# అడివి బాపిరాజు, బృందావన్ లాల్ వర్మగార్ల చారిత్రక నవలలు - తులనాత్మక పరిశీలన

# [Historical Novels of Adivi Bapiraju and Brindavanlal Varma A Comparative Study]



శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయానికి
పిహెచ్.డి. డిగ్రీ కోసం
సమర్పించిన సిద్ధాంత వ్యాసం


పరిశోధకురాలు
కె. పి. నాగరత్నమ్మ

పర్యవేక్షకురాలు
ఆచార్య పి. కుసుమ కుమారి

తెలుగు అధ్యయనశాఖ
శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
తిరుపతి


1993

Ms. K. V. NAGARATHNAMMA
Research Scholar (Part-Time)
Department of TELUGU STUDIES
SriPadmavathi Mahila Visvavidyalayam
TIRUPATI

## DECLARATION

I hereby declare that this thesis bearing the title "HISTORICAL NOVELS OF ADIVIBAPIRAJU AND BRINDAVANLAL VARMA - A COMPARATIVE STUDY" has been composed by me and has not previously formed the basis for the award of any degree, diploma, associateship, fellowship or any other title of any other University.

K. V. Nagarathnamma
(K. V. NAGARATHNAMMA)

PLACE: TIRUPATI

Date : 31 12 '93

Dr. P.KUSUMAKUMARI
Professor and Head
Department of Telugu Studies
Sri Padmavathi Mahilavisvavidyalayam
TIRUPATI

## CERTIFICATE

This is to certify that the thesis entitled "HISTORICAL NOVELS OF ADIVIBAPIRAJU AND BRINDAVANLAL VARMA - A COMPARATIVE STUDY" is being submitted in partial fulfilment of Ph.D., degree to SRI PADMAVATHI MAHILA VISVAVIDYALAYAM COLLEGE, TIRUPATI, forms the result of the research work of Ms.K.V.NAGARATHNAMMA under my guidance in the Department of Telugu Studies. The thesis has not previously formed the basis for the award to the candidate of any degree, diploma or other similar title. This was a systematic study done under my supervision.

PLACE: TIRUPATI

Date : [illegible]

(P.KUSUMAKUMARI)
HEAD
DEPT OF TELUGU STUDIES
S.P. [illegible]

# కృతజ్ఞతలు

నేను పిహెచ్.డి కోర్సులో చేరే అవకాశం కల్గించిన శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయాధికారులకు, తెలుగు అధ్యయన శాఖకు నా కృతజ్ఞతలు.

సిద్ధాంత వ్యాస విషయంలో నాకు సలహాల నొసగడమే కాక, నేను ఎప్పుడు, ఏ సమయంలో వెళ్ళినా నా సందేహాలకు ఓపిగ్గా సమాధానాలిచ్చి, నేను సేకరించిన విషయాలను ఏ మాత్రం ఆలస్యం చేయకుండా సరిదిద్ది సకాలంలో ఇవ్వడమే కాకుండా, నా కోసం స్వయంగా గ్రంథాలయాలకు వెళ్ళి విషయ సేకరణ గావించి ఎంతో ప్రోత్సాహమిచ్చి, సకాలంలో ఈ గ్రంథాన్ని సమర్పించడానికి ఎన్నో విధాల నాతో సహకరించిన మా పర్యవేక్షకురాలు ఆచార్య పి. కుసుమకుమారి గారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

నేను అడిగిన వెంటనే అంగీకరించి నన్ను ప్రోత్సహించిన మా రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం మాజీ వైస్ చాన్సలర్ గారైన ప్రొ. రామానుజతాతాచార్యుల వారికి, ప్రస్తుత వైస్ చాన్సలర్ ప్రొ. మహాదేవన్ గారికి, రిజిస్ట్రార్ శ్రీ చంద్రశేఖర పాండే గారికి, మా పోస్ట్ ఆచార్య విభాగ అధ్యక్షులు శ్రీ డా. రామకృష్ణమాచార్యుల గారికి నా కృతజ్ఞతలు.

నన్ను ఆశీర్వదించి ఈ పరిశోధనకు ప్రోత్సహించి, తగు సలహాలనిచ్చిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు విభాగం లోని నా గురువర్యులు కీ.శే. ఆచార్య జి.యస్. రెడ్డిగారికి, కీ.శే. మద్దూరి సుబ్బారెడ్డి గారికి, కీ.శే. ఆచార్య నాగయ్య గారికి నా కృతజ్ఞతలు.

తులనాత్మక రంగానికి సంబంధించిన అంశం స్వీకరించి
పరిశోధన చేయమని నన్ను ప్రోత్సహించిన ఆచార్య సర్వోత్తమ రావుగారికి
నా కృతజ్ఞతలు.

హిందీ భాషలో నాకు కలిగిన ఎన్నో సందేహాలను తీర్చి, నాకు
తగు సూచనలిచ్చి, నన్ను ప్రోత్సహించి, నా పరిశోధనకు తోడ్పడిన
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం హిందీ విభాగం మాజీ రీడర్ డా॥ జ్ఞానప్ప-
నాయుడుగారికి నా కృతజ్ఞతలు.

మా రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠంలో రీడర్‌గా పని చేస్తున్న
డా॥ పేరి సుబ్బరాయన్ గారు మొదటినుంచి నన్ను ఈ పరిశోధనకు
ప్రేరేపించడమే గాక, ఎంతో సహాయ సహకారాలనందించారు; వారికీ,
నాకు సంస్కృత విషయ సేకరణలో సహాయపడిన సీనియర్ అధ్యాపకులు
డా॥ రామకృష్ణ గారికి నా కృతజ్ఞతలు

నాకు బుందేల్ ఖండ్ ప్రాంతపు విషయ సేకరణలో సహక
రించిన డా॥ ఆర్. చంద్రశేఖర్, డా॥ లక్ష్మీవిలాస్ పాండే, అధ్యాపకులు
సంస్కృత విద్యాపీఠం (లక్నో); డా॥ వై. యస్. రమేష్, అధ్యాపకులు
సంస్కృత విద్యాపీఠం, జైపూర్ గార్లకు నా కృతజ్ఞతలు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయ అధ్యక్షులు
శ్రీ చంద్రన్ గారు, తెలుగు విభాగంలోని శ్రీ షణ్ముగం, హిందీ విభాగం
లోని శ్రీ గుణశేఖర్ గార్లకు, మహిళా విశ్వవిద్యాలయ గ్రంథాలయ
సిబ్బందికీ తెలుగు విభాగం అటెండర్ రమాసుందరికీ, రాష్ట్రీయ సంస్కృత

విద్యాపీఠం గ్రంథాలయ సిబ్బందికీ నా కృతజ్ఞతలు.

సహజంగా పురుషుని ప్రతి విజయం వెనుక ఒక స్త్రీ ఉంటుందని అంటారు కాని పురుషుని సహాయ సహకారాలు ఏ స్త్రీకైనా, ఏ రంగంలోనైనా రాణించే అవకాశం కల్గిస్తాయి. అటువంటి మహా పురుషునిగ సహాయ సహకార ప్రోత్సాహాలందించి నా భావాలకు రూపకల్పన చేసి, మెరుగులు దిద్ది, ఈ పరిశోధనా గ్రంథం వెలువడేందుకు నాకెంతో మానసిక ధైర్యాన్ని కలిగించి, నాకు ఎల్లవేళలా సహాయ పడిన మా శ్రీవారు మురళీధర రావు గారికి ఆజన్మాంతం కృతజ్ఞురాలిని.

ఈ గ్రంథాన్ని అందంగా రాసి ఇచ్చిన సయ్యద్ జాఫర్ గారికి నా కృతజ్ఞతలు.

నా పరిశోధన ప్రారంభం నుంచి సిద్ధాంత ప్రతి తయారీ వరకు నాకెంతో సహకరించిన మా అబ్బాయి చి॥ రవికిరణ్ కు, నా తమ్ముళ్ళు, మరదళ్ళు తదితర కుటుంబ సభ్యులకు, ముఖ్యంగా చిన్నదైనా పేచీ పెట్టక సర్దుకు పోయిన మా పాప చి॥ కనక దుర్గకు నా ఆశీస్సులు.

నా ఈ సిద్ధాంత వ్యాసం వెలువడేందుకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తోడ్పడిన ఎందరో మహానుభావులకు, అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను.

# విషయ సూచిక

## 3.3. తులన :

1.0. ప్రవేశిక: నవల వచన సాహిత్యానికి సంబంధించిన ప్రక్రియ. దీనిలో కథా వస్తువు సాధారణంగా కల్పితంగా ఉంటుంది. ఆధునిక నవలా వికాసం మొట్టమొదట యూరప్ ఖండంలో ప్రారంభమయ్యిందని విమర్శకుల అభిప్రాయం. అంత మాత్రాన భారత దేశంలో నవలా ప్రక్రియ ప్రచారంలో లేదని చెప్పడం భావ్యంకాదు. సంస్కృత గద్యంలో రాసిన పంచతంత్రం, హితోపదేశం, బేతాళ పంచవింశతి, బృహత్కథా మంజరి, వాసవదత్త, కాదంబరీ, దశకుమార చరిత్ర మొదలైన వాటిలో నవలా వికాస క్రమం కన్పిస్తుంది. కొంత మంది విద్వాంసులు బాణభట్టు రచించిన సంస్కృతంలోని 'కాదంబరి'ని భారతదేశంలోని మొట్టమొదటి నవలగా అంగీకరించారు.[1] కానీ 'కాదంబరి'లో అలౌకికత, భావాత్మకత, ఆలంకారికత అధికంగా కన్పిస్తాయి. స్వాభావిక శైలి, రచనా విధానం, సామాజిక జీవిత ప్రతిఫలనం మొదలైన విషయాలను దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే 'దండి' రచించిన 'దశకుమార చరిత్ర'ను భారత దేశానికి చెందిన మొట్టమొదటి నవలగా పేర్కొనవచ్చు.[2]

సంస్కృత కథా సాహిత్యం అరేబియా, ఇరాక్, యూరప్ ఖండంలోని అనేక దేశాల్లో వ్యాపిస్తూ గ్రీసు (యునాన్) వరకు వెళ్ళింది. "సంస్కృత సాహిత్యానికి సంబంధించిన చాలకథలు మధ్య ఆసియా, యూరప్ లోని అనేక భాషలలోనికి అనువదించారు".[3] ఈ కారణంగా

---

1. హిందీ సాహిత్య కా వైజ్ఞానిక్ ఇతిహాస్ - గణపతి చంద్రగుప్త, పు: ౧౦౦
2. పైదే. ౧౦౧
3. పైదే. ౧౦౧

‘చాలమంది పాశ్చాత్య విద్వాంసులు యూరప్‌లోని ‘రొమాంటిక్’ కథా సాహిత్యానికి మూలాధారం భారతదేశపు కథా సాహిత్యమని అంగీకరిస్తారు’[1] యూరప్‌లో రొమాంటిక్ కథాసాహిత్యం వెలువడి, దాని నుండి నవలావిర్భావం జరిగిందని విజ్ఞుల అభిప్రాయం.[2] “ప్రేమ, సాహసం సమ్మేళన భావాలనే రొమాన్స్ (Romance) అన్నారు”.[3]

రొమాన్స్ అనే పదాన్ని గురించి ‘ది ఇంగ్లీష్ నావెల్’ (The English novel) అనే గ్రంథాన్ని రచించిన ‘జార్జి సెనిటస్’ చెప్పిన మాటలు గమనింపదగ్గవి.

“రొమాన్స్ అనే పదం మిక్కిలి వివాదాస్పదమైంది. దీనిని తెలుసుకోవాలి అనే ఉద్దేశంతో తెలివిగల వ్యక్తి అధికంగా ఆలోచించడానికి సాధారణంగా ఇష్టపడడు”.[4]

రొమాన్స్ అనే పదాన్ని క్రమంగా ఆంగ్లేయ క్లాసికల్ కథలకు, అటు తర్వాత స్వతంత్ర, కాల్పనిక, ప్రేమాఖ్యానాలకు, సాహసిక కథలకు అన్వయించడం జరిగింది.

మొట్టమొదట ఈ శబ్దానికి ‘వ్యవహారిక భాష’ అనే అర్థం ఉండేది. “రోమన్ దేశీయులు ఫ్రాన్స్‌ను జయించినప్పుడు (ఫ్రాన్స్‌లో) లాటిన్ భాషను బలాత్కారంగా వారి నెత్తిన రుద్దారు.

---

1. హిందీ సాహిత్యకా వైజ్ఞానిక్ ఇతిహాస్ – గణపతి చంద్రగుప్త, పు: 910
2. పైదే, పు: 909.
3. పైదే, పు: 909.
4. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఏవం మృగనయనీ – డా॥ శాంతి స్వరూప్ గుప్త, పు: 17

ఫ్రాన్స్ దేశీయులు దానిని అంగీకరించక తమ భాషకు ఒక కొత్త రూపం కల్పించి, సృష్టి కలిగించుకొని దానికి 'రొమాన్స్' అని పేరు పెట్టారు."[1] ఫ్రాన్స్ దేశీయులు ఈ భాషను 'వ్యావహారిక భాష' అన్నారు." The vernacular language of France as opposed to Latin " అంటే లాటిన్ భాషకు వ్యతిరేకంగా ఫ్రాన్స్ దేశీయులు సృష్టించిన వ్యవహారిక భాషే 'రొమాన్స్' అని సాహిత్య విద్వాంసులు నిర్ణయించారు. ఫ్రెంచి, రోమన్ సాహిత్యంలో వర్ణించిన ప్రాచీన విషయాలకు స్వస్తి చెప్పి, నూతన సాహిత్య రచనకు పూను కొన్నారు. ఈ కొత్త సాహిత్యానికే 'రొమాన్స్' (Romance) అని పేరు పెటారు.

మొదట్లో పద్యరూపంలో రాసిన వీరగాథలనే 'రొమాన్స్' అని పిలిచే వారు. " The Tale in verse embodying the adventure of some hero of chivalry especially of those of the great cycles of medieval legend and belonging both in meter and form to the ages of knignt-hood ....."[3] తర్వాత క్రమక్రమంగా గద్య సాహిత్యంలో కూడ ఈ ప్రక్రియ ప్రవేశించింది.

రొమాన్స్ ను, " Any fictitious and wonderful tale,

1. బృందావన్ లాల్ వర్మ – ఉపన్యాస్ ఔర్ కళ – డా॥ శివకుమార మిశ్ర, పు: 256
2. పైదే., పు: 256
3. పైదే., పు: 256, 57.

A fictitious narrative in prose, or verse which passes beyond the limit of real life"[1]

"The class of fictions which consists of such stories of ideas and actions suggestive of chivalry, adventure and mystery, an affair of a strange or adventurous nature"[2] అని నిర్వచించడం జరిగింది.

శ్రీమతి శారదగారు "The Term Romance in the early middle ages meant the vernacular languages derived from the learned language, Latin. But now it applies to any fictional account of heroic achivements, colourful scenes, passionate love or supernatural experiences"[3] అని చెప్పారు. కాబట్టి "The Romance gives greater freedom to the imagination deals with more unusual aspects of life"[4] అని, "Adventure and love are essential for a romance"[5] అని చెప్పవచ్చు.

యూరప్ లోని ఇటలీలో మొట్టమొదట సారిగా రొమాంటిక్ నవలాసాహిత్య ప్రచారం జరిగిందని చెప్తారు. 14 వ శతాబ్దపు

---

1 బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ ఔర్ కళ - డా॥ శివకుమార్ మిశ్ర, పు. 258
2. పైదే., పు:258.
3. The Hindu - 'Romance'. saturday 10.4.93 M Sarada
4. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఏవం మృగనయనీ - డా॥ శాంతి స్వరూప్ గుప్త, పు.17
5. పైదే., పు:18.

మధ్యభాగంలో ఇటలీదేశపు లేఖకుడైన 'బొకేశియో' వ్యంగ్య పూరితం, హాస్య ప్రధానమైన 'డీకేమరాన్' అనే నవలను రచించాడు. 17వ శతాబ్దంలో స్పెయిన్ లేఖకుడైన 'సర్వాన్టే' 'డాన్‌క్విక్జోట్'ను రచించాడు. క్రమక్రమంగా ఫ్రాన్స్‌లో 'రొమాంటిక్' మరియు 'యథార్థవాద' కథా సాహిత్యం అభివృద్ధి చెందసాగింది.

"17, 18 శతాబ్దాలలో ఇంగ్లాండ్‌లో పేరుగాంచిన నవలలు చాల వెలువడ్డాయి. వాటిలో 'సర్ ఫిలిప్ సిడ్నీ' రాసిన 'ఆర్కేడియా' (1560), 'జాన్ బునియన్' గారి 'పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రస్' (1684), 'డేనియల్ డెఫో' గారి 'రాబిన్‌సన్ క్రూసో' (1719), 'జోనాథన్ స్విఫ్ట్' రాసిన 'గలివర్స్ ట్రావెల్స్' (1726) మొదలైనవి.

క్రమక్రమంగా ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, రష్యాలలో గొప్ప నవలలు వెలువడ్డాయి. వాటిలో 'శామ్యూల్ రిచర్డ్సన్' గారి 'పామేలా' (1740), 'హెన్రీ ఫీల్డింగ్' రాసిన 'టామ్ జోన్స్' (1749), 'ఆలివర్ గోల్డ్‌స్మిత్' రాసిన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్', 'జేన్ ఆస్టిన్' గారి 'ప్రైడ్ అండ్ ప్రిజుడిస్', 'సర్ వాల్టర్ స్కాట్' రాసిన 'వేవర్లీ నావెల్స్' 'చార్లెస్ డికెన్స్' రాసిన 'డేవిడ్ కాపర్‌ఫీల్డ్', 'జార్జ్ ఇలియట్' గారి 'ఏడమ్ బీడ్' మొ॥ రచనలు ఇంగ్లాండ్ దేశం నుండి వెలువడ్డాయి. ఫ్రాన్స్ నవలాకారుల్లో 'వాల్టేయర్', 'విక్టర్ హ్యూగో', 'జోలా', 'అనాతోలే ఫ్రాన్స్' మొదలైన వారు ప్రముఖులు. వీరే గాక జర్మనీలో గథె, రష్యాలో పుష్కిన్, టాల్‌స్టాయ్ మొదలైన నవలాకారుల ఆవిర్భావం జరిగింది[1]

1. హిందీ సాహిత్యకా వైజ్ఞానిక్ ఇతిహాస్ - గణపతి చంద్ర, పు. 900 (మరియు)
An outline History of English literature - William Henry Hudson, P: 149-156

భారతీయ సాహిత్యంలో నవలావిర్భావం ఆంగ్లసాహిత్య ప్రభావం వల్ల జరిగింది. 18 వ శతాబ్దం అంతానికి యూరప్ లోని విభిన్న భాగాలల్లో నవలా సాహిత్య వికాసం జరిగింది కాని, తెలుగు హిందీ సాహిత్యాల్లో దీని పుట్టుక వికాసం 19 వ శతాబ్ద పు అంతిమ భాగంలోనే జరిగింది. హిందీ తెలుగు భాషల కంటె ముందుగా బెంగాలులో నవలారచన ప్రారంభమైంది. బెంగాలీ భాషలోని ప్రసిద్ధ నవలాకారులైన బంకించంద్ర చటోపాధ్యాయ, శరచ్చంద్ర చటోపాధ్యాయ రవీంద్రనాథ్ ఠాగూర్ మొదలైన వారి రచనల వల్ల ప్రభావితులై, హిందీ తెలుగు నవలాకారులు చారిత్రక నవల రచనను చేపట్టారు.

**చారిత్రక నవల – వివరణ:** 'చరిత్ర', 'నవల' అనే రెండు పదాల సమ్మేళనరూపమే చారిత్రక నవల. చరిత్ర యదార్థ సంఘటనైతే, 'నవల' కల్పన. రచయిత కల్పన, చరిత్రలోని యదార్థ సంఘటనల సమ్మేళనమే చారిత్రక నవల.

సంస్కృతంలో 'ఇతిహాసు' అనే శబ్దాన్ని తెలుగులో 'చరిత్ర' అనే అర్థంలో గ్రహిస్తున్నాం. "చరిత్ర అనే శబ్ద వ్యుత్పత్తి కొంత కుతూహల జనకమైంది. ఈ శబ్దం మూడు శబ్దాల అంటే 'ఇతి+హ+ఆస్' ల సంయోగం వల్ల ఏర్పడింది. దీని అర్థం 'ఇది ఈ విధంగా జరిగింది' అని చెప్పుకోవచ్చు. అందుకే 'చరిత్ర' కు సామాన్య అర్థంగా 'గతించిన ఘటనల వృత్తాంతం' అని చెప్పుకోవచ్చు. 'ఇతిహాస' శబ్దానికి ఆంగ్లంలో 'హిస్టరీ' అని అర్థం"[1]

1. హిందీకే ఐతిహాసిక ఉపన్యాసోంమే ఇతిహాస ప్రయోగ – డా॥ గోవింద్ జీ. పృ. 1

చెప్పవచ్చు. "ఈ 'హిస్టరీ' అనే శబ్దం గ్రీకు శబ్దం 'ఇస్తోరియా' (Istoria నుండి పుట్టింది. 'ఇస్తోరియా' అంటే 'A searching to find out' అనే ఈ పదానికి అర్థం."[1] 'మాతా', 'మదర్', 'పితా', 'ఫాదర్' అన్నట్లు 'ఇతిహాసం' కూడా 'హిస్టరీ'గా మారి ఉండవచ్చు. ఈ చరిత్ర, నవలను గురించి ప్రాచ్యులు, పాశ్చాత్యులు విభిన్నమైన అభిప్రాయాలను వెలిబుచ్చినారు.

ప్రాచ్య, పాశ్చాత్యుల అభిప్రాయాలు: విష్ణు పురాణంలో "ప్రాచీనుల చరిత్రలు, కథలు మొదలైన వాటిని గురించి వ్యాఖ్యానించేదీ దేవతలు, ఋషులకు సంబంధించిన విషయాలను తెల్పేది మరియు భూత భవిష్యత్కాలాలకు చెందిన ధర్మ విషయాలను చర్చించేది ఇతిహాసం"[2]

కౌటిల్యుడు "పురాణం, ఇతివృత్తం, ఆఖ్యాయిక ఉదాహరణ ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం - అన్నీ చరిత్రే"[3] అని స్పష్టంగా చెప్పాడు. రాజశేఖరుని కావ్యమీమాంస రచనాకాలం నాటికి 'ఇతిహాసం' ధర్మార్థ కామ మోక్షాలకు జరిగిపోయిన చరితకు మాత్రం సంబంధించి ఉండేది. కాలక్రమేణ ఇతిహాసం అనే పేరు మరుగున పడిపోయి గతంలో జరిగిపోయిన మానవుని వివిధ కార్యకలాపాలన్నీ చరిత్రగా పరిగణించారు

---

2. ఆర్షాది బహు వ్యాఖ్యానం - దేవర్షి చరిత్రాశ్రయం ఇతిహాసమితి ప్రోక్తం భవిష్యాద్భూత ధర్మయుక్
3. పురాణమితి వృత్త మాఖ్యాయి కోదాహరణం.
   ధర్మశాస్త్ర, అర్థశాస్త్రం చేతిహాసః
   కౌటిల్యుని అర్థశాస్త్రం 1.5.14.
4. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము (మూ.సం), పు:205
1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్, పు:1

A. X. Soares "History and 'story' are the same word and are derived from the Greek word which means information obtained by inquiry or research. History in its most comprehensive sense is all that has happened not merely to men but to every other object on earth"[1] అన్నారు.

Dharmendra Goel "History means recorded of happenings as well as the sequences of happenings"[2] అన్నారు.

Professor Elton "History is concerned with all these human sayings, thoughts, deeds and sufferings which occured in the past and have left present deposit and it deals with them from the point of view of happening change and the particular."[3] అన్నారు. చరిత్రను గూర్చి ఎవరెన్ని విధాలుగా నిర్వచించినా "History is a record of facts" అనే విషయాన్ని అందరూ అంగీకరిస్తారు.

'నవల' అనే పదానికి లాటిన్ భాషలోని 'Novellus' లేక 'Novus' అనే పదం మూలం. ఇటాలియన్, స్పానిష్ భాషల్లో దీన్ని 'Novella' అనీ, ఫ్రెంచి భాషలో 'Nouveau' అని అంటారు. 'నవల' అనేది ఆంధ్రుల అకారాంత స్త్రీలింగంగా సంస్కృతీకరించిన ఆంగ్ల

---

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - డా॥ గోవింద జీ, పు: 77
2. Philosophy of History - Dharmendra Goel, P: 1
2. The Practice of History - Professor Elton, P: 24

వ్యుత్పత్తిని బట్టి దీనిని తెలుగులో 'నవాన్ లాతి గృహ్ణాతీతి నవలా' అంటే, నవ్యకథ అని అర్థం చెప్పవచ్చు. హిందీ భాషలో నవలను 'ఉపన్యాస్' అని పిలుస్తారు.

Ralf Fox గారు "The novel is not merely Fictional prose, it is the prose of man's life the first art to take the whole man and give him expression"[1] అన్నారు.

E.A. Baker గారు "Novel is the interpretation of human life by means of fictitious and narrative prose ... Novel is concentrated with real world it deals with facts or with things that are made as like facts as the novelist can make them. Its aim is to present a world as possible to the actual world, not to fashion a new one to the hearts desire"[2] అన్నారు.

బొడ్డుపాటి వేంకట కుటుంబరావు గారు "రచనా కాలము నందలి వాస్తవికములగు జీవితాచార వ్యవహారాలను చిత్రించునది నవల"[3] అన్నారు.

మొదలి నాగభూషణ శర్మ గారు "సాంఘిక జీవితానికి ప్రతిబింబంగా వ్యక్తుల జీవిత గమనాన్ని చిత్రిస్తూ, జనుల,

---

1. The Novel and the people - Ralf Fox, P:20
2. The History of English novel _ E.A. Baker., P:15.
3. ఆంధ్ర నవలా పరిణామము - బొడ్డుపాటి వేంకట కుటుంబరావు, పు:102

ఆచార వ్యవహారాలను వ్యక్తీకరించే గద్య ప్రబంధం"[1] అన్నారు.

కాబట్టి చరిత్ర, కల్పనల సమ్మేళనం చారిత్రక నవల.

కొంతమంది ప్రముఖుల 'చారిత్రక నవల'లను గూర్చి వ్యక్తీకరించిన నిర్వచనాలను చెప్పుకోవడము ఇక్కడ అప్రస్తుతంకాదు.

చారిత్రక నవల - నిర్వచనాలు :

ఫుల్లాభొట్ల వేంకటేశ్వర్లు గారు " జరిగి పోయిన ఒకానొక చారిత్రక సంఘటనను గ్రహించి, దానిని ఆత్మగా చేసి కొని, దాని చుట్టూ పెక్కు అద్భుత సంఘటనలతో, పవిత్ర సన్నివేశములతో, కథాకథన దక్షతతో రచించిన మహత్తర గ్రంథమే చారిత్రక నవల"[2] అన్నారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి 'కోరి నరసింహశాస్త్రి - ధూర్జటి' నవల భాషాంతరీకరణకు ప్రస్తావన రాస్తూ చారిత్రక నవల అంటే " చరిత్రకు సత్యము కావలె. నవలకు కల్పనతో కూడిన సౌందర్యమవసరము. చారిత్రక నవల సత్యసౌందర్యముల సమ్మేళనము"[3] అన్నారు.

A.C. ward గారు " A historical Novel is an imaginative recreation of a remote period"[4] అన్నారు.

Ernest. E. Leisy గారు " A Historical Novel is a

---

1. తెలుగు నవలా వికాసం - మొదలి నాగభూషణ శర్మ., పు: 20.
2. తెలుగు నవలా సాహిత్య వికాసం - ఫుల్లాభొట్ల వేంకటేశ్వరులు., పు: 38
3. కోరి నరసింహశాస్త్రి - ధూర్జటి (పీఠిక), పు: 7.
4. Foundation of English prose — A.C.ward. P: 101

novel, the action of which is laid in an earlier time."[1] అన్నారు.

సుప్రసిద్ధ హిందీ నవలాకారుడైన బృందావన్ లాల్ వర్మ గారు "చారిత్రక నవలా కారుడు చారిత్రక సత్యాలను విడిచిపెట్టి రాయుట సమంజసం కాదు. సత్యాన్ని వదలిన కల్పన, వ్యాఖ్య, ఊహ మొదలైనవి నిర్జీవాలు. నవలాకారుడు సత్యాన్ని కల్పనను, పాలతో చక్కెర కలిపినట్లు మేళవింపజేసి రాస్తే అది ఉత్తమ చారిత్రక నవల[2] అవుతుందని అన్నారు.

ఆచార్య చతురసేన శాస్త్రిగారు "చారిత్రక నవలల్లో దేశ కాలాదులకు చెందిన పరిస్థితులకు ప్రాధాన్యం ఉంటుంది. నవలాకారుడు చరిత్రలో ప్రసిద్ధి చెందిన ఆనాటి జీవిత స్వరూపాన్ని ఊహించి సంభావ్యాలయిన జీవిత వృత్తాంతాలను నవలల్లో వ్యక్తం చేస్తారు. కేవలం గత కాలానికి చెందిన సంఘటనలు మాత్రం పేర్కొనకుండా ఆ కాలానికి సంబంధించిన సామాజిక స్పృహను కూడా చిత్రిస్తారు."[3] అని అన్నారు.

ఆంగ్ల విమర్శకుడైన Walter Bagehot "చారిత్రక నవల 'చరిత్ర' అనే వాటిని జలప్రవాహంలో పడి ఉన్న ప్రాచీన దుర్గపు మినార్ వీడుతో పోల్చి ఉన్నారు. నీళ్ళు కొత్తవి. ప్రతి దినం మారే స్వభావం కలవి. కాని మినార్ ప్రాచీనమైనది. అది తన స్థానంలో స్థిరంగా

---

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - డా॥ గోవిందజీ, పు: 100
2. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మా - శశిభూషణ్ సింహాల్, పు: 24, 30
3. ఐతిహాసిక్ ఉపన్యాస్ - తులనాత్మక అధ్యయన్ - నారాయణ భారద్వాజ, పు: 42

ఉంటుంది. అట్లే చారిత్రక నవలాకారుని పాదాలు భూమిపై ఉంటాయి. కాని శ్వాసమాత్రం యుగాను సారంగా పీల్చుకొంటాడు. ఒకే చారి. విషయాన్ని విభిన్న యుగాలకు చెందిన రచయితలు ఇందువలననే రకరకాలుగ రాస్తారు"[1] అని అన్నారు.

చారిత్రక ఇతివృత్తానికి, సంఘటనలకు, కల్పనలను జోడించి సజీవంగానూ, సహజంగానూ, ఆకర్షణీయంగా రచిస్తే చారిత్రక నవల అవుతుంది. Mr Jonathan గారి "A novel is rendered historical by the introduction of dates, personages or events, to which identification can be readily given."[2] మాటలు, చారిత్రక నవలల్లో పాత్రలకు, తారీఖులకూ, సంఘటనలకు ఉన్న ప్రాధాన్యాన్ని తెలియజేస్తున్నది.

**చరిత్ర - చారిత్రక నవలల రచనాభేదం :** చరిత్ర రచనకూ, చారిత్రక నవలా రచనకూ కొంత భేదం ఉంటుంది.

చరిత్రలో జరిగిపోయిన విషయాలు, వాటి చారిత్రక విలువన్ని బట్టి వాస్తవికతకు దగ్గరగా ఉంటాయి. చరిత్రకారుడు జరిగిన విషయాలను మనోహరంగా ఉండేటట్లు కల్పించడం కాని, లేదా వర్ణించడం గాని చేయడు. ఒక యుగానికి లేదా ఒక కాలానికి సంబంధించిన సమస్త విషయాలు చరిత్రలో క్రోడీకరిస్తారు. చరిత్రకారుడు

---

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మ - శశిభూషణ్ సింహాల్. పు: 28

2. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్, పు: 100. - డా॥ గోవింద్ జీ

జరిగినది జరిగినట్లు రాస్తాడు. చరిత్రలోని వ్యక్తులు, సంఘటనలు పరిమితంగా ఉంటాయి. చరిత్ర రచన శాస్త్రీయమైనది. దీనిలో యదార్థమైన సంఘటనలకు ప్రాధాన్యం ఉంటుంది. ఈ సందర్భంలో చారిత్రక నవలంటే సంఘటనలను మార్చడం మాత్రమే కాదు అంటూ, George Lukacsగారు "what matter, therefore, in historical novels is not the retelling of great historical events, but the poetic awakening of the people who figured in these events. what matter is that we should re-experience the social and human motives which led men to think, feel, and act just as they did in historical reality"[1] అన్న అభిప్రాయం ద్వారా చారిత్రక అనుభవానికి ప్రాధాన్యాన్నిచ్చారు (Historical experience).

చారిత్రక నవలాకారుడు ఊహ ప్రధానంగానే తన రచనను కొనసాగిస్తాడు. ఒక యుగానికి లేక ఒక కాలానికి చెందిన ఒకటో రెండో సంఘటనలను మాత్రమే తన రచనకు ఆధారంగా గ్రహిస్తాడు. ఈ విధంగా జరిగి ఉండవచ్చునని ఊహించి రాస్తాడు. పాఠకులు ఆలోచించడానికి ఆస్కారం, అవకాశం కల్పించడమే నవలాకారుని కర్తవ్యం. H. Butter field గారు "The historical novelist receives his hint from history, but this hint need not necessarily be a story ready-made, a sequence of events to be followed.

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - డా. గోవింద్ జీ, పృ: 112

Many historical novels are stories straight from a history book, amplified and rounded off by fiction perhaps and retold with some variations. History may provide plot and adventure and fiction may just fill in the lines where history is inadequate and idealise incidents and characters where history is incomplete and disappointing."[1]

చరిత్రలోని సత్యం, చైతన్యం, నవలలోని కల్పనల సమ్మేళనమే చారిత్రక నవల.

చారిత్రక నవలా స్వరూపాన్ని గూర్చి " A historical novel can be primarily an adventure story in which the historical elements merely add interest and a sense of importance to the actions described; or it can be essentially an attempt to illustrate those aspects of the life of a previous age which most sharply distinguish it from our own; or it can be an attempt to use a historical situation to illustrate some aspect of man's fate which has importance and meaning quite apart from that historical situation"[2] చెప్పడం జరిగింది. చారిత్రక నవలకు కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి.

---

1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - డా॥ గోవిందజీ., పృ: 114

2. Walter Scott - Modern Judgements —— D.D. Devlin, p.25

1.1. చారిత్రక నవలా లక్షణాలు : "నవల అనే పేరు కొత్తది కావచ్చు. దాని అర్థమూ అన్వయమూ స్వరూపమూ ఎంతో పరిణతి చెందుచున్నది కాని అసలు ప్రక్రియ అతి పురాతనమైనదే. టాల్‌స్టాయ్ 'వార్ అండ్ పీస్' గొప్ప నవల ఐతే, మహాభారత మెందుకు కాదు? రొమా రోలా 'క్రిస్టఫ్' నవల ఐతే, రామాయణ మెందుకు కాదు? ఇలియట్, ఒడిస్సే 'పారడైజ్ లాస్ట్' లు నవల లెందుకు కావు? పద్యాత్మకంగా ఉండడమేనా అవి చేసిన పాపము? పైగా రామాయణ, మహాభారతాల భాష వచనానికి దగ్గరగా ఉండే సులభశైలి కూడాను"[1] అన్నారు ప్రముఖ చారిత్రక నవలా రచయిత శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు.

నవలలోని అంతర్భాగమే చారిత్రక నవల కాబట్టి చారిత్రక నవలా ప్రక్రియకూడా అతి పురాతనమైందని భావించవచ్చు. ఆనాటి రామాయణం, మహాభారతం, ఇలియట్, ఒడిస్సే మొదలైనవన్నీ యుగ యుగాల చరిత్రనూ, చారిత్రక వ్యక్తుల్ని గురించి తెల్పే కథలే. కానీ వీటిలో సత్యాలకన్నా కల్పనలకే ప్రాధాన్య మెక్కువగా ఉంటుంది. అయినా బీజ ప్రాయంగానైనా సత్యం ఉండక పోతే ఈ కథలు ఎలా ఆవిర్భవించాయి?

మహాకావ్య లక్షణాలను 'దండి' ఇలా చెప్పాడు "ఇతిహాస కథను ఆధారంగా చేసికొని గాని, లేక కాల్పనికమైన ఉత్తమ వ్యక్తికి సంబంధించిన వర్ణనలతో కూడి, ధర్మార్థ కామ మోక్షాలనెడి పురుషార్థ చతుష్టయ ప్రతిపాదనకు లోబడి ఉండి లోకవ్యవహారము నందు

1. భారత స్వాతంత్ర్య రజతోత్సవ ప్రచురణలో 1947-1972 తెలుగు నవల - నోరి నరసింహశాస్త్రి - మహతి, పు: 30

నిపుణుడు, ఔదార్యం మొదలైన సుగుణాలతో కూడిన నాయకుడిని ఎంపిక చేసుకొని గ్రంథం ఉంటే - ఈ లక్షణాలతో కూడిఉన్న కావ్యమే మహా కావ్యం అనవచ్చును."[1]

అగ్నిపురాణంలో కూడా ఇంచుమించు ఇదే అర్థంతో ఒక శ్లోకం ఉంది. "ఇతిహాస కథను ఆధారం చేసుకొనిగాని, లేక కాల్పనిక మైనదియైన ఉత్తమ వ్యక్తికి సంబంధించిన వర్ణన ఉండాలి. ఇంకా రహస్యం దౌత్యం, సమరభూమికి ప్రయాణమవడం మొదలైన వర్ణనలతో కూడి, మరీ ఎక్కువ విస్తరణ లేని కావ్యాన్ని మహాకావ్యం అంటారు"[2]

ధనంజయుడు రాసిన 'దశరూపకం'లో "చక్కని గుణసంపద కలిగినవాడు, ధీరోదాత్తుడు, పరాక్రమశాలి, కీర్తిగామి, ఉత్సాహి, వేద రక్షణా తత్పరుడు, ఉత్తమ క్షత్రియుడు, సుప్రసిద్ధ వంశోద్భవుడు అయిన రాజశ్రేష్ఠుడు గాని లేక దేవతా పురుషుడు గాని నాయకుడుగా నున్న కావ్యం మహాకావ్యంగ పేర్కొనబడుతుంది. ఇట్టి నాయకుని యందు చిన్న దోషాలేవైనా ఉన్నచో వానిని వర్ణించరాదు.

---

1. ఇతిహాస కథోద్భూత మితరద్వా సదాశ్రయమ్।
చతుర్వర్గ ఫలాయత్తం చతురోదాత్త నాయకమ్॥
'కావ్యాదర్శ' అనే మహా కావ్యలక్షణ ప్రకరణంలో
15వ శ్లోకం, దండి ప్రణీతం.

2. ఇతిహాస కథోద్భూత మితరద్వా సదాశ్రయమ్।
మంత్ర దూత ప్రయాణ జినియతం నాతి విస్తరమ్॥
'అగ్నిపురాణం' - అధ్యాయం 174, కావ్యప్రకరణం
(సంస్కృత సంస్థాన్, ఖ్వాజాకుతుబ్ వేద్, ఉత్తరప్రదేశ్ పబ్లికేషన్స్) పు. 366

3. "అభిగమ్య గుణైర్యుక్తో ధీరోదాత్తః ప్రతాపవాన్।
కీర్తికామో మహోత్సాహ స్త్రయ్యాస్త్రాతా మహీపతిః॥
ప్రఖ్యాత వంశో రాజర్షి ర్దివ్యో వా యత్ర నాయకః।
తత్ప్రఖ్యాతం విధాతవ్యం వృత్త మత్రాధి కారికమ్॥
'దశరూపకమ్. ధనంజయ ప్రణీతం. తృతీయ పరిచ్ఛేదం. శ్లో 22, 23. పు. 216

కాబట్టి పురాణాలు , కావ్యాలు , ఇతిహాసాలు ప్రబంధాలు మొదలైనవి నవలకు, చారిత్రక నవలకు మూలరూపాలని నిశ్చయంగా చెప్ప వచ్చు. కాని ఇవి బీజరూపాలు మాత్రమే.

భారతీయ సాహిత్యంలో నవలా ప్రక్రియ ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్లనే పూర్తి రూపురేఖలు స------న్నదని భావించ వచ్చు. అందువల్ల తెలుగు , హిందీ సాహిత్యంలోని నవలలను పరిశీలించాలంటే , దానికి ముందుగా ఆంగ్ల సాహిత్యం లోని చారిత్రక నవలా లక్షణాలను పరిశీలించాలి.

ఆంగ్ల సాహిత్యంలో చారిత్రక నవలలు అనగానే మనకు మొట్ట మొదట గుర్తుకు వచ్చే , చారిత్రక నవలా రచనకు ఆద్యుడు 'సర్‌వాల్టర్‌-స్కాట్ గారు'. " sir walter scott is the father of the historical novel in the English language - the real creater of, as well as the master artist in this form of fiction."[1] ఇంకా " sir walter scott who in Theory and practice laid the foundation-stone of modern historical novel, set in the interval at a half a century"[2]

'స్కాట్' స్కాట్‌లాండ్ లోని ఎడింబరో నగరంలో ( క్రీ.శ.1771-1832) జన్మించారు. చారిత్రక నవలలు రాయడానికి ముందు తనదేశానికి సంబంధించిన జానపద గీతాలు రాసేవారాయన. తర్వాత Maria Adjomat ప్రభావం వల్ల చారిత్రక నవలా రచనకు పూనుకొన్నారు. చిన్నతనం నుండే

1. Advanced literary essays, The Historical Novel - Dr. Raghukul Tilak , p: 313

2. American Historical Novel - Ernest E. Leisy , p: 5

వీరికి కథలు చెప్పే నేర్పరితనం, చరిత్రపై ఆసక్తి, కల్పనా చాతుర్యం ఉండేవి. ఆయన వాస్తవికతను, ఊహను కలిపి, చరిత్ర, రొమాన్స్‌లను సమపాళ్ళలో మిశ్రమం చేసి భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించారు. 'ఇవాన్ హో', 'క్వింటన్ ధర్వార్డ్' మొదలైన చారిత్రక నవలల పరిచయ వాక్యాల్లో చరిత్రను, నవలలను విశ్లేషించి చూశారు. వారు చరిత్రను, నవలను పరిశీలించిన దృష్టిని రఘుకుల తిలక్ గారు ఇలా వర్ణించారు.

"From scotts starry observations in the prefaces to some of his novels like 'Ivan hoe' and 'Quentin Durward', we may conclude that he viewed history as centrifugal and the novel as centripetal"[1] చారిత్రక నవలల్లో చరిత్ర కేంద్రంనుంచి పరిధివైపు విస్తరిస్తుండగా, నవల పరిధినుంచి కేంద్రం వైపు విస్తరిస్తుందని చెప్పడం ఇందులోని ముఖ్య విషయం.

సర్ వాల్టర్ స్కాట్ గారు చారిత్రక నవలలకు కొన్ని లక్షణాలు చెప్పారు. అవి-

1. "In the historical novel, both the scenic and the temporal Setting of the story must be felt through out by the reader.
2. Appeal of the Adventure.
3. scenery and description.
4. Suggesting the period, manner and customs but the tone of the

1. Advanced literary essays, the historical novel - Dr Raghukul Tilak, P: 113

past period will be situated throughout the fiction.

5. Using older form of languages 'Arachaise' Ex thou, thee.

6. Familiarity with religious temper of the story and to understand the spirit of the age"[1]

ఈ విధంగా తెల్పిన స్కాట్ గారు "In the mingling of fact and fiction historical accuracy need not be followed" అని కూడా చెప్పి ఉన్నారు.

స్కాట్ కి పూర్వం ఫీల్డింగ్, స్విఫ్ట్, వాల్టైర్ మొదలయిన రచయితలు తమ నవలల్లో చరిత్రను కొంత వరకు మాత్రమే స్పృశించినట్లు తెలుస్తుంది. కాని స్కాట్ కి పూర్వం 18 వ శతాబ్ది చివరి కాలంలో చారిత్రక నవలకు ముందుగ 'Historical romances', అంతకంటె ముందుగ 'Gothic Romances' వచ్చినట్లు అర్థమౌతుంది. "The Gothic Novel in England which grew out of the medieval day-dreaming of the 18th century, encouraged by the precedents of French fiction, developed in the coarse stock characters and situations and partial emotional effects."[3] ఈ 'గోథిక్' నవలలను 'టెర్రర్' నవలలు అనికూడ అంటారు. భయం, ఉద్రేకం, ఉత్సాహం, కుతూహలం, ఆశ్చర్యం మొదలైన

---

1. Ivan hoe, Sir Walter Scott' by Srinathan - an Introduction by & JC Grierson, P: 27-31
2. The critical Heritage, Edited by John N Haydon, London 1970, P:9
3. Advanced literary essays - Dr. Raghukul Tilak, P:118

భావాలు ఈ నవలా లక్షణాలు. ఈ 'గోథిక్' నవలల్ని అద్భుత నవలలుగా పేర్కొవచ్చు. ఈ 'గోథిక్' నవలలే ఒక విధంగా చారిత్రక నవలా రచనకు దారి చూపాయని చెప్పవచ్చు. 19వ శతాబ్దం నుండి స్కాట్ తో పరిపూర్ణ చారిత్రక నవలా రచన ప్రారంభం అయింది.

స్కాట్ కు ప్రాచీన గాథలు, మధ్యయుగ యోధుల గాథలు అంటే చాల ఇష్టం. చరిత్రను అంకిత భావం తోనూ, పూజ్యభావం తోనూ పరిశీలించేవాడు. ప్రాచీన స్కాట్లండు దేశ కథల్ని హృదయానికి హత్తుకునే విధంగా రచనలు చేశారు. కేవలం స్కాట్లండ్ వీరుల, స్కాట్లండ్ దేశ చరిత్ర కాకుండా, ఇంగ్లాండు, యూరోపా ఖండం లాంటి ఇతర ప్రాంతాల చరిత్రను అన్వేషించి తమ నవలల్లో పొందు పర్చారు. స్కాట్ గారి నవలాక్షేత్రం చాలా విశాలమైంది; సుదీర్ఘమైంది. కాల పరిధి కూడా చాలా ఎక్కువ. 3 శతాబ్దాల కథల్ని తన చారిత్రక నేపథ్యంగా ఎన్నుకొన్నారు స్కాట్ గారి ముఖ్యోద్దేశం రొమాన్స్ ని వెలుగులోకి తేవడమే. ఈ రొమాన్స్ ని సాధించడానికి చారిత్రక సత్యాల్ని అన్వేషించారు. "scott used the facts of history for purposes of romance. He did not care for strict Historical truth"[1] స్కాట్ మహాశయుడు రొమాన్స్ నే ప్రయోజనంగా భావించి చరిత్రను అన్వేషించినా, రొమాన్స్ కంటే చారిత్రక సత్యాలు అతని కవిత్వ సంపదచే మరింత గాఢ్ఢంగా వెలుగులోకి వచ్చాయి. చారిత్రక నవలా లక్షణాలు ఈ విధంగానే పుట్టుకొచ్చాయని చెప్పవచ్చు. అందుకే స్కాట్ గారిని

---

1. 'Advanced literary essays', The Historical Novel - Dr Raghukul Tilak, P 114

'Antiquarian'[1] - చారిత్రక నవలాకారునిగా అభివర్ణిస్తూ ఎంతో మంది ప్రముఖులు స్కాట్‌ను పొగిడారు. వారిలో "According to Lukacs 'scott's greatness lies in his capacity to give living human embodiment to historical - social types. The typically human terms in which great historical trends became tangible had never before been so superbly, straightforwardly and pregnantly portrayed. And above all, never before had this kind of portrayal been consciously set at the centre of the representation of reality"[2]

Daiches states " His imagination, his abundant sense of life, his ear for vivid dialogue, his feeling for the striking incident and that central, healthy sense of the humour of character, added, of course, essential qualities to his fiction. But it was his tendency to look at history through character and at character through the history that had worked on it that provided the foundation of his art.[3]

స్కాట్ రాసిన waveverly (1814), Guy Mannering (1815), Antiquary (1816), Old Morality (1816), The Heart of Midlothian (1818),

1. English Novel- J. Alfred., P:70.

2,3. walter scott and the Historical Imagination David Brown., P;3.

Robroy (1818), Ivanhoe (1820), The Talisman (1825), Kenilworth (1821), The Fortunes of Nigel (1822), The Quentin Durward (1823), Saint Ronan's well (1824), Redgauntlet (1824) మొదలైనవి చారిత్రక రొమాన్సులుగా ప్రఖ్యాతి పొందాయి.

స్కాట్ తర్వాత ఆంగ్లంలో పేర్కొనదగిన చారిత్రక నవలా కర్తలలో చార్లెస్ డికెన్స్ (1812-1870), Bulwer Lytton (1803-1873), Thackeray (1811-1863), W.H, Ainsworth (1805-82), Charles Reade (1814-1884), Charles Kingsle (1819-1875) మొదలైన వారు ముఖ్యులు.

చార్లెస్ డికెన్స్ 'బార్నబీ రడ్జ్', 'ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్' మొదలైనవి రాశారు. బుల్వర్ లైటన్ 'రైయిన్జి', 'ది లాస్ట్ డేస్ ఆఫ్ పాంపీ' మొదలైనవి రాశారు. థాకరే 'ఎన్రీ ఎస్మండ్', 'ది ఇంగ్లీష్ హ్యూమరిస్ట్స్ ఆఫ్ ది ఏటీన్త్ సెంచరీ' మొదలైన నవలలు రాశారు. ఎన్స్‌వర్త్ గారు 'రోక్‌వుడ్', 'జాక్ షెప్పర్డ్', 'ది టవర్ ఆఫ్ లండన్' మొదలైనవి రాశారు. చార్లెస్ రీడ్ (Charles Reade) అనే గొప్ప చారిత్రక నవలా కారుడు 'ది క్లాయిస్టర్ అండ్ ది హెర్త్' అనే మాస్టర్ పీస్ ను రాశారు. చార్లెస్ కింగ్స్‌లీ 'వెస్ట్ వర్డ్ హో', ఈస్ట్ (Yeast), Alton Locke, Hypatia మొదలైన నవలలు రాశారు.[1]

ఈ విధంగా చారిత్రక నవలలు రచించిన ఆంగ్ల చారిత్రక నవలా కారులంతా స్కాట్‌నే అనుసరిస్తూ ఈ క్రింది లక్షణాలను ఇంచుమించు తమ నవలల్లో పాటించారని చెప్పవచ్చు.

---

1. Advanced literary essays, The Historical Novel - Dr Raghukul Tilak, P: 315, 316

ఆంగ్ల చారిత్రక నవలల్లో కనిపించే ముఖ్యలక్షణాలు :

1. గతంలో ఏదో ఒక కాలానికి, దేశానికి సంబంధించిన చారిత్రక వ్యక్తులను వర్ణిస్తూ, తద్వారా ఆ దేశానికి ఉన్నతి చేకూర్చే కథల్ని ఇతివృత్తంగా కల్పించడం.

2. చారిత్రక రొమాన్స్‌కు తగుస్థానం కల్పించడం.

3. చారిత్రక నవలల్లోని ప్రముఖ పాత్రల్ని రచయిత తన ఇష్ట ప్రకారం చిత్రించేందుకు వీలులేనందున చరిత్రలో లేని కొన్ని పాత్రలు కల్పించడం; అలా కల్పించిన కథలో ప్రధానంగా గ్రహించిన దేశ, కాల పరిస్థితుల కనుకూలంగా పాత్ర కల్పన చేయడం.

4. చారిత్రక నవలల్లో చారిత్రక సంఘటనలు లేక చరిత్రలోని వ్యక్తులు లేకుండా కూడ రచించడం. కాని చరిత్రనుండి ఏవైనా సంఘటనలను లేక వ్యక్తులను గ్రహిస్తే చారిత్రక విలువలు కోల్పోకుండ చూడడం.

5. కల్పనకు, సత్యానికి మధ్య అవినాభావ సంబంధాన్ని చేకూర్చడం. అంటే, ఒక ప్రక్క చారిత్రక విలువలు కల్గి ఉంటూ, మరో ప్రక్క కళాత్మక విలువలు కోల్పోకుండా ఉండడం.

6. సాధారణంగా ఆంగ్ల చారిత్రక నవలల్లో రచయితలు సంభాషణలను నాలుగు విధాలుగా నిర్వహించారని తెలుస్తుంది. i) కథా కాలానికి సంబంధించిన భాషా ప్రయోగం, ii). గతంలోని ఏదో ఒక కాలానికి సంబంధించిన భాషా ప్రయోగం, iii) ప్రత్యేకంగా ఏ కాలానికీ సంబంధించని భాషా ప్రయోగం. iv) వర్తమానానికి సంబంధించిన భాషా ప్రయోగం

7. చారిత్రక నవలల్లోని పాత్రలు, సంఘటనలు ఆయా వాతావరణ పరిస్థితుల కనుకూలంగా భౌతిక, మానసికమైన మార్పులను పొందేటట్లు సన్నివేశ కల్పన గావించడం.

8. గత చరిత్రపై అభిమానాన్ని కలిగించి, సృజనాత్మకంగా ఆలోచించే వారికి సంతృప్తిని కలిగించడం.

9. గత ఔన్నత్యాన్ని, గతానికీ వర్తమానానికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని చిత్రించడం.

ఈ లక్షణాలన్నీ గ్రహించి తెలుగు, హిందీ చారిత్రక నవలాకారులు కూడా తమ రచనలు సాగించారని చెప్పవచ్చు. పై లక్షణాలన్నీ క్రోడీకరిస్తే చారిత్రక నవలా లక్షణాలను ఈ క్రింది విధంగా కూడా పేర్కొవచ్చు.

1. చారిత్రకత.
2. చారిత్రక రొమాన్స్.
3. పాత్ర నిర్మాణంలో ప్రత్యేకత.
4. వర్ణనాధిక్యత.
5. దేశకాల నిబద్ధమైన సన్నివేశ కల్పన.
6. దేశకాల నిబద్ధమైన వాతావరణం, ఆచార పరికల్పన.
7. భాషా, శైలీ విన్యాసంలో ప్రత్యేకత.
8. ఉన్నతాశయ ప్రచలనం మొదలైనవి.

హిందీ భాషలోని చారిత్రక లక్షణాలను గురించి శ్రీ శివనారాయణ-శ్రీవాత్సవ గారు " చారిత్రక నవలల్లో లక్షణాలను చారిత్రక దృష్టితో చూడాలి.

సామాన్య నవలా లక్షణాలతో సమానంగా చారిత్రక నవలా లక్షణాలున్నప్పటికీ కొద్ది పాటి మౌలికభేదం ఉంటుంది. సామాన్య నవలల్లో వలె కథా వస్తువు, పాత్ర - చిత్రణ, సంభాషణలు, దేశ కాల పరిస్థితులు, భాష, శైలి, ఉద్దేశం అనే ఆరు లక్షణాలు చారిత్రక నవలకూ అవసరం" అన్నారు

'హిందీ సాహిత్యంలో ప్రసిద్ధి గాంచిన చారిత్రక నవలాకారుడైన బృందావన్ లాల్ వర్మగారు కూడా, సర్ వాల్టర్ స్కాట్ ఆదర్శంగా చారిత్రక నవలలను రచించడాన్ని బట్టి, అనేకులు వర్మగారిని, వాల్టర్ స్కాట్ తో పోల్చారు. వీరే కాకుండా ఆచార్య హజారీ ప్రసాద్ ద్వివేదీ, యశ్ పాల్, రాంగేయ-రాఘవ్, ఆచార్య చతురసేన్ శాస్త్రి, భగవతీ చరణవర్మ మొదలైన వారు కూడా హిందీ చారిత్రక నవలాకారులే. వీరందరూ పై లక్షణాలన్నీ తమ నవలల్లో పొందుపర్చారు. తెలుగులో అడివి బాపిరాజుగారు, నోరి నరసింహ-శాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు మొదలైన వారందరూ చారిత్రక నవలల్ని కూడా రాసినవారే. వీరందరూ కూడ పూర్వ చరిత్రను అన్వేషించి, చారిత్రక ప్రదేశాలు సందర్శించి, కొంత చరిత్రను, కొంత కల్పనలను జోడించి రచనలు చేసిన వారే. వీరుకూడా చారిత్రక లక్షణాలతో కూడిన నవలలే రాశారు. వీరిలో ముఖ్యంగా బాపిరాజుగారిలో కూడా వాల్టర్ స్కాట్ ప్రభావం కనిపిస్తుంది. బాపిరాజుగారు కూడా చారిత్రక సత్యాలను వెలికి తీసి చారిత్రక నవలలు రాసినా, రొమాన్స్ ఛాయలు ప్రస్ఫుటమౌతున్నాయి కానీ ఈ మాటను తాను వాచ్యంగా ఎక్కడా ప్రస్తావించ లేదు

౨౦వ శతాబ్దంలో చారిత్రక నవలల పరిస్థితి గురించి

రఘుకుల తిలక్ గారు " In the 20th century, the historical novels has suffered a decline. The Times are uncongenial to the historical novels of the Scott type, dealing with romance of knight-errantry and woman worship"[1] అన్నారు.

చారిత్రక నవలల్లో పేర్కొదగిన ముఖ్య విషయం గురించి రాచమల్లు రామచంద్రా రెడ్డిగారు " నవలల్లో చిత్రితమైన చరిత్ర తన గత చరిత్రే అని పాఠకునికి అనుభూతి కావాలి"[2] అన్నారు. అటువంటి అనుభూతి కల్గినప్పుడే పాఠకునిలో తనపూర్వుల చరిత్రను గూర్చి గర్వపడడం, చరిత్రలోని వీరపురుషుల సాహసాన్ని అభినందించడం, తన దేశాన్ని ప్రశంసించడం మొదలైన భావాలు ఉత్పన్నమౌతాయి. అప్పుడే చారిత్రక నవలా రచనా ప్రయోజనం నెరవేరుతుంది.

చారిత్రక సత్యాలను ప్రాతిపదికగా చేసుకొని కల్పనను జోడించి నవలను రచించే ప్రయత్నంలో నవలాకారునికి ఎన్నో సమస్యలెదురౌతాయి.

## 1.2. చారిత్రక నవలా రచనలో నవలాకారునికి ఎదురయ్యే సమస్యలు :

చారిత్రక వాస్తవాలకు యథాతథంగానో, కొద్ది మార్పులతోనో లేక కొంత కల్పనలను జోడించిన నవల చారిత్రక నవల. చారిత్రక నవలల్లో ఎన్ని కల్పనలున్నా చారిత్రక యథార్థాలు తప్పనిసరిగా

---

1. Advanced literary essays, The Historical Novel - Dr. Raghukul Tilak, P:317.

2. సంవేదన - 1988 ' కొల్లాయి గట్టితే నేమి ' - విమర్శ - రాచమల్లు రామచంద్రారెడ్డి

ఉండాలి. అందుకే చారిత్రక నవలాకారుని ఒకవిధంగా చరిత్రకారుడే అనవచ్చు. అతడు కేవలం నవలాకారుడే కాక కళాకారుడు కూడ.

చారిత్రక నవలాకారుడు రెండురకాలయిన బాధ్యతలను నిర్వహించాలి. 1. చరిత్రకారుని పని, 2. నవలాకారుని పని. ఈ రెండు అంశాలను సమర్థవంతంగా సమ్మిళితం చేసి సాఫల్యం పొందిన రచయిత ఉత్తమ చారిత్రక నవలాకారుడౌతాడు.

చారిత్రక నవలాకారుడు చరిత్రను నవలగా మలచడంలో రెండు పద్ధతులను అవలంబిస్తాడు మొదటి పద్ధతిలో చరిత్ర అతనికి కేవలం సామగ్రిని మాత్రం అందిస్తుంది. అతడు ఏ కాలం నాటి సంఘటనలను కథను గ్రహిస్తాడో ఆ కాలం నాటి సంఘటనలు, జీవిత విధానం, ఆచార విచారాలు, సామాజిక, ధార్మిక పరిస్థితులు మొదలైన వాటిని తన నవలలో పొందుపరచడంలో జాగ్రత్త వహిస్తాడు ఈ పద్ధతిలో నవలాకారుడు చరిత్ర అందించిన సామగ్రిని తన ఇష్టం వచ్చిన రీతిలో మలచుకొంటాడు నిజానికి ఈ పద్ధతి చాల కష్టం రచయిత ఈ ప్రయత్నంలో పాత్రలను సృష్టించవచ్చు సంభాషణలను కల్పించవచ్చు. ఇంకా చరిత్రకు విరుద్ధంగా లేకుండా, నవలకు పుష్టి చేకూరుతుందనే లక్ష్యంలో అనేక సంఘటనలను కల్పించవచ్చు

రెండవ పద్ధతిలో చరిత్ర సామగ్రిని చేకూర్చడమే గాక, నవలాకారునికి పటిష్ఠమైన కథావస్తువును కూడా అందిస్తుంది [illegible] చేసుకొని రచయిత సృజనాత్మక శక్తిని ఉపయోగించి [illegible]

నింపి ప్రాణం పోసి ఆకర్షణీయంగా నవలగా మలుస్తాడు. ఈ పద్ధతి లోనూ చారిత్రక నవలా కారుడు కథా వస్తువును సమకూర్చుకోవడం, ఆ కథా వస్తువును కళాత్మకంగా మలచడం అన్న ప్రధాన విషయాలను మరువకూడదు. ఈ పద్ధతిలో నవలా కారుడు కథా వస్తువునే గాక, చారిత్రక సంఘటనలను కూడా చరిత్ర నుండి గ్రహిస్తాడు. అందులోని లోటుపాట్లను తన కల్పనలతో పూరిస్తాడు. అవసరాన్ననుసరించి చరిత్ర తీవ్రతను, ఆకస్మికతకు స్వాభావికత కలిగించడానికి అప్పుడప్పుడు దానిని ఎన్నో మలుపులు తిప్పుతాడు.

ఈ రెండు పద్ధతుల లోనూ నవలా కారుడు కొన్ని సమస్యలను ఎదుర్కొంటాడు. అవి-

1. కథా వస్తువు, సంఘటనలు క్రమ పద్ధతిలో కూర్చడం.
2. చారిత్రక సంఘటనలకు లేదా సత్యాలకూ, కల్పనలకూ మధ్య సమన్వయం కుదర్చడం.
3. కాలం నిర్ణయించడం.
4. పాత్రలను చిత్రీకరించడం.
5. నవలలోని కల్పనలకూ, చారిత్రక సత్యాలకు మధ్య చక్కని సంవిధాన మేర్పరచడం.
6. దేశ కాల పరిస్థితులను నిర్ధారించడం.

1. కథావస్తువు, సంఘటనలు క్రమ పద్ధతిలో కూర్చడం: చారిత్రక నవలా కారునికి మొట్ట మొదట ఎదురయ్యే సమస్య కథా వస్తువు [illegible]

ఎంచుకోవడం , తర్వాత దీనిని క్రమ పద్ధతిలో కూర్చడం. చరిత్ర,నవలా కారునికి తయారు చేసిన కథను ప్రత్యేకంగా ఇవ్వదు. చరిత్రలో అనేక సంఘటనలు ఒకదానికొకటి సంబంధం కానివి చెల్లాచెదురుగా ఉంటాయి. వాటిని కథా సూత్రంలో బంధించి, నవలకు ఒక రూపాన్నివ్వడం చారిత్రక నవలాకారుని విధి. ఇందులో నవలాకారుని ప్రతిభా పాటవాలు బయట పడతాయి.

2. చారిత్రక సంఘటనలకు లేదా సత్యాలకూ, కల్పనలకు మధ్య సమన్వయం కుదర్చడం: చారిత్రక నవలాకారుడు ఏ సంఘటనలు ఎన్నుకోవాలి? ఏ సంఘటనలు వదిలేయాలి అన్న నిర్ధారణకు రావాల్సి వస్తుంది. ఈ సందర్భంగా A.T. Sheppard గారు "In every period of history, in every episode, in a fragment of stone, in an old weapon, in a name on a desolate grave, in a scarp of verse, is the germ of historical novel. The difficulty is, or should be, selection. The selection of the title is difficult. The selection of character and incident is a difficulty. And it is important to know what to reject and what to select"[1] అన్నారు. చారిత్రక సత్యాలనుగ్రహించి, కల్పనతో వీటిని ఎలా సమన్వయించాలి అన్న విషయం యోచించాలి ఈ విషయాన్ని గురించి బృందావన్ లాల్ వర్మగారి అభిప్రాయం ఇలా ఉంది "నిజమైన చరిత్ర

1 హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ — డా॥ [illegible]

దొరికినప్పుడు దానిలో ఎలాంటి పరివర్తన చేయకుండా యథాతథంగా స్వీకరించాలి. చరిత్ర అస్పష్టంగానూ, లేదా అసంపూర్ణంగానూ లభిస్తే దానికి సమన్వయం కుదిర్చేదానికి లేదా ప్రధాన పాత్రను ముందుకు నడిపేందుకు అప్రధాన పాత్రల ఆవశ్యకత ఎంతైనా ఉంది కాబట్టి ఆధునిక మానవ జీవితం లోని జీవిత పాత్రల సౌశీల్యాన్ని తన కల్పనా శక్తితో ప్రాచీన పాత్రలకు అన్వయింప చేయాలి సమయం మారగవచ్చును కానీ మానవ స్వభావంలో మార్పుండదు."[1] పై విషయాన్ని గురించి ఆయన ఇంకా ఇలా రాశారు. "చరిత్రను ఆధారం చేసికొని నవలను రచించే నాటికి తన దృష్టికోణంపై చారిత్రక నవలాకారునికి నమ్మకం ఉంటుంది కానీ చరిత్ర రాసే వానికంటే ఎక్కువ స్వతంత్రుడు కావాలంటే యుద్ధంలో వీర విహారాలను, రాజకీయ యుక్తులను, ప్రేమకథలను కలిపి సంఘటనాత్మకంగా చేయవచ్చు. లేదా కల్పనా పూర్ణమైన సంఘటనలను పూర్తిగా నమ్మదగిన వానిగా రచించవచ్చు. ఈ ప్రయత్నం సత్యం, సుందరం అనే పరిధిలో ఇమిడి ఉండాలి. అతని కల్పన లోక కళ్యాణం వైపు పయనించనప్పుడు అతని పరిశ్రమ సఫలం కాదు... చరిత్ర ప్రకాశింపని చోట రచయిత కల్పనను ప్రయోగించి విస్మృతమైన సత్యాలను స్పష్టం చేయగలడు."[2]

**3. కాలం నిర్ణయించుకోవడంలో సమస్య:** చారిత్రక నవలాకారుడు కాలాన్ని ఎన్నుకొనే విషయంలో ప్రత్యేకించి కొన్ని సమస్యలను ఎదుర్కొంటాడు

---

1. హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్. [illegible]
2. పైదే, పు: 173.

కాలం విషయంలో George Lukass గారు "It is clear that the more remote on historical period and the conditions of life of its actors, the more the action must concern it-self with bringing those conditions plastically before us, so that we should not regard the particular psychology and ethics which arise from them as an historical curiosity, but should re-experience them as a phase of mankind's development which concerns and moves us"[1] అన్నారు.

A.T. Sheppard గారు "It is comparatively easy to write about the very remote past, to invent names, perhaps which probably were land or sea, but you do at your own risk ... you may invent names, invent environment, even make your clock strike in Roman halls and years with impunity and with ease - until you found out"[2] అన్నారు.

జార్జ్ లూకాస్, ఎ.టి. షెప్పర్డ్‌ల అభిప్రాయం ప్రకారం, తెలిసిన భూతకాలం చరిత్రను తీసుకొని నవలను రాస్తే అది ప్రభావోత్పాదకంగానూ, సులభంగానూ ఉంటుంది కాని [illegible]

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - డా॥ గోవింద్‌జీ, పృ 1...
2. పైదే, పృ: 153.

సులభం కాదు. కానీ, కాలం దూరమయ్యే కొద్దీ, కల్పనకు నవలాకారునికి ఎక్కువ విలువ ఉంటుంది. ఝాన్సీ లక్ష్మీబాయి, అల్లూరి సీతారామరాజు, టిప్పూ సుల్తాన్ కథాకాలాల కంటే, శాతవాహనులు, ఇక్ష్వాకులు, గుప్తులు, మౌర్యుల కథాకాలం గ్రహిస్తే కల్పనకు బాగా విలువుంటుంది కానీ కల్పనలున్నా అవి ఆ కాలం నాటివని స్ఫురించాలి. కాబట్టి రచయితకు ఆనాటి కాల పరిస్థితి పట్ల లోతైన అవగాహన ఉండాలి. లేకుంటే అతడు మార్గాన్నుంచి తప్పుదారి పట్టే అవకాశం ఉంది. ఈ సందర్భంగా హజారీ ప్రసాద్ ద్వివేదీ గారి ఉద్దేశం గమనింపదగ్గది "చరిత్రకు సంబంధించిన గత విషయాలన్నీ పూర్తిగా తెలిసినవి కానీ, తెలియనివి కానీ ఉండవు. సాధారణంగా సుదీర్ఘమైన భూతకాల చారిత్రక సత్యాల పరిచయం తక్కువగానూ, సమీప భూతకాలానికి చెందిన వాటి పరిచయం ఎక్కువగానూ ఉంటుంది. చారిత్రక నవలాకారుడు సుదూరంగా ఉండే భూతకాలపు సంఘటనలకు సమన్వయం చేకూర్చాలంటే కల్పనాశక్తి అధికంగా ఉపయోగించాల్సి ఉంటుంది. చారిత్రక నవలా రచయిత వాస్తవికతను ఉపేక్షించలేరు. అతడు గతాన్ని చిత్రించే ఉప్పుడు పురాతత్వం, మానవత్వం, మనోవిజ్ఞానం మొదలైన వాటికి చెందిన ఆధునిక దృష్టికోణాన్ని తెలుసుకోకుండా పనికిరాని కల్పన చేస్తే హాస్యాస్పదులౌతారు. ఈ దృష్టితో చూస్తే చారిత్రక నవల రాయడం చాల కష్టం. చాల స్వల్పమైన విషయాలను చిత్రించడంలో కూడా జాగ్రత్త వహించాలి. శిష్టాచారంలో ప్రయోగించే శబ్దాలు, ఆనాటి మర్యాద

విశ్వాసాలకు విరుద్ధంగా ప్రయోగించే వాక్యాంశాలు కూడా రసానుభూతికి భంగం కలిగిస్తాయి."[1] కాబట్టి సుదూర భూత కాలాన్ని వస్తువుగా స్వీకరిస్తే సౌకర్యంతో బాటు, అసౌకర్యం కూడా ఉంటుంది.

4. పాత్రలను చిత్రీకరించడం : ఈ విషయంలో కూడా భిన్న మతాలున్నాయి. కొంత మంది విమర్శకులు చరిత్రలో ప్రసిద్ధి గాంచిన పాత్రలే చారిత్రక నవలా రచనకు ఉపయోగపడుతాయి అంటే మరి కొందరు ప్రసిద్ధి గాంచిన పాత్రల కంటే ప్రసిద్ధి గాంచిన సంఘటనలే ఉపయోగ పడతాయన్నారు. పాత్రలు అప్రధానాలైనా సంఘటనలు మాత్రం ప్రధానంగా ఉండాలన్నదే వీరి అభిమతం.

George saints.bury మతప్రకారం "... when this condition is complied with, the actual historical events may be and constantly have been used with effect as aids in developing the story and working out the fortunes of actors"[2] సంఘటనలు ప్రధానంగా ఉంటే కథను, పాత్రలను మలచుకోవచ్చును.

5. విషయానికి - సత్యానికి మధ్య పరస్పర సంబంధం (సాంగత్య- సంబంధ నిర్ధారణ : నవలలో చేసిన కల్పనలకూ, చారిత్రక సత్యాలకు మధ్య పరస్పరం నిర్ధారించడం కూడా ఒక సమస్యే. పరస్పర సంబంధం

---

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - డా॥ గోవింద్ జీ, పు. ...4
2. The English Novel - George Saintsbury, Dutton and co 1913, 132 - 133

లేక పోతే నవల చెల్లాచెదురు చేయబడ్డ గ్రంథాలయం లాగా ఉండడమే గాక, చారిత్రక సత్యాలనుగాక అసత్యాలను చాటి చెప్పినట్లు అనిపిస్తుంది. ఈ విషయంలో చారిత్రక నవలాకారుడు, చరిత్రకారుని వలె సత్యాలను, ఘటనలను ఒక దారంలో గుచ్చుకాని, కార్యకారణ సంబంధాలతో బంధించి, ఒక సంశ్లిష్టమైన నిర్మాణం గావిస్తే ఆ నవల ఉత్తమ చారిత్రక నవల అవుతుంది.

6. దేశకాల పరిస్థితులు: వైదిక యుగం, బౌద్ధయుగం, మధ్యయుగం, మహమ్మదీయ యుగం మొదలైన భిన్న యుగాల చరిత్రకు సంబంధించిన దేశ కాల పరిస్థితులు భిన్నంగా ఉంటాయి. ఇవి చరిత్రతో కలిసి ముందుకు సాగవు. యుగానికి, కాలానికి చెందినవి కూడా కావు. ఒకే యుగంలో కూడా భిన్న దేశ ప్రాంతాలకు చెందిన పరిస్థితులు భిన్నంగా ఉంటాయి. ఉదా॥ మధ్యయుగం నాటి బుందేల్ ఖండ్ ప్రాంతానికి, దక్షిణ భారతదేశ ప్రాంతానికి పరిస్థితులు భిన్నంగా ఉండేవి. బౌద్ధ కాలానికి చెందిన పాటలీ పుత్ర దేశకాల పరిస్థితులు నేటి ఆధునిక దేశకాల పరిస్థితుల కంటె భిన్నంగా ఉండేవి కాబట్టి చారిత్రక నవలాకారుడు క్షుణ్ణంగా శోధించి ఆ నాటి దేశకాల పరిస్థితులనే తన నవలలో ప్రతిబింబించేటట్లు చేయాలి.

పైన చర్చించిన సమస్యలన్నీ ప్రతి నవలాకారుడు సర్వసాధారణంగా ఎదుర్కొంటాడు. వాటిని ఎన్నో పద్ధతుల ద్వారా పరిష్కరించుకొంటారు. ఏ చారిత్రక నవలలో గతం సజీవంగా ఉంటుందో పాత్రలు, సంఘటనలు తమ వైశిష్ట్యాన్ని చాటి చెపుతాయో, కథ [illegible] [illegible],

ఆ నవల సాఫల్యాన్ని పొందగలదు. అటువంటి చారిత్రక నవలాకారుడు ఉత్తమ చారిత్రక నవలాకారుడౌతాడు.

చారిత్రక నవలా ప్రయోజనం గురించి పరిశీలించవలసి ఉంది.

1.3. చారిత్రక నవలా ప్రయోజనం: సమగ్ర మానవ జీవన చిత్రణమే నవల. ఇటువంటి మహత్తర చిత్రణం నుండి మనం గ్రహించేది ఏమిటి? దీనిని చదవడం వల్ల కలిగే లాభాలేవి? లభించే సందేశం ఏమి? ఏ మహత్తర ప్రతిఫలం ఆశించి పాఠకుడు తన సమయాన్ని వ్యయం చేసి నవలను చదువుతున్నాడు? అన్న ప్రశ్నలు కలుగక మానవు. ఒక్క నవల మాత్రమే కాదు, సాహిత్య ప్రక్రియలైన మహాకావ్యం, ఖండకావ్యం, నాటకం, కథానిక మొదలైన వాటి విషయాల్లో కూడా ఈ ప్రశ్న ఉద్భవిస్తుంది. సమాజాన్ని కర్తవ్యోన్ముఖం గావించి ప్రగతి పథాన నడిపించడమే ఈ సాహిత్య ప్రక్రియల ప్రయోజనం.

ఆచార్య జి. యస్. రెడ్డి గారు సాహిత్య ప్రాముఖ్యతను గురించి "సమాజము యొక్క నాగరికత సంస్కృతులకు ముఖ్య లక్షణం సాహిత్యం ఈనాడు సాహిత్యము లేని నాగరిక మానవ సమాజం లేదు సాహిత్యం సమాజాన్ని ఆశ్రయించి అనుగమించినా, కొన్ని ఘట్టాలలో సాహిత్యమే సమాజము యొక్క పురోగతికి చోదకమవుతుంది"[1] అన్నారు. ఆధునిక యుగంలో సమాజానికి కాక సందేశాన్నందించి ఉన్నత మార్గాన్ని నిర్దేశించే సాహిత్య ప్రక్రియల్లో నవల అత్యంత ప్రధానమయ్యింది. నవల సమాజమనే

1. సాహితీ సుధాలహరి - 'పరిచయం' సముద్రాల నాగ... పుట 6

నావకు చుక్కాని వంటిది.

పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు గారు "విశ్వసృష్టిని దాని స్వరూప స్వభావాలను బాగా గమనించి, యదార్థ పరిస్థితులను అవగాహన చేసుకోవడానికి నవలా ప్రక్రియ కన్నా మరొక మార్గం లేదనడం అతిశయోక్తి కాదు. ఇది ఇతగాలయిన సాహిత్య ప్రక్రియలకు సుకుటాయమానం. ఒక దేశప్రజల పరిస్థితుల్ని వేరొక దేశప్రజలు సంపూర్ణముగా తెలుసుకోవడానికి నవలా ప్రక్రియ కన్న మించిన సాధనం మరియొకటి లేదు కాబట్టి దీనిని ప్రపంచదర్శిని అని చెప్పవచ్చు"[1] అనీ, "ప్రతిభావంతులైన నవలాకారుడు తన విద్యుక్తధర్మాన్ని బాగుగా గుర్తించి, అప్రమత్తులుగా కృషి చేసి 'విశ్వశ్రేయసః కావ్యం' అన్న మన ప్రాచీన ఆలంకారికుల ప్రవచనానికి అనుగుణంగా ఆ నవలను మలచబడి, సర్వ జనులకు ఆనందాన్ని ఇచ్చేదిగా యుండి, ప్రపంచదర్శినియై చాలాకాలం వర్ధిల్లుతుంది. అప్పుడే అది లోకానికి మధురానుభూతులను అందించగలుగుతుంది"[2] అనీ చెప్పారు.

అక్కిరాజు ఉమాపతి రావు - నవలా ప్రయోజనాన్ని గురించి చెప్తూ - "నవల సమగ్ర సాహిత్య ప్రక్రియ సాహిత్యానికి, మానవజీవితానికి ఉండే సంబంధాన్ని సమగ్రముగాను, ఆకర్షణీయంగాను, ఈ ప్రక్రియద్వారా నిరూపించ గలిగినట్లు మరే సాహిత్య ప్రక్రియ ద్వారాను నిరూపించలేము. సాహిత్య ప్రయోజనాన్ని సాధించడానికి కూడా నవలా ప్రక్రియ ద్వారానే ఎక్కువ అవకాశం ఉంది."[3]

1 తెలుగు నవలా సాహిత్య వికాసము - పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు, పు: 58
2 పైదే, పు: 58.
3. నవలా సాహిత్యం - సామాన్యుడు (వ్యాస సంపుటి) అక్కిరాజు ఉమాపతి రావు, పు: 37.

ఈ పరిస్థితుల్లో చారిత్రక నవలకూడా దీనికి అపవాదం కాదు. చారిత్రక నవలాకారుడు తన నవలకు సంబంధించిన చారిత్రకాంశాలను క్షుణ్ణంగా పరిశీలించి, అవసరమైన చోట కల్పనలు జోడించి రచన గావిస్తే, మనకు మధురానుభూతులు కలగడమే కాక చారిత్రక అంశాలు తెలుస్తాయి. సర్వమానవ కళ్యాణానికి, సర్వమానవ సౌభ్రాతృత్వానికి, జాతీయ సమైక్యతకు దోహదమిచ్చేందుకు కూడా చారిత్రక నవలలు తోడ్పడుతాయి; కాబట్టి "చారిత్రాత్మక నవలల్లో ప్రధానమైన అంశం గతకాలంలో ఎన్నడో జరిగి ఉండవచ్చునన్న కథాంశాన్ని, ఆనాటి ప్రజా జీవితాన్ని నవలాకర్త పునర్నిర్మించవలసి ఉంది. ఇటువంటి సందర్భంలో కల్పన, వాస్తవికతల సమన్వయం కుదరడం కష్టం. సమకాలీన సమస్యలను, పరిష్కారాలను కొందరు నవలాకర్తలు ప్రాచీన ఇతివృత్తాలలోకి చొప్పించి, అందులో కృతకృత్యులగుతున్నారు"[1]

రచయిత గతకాలంలోని చరిత్రలో ప్రవేశించి, అందలి చారిత్రక సంఘటనలను వెల్లడించే ప్రయత్నం చేస్తారు కాబట్టి "తమ సమకాలీన సమాజాన్ని సంస్కరించి ఉన్నతంగా చేయడానికి నవలాకారుడు గతకాలం నాటి ఆదర్శాలను, గౌరవంగా జీవితాన్ని నడిపే విధానాన్ని, అచట మహాపురుషుల నీతి, సదాచారం మొదలైన వాటిని మన ముందుంచి మన ప్రవర్తనను చక్కదిద్దుతారు."[2] సంఘంలోని పాఠకుడు గతంలోని

---

1. 'మహతి' నవలా విభాగం - 'నవల-వాస్తవికత-కల్పన' - డా॥ ముదిగొండ వీరభద్ర శాస్త్రి, పు.:118.
2. హిందీ ఉపన్యాస్ - డా॥ శివనారాయణ శ్రీవాస్తవ్, పృ.:33.

విషయాలను చదివి అవగాహన చేసికొని, తన జీవితాన్ని గౌరవప్రదం గాను, ఆదర్శ ప్రాయం గాను తీర్చి దిద్దుకునేటట్లు చేయడానికి ప్రయత్నిస్తారు.

భారత దేశంలో దేశకాల పరిస్థితుల కనుగుణంగా ఎన్నో మతాలు, అవాంతర మతభేదాలు ఉద్భవించాయి. మత పరమైన సంఘర్షణలు కూడా చెలరేగాయి. ఆయా సంఘర్షణలను, వాటి ఫలితాలను చారిత్రక నవలల ద్వారా సందర్భాను సారంగా నవలాకారులు ప్రతిపాదించేటందుకు అవకాశం ఎక్కువగా ఉంది. తరతరాలుగా ప్రజల్లో కులం, మతం, స్త్రీల విషయాల్లో పాతుకు పోయిన సనాతన అభిప్రాయాలను రూపుమాపడం, సమాజంలో స్త్రీకి పురుషునితో సమానమైన గౌరవస్థానాన్ని కల్పించడం, స్త్రీ విద్యను ప్రోత్సహించడం, ప్రజల్లో చైతన్యాన్ని కల్గించి సమస్యా పూరితమైన సమకాలీన జీవితాన్ని ప్రతిబింబింప చేసి తద్వారా సమాజాభివృద్ధికి కొంత వరకు దోహదం కల్గించేందుకు ప్రయత్నించడమే చారిత్రక నవలల ప్రయోజనం.

జాతి ఔన్నత్యం, ఆ దేశ ప్రజల దేశభక్తి జాతీయతా భావాల మీద ఆధారపడి ఉంటుంది. ప్రజల్లో ధైర్య సాహసాలను, దేశభక్తిని, కార్యదీక్షను, జాతీయ భావాన్ని పురికొల్పడమే చారిత్రక నవలాకారుని ముఖ్య ఉద్దేశం. ఆ ఉద్దేశంతోనే చరిత్రలోని వీరుల, నాయకుల జీవితాలను తమ రచనల్లో వ్యక్తం చేస్తారు. వారు దేశం కోసం ప్రాణాలను సైతం లెక్క చేయకుండ శత్రు రాజులతో పోరాడి, దేశాన్ని శత్రువుల బారినుండి కాపాడడం వంటి సన్నివేశాల వల్ల ప్రజల్లో ఐకమత్యాన్ని పెంచి, వారిలో దేశాభిమానాన్ని భక్తిని పెంపొందింప జేయాలని చారిత్రక నవలా రచయితలు

భావించారు.

"స్వాతంత్ర్యాకాంక్షను దేశీయులలో ప్రజ్వలింప చేయడమే రచయితల, కళాకారుల, మేధావి వర్గాల ప్రధాన ఆశయం. స్వాతంత్ర్యం రావటానికి ముందు పాతిక సంవత్సరాల తెలుగు సాహిత్యాన్ని పరిశీలించి చూస్తే చారిత్రక నవలైనా సరే, ఆత్మాశ్రయ కవిత్వమైనా సరే, నాటకమైనా సరే పారతంత్ర్యాన్ని నిరశించడమూ, స్వేచ్ఛను కీర్తించడమూ, మన సమాజంలో కనబడే లోపాలను సరిదిద్దుకోవాలన్న ప్రబోధము కనపడుతాయి."[1]

"చారిత్రక నవలాకారుడు ప్రస్తుత సమాజంలో వర్తమాన సమస్యలైన జాతిసమస్య, వివాహ సమస్య, నారీ సమస్య మొదలైన వాటికి గతకాల ప్రనేపథ్యంలో చారిత్రక నవలల ద్వారా పరిష్కార మార్గాన్ని చూపడానికి ప్రయత్నం చేస్తారు."[2] జీవితానికి సంబంధించిన శాశ్వత సత్యాలను వెల్లడించే ఉద్దేశంతోనే చారిత్రక నవలాకారులు శాశ్వత నవల్ని రచిస్తారు. 'సత్యమేవ జయతే నానృతం' అనే విషయాన్ని చారిత్రక సంఘటనల ద్వారా నిరూపించేందుకు ప్రయత్నిస్తారు.

చరిత్రపై విశ్వాసంగల చారిత్రక నవలాకారులు తరచుగా చారిత్రక సంఘటనలను వాటి పాత్రల విషయంలో తన మనస్సులో అనురాగాత్మకమైన ప్రవృత్తిని అవలంబిస్తారు. "కథా వస్తువులో ఎక్కడైనా యదార్థానికంటే భిన్నమైన పరిస్థితులుంటే, అతడు న్యాయ బుద్ధితో తమ

---

1. మహతి - 'తెలుగు నవల - సామాజిక దృక్పథం' - డా॥ అక్కిరాజు రమాపతిరావు. పు: 99.
2. హిందీ ఔర్ మరాఠీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఏక్ తులనాత్మక్ అధ్యయన్ - డా॥ చంద్రకాంత్ గర్జే పు: 48.

చారిత్రక నవలల్లో చరిత్ర సంబంధమైన సత్యాలను వ్యక్తం చేస్తారు. ఎందుకంటే భారత దేశం ఒకప్పుడు ఏదో ఒక రూపంలో అన్యాక్రాంతమై ఉండేది. శాసకులు చరిత్రలు తమ ఇష్టం వచ్చినట్లు రాసి, సత్యాన్ని కప్పి ఉంచడానికి వెనుకాడలేదు. విదేశీయ చరిత్రకారులు తమదేశ చరిత్రను గొప్పగా రాసుకొని, మనదేశ గౌరవాన్ని తక్కువ చేసి రాసేవారు. ఇదే విధంగా చారిత్రక పాత్రల విషయంలో కూడ విదేశీయ చరిత్రకారులు అసంబద్ధంగా చిత్రించినారు. ఇట్టి స్థితిలో చారిత్రక నవలాకారులు పక్షపాత పూర్ణమైన ఈ విషయాన్ని సహించలేక పోయారు. ఈ అసత్య విషయాన్ని ఖండించి, తమ రచనల ద్వారా తమదేశానికి, పాత్రలకు న్యాయం చేకూర్చడానికి ప్రయత్నించారు[1]" అదీగాక కాలగర్భంలో కలిసిపోయిన అనేక చారిత్రకాంశాలను వెలికి తీయాలనే ఉద్దేశంతో నవలాకారులు కల్పనను ఆధారంగా గ్రహిస్తారు. ఈ కల్పనలో ప్రాచీన వీరుల శౌర్యం, పరాక్రమం, రాష్ట్రీయ భావన, దేశం కొరకు ఆత్మాహుతి కావడం మొదలైన విషయాలను చిత్రించి, ప్రజల్లో దేశాభిమానం ప్రాంతీయ భావన, స్వాతంత్ర్య పిపాస మొదలైన వాటిని జాగృతం చేయడానికి ప్రయత్నం చేస్తారు.

"చారిత్రక నవలల్లో సత్యానికి జయం, అసత్యానికి అపజయం కలుగుతుందనే సిద్ధాంతాన్ని చారిత్రక సంఘటనల ద్వారా స్పష్టం చేయడమే చారిత్రక నవలాకారుని ఉద్దేశం. ఈ ప్రయోజనంతో పాటు చారిత్రక నవలల్లో సాంఘిక క్షేమం, లోక కళ్యాణ భావన కలిగించడమే చారిత్రక నవల

1. హిందీ ఔర్ మరాఠీకే ఐతిహాసిక్ ఉపన్యాస్ ఏక్ తులనాత్మక్ అధ్యయన్ - డా॥ [illegible], పృ. 44

ప్రయోజనం"

చారిత్రక నవల ఒక విధంగా మానవులలోని జాతీయ ఔన్నత్యాన్ని పెంపొందించే తహతహను శాంతపరుస్తుంది. మానవుడు ఆదర్శ భావాలను పోషిస్తూ, కర్తవ్యోన్ముఖుడుగా ఉండేందుకు ప్రేరేపిస్తుంది"[2]

చారిత్రక నవలల్లో ఇతర నవలలకంటె ఆనాటి సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ విషయాలు అధికంగా చిత్రించడం జరుగుతుంది. ఇతర కావ్య ప్రక్రియల మాదిరిగా చారిత్రక నవలల్లో కూడ రసానుభూతి మాత్రమే ఉత్తమ ప్రయోజనం కాజాలదు. చరిత్రలోని పూర్వయుగానికి చెందిన సంఘటనలను ప్రకటించినప్పుడే నవలాకారుని ఉద్దేశం నెరవేరుతుంది. గతకాలపు వ్యక్తుల జీవితాలలోని మంచి చెడులు రెండు నవలలో కనబడుతాయి. అటువంటప్పుడు గతకాలపు ఉజ్జ్వలమైన భాగాన్నే తీసుకొని పాఠకుని మంచి కార్యాల వైపు ప్రేరేపింప వచ్చుననే విషయం సత్యమే. కాని దానికి భిన్నంగా ఆనాటి చెడు కార్యాలు కూడ వెలువరించి, అలాంటి కార్యాలు చేయకూడదని నీతిని బోధించ వచ్చు. అంతే ప్రజల్లో మానవతా దృక్పథాన్ని కల్గించడమే గాక, దేశభక్తిని, జాతీయ సమైక్యతను కల్గించడం కూడ చారిత్రక నవలల ప్రయోజనం.

ప్రతి యుగంలోను ఒక మూర్త భావం ప్రధానంగా ఉంటుంది. ఆ కాలపు ప్రజల సామాజిక జీవనంలో కూడ ఏదో ఒక ప్రత్యేకత కన్పిస్తుంది. గతంలో ఆయా గొప్ప వ్యక్తుల ఆదర్శమయ జీవితాన్ని, సంఘు

1. హిందీ ఉపన్యాస్ - శ్రీశివనారాయణ్ శ్రీవాస్తవ్, పు: 32
2. పైదే., పు: 33

సంస్కరణా ఆశయాల్ని చారిత్రక నవలలు సమాజపు స్మృతి పథంలోకి తెస్తాయి. ఆయా కాలాలకు సంబంధించిన ప్రజల సాంఘిక జీవనం, ఆచార వ్యవహారాలు, వర్ణవ్యవస్థ, రాజుల పరిపాలనా విధానం, దేశ పరిస్థితులు మొదలైన విషయాలన్నీ చాలవరకు చారిత్రక నవలల్లో వర్ణించడం వల్ల పాఠకులకు అప్పటి స్థితి గతులన్నీ తెలుస్తాయి. మన పూర్వుల జీవితాచారాలు, గతంలోని సంఘటనలు, ధైర్యసాహసాలు, మనోహరంగా కథాత్మకంగా కల్పించడం వల్ల పాఠకుల్లో చరిత్ర పఠనం పట్ల అభిరుచి అధికం అవుతుంది. చరిత్రను యథాతథంగా కాక, కళాత్మకంగా చిత్రించడం వల్ల చారిత్రక నవలలు పరోక్షంగా పాఠకుల్లో చరిత్రపై ఆసక్తిని కలిస్తున్నాయి. ఈ సందర్భంలో జాతీయ సంస్కృతి, నాగరికతలను గూర్చి మల్లాది వసుంధర గారు –

మన జాతి పరమ నాగరికమైన జాతి. సర్వప్రపంచమున నెచ్చటను ఆర్య సంస్కృతిని మించిన సంస్కృతి కానరాదు. మహర్షులైన వ్యాస వాల్మీకులు మన సంస్కృతిని తీర్చిదిద్దినారు అన్నారు. అటువంటి నాగరికత, సంస్కృతి సంప్రదాయాలను ఇంత సమ్మిళితంగా వ్యక్తీకరించడమే మన చారిత్రక నవలల పరమ ప్రయోజనం.

సంక్షిప్తంగా చారిత్రక నవలా ప్రయోజనాల్ని శ్రీ శివనారాయణ్ – శ్రీవాస్తవగారు ఈక్రింది విధంగా చెప్పారు.

1. గతాన్ని గురించిన ప్రేమ, వాటిని ఈ కాలానికి అన్వయించడం
2. రాష్ట్రీయ గౌరవాన్ని పెంపొందించడం

3. గతాన్ని ఆధునిక యుగానికి సమన్వయించి తద్వారా వ్యక్తిగత అభిప్రాయాలను స్పష్టం చేయడం.

4. గత విషయాలను మనో వైజ్ఞానికంగా వ్యాఖ్యానించడం.

5. చరిత్రకు న్యాయం చేకూర్చడం "[1] అని చెప్పారు.

ముఖ్యంగా చారిత్రక నవలలు " మనో వినోదం, సామాజిక, రాజకీయ సమస్యలను పరిష్కరించడానికి చరిత్రలో సమాధానం వెతకడం, అంతేగాక జాతీయ గౌరవం, ప్రాచీన వైభవాన్ని గురించిన స్పృహ, వర్తమానం కంటె చరిత్ర కాలానికి ప్రాధాన్యమివ్వడం, తన అభిప్రాయాలను స్పష్టం చేసే భావన మొదలైన ప్రయోజనాలను అందిస్తుంది."[2]

**1.4. భారతీయ సాహిత్యంలో చారిత్రక నవలలు - వికాసం :** భారతీయ సాహిత్యంలో నవలారచన 19వ శతాబ్దంలో ప్రారంభం అయింది ఆ సమయంలో ఆంగ్లేయ భాషా సాహిత్యాలు ఉన్నత దశలో ఉన్నాయి. ఆంగ్లము, ఫ్రెంచి మొదలైన పాశ్చాత్య భాషా సాహిత్యగ్రంథాల అనువాదాలు అధికంగా వెలువడినాయి.

విభిన్న భారతీయ సాహిత్యాలలో చారిత్రక నవలలు పొందిన వికాసాన్ని సంక్షిప్తంగా ఈ విధంగా సమీక్షించవచ్చు.

**బెంగాలీ భాష :** బెంగాలీ భాషలో మొట్టమొదటి చారిత్రక నవలా కారుడు 'బంకిం చంద్ర చటర్జీ'. బంకిం చంద్ర పాశ్చాత్య సాహిత్య ప్రభావానికి ఎంత

1. హిందీ ఉపన్యాస్ – శివనారాయణ్ శ్రీవాత్సవ., పు: 34

2. హిందీ ఔర్ మరాఠీకే ఐతిహాసిక్ ఉపన్యాస్ – డా॥ చంద్రకాంత్ గర్గే పు: 49

వరకు లోనయ్యాడో చెప్పజాలం. కాని అతనిపై స్కాట్ మున్నగు పాశ్చాత్య నవలాకారుల ప్రభావం మాత్రం కొంతవరకున్నదని చెప్పవచ్చు. అతని చారిత్రక నవలల బాహ్య స్వరూపం పాశ్చాత్య పద్ధతికి చెందినదే. అయినా ఆత్మ మాత్రం భారతదేశానికి సంబంధించింది. బంకించంద్ర దుర్గేశనందినీ, కపాలకుండల, మృణాళిని, చంద్రశేఖర్, రాజసింహ, ఆనందమఠం, దేవీ చౌధరాణీ మొదలైన ప్రసిద్ధ చారిత్రక నవలలు రచించారు. దుర్గేశనందిని, కపాలకుండల, మృణాళిని, చంద్రశేఖర్ నవలల్లో ఒకటి, రెండు పాత్రలు తప్ప మిగిలినవన్నీ కల్పితాలు.

రాఖాల్‌దాస్ - వంద్యోపాధ్యాయ ఎన్నో చారిత్రక నవలలు రచించారు. కరుణా, అశోక్, ధ్రువ మొదలైనవి ప్రసిద్ధమైన అతని చారిత్రక నవలలు. స్వర్ణకుమారీదేవి అనే రచయిత్రి రచించిన 'దీప నిర్వాణ్' అనే చారిత్రక నవల పృథ్వీరాజ్ సంయోగిత కథకు సంబంధించింది. రవీంద్రనాథ్‌-ఠాగూర్ రూపొందించిన చారిత్రక నవలల్లో 'బహురాకురాణి', 'రాజర్షి' అనేవి పేర్కొనదగినవి.

**గుజరాతీ:** గుజరాతీ నవలాసాహిత్య ప్రారంభదశలో అనువాద నవలల సంఖ్య అధికం. ఆంగ్ల భాషనుంచి ఎన్నో నవలలు అనువదింపబడి ప్రచారంలోకి వచ్చాయి. వాటిలో 'సర్ వాల్టర్ స్కాట్' రచించిన చారిత్రక నవలల అనువాదం పేర్కొదగింది. బెంగాలీ, మరాఠీ, హిందీ మొదలగు భాషలలోని నవలలు కూడా గుజరాతీ లోనికి అనువదించారు గుజరాతీ భాషలో మొట్టమొదటి చారిత్రక నవలాకారుడు 'నందశంకర తులజాశంకరమెహతా'

మెహతా రచించిన 'కరుణ ఘేలో' అనే చారిత్రక నవల 1866లో ప్రక
టింప బడింది. దీనిలో రాజా కరణ్ వృత్తాంతం కథావస్తువు. 'శ్రీకన్హయా-
లాల్. మాణిక్యాలాల్ మున్షీ' రచించిన చారిత్రక నవలలు ప్రశంసనీయాలు
'పృథ్వీవల్లభ్ గుజరాత్ కే నాథ్', 'పాటనికా ప్రభుత్వ. జయసోమనాథ్',
'భగ్న పాదుక' మొదలైన చారిత్రక నవలలను అతడు రచించాడు. మున్షీ
తరువాత 'ధూమకేతు' అనే రచయిత పేర్కొనదగిన వాడు. అతడు
'మహమ్మద్ గజనీ దండయాత్ర' తరువాత జరిగిన సంఘటనలను ఆధారంగా
చేసికొని 'చౌలాదేవి' అనే నవలను రచించాడు.

మరాఠీ: మరాఠీ సాహిత్యంలో మొట్టమొదటి నవలా రచన 1854లో
జరిగింది. శివాజీ కాలంనాటి రాజకీయ సంఘటనలను ఆధారంగా చేసికొని
'శ్రీ గుంజీకర్' అనే రచయిత 'మోచన్ గఢ్' అనే నవలను రచించాడు. ఇది
మరాఠీ సాహిత్యం లోని మొట్టమొదటి నవల. ఆటు తరువాత 'నాగేష్
వినాయక్ బాపట్' 'బాజీరావ్ సాహెబ్', 'సంభాజీ', 'చతురగఢ్
బావేట', 'పానిపట్ కీ మహిమ' అనే చారిత్రక నవలలు రచించాడు.
'హరి నారాయణ్ ఆప్టే' అనే అతడు సామాజిక స్పృహను కలిగించే క్రాంతి
కారి అయిన నవలాకారుడు. కొంతమంది పండితులు అతనిని మరాఠీ
భాషలో స్కాట్‌గా భావిస్తారు. అతడు రచించిన సాంఘిక, రాజనీతికి
సంబంధించిన నవలలు చాల ఉత్తమ శ్రేణికి చెందుతాయి. 'రూప్
నగర్ కీ రాజకన్యా', 'వజ్రాకార్', 'ఘుటవాలా', 'ఘణవహి గేలా'
అనేవి ప్రసిద్ధాలైన అతని చారిత్రక నవలలు. 'ఆప్టే' తరువాత చారిత్రక

నవలా కారులలో ' జానకీ బాయి దేశాయి ', ' షహా ', ' సహకాలీ కృష్ణ ' ' దత్తో అప్పాజీ ' మొదలైన వారు పేర్కొదగ్గ వారు.

అస్సామీ : ' అస్సామ్ ' భాషలోని చారిత్రక నవలాకారులలో ' రజనీకాంత్- బరదలే ' ముఖ్యమైన వాడు. ' లక్ష్మీనాథ్ బేజ బరువా ' అస్సామ్ కు చెందిన చరిత్ర నుండి కథా వస్తువును గ్రహించి ' పద్మ కుమారి ' అనే నవలను రచించాడు. ఈ నవల రాష్ట్రీయ భావాలను జాగృతం చేసింది.

' రజనీకాంత్ బరదలే ' ' మనోమతి ' అనే మౌలిక చారిత్రక నవలను రచించారు. అటుపిమ్మట ' సీత చంద్ర గోస్వామి ', ' పానిపథ్ ' అనే నవలను, ' హరినారాయణ దత్త బరువా ' ' చిత్రదర్శ ' అనే నవలను రచించారు. ఈ నవలలపై ' స్కాట్, డికెన్స్ ' ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది.

ఒరియా : ' ఒరియా ' భాషలో ' దేబ ప్రసన్న పట్నాయక్ ' చారిత్రక నవలాకారుడుగా ప్రసిద్ధి గాంచిన వాడు. ఆయన వర్తమాన కాలపు జీవితాన్ని గతకాలపు ఔన్నత్యంతో చూడడానికి ప్రయత్నించాడు. సంఘర్షణ మయమైన భవిష్యత్తుకు గతకాలం నుండి ప్రోత్సాహాన్ని పొందడం అతని నవలల్లో కనిపించే తత్వం. ఇతడు రచించిన మొట్టమొదటి చారిత్రక నవల ' పద్మావతి '. దానిలో ' అల్లాఉద్దీన్ ఖిల్జీ ' చిత్తోర్ పై జరిపిన దండయాత్ర వర్ణన ముఖ్యమైంది.

' రామ్ శంకర్ రామ్ ' రచించిన ' విలాసిని ' అనే చారిత్రక నవలలో మరాఠీల అత్యాచారాలను చిత్రించారు. ఫకీర్ మోహన్

రచించిన చారిత్రక నవల 'లక్ష్మి' లో మొగలాయి, మరాఠీల మధ్య జరిగిన సంఘర్షణను చిత్రించారు.

తమిళం : తమిళంలో మొట్టమొదట నవలాకారుడు 'కల్కి.' ఇతడు 'శివకామి శపథం', 'పార్థివన మను', 'యోమోని శలవన్' అనే మూడు ప్రసిద్ధాలైన నవలలు రచించాడు. 'శాండిల్యన్' 'ఉదయభాను' అనే చారిత్రక నవలను రచించాడు. ఇతనికి 'భాష్యన్' అనే ఉపనామం కలదు. ఇందు ఔరంగజేబు కాలం నాటి రాజదూతల కథ వర్ణించారు.

టి. యస్. సుబ్రమణ్యం 'మయూరన్' అనే చారిత్రక నవలను రచించాడు. ఇందు పల్లవ సామ్రాజ్యానికి అధీనంలో మున్న కుంతల దేశపు పూర్వీకుల చరిత్ర వర్ణింపబడింది.

మలయాళం : మలయాళంలో చారిత్రక నవలాకారులలో 'సి.వి. రామన్ పిళ్ళై' పేర్కొన దగినవాడు. అతడు 'మార్తాండ వర్మ', 'ధర్మరాజ', 'రామరాజ బహాదూర్' అనే మూడు చారిత్రక నవలలు రచించాడు.

'రాజవర్మ అప్పన తంబూరాన్' రచించిన 'ముతరాయన్' ప్రసిద్ధమైన చారిత్రక నవల. చారిత్రక నవలాకారులలో 'పి.కె.యమ్. ఫణిబకర్' పేరు కూడా పేర్కొనదగింది![1]

కన్నడం : పాశ్చాత్య సంపర్కం వల్ల కన్నడంలో సమృద్ధంగా అభివృద్ధి చెందిన ప్రక్రియ నవల. 'ది పిల్‌గ్రిమ్సు ప్రోగ్రెస్' కు 1842 లోను, 'రాబిన్సన్ క్రూసో' కు 1857 లోను కన్నడంలో అనువాదాలు వచ్చాయి. 1885లో దుర్గేశనందిని

1. హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాస్ - డా॥ రామనారాయణ్ సింహా ప. ఘర్., పృ 19.41

895 లో వివేక చంద్రిక, 1899 లో సుకుమారి అనువాదాలయ్యాయి.

ఈ భాషలో పూర్తిగా, స్వతంత్రంగా రచించిన మొట్టమొదటి చారిత్రక నవల 'సూర్యకాంత'. దీని రచయిత శ్రీ లక్ష్మణరావు. తర్వాత అనేక స్వతంత్ర చారిత్రక నవలలు, అనువాద చారిత్రక నవలలు వచ్చాయి. ఆనంద మఠ, లీలావతి, విషవృక్ష మొదలైన నవలలు కన్నడంలో చాలా ప్రసిద్ధాలయ్యాయి. నోరి నరసింహ శాస్త్రిగారి రుద్రమదేవిని శ్రీ కె. వెంకటరామప్పగారు కన్నడానికి అనువదించారు.[1]

ఈ విధంగా ఇంచుమించు భారతీయ భాషలన్నింటిలోనూ, చారిత్రక నవలలు 19వ శతాబ్దపు ఉత్తరార్ధం నుండి బయలుదేరాయి.

1.5. తెలుగు చారిత్రక నవలా పరిణామం: "నవల వ్యక్తుల సాంఘిక జీవనానికి ప్రతిబింబమైన సాహిత్యరూపం. కవిత్వం రచయిత భావనా బలానికి వ్యక్తీకరణ కాగా, నాటకం మానవుల అంతర్బాహ్య సంఘర్షణలకు ప్రతీకగా చెప్పుకోవచ్చు. ఒక్క నవల మాత్రమే సమగ్రంగా సమకాలిక జీవితానికి దర్పణంగా ఉండగలదు. అది ఎట్టి వృత్తాన్ని స్వీకరించినా అందులో సమకాలిక సంఘటనల ప్రభావం ఉండక తప్పదు అనే విషయం అందరికీ తెలిసినదే. కేవలం సాంఘికమైన నవలలు ప్రత్యక్షముగా సంఘ సమస్యలను ఇతివృత్తముగా స్వీకరింపగా చారిత్రక నవలలు కూడా సంఘ విప్లవమునకు సూచనలని ఒకసారి

1. కన్నడ సాహిత్య చరిత్ర - డా॥ ఆర్వియన్ సుందరం, పు: 180, 181, 189

సాంఘిక జీవనాన్ని చిత్రించినవని చెప్పవచ్చు. దీనికి నిదర్శనముగా జాతీయ జీవనాన్ని ప్రతిబింబిస్తూ తెలుగులో వచ్చిన అసంఖ్యాకమయిన నవలల్ని పేర్కొనవచ్చు. స్వాతంత్ర్య సమరం సాగే రోజుల్లో వచ్చిన చారిత్రక నవలలు ఆనాటి జాతీయ విప్లవోద్దేశానికి పరోక్షంగా ప్రతీకలే"[1]

క్రీ.శ. 19వ శతాబ్ది చివరి భాగంలో తెలుగు నవలా ప్రక్రియ చారిత్రక నవలా రూపంతోనే ప్రారంభమయింది.

"ఈ చారిత్రక నవలా ప్రక్రియా పరిణామాన్ని ఈ క్రింది దశలలో పరిశీలించవచ్చు.

1. ప్రారంభ యుగం. (క్రీ.శ. 1872-1900)
2. అనువాద యుగం. (క్రీ.శ. 1900-1920)
3. వికాస యుగం. (క్రీ.శ. 1920-1942)
4. మనో వైజ్ఞానిక యుగం. (క్రీ.శ. 1942 నుండి -1960)
5. సమకాలీన యుగం. (క్రీ.శ 1960 నుండి నేటివరకు) "[2]

**ప్రారంభ యుగం (క్రీ.శ. 1872-1900) :** భారతదేశాన్ని ఆంగ్లేయులు పరిపాలిస్తున్న కాలంలో, రాజకీయ రంగంలోనే కాక సాంఘిక, మత పరిస్థితుల మీద కూడా వారి ప్రభావం విరివిగా వ్యాపించింది. సమాజంలో సాంఘిక దురాచారాలు, స్వార్థపరత్వం అధికంగా ప్రబలింది. ప్రజల్లో జాతీయతను, దేశభక్తిని పురికొల్పేందుకు, హిందూ సా~~~~

1. తెలుగు నవలా వికాసము - మొదలి నాగభూషణ శర్మ, పు. 127, 128
2. తెలుగు సాహిత్య సమీక్ష - Dr. జి. నాగయ్య. పు. 809-825

అభిమానాన్ని కల్గించేటందుకు శ్రీ ఖండవల్లి రామచంద్రుడు, శ్రీ భోగరాజు-నారాయణ మూర్తి గారు మొదలైన వారు చారిత్రక నవలలను రచించారు.

క్రీ.శ. 19 వ శతాబ్ది చివరి భాగంలో తెలుగులో చారిత్రక నవలల శకం ప్రారంభమైంది. 1872 వ సంవత్సరంలో వెలసిన 'నరహరి-గోపాలకృష్ణమశెట్టి రచించిన 'రంగరాజ చరిత్ర' మొదటి చారిత్రక నవలగా పేర్కొనవచ్చు. కాని 1893 లో వెలువడిన 'శ్రీ ఖండవల్లి రామచంద్రుడు' రాసిన 'ధర్మవతీ విలాసము' మొదటి చారిత్రక నవల అని కొందరి అభిప్రాయం. మరికొందరు కందుకూరి వీరేశలింగం పంతులు రాసిన 'వివేక చంద్రిక' అను నామాంతరం గల 'రాజశేఖర చరిత్రము' మొదటి నవలగ పేర్కొన్నారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారి ఆ ధ్వర్యాన 'చింతామణి' పత్రిక వెలువడింది. చింతామణి పత్రిక నిర్వహించిన నవలల పోటీలలో గెలుపొందిన నవలల్లో అధికభాగం చారిత్రకాలే. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు రాసిన 'హేమలత' (1877) అహల్యాబాయి (1897) కర్పూర మంజరి (1898) అనునవి ప్రథమ శ్రేణి చారిత్రక నవలలు. చిలకమర్తి వారు చారిత్రక నవల కాద్యులని చెప్పవచ్చు. చిలకమర్తి వారి ఒరవడి ననుసరించి చారిత్రక నవలలను రాసిన వారిలో పేర్కొనదగిన వారు కేతవరపు వేంకటశాస్త్రి, భోగరాజు నారాయణ మూర్తి మొదలైన వారు.

**అనువాద యుగం (క్రీ.శ. 1900-1920) :** క్రీ.శ. 1872-1930 మధ్య ప్రాంతాన్ని అనువాదయుగం అన్నారు. " ఈ అనువాద యుగాన్నే చారిత్రక నవలాయుగం అని కూడా అనివచ్చు. దీనికి కొన్ని కారణాలున్నాయి. ఈ కాలంలో

వచ్చినన్ని చారిత్రక నవలలు మరి ఏ ఇతర కాలంలోనూ రాలేదు. దీనికి కారణం ఆ నాటి దేశ వాతావరణమే. జాతీయోద్యమ ప్రభావం దాని తరువాత వచ్చిన ఆంధ్రోద్యమ ప్రభావం జాతి దృష్టిని తమ చరిత్ర వైపుకు మళ్ళించింది."[1]

ఈ అనువాద యుగంలో అనేక అనువాద చారిత్రక నవలలు వెలువడినాయి. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, శ్రీ భోగరాజు నారాయణ మూర్తి, శ్రీ కేతవరపు వేంకటశాస్త్రి, శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల వంటి వారు స్వతంత్ర రచనలు చేస్తూ అనువాదాలను కూడా వెలువరించారు.

కొమర్రాజు లక్ష్మణరావు పంతులు విజ్ఞాన చంద్రికా గ్రంథమాల పక్షాన నిర్వహించిన పోటీలలో 'భోగరాజు నారాయణ మూర్తి' రచించిన 'విమలా దేవి', 'అల్లాహూ అక్బర్', 'చంద్రగుప్తుడు', 'ఆంధ్ర రాష్ట్రం' అనే చారిత్రక నవలలకు బహుమతులు లభించాయి. 'వేలాల సుబ్బారావు' గారి 'రాణీ సంయుక్త'; 'కేతవరపు వేంకటశాస్త్రి' గారి 'రాయచూరు యుద్ధము', 'ఇచ్ఛనీ కుమారి'; 'దుగ్గిరాల రాఘవ చంద్రయ్య చౌదరి' గారి 'విజయ నగర సామ్రాజ్యము'; 'ఎ.వి.నరసింహం' గారి 'పాతాళభైరవి' మొదలైనవి విజ్ఞాన చంద్రికా గ్రంథమాల పక్షాన బహుమతులు పొందిన చారిత్రక నవలల్లో పేర్కొనదగినవి.

19వ శతాబ్ది ప్రారంభంలో పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్ల, వారి నవలా సాహిత్యాన్ని తెలుగు వారు అనువదించినారు. అటు

---

1. తెలుగు నవలా వికాసం - మొదలి నాగభూషణ శర్మ, పు: 11

తరువాత జాతీయోద్యమాలకు ఆలవాలమైన వంగదేశం నుండి ఆ ఉద్యమాన్ని తమ నవలల్లో ప్రతిబింబింపజేసిన 'బంకించంద్ర చటర్జీ' మొదలైనవారి నవలలను ఎక్కువగా అనువదించినారు.

"తెలుగులోని మొదటి అనువాదం జి.వి.యస్. దొరస్వామయ్య రచించిన 'కపాలకుండల' (1899). వీరు 1907 లో 'ఆనందమఠం' అనే బెంగాలీ నవలను కూడా అనువదించినారు. కనకవల్లి భాస్కరరావు 'ప్రఫుల్లముఖి' (1904), చిల్లరిగె శ్రీనివాసరావు 'కృష్ణకాంతుని మరణశాసనం' (1910), తల్లాప్రగడ సూర్యనారాయణ 'శైవలినీ చంద్రశేఖరము' (1910), చాగంటి శేషయ్యగారి 'దుర్గేశనందిని', 'నవాబునందిని', 'రాధారాణి' (1910), వేంకట పార్వతీశ్వర కవుల 'రాజసింహ' (1912), అక్కిరాజు - ఉమాకాంతం గారి 'టిప్పుసుల్తాను' (1913), చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి 'దాసీకన్య' (1915), తెన్నేటి సూరి గారి 'రెండు మహానగరాలు' మొదలైనవి అనువాద, అనుకరణ చారిత్రక నవలలు."[1]

"ఈ కాలములో స్వతంత్ర, చారిత్రక నవలలు కూడా అనేకము వెలువడినవి. ఖండవల్లి రామచంద్రుడు గారి 'ధర్మవతీ విలాసము' (1893), 'లక్ష్మీసుందర విజయము' (1896), కేతవరపు వేంకటశాస్త్రి గారి 'రాయచూరు ముట్టడి' (1914), వంగూరి సుబ్బారావు గారి 'ప్రభాతము' (1915), 'ధరణికోట' (1915), చిలుకుల పిచ్చయ్యశాస్త్రి 'పద్మిని' (1920) మొదలైనవి స్వతంత్ర చారిత్రక నవలలకుదాహరణములు."[2]

1. తెలుగు సాహిత్య సమీక్ష - డా॥ జి. నాగయ్య., పు: 813.
2. పైదే., పు: 1

సరస్వతీ గ్రంథమాలలో అనువాదాలు అనుకరణాలయిన నవలలనేకాలు వచ్చినవి. వీటిలో గ్రాంథిక శైలి మార్పు చేసి, వ్యావహారిక భాషలో నవలలను రాసిన వారిలో ముఖ్యులు 'శివశంకర శాస్త్రి' గారు. 'ప్రభాత కుమార్ మహోపాధ్యాయ' రచించిన బెంగాలీ నవలకు శివశంకర గారు చేసిన స్వేచ్ఛానువాదం 'కుంకుమ భరణి' తెలుగు నవలలలో ఒక మధుర గుళిక. ఈ యుగంలో వెలసిన ఆంగ్లానువాద నవలల్లో ముఖ్యమైనవి 'కేతవరపు వేంకటశాస్త్రి గారి 'వివాన్ హో', అక్కిరాజు ఉమాకాంతం గారి 'టిప్పు సుల్తాను' మొదలైనవి.

ఈ యుగంలో చారిత్రక నవలలనేకాలు రచింపబడడం చేత దీనిని 'చారిత్రక నవలాయుగం' అని కూడా చెప్పవచ్చు.

వికాసయుగం (క్రీ.శ. 1920-1942): తెలుగు నవలా చరిత్రలో భావకవిత్వ యుగాన్ని వికాసయుగమని చెప్పవచ్చు. ఈ వికాస యుగానికి చలం, విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజులను ప్రతినిధులుగా భావింపవచ్చును. వీరు ముగ్గురూ కాల్పనికోద్యమం లోని మూడు రీతులకు ప్రతినిధులు.

'గుడిపాటి వేంకటాచలం' సమాజంలో నీతిపేర జరుగుతున్న అన్యాయాన్ని నిర్భయంగా ఎదిరించి, స్త్రీ స్వేచ్ఛను గురించి తీవ్రంగా పోరాడిన వ్యక్తి. అతడు సాంఘిక విప్లవ వాదిగా పేరు పొందిన రచయిత.

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పతనమై

పోతున్న వ్యవస్థను సంస్కరించాలని తలచిన సంప్రదాయవాది శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. ఆయన నవలా రచయితగా కూడా శక్తిమంతుడు. సుమారు 60 నవలలను రాసినాడు. ఏకవీర, ధర్మచక్రము, బద్దన్న సేనాని, కడిమిచెట్టు మొదలైనవి విశ్వనాథవారి చారిత్రక నవలలు. 'ఏకవీర' తెలుగు దేశంలో తామినాడు చెలరేగిన కాల్పనికోద్యమ ప్రభావంతో వెలువడిన చారిత్రక నవల.

విశ్వనాథ వారి తరువాత అంతటి పేరు ప్రఖ్యాతులు పొందిన చారిత్రక నవలాకారుడు అడివి బాపిరాజుగారు. ఈయన మూడు చారిత్రక నవలల్ని, ఒక చారిత్రక నవలికను రచించారు. అవి 'హిమబిందు', 'అడవి శాంతిశ్రీ', 'గోన గన్నారెడ్డి', 'అంశుమతి' (నవలిక). తెలుగు చరిత్ర పట్ల వీరికి అభిమానమెక్కువ. తెలుగు వీరుల జీవితాలను నవలలుగా మలచడంలో సిద్ధహస్తులు బాపిరాజుగారు.

"చరిత్రను పునర్నిర్మించడంలో బాపిరాజుది అందెవేసిన చేయి. విశ్వనాథ, బాపిరాజు, నోరి ముగ్గురూ గొప్ప నవలాకారులు. తెలుగు చరిత్ర ఆధారముగా రచనలు చేశారు. అందులో విశ్వనాథ చరిత్రను కేవలం భూమికా మాత్రంగానే స్వీకరించారు. ఆయనకు కథ ముఖ్యం. ఇతి వృత్తాన్ని ఇష్టం వచ్చినన్ని మలుపులు మళ్ళిస్తూ కూడా వస్త్వైక్యం చెడకుండా నిలబెట్టి తన రచనను సుసంఘటితమైన శిల్పమూర్తిగా వెలువరించే నేర్పు కలవారు. చారిత్రక నవలల్లో చరిత్ర ప్రధాన స్థానం వహిస్తుంది. గంభీరమైన పాత్రలు, ఉదాత్తమైన

కథాకథనం, రచయిత తాను స్వీకరించిన కాలానికి అనుగుణంగా చిత్రించే వాతావరణ కల్పన; ఇవి చారిత్రక నవలలకు ముఖ్య లక్షణాలు. విశ్వనాథలో చరిత్రకన్న కథ ముఖ్యం. నోరి నరసింహ శాస్త్రిలో చరిత్ర పునర్నిర్మించడానికి గట్టి పట్టుదల ఉన్నా సంఘటన, పాత్ర చిత్రణలో కొంత ఆధునికత, కొంత సమకాలీన జీవనాన్ని ప్రతిబింబింప చేయాలనే ఆకాంక్ష కనిపిస్తుంది. ఇక బాపిరాజు నవల్లో చారిత్రక భావాల్ని సృష్టించడంలో కృతకృత్యులయినాడు."[1]

బాపిరాజు గారి నవలలో ఆనాటి చారిత్రక పరిస్థితులతో పాటు ఆ కాలపు ఆచార వ్యవహారములు, కళ, విజ్ఞానము, అభిరుచులు తేటపడుచుండును. పాత్రలన్నియు అప్పటి సమకాలిక వ్యక్తిత్వం కలిగి సహజత్వంతో కన్నులకు కట్టినట్లు గోచరించును. వసుధైక కుటుంబ నిర్మాణము బాపిరాజుగారి నవలలలో కన్పించు ప్రధానాంశము. బాపిరాజుగారి పాత్రోన్మీలనా చాతుర్యము పలువురి మెప్పు సంపాదించినది. బాపిరాజు కాల్పనికోద్యమము లోని ప్రతి లలిత భావమునకు అక్షర రూపము కల్పించిన ప్రతిభాశాలి."[2]

1930కి తర్వాత వెలువడిన నవలల్లో ఎక్కువ భాగం ఆంధ్ర దేశ చరిత్రకు చెందిన నవలలే. అందులోనూ, బాపిరాజు గారు దేశక్షేమానికి, సర్వమానవ సౌభ్రాతృత్వానికి, సర్వమత సమన్వయానికి

---

1. తెలుగు నవలా వికాసం - మొదలి నాగభూషణశర్మ, పు: 78, 79.

2. తెలుగు సాహిత్య సమీక్ష (రెం.సం) డా॥ జి.నాగయ్య, పు 820.

శాతవాహన కాలం నాటి, హిందూ, జైన, బౌద్ధ మతాచార్యులతో వాదోపవాదాలను సృష్టించి, సర్వమత సమన్వయాన్ని సమర్థించి ప్రజల్లో శాంతిని కల్పించారు. వీరు తమ నవలల్లో చరిత్రతో పాటు మనోజ్ఞమైన కథాకల్పన చేస్తూ, ఆయా కాలానికి సంబంధించిన సామాజిక, ఆర్థిక, జీవన విధానాలను కూడా చిత్రించారు. చారిత్రక నవల ముఖ్య ప్రయోజనమైన సందేశ, ఆహ్లాదాలను రెంటినీ ఈ నవలల్లో మనం చూడవచ్చు. అంతేగాక స్వాతంత్ర్యం రాకపూర్వం రచించబడ్డ ఈ నవలలు ప్రజల్లో స్వేచ్ఛా భావాన్ని, అభ్యుదయ ఆశయాలను, దేశభక్తిని కల్పించడానికి దోహదం చేశాయి. చరిత్రలోని ఒకనొక నాయకుణ్ణి నవలలో ప్రధానంగా గ్రహించి, ఆ పాత్ర ద్వారా దేశస్వాతంత్ర్యానికి, ప్రజల అభ్యుదయానికి అతడు చేసిన ఘనకార్యాలు, సాధించిన ఫలితాలు వ్యక్తం చేసేందుకు రచయితలు పూనుకొన్నారు.

**మనోవైజ్ఞానిక యుగం (1942 నుండి 1960)** మనోగత భావాలను, మానసిక సంఘర్షణలను యథాతథంగా చిత్రీకరించు నవలలు వెలువడటం ఈ యుగ ప్రత్యేకత. మనస్తత్వశాస్త్ర విధానాల నాధారంగా పాత్ర చిత్రణకు ప్రాధాన్యమిచ్చి నవలలు రాసిన వారిలో ముఖ్యులు బుచ్చిబాబు. గోపీచంద్, జి.వి.కృష్ణారావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి మొదలైన వారు ముఖ్యులు.

ఈ కాలంలో మనో విశ్లేషణ ప్రధానంగా వెలువడిన

నవలలే కాక 'మంచి' నవలలు కూడా వెలువడినవి. వాటిలో భాస్కర భట్ల కృష్ణారావు రాసిన 'యుగసంధి', 'వెల్లువలో పూచిక పుల్లలు'; బలివాడ కాంతారావు రచించిన 'గోడ మీద బొమ్మ', 'సుగుణ' మొదలైనవి ప్రత్యేకంగా పేర్కొనదగినవి. వడ్డెర చండీదాస్ రాసిన 'హిమజ్వాల' కళాత్మకంగా ఉన్నతమైన నవల.

ఈ కాలంలో ప్రఖ్యాతికి వచ్చిన చారిత్రక నవలా రచయిత నోరి నరసింహ శాస్త్రిగారు. ఆయన చారిత్రక నవలల నిర్మాణంలో నూతన పద్ధతిని ప్రవేశపెట్టినారు. నోరి నరసింహ శాస్త్రిగారు ఆయా కాలాలలోని తెలుగు కవులను ప్రధాన నాయకులుగా గ్రహించి, ఆయా కాలాల సాంఘిక, రాజకీయ పరిస్థితులను పునర్నిర్మించు ప్రయత్నం చేయుచు 'నారాయణ భట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి, కవిసార్వభౌముడు, ధూర్జటి' వంటి ఉత్తమ చారిత్రక నవలలను రాసినారు.

డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్య గారు విజయనగర రాజుల కాలం నాటి పరిస్థితులను తీసికొని 'మధుమావతి', 'ఛత్రగ్రాహి' అనే నవలలను రాసినారు. ఆంధ్రదేశపు చరిత్ర కాకపోయిననూ, తెన్నేటిసూరి రాసిన 'చెంఘిజ్ ఖాన్' చారిత్రక నవలల్లో పేర్కొనదగిన నవల. మంగోలియన్ వియంత క్రూర వ్యక్తిత్వాన్ని చిత్రించిన ఈ నవలలో తెన్నేటి సూరి, వాతావరణ నిర్మాణంలోనూ, కథాకథనంలోనూ ప్రతిభను కనబరచినాడు. "ఆంధ్రభాషలో వచ్చిన అత్యుత్తమ చారిత్రక నవలలో 'చెంఘిస్ ఖాన్' ఒకటి"[1]

---

1. ఆంధ్ర నవలా వికాసం - మొదలి నాగభూషణ శర్మ, పు. 155

మల్లాది వసుంధర గారి 'తంజావూరు పతనము', 'సప్తపర్ణి', 'దూరపు కొండలు'; ధూళిపాళ శ్రీరామమూర్తి గారి 'భువన విజయము'; కొర్లపాటి శ్రీరామమూర్తి గారి 'చిత్రశాల'; పిలకా గణపతిశాస్త్రి గారి 'మీనాంబిక'; కాకర్ల నరసింహం గారి 'కనకాభిషేకము', 'రఘునాథ రాయలు' మొదలైనవి ప్రశస్తాలైన చారిత్రక నవలలు.

సమకాలీన యుగం (1960 నుండి నేటివరకు) : కథాసంవిధానం లోను, వ్యక్తీకరణ లోను, భాషలోను కొత్త కొత్త ప్రయోగాలు చేయుచు ఈ యుగంలో ఎన్నో నవలలు రచింపబడినాయి. ఈ యుగంలో నవలా రచయితలతో పాటు రచయిత్రుల నవలలు కూడా అధిక సంఖ్యలో వెలువడినాయి. కొన్ని సాంసారిక సమస్యా పూరితాలైనవి, మరికొన్ని మధ్యతరగతి స్త్రీల సమస్యల ఆధారంగా రచింపబడినాయి. కొన్ని సున్నితమైన శైలితో, మృదువైన కథాకథనంతో నడచిన నవలలు; సమాజాన్ని నగ్నంగా ప్రదర్శించిన నవలలు అనేకం వెలువడినాయి.

ఈ సందర్భంలో చారిత్రక నవలా రచనకు ప్రోత్సాహం కల్గించిన కొన్ని సంస్థలను, పత్రికలను ఇక్కడ పేర్కొనవలసి ఉంది.

ప్రజల్లో స్వాతంత్ర్య భావాలను కల్గించాలని 'శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు' క్రీ.శ. 1906 న హిందూ మహాయుగం, మహమ్మదీయ యుగం వంటి చరిత్ర గ్రంథాలను 'విజ్ఞాన చంద్రికా మండలి' ద్వారా ప్రకటించి చారిత్రక నవలల పోటీని ఏర్పాటు చేసి చారిత్రక నవలా వికాసానికి ఎంతో దోహదంగా తోడ్పడ్డారు. శ్రీ కొప్పవరపు చంద్రారెడ్డి 1911లో 'ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల

అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థ ద్వారా 'ప్రమదావనము', 'వసుమతీ వసంతము', 'దుర్గేశ నందిని' వంటి చారిత్రక నవలలు వెలువడ్డాయి. శ్రీ తాపీ ధర్మారావు స్థాపించిన 'వేగు చుక్క గ్రంథమాల' 'ప్రభాతము' (1911) అనే ఆంధ్ర చారిత్రక నవలను ప్రచురించింది. శ్రీ చెలికాని అప్పారావు గారు 'రామ విలాస గ్రంథమాల'ను స్థాపించారు. 'సరస్వతీ గ్రంథమాల' అనే సంస్థను క్రీ.శ. 1923లో శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడు గారు స్థాపించారు. ఇటువంటి సంస్థలు వంగ నవలలకు అనువాదాలను కూడ వెలువరించాయి. పత్రికల విషయానికొస్తే 'చింతామణి' (1880), 'వివేక చంద్రిక', 'సకల విద్యా వర్ధిని' (1875), 'కృష్ణా పత్రిక' (1902), 'దేశ మాత' (1904), 'మనోరమ' (1906), 'ఆంధ్ర వార పత్రిక' (1908) మొదలైన పత్రికలు చారిత్రక నవలా రచనకు ఎంతో ప్రోత్సాహాన్నందించాయి.

1.6. హిందీ చారిత్రక నవలా పరిణామం : "హిందీ చారిత్రక నవలల ప్రవృత్తి, శిల్పం, శైలి, వీటిని దృష్టిలో ఉంచుకొని హిందీ చారిత్రక నవలా సాహిత్య పరిణామాన్ని మూడు యుగాలుగా విభజించవచ్చు.

1. ప్రథమ ఉత్థాన కాలం (క్రీ.శ. 1890 నుండి 1915)
2. ద్వితీయ ఉత్థాన కాలం (క్రీ.శ. 1916 నుండి 1928)
3. తృతీయ ఉత్థాన కాలం (క్రీ.శ. 1929 నుండి 1960)"[1]

ప్రథమ ఉత్థాన కాలం (క్రీ.శ. 1890 నుండి 1915) : ఈ యుగంలోని చారిత్రక నవలా కారులు – చారిత్రక నవలలు:

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్, డా. గోవింద జీ., పు: 184

హిందీ చారిత్రక నవలా సాహిత్యంలో మొట్ట మొదటి చారిత్రక నవలాకారుడు కిశోరీలాల్ గోస్వామి. ఇతడు ప్రారంభ యుగానికి చెందినవాడు. ఇతనికి చారిత్రక నవలాకారునిగా గొప్ప పేరు ఉంది. గోస్వామి గారు తన యుగంలో ప్రచారంలో ఉన్న నవలా ప్రవృత్తులనన్నింటిని గ్రహించి నవలా సాహిత్యాన్ని రచించారు. హిందీ నవలలకే ప్రాధాన్యమిచ్చి తన మౌలికమైన ప్రతిభను కనబర్చారు. ఈయన రాసిన నవలల సంఖ్య ఆనాటి ఇతర నవలా రచయితల రచనల కంటే అధికం. ఈయన మొదటి నవల 'హృదయ హారిణి' లేక ఆదర్శ రమణి. ఈ నవల 1889లో రాసినా 1890లో ప్రచురించారు. ఈయన 'ఉపన్యాస్' అనే పత్రికను కూడా వెలువరించి అందులో తన జీవితకాలంలో రాసిన అరవై అయిదు నవలలను ప్రకటించారు. వాటిలో పదమూడు చారిత్రక నవలలు.

గోస్వామి రచించిన చారిత్రక నవలలు : 1. హృదయ హారిణి (1890), 2. లవంగలత (1890), 3. తార (1902), 4. కనక కుసుమ్ (1903), 5. హీరా బాయి (1904), 6. రజియా బేగమ్ (1904), 7. మల్లికాదేవి (1905), 8. లక్నో కీ కబ్రా (1906-18), 9. ఇందుమతి (1906), 10. సోనా ఔర్ సుగంధి (1909-1911), 11. లాల్ కుందర్ (1907), 12. గుల్ బహార్ (1911), 13. గుప్త గోధన (1919-1924)"[1]

ఈ కాలంలోని రెండవ చారిత్రక నవలాకారుడు 'బాబూ గంగా ప్రసాద్ గుప్త'. ఇతడు రచించిన చారిత్రక నవలల్లో 1 నూర్జహాన్ (1902),

---

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - గోవిందజీ. పు: 187

2. వీర పత్ని యా రాణి సంయోగిత (1903), 3. కుంజర సింహ సేనాపతి (1903), 4. పూనా మే హల్ చల్ (1903), 5. హమ్మీర్ (1904) 6. వీర జయమల్ యా కృష్ణ కాంతా (1904), 7. అవధ్ కీ బేగమ్ (1905) అనేవి ముఖ్యమైనవి."[1]

గంగా ప్రసాద్ గుప్తగారి తరువాత చెప్పుకోదగ్గ మూడవ చారిత్రక నవలా కారుడు జయరామ్ దాస్ గుప్తగారు. ఇతని నవలలపై కిశోరీలాల్ గోస్వామి ప్రభావం అధికంగా కనబడుతుంది. జయరామదాస్ రచించిన చారిత్రక నవలల్లో 1. రంగ్ మే భంగ్ (1907), 2. కాశ్మీర్ పతన్ (1907), 3. కళావతీ (1908), 4. చాంద్ బీబీ యా వీరరమణి (1909), 5. నవాబీ పరిస్థాన్ యా చాంద్‌నీ శార్ అంధేరా (1909), 6. ప్రభాత్ కుమారి (1909) 7. రాణి పన్నా వా రాజ్ లలనా (1909), 8. వీరాంగనా వా ఆదర్శ లలనా, 9. శూర శిరోమణి, 10. ఫూల్ కుమారి, 11. చంపా, 12. నూర్జహాన్ మొదలైనవి ప్రసిద్ధములు.[2]

ప్రథమోత్థాన కాలంలో పైన పేర్కొన్న ముగ్గురు చారిత్రక నవలా కారుల ననుసరించి చాలమంది నవలాకారులు చారిత్రక నవలలను రచించారు. వస్తువు, శిల్పవిధానం, భాష, శైలి దృష్టితో పైన పేర్కొన్న ప్రముఖులైన ముగ్గురు నవలా కారులు ఆనాటి చారిత్రక నవలాకారులకు మార్గదర్శకులు. వారిలో 'బలదేవ ప్రసాద్ మిశ్ర' మహమ్మదీయ చరిత్రను ఆధారంగా చేసుకొని శృంగారం తోను, సాహసంతోను కూడిన మూడు చారిత్రక నవలలను రచించారు. అవి 1. అనార్కలి (1900), 2. పృథ్వీరాజ్ చౌహాన్ (1902), 3. పానిపట్ (1902) బలభద్ర సింహ గారు మహారాష్ట్రవీరుడు శివాజీకి సంబంధించిన 1. సౌందర్య కుసుమ్-

1. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ - గోవిందజీ., పృ:192
2. పైదే., పృ:193.

వా మహారాష్ట్ర ఉదయ్ (1910), 2. సౌందర్య ప్రభా వా అద్భుత అంగూఠీ (1911) రచించారు. మహమ్మదీయ సుందరీ మణులను ఆధారంగా చేసుకొని మహమ్మదీయ చరిత్ర నేపథ్యంలో రాయబడిన చారిత్రక నవలల్లో, 'మధురా ప్రసాద్ శర్మ' రచించిన 'నూర్జహాన్'; ప్రేమ సుందర్‌లాల్ రచించిన 'నూర్జహాన్'; జైనేంద్ర కుమార్ రచించిన 'గుతేవార్' (1903); భగవాన్‌దాస్ రచించిన 'ఉద్యా బేగమ్' (1905); జయరామ్‌లాల్ రహత్‌గీ రచించిన 'తాజ్‌మహల్' ముఖ్యమైనవి.

హిందూ స్త్రీల ఉన్నత ఆదర్శాన్ని దృష్టిలో ఉంచుకొని రచించిన చారిత్రక నవలల్లో కేదార్‌నాథ్ శర్మగారి తారామతి (1901) వ్రజ బిహారీ శర్మ గారి 'కోటారాణి' (1902) విఠ్ఠల్‌దాస్ నాగర్‌గారి 'పద్మకుమారి' (1903) గిరిజానందన తివారీ గారి 'విద్యాధరి' (1904), 'పద్మిని' (1905), 'సులోచన' (1906) లాల్‌జీ సింహ గారి 'వీరబాల' (1906), మున్షీ దేవీ ప్రసాద్ గారి 'రూఠీ రాణి' (1906) మొదలైనవి ముఖ్యమైనవి. హిందూ వీరుల శౌర్య పరాక్రమాన్ని దృష్టిలో ఉంచుకొని రచించిన వారిలో రామప్రతాప్ శర్మ రచించిన 'నరదేవ్' (1903), కృష్ణదేవ ప్రసాద్ సింహగారి 'వీర చూడామణి' (1915), మురారీలాల్ పండిత్ రచించిన 'విచిత్రవీర్' (1915) మొదలైనవి ఉన్నాయి.

**ద్వితీయ ఉత్థాన కాలానికి చెందిన చారిత్రక నవలాకారులు - వారి చారిత్రక నవలలు (1916-1925):** ప్రథమ ఉత్థాన కాలానికి చెందిన కిశోరీలాల్ గోస్వామి గారు ద్వితీయ ఉత్థాన కాలానికి కూడ చెందిన వారే. ఆయన సంఘటనలను ఆధారం చేసుకొని చారిత్రక నవలలను రాయటానికి ఆయన 1890లో వేసిన పునాదే తరువాత ద్వితీయోత్థాన నవలాకారులకు

ఆదర్శమైంది. అతని కడపటి చారిత్రక నవల 'గుప్త గోధన' 1919 లో ప్రారంభమై 1924 కు ముగిసింది. ఘటనా ప్రధానమైన చారిత్రక రచన వ్రజనందన సహాయ్ గారి 'లాల్ చీన్' (1916) నవలతో క్రమంగా క్షీణించి శీల ప్రధానమైన నవలా రచనకు దారి తీసింది. 'లాల్ చీన్' అనే నవల అంతకు ముందరి చారిత్రక నవలల కంటె భిన్నమైంది. ఈ నవల చారిత్రక నవలా రచనాక్షేత్రంలో కొత్త మార్గాన్ని సూచిస్తుంది. 'ప్రేమ్ చంద్' రాసిన ప్రసిద్ధమైన శీలప్రధానమైన 'సేవాసదన్' (1918)లో వెలువడింది. కాబట్టి హిందీ చారిత్రక నవలా సాహిత్యానికి చెందిన ద్వితీయ ఉత్థాన కాలం 1916 తో ప్రారంభమైందని చెప్పవచ్చు.

'వ్రజనందన సహాయ్' గారు రచించిన చారిత్రక నవల 'లాల్ చీన్' కథా వస్తువు దక్షిణ భారత దేశానికి చెందిన బహుమనీ సుల్తాన్ గయాసుద్దీన్ బహుమనీ, అతని ముసల్మాను బానిసైన 'లాల్‌చీన్'కు సంబంధించింది. ఈ నవల చరిత్ర, కల్పన అనే రెండు దృష్టి కోణాలతో అంతకు ముందున్న చారిత్రక నవలల కంటె భిన్నమయింది.

ద్వితీయోత్థాన కాలంలో ప్రముఖ చారిత్రక నవలాకారులు 'మిశ్రబంధువులు' వీరి మొదటి నవల 'వీరరమణి' (1917). ఈ నవలలో చారిత్రక సత్యం, కల్పన రెండూ చోటు చేసుకున్నాయి. దీనిలో నవలా శిల్పం కొరవడినప్పటికీ శైలికీ, చరిత్రకు దగ్గర సంబంధం కనబడుతుంది. మిశ్రబంధువులు రాసిన 'చంద్రగుప్త విక్రమాదిత్య (1942), పుష్యమిత్ర శుంగ (1943), విక్రమాదిత్య (1944), చంద్రగుప్త మౌర్య (1947)

ముఖ్యమైనవి. వీరి చారిత్రక నవలల్లో చారిత్రక సత్యం అధికంగా ఉన్నప్పటికి నవలా రచనకు కావలసిన ప్రతిభ కొరవడిందని చెప్పవచ్చు. వీరి నవలల్లో సంభాషణాత్మక శైలి వల్ల నాటకీయత అధికమైంది. మిశ్రబంధువుకు పూర్వపు చారిత్రక నవలాకారులు కేవలం మహమ్మదీయులనే తమ నవలలకు ఆధార వస్తువులుగా తీసుకొని రాశారు. కాని మిశ్రబంధువులు మహమ్మదీయ చరిత్రకంటె పూర్వపు చరిత్రను ఆధారంగా చేసుకొని నవలలను రాశారు.

ద్వితీయ ఉత్థాన కాలంలో వెలువడిన 'దుర్గా దాస ఖత్రి' గారి 'అనంగ పాల్' (1917), 'శ్యామసుందర్ దాస్' గారి 'రాణిదుర్గావతి' (1917), హరిదాస మాణిక్ గారి 'చౌహాన్ తలవార్' (1918), విశ్వంభర్ నాథ్ జిజ్జా గారి 'తుర్క్ తరుణి' (1925), భగవతీ చరణ్ వర్మగారి 'పతన్' (1927) మొదలైనవి ప్రసిద్ధాలు.

**తృతీయ ఉత్థాన కాల చారిత్రక నవలాకారులు - చారిత్రక నవలలు (1929- 1960) :** ఈ కాలంలో హిందీలో శ్రేష్ఠమైన చారిత్రక నవలా రచనకు బృందావన్ లాల్ వర్మగారు ప్రనాది వేశారు. హిందీ చారిత్రక నవలా సాహిత్యంలో బృందావన్ లాల్ వర్మగారికి ముందు బెంగాలీ, ఆంగ్లేయ భాషలలోని చారిత్రక నవలలను అధికంగా అనువాదం చేస్తూ ఉండేవారు. మౌలికాలైన చారిత్రక నవలలుగ పేర్కొంటున్న వాటిలో మౌలికత పూర్తిగా లేక పోయింది

మొదట నవలాకారులైన కిశోరీలాల్ గోస్వామీ గారి నవలలు కొన్నింటిని చారిత్రక నవలలని అనేవారు కాని వాటిని చారిత్రక నవలలని

పరిగణించరదం సరిగాదు. వాటిలో చరిత్రను ఆధారంగా చేసుకొని ప్రేమ ప్రసంగాలు, తాంత్రిక విద్యల ప్రచారం అధికంగా జరిగింది. గోస్వామి గారి కాలంలో చారిత్రక నవలా రచన ప్రారంభమైనప్పటికీ నిజమైన చారిత్రక నవలల వికాసం అనేది బృందావన్ లాల్ వర్మగారి నవలల ద్వారా జరిగింది. ముందు యుగాలలోని నవలాకారుల దృష్టి చారిత్రకత వైపు తక్కువగాను, ఉపదేశం, మనోరంజనం వైపు అధికంగా ఉండేది. కాని "వర్మగారి నవలల్లో ముఖ్యంగా బుందేల్ ఖండ్ మధ్యకాలీన చరిత్రలోని వివిధ సంఘటనలను, శాశ్వతమైన పాత్రలను గ్రహించి సత్యాలకు, కల్పనలకు సుందర సమన్వయం చేయడం జరిగింది. ఇందులోని ముఖ్య సంఘటనలన్నీ చరిత్ర సమ్మతాలు. ఆయన కేవలం చరిత్రనే గాక చరిత్రకు సంబంధించిన అనేక సంఘటనలను శోధించి నవలల్లో సమకూర్చారు. వర్మగారి నవలల్లో చరిత్రే కాక రొమాన్స్ కూడా ఉంది. ఆయన రాసిన కథలన్నింటిలోనూ సాహసం, శౌర్యం, ప్రేమ, త్యాగం, కర్తవ్యపాలన మొదలైన సుగుణాలున్నాయి. అందువల్ల వారి నవలలు కర్మ, కర్తవ్య పరాయణత అన్న సందేశాన్నందిస్తాయి. అతని దృష్టికోణం ఆదర్శోన్ముఖమైంది. అందువల్ల వారు తన పాత్రలద్వారా సచ్చరిత్రపైన ఎక్కువ మక్కువ చూపారు."[1]

వర్మగారు హిందీలో వాస్తవిక రొమాన్స్ సాహిత్యానికి మూల పురుషుడు. "వర్మగారి నవలల్లో ప్రముఖమైనవి చారిత్రకాలు. అందులోనూ రొమాన్స్ ప్రవృత్తి అధికం. అతని అన్ని కథలు, కథానికలు, నవలలు, రొమాన్స్,

---

1. హిందీ సాహిత్యకా వైజ్ఞానిక్ ఇతిహాస్ - గణపతి చంద్రగుప్త, పు: 924

ప్రేమ, సౌందర్యమయమైన వాతావరణంలో నిండినటువంటివి."

కమలకుమారి జౌహరీ గారు "వర్మగారు నిజంగా రొమాన్స్ నవలా లేఖకుడు. అతని రచనలన్నీ ప్రేమ, సౌందర్యం, వీరత్వం మొదలైన వాటితో భావాత్మకం గానూ, కావ్యమయం గానూ కానియారు దగినవి"[2] అన్నారు.

బృందావన్ లాల్ వర్మగారి ప్రవేశంతో హిందీ సాహిత్యంలో చారిత్రక నవల రూపురేఖలు మారిపోయాయి. ఆంగ్ల సాహిత్యంలో 'సర్ వాల్టర్ స్కాట్' గారు ఏ విధంగా చారిత్రక నవలలకు ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించారో, బృందావన్ లాల్ వర్మగారు కూడ అదే విధంగా హిందీ సాహిత్యంలో ఒక స్థానం ఏర్పరిచారు.

స్కాట్, రొమాన్స్ సాహిత్యంలో గొప్పవారు. యదార్థం కల్పనల సుందర సమన్వయం స్కాట్ నవలల్లో జరిగింది. స్కాట్ కు ముందు ఆంగ్లేయ సాహిత్యంలో స్పష్టమైన చారిత్రక నవల లేదు. స్కాట్ తనకు దొరికినటువంటి అన్ని చారిత్రకాధారాలను, ప్రేరణలను గ్రహించి దానితో చారిత్రక సత్యాలను, కాల్పనికతను సమ్మిశ్రణం చేసి, చారిత్రక నవలలకు ఒక రూపాన్ని కల్పించేటందుకు ప్రయత్నం చేశారు. ఆంగ్లేయ సాహిత్యంలో ఏ పరిస్థితులు వాల్టర్ స్కాట్‌కు జన్మనిచ్చాయో, అటువంటి పరిస్థితుల్లోనే హిందీ సాహిత్యం బృందావన్ లాల్ వర్మగారికి జన్మనిచ్చింది. ఏ విధంగా స్కాట్‌గారు 'స్కాట్ లేండ్'ను భూమికగ తీసుకొని తవదేశ గౌరవాన్ని కాపాడుకొనేందుకు చారిత్రక నవలలు రాశారో, అదే విధంగా

---

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మా సాహిత్య సర్వేక్ష - డా॥ త్రిలోక్ నారాయణ్ దీక్షిత్, పృ: 311.

2. హిందీ కే [illegible] ఐతిహాసిక్ ఉపన్యాస్ - కమలకుమారి జౌహరి, పృ: 49

బృందావన్ లాల్ వర్మగారు బుందేల్ ఖండ్‌కు గౌరవాన్ని చేకూర్చేందుకు చారిత్రక నవలలు రాశారు. ఈ సందర్భంలో అతడికి, అతడి నవలలకు స్కాట్ తోను స్కాట్ గారి నవలలతోనూ దగ్గర పోలికలున్నవి.[1]

ఆంగ్ల సాహిత్యంలో స్కాట్ కి పూర్వం Historical romances, అంతకు పూర్వం Gothic romances ఉంటే, 19వ శతాబ్దంలో స్కాట్ తో పరి చారిత్రక నవలా రచన ప్రారంభమయింది. బృందావన్ లాల్ వర్మ గారికి ముందు చారిత్రక నవల్లో చరిత్రకు కానీ, చారిత్రక ప్రాంతాలకు కానీ ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు కారు. మంత్ర తంత్రాలు, భూత పిశాచాదులకు సంబంధించిన విషయాలకు, అతి మానవీయ, అమానుష శక్తులు, కుతంత్రాలు, కుట్రలు, ప్రేయసీ ప్రియుల ప్రేమ, ఆలింగనం, చుంబనం, వ్యభిచారం, అత్యాచారం మొదలైన అంశాలపై రచయితలు దృష్టిని ప్రసరించారు. చరిత్రను యథాతథంగా చిత్రిస్తే పాఠకులు ఆదరించరని వారి భావన. కాని వర్మగారు ఈ అభిప్రాయం తప్పని, చరిత్రను రాసినా అది రాసే విధానం మనోహరంగా ఉంటే పాఠకులు ఆదరిస్తారని, తన నవలల ద్వారా నిరూపించదలచి చరిత్రకూ, కల్పనలకూ తమ నవలల్లో సమ ప్రాధాన్యం ఇచ్చి అనేక చారిత్రక నవలల్ని రాశారు. వర్మగారు 1. గఢ్ కుండార్ (1929), 2. విరాటాకీ పద్మినీ (1936), 3. ముసాహిబజూ (1946), 4. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి (1946), 5. కచనార్ (1947), 6. మృగనయనీ (1950), 7. టూటేకాంటే (1954), 8. అహల్యాబాయి (1955), 9. భువన విక్రమ్ (1957), 10. మాధవ్ జీ సింధియా (1957) మొదలైన ప్రముఖ చారిత్రక నవలలు రాశారు.

---

1. హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాస్ – డా॥ రామనారాయణ సింహ మాథుర్., పు: 37.

బృందావన్ లాల్ వర్మగారి తరువాత చెప్పుకోదగ్గ నవలాకారులు 'రాహుల్ సాంకృత్యాయన్'. ఇతడు బౌద్ధ సాహిత్యాన్ని పూర్తిగా అవగాహన చేసుకొన్నట్టి పురాతత్వ శాస్త్రజ్ఞుడు. ఈయన నాలుగు చారిత్రక నవలల్ని రాశారు. 1. సింహ సేనాపతి (1942), 2. జయయౌధేయ (1944), 3. మధుర స్వప్న (19[illegible]). 4. విస్మృత యాత్రీ (1955).

ఈ కాలానికి చెందిన మూడవ చారిత్రక నవలాకారుడు చతుర్‌సేన్ శాస్త్రిగారు. ఈయన రచించిన 1. ఖవాస్ కా బ్యాహ (1932), 2. వైశాలీ కీ నగర్ వధు (1949), 3. పూర్ణాహుతి (1949), 4. రక్త్ కీ ప్యాస్ (1950), 5. సోమనాథ్ (1954), 6. ఆలంఘీర్ (1954), 7. వయం రక్షామః (1955), 8. సోనా ఔర్ ఖూన్ (1959-60) ముఖ్యమైనవి. ఈ చారిత్రక నవలల్లో ఆయా కాలాల నాటి రాజకీయ కలహాలు, కుట్రలు, విద్రోహ చర్యల గురించి వివరించారు. ఈయన రచించిన 'వైశాలీ కి నగర వధు' సర్వశ్రేష్ఠమైన రచన. బౌద్ధయుగం నాటి సాంఘిక, ధార్మిక విషయాలు ఇందులో ప్రతిపాదించబడ్డాయి.

చతురసేన్ శాస్త్రిగారి తర్వాత ఎన్నదగిన చారిత్రక నవలాకారులలో 'యశపాల్' ప్రముఖుడు. ఇతడు 'దివ్య' (1945) 'అమిత' (1956) పేర్లుగల రెండు చారిత్రక నవలలను రచించాడు. 'దివ్య' చారిత్రక పాత్ర కాదనీ, చారిత్రక కల్పన మాత్రమే అని చెప్పినాడు.

చారిత్రక సంఘటనలను పూర్తిగా విశ్లేషించి రాసిన రెండవ నవల 'అమిత'. దీనిలో అశోకుడు కళింగ దేశంపై దండెత్తి వెళ్ళడం, లక్షలకొలది కళింగదేశీయుల్ని చంపడం, తత్ఫలితంగా అతని హృదయంలో

అమృత్‌లాల్ నాగర్ రచించిన 'షత్రంజ్ కే మోహరే' (1959) మొదలైనవి ముఖ్యంగా పేర్కొనదగినవి.

పై వివరణావల్ల హిందీ చారిత్రక నవలా సాహిత్యం మిగిలిన హిందీ నవలలవలె శిల్ప ప్రయోగం, వర్ణనాశైలి, చరిత్ర చిత్రణ పద్ధతి మొదలైన విషయాల్లో ఆశ్చర్యకరమైన ఉన్నతిని పొందింది. హిందీ చారిత్రక నవలాకారులు గత చరిత్రను వాస్తవంగా నిరూపించడానికి ప్రయత్నం మాత్రమే కాక, చారిత్రక నేపథ్యంలో వ్యక్తి సమాజాల గతి విధులను చిత్రించడం ద్వారా గత జీవితాన్ని విశ్లేషించి, శాశ్వతమైన మానవ విలువలను మనకందించారు.

**1.7. తెలుగు చారిత్రక నవలా వర్గీకరణ:** ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియల్లో నవల ప్రాముఖ్యం సంతరించుకొంది. దేశంలో రాజకీయ పరిణామాలకు దారితీసిన ప్రథమ (1914-1919), ద్వితీయ (1939-1945) సంగ్రామాలు, సోవియట్ విప్లవం (1917), భారత స్వాతంత్ర్య ఉద్యమం, జాతీయ పునరుజ్జీవనం, సంఘ సంస్కరణ ఉద్యమం మొదలైనవి ఎన్నో నవలల ఆవిర్భావానికి తోడ్పడ్డాయి. అందువల్ల ఈ నవలల్లో ఎన్నో రకాలైన ఇతివృత్తాలు, రచనా పద్ధతులు కన్పిస్తాయి.

తెలుగు నవలల్లో ఉండే విషయాన్ని ఆధారంగా చేసుకొని తెలుగు నవలలను వర్గీకరించిన వారిలో డా॥ బొడ్డుపాటి వెంకటకుటుంబరావు, శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు, శ్రీ పిల్లలమర్రి వెంకట-హనుమంతరావు, శ్రీ కూచిమంచి వెంకటసుబ్బారావు, శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ,

శ్రీ B.V. కుటుంబరావు , శ్రీ మొదలి నాగభూషణ శర్మ , శ్రీ పుల్లా భొట్ల-వేంకటేశ్వరులు మొదలైన వారు పేర్కొదగ్గ వారు.

నవలల్లోని వస్తువును ఆధారం చేసుకొని నవలలను "డా॥ బి. వి. కుటుంబరావుగారు ఈ విధంగా వర్గీకరించారు.

1. ఘటనా ప్రధానములు

2. కౌతూహల ప్రధానములు (లేక) కాల్పనికములు

3. శీల (పాత్ర) ప్రధానములు

4. సంఘ చిత్రణ ప్రధానములు

5. ఇతిహాస ప్రధానములు

6. మనః ప్రవృత్తి నిరూపణ ప్రధానములు "[1].

"మొదలి నాగభూషణ శర్మగారు - నవలలను ఈక్రింది విధంగా వర్గీకరించారు.

1. పౌరాణిక నవలలు

2. చారిత్రక నవలలు

3. సాంఘిక నవలలు "[2]

తెలుగు విజ్ఞాన సర్వస్వంలో

1. చారిత్రక నవలలు

2. సాంఘిక నవలలు

3. రాజకీయ నవలలు

---

1. ఆంధ్ర నవలా పరిణామము - బొడ్డుపాటి వెంకట కుటుంబరావు , పు. 118

2. తెలుగు నవలా వికాసం - మొదలి నాగభూషణ శర్మ , పు. 10

4. హాస్య ప్రధానమైన నవలలు

5. మనో విజ్ఞాన సంబంధమైన నవలలు

6. మనస్తత్వ శాస్త్ర సంబంధమైన నవలలు

7. అపరాధ పరిశోధక నవలలు "[1] అని ఏడు రకాలుగా వర్గీకరించారు.

నవలల్లోని అంతర్భాగమైన చారిత్రక నవలలు కొన్ని చరిత్ర ప్రధానంగా ఉంటే, మరికొన్ని కల్పన ప్రధానంగా ఉండడం, కొన్ని బీజ మాత్రంగా చారిత్రకాంశాలను గ్రహించడం - ఈ విధంగా రకరకాలుగా ఉండడం వల్ల చారిత్రక నవలల్ని తిరిగి ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

1. అనువాద అనుకరణ చారిత్రక నవలలు

2. స్వతంత్ర చారిత్రక నవలలు

3. చారిత్రక ఆభాసాలు (లేక) కల్పిత చారిత్రక నవలలు (చారిత్రక రొమాన్స్)

4. సంపూర్ణ చారిత్రక నవలలు

5 మిశ్రమ చారిత్రక నవలలు

**అనువాద, అనుకరణ చారిత్రక నవలలు:** నవలా సాహిత్య ప్రారంభ దశలోనే అంటే 1893-1930 ల మధ్య వెలువడిన చారిత్రక నవలలు ఎక్కువగా అనువాదాలు, అనుకరణాలు. మొట్టమొదట అనువాద చారిత్రక నవలగ శ్రీ ౦.౪. దొరస్వామయ్య రచించిన 'కపాలకుండల' (1899)ను

---

1. విజ్ఞాన సర్వస్వం - నాల్గవ భాగం, పు: 876 - 881

పరిగణించారు. వీరిచే 'ఆనంద మఠము' (1907), శ్రీ కనకవల్లి భాస్కర-రావు రచించిన 'ప్రఫుల్ల ముఖి' (1909), శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావు రాసిన 'శ్రీ కృష్ణకాంతుని మరణశాసనము' (1900) శ్రీ తల్లాప్రగడ సూర్య-నారాయణ రచించిన 'శైవలినీ చంద్రశేఖరము' (1910), శ్రీ చాగంటి శేషయ్య రచించిన 'దుర్గేశనందిని' (1911), 'నవాబు నందిని' (1915), శ్రీవేంకట-పార్వతీశ కవుల 'రాజసింహ' (1912) మొదలైనవి బంకించంద్రుని రచనలకు అనువాదాలు.

శ్రీ చిలకమర్తి వారి 'రాజస్థాన కథావళి', శ్రీ కాకర పర్తి-సత్యనారాయణ గారి 'కనకాంగి' (1923), శ్రీ తెన్నేటి సూరి గారి 'రెండు మహానగరాలు', శ్రీ కేతవరపు వేంకట శాస్త్రిగారి 'బివాన్ హో' మొదలైనవి ఆంగ్ల చారిత్రక నవలల అనువాదాలు.

ఇంకా మరాఠీ నుండి, మలయాళం నుండి, కన్నడం నుండి, గుజరాతీ నుండి, హిందీ ఇంకా ఇతర భాషల నుండి ప్రసిద్ధ చారిత్రక నవలలు అనువదించటం జరిగింది.

కొందరు రచయితలు మూలాన్ని మక్కికి మక్కిగా అనుకరిస్తే, మరికొందరు మూలంలోని నవలలను అనుకరిస్తూ రచనా విధానంలో స్వతంత్రతను అవలంబించారు. ఇటువంటి రచనలే అనుకరణ నవలలు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం రాసిన 'అహల్యాబాయి', 'టిప్పుసుల్తాను' నవలలు, 'మెడోస్ టేలర్' రచించిన 'సుల్తాను', 'తారా', 'చాంద్‌బీబీ' నవలలకు, 'శ్యామల' షేక్స్‌పియర్ రాసిన 'మాక్‌బెత్'కు అనుకరణలు

శ్రీ కొండపర్తి వీరభద్రాచార్యుల 'జయసేన విజయము' షేక్స్పియర్ 'ఒథెల్లో' కు అనుకరణ.

అనువాద నవలల్లో రచయితలు చాలవరకు మూలంలో ఏ పేరుందో ఆ పేరే శీర్షికగా పెట్టారు; కానీ అనుకరణ రచనల్లో మాత్రం అనేకమంది శీర్షిక పేర్లు కూడా మార్చారు. ఆ నాటి ఈ అనువాదం, అనుకరణ నవలలన్నీ చాలవరకు కఠినమైన సమాసాలతో కూడిన గ్రాంథిక భాషలో ఉండటం కనిపిస్తుంది.

స్వతంత్ర చారిత్రక నవలలు : అధిక సంఖ్యలో వెలువడ్డ అనువాదాల, అనుకరణాల గాలిదుమారం క్రమంగా తగ్గిన తర్వాత, చేవగల స్వతంత్ర రచనలు తెలుగు రచయితల హస్తకమలాల నుండి విరివిగా బాలు వారాయి. ఈ మార్పుకు ముఖ్యులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ అడివి-బాపిరాజు, శ్రీ నోరి నరసింహశాస్త్రి. వీరు తెలుగు వారి చరిత్రను విశిష్టమైన పద్ధతిలో రాసి, వినూత్నమైన రూపాన్ని కల్పించిన ప్రతిభావంతులు. వీరు ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన ఇతివృత్తాలను స్వీకరించి స్వతంత్ర నవలలు రాశారు. వీరి నవలల్లో పాత్రలకు సంబంధించి, రాజ కుటుంబాలకు చెందిన వారికే గాక సామాన్య ప్రజలకు ప్రాధాన్యం ఇచ్చారు. నోరి నరసింహ-శాస్త్రి గారి నవలల్లో మహాకవులైన నన్నయ, తిక్కన, ఎర్రన, పోతన, శ్రీనాథుడు, ధూర్జటి మొదలైన వారి జీవిత చరిత్రలు సజీవత్వం పొందాయి. ఈ విధంగా కవుల జీవిత చరిత్రను ఆధారంగా తీసుకొని చారిత్రక నవలల రచనా విధానంలో ఒక నూతన అధ్యాయాన్ని నోరివారు సృష్టించారు

వీరి తర్వాత స్వతంత్ర చారిత్రక నవలా రచనలు అధికంగా చేసినవారు శ్రీ చిలుకూరి వీరభద్రరావు, తెన్నేటి సూరి, శ్రీ కొండూరు-వీర రాఘవాచార్యులు, శ్రీ పిలకా గణపతి శాస్త్రి, శ్రీమతి మల్లాది వసుంధరాదేవి మొదలైన వారు.

స్వతంత్ర చారిత్రక నవలల్లో కొన్ని పాత్రలు, లేదా ఒకటి రెండు సంఘటనలు లేదా దేశకాలాదులు మాత్రం చరిత్ర నుండి గ్రహించి, మిగిలిన కథాంశమంతా రచయితే స్వయంగా కల్పించేవారు. ప్రత్యేకించి నోరి-నరసింహ శాస్త్రి గారి నవలల్లో చరిత్ర, చరిత్రాంశాలు అధికంగా ఉంటాయి. వీలున్నంత వరకు చారిత్రకతకు భంగం వాటిల్లకుండా ఈ స్వతంత్ర చారిత్రక నవలల రచన సాగుతుంది. స్వతంత్ర చారిత్రక నవలల్లో మహారాష్ట్ర, రాజస్థాన్, కాశ్మీర్ మొదలైన ఉత్తర భారత చరిత్రకు సంబంధించిన చారిత్ర కాంశాలతో కూడిన నవలలు వచ్చాయి. ఐతే మొత్తం మీద ఆంధ్రదేశ చరిత్రకు చెందిన చారిత్రక నవలలకు లభించిన స్థానం అధికాధికం అని చెప్ప వచ్చు.

**చారిత్రక ఆభాసాలు లేక కల్పిత చారిత్రకాలు లేక చారిత్రక రొమాన్సులు:**

తెలుగులోని ఈ చారిత్రక ఆభాసాలు ఆంగ్లంలోని 'Gothic Novels' మరియు 'Historical romances' ను పోలి ఉంటాయి. వీటిలో చరిత్ర కంటె కల్పనకు, అద్భుత సన్నివేశాలకు, ఊహలకు ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. రచయిత దేశ కాలాదులను లేదా ఒకటి రెండు పాత్రలను మాత్రం చరిత్రకు ఆధారంగా తీసికొని ఈ కోవకు చెందిన నవలా రచన చేస్తా

ఈ నవలల్లోని సంఘటనలకు చరిత్రలో ఆధారాలేవీ ఉండవు. చారిత్రక నవల ప్రారంభమైన తొలి రోజుల్లో ఎక్కువగా చారిత్రక ఆభాసాలే రచించడం జరిగింది. 'చిలకమర్తి వారి రచనలు', విశ్వనాథ వారి 'పురాణ వైరి గ్రంథమాల' లోని నవలలన్నీ ఈ కోవకు చెందినవే.

సంపూర్ణ చారిత్రకాలు : కల్పనలు, అద్భుతాలు అతి తక్కువగా ఉండి, చరిత్రాంశం ఎక్కువగా ఉండేవి సంపూర్ణ చారిత్రకాలు అని పేర్కొనవచ్చు. విశ్వనాథ వారితో తెలుగులో సంపూర్ణ చారిత్రక రచన తన రూపాన్ని సంతరించుకొందని చెప్పవచ్చు. స్వాతంత్ర్యానంతరం వెలువడిన చారిత్రక నవలల్లో అద్భుత సన్నివేశాలకు, వర్ణనలకు, కల్పిత ఘట్టాలకు ప్రాముఖ్యత తగ్గి, చరిత్రలోని రాజుల జీవితాలకు ప్రజల జీవన విధానానికి, దేశ స్థితి గతులకు ప్రాధాన్యం ఇవ్వడం జరిగింది. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి రచనలు ఈ కోవకు చెందినవి.

మిశ్రమ చారిత్రకాలు : ఎక్కువ కల్పనలు, అద్భుత సన్నివేశాలు లేకుండా కొంత చరిత్ర, కొంత కల్పన ఆధారంగా రచనలు గావించిన చారిత్రక నవలల్ని మిశ్రమ చారిత్రకాలు అంటారు. సాధారణంగా తెలుగు చారిత్రక నవలల్లో ఈ కోవకు చెందిన నవలలే అధికంగా కన్పిస్తాయి. హిమబిందు, కళారాధన, సుధీర మొదలైనవి ఈ కోవకు చెందిన నవలలు.

1.8. హిందీ చారిత్రక నవలా వర్గీకరణ: ప్రాచీన యుగంలో ఇప్పుడున్నంత విస్తారంగా నవలా స్వరూపం లేనప్పుడు ఏ కథా వస్తువుకైనా నవల సాహిత్యపరంగానూ, కళాత్మకంగాను వికాసం పొందిన తర్వాత ఎన్నో ప్రాతిపదికలతో దానిని వర్గీకరించడం జరిగింది.

ప్రతాప్ నారాయణ్ టండన్ గారు విభిన్న ప్రవృత్తులను స్వరూప స్వభావాల్ని దృష్టిలో ఉంచుకొని ఈ క్రింది విధంగా విభజించారు.

1. చారిత్రక నవలలు, 2. సాంస్కృతిక నవలలు, 3. సామాజిక నవలలు, 4. సమస్యా ప్రధాన నవలలు, 5. భావ ప్రధాన నవలలు, 6. ఆదర్శవాద నవలలు, 7. నీతి ప్రధాన నవలలు, 8. యదార్థవాద నవలలు, 9. ఆదర్శ పరక యదార్థ వాద నవలలు, 10. సామాజిక యదార్థవాద నవలలు, 11. ప్రగతివాద నవలలు, 12. అతి యదార్థ వాద నవలలు, 12. ప్రకృతి వాద నవలలు, 14. మనో వైజ్ఞానిక నవలలు, 15. రాజనీతిక నవలలు, 16. ప్రయోగాత్మక నవలలు, 17. తిలస్మి నవలలు, 18. జాదూ ( మంత్ర తంత్ర) నవలలు, 19. డిటెక్టివ్ నవలలు, 20. వైజ్ఞానిక నవలలు, 21. లోక కథాత్మక నవలలు, 22. ఆంచలిక నవలలు"[1]

డా. శాంతి స్వరూప గుప్తగారు నవలా స్వరూపం, విషయం, తత్వం, కథా కథనం మొదలైన వానిని దృష్టిలో ఉంచుకొని నవలలను విభజించారు. కథాస్వరూపాన్ని, కథావస్తువులోని సత్యాన్ని దృష్టిలో ఉంచుకొని నవలలను రెండు వర్గాలుగా విభజించవచ్చు. అవి - 1 కల్పనా ప్రధాన నవలలు, 2. వాస్తవికతా ప్రధాన నవలలు. విషయాన్ని దృష్టిలో ఉంచుకొని నవలలను ఆరు రకాలుగా విభజింపవచ్చు.

1. సామాజిక నవలలు, 2. రాజనీతిక నవలలు, 3. చారిత్రక నవలలు, 4. వైజ్ఞానిక నవలలు, 5. మనో వైజ్ఞానిక నవలలు, 6. ఆంచలిక నవలలు

1. హిందీ ఉపన్యాస్ - డా. ప్రతాప్ నారాయణ టండన్, పు: 6

నవలా తత్వాన్ని అనుసరించి నవలలను 1. ఘటనా ప్రధాన నవలలు , 2. చరిత్ర ప్రధాన నవలలు , 3. ఉద్దేశ ప్రధాన నవలలుగా విభజించ వచ్చు.

నవలలో రాసిన శైలీ విధానం ఆధారం చేసుకొని కూడ నవలలను విభజించ వచ్చు 1. వర్ణనాత్మక (శైలి) నవలలు , 2. నాటకీయ (శైలి) నవలలు, 3. ఆత్మకథాత్మక (శైలి) నవలలు, 4. ప్రతీకాత్మక (శైలి) నవలలు , 5. డైరీ (శైలి) నవలలు.[1]

చారిత్రక నవలల వర్గీకరణ : డాక్టర్ రామనారాయణ సింహా - మాధుర్ గారు చారిత్రక నవలల్ని రెండు విధాలుగా వర్గీకరించారు. 1. చారిత్రక సత్యం ఆధారంగా వర్గీకరణ, 2. విషయ ప్రతిపాదనను సరించి వర్గీకరణ.

చారిత్రక సత్యం ఆధారంగా వర్గీకరణ : చారిత్రక నవలల్లోని కల్పన , చరిత్రల ఆధారంగా చారిత్రక నవలలు మూడు రకాలుగా విభజన చేశారు.

1. చరిత్ర ప్రధానమైన చారిత్రక నవలలు : ఉదా॥ చతురసేనశాస్త్రిగారి 'ఆలంఘీర్', బృందావన్ లాల్ వర్మగారి 'ఝాన్సీ కీ రాణి లక్ష్మీబాయి'

2. కల్పనా ప్రధానమైన చారిత్రక నవలల వర్గీకరణ: ఉదా॥ హజారీ ప్రసాద్-ద్వివేదీ గారి 'బాణభట్టు కీ ఆత్మకథా', చతురసేన శాస్త్రిగారి 'వైశాలీ కీ నగర వధు'.

---

1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ ప్రగనయనీ - శాంతి స్వరూప గుప్త. పు: 16

.. సమ ప్రాధాన్యం గల చారిత్రక నవల : ఉదా॥ మిశ్రబంధు రచించిన 'చంద్రగుప్త మౌర్య

విషయ ప్రతిపాదనను అనుసరించి చారిత్రక నవలల వర్గీకరణ:

1. చరిత్ర ప్రాధాన్యం గల చారిత్రక నవలలు: ఉదా॥ చంద్రశేఖర్ పాఠక్ 'భీమసింహ' ; బృందావన్‌లాల్ వర్మగారి 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' ; చతురసేన శాస్త్రి 'ఆలంఘీర్' ; 'గురుదత్త', 'బహతీరాత్'.

2. దేశప్రేమ ప్రాధాన్యం గల నవలలు : ఉదా॥ రామచరణ్ జైన్ 'గదర్' ; రాహుల్ సాంకృత్యాయన్ రచించిన 'జయయౌధేయ', 'సింహసేనాపతి', 'మధుర స్వప్న' ; వాల్మీకి త్రిపాఠీ 'ప్రజాప్రియ ప్రకేష్' మొదలైనవి.

3. సంఘ ప్రాధాన్యం గల చారిత్రక నవల: ఉదా॥ శ్రీ జయశంకర్ ప్రసాద్ 'ఇరావతీ' ; యశ్‌పాల్ 'దివ్య' ; చతురసేన శాస్త్రి 'వైశాలీకీ నగర వధు' మొదలైనవి.

4. సంస్కృత ప్రాధాన్యం గల చారిత్రక నవలలు: ఉదా॥ హజారీ ప్రసాద్ ద్వివేదీ 'బాణభట్టు కీ ఆత్మకథ' ; 'చారు చంద్రరేఖ'.

మనో వైజ్ఞానిక చారిత్రక నవలలు: 'భగవతీ చరణ్ వర్మ' గారి 'చిత్రలేఖ' ; పండిత గోవింద వల్లభ పంత్ 'అమితాభ', 'నూర్జహాన్' ; రాంగేయ రాఘువ 'ముర్దోం కా టీలా' మొదలైనవి.[1]

" చారిత్రక నవలల్లో ప్రతిపాదించిన కథావస్తువు, పాత్రలు, చరిత్ర చిత్రణ, వాతావరణం మొదలైన విషయాల్ని ఆధారంగా చేసుకొని

---

1. హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాస్ - రామనారాయణ సింహ మాధుర్, పు: 11-10

చారిత్రక నవలల్ని నాలుగు విధాలుగా విభజింప వచ్చునని 'శ్రీనారాయణ-భారద్వాజ గారు'[1] చెప్పారు.

విశుద్ధ చారిత్రక నవలలు:

ఉదా॥ చతురసేన శాస్త్రి 'ఆలంఘీర్'; బృందావన్ లాల్ వర్మ 'ఝాన్సీకీ రాణీ లక్ష్మీబాయి', 'మాధవ జీ సింధియా' మొదలగునవి.

సమన్వయాత్మక చారిత్రక నవల:

ఉదా॥ బృందావన్ లాల్ వర్మ 'మృగనయని'.

మిశ్రబంధు రచించిన 'చంద్రగుప్తమౌర్య'

వాతావరణ ప్రధాన చారిత్రక నవల:

ఉదా॥ గురుదత్త గారి 'బహతీ రేత్'; హజారీ ప్రసాద్ ద్వివేదీ గారి 'చారు చంద్రరేఖ'; బృందావన్ లాల్ వర్మ 'విరాటాకీ పద్మినీ'.

కల్పనా ప్రధానమైన చారిత్రక నవలలు:

బృందావన్ లాల్ వర్మ 'కచనార్'; యశపాల్ 'దివ్య'; రాంగేయ-రాఘవ్ 'ముర్దోం కా టీలా' మొదలైనవి.'

విభిన్న దృక్పథాల ననుసరించి శాంతిస్వరూప గుప్తగారు చారిత్రక నవలల్ని ఈక్రింది విధంగా విభజించి ఉన్నారు.

"యుగ ప్రాతినిధ్యం వహించిన నవలలు:

ఉదా॥ రాహుల్ సాంకృత్యాయన్ 'సింహ సేనాపతి', 'జయ యౌధేయ'

---

1. ఇతిహాసిక్ ఉపన్యాస్ తులనాత్మక్ అధ్యయన్ - శ్రీనారాయణ భారద్వాజ, పు. 44.

వ్యక్తి ప్రాతినిధ్యం వహించిన నవలలు:

ఉదా॥ జయశంకర ప్రసాద్ 'ఇరావతి'; యశపాల్ 'దివ్య'.

అతిరంజనకారీ (అత్యుక్తి) చారిత్రక నవలలు:

ఉదా॥ బృందావన్ లాల్ వర్మ 'మృగనయనీ', 'కచనార్'[1]

"శాంతి స్వరూప గుప్తగారు చారిత్రక నవలలను

1. శుద్ధ చారిత్రక నవల
2. చారిత్రక రొమాన్స్[2] అని రెండు ప్రధాన వర్గాలుగా విభజించినారు.

చారిత్రక నవల - చారిత్రక రొమాన్స్:

డా॥ సత్యేంద్ర గారు విశుద్ధ చారిత్రక నవలకు, చారిత్రక రొమాన్స్ కు గల భేదాన్ని ఇలా చెప్పారు. "రొమాన్స్ (Romance)కు సాధారణ నవలకు చాలా భేదం ఉంది. మొదటిది కేవలం చరిత్ర అనే దారాలను ఆధారంగా గ్రహించి, జీవితం అనే రంగుల జీవనంలో శౌర్యం కోసం ప్రతిష్ఠ అనే మార్గాన్ని తయారు చేస్తుంది. రెండవది 'చరిత్ర' అనే దారాలకు ఎముకల్ని, మాంసాన్ని నింపి ప్రాణం పోసుకోవడానికి ప్రయత్నిస్తుంది. రొమాన్స్ లేఖకుడు, వస్తువు పాత్రలను చరిత్ర నుండి గ్రహిస్తానని పరదం వేసుకొంటాడు గాని, చరిత్రనే రాస్తానని మాత్రం ఎప్పటికీ అనుకోడు. కానీ, అది చరిత్ర ప్రామాణికత్వాన్ని

---

1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ మృగనయనీ - డా. శాంతి స్వరూప గుప్త, పు: 20
2. పైదే., పు: 21.

కలిగి ఉంటుందని మాత్రం చెప్తారు. రొమాన్స్‌లో కల్పనకు ప్రత్యేక స్థానం ఉంటుంది కాని విశుద్ధ చారిత్రక నవలలో ఉండదు."[1] దీనిని బట్టి రొమాన్స్‌లో చరిత్ర నామమాత్రంగా ఉంటి, కల్పన అధికంగా ఉంటుంది. W.L. Cross గారు "The romance gives greater freedom to the imagination deals with more unusual aspects of life"[2] అన్నారు. కాని శుద్ధ చారిత్రక నవల్లో చరిత్రకు సంబంధించిన దృఢమైన ఆధారాలుంటాయి. అందులోని పాత్రలు, ఘటనలు, వాతావరణం అన్నీ చారిత్రకమై ఉంటాయి. కల్పనలకు రెండవ స్థానం ఉంటుంది. శుద్ధ చారిత్రకనవల ఉద్దేశం కేవలం మనోరంజనమే కాదు చరిత్ర జ్ఞానాన్ని కల్గించడం, భ్రాంతులను నివారించడం. అయితే రొమాన్స్ లేఖకునికి చరిత్రసాధనం, నవల సాధ్యం; అంటే చరిత్రను ఉదాహరణంగా గ్రహిస్తారు.

రొమాన్స్ నవలల్లో వ్యక్తి జీవితంలో శౌర్యం సాహసాలతో బాటు ప్రేమకూడ ఉంటుంది. "Love and honour are the two ideals of the hero in a romance. He goes from one adventure to another in the manner of a mediaeval knight of chivalry and always wins the battle. Because of his uncommon qualities and great valour he considers himself a redeemer of his people identifies himself with a social quest"[3]

---

1. హింది ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ వృందనయికే - డా॥ శాంతిస్వరూప్ గుప్త, పు: 21
2. The development of the English novel - W.L. Cross, పు:
3. Philip Meadows Taylor (Ph.d. Thesis) అముద్రితం (Fiction - History - Romance) Dr. M. Sarada, పు: 126

ఈ ప్రేమతో బాటుగ కావ్యమయ రసానుభూతి కలుగుతుంది. ఈ అను భూతే రొమాన్స్ కు ఒక గుణం. ఈ కావ్యమయ అనుభూతి కారణంగానే చారిత్రక రొమాన్స్ లేఖకుడు ఒకవైపు మధుర ప్రణయ వృత్తాంతాలను, మరోవైపు ప్రకృతికి సంబంధించిన మంజుల, మనోహరమైన రూపం ద్యోతకమయ్యే చిత్రణ చేస్తాడు.

" The love of a romance in the popular or general understanding, contains elements of love and adventure sex and violence, harror and grotesquerie. Among them sex and Violence emerge as central elements in any romance "[1]

' రొమాన్స్ ' లేఖకుడు ఒకవైపు త్యాగం, బలిదానం అనే ప్రసంగాల ద్వార పాఠకుని హృదయాన్ని ద్రవింప చేస్తాడు. మరోవైపు ప్రాచీన భిన్న శిథిల అవశేషాలను చూపించి అతని హృదయంలో బాధను, పీడను కలిగించి దానిని తన నవలలో ప్రతిబింబించేటట్లు చేస్తాడు శుద్ధ చారిత్రక నవల్లో ఈ కావ్యమయ అనుభూతి ఉండదు. ఆ స్థానంలో అతడు తర్కం, సత్యం. సాక్ష్యం మొదలైన వాటి ఆశ్రయాన్ని పొంది, తన రచనలను బుద్ధికి సంబంధించినవిగ రచి స్తాడు. ఈ కారణంగానే శుద్ధ చారిత్రక నవలలో చారిత్రక సత్యాలకు ప్రాధాన్యముండి సారహీనంగా ఉంటుంది. కాన చారిత్రక రొమాన్స్ లో రసావిష్కరణకు అవకాశం ఎక్కువగా ఉంటుంది.

---

1. Philip Meadows Taylor
(Fiction - History - Romance, Dr. M. Sarada, Ph.D థీసిస్ అనువాదం, పుట 196

1.9. తులనాత్మక అధ్యయన ప్రాధాన్యత: ఒక భాషా సాహిత్యాన్ని మరొక భాషలోని సాహిత్యంతో పరిపోల్చి సామాన్య వైషమ్యాలను చర్చించడాన్నే 'తులనాత్మక అధ్యయనం' అంటారు. తులన (comparative) అనే పదాన్ని మొట్టమొదట షేక్స్‌పియర్ తన నాటకం 'హెన్రీ' మొదటి భాగంలో వాడారు. "The act of comparison may lead to the birth of the word comparative. 17, 18 శతాబ్దాల్లో అనేకమంది ఈ comparative అనే పదాన్ని వాడుతూ వచ్చారు. 1845లో comparative అనే పదాన్ని Mathew Arnold మరలా వెలుగులోకి తెచ్చారు[1]

"క్రీ.శ. 1848 లో మాథ్యూ ఆర్నాల్డ్ కవి 'comparative literature' అనే మాటను మొదట వాడినారు. దీనినే 'తులనాత్మక సాహిత్యం' అని మనం వ్యవహరిస్తున్నాం. తులనాత్మక పరిశీలనను ప్రప్రథమంగా ప్రారంభించినవారు జర్మనీ దేశానికి చెందిన 'ఫెడరిక్ - సెలగెల్ ఎ. డబ్ల్యూ సెలగల్' అని విజ్ఞుల భావన."[2] విస్తృత సాహిత్య పరిధిగల ఈ రకమైన అధ్యయనాన్ని తులనాత్మక అధ్యయనం అంటున్నాం. ఈ ప్రక్రియకు comparative studies అనేమాట సరిపోతుంది. "ప్రొఫెసర్ ఎం. సుబ్బారెడ్డి గారు- 'studies' అనే పదానికి విస్తృతార్థం ఉంది. కేవలం భాషాసాహిత్యాలకు మాత్రమేగాక సంస్కృతి, చరిత్ర మొదలైన వాటి అవగాహన కూడ జరుగుతుంది. అనే అర్థంలో studies అని వాడడమే సమంజసం అన్నారు.

1. comparative study of early novels in Hindi and Telugu - Prof A.B Sai Prasad, P: 15
2. తులనాత్మక అధ్యయనం - ఆవశ్యకత — డా॥ ఎర్ర బాలకృష్ణారెడ్డి, పు:1,2.
3. పైదే., పు: 2.

"మాథ్యూ ఆర్నాల్డ్ కవి 'తులనాత్మక సాహిత్యం' అన్న మాటను 1848 లో మొట్టమొదట వాడినా, ఫ్రెంచి భాషలో ఆ పదాన్ని 1829 లోనే 'విల్లెమైన్' అనే ఫ్రెంచి రచయిత 'Literature compare'ను ఉపయోగించారనడానికి ఆధారాలున్నాయి"[1]

"20 వ శతాబ్దంలో కూడ 'లేన్ కూపర్' వంటి మహాకవులు తులనాత్మక సాహిత్యాన్ని ఒక 'బోగస్ టర్మ్' అని నిరసించిన సందర్భాలున్నాయి."[2]

"సాహిత్యంలో తులనాత్మక అధ్యయనం జాతీయ దృక్పథానికి నిదర్శనం. తులనాత్మక సాహిత్య అధ్యయనం ఒక ప్రత్యేక విభాగంగా (discipline) ప్రపంచంలోని వివిధ విశ్వవిద్యాలయాల్లో ప్రత్యేక సంస్కృతుల సరిహద్దుల నతిగమించి ప్రపంచ మానవ ఆలోచనా తత్త్వాన్ని ఆవిష్కరించడానికి దోహదం చేస్తుంది."[3] అందుకే విశ్వకవి రవీంద్రులు తులనాత్మక సాహిత్యాన్ని 'విశ్వసాహిత్యం' అన్నారు.

"The comparative literature to begin with a mode - a method of studying different literatures from a comparative point of view but culminates in a concept of world literatures. It is interesting to note that in his talk on comparative literature in 1906 Rabindranath Tagore christened it 'viswa sahitya' (world literature)"[4] "గీత మహాశయుడు కూడా

1. తులనాత్మక సాహిత్య అధ్యయన వికాసం - డా॥ పి.కుసుమకుమారి., పు: 13 — తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక.

2,3. పైదే., పు: 13.

4. A comparative study of early novels in Hindi and Telugu - Prof Dr A.B. Sai prasad P: 166, 167

తులనాత్మక సాహిత్యాన్ని ఇదే అర్థంలో వాడారు."[1]

బెర్నార్డ్ ఫెన్ గారు "comparative study in literature is not only a study in literary resemblance but one in contrasts".[2] ఇలియట్ మహాశయుడు "comparison and analysis are the chief tools of critic but CL is explicity comparative"[3] అన్నారు.

సాధారణంగా ఒక వస్తువును మరో వస్తువు తోను, ఒక వ్యక్తిని మరో వ్యక్తితోను, ఒక భావాన్ని మరో భావం తోనూ పోల్చి చూడడం నిత్య జీవితంలో మనకు పరిపాటి. ఒక వస్తువు మంచి చెడ్డలను, ఒక విషయం బాగోగులను పరిశీలించి వాటి విలువ కట్టడానికి, వాటిని ఇతర వస్తువులతో కానీ, విషయాలతో కానీ పోల్చి చూడవలసి వస్తుంది. Sir James అనే పండితుడు "comparison bestows perfection"[4] అంటే పోల్చి చూడడం వల్ల ఒక విషయాన్ని నిర్దుష్టతమంగా వ్యక్తం చేయవచ్చు అని చెప్పారు. "To express a higher or lower degree of quality, we have to necessarily seek, the help of comparative study. Now a days there fore to gain higher knowledge all have to devotedly depend upon comparative

---

1. A comparative study of early novels in Hindi and Telugu Prof Dr A.B. Sai Prasad., పు: 166-167
2. study in comparative literature - Bernard Fenn., P:212.
3. Comparative Indian literature - Some perspectives - Indranath choudari, P:3.
4. తెలుగులో పరిశోధన - రజతోత్సవ సంచిక — శ్రీ ముసేక్ నక్షత్., పు: 316.

study only."[1] Bernard Fenn గారు "comparative study on the upward scale is the study in similarities while on down ward scale it is the study in dissimilarities"[2] అన్నారు.

సాహిత్యంలోనూ, వైజ్ఞానిక రంగంలోనూ మహోత్కృష్టమైన ప్రగతి, తులనాత్మక పరిశీలన వల్లనే సాధ్యపడుతుంది. అందుకే Max Muller అనే పండితుడు "All higher knowledge is gained by comparison and rests on comparison"[3] అన్నారు. Hendry H.H. Remak "comparison is the main tool for the study of more than one literature"[4] అన్నారు.

ముఖ్యంగా సాహిత్య రంగంలో రెండు విభిన్న భాషా రచయితల రచనలను తులనాత్మక అధ్యయనం చేయడం వల్ల మనం రెండింతలుగా లబ్ధి పొందవచ్చు. "When the comparative study is extended to the authors of distinctively different languages it is doubly fascinating"[5]

"వివిధ భాషా సాహిత్యాలను తులనాత్మకంగా అధ్యయనం చెయ్యడం

---

1. A comparative study of early novels in Hindi and Telugu Prof. Dr. A.B. Sai Prasad., P:159.
2. Study in comparative literature – Bernard Fenn., P: 218.
3. Lectures on science of religion – Max Mullar., P: 12.
4. Comparative Indian literature some perspectives – Indranatha choudhari., P:2.
5. A comparative study of early novels in Hindi and Telugu – Prof. Dr. A.B. Sai Prasad, Scholarly opinion by Arudra, P: 2.

విశ్వమానవ సృజనాత్మక శక్తిని అన్వేషించడానికి దోహదం చేస్తుంది"[1]

సమస్త మానవ సంస్కృతిలో నిగూఢంగా నిక్షిప్తమై ఉన్న మాన సంవేదనంలో గల సమైక్యతను నిరూపించగల సాధనం తులనాత్మక పరిశీలనమే. "సమాన తత్వాలను భిన్న దృక్పథాలతో పరిశీలిస్తూనే తులనాత్మక పరిశీలన మానవ జాతిలో గల సమైక్యతను నిరూపిస్తుంది. భాషాగతంగా కాక భావగతమైన ఏకరూపతను ప్రతిపాదిస్తూ సమస్త మానవ జాతిలో ఐక్యత, భావాన్ని పెంపొందిస్తుంది."[2]

ఏ భాషా సాహిత్యం కూడా ఇతర భాషా సాహిత్య ప్రభావం ఏ మాత్రం లేకుండా రూపొంద లేదు. ఒకటి కంటె ఎక్కువ భాషలను సరి పోల్చి చూడడం సాహిత్య దృక్పథాలను విశాలతరం చేస్తుంది."[3]

ఇంద్రనాథ్ చౌధురి గారు "comparative literature has cometo stay invarious universities of the world yet a large number of critics are sceptical of its valadity because they feel that it has failed to develop a method which sets it clearly apart from other modes of literary criticism"[4] ఇంకా "A method is over all plan for the orderly understanding of the field. It is motivated by approach

---

1. తులనాత్మక సాహిత్య అధ్యయనం - డా॥ పి. కుసుమ కుమారి — తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక., పు:14.
2. తెలుగులో పరిశోధన — రజతోత్సవ సంచిక — భీమసేన్ నిర్మల్., పు: 316.
3. తులనాత్మక సాహిత్య అధ్యయనం - తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక — డా॥ పి. కుసుమ కుమారి., పు: 13.
4. Comperative Indian Literature some Perspectives - Indranath Choudary., P: 1.

and designed by axioms of the field. There are three inter-related approaches - historical, formalistic and socio-realistic - which are harmoniously blend together in pointing out the two fundamental laws which determine the nature of comparative literature. These two principles are : International contextualism and comparative criticism ....

..... in the catalogue of the university of california, Berkerly - it is mentioned that a course in comparative literature offers students an opportunity :

(a) To develop their ability to read literature critically and responsibly.

(b) To study one literature in depth and at least one other in areas immediately relevant to their aims and interests so that a Student may acquire a broader sense of literary history and tradition than may be derived from the study of a single literature, and this broader sense will ultimately prepare the students for a methodological investigation of problems involving more than one literature."[1] అన్నారు.

తులనాత్మక సాహిత్యాన్ని అవగాహన చేసుకొనేందుకు “ఇంద్రనాథ్ చౌదరి గారు 5 సూచనలిచ్చారు (Five dimensional discipline)

---

1. comparative Indian literature - Indranath Chaudhuri P. 1,2
Some Perspectives

i. The study of influence or affinity or tradition convention of literary works in relation to each other and other forms of human expression.

ii. studies of movements and trends.

iii. formalistic study of literary works.

iv. Study of themes and motifs

v. study of theory - oriental poetics and Text-oriented criticism."[1]

భారతీయ సాహిత్యాలన్నీ ఒకే భావాన్ని వేరు వేరు భాషల్లో వెలువరిస్తాయని తులనాత్మక పరిశీలన ద్వారా తెలుస్తుంది. అఖండ భారతావని ఎన్నో భాషల నిలయం. అనేక రకాల భాషా సాహిత్యాలనే కుసుమాల సౌరభాలతో మన దేశ సాహిత్యం సుసంపన్నమైన నందనోద్యాన వనంలా విలసిల్లుతోంది. భారతీయ సాహిత్యాల కన్నింటికి మూలాధారం సంస్కృత సాహిత్యం. భిన్న భాషా సాహిత్యాల అంతరంగంలో కన్పించే ఏకత్వం విదేశీయులను సైతం ఆశ్చర్య పరిచింది. రాబర్ట్ బ్రౌన్, మాక్స్ ముల్లర్, కాల్డ్‌వెల్ మొదలైన విదేశీయ పండితులు మన భారత సాహిత్యంలోని విశిష్టతను గుర్తించారు. భిన్నత్వంలోని ఏకత్వాన్ని ఉటంకిస్తూ పండిట్ జవహర్ లాల్ నెహ్రూ గారు ఇలా అన్నారు "And yet underneath all this there is an Indianness which distinguishes every part of India and is

1. Comparative Indian literature - Some Perspectives, Indranath Choudhuri, p: 3.

something unique and deeper than the external differences that may strike the casual observer. India is a curious mixture of amazing diversity and abiding unity"[1]

కానీ ఈ ఏకత్వాన్ని, అభిన్నతను గుర్తించడానికి ఈ శతాబ్ద ప్రారంభం వరకు ఎటువంటి ప్రయత్నం జరుగలేదు. "గాంధీగారు దక్షిణ భారత హిందీ ప్రచార సభను క్రీ.శ. 1918లో మద్రాసులో ప్రారంభిస్తూ వారిచ్చిన ఆప్తవాక్యమే, ( ఏక్ హృదయ్ హో భారత్, ఏక్ రాష్ట్రభాషా హిందీ) ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది."[2] తమిళ కవి సుబ్రమణ్య భారతి కూడా భారతీయ భాషలు వేరైనా భావం మాత్రం ఒక్కటే అన్నారు. "She (Mother India) has eighteen languages to speak, even then the thinking is one"[3] భిన్న భాషా సాహిత్య తులనాత్మక అధ్యయనం ద్వారా భాషలు వేరైనా భావాలు ఒకటే అనే అర్థం ద్యోతకమౌతుంది. అందుకే "The comparative study promotes better understanding between the language groups belonging to two different regions by making them to sink their differences by adopting the universally acclaimed of given and take."[4]

శ్రీ ప్రభుదాస్ బి. పట్వారీ అభిప్రాయపడినట్లు "A comparative

---

1. తెలుగులో పరిశోధన - రజతోత్సవ సంచిక — థీమ్‌సీస్ బిర్యర్., పు: 317.
2. పైదే., పు: 317.
3. A comparative study of early novels in Hindi and Telugu A.B. Saiprasad., P: 160.
4. Ibid., P: 160.

study of the literature of the Indian languages and a comparative study of the Indian languages vis-a-vis the foreign languages will reveal common approaches and similarities in ideals, irrespective of time, land and language."[1]

తులనాత్మక పద్ధతిని గురించి ఆచార్య జి.యస్. రెడ్డి గారు — " ఇరుగు పొరుగు భాషల్లో లేదా భిన్న దేశాల్లో వెలసిన సాహిత్యాలను పరిపోల్చి, వాటిలోని సామ్య వైషమ్యాలను , పరస్పర ప్రభావాదులను , ప్రత్యేక లక్షణాదులను పరిశీలించడమే తులనాత్మక పద్ధతి . ఈ పద్ధతి అర్వాచీనం. పాశ్చాత్య దేశాల్లో పాతికేళ్ళనుండి ప్రాముఖ్యానికి వచ్చింది. భారతీయ సాహిత్య విషయంలో తులనాత్మక పరిశీలనకు సాటిలేని ప్రాధాన్యం ఉంది. తులనాత్మక పద్ధతిలో భారతీయ సాహిత్యాలను అధ్యయనం చేయడం , జాతి సమైక్యతకు , భావ సమైక్యతకు దోహదపడుతుంది "[2]

భారతీయ భాషలు వేరుగా కనబడినా వీటిలోని ఏకత్వాన్ని K. M. George గారు " Just as many wicks produce one light , India's many languages produce one literature "[3] అని అభిప్రాయపడ్డారు.

హిందీ వాఙ్మయంలో సుప్రసిద్ధ పండితుడైన ' నందదులారే-

---

1. A comparative study of early novels in Hindi and Telugu Prof. Dr. A. B. Sai Prasad., P. 160
2. తెలుగు సాహిత్య సమీక్ష – డా॥ జి. నాగయ్య., పు.:8
3. A comparative Study of Early Novels in Hindi and Telugu Prof Dr A B. Sai Prasad , P. 195

వాజ్‌పేయ్ గారు "విభిన్న ప్రాదేశిక సాహిత్యాలలో ప్రతిబింబించే భారతీయ సాంస్కృతిక ఏకత్వానికి సంబంధించిన విషయాలను అన్వేషించాలి జాతీయ జీవిత సమగ్రతను కేంద్రంగా ఉంచుకొని విభిన్న ప్రాదేశిక కవుల వైశిష్ట్య విషయాలలో కూడ అన్వేషణ అవసరం ... తులనాత్మక పరిశోధనలో సాంస్కృతిక విషయాలను సమగ్రంగా పరిశీలించడం వల్ల ప్రయోజనం చేకూరుతుంది. వాస్తవానికి జానపద సంస్కృతికి, ప్రాదేశిక సంస్కృతికి సంబంధించిన సమస్త విషయాల అనుశీలనమే జాతీయ జీవనంలో భిన్నత్వంలో ఏకత్వాన్ని సంపాదించగలదు"[1] అన్నారు.

19వ శతాబ్దంలో యూరోపియన్ పండితులు సంస్కృత సాహిత్యంలో పరిచయం ఏర్పరచుకోవడం మతపరంగానూ, భాషాపరంగానూ తులనాత్మక అధ్యయనానికి దారితీసింది.[2] "1984 లో ఢిల్లీలో ఏర్పడిన 'కంపారిటివ్ ఇండియన్ లిటరేచర్ అసోసియేషన్' వివిధ భారతీయ భాషల మధ్య సామ్యాలను నిర్మాణాత్మకంగా, తులనాత్మక దృష్టితో అధ్యయనం చేసి 'ఇండియన్ లిటరేచర్' అన్న అంశాన్ని ఒక 'అకడమిక్ డిసిప్లిన్'గా రూపొందించడం, ఆ నేపథ్యంలో విశ్వవిద్యాలయాల్లోని సారస్వత విభాగాలు ఆధునీకరించడం తమ ప్రధాన లక్ష్యాలుగా ప్రకటించింది"[3]

తులనాత్మక అధ్యయన ప్రయోజనాన్ని గురించి ఈ విధంగా చెప్పడం జరిగింది. "comparative literature is a discipline

---

1. అనుసంధాన్‌కీ ప్రక్రియా, విషయ నిర్వాచన్ - ఆచార్య నందదులార్ వాజ్‌పేయ్., పు: 75,76
2. తులనాత్మక సాహిత్య అధ్యయన వికాసం - తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక, పు: 14.
2. పైదే., పు: 15,16.

dedicated to the study of literature without national and linguistic barriers"[1]

శ్రీమతి మహాదేవివర్మ తులనాత్మక పరిశీలన ప్రాశస్త్యాన్ని వివరిస్తూ 'అపరిచయ జనితాలయిన సందేహాలూ, అవిశ్వాసాలూ అర్థపరిచయ జనితాలయిన భ్రమలూ, మన సాంస్కృతిక గగనాన్ని ఆవరించుకొంటున్నాయి. రాజకీయ పార్టీల తలపోటీలు మనజీవితాలలోని సహజ సహానుభూతిని ఎండగట్టి వాటిని తరళ జల రహితమయి ఎండిపోయి, మట్టికొట్టుకొని పోతున్న నదీగర్భం వలె రసరహితంగా చేస్తున్నాయి. ..... తలపుల్లో ఔదార్యాన్ని నింపి హృదయాలతో శోధించి, జీవితంలో సామంజస్యాన్ని సంవేదనశీలాన్ని కలిగించడానికి అనేకత్వంలో నిక్షిప్తమయిన ఏకత్వాన్ని నిరూపించడానికి మళ్ళీ ఆచార్య పుంగవులు, సాధుమహా పురుషులు కావాలి. అలనాడు వారు చేసిన కృషి ఈ రోజున మనం తులనాత్మక పరిశీలన ఆదాన ప్రదానం ద్వారా సాధించాలి"[2] అని చెప్పారు.

## తులనాత్మక అధ్యయన ప్రయోజనాలు :

1. విభిన్న ప్రాదేశిక సాహిత్యాలలో కనిపించే సామ్యాలను, వైషమ్యాలను నిరూపించి, విభిన్న ప్రాంతాల్లో నివసించే ప్రజల మధ్య పరస్పర సాంస్కృతిక సంబంధం ఉందని పరిశీలించి, ఆ సాహిత్యాలలో అంతర్భూతమై ఉన్న భారత దేశ సాంస్కృతిక ఏకత్వాన్ని నిరూపించడంలో తోడ్పడుతుంది.

---

1. comparative Indian Literature some prospectives - Indranath chaudhari., P: 9

2. తెలుగులో పరిశోధన - భీమసేన నిర్మల్., పు: 318.

2. సమాన తత్వాలను , భిన్న దృక్పథాలను పరిశీలిస్తూనే తులనాత్మక పరిశీలన మానవ జాతిలో గల సమైక్యతను నిరూపిస్తుంది. భాషాగతం గాక భావగత మయిన ఏకరూపతను ప్రతిపాదిస్తూ సమస్త మానవ జాతిలో ఏకత్వ భావాన్ని పెంపొందింప జేస్తుంది.

3. మానవ భావాలలో గల సమైక్యతను తులనాత్మక పరిశీలన ద్వారా అభివ్యక్తీకరించి సోదాహరణంగా తర్క యుక్త ప్రణాళికతో భావ సమైక్యత పెంపొందించి, తద్వారా జాతీయ సమైక్యత సాధించడం.

4. తులనాత్మక అధ్యయనం, భిన్న భాషలు మాట్లాడే ప్రజలు పరస్పరం దగ్గర కావడానికి ఎంతగానో ఉపకరించ గలదు. భిన్న భాషల సాహిత్య, సాంస్కృతిక సంప్రదాయాలను క్షుణ్ణంగా తెలుసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది.

5. సాహిత్య పరంగా నిరూపించ గలగడమే గాక జాతి వైవిధ్యంలోని ఏకీభావాన్ని ఎత్తి చూపించి, సమస్త మానవ సౌహార్ద్ర భావానికి పునాదులు వేయడం.

6. ఏదో ఒక సాహిత్య ప్రక్రియను ఆధారంగా చేసుకొని రెండుగాని, అంత కంటె ఎక్కువ సాహిత్యాలను గాని పరిశీలించడం వల్ల పరస్పర భావ వినిమయం జరిగి మానవుని ఆలోచనా పరిధి విస్తృత మవుతుంది. మనం ఇతరుల కంటె ఏ విషయంలో ముందున్నామో, ఎంత వెనకబడి ఉన్నామో అనే విషయం దృగ్గోచర మౌతుంది. అనవసరమైన భాషా దురభిమానాలు పెరిగిపోయి మాతృ భాషేతర సాహిత్యం పట్ల సదవగాహనతో కూడిన సహృదయత అలవడి ఉత్తరోత్తర జాతీయ సమైక్యత బలపడుతుంది. చివరికి భారతీయాత్మ ఒక్కటే

అనే అంతిమ సత్యం మనకళ్ళముందు భాసించి, తద్వారా అంతర్జాతీయత వంటి విశాల దృక్పథ భావాలు వ్యాపించి సాహితీ పిపాసు లందరూ మరింత సన్నిహితులయ్యే అవకాశం ఏర్పడుతుంది. 'oneness of human race' అవగాహనకు వస్తుంది.

ఈ విషయాన్ని బలపరుస్తూ 1945లో ఒక కవుల సమావేశంలో "ఈనాడు అన్ని భారతీయ భాషల్లో విజ్ఞానులు, జిజ్ఞాసువులు వివిధ భాషల సంస్కృతులు, ఆచార సంప్రదాయాలు పరస్పరం విదితం కాకపోయినట్లయితే ఈ విశాల భారతీయ చరిత్ర సంస్కృతులు ఎప్పటికీ సంకుచితంగా ఉండిపోతా యనీ, అందుచేత చారిత్రక, సాంస్కృతిక అన్యోన్యత మన ఆధునిక కర్తవ్యం అని అర్థం చేసుకొన్నారు."[1]

ప్రస్తుత తులనాత్మక పరిశోధనా కార్యక్రమం, విదేశాల్లోనూ భారత దేశం లోనూ విస్తృత ప్రాతిపదికపై జరుగుతున్నది. తులనాత్మక అధ్యయనం భారతీయ భాషా విభాగాల్లో క్రమంగా ఒక ప్రత్యేక స్వతంత్ర విభాగం (Independent discipline)గా రూపు దిద్దు కొంటున్నది.

1. యుగకవి-శేషేంద్ర — శ్రీ అక్బర్ హసన్ (సుప్రసిద్ధ ఉర్దూ విమర్శకులు), పు: 209

అధ్యాయం : 2

# అడివి బాపిరాజు - బృందావన్ లాల్ వర్మల జీవితం వ్యక్తిత్వం - తులన

2.0. ప్రవేశిక : "సాహిత్యకారుని కృతిత్వ వ్యక్తిత్వాలు పరస్పర సాపేక్షాలు. సాహిత్యంలో రచయితకు సంబంధించిన సంపూర్ణమైన వ్యక్తిత్వం, అంటే అతని అనుభూతి, కల్పన, ఆలోచన, సృజనాత్మకత మొదలైనవన్నీ స్పష్టం అవుతాయి. దీనికి సాహిత్య రచనల్లో మహత్తరమైన స్థానం వుంది. అనేక విధాలైన మంచి చెడ్డలకు సంబంధించిన పరంపరలు, సంస్కారాలు, ఆలోచనా ధోరణులు, విభిన్నాలైన పరిస్థితులు సాహిత్యకారుని వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడుతాయి. అతని వ్యక్తిత్వం అతని రచనల్లో ప్రతిబింబిస్తుంది. అందుకే ఒకానొక సాహిత్యకారుని రచనల్ని అధ్యయనం చేసేముందు అతని నిజ జీవితం, మానసిక పరిస్థితి, స్వభావం మొదలైన వాటిని తప్పనిసరిగా తెలుసుకోవలసిన అవసరం ఎంతేని ఉంటుంది."[1]

"వ్యక్తి సమాజానికి ఒక అంగం వంటి వాడు. సమాజమనే శరీరంతో అతని సంబంధం శరీరానికి శరీరాంగాలకు గల సంబంధం వంటిది. వ్యక్తి సమాజంలో కలసి ఉన్నప్పుడే అతని మానసిక వికాసానికి అవకాశం ఉంటుంది. సమాజ సహకారం చేతనే అతనిలో ఆలోచనా పద్ధతి వికసించి దృఢం అవుతుంది. సాంఘిక, ఆచారాల ప్రభావం నలువైపుల ఉన్న పరిస్థితులు ఇందుకు సహకరిస్తాయి."

బృందావన్ లాల్ వర్మా కా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్, పృ.67
:దే పృ.68

అందువల్లనే అడివి బాపిరాజు, బృందావన్ లాల్ వర్మల చారిత్రక నవలల పరిశీలనకు ముందు వారి వ్యక్తి కృతిత్వాలకు సంబంధించిన వైశిష్ట్యాన్ని తెలుసుకోవడం అత్యవసరం మాత్రమే గాక అనివార్యం కూడ.

బహుముఖ ప్రజ్ఞాశాలి యైన అడివి బాపిరాజు గారు తన జీవితాన్ని సాహిత్య సరస్వతీ సమారాధనకు అర్పించిన వారు. భావ కవిత్వం **ప్రబలంగా ఉన్నదినాల్లో** సుమధుర సుకుమార శైలిలో గ్రంథరచన కావించిన సాహిత్యస్రష్ట బాపిరాజు గారు. ఆయన రచయితయే కాకుండా చిత్రలేఖకుడు, గాయకుడు, విమర్శకుడు, శశికళోపాసకుడు. చారిత్రకమైన ఒక మహా యుగానికి సజీవ ప్రతీకయనదగిన దేశభక్తుడు. మానవ మాత్రులలో సుకుమార మనస్వి అనదగిన ఆదర్శమూర్తి. తన హృదయాన్ని వేయితంత్రుల వీణగా మలచుకొనిన సంగీత, సాహిత్య సార్వభౌముడు. ఈ సందర్భంలో 'వి.వి. తోంపే' గారి మాటలు స్మరణీయాలు.[1] "Life is a mixed game for Bapi Raju" తన జీవితాన్ని సాహిత్య తపస్సులో పండించుకొన్న బాపిరాజు గారి జీవితాన్ని గురించి, వ్యక్తిత్వాన్ని గురించి సాహిత్య పఠితలందరూ తెలుసుకోవాల్సిన అవసరముంది.

**2.1.1. జననం :** అడివి బాపిరాజు గారు మన్మథనామ సంవత్సరం (1895) ఆశ్వయుజ బహుళ పంచమి రాత్రి అక్టోబరు 8వ తారీఖున, భీమవరానికి 11 మైళ్ల దూరంలోనున్న 'సరిపల్లె' గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రిపేరు కృష్ణయ్య. తల్లిపేరు

1. 'Adivi Bapiraju's life dedicated to art'
The Indian Express - Sunday standard
V.V. Tonpe. August 11th, 1963. P:12.

సుబ్బమ్మ. బాపిరాజుగారు ద్వితీయ సంతానం. ఆయనకు ఒక అక్క, ఒక తమ్ముడు, నలుగురు చెల్లెళ్ళు. కృష్ణయ్యగారు రసవత్తరమైన కథలను చెప్పడంలో ప్రజ్ఞాశాలి. సుబ్బమ్మగారు అమలిన మధుర హృదయ. తల్లి దండ్రుల లోని సుగుణాలన్నీ బాపిరాజు గారు పుణికి పుచ్చుకొని జన్మించారు.[1]

2.1.2. **విద్యాభ్యాసం:** అడివి బాపిరాజు 1903వ సంవత్సరం కొవ్వూరు, ఆదినారాయణరావు గారి వీధిబడిలో ప్రాథమిక విద్య అభ్యసించారు. నాల్గవ తరగతి వరకు అక్కడే చదివారు. ఆ తర్వాత భీమవరం దగ్గర నర్సాపురంలో ఫస్ట్ ఫారమ్ వరకు చదివారు. 1911-1914 మధ్యకాలంలో ఐదవ, ఆరవ ఫారాలు పాసయ్యారు. 1917 లో ఇంటర్ రాజమండ్రి కాలేజీలో చదివారు. అప్పుడు ఆ కాలేజీ ప్రిన్సిపాల్ గారైన 'ఆస్వాల్డ్ కూల్డ్రే' గారు బాపిరాజు గారిలో నిద్రాణమై ఉన్న కవితను, చిత్రకళను గుర్తించి మేల్కొలిపారు. 'కూల్డ్రే' గారు కూడ కవి, చిత్రకారులు. అందుకే బాపిరాజు గారిలో గల కళలను గుర్తించ గలిగారు. తరువాత బాపిరాజు గారు 'రాజమండ్రి'లో B.A పూర్తి చేసారు. అటు పిమ్మట 'మదరాసు'లో 'లా' కాలేజీలో చేరి న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేసి బి.యల్ పట్టా పుచ్చుకున్నారు. ఇంతటితో ఆయన విద్యార్థి జీవితం పూర్తిం అయినప్పటికి, నిరంతరం గ్రంథ పఠనం చేస్తూ నిత్య విద్యార్థిగనే

1. కులపతి - ప్రత్యేక సంచిక 'అడివి వారి చిన్నోడు' పు: 19.

యావజ్జీవితం గడిపారు. 1924 సం॥లో ఆయన బందరులోని ఆంధ్ర జాతీయ కళాశాలలో చేరి ప్రమోదకుమార్ చటర్జీవద్ద చిత్రకళా శిక్షణ పొందారు.

2.1.3. **ఉద్యోగ జీవితం :** బాపిరాజు గారు బి.ఏ. పూర్తయ్యాక కొంతకాలం బోర్డు స్కూల్లో ఉపాధ్యాయుడుగా పనిచేశారు. కొన్నాళ్ళకు న్యాయవాదిగా భీమవరంలో ప్రాక్టీసు ప్రారంభించారు. కాని, ఆ న్యాయవాద వృత్తిలోని మోసాల్ని, అవకతవకల్ని భరించలేక పోయారు అంతే గాక న్యాయవాద వృత్తి తన కళా జీవితానికి అడ్డుగా నిలుస్తుందని కూడ భావించారు. ఆ కారణంగా న్యాయవాద వృత్తి వదిలేశారు. తర్వాత బాపిరాజు గారు ఉద్యోగం కోసం చాలా శ్రమపడ్డారు. తిరుపతిలో ఉద్యోగం వస్తుందని, అక్కడే అందరూ కలసి స్వామి సన్నిధిలో ఉండవచ్చుని ఆశపడ్డారు. కాని ఆయనకు తిరుపతిలో ఉద్యోగం రాలేదు. డబ్బు కావాలనుకున్నప్పుడు రేడియోలో 'ఎంగేజిమెంట్లు' సంపాదించో, లేదా కథలు వ్రాసో అప్పటికప్పుడు డబ్బు సంపాదించేవారు. ఒకసారి ఉద్యోగ ప్రయత్నానికై మద్రాసు వెళుతూ భీమవరం రైల్వే స్టేషనులో అతని మిత్రుడు గూడూరు-నమశ్శివాయ గారితో "ధన్వంతరి గారూ! మద్రాసు పోతున్నాను ఏదైనా ఉద్యోగం చూసుకోవాలి. మద్రాసులో ఉద్యోగానికి ప్రయత్నం చేస్తా. ఏదీ దొరక్క పోతే రిక్షా అన్నా లాగుతా. అదీ దుర్లభమకుకుంటే కూం నదిలో పడి ప్రాణాలు తీసికొంటాను"[1] అని ఎంతో బాధగా అన్నారు.

---

1. భరత నాట్యాల బావ మా బాపిబావ - గూడూరు నమశ్శివాయ (అముద్రితం)

1935 వ సంవత్సరంలో బాపిరాజు గారు ఆంధ్ర జాతీయ కళాశాల ఆహ్వానం మేరకు కులపతిగా వెళ్లారు. ఆ కళాశాలలో భారతీయ చిత్రలేఖన శాఖను నెలకొల్పారు. ఆ సమయంలోనే కళా దర్శకునిగా సినీ ప్రపంచంలోకి అడుగు పెట్టారు. 'సతీ అనసూయ', 'ధ్రువ విజయం' అన్న చిత్రాలకు ప్రథమాంధ్ర కళా దర్శకులుగా బాపిరాజు గారు అవతరించారు. సినిమా రంగంలోకి అడుగుపెట్టడం వల్ల జాతీయ కళాశాలలో కులపతి పదవికి సంపూర్ణ న్యాయం చేకూర్చ లేదని అపవాదు వచ్చింది. అది భరించలేక ఆ పదవికి రాజీనామా చేశారు. 1915 లో మచిలీపట్నం నుండి వెలువడే 'త్రివేది' అన్న ఆంగ్ల పత్రికకు సహాయ సంపాదకుడుగా పని చేశారు. 1943 లో 'మీజాన్' పత్రిక ప్రొప్రైటర్ గులాం మహమ్మద్ గారు బాపిరాజు గారిని పిలిచి "రాజుగారూ 'మీజాన్' పత్రికను తెలుగులోనికి తీసుకు రావాలనుకున్నాము. మీరే ఆ పత్రికకు సంపాదకులు" అన్నారట. బాపిరాజు గారు అంగీకరించారు. బాపిరాజు గారు 'మీజాన్' పత్రికా సంపాదకునిగా గడిపిన దినాలు సువర్ణాక్షరాలతో లిఖింపదగినవి. వారి 'అడవి శాంతిశ్రీ', 'తుఫాను', 'కోనంగి', 'గోనగన్నారెడ్డి' నవలలు 'మీజాన్' పత్రికలో ధారావాహికంగా వెలువడ్డాయి. కొన్ని సంవత్సరాల తర్వాత ఆ పత్రిక వ్యవస్థాపకుడు కాంగ్రెసుకు విరుద్ధంగా సంపాదకీయం వ్రాయమనడం తోను, రజాకార్ల ఉద్యమం విపరీతంగా చెలరేగడం తోనూ బాపిరాజు గారు

'మీజాన్' పత్రిక సంపాదకత్వానికి రాజీనామా ఇచ్చారు.

అటు తర్వాత బాపిరాజు గారు చిన్న చిన్న ఉద్యోగాలు చాలా చేశారు. విజయవాడ రేడియోస్టేషను వారికి సలహాదారునిగా పనిచేశారు. చిత్రకారునిగా కూడా పనిచేశారు. ఈ రకంగా సాహిత్య సేవ చేస్తూ భుక్తి గడువడం కోసం, తన రోగిష్టి భార్య మందుల కోసం, కుంటి కూతురి కాళ్ళు రప్పించడం కోసం డబ్బు సంపాదించాలని ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని చివరి రోజుల వరకు ఆయన డబ్బుకు ఇబ్బంది పడుతూనే ఉన్నారు. చివరి రోజుల్లో డబ్బు ఇబ్బందులు తీరి చక్రవర్తికి జరిగినంత వైభవంగా జరిగింది రాజుగారి జీవితం. కాని ఇలా ఎక్కువ కాలం కొనసాగలేదు. ఆయన ఆరోగ్యం బాగులేక ఆస్పత్రిలో చేరి 1952 సెప్టెంబరు 22వ తేదీన పరమపదించారు.

**2.1.4. వివాహం:** బాపిరాజు గారికి విద్యార్థి దశలోనే అనగా బి.ఏ. రెండవ సంవత్సరం చదువుతున్నప్పుడే వివాహం అయింది. ఆయన భార్య పేరు సుభద్ర. వివాహ జీవితంలో బాపిరాజు గారికి ఎన్నో ఎదురుదెబ్బలు తగిలాయి. బాపిరాజు గారికి మూడు సార్లు పుత్ర వియోగం సంభవించింది. బాపిరాజు గారికి పిల్లలంటే చాలా ఇష్టం. ఈ పుత్రుల వియోగం ఆయన్ని ఎంతో కృంగదీసింది. తర్వాత 1931లో ఆయనకు కూతురు జన్మించింది కాని 10 నెలల వయస్సులోనే

పిల్లగా తన కళ్ళ ముందు ఉండడం ఆ తల్లి తట్టుకోలేక పోయింది. ఆమెకు 'హిస్టీరియా' లాంటి నరాల జబ్బు ప్రారంభమైంది. ఆ పరిస్థితుల్లో మరో కుమార్తె జన్మించింది. ఆమెకు ప్రేమకుమారి అని పేరుపెట్టారు. బాపిరాజు భార్యకు భర్తపట్ల ఎనలేని అభిమానంతో పాటు అనుమానం కూడా ఉండేది. ఇన్ని బాధలున్నా రాజుగారు తన బాధలను పిల్లలకు తెలియనిచ్చేవారు కాదు. ఆయన అల్ప సంతోషి. ఒక చిన్న పొగడ్తకి పొంగిపోయేవారు. బాపిరాజుగారు డబ్బు సంపాదించాలని ఎంతగానో ప్రయత్నించేవారు. ఆ డబ్బుతో తన భార్య జబ్బుని బాగుచేయించాలని, తన కూతురును అమెరికా తీసికెళ్ళి ఆమె కాళ్ళు బాగుచేయించాలనీ తపన పడేవారు. కాని సుభద్రమ్మ నిరుత్సాహకరమైన మాటలు ఆయన్ని క్రుంగదీసేవి. కొంతమంది స్నేహితులను కొన్నవారు ఆయన్ని మోసం చేశారు. చివరకు తమ్ముడు సత్యనారాయణ కూడ బాపిరాజుగారిని మోసం చేశారని కొందరంటారు. కాని బాపిరాజుగారు ఎవరినీ ద్వేషించలేదు.

**2.1.5. మాతృభూమిపై ప్రేమ:** భరత మాతకు ముద్దుబిడ్డయైన బాపిరాజుగారికి మాతృదేశమంటే ఎనలేని ప్రేమ. ఉద్యోగం లేక అల్లాడుతున్న సమయంలో బాపిరాజుగారి గురువు, అత్యంత ఆప్తులు అయిన కూల్డ్రే దొరగారు "మంచి కళాదృష్టి, ప్రజ్ఞ ఉన్న నీవు ఈ దేశంలో రాణించలేవు. నేను మాదేశం చేరుకొనే కాలం సమీపిస్తోంది. కాబట్టి న్ను

భూత్వాని

సిఫారసు చేసి నీకు ఉన్నత పదవి ఇప్పించగలను. నీవు నాతో తప్పక రావాలి"[1] అని అన్నారట. ఈ మాటలు వినడంతోనే దేశభక్తి, జాతీయాభిమానం బాపిరాజు గారిలో ఒక్కుమ్మడిగా పెల్లుబికింది. "నా దృష్టిలో మీరు భగవంతునికి తేడాలేదు. మీ శిష్యుడుగా మీరు ఏది చేయమంటే అది గౌరవంతో చేస్తాను. అయితే బానిస తనంలో బ్రతుకుతున్న నా జాతిని, నా దేశాన్ని విడిచి ఇంగ్లాండువచ్చి నేనొక్కడినే అక్కడ సుఖపడలేను. కష్టమైనా, సుఖమైనా నా జాతితో కలసి నా మాతృదేశంలోనే అనుభవిస్తాను"[2] అని తక్షణమే తన అనంగీకారాన్ని తెలియజేశారట బాపిరాజు గారు. ఈ అవకాశమే మరొకరికి లభిస్తే స్వదేశాన్ని వదలి, రెక్కలు గట్టుకొని కూర్త్రేని అనుసరించి ఉండేవారు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అని విశ్వసించిన వారు బాపిరాజు గారు.

బాపిరాజు గారు గాంధీగారి శిష్యులు. ఆయన అడుగు జాడలు అనుసరించి పోవడమే ఆయన ధ్యేయం. జీవితాంతం ఖద్దరునే ధరించారు. గాంధీజీపై ప్రేమతో తన మూడవ కుమారునికి 'గాంధీకృష్ణ' అన్న పేరు పెట్టుకొన్నారు. ఆయన భారతదేశ స్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహ ఉద్యమాల్లో పాల్గొని జైలుకు కూడా వెళ్ళిన దేశభక్తుడు. "రాజమండ్రి జైలులో ఉండగా ఒకనాడు వీరి శ్రీమతి బంధువులతో

---

1. 'శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యాను శీలనము' – డా॥ మన్నవ సత్యనారాయణ., పు: 29.
2. పైదే.

కలసి వీరిని చూడడానికి రాగా, ఆమెతో ఒక్క మాటైనా మాట్లాడ లేదట. కారణం ఆమె వస్త్రాలు ధరించడం ఆయనకు ఎం బాధను కల్గించడమే"

"ఆచారాన్ని మంటగలుపుతున్నావని పెద్దలు పోరుపెడుతున్నా వినక హరిజనుల్ని ఇంటిలోకి తీసుకొని వచ్చి తరచు భోజనం పెట్టి పంపుతూ ఉండేవారు. బాపిరాజుగారు బందరులో ఉంటున్నప్పుడు ఒకసారి హరిజనులందరికీ జాతీయ కళాశాలలో భోజనాలు ఏర్పాటు చేశారు. హరిజనులందరూ భోజనం పూర్తి చేసి, ఎవరికి వారు లేచి వెళ్ళిపోయారు. వారి విస్తళ్లు ఎవరు తీస్తారన్నది విందు ఏర్పాటు చేసిన వారికి ఒక సమస్య కాగా, బాపిరాజుగారు జోక్యం చేసుకొని 'ఆ విస్తళ్ళన్నీ నేనే తీస్తాను' అని ముందుకు వచ్చి ఆ ప్రాంతాన్ని శుభ్రం చేశారు. ఇది నిజమైన గాంధేయత."[2]

బాపిరాజు గారికి తను పుట్టిన తెలుగు గడ్డ అన్నా, తెలుగు వారన్నా ఎనలేని అభిమానం. పూర్వ ఆంధ్రుల వైభవాన్ని ప్రపంచానికి చాటడానికి ఆయన చారిత్రక నవలలు ఎంతో శ్రమించి రాసి, ఆంధ్రాభిమానాన్ని తీర్చుకొన్నారు. "మానవ సభ్యతకు భారత సభ్యతయే గురువనియు, భారతీయ సంస్కృతి హారమున ఆంధ్ర సంస్కృతి నాయకమణి యనియు నాతని మతము" అన్న కాటూరి వారి

1. శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యానుశీలనం - డా॥ ముప్పవ సత్యనారాయణ పు: 29
2. పైదే., పు: 30
3. సాహిత్య దర్శనం - వ్యాసావళి - మా బాపిరాజు. కాటూరి వేంకటేశ్వరరావు ఆగష్టు - 1967

మాటల వల్ల బాపిరాజు గారి ఎనలేని దేశభక్తి, ఆంధ్రాభిమానం వ్యక్తమవుతోంది.

'మీజాన్' పత్రిక సంపాదకునిగా బాధ్యతలు స్వీకరిస్తున్నప్పుడు, భారతీయులను కించపరుస్తూ, ఆంగ్లేయులకు అనుకూలంగా ఏనాడూ వ్రాయను అని మాట తీసుకున్న తర్వాతే పత్రికా సంపాదకునిగా అంగీకరించారు. సింగరాజు లింగమూర్తిగారు బాపిరాజు గారి దేశాభిమానాన్ని గురించి ముచ్చటిస్తూ "మహమ్మదీయ వ్యవస్థాపకుని వద్ద పని చేస్తున్నా బాపిరాజు గారు ఎప్పుడూ ఆత్మాభిమానాన్ని, ఆత్మ స్వాతంత్ర్యాన్ని కోల్పోలేదు. ఇంగ్లీషు పత్రికలకు వ్రాయబడిన సంపాదకీయాల్నే తెలుగు పత్రికకు అనువదించవలసి ఉండేది. మొదట్లో రాజుగారు అందుకు అంగీకరించినా, అది ఎప్పటికైనా దేశ స్వాతంత్ర్యానికి భంగకరమని భావించి, తెలుగు పత్రికకు ప్రత్యేక సంపాదకీయాలు వ్రాసుకుంటానని వ్యవస్థాపకుని కోరాడు."[1] విధిలేక ఆ మహమ్మదీయ వ్యవస్థాపకుడు బాపిరాజు గారి ప్రతిపాదనను అంగీకరించాడు. కాని కొన్నాళ్ళ తర్వాత కాంగ్రెసుకు, భారత దేశానికి విరుద్ధంగా సంపాదకీయం రాయమనడంతోనూ, రజాకార్ల ఉద్యమం చెలరేగడంతోనూ, 'మీజాన్' పత్రికకు రాజీనామా చేసి మాతృభూమిపై ప్రేమను చాటుకున్నారు.

**2.1.6. అభిరుచి:** బాపిరాజు గారు రోహిణీ నక్షత్ర జాతకులు

1. 'సాహిత్య దర్శనం' వ్యాసావళి - మా బాపిరాజు. పు: 49.
కాటూరి వేంకటేశ్వర రావు.

కావడం వల్ల వెన్నెలనెక్కువగా ప్రేమించే వారు. 'శశికళ' ఆయన ఊహాసుందరి. ఆయన కవిత్వానికి కేంద్రం 'శశికళ'. బాపిరాజుకు శారద రాత్రుల్లో గోదావరీ తీరపు ఇసుక తిన్నెల్లో తరళ చంద్రికా రేఖయై ఆమె దర్శన మిచ్చింది. ఇలా తనపై వాలిన వెన్నెల వెలుగుకు 'శశికళ' అని పేరుపెట్టుకొని ఆమెను ఆరాధించారు. ఈ శశికళా దర్శనాన్ని బాపిరాజు గారే స్వయంగా ఇలా చెప్పుకొచ్చారు.

" జల జల సాగే వాగుమధ్యను, శిలాతల్పం పవ్వళించి, కలలు కంటూ నిదుర పోతిని, నిదుర పోయే నాపై వాలితివే, నాపై వాలిన నిన్ను చూచి గురువు కూర్మి చిత్రం లిఖియించె 'ఎండిమియాన'ని చిత్రం పేరుంచె"[1]

బాపిరాజు గారికి తన ఊహాసుందరి 'శశికళ' అంటే అభిరుచి మెండు. అందుకే ఆయన శశికళపై చాలా గేయాలు రాశారు. ఆ గేయాల్లో పాషాణాలకు ప్రాణం పోయగల జీవశక్తి దర్శన మిస్తుంది.

" కూర్మి మహాశయుడు బాపిరాజు గారిని వెంటబెట్టుకొని భారతదేశంలోని చారిత్రక సుప్రసిద్ధ స్థలాల్ని, పుణ్యక్షేత్రాల్ని సందర్శించారు. అంతే గాక వారిద్దరూ కలసి ప్రకృతి రామణీయకాన్ని వీక్షిస్తూ కొండల్లో కోనల్లో, వెన్నెల రాత్రుల్లో విహరించారు. సంధ్యా సమయాల్లో గోదావరీ నదిలో ఈదే వారు."[2] గలగల పారే నదిలో ఈతకొట్టడమంటే

---

1. చుక్కాని - శశికళా స్వరూపం 1.10.62., కాటూరి వేంకటేశ్వర రావు.

2. శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యాను శీలనము., డా॥ మన్నవ సత్యనారాయణ. పు:5.

బాపిరాజు గారికి ఎంతో సరదా....

బాపిరాజు గారు కేవలం నవలాకారులే గాక గేయకారులు కూడ. చక్కగా పాటలు పాడి సభను రంజింప చేయగలరు. మంచి వక్త. గంటల తరబడి చతురోక్తులతో భాషించి సభను మెప్పించగలరు. సాహిత్య గోష్ఠి కార్యక్రమాల్లో, పరిషత్తుల్లో ఆయన లేకుంటే సభ చిన్నబోయి నట్లుండేది. మంచి వక్తే గాక చక్కని చిత్రకారులు. వీరు చాక చక్యంతో చిత్రాలు గీయడమే గాక చిత్రలేఖన కళకు సంబంధించిన అనేక గ్రంథాల్ని చదివి అమరావతి, అజంతా, ఎల్లోరా వంటి ప్రదేశాలు పర్యటించి ప్రాచీన శిల్ప సౌందర్య వైశిష్ట్యాల్ని అవగాహన చేసుకొని, చిత్రకళా పరిజ్ఞానాన్ని సమృద్ధిగా సంపాదించారు. చిత్రకారులే గాక ప్రథమాంధ్ర చిత్ర కళా దర్శకులు. సతీ అనసూయ, ధ్రువ విజయం వీరు కళా వహించిన మొదటి చిత్రాలు. చిత్ర దర్శకులే గాక పత్రికా సంపాదకులు. 'మీజాన్' తెలుగు పత్రికకు మూడేండ్లు (1943 నుండి 46) సంపాదకులుగా పని చేశారు. వీరి సంపాదకత్వంలో పాఠకుల సంఖ్య పెరిగి, పత్రిక హెచ్చు సంఖ్యలో వివిధ ప్రాంతాలకు విస్తరించింది. బహుముఖ ప్రజ్ఞా శాలియైన బాపిరాజు గారికి పై రంగాలన్నింటిలో ప్రవేశము, అభిరుచి ఉన్నాయి. బాపిరాజు గారు పాకశాస్త్ర ప్రవీణులు. ఆయన వంట చేస్తే ఎంతో రుచిగా ఉండేది. వంటను గురించి అనర్గళంగా ఉపన్యసించేవారు. ఉపాధ్యాయుడుగా పని చేసేటప్పుడు క్లాసులో కూడ గుత్తి వంకాయి కూరను గురించి గంటల తరబడి చెప్పేవారు. సమావేశాల్లో కూడ ఆయన

గుత్తి వంకాయ కూరను గురించే చర్చ జరిగేది... బావగారూ అంటూ ప్రతి వారినీ ఆప్యాయంగా పలుకరిస్తూ, ఎంతటి కఠినులనైనా ఇట్టే స్నేహితులుగా చేసుకొనే వారు. బాపిరాజు గారు ఎప్పుడైనా స్నేహితుల ఇంటికి గాని, బంధువుల ఇంటికిగాని వెళ్తే వీధిలోనే నిల్చొని మాట్లాడక, ఏకంగా ఇంటిలోనికి పోయి, ఆ ఇంట్లో ఆడవాళ్ళను కూడా ఆప్యాయంగా, చనువుగా పలుకరించి వీలైతే వంటలో కూడా సహాయం చేసేవారు. వారిని చూసి ఏ యువతి కూడా సిగ్గు పడేది కాదు. అతని ఆత్మీయతకు అలవాటు పడి ఆప్యాయంగా పలుకరించేవారు.

ఇన్ని విషయాల్లో అభిరుచి, ఆసక్తిగల రాజు గారికి న్యాయ వాద వృత్తిపై అభిరుచి ఉందా? లేదా? అని ప్రశ్నించుకుంటే సమాధానం దొరకడం కష్టమే. ఇష్టం లేకపోతే ప్లీడరీ చదువు ఎందుకు చదువుతారు? అయితే వీరి వృత్తిలో ఒక్క సంవత్సర కాలం మాత్రమే కొనసాగి, న్యాయవాద వృత్తికి స్వస్తి చెప్పారు. ప్లీడరు వృత్తిని నిర్వహిస్తున్న రోజుల్లో కూడ బాపిరాజు గారు కోర్టుకువెళ్ళి తన వాదనను కొన సాగించిన సంఘటనలు చాలా తక్కువ. "కర్మము చాలక యెవ్వరేని వకాలతు నిచ్చి, వాయిదా నాటికి తెంచి తను ఆఫీసు దగ్గర - ఆఫీసనుమన దొకటి యుండిననే సుమీ? వచ్చి కూర్చున్నచో లాయరు గారెచట నుండెడి వారు? ముష్టి నారాయణ తోటలో పుష్పజాతుల గూర్చి యానుపూర్వకముగా నద్భుతమైన ప్రసంగము చేయుచుండును. ఎటులో అటునుండి పట్టితెచ్చి కోటునూ, పాగాను తెచ్చి తగిలించి

కోర్టులో కూరుచుండ బెట్టినచో, ఆ ముసిముసినవ్వులు, ఆ వాలకము జూచి ప్రతిపక్ష వకీలే ముందుగా వాయిదా కోరెడివాడు. సబ్ జడ్జి మాత్రమేమి చేయగలడు? కోర్టు మాట మరచిపోయి, 'ఏమండీ! బాపిరాజుగారూ! ఎంతవరకు వచ్చింది మీ నవల?' అనుచు కుశల ప్రశ్న మొనర్ప వలసినదే"[1]

బాపిరాజుగారు ప్లీడరు వృత్తిని నిర్వహించలేక పోవడానికి ఆయన అసమర్థత ఎంత మాత్రం కారణం కాదు. ఎంతటి జటిల విషయమైనా సోదాహరణతో గంటల తరబడి ఉపన్యసించగల వక్తకు కోర్టులో వాదించడం ఏమంత కష్టమైన పనికాదు. అయితే మరి ఈ వృత్తిని ఎందుకు విడిచినట్లు? "బాపిరాజుగారి హృదయం మృదువైనది. ఆయనకు అసత్య భీతి ఎక్కువ. అంతేగాక వీరు కవిత్వ, చిత్రలేఖనాదుల కంకితమైన వ్యక్తి. రచయితగా, చిత్రకారుడుగా మంచి కీర్తి ప్రతిష్ఠల నార్జింపదలచిన బాపిరాజుగారికి ఈ వృత్తి ప్రతిబంధక మనిపించింది. అంతేగాక గాంధేయ వాదియైన బాపిరాజుగారికి బ్రిటీష్ వారు కల్పించిన న్యాయవాద వృత్తిపట్ల అనాదరమేమో?"[2]

ఇన్ని రంగాలలో అభిరుచి, అభినివేశం కల్గిన బాపిరాజుగారికి చిన్నప్పట్నుంచి పఠనాసక్తి ఎక్కువ. "చదువుకొనుటకో గ్రంథమున్న చాలును; ఆకలిదప్పులు, నితర తాపములు బాపిరాజు నంటవు.

---

1. సాహిత్య దర్శనం - వ్యాసావళి - 'మా బాపిరాజు' - కాటూరి వేంకటేశ్వరరావు, పు: 54,55.

2. శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యానుశీలనం - డా॥ మన్నవ సత్యనారాయణ పు: 10, 11.

నడిరేయి వేళకూడా గుడ్డి దీపపు వెలుగులో, వట్టి నేలపై సాగిలపడి గ్రంథ పఠన మొనర్చెడి వాడు"[1]

బాపిరాజు గారికి ఆంధ్రుల పట్ల, ఆంధ్రుల చరిత్ర పట్ల అపార గౌరవం. తెలుగు భాషను, సంస్కృతిని ప్రాణ సమానంగా అభిమానించే వారు. బాపిరాజు గారు ం ఆంధ్రాభిమాని మాత్రమే కాక జాతీయవాది, లలితకళా ప్రియుడు, గొప్ప సంఘ సంస్కర్త, భావుకుడు, దేశభక్తుడు, గాంధేయవాది, చరిత్రను రూపకల్పన చేసిన శిల్పి, సౌందర్యోపాసకుడు, కళా తపస్వి, చిత్రకారుడు, గేయకారుడు, త్యాగమూర్తి.

**2.1.7. ధార్మిక విశ్వాసం :** బాపిరాజు గారి జీవితాన్ని క్షుణ్ణంగా పరిశీలిస్తే దేవుని ఉపాసకుడుగా, మూఢ భక్తుడుగా ఎక్కడా ద్యోతకమవదు. కాని అక్కడక్కడ దైవచింతన, భగవంతునిపై విశ్వాసం వారి మాటల్లో కనబడుతూ ఉంటుంది. ఒకసారి తన కూతురైన రాధా వసంతం తో ఇలా అంటారు. " పాటలు రాయడం మానకు. కథలు, నవలలు ఎన్ని వ్రాసినా మనల భగవంతుని కడుకు క్షణ క్షణమూ కాని పోగల శక్తి పాటలకే ఉంది. అవి మన ఆత్మకు అమృత శుద్ధి ప్రసాదిస్తాయి. అవి మనలకు దివ్యానుభూతులు ప్రత్యక్షం చేయగలవు. ఆవుపాల తరచగా వచ్చిన వెన్నయే పాట. బ్రతుకు ఆవు. రసజ్ఞత ఆవుపాలు. కావ్యసృష్టి వెన్న. ఆ వెన్న బాలకృష్ణుని

---

1 సాహిత్యదర్శి

ప్రియ వస్తువు"

ఇంకా " విశ్వసాహిత్య రసజ్ఞునికి ఈ దేశమూ, ఈ భాషా అని లేదు. ఎక్కడ సౌందర్యం విలసిల్లుతుందో అక్కడ భగవంతుడున్నాడు. ఎక్కడ ఆనందం తాండవమాడుతుందో అదే శ్రీ నటరాజ తాండవం. ఎక్కడ ధర్మ హృదయము, పవిత్ర జీవితము ఉందో అదే సత్, విశ్వరహస్యం సత్యం, శివం, సుందరం అని మనుష్యుల జీవితాల్లో నిండితే సత్, చిత్, ఆనందం భాసిస్తాయి."[2] అని ఆధ్యాత్మిక ధోరణిలో సాగిపోతారు రాజుగారు. ఆయన అనేక మంది వలె నిరంతరమూ గుళ్ళూ, గోపురాలు చుట్టూ, వ్రతాలు, పూజలు, భజనలు చేస్తూ ఆడంబరాలకు పోలేదు. తన రచనలచే, తన మార్గంలోని మంచితనాన్నే భగవంతునిగా భావించారు. పైపై మెరుగుల బాహ్య ప్రవర్తన కంటె, చిత్తశుద్ధి కలిగిన వ్యక్తే గొప్ప ధార్మికుడు. అటువంటి కోవకు చెందిన వారు బాపిరాజు గారు.

ఒకసారి బాపిరాజుగారి రెండవ కూతురు ప్రేమకుమారికి జ్వరం వచ్చింది. బాపిరాజు గారు 'మృత్యుంజయుడు' చిత్రం వేసి ఉన్నారు. ఆ చిత్రాన్ని ఆమె తలకింద పెట్టి భగవంతుణ్ణి ప్రార్థించారు. ఈ మృత్యుంజయుడు చిత్రం గీశాకే ఆయనకు అదివరకున్న గుండె జబ్బు కూడ ఉపశమించిందట. అందుకే మానవశక్తికి మించిన దైవశక్తి

1. బాపిరాజు శాధావసంతంగారికి రాసిన ఉత్తరం. ఆధారం:అ.బాపిరాజు నవలలు - ఒక పరిశీలన (పరిశోధన గ్రంథం అముద్రితం) డా॥ డి. విజయలక్ష్మి .. పు:41.
2. పైదే.

ఒకటి మానవవృత్తి నడుపుతూ ఉంటుందని ఆయన నమ్మకం. "మానవ సేవయే మాధవసేవ అనే నమ్మకం గల బాపిరాజు గారు ఒక ప్రక్క సాహిత్య సేవ ద్వారా మానవసేవ చేస్తూ కూడ, మరొక ప్రక్క అడిగిన వారికి లేదనకుండా ఉన్నంతలో సహాయం చేసే ఉదార హృదయం వీరిది."[1] "1946 ప్రాంతంలో రైల్వే స్టేషన్‌లో బాపిరాజు శిష్యుడు పరుగెత్తు కొంటూ వచ్చి, 'నా భార్యకు చాలా జబ్బుగా ఉంది' అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ ఉంటే, బాపిరాజు గారు తన దగ్గరున్న డబ్బంతా ఇచ్చేశారు. గుంటూరులో బంధువుల ఇంటికి వెళ్ళడానికి జట్కాకు ఇచ్చేందుకు కూడా డబ్బులు లేక పోయాయి."[2]

2.1.8. **సాంఘిక జీవితం :** బాపిరాజు గారు గాంధేయ వాది. విదేశీ పాలనలో బానిసలుగా మగ్గుతున్న భారతీయుల దయనీయ మైన స్థితి బాపిరాజు గారి హృదయాన్ని కలచి వేసింది. గాంధీజీ బోధలు, సిద్ధాంతాలు వీరిని ఆకర్షించాయి. సహాయ నిరాకరణో ద్యమంలో పాల్గొని 1921 లో జైలుకు వెళ్ళారు. కూల్డ్రే దొరగారు విదేశాల్లో బాపిరాజు గారికి మంచి ఉద్యోగం ఇప్పిస్తాను రమ్మని పిలిపిస్తే జాతీయాభిమానంతో తిరస్కరించారు.

అడివి బాపిరాజు గారు 1943 నుండి 1946 వరకు 'మీజాన్' తెలుగు పత్రికకు సంపాదకులుగా ఉన్నప్పుడు సాంఘిక

---

1. శ్రీమతి టి. రాధా వసంతం - మహా మానవుడు మా నాన్న
త్రివేణి పత్రిక - జనవరి 1974, పు: 35,36.
2. అడివి బాపిరాజు గారి నవలల పరిశీలన (పరిశోధన గ్రంథం - అముద్రితం) డా|| టి.వి
పు: 43

దురాచారాలపై ఎన్నో సంపాదకీయాలు రాశారు. ఈయన 'మీజాన్' పత్రికలో 'ధూప దీపాలు' అనే శీర్షికతో ఎం హాస్యయుతంగా ఆ నాటి సంఘాన్ని దుయ్యబట్టారు. బాపిరాజు గారు చారిత్రక నవలలే గాక సాంఘిక నవలలు, కథానికలు, గేయాలు ఎన్నో రాశారు. వారు చారిత్రక నవలల్లో ప్రాచీనాంధ్ర వైభవం, సంఘ స్వరూపం గురించి చర్చిస్తే సాంఘిక నవలల్లో అర్వాచీన (ఆనాటి) సంఘ స్వరూపాన్ని గురించి, సంస్కరణాలు గురించి వివరించారు. జమీందారీ వ్యవస్థ, అంటరానితనం, స్వాతంత్ర్యం, స్త్రీ జనోద్ధరణ, వర్ణాంతర వివాహాలు మొదలైన సాంఘిక సమస్యలు వారి రచనల్లో చోటు చేసుకున్నాయి.

**2.1.9. రాజకీయ జీవితం :** 1921 లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినప్పుడు బాపిరాజు గారు కూడ కాంగ్రెసులో చేరారు. 1909 మింటో మార్లే సంస్కరణలు, 1919 'మాంటెగ్యూ చెమ్స్ ఫర్డ్' సంస్కరణలు మూలంగా ధనిక వర్గాలకు, పేదరైతులకు ఓటుహక్కు వచ్చి రాష్ట్రంలో ద్వంద్వ పరిపాలన ఏర్పడింది. ఈ ఎన్నికల్లో పాల్గొనకుండ రాజకీయ రంగానికి దూరంగా ఉండి, సాంఘిక కార్యక్రమాల్లో, నిర్మాణాత్మక కార్యక్రమాల్లో మాత్రం పాల్గొని దేశసేవ చేసే వారిని 'నో ఛేంజర్లు' అనే వారు. బాపిరాజు గారు కూడ నో ఛేంజర్ల' గ్రూపుకు చెందిన వారుగా భావించవచ్చు.

తర్వాత బాపిరాజు గారు గాంధీజీ ప్రారంభించిన

సత్యాగ్రహ ఉద్యమాల్లో పాల్గొన్నారు: జైలుకు కూడా వెళ్ళారు. ఆయన ఆరు మాసాలు రాజమండ్రి జైలులోను, ఆరు మాసాలు నెల్లూరు జైలులోను మొత్తం సంవత్సరం పాటు కారాగార శిక్ష అనుభవించారు. "నెల్లూరు జైలులో ప్రఖ్యాత తమిళకవి సుబ్రమణ్య భారతి లోగడ ఏ గదిలో అయితే జైలుశిక్ష అనుభవించారో బాపిరాజు గారు కూడ అదే గదిలో నిర్బంధింపబడి శిక్షననుభవించడం విశేషం"[1] గాంధేయవాది అయిన తర్వాత ఆయన జీవితాంతం ఖద్దరునే ధరించారు. జాతీయోద్యమ ప్రభావితులై ఎన్నో దేశభక్తి గీతాలు రాశారు. అంతేగాక గాంధీజీపై కూడ అభిమానంతో గేయాలు రాసి, వివిధ సభల్లో ఆ గేయాలు పాడుతూ మహాత్మునిపై తమకుగల మక్కువను వ్యక్తీకరించారు. "హిమాలయోత్తుంగ శిఖరం. నీ బ్రతుకు ఉమాపతీ నృత్యరంగం" అన్న గేయం ఆనాడు గొప్ప సంచలనాన్ని కలిగించిందట. జాతీయోద్యమ ప్రేరణతో బాపిరాజు గారు ఎన్నో గేయాలు రాశారు. ఇలా ఒక ప్రక్క క్షణం తీరిక లేకుండా ధారా ప్రవాహంగా రచనలు చేస్తూ, మరోప్రక్క భుక్తికోసం ఉద్యోగం వేటలో చెప్పులరిగేలా తిరుగుతూ కూడ, దేశమాత బానిస సంకెళ్ళు త్రెంచడానికి గాంధీగారు శంఖం పూరిస్తే ఆ నినాదం విని, దేశభక్తి పొంగి పొరలి చంద్రునికో నూలు పోగులా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, దేశ స్వాతంత్ర్యం కొరకు జైలుకు కూడ వెళ్ళిన ధన్యజీవి రాజు గారు.

---

1. శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యాను శీలనం - పు: 29.
డా॥ మక్కువ సత్యనారాయణ,

2.1.10. సాహిత్య జీవితం: బహుముఖ ప్రజ్ఞాశాలియైన బాపిరాజు గారికి చిన్నప్పట్నుంచీ గ్రంథాలు పఠించడంలో ఆసక్తి ఎక్కువ. పుస్తకాలు చదవడమే గాక, కథలు అప్పటికప్పుడే కల్పించి వీనుల విందుగా చెప్పే వారు. ఈ వారసత్వం అతని తండ్రి కృష్ణయ్య ద్వారా రాజుగారికి సంక్రమించింది. బాపిరాజు గారు పాటలు పాడితే విన్న వారందరూ ఆ గాన మాధుర్యానికి పరవశించి పోయే వారు. రాజుగారు తన కాలేజీ జీవితం లోనే జానపద జీవితాన్ని ప్రతిబింబించే అనేక గేయాలను రాశారు. కొన్ని కథలు రాసిన తర్వాత 1912 నుండి నవలలు రాయడం ప్రారంభించారు. "బాపిరాజు నవలలు తెలుగువారి సాంస్కృతిక వ్యవస్థకు అద్దం పట్టే విశిష్ట రచనలు. అవి ప్రక్రియా శిల్ప సంపన్నములు. పాత్రల మనస్తత్వాన్ని చిత్రించడంలో, వారిలో ఆత్మీయతా ధర్మాన్ని సాక్షాత్కరింప చేయడంలో కొన్ని ఆదర్శాలు, వాస్తవాలు, ధ్యేయాలు మొదలైనవి మూర్తి భవింప చేయడంలో బాపిరాజు లేఖిని సజీవంగా సాగింది. వీరి నవలల్లో కూడ సాంఘిక, సాంస్కృతిక కళాత్మక సంఘటనలు కోకొల్లలు"[1] బాపిరాజు గారు సాంఘిక నవలలే గాక చారిత్రక నవలలు కూడ రాయడానికి ప్రేరణ కల్గించిన వ్యక్తి ఆయన గురువు కూల్డ్రే దొరగారు. కూల్డ్రే గారు మంచి గ్రంథాలను ఎన్నిక చేసి శిష్యుల చేత చదివించే వారు. "ఒకప్పుడు కూల్డ్రే గురుత్వం వహించి బాపిరాజు గారికి చిత్రకళను, ఆంగ్ల సాహిత్యాన్ని

---

1. నాకు పరిచితుడైన మా బాపిరాజు — ఆచార్య కె. గోపాలకృష్ణారావు. శివజన్మదిన సంచిక. నారదబిందు శశికళ, పు: 51

పాశ్చాత్య సంస్కృతి, సంప్రదాయాల్ని బోధిస్తే , ఇంకో పర్యాయం బాపిరాజు గురుస్థానాన్ని అలంకరించి కూర్మ్ శిష్యుడికి భారతదేశ చరిత్రను , భారతీయుల ఆచార వ్యవహారాల్ని బోధించేవారు."[1] కూర్మ్ మహాశయుడు బాపిరాజు గారిని వెంటబెట్టుకొని భారత దేశంలోని చారిత్రక సుప్రసిద్ధ స్థలాల్ని , పుణ్యక్షేత్రాల్ని దర్శించారు. అప్పుడే బాపిరాజు గారికి చారిత్రక నవలలు రాయాలనే సంకల్పం కలిగింది. బాపిరాజు వీరాంధ్రుడు. ఆంధ్రులపై ఈగకూడ వాలనిచ్చేడి వాడు కాదు కాబట్టి , పూర్వాంధ్రుల వైభవాన్ని ప్రపంచానికి చాటాలనుకున్నారు. అంతేగాక ప్రజల్లో పాతుకు పోయిన మత వైరుధ్యాన్ని తొలగించి, అన్ని మతాలు ఒకటే అనే భావాన్ని కూడ ప్రజల్లో కల్గించేందుకు చారిత్రక నవలా రచనకు పూనుకొన్నారు.

తెలుగులో చారిత్రక నవలలకు చక్కని పునాదులేర్పరచిన కళాత్మక సుందర సౌధ నిర్మాణంలో బాపిరాజు పాత్ర విలక్షణమైనది. వారి గుండె లోతుల్లో దోబూచులాడిన జాతీయ (రాష్ట్రీయ) అభిమానం 'హిమబిందు' , 'గోనగన్నారెడ్డి' మొదలైన నవలల్లో గోదావరి నదిలా ఉప్పొంగి పోయింది. తెలుగు గడ్డమీద గద్దె నిలిపిన శాతవాహనులు , ఇక్ష్వాకులు, కాకతీయులు ఆంధ్ర జాతీయ సంస్కృతికి వెన్నెల పందిళ్ళు వేశారు. చారిత్రక నేపథ్యానికి కల్పన కళాత్మక రూపాన్ని ప్రసాదించింది. కేవలం చారిత్రక వ్యక్తులను, రాజకీయ సంఘటనలను చిత్రించినంత మాత్రాన అది చారిత్రక నవలకాదు. అది ఇటుక, సున్నం , రాళ్ళు వంటి

---

అడివి బాపిరాజు నవలా సాహిత్యానుశీలనం ., పు: 5 .
డా॥ ముప్పన సూర్యనారాయణ.

మూల పదార్థం మాత్రమే. జాతీయ హృదయ చిత్రణం, దానికి ఒక జీవాన్ని కలిగించే చైతన్య శక్తి బాపిరాజు గారి చారిత్రక నవలల్లో ఈ విలక్షణ ధర్మం పుష్కలంగా ఉంది. ప్రాచీన నాగరికతా సంస్కృతులన్నీ దివ్యనదీ తీరాలలో విలసిల్లిన అంశం చారిత్రక సత్యం. తెలుగు నేలను పునీతం చేసి, సస్యశ్యామలం చేసే నదులన్నీ దివ్యత్వాన్ని తీర్చిదిద్దు కొన్నవే. ఆ నదీ తీరాలు మతానికి, శిల్పాలకు, సాంఘిక సంస్కృతులకు ప్రతిబింబాలుగా ఉన్న అంశాన్ని బాపిరాజు గారు అనేక సందర్భాలలో రమ్యంగా, ప్రబోధాత్మకంగా చిత్రించారు. వర్తమానానికి చక్కని స్ఫూర్తినిచ్చి, భవిష్యత్తుకు బంగారు బాట వేసేదే భూతకాలం. అదే చరిత్ర. ఈ నగ్న సత్యాన్ని, ప్రబోధాన్ని బాపిరాజు గారు కళాత్మకంగా అందించారు. కృష్ణా, గోదావరీ తీరాలలో ప్రాచ్య కాలం నుండి నేటి వరకు ఇటువంటి సంస్కృతి వెలిసింది. కృష్ణా తీరాన బౌద్ధము, బౌద్ధ శిల్పము ఆంధ్ర సంస్కృతికి వన్నె చిన్నెలు తెచ్చింది."[1] ఆంధ్రుల చరిత్రను ఆధారంగా తీసుకొని నవలలు రాసిన ఘనత ప్రథమంగా బాపిరాజు గారికే దక్కింది. బాపిరాజు గారి 'హిమబిందు' నవల హిందీ లోకి తర్జుమా చేయబడింది.

**నవలాకారునిగా బాపిరాజు గారు:** బాపిరాజు గారు 1. హిమబిందు, 2. అడవి శాంతిశ్రీ, 3. అంశుమతి, 4. కోనగన్నారెడ్డి అనే చారిత్రక నవలల్ని రచించారు. ఇవే గాక 'మధుర వాణి', 'శిలారథం', 'కైలాసేశ్వరుడు' అనే

1. నాద బిందువు - శశికళ. ౧౦ వ జన్మదిన సంచిక.
నాకు పరిచయమైన బాపిరాజు ., పు: 51, 62.
- ఆచార్య కె. గోపాల కృష్ణా రావు.

నవలల్ని కూడ ప్రారంభించారు. అయితే అవి పూర్తి కాక ముందే బాపిరాజు గారు దివంగతులైనారు.

బాపిరాజు గారు కాల్పనిక రచయితగా గుర్తింపబడినా ఆయన చారిత్రక నవలలు కేవలం కల్పనా కథలు మాత్రం కావు. ఆయన ఏ చారిత్రక నవల రాయాలను కొంటారో ఆ చారిత్రక ప్రదేశాలు సందర్శించి, అక్కడి రాతి శాసనాలు, తామ్ర శాసనాలు చదివి, అందులోని వివరాలు యదాతథంగా రాసుకొనేవారు. అనుస్యూతంగా వస్తున్న కథలను అక్కడి ప్రజల ద్వారా వినేవారు. అటు తర్వాత చరిత్రకారులతో తర్జన భర్జనలు చేసి, చరిత్ర గ్రంథాలను కూలంకషంగా పరిశీలించి తెల్సుకొన్న అంశాలను మనశ్చక్షువులతో దర్శించి, మేధా శక్తితో నాటి వాతావరణాన్ని, సన్నివేశాల్ని, పాత్రలను ఊహించి చారిత్రక నవలల్ని సృష్టించేవారు; అంతే తప్ప ఏవో ఊహాలతో మాత్రం చారిత్రక నవలల్లోని కథలను కూర్చేవారు కారు. అందుకే 'హిమబిందు' ఒక అద్భుత సృష్టియై చారిత్రక నవలా ప్రపంచానికే తలమానిక మైంది. 'అడవి శాంతిశ్రీ' ఒక సుందర కావ్యమై కృష్ణా, గోదావరీ నదుల్లా సాగిపోయింది. 'అంశుమతి' చిన్న పిల్లలను సైతం అలరించే అందమైన నవలికగా రూపొందింది. 'గోన గన్నారెడ్డి' యుద్ధాలతో, వ్యూహాలతో పాఠకులకు ఎంతో ఆసక్తి రేకెత్తిస్తూ ఒళ్ళు గగుర్పాటు కలిగించే నవలగా రూపొందింది.

**బాపిరాజు గారి సాంఘిక నవలలు :** 1. నారాయణరావు, 2. తుఫాను, 3. కోణంగి, 4. జాజిమల్లి, 5. నరుడు.

బాపిరాజు గారు తమ సాంఘిక నవలల్లో ఆనాటి సంఘ

జీవనం ప్రతిబింబించేటట్లు రచనలు చేశారు. 1930 - 35 మధ్యకాలంలో జమీందారీ వ్యవస్థ పతన దశకు చేరుకుంది. నాటి జమీందారీ వ్యవస్థను కళ్ళకు కట్టినట్లు 'నారాయణరావు' నవలలో వర్ణించారు. పాశ్చాత్య వ్యామోహానికి లోనై తాగుడు, జూదం, వ్యభిచారం మొదలైన వ్యసనాల పాలై కొందరు జమీందారులు తమ సర్వస్వాన్నీ కోల్పోయి అప్పుల పాలయ్యారు. కొందరు తాము జమీందారులమన్న మాటే మర్చిపోయి బ్రిటీషు వారిచ్చే ఉద్యోగాల కోసం ప్రాకులాడుతూ, వారి అడుగులకు మడుగులొత్తుతూ ప్రవర్తించే వారు. ఈ విషయాలన్నీ నారాయణరావు నవలలో విశదంగా చర్చించారు. 1930 ప్రాంతంలో చెలరేగిన స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాన్ని బాపిరాజు గారు తీవ్రంగా వ్యతిరేకించారు. 'కోనంగి', 'తుఫాను' నవలల్లో స్త్రీ స్వతంత్ర ప్రతిపత్తి పట్ల బాపిరాజు గారి అభిప్రాయం తెలుస్తుంది. బాపిరాజు గారు వాంఛించిన స్త్రీ స్వేచ్ఛ చలంగారి స్త్రీ స్వేచ్ఛ లాంటిది కాదు. బాపిరాజు గారు గాంధేయ వాది. "అర్ధ రాత్రి స్త్రీ ఎప్పుడు ఒంటరిగా బయట తిరగ గల్గుతుందో అప్పుడే మనకు స్వాతంత్ర్యం వచ్చినట్లు" అన్న గాంధీగారి సిద్ధాంతమే బాపిరాజుది. ఆ నాటి సాంఘిక సమస్యల్లో అంటరానితనం ముఖ్యమైంది. ఈ సమస్యను 'నరుడు' అనే నవలలో చర్చించారు. హరిజనుడు కూడ నరుడే అన్న భావనతో రాజుగారు 'నరుడు' నవలికను రచించారు. హరిజనోద్ధరణతో పాటు వర్ణాంతర వివాహాలు కూడ సంఘాభివృద్ధికి హేతువులు అని భావించి 'కోనంగి' నవలను రచించారు. ఇలా బాపిరాజు గారు అటు సంఘ దురాచారాల్ని చూపి ప్రజలకు

ఉన్నతాదర్శాల పట్ల చక్కని అవగాహన కలిగేటట్లు సాంఘిక నవలలు రచించారు.

**కథానికా రచయితగా బాపిరాజు గారు :** బాపిరాజు గారు వందకు పైగా కథలు రాశారు. వీరి కథలన్నీ ఆరు సంపుటాలుగా ముద్రితమైనాయి. 1. రాగమాలిక, 2. అంజలి, 3. తూలికా నృత్యం, 4. తరంగిణి, 5. భోగీర లోయ, 6. బాపిరాజు కథలు.

బాపిరాజు గారు కథలను కల్పించడంలో చాలా నేర్పరి. బాపిరాజు గారి కథలన్నీ మంగళాంతాలే. ఆయన కథలన్నింటిలోను కళాకారులే పాత్రలు. వీరి కథలు 'మీజాన్' పత్రికలోను, భారతిలోను, ఇతర పత్రికల్లోను ప్రచురించారు. కొన్ని కథలు నాటక రూపంలో ఆకాశవాణి నుండి ప్రసారమయ్యాయి. బాపిరాజు గారి కథలు ఆంధ్రులకు బాగా పరిచయం. 'నాగలి, నరసన్న పాపాయి, గుడ్డిపిల్ల, నేలతల్లి, తిరుపతి కొండమెట్లు, హంపీ శిథిలాలు, సంధ్యా నృత్యం, శైలబాల, రాగమాలిక, తూలికా నృత్యం, భోగీరలోయ, తరంగిణి, ఆకాశపథం మొదలైన కథల్లో పేదవారిని, భిక్షుకులను, కార్మికులను, కర్షకులను, కళాకారులను గురించి రాశారు. బాపిరాజు గారి కథలు అనేకం హిందీలోకి, ఇంగ్లీషులోకి అనువదింపబడ్డాయి. ఇందుకు కారణం " బాపిరాజు గారు భావాత్మకమైన కథలు వ్రాయగుంలో బాగు బాగు అని అనిపించుకొన్న మహా భాగుడు. ఆయన కథలలో కల్పనలు, భావములు, వర్ణనలు విశిష్ట స్థానము

ఆక్రమించును. భాష కావ్య భాష."[1]

**గేయకారుడుగా బాపిరాజు గారు :**

బాపిరాజు గారు అనేక రకాలైన గేయాలు రచించారు. వీరు చివరి రోజుల్లో తమ గేయాలన్నింటిని సరిచూచుకొని, గేయ సంపుటి వ్రాత ప్రతిని సిద్ధం చేశారు. అది ముద్రితం కాకముందే మరణించారు. వారి మరణానంతరం 1954 జనవరిలో శ్రీరావులపర్తి భద్రిరాజు గారి పూనికతో, తొలిసారిగా ఆ గేయ సంపుటి వెలుగులోనికి వచ్చింది. బాపిరాజు గారు తన ఊహాసుందరి 'శశికళ'ను ప్రేమించి, ఆరాధించి, ఆమె కోసం పరితపించి, ఆమె సాక్షాత్కారం కోసం అనుక్షణం నిరీక్షించి, ఆమె పై ఎన్నో గేయాలు రాసి శశికళా ప్రియ భావుక భావకవిగా సంభావితులైనారు. వీరి శశికళా గేయాలు 'ఆకాశవాణి' ప్రసారం చేసింది. 'పాడకే నా రాణి, పాడెదను నీకునై, పాటలను దేవి' అనే పాటలను సుప్రసిద్ధ గాయకులు శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు పాడగా రికార్డు చేశారు. దేశభక్తి గేయాలు సందర్భానుసారంగా చాప్పించారు.

**నాటకరచయితగా బాపిరాజుగారు:** బాపిరాజు గారు 1949-50 ప్రాంతాల్లో రేడియో నాటక రచనపై తమ దృష్టిని కేంద్రీకరించారు. ఆ కాలంలో 'ఆకాశవాణి' విజయవాడ కేంద్రానికి సలహాదారుగ పనిచేశారు. 'ఉషా సుందరి', 'కృతి సమర్పణం', 'శైలబాల', 'భోగీర లోయ', 'నవోదయం', 'ఏరువాక', 'దుక్కిటెద్దులు', 'ఆంధ్ర సామ్రాజ్ఞి'

---

1. అక్షరాభిషేకము – గొర్రెపాటి వెంకట సుబ్బయ్య .. పు: 146.

మొదలైనవి వీరి రేడియో నాటకాల్లో ముఖ్యమైనవి. అంతేగాక, వీరు తమ 'నారాయణరావు' నవలను రేడియో నాటకంగా మలచి, అందులో జమిందారు పాత్రను పోషించి, నాటక రచయితగా నటుడిగా శ్రోతలను రంజింప చేశారు. నాటకరంగంలో కూడ ఆయనకు ప్రవేశముంది.

**వ్యాసకర్తగా బాపిరాజు గారు :** నవలలు, కథానికలు, గేయాలు, రేడియో నాటికలు మాత్రమేగాక బాపిరాజు గారు వివిధ విషయాలపై ఎన్నో వ్యాసాలు రాశారు. వీరి వ్యాసాలు కొన్ని పత్రికల్లో వెలువడ్డాయి. లలిత కళల గొప్పదనాన్ని వివరిస్తూ రాసిన వ్యాసాల సంఖ్య ఎక్కువ అని చెప్పవచ్చు. దేశభక్తి పూరితమైన వ్యాసాలు కూడ అనేకం రాశారు.

ఇలా బాపిరాజుగారు సాహిత్య రంగంలో వివిధ ప్రక్రియల్లో రచనలు చేసి ఆంధ్ర సరస్వతీమ తల్లికి ముద్దుబిడ్డ మైనారనడంలో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు. "1920 పిమ్మట నడిచిన ఆంధ్ర సాహిత్య చరిత్రలో బాపిరాజు వంటి అద్భుత వ్యక్తి మరొకడు లేడు. కవి, కథకుడు, చిత్రకారుడు, అభ్యాయికా కర్త, అధ్యాపకుడు, పత్రికా సంపాదకుడు, సినీ కళాస్రష్ట - ఎన్నని చెప్పను. ఇన్ని ప్రజ్ఞలున్న వ్యక్తి ఏ కాలమందైనా దుర్లభమే. వీరి గ్రంథాలు నిత్యనూతనాలై పాఠకుల్ని అలరింపజేసాయి"[1]

2.1.11. **లక్ష్యసిద్ధి :** బాపిరాజు గారి లక్ష్యసిద్ధిని గురించి శ్రీ కురుగంటి - సీతారామయ్యగారు "బాపిరాజు ధర్మము నిర్వహించునప్పుడు ధర్మవేత్తయై, యుద్ధములు వర్ణించువేదల సమరశాస్త్ర విశారదుడై,

1. విజ్ఞాన సర్వస్వము (రెం.సం) తెలుగు సంస్కృతి ., పు: 942,43.

ప్రేమికుల సంభాషణలో రసమూర్తియై, శిల్ప చాతుర్యము నుగ్గడించు వేళ శిల్పియై, గానము పాడించునెడల గాయకుడై, బాలికల ఆట పాటల నిరూపించునెడల బాలుడై, శాస్త్ర చర్చల జరుపునెడల శాస్త్ర వేత్తయై, పాత్రోన్మీలన సమయమున సహృదయుడై మొత్తము మీద నవలా రచనయందు మహాకవి యైనాడు"[1] అన్నారు. ఎవరన్నా లక్ష్యాన్ని సాధించాలంటే పై లక్షణాలన్నీ ఉండాలి. అవి రాజుగారిలో పుష్కలంగా ఉన్నాయి. బాపిరాజు గారు తన జీవితాన్ని ఇలా నిర్వచించారు. "ధనం కావాలని కాంక్ష, జ్ఞానం రావాలని ఆశ, పేరు పొందాలని కోర్కె అందుకు శుష్క ప్రయత్నాలు, వ్యంగ్య ప్రయోజనాలు, వ్యర్థ హంగామాలూ, రహస్యంలో విడరాని , ఇవయ్యా నా జీవితం"[2] "సంసారం, ఉద్యోగం, రాజకీయాలు, హోదా, పలుకుబడి మొదలైన కార్యకలాపాలతో సంబంధం కలిగి ఉంటూనే, వీనికి లొంగి పోకుండా దూరంగా ఉండి, తనదైన మరో ప్రపంచాన్ని సృష్టించుకొని, వ్యక్తిగతంగా పరిపూర్ణమైన ఆనందాన్ని అనుభవించాలనుకోవడం బాపిరాజు గారి అభిమతం."[3]

ఒకసారి బాపిరాజు గారి కుమార్తె రాధా వసంత తాను రాసిన గేయాన్ని తీసుకువెళ్ళి తండ్రికి చూపించింది. ఆ గేయాన్ని చూచి బాపిరాజు గారు విపరీతంగా నవ్వారు. అప్పుడు ఆమె

1. తెలుగు నవలా వికాసం - శ్రీ మొదలి నాగభూషణ శర్మ., పు:157.
2. బాపిరాజు నవలలు - ఒక పరిశీలన. పరిశోధక గ్రంథం (అముద్రితం) డా॥ విజయ పు: 29
3. పైదే., పు:29.

చిన్నబుచ్చుకుంటే , " అదేమిటి నాన్నా! మీ నాన్ననే అర్థం చేసుకోలేదా? నువ్వు కేవలం నా గొప్పతనమే ప్రతి ఆలోచనలోనూ నింపుకుంటూ ప్రతి మాటలోనూ వ్యక్తం చేస్తే నాకు నవ్వురాదూ! మీ నాన్నేదో అతీతుడని నీ అభిప్రాయం. నువ్వూ కథలు వ్రాయి. నీ శక్తి సామర్థ్యాలు ఉపయోగించి ఆలోచించు. విమర్శకుల అభిప్రాయమూ జతకూర్చి నాతో వాదనలు ప్రారంభించు. అంతేగాని నేను వ్రాసిన ప్రతి అడుగూ అనుసరిస్తూ 'అద్భుతం' అనడం ఏమంత సమంజసం? మా నాన్నపై ఈగ వాలడానికి వీల్లేదంటే ఎలా రా నాన్నా? "[1] అంటూ ఆమెను ప్రోత్సహించారు. పుట్టగానే ఏవీ సిద్ధించవంటూ తానే ఆమెకు గురువు కూడా అయ్యారు. " కవిత్వం, చిత్రలేఖనం ఈ రెండే నేను స్వయంగా సంపాదించి నా పిల్లలకిస్తున్న ఆస్తి "[2] అంటారాయన. కూతురికి రాసిన ఉత్తరాల్లో బాపిరాజుగారి లక్ష్యం అర్థమౌతుంది. కూతురికి ఇలా రాస్తారు. " భాష మన ఖజానా. భాష బాగా సంపాదించుకుంటె కావ్య భూషణాలు ఎన్నైనా నిర్మించుకోవచ్చును. ఆ భాష కోసం మనుచరిత్ర, నన్నయ, తిక్కన, ఎఱ్ఱనల భారతము, పోతన భాగవతము, శ్రీనాథుని గ్రంథాలు, తెనాలి వారి పాండురంగ మాహాత్మ్యము, సూరన కళాపూర్ణోదయమూ, (పోరముని ఉతర రా- యణము, పినవీరుని జైమినీ భారతమూ, ముక్కు తిమ్మన పారిజాతాపహరణము

1. డా. బాపిరాజు గారి నవలలు - ఒక పరిశీలన (పరిశోధన గ్రంథం- అముద్రితం) పు: 39. - డా॥ కె. విజయలక్ష్మి
2. పైదే., పు: 40.

అభినవ దండి కాళహస్తి శతకము - చాల ముఖ్యమైనవి. అవి భాష, డాణీ, శైలీ ఇస్తాయి. కథలకోసం ఇంగ్లీషు కథలు చదవాలి. చిన్న కథలకూ, నవలలకూ పాశ్చాత్యులు మనకు గురువులు. కాబట్టి నువ్వు ఇంగ్లీషు కూడా నేర్చుకోవాలి."[1] ఇలా పిల్లలకు ఉత్తరాలు రాయడం, వారిని ప్రోత్సహించడం బాపిరాజు గారి కర్తవ్య దీక్షను ప్రతిబింబిస్తుంది.

**2.1.12. పురస్కారాలు ( గౌరవాలు) బహుమతులు :** బాపిరాజు గారు రాసిన సాంఘిక నవల 'నారాయణ రావు' ప్రత్యేక స్థానాన్ని సంపాదించింది. 1934 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నిర్వహించిన నవలల పోటీలో ఈ నవల ఎన్నిక చేయబడి బహుమతి పొందింది. ఈ నవలల పోటీలకు విశ్వనాథ సత్యనారాయణ గారి 'వేయి పడగలు' కూడా పోటీకి వచ్చింది. జడ్జీలు ఏ నవల ఉత్తమమైందో నిర్ణయించలేక ఇద్దరి నవలలు ఉత్తమమైనవిగా ఎంపిక చేసి రెండింటికి ప్రథమ బహుమతి ఇచ్చారు.

కళా దర్శకులుగా, కళావేత్తగా ఆ నాటి చిత్ర పరిశ్రమలో బాపిరాజు గారికి మంచి గౌరవం ఉండేది. 1944 ప్రాంతంలో శ్రీ గూడవల్లి రామబ్రహ్మం గారు 'పల్నాటి యుద్ధం' నిర్మిస్తున్నారు. ఒకటి, రెండు డిజైనులలో తెలుగుదనం లోపించిందనే సంశయం వారికి కలిగింది. ఈ సమస్యను బాపిరాజు గారే తీర్చాలనుకొన్నారు.

1. భరత నాట్యాలు. మా బాపి బావ (చార్య) — గూడూరు నమశ్శివాయ., (అముద్రితం)

బాపిరాజు గారిని కోరగా వారా రెండు డిజైనులు వేసి ఇచ్చారు. రామబ్రహ్మం గారు వాటిని లోనికి తీసుకొని వెళ్లి ముకుళిత హస్తాలతో తిరిగి వచ్చారు. బాపిరాజు గారి చేతులు పట్టుకొని అమితానందంతో తాంబూలం సమర్పించారు. బాపిరాజు గారు తాంబూలంలో 1500 రూపాయల చెక్కు చూచి ఆశ్చర్య పడుతుంటే, ఈ నూలు పోగును స్వీకరించండన్నారు. ఆ రోజులలో రెండు డిజైనులకు 1500 రూపాయలు సమర్పించారంటే బాపిరాజు గారి స్థాయి ఎంత ఉన్నతమో వేరే చెప్పనక్కర లేదు."[1]

చిత్రకారుడుగా బాపిరాజు గారు శాశ్వత యశస్సు నార్జించు కొన్నారు. వీరి 'తిక్కన' చిత్రానికి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారి బహుమతి లభించింది. వీరు చిత్రించిన 'శబ్ద బ్రహ్మ' చిత్రం డెన్మార్క్ దేశం లోని ఒక చిత్ర ప్రదర్శన శాలలో పదిల పరచ బడి ఉంది. 'భాగవత పురుష' చిత్రం తిరువాన్కూరు లోను, 'సూర్యదేవ' చిత్రం కూచ్ బీహార్ లోను ఉన్నాయి. 'సముద్రగుప్త' చిత్రం అల్లాడి-కృష్ణ స్వామయ్య గారింట్లో ఉంది. "బాపిరాజు గారు చిత్రించిన 'శబ్ద బ్రహ్మ' చిత్రం డెన్మార్క్ మ్యూజియానికే అలంకారం. వీరి దశదిశా పరివ్యాప్త ఇంత కన్నా ఉదాహరణ ఏం కావాలి?"[2] ప్రభుత్వ ఆదేశం పై

1. కులపతి - బాపిరాజు గారి సంస్మరణ సంచిక .. పు: 94.
ప్రథమాంధ్ర కళాదర్శకుడు
శ్రీ బొమ్మకంటి సుబ్బారావు.
2. శ్రీ అడివి బాపిరాజు నవలా సాహిత్యాను శీలనం .. పు: 20
డా॥ మన్నవ సత్యనారాయణ

1951 ఫిబ్రవరిలో సిగీరియా కుడ్య చిత్రాలను పరిశీలించడానికి 'సింహళం' వెళ్లారు. భారతదేశానికి తిరిగివచ్చి 12 సిగీరియా చిత్రాల్ని చిత్రించారు. వీనిలో కొన్ని మద్రాసులోని ప్రభుత్వ మ్యూజి యంలో భద్రపరచబడి కళాప్రియులకు కనువిందు చేస్తున్నాయి.

బాపిరాజు గారి వ్యాసాలు, గేయాలు, కథానికలు, నవలలు ఆంధ్రపత్రిక, భారతి, మీజాన్ పత్రికల్లాంటి పత్రికల్లో ప్రచురించబడి వారికి అనేక బహుమానాలు, ధనమూ సంపాదించి పెట్టాయి. రేడియో ప్రసారాలకు, నాటకాలకు, చిత్రాలకు కూడ అనేక బహుమానాలు వచ్చాయి. కాని ఈ బహుమానాల కంటే వారి రచనలు, చిత్రాలు ప్రజల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోవడమే వారికి పెద్ద పురస్కారం. డా॥ విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి- శాస్త్రి, నరసింహ శాస్త్రి, ఆధునిక కవి రచయిత డా॥ సి. నారాయణరెడ్డి మొదలైన వారి కంటె బాపిరాజు గారి లోని ప్రతిభా పాటవాలు ఏమి తక్కువ కాదు. చిన్న వయస్సులోనే వారికి ఆయుష్షు తీరి మరణించారు. ఇంకా పది, పదిహేను సంవ త్సరాలు బ్రతికివుంటే మరికొన్ని అమోఘ రచనలు గావించి ఉండే వారు. అప్పుడు వారికి 'జ్ఞానపీఠ్' అవార్డో, 'పద్మ విభూషణ్' బిరుదో తప్పక వచ్చి ఉంటుందనడం లో ఏ మాత్రం సందేహం లేదు.

**2.1.13. బాపిరాజు గారిని గురించి ప్రముఖుల అభిప్రాయాలు:**

బుచ్చిబాబు గారు "సౌజన్యం, మనస్సులో మెత్తదనం, ఆయనలో గల

వర్తనకు వన్నె తెచ్చాయి. అందుకే తమ పనులకు రచనలను మించిన వ్యక్తిత్వం గల మహనీయులలో బాపిరాజుగారొకరు"[1]

బుద్ధవరపు కామరాజు గారు "బాపిరాజు వస్తుంటే ఆనందోత్సాహ పరిమళాలు తెరలు తెరలుగా ముందు వచ్చేవి. ఎంత పెద్ద సభ అయినా, ఎంత చిన్న సమావేశమైనా ఆయన సమాన ఉత్సాహంతో పాల్గొనే వారు. ఏ అంశం మీదనైనా వినేవాళ్లకు విసుగు పుట్టకుండా ఛలోక్తులతో, పాటలతో గంటల తరబడి పుష్టిగల ఉపన్యాసం ఇవ్వగల వక్త ఆయన"[2] అని అన్నారు.

విశ్వనాథ సత్యనారాయణ గారు "బాపిరాజును గూర్చి ఏమి చెప్పను? సూర్యుని గురించి చెప్పేదేముంటుంది"[3] అన్నారు. ఇంకా విశ్వనాథ వారే "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి. శ్రీ బాపిరాజు యిట్లు జన్మించిన వాడు"[3] అని అన్నారు.

బుచ్చిబాబు గారు "గెథే మహాశయుడు సంఘాన్ని చివరి దాకా పట్టుకొని ప్రాకులాడాడు. 'వాల్ట్ విట్‌మాన్' దూరంగా పారిపోయాడు. బాపిరాజు ప్లీడరీ వృత్తిని వదిలేసినా సంఘంలో నుంచి పారిపోలేదు. సంఘంలో నివసిస్తూనే నిర్దేశించుకొన్న విధానాన్ని ఆచరణలో పెట్టాడు"[4] అన్నారు.

---

1. శ్రీ బాపిరాజు గారి నవలలు – ఒక పరిశీలన (పరిశోధన గ్రంథం – అముద్రితం) డా॥ శి. విజయలక్ష్మి, పు: 39
2. నారదబిందు. శశికళ – 90 వ జన్మదిన సంచిక
   అనుభవాలు, జ్ఞాపకాలు — బుద్ధవరపు కామరాజు, పు: 7.
3. శ్రీ బాపిరాజు నవలలు – ఒక పరిశీలన (సిద్ధాంత గ్రంథం – అముద్రితం) పు: 75
   డా॥ విజయలక్ష్మి.
4. కులపతి - జీవితం పట్ల బాపిరాజు దృక్పథం. పు: 22.
   బుచ్చిబాబు.

శ్రీ మొదలి నాగభూషణ శర్మగారు " శ్రీ అడివి బాపిరాజు తెలుగు దేశానికి భావకవిత్వమిచ్చిన బంగారు పంట. వంగ సాహిత్యానికి రవీంద్రుడు ఎంత వైవిధ్యమైన కళామూర్తో, తెలుగు సాహిత్యానికి బాపిరాజుగారు అంత "[1] అని అన్నారు.

2.1.14. **ముగింపు:** ఇంతటి ప్రజ్ఞావంతులైన బాపిరాజు గారు భౌతికంగా మరణించినా, వారు రాసిన గ్రంథాల వల్ల, వారు గీసిన చిత్రాల వల్ల, వారు పాడిన పాటలవల్ల అఖిలాంధ్ర ప్రజల హృదయాలలో జీవిస్తూనే ఉన్నారు. ఆయన్ని స్నేహితులు, సన్నిహితులు మా బాపిబావ అంటూ ఆప్యాయంగా పిలిచేవారు. వీరిని గురించి శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు ఇలా అన్నారు.

" బాపిరాజు ఆప్యాయతకు తెరచిరాజు
ఆడంబరానికి త్రోసిరాజు
అందుకే ఆయనంటే ఆబాల గోపాలానికి
అదో విధమైన మోజు "[2]

బాపిరాజు ఉత్తమ నవలా కారుడు. గొప్ప చిత్రకారుడు. మధుర వచస్వి. కళాతపస్వి, విశేషించి మంచి మనస్సుగల మహామనీషి. తన మనస్సు, వచస్సు, తపస్సు, ఫలసిద్ధి నందించుకొని, తెలుగు వారికి చారిత్రక నవలల ద్వారా పూర్వాంధ్రుల వైభవాన్ని

---

1. తెలుగు నవలా వితానము - శ్రీ మొదలి నాగభూషణ శర్మ., పు: 270.
2. శ్రీ అడివిబాపిరాజు నవలాసాహిత్యానుశీలనము - డా॥ మన్నవ సత్యనారాయణ, పు: 42

గుర్తుచేసి, సాంఘిక నవలల ద్వారా సహజ మాధుర్యాన్ని, ఆనం
దాన్ని చవిచూపి, తన కుంచెతో సౌందర్యాలను నింపి, గేయాలతో
వీనుల విందు గావించి, వ్యాసాలతో చదువరులను యేవో లోకా
లకు కొనిపోయి, ఉపన్యాసాలతో శ్రోతలను ఉర్రూతలూగించి
గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించిన బాపిరాజు గారు ఆంధ్ర
దేశానికే గాక, యావద్భారత దేశానికే తలమానికం అని నిస్సంశయంగా
చెప్పవచ్చు. తెలుగు కావ్య వాఙ్మయంలో తిక్కనకు ఎటువంటి
అద్వితీయమైన స్థానం ఉందో, నవలా వాఙ్మయంలో ముఖ్యంగా
చారిత్రక నవలా వాఙ్మయంలో బాపిరాజుగారికి అంతటి
మైన స్థానం ఉందనడంలో అతిశయోక్తి ఎంత మాత్రం లేదు.

హిందీ చారిత్రక నవలా సాహిత్యంలో బృందావన్‌లాల్ - వర్మగారు చారిత్రక గణ్య నవలాకారులు. ఆయన మహోత్తరమైన కాల్పనికతతో కూడిన స్వచ్ఛమైన చారిత్రక నవలా రచనా సంప్రదాయాన్ని స్థాపించిన మొట్టమొదటి నవలాకారుడు. కేవలం నవలాకారుడే గాక విమర్శకుడు, వ్యాఖ్యాత కూడాను.

**2.2.1. జననం:** బృందావన్ లాల్ వర్మగారు జనవరి 9, 1889 వ సంవత్సరం పుష్యమాసం, శుక్లపక్షం, అష్టమినాడు ఝాన్సీలోని 'మహూరాణీపురం' అనే గ్రామంలో జన్మించారు. "ఇతని తండ్రిపేరు శ్రీ అయోధ్యాప్రసాద్. తల్లిపేరు శ్రీమతి సబ్‌రానీ. వర్మగారి తండ్రి ఝాన్సీలో తహసిల్‌దార్ ఆఫీసులో గుమాస్తా"[1] "వర్మ గారికి ఇద్దరు సోదరులు, అనేకమంది సోదరీమణులున్నారు."[2] వర్మగారి తండ్రి నెలసరి రాబడి తక్కువ. సంసారం పెద్దది. కాబట్టి వర్మగారు పేదకుటుంబంలో, పదిమందిలో ఒకడుగా జన్మించి బాల్యం గడిపారు.

**2.2.2. విద్యాభ్యాసం:** "ఝాన్సీలోని ప్రాథమిక పాఠశాలలో వర్మగారు ప్రాథమిక విద్య పూర్తి చేశారు. అప్పుడు కీర్తిశేషులు విద్యాధర దీక్షితులుగారు వర్మగారికి గురువులు. తర్వాత లలితపురంలో పినతండ్రి గారింట్లో ఉంటూ, జిల్లా స్కూలులో మిడిల్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. తిరిగి ఝాన్సీలోని 'మెక్‌డొనాల్' మాధ్యమిక పాఠశాలలో చదివి

---

1. హిందీకే సాహిత్య నిర్మాత బృందావన్ లాల్ వర్మ – డా॥ ప్రభాకర్ మాచవే., పృ:1.

2. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పృ:70.

మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు."[1]

వర్మగారి తండ్రికి పై చదువులు చదివించడం ఇష్టంలేదు. ఎందుకంటే వారి కుటుంబ ఆర్థిక పరిస్థితి బాగా ఉండేది కాదు. తండ్రి ఒక్క సంపాదనపై అనేకమంది ఆధారపడి ఉండడం చేత, చదువు నిలిపివేసి ఏదైనా గవర్నమెంటు ఆఫీసులో అతనికి ఉద్యోగం ఇప్పించాలనుకొనేవాడు. వర్మగారికి కూడా పై చదువులు చదవాలనే అభిలాష ఎక్కువగా లేదు. ఉద్యోగం చేయాలంటే కూడ ఇష్టం లేదు. చిన్నప్పటినుండి అతనికి 'పహిల్వాన్' కావాలనీ, 'లేఖకుడు' కావాలనీ కోరిక ఉండేది. ఇంకా అతనికి పుస్తకాలు చదివే అలవాటు కూడ ఎక్కువగా ఉండేది. ఈ అలవాటు అతనికి తన ముత్తవ్వ, పినతండ్రుల ద్వారా కలిగిందని చెప్పవచ్చు. అతని ముత్తవ్వ వర్మగారికి ఎన్నో కథలు చెప్పేది. ముత్తవ్వకు ఝాన్సీ లక్ష్మీబాయి తెలుసును. "నా ముత్తాత దీవాన్ ఆనందరావ్-మాధవ్ రాణీ లక్ష్మీబాయి వైపు యుద్ధం చేస్తూ 'మవు' యుద్ధంలో మరణించాడు. నాకు అప్పుడు 8 సంవత్సరాల వయస్సు. అప్పటి నుండి ముత్తవ్వ ద్వారా అనేక కథలు వినేవాడిని"[2] అని వర్మగారే స్వయంగా రాసుకొన్నారు. ఆమె చెప్పిన కథలు నిరంతరం విని వర్మగారిలో కథలు చదవాలి అనే ఆసక్తి పెరిగింది.

---

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్, పు: 72.
2. ఝాన్సీకీ రాణీ లక్ష్మీబాయి (నవల) పరిచయం – బృందావన్‌లాల్ వర్మ, పు: 1.

"వర్మగారు లలితపురంలో చదివేటప్పుడు పిన తండ్రి ఇంట్లో ఒకే ఒక్క లాంతరు ఉండేది. దాన్ని రాత్రిపూట ఆర్పేసేవాళ్ళు. అతడు మట్టిదీపప్రమెమ్మెలో నూనె వత్తులు వేసుకొని, బోర్ల పడుకొని కాళ్ళు చాపుకొని పుస్తకం దీపం ముందు పెట్టుకొని చదివేవాడుట."[1] ముఖ్యంగా మంత్ర తంత్రాలకు చెందిన పుస్తకాలు అలా చదవడం వర్మగారికి ఎంతో ఇష్టం. చిమ్మచీకటిలో మినుకు మినుకుమనే దీపం మధ్య ఒంటరిగా, ఒళ్ళు గగుర్పొడిచే పుస్తకాలు చదవడంలో ఎంతో థ్రిల్లు పొందేవారు. ఇలా పుస్తకాలు చదవడం అలవాటైన వర్మగారు ఉన్నత విద్య అభ్యసించాలని నిశ్చయించుకొన్నారు. అనేక విషమ పరిస్థితులను ఎదుర్కొని ఆయన గ్వాలియర్‌లోని విక్టోరియా కళాశాలలో B.A. పరీక్ష, ఆగ్రాలో L.L.B (న్యాయవాద) పరీక్షల్లో ఉత్తీర్ణులయ్యారు. తర్వాత M.A. పాస్ కావాలనీ, ఇంగ్లండ్ వెళ్ళి పై చదువులు చదవాలనీ అనుకొన్నారు కానీ వర్మగారి తల్లిదండ్రులు దివంగతులైన కారణం చేత, చదువుపై శ్రద్ధ తగ్గిపోయింది. ఇంగ్లండు వెళ్ళాలనే కోరిక అణగారిపోయింది.

**2.2.3. ఉద్యోగ జీవితం:** కుటుంబ ఆర్థిక పరిస్థితి వల్ల మెట్రిక్ పాసైన వెంటనే ఆయన ఉద్యోగం చెయ్యాల్సి వచ్చింది. "తండ్రి కోరికననుసరించి ఝాన్సీలోని సబ్ రిజిస్ట్రార్ కార్యాలయంలో

---

1. హిందీకే సాహిత్య నిర్మాత 'బృందావన్‌లాల్ వర్మ' – డా॥ ప్రభాకర్ మాచవే పు: 11.

నెలకు పన్నెండు రూపాయల జీతంపై కేవలం మూడు వారాలు పని చేశారు. ఆ మూడు వారాల్లోనే ఆయనకు కమీషను క్రింద ఏభై లేక ఏభై ఐదు రూపాయలు, జీతం తొమ్మిది రూపాయలు వచ్చింది. ఇలాంటి కమీషన్ల పద్ధతి ఆయనకు నచ్చలేదు. ఆ ఉద్యోగం వదిలేశారు. భవిష్యత్తులో కూడ ఇలాంటి కమీషను పని చేయకూడదని నిశ్చయించుకొన్నారు."[1] కొన్ని రోజుల తర్వాత అటవీ శాఖ కార్యాలయంలో నెలకు ఏభై రూపాయల వేతనంపై ఉద్యోగం చేశారు. ఏడు నెలల తర్వాత ఆ ఉద్యోగానికి కూడ రాజీనామా చేశారు. ఆ రాజీనామా చేయడానికి కూడా ఒక కారణముంది. "వర్మగారు నవలలు చదవడమనే అలవాటును చంపుకోలేక, ఫారెస్ట్ విభాగంలో పనిచేసేటప్పుడు ఆఫీసులో నవలలు చదువుతుండగా, ఆఫీసులో పని చెయ్యాలిగాని నవలలు చదవకూడదని వర్మగారి ఆఫీసర్ మందలించారు. దీనితో వర్మగారి ఆత్మాభిమానం దెబ్బతింది. ఆ రోజంతా నిలబడే పనిచేసి తనకు తానే శిక్ష వేసుకొన్నారు. ఆ రోజు నుండీ ఆఫీసుకు ఎప్పుడూ పుస్తకాలు తీసుకొని వెళ్ళలేదు."[2] కొన్నాళ్ళకు ఆ అటవీశాఖ ఉద్యోగంలో కూడ ఇమడలేక ఆ ఉద్యోగానికి రాజీనామా చేశారు. తర్వాత "ఆగష్టు 1916 లో ఝాన్సీలోనే న్యాయవాద వృత్తిని ఆరంభించార

---

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పు: 72.
2. హిందీకే సాహిత్య నిర్మాతా – బృందావన్‌లాల్ వర్మా – డా॥ ప్రభాకర్ మాచవే., పు: 12
3. పైదే., పు: 13.

కాని న్యాయవాదిగా కూడ ఎక్కువ రోజులు చెయ్యలేదు. తన రచనా వ్యాసంగానికి తన వృత్తి అడ్డుగా ఉందని వదలిపెట్టి పూర్తిగా రచనలు చేయడంలోనే తర్వాతి కాలమంతా గడిపారు.

**2.2.4. వివాహం :** "పదకొండు సంవత్సరాల వయస్సులో వర్మగారికి వివాహం జరిగింది. ఆయన భార్య పేరు సరయూదేవి. వారిది బాల్య వివాహమైనా అనుకూల దాంపత్యమై విలసిల్లింది. ఆమె అబలయైనా సబలలా అసాధారణ ధైర్యంతో దేవివలె తన పరివారాన్ని రక్షిస్తూ అందరికీ అద్వితీయమైన సేవ చేసేది."[1] వారి ముద్దుల ఏకైక కుమారుడు సత్యదేవ వర్మ.

**2.2.5. మాతృభూమిపై ప్రేమ :** 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అన్న భావన మూర్తీభవించినవారు బృందావన్‌లాల్ వర్మగారు. వారి ముత్తాత ఆనందరావ్ మాధవ్ గారు దేశభక్తులు. లక్ష్మీబాయి తరపున బ్రిటీష్ వారితో పోరాడి అసువులు బాసిన అమర జీవి. ఈయన దేశభక్తి మనుమడైన వర్మగారిలో చిన్నప్పట్నుంచి నరనరాల్లో పాకిపోయింది. భారతదేశమన్నా, భారతీయులన్నా ఆయనకు మక్కువ ఎక్కువని కొన్ని సంఘటనల ద్వారా మనకు అర్థమౌతుంది.

ఒకసారి ఆంగ్లేయ చరిత్రకారుడైన 'మార్సిడన్' రాసిన 'హిస్టరీ ఆఫ్ ఇండియా' అనే పుస్తకాన్ని వర్మగారు చదివారట. అందులో "హిందూదేశం ఉష్ణదేశం కాబట్టి ఇక్కడి ప్రజలు సోమరిపోతులుగా

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్ ., పు: 70.

ఉంటారు. అందుచేత విదేశీయుల చేతిలో హిందువులు ఓడిపోయే వారు. ఆంగ్లేయులు శీతల ప్రదేశం నుండి వచ్చినవారు అయినందున ఎప్పుడూ పరిపాలన సాగించేవారు."[1] ఈ మాటలు చదివి వర్మగారికి ఎంతో కోపం వచ్చింది. బహుశా ఈ మాటలు నిజమైతే ఇటువంటి ఉష్ణ దేశంలోనే ప్రాచీన కాలంలో రాముడు, కృష్ణుడు, భీముడు, హనుమంతుడు వంటి గొప్ప వీరపురుషులు ఎట్లా జన్మించారు. ఈ మార్సిడన్ రాసిన వాక్యాలు తప్పు అని విపరీతమైన కోపంతో ఆ పుస్తకంలోని వాక్యాలు చించేశారు. అతడి పినతండ్రి వర్మగారిని మందలించి, ఇలా పుస్తకాలు చించినంత మాత్రాన హిందువులు వీరులు అని నిరూపించగలవా? నీవు నిజమైన సత్యాలు రాయాలంటే చరిత్ర పుస్తకాలను బాగా చదవాలి. చారిత్రక స్థలాలను పర్యటించాలి. పరంపరగా వచ్చే జనశ్రుతులను ఆకళింపు చేసుకోవాలి. వాటి సహాయంతో చరిత్రను పునర్నిర్మించాలి; అని సలహా ఇచ్చారు. "వర్మ ముత్తవ్వ ఝాన్సీరాణిని స్వయంగా చాలా మార్లు చూచి పొడిందట. ఆమె అనేక సాహస కథల్ని వర్మకు చెప్పేది. అంతేగాక రామాయణ, మహాభారతాల్లోని ఆదర్శ పాత్రలైన రాముడు, భీముడు, అర్జునుడు, కృష్ణుడు మొదలైన వారి సాహసోపేతమైన కథల్ని వినడం వల్ల ఆయనలో స్వాభిమానం, నిర్భయత్వం, ధైర్య సాహసాలు పెంపొందాయి."[2]

---

1. హిందీ సాహిత్య కే నిర్మాత - బృందావన్ లాల్ వర్మ - డా॥ ప్రభాకర్ మాచవే., పు:10,11.
2. 'బృందావన్ లాల్ వర్మాకే ఉపన్యాసోం కా సాంస్కృతిక్ అధ్యయన్' – డా॥ కృష్ణ అవస్థీ, పు:104.

గారు ఆనాడే హిందువుల శౌర్యాన్ని, దేశభక్తిని వేనోళ్ల చాటాలని నిశ్చయించు కొన్నారు; సఫలీకృతు లయ్యారు. నిజానికి వర్మగారి 'ఝాన్సీ కి రాణీ లక్ష్మీబాయి', 'అహిల్యాబాయి' నవలలు చదువుతూంటే, హిందువుల ధైర్య సాహసాలు మనకు కళ్లకు కట్టినట్టు కన్పిస్తాయి. హిందువులు వీరాధి వీరులే కాని సోమరి పోతులు కారు అని అర్థమౌతుంది. మరి ఎందుకు హిందువులు ఆంగ్లేయుల చేతిలో ఓడి పోయారు. దానికి ఒకే కారణం, అదేమంటే వారు మారణాయుధాలు వాడారు. అవి మన వద్ద లేవు. అందుకే మహావీరులైన అల్లూరి సీతా-రామరాజు, కట్టబొమ్మన, టిప్పు సుల్తాను, ఝాన్సీ లక్ష్మీబాయి లాంటి వారు దేశ స్వాతంత్ర్యం కొరకు చివరి రక్తం బొట్టు వరకు చిందించి ప్రాణాలొడ్డి పోరాడారు; అమర జీవులైనారు.

**2.2.6. అభిరుచి:** వర్మగారు కర్మజీవి. తన ఆరోగ్యంపై ఎక్కువ శ్రద్ధ చూపేవారు. బాల్యం నుండి వ్యాయామం, కుస్తీ, హఠయోగం, ప్రాణాయామం చేయడం, వేట, ఈత, గుర్రపు స్వారీ, ఫుట్‌బాల్, హాకీ, క్రికెట్ మొదలైన క్రీడల్లో పాల్గొనడం, దేశభ్రమణం మొదలైన విషయాల్లో చాల అభిరుచి ఉండేది. అందువల్లే ఆయన వృద్ధాప్యంలో కూడ యువకుని వలె కన్పించే వారు.

డాక్టర్ మోహినీ సహాయ్ గారి మాటల్లో "వర్మగారు ఎప్పుడూ ఏదో పనిలో నిమగ్నులై ఉండేవారు. ఒకప్పుడు చారిత్రక మహత్త్వం గల ప్రదేశాలను చూచేందుకు పోవడం, సెలయేళ్లు, నగులు,

కొండలు మొదలైన ప్రాకృతిక సౌందర్యం గల ప్రదేశాల్లో తిరగడం, వేరొకప్పుడు పొలాలను, ఉద్యాన వనాలను ఉత్సాహంతో చూడడం, మరి యొకప్పుడు దేశసేవ, ప్రజాసేవ, సమాజసేవ మొదలైన కార్యాలలో పాల్గొనడం, న్యాయవాద వృత్తిని నిర్వహించడంలో శ్రద్ధ చూపడం, డిస్ట్రిక్ బోర్డు అధ్యక్ష పదవిని నిర్వహించడం ఇలా ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నులై ఉండేవారు."[1]

ఇక పుస్తక పఠనం, పుస్తకాలు రాయడమనే అభిరుచి చిన్నప్పటి నుండి ఆయనకు ఉండేది. ఆర్థిక ఇబ్బందుల వల్ల చిన్న చిన్న ఉద్యోగాలు చేసినా, తన అభిరుచుల ప్రకారమే తన జీవితాన్ని మలుచుకొన్న మహా మనిషి వర్మగారు. కొద్దికాలం న్యాయ వాద వృత్తి స్వీకరించినా పుస్తక రచనకు, సమయం చాలక పోవడం వల్ల తన ప గౌరవమున్నా విధిలేక న్యాయవాద వృత్తిని మానేశారు.

వర్మగారికి దండేలు, కుస్తీ అంటే విపరీతమైన ప్రేమ "ఎంతటి చలికాలంలో నైనాసరే ఊలు గుడ్డలు ధరించేవారు కారు. ఎంతటి వ్యాయామం చేసేవారంటే, ఉదయం నాల్గు గంటలకే లేచి లంగోటి గట్టుకొని లాఠీ తిప్పేవారు. తరువాత 'లఖారీ' నదికి వెళ్లి గంటల తరబడి ఈత కొట్టేవారు. తరువాత ఐదువందల నుండి ఏడు వందల వరకు దండేలు, రెండు వందల పైగా బస్కీలు తీసేవారు. తెల్లవారి ఈ కార్యక్రమాల తర్వాత నాలుగు లేక ఐదు పెద్ద

---

ఉపన్యాస: 1 – డా॥ మోహినీ సహాయ్., పు: 79.

చపాతీలు తిని, రెండున్నర శేర్ల పాలు తాగేవారు."[1]

అతనికి వేట అంటే కూడ ఎంతో ఇష్టం. ఆయన గొప్ప వేటగాడు. నెలకొక్క సారైనా వేటాడనిదే అతనికి తిన్న భోజనం అరిగేది కాదట. ప్రాణ భయం ఏ మాత్రం లేదు. ఆయన అభిప్రాయం – "ప్రాణా పాయం సంభవించే ఘటన ప్రత్యక్షంగా కనబడుతున్నప్పటికీ నాలో భయం ఏ మాత్రం ఉండేది కాదు. ఆ సంకటం తొలగి పోయినప్పుడు దానికి సంబంధించిన కొన్ని సంఘటనలు, వికృతరూపాలు ధరించి కనబడి భయాన్ని కలిగించేవి. ఏదైనా విపత్తి వచ్చినప్పుడు తప్పకుండ శక్తికొలది వాటి నెదుర్కొంటా. తరువాత జరుగవలసినది జరుగక మానదు"[2] ఈ అనుభవం అతనికి వేటద్వారా కలిగింది. దీనిపై ప్రఖ్యాత హిందీ కవి మైథిలీ శరణ గుప్తగారు ఒక సభా వార్షికోత్సవ సమయంలో మాట్లాడుతూ ఇలా అన్నారు. "వర్మ గారిని ఎప్పుడైనా చూడండి అడవిలోనూ, నదుల దగ్గరనో, కాలువల దగ్గరనో, కొండలు లేక పర్వతాల దగ్గరో తుపాకీ పట్టుకొని తిరుగుతూ ఉంటారు. అతనికి పులి అన్నా, సింహం అన్నా భయం లేదు. వచ్చినప్పుడు చూచుకొంటాము లెండి అని నాతో చెప్పేవారు."[3]

ఒకసారి ఒక అడవిపంది ద్వారా అతనికి పెద్ద దెబ్బ తగిలింది. మరోసారి చెవిదగ్గర ,మైన గాయమై ప్రాణాపాయం

1. హిందీకే సాహిత్య నిర్మాతా- బృందావన్ లాల్ వర్మా – డా॥ ప్రభాకర్ మాచవే., పు: 14
2. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పు: 80
3. పైదే.

వరకు వచ్చింది. అయినా అతనికి వేటంటే భయంలేదు. వేటను మానుకోలేదు. వేట అతని జీవితంలో ఒక వ్యసనంగా మారిపోయింది అందుకే కాంజోరలు 'మృగనయని' నవలలో నిన్నీ, లాఖీలకు వేట అంటే ఇష్టమనీ రాసి వేటను వర్ణించి తనకు వేటపై గల మక్కువను తీర్చుకొన్నారని పిస్తుంది.

ఒకసారి 1930లో ఆయనకు తోటలను పెంచాలనే పిచ్చి కోరిక కలిగింది. 'వృక్షో రక్షతి రక్షితః' అని నేడు స్లోగన్లతో చెట్లను, తోటలను పెంచమని ప్రభుత్వం, అధికారులు పోరుపెడుతున్నారు. ఈ చెట్ల వల్ల ప్రయోజనాలను గ్రహించి ఆనాడే వర్మగారు తోటలను పెంచాలను కొనడం వారి భావి దర్శనానికి, సునిశిత బుద్ధికి నిదర్శనం. కాని "ఈ పిచ్చిలో పడి పది, పన్నెండు సంవత్సరాల జీవితాన్ని, వకీల వృత్తి ద్వారా సంపాదించిన డెబ్బై వేల రూపాయలను ఖర్చు చేశారు. అదీ చాలక అరవై, డెబ్బైవేల రూపాయల దాకా అప్పు కూడా చేశారు. ఆ అప్పు వడ్డీతో కలిపి సుమారు ఒక లక్ష రూపాయల దాకా అయింది."[1]

సితారు వాయించడమంటే కూడ వర్మగారికి ఎంతో ఇంకా సంగీతం, చిత్రకళ, మూర్తి కళలు అంటే కూడ మహాప్రాణం. అప్పుడప్పుడు గంటలకొలది సితారు వాయిస్తూ భోజనం చెయ్యడం, నిద్ర పోవడం కూడ మరచి పోయే వారు.

డాక్టర్ శశిభూషణ్ సింహాళ్ గారు " వర్మగారికి లలిత

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మ - డా॥ శశిభూషణ్ సింహాళ్., పు: 311, 312.

కళలందు ఆసక్తి మెండు. గంటల కొలది సితారు వాయిద్యాన్ని వాయిస్తూ ఉండేవారు. ఆయన సంగీతాన్ని ఆరాధించే వారు. శిల్పకళ అంటే ఎనలేని ప్రేమ. అతనిలో ప్రతిక్షణం జ్ఞాన సముపార్జన చేయాలనే తపన ఉండేది"[1] అని చెప్పారు.

2.2.7. **ధార్మిక విశ్వాసం :** వర్మ గారి కుటుంబీకులు ధార్మిక బుద్ధి కలవారు. ధర్మ చింతన, దైవ చింతన మెండుగా గలవారు. ఆ బుద్ధి వర్మ గారికి కూడ వచ్చింది. వారి ఇంటి వద్ద ప్రతి దినం తులసీ రామాయణం పఠించే వారు. హనుమాన్ చాలీసాపై అతనికి నమ్మకం మెండు. ఆపద సమయాల్లో దేవుని ప్రార్థిస్తే మేలు కలుగుతుందని విశ్వాసం ఉండేది. కాని అర్థ రహితమైన సంప్రదాయాలు, మూఢ నమ్మకాలు అతనికి గిట్టవు.

వర్మ గారిలో ధర్మ చింతన కూడ ఎక్కువ. ఆయన జీవితంలో కొన్ని సంఘటనలు అతని మనస్సులో గొప్ప మార్పును కలిగించాయి. "వర్మ గారికి నాలుగు సంవత్సరాల వయస్సులో ఇంట్లో ఒక రోజు కొంత డబ్బు దొంగిలించారట. ఆ రాత్రే అతనికి ఒక భయంకరమైన చెడ్డ కల వచ్చింది. ఆ కలలో ఆయన, ఆయన తల్లి ప్రయాణం చేస్తున్నారట. రైలు ఝాన్సీ స్టేషను చేరింది. దిగేటప్పుడు తల్లి కనబడలేదు. సామాన్లు క్రిందికి దింపాడు. వాటిలో ఒక చిన్న, కొత్త మూట కూడా ఉంది. ఆ మూట విప్పాడు. అందులో తల్లి శవం, ముక్కలు కనిపించాయి.

---

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మ – డా॥ శశిభూషణ్ సింహాల్., పు.12.

అతడు గట్టిగా కేక వేసి వెక్కి వెక్కి ఏడ్చేదానికి మొదలుపెట్టాడు. తల్లి వెంటనే అతన్ని లేపి దగ్గరకు తీసుకొనింది. తనకు వచ్చింది కల అని తెలుసుకొని వర్మగారు తల్లికి అంతా చెప్పి, ఇక మీదట ఎప్పుడూ దొంగతనం చేయను. దొంగతనం చేసినందువల్లే నీ గురించి అలాంటి చెడ్డ కల కన్నాను."[1] అని చెప్పారట. చిన్ననాటినుండి వర్మగారు సత్యవాక్కు, ధర్మచింతన, ఉదార బుద్ధి, నీతి నిజాయితి వంటి సద్గుణాలను అలవరచుకొన్నారు.

1906 లో అతనికి ధర్మ సంబంధమైన ఆలోచనల్లో గొప్ప మార్పు వచ్చింది. ఆ సమయంలో అతడు ఆర్య సమాజంలో ఒక గొప్పవక్త ఉపన్యాసాలు ఆరు, ఏడు పర్యాయాలు విన్నారు. తర్వాత 'సత్యార్థ ప్రకాష్' అనే పుస్తకాన్ని జాగ్రత్తగా అధ్యయనం చేశారు. దీనితో వర్మగారికి ఆర్య సమాజం పట్ల నమ్మకం ఏర్పడింది. గొప్ప ఆర్య సమాజ సేవకుడిగా మారిపోయాడు. కొన్నాళ్లకు 'చార్లెస్ డార్విన్' స్పెన్సర్, మార్క్స్, ఎక్బన్, దాంతే, విక్టర్ హ్యూగో మొదలైన వారి పుస్తకాలను చదివి వారి ఆలోచనలతో ఏకీభవించి, నాస్తికుడుగా మారిపోయాడు. అతడు తన డైరీలో "ఈ ప్రపంచాన్ని సృష్టించిన వాడెవడో బహుశ ఒకడు ఉంటాడనే నమ్మకం ఉంది. కానీ దేవీ దేవతలపైన నమ్మకం పోయింది. నా మనస్సులోని ఈ కొత్తవెలుగు ఎప్పటికీ నన్ను వదలి పెట్టదు"[2] అని రాసుకొన్నాడు.

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య — డా॥ మోహినీ సహాయ్, పు: 73
2. పైదే., పు: 84.

**2.2.8. సాంఘిక జీవితం:** విద్యార్థి దశనుండే వర్మగారు సాంఘిక సేవ పట్ల మొగ్గు చూపేవారు. విదేశీ వస్తువుల్ని బహిష్కరించడాన్ని సమర్థించేవారు. గాంధీగారి సిద్ధాంతాలు ఆయన్ని ప్రభావితం చేశాయి. ప్రజాసేవ చేయడం ఒక విద్యుక్త ధర్మంగా ఆయన భావించేవారు. "1918 లో ఝాన్సీలో 'ఇన్‌ఫ్లూయిన్‌జా' అనే వ్యాధి భయంకరంగా వ్యాపించింది. వర్మగారు ఆ వ్యాధిగ్రస్తులకు ఎనలేని సేవలు చేశారు. ఆ వ్యాధితో చనిపోయిన శవాలను కూడ ఆయన స్వయంగా మోశారు."[1]

సమాజంలో అనుస్యూతంగా వస్తున్నట్టి అంధవిశ్వాసాలను, సంప్రదాయాలను, సాంఘిక దురాచారాలను ఆయన ఖండించేవారు. తార్కిక బుద్ధితో ఆలోచించి, తనకు మంచివని తోచిన విషయాలనే ఆయన అంగీకరించేవారు. హోలీ పండుగనాడు జరిగేటటువంటి భీభత్సాన్ని చిన్నప్పటి నుండి అసహ్యించుకొనేవారు. ఒకసారి హోలీ పండుగ సందర్భంగా అతని "అత్తవారి ఊరిలో అతని ముఖంపై పచ్చరంగు చల్లగా, అతని మనస్సు బాధ చెంది తిరిగి నాలుగు సంవత్సరాల వరకు అతడు అత్తగారి ఊరుకు వెళ్ళలేదు."[2] అందుకే తన ఉద్దేశాన్ని మృగనయని నవలలో నిన్నీ పాత్రద్వారా వ్యక్తం చేశారు. ఆ నవలలో హోలీ పండుగనాడు ప్రజలు ప్రదర్శించే అసభ్యకరమైన చేష్టలను నిన్నీ ఖండిస్తుంది.

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పృ: 84.
2. పైదే., పృ: 83.

"అతనికి హిందూ సమాజంలో అధికంగా వ్యాప్తిలో ఉన్న కాళ్లకు నమస్కరించే సంప్రదాయమంటే ఇష్టముండేది కాదు. తల్లిదండ్రులకు, గురువులకు తప్ప మరెవ్వరి కాళ్లకు వంగి నమస్కరించ కూడదు అనేవారు."[1]

సమాజంలో ఉన్న వరకట్న పిశాచాన్ని రూపుమాపాలని ఎలుగెత్తి చాటేవారు వర్మగారు. అందుకే తన ఏకైక పుత్రుని వివాహంలో కట్నం తీసుకోలేదు.

హిందూ సమాజంలో వేళ్లు పాతుకుపోయిన అస్పృశ్యత, అంటరానితనం మొదలైన దురాచారాలు సమాజానికి హాని కలిగించేవని తలచి, వాటి నివారణకు ఎంతో కృషి చేశారు.

వర్మగారు తన డెబ్బైయ్యవ జన్మదినోత్సవ సమయంలో కొన్ని నియమాలను పాటిస్తానని ప్రతిజ్ఞ చేశారు. అవి –

1. అహంకారాన్ని, విద్వేషాన్ని వదిలేందుకు ప్రయత్నించడం,
2. అంధ విశ్వాసాలను వదలిపెట్టడం,
3. భగవంతుని యందు శ్రద్ధా భక్తులను చూపించడం,
4. ఇతరులను పీడించకుండా ఉండడం,
5. అహింస, ద్వేషరాహిత్యం, నిర్భయత్వం మొదలైన వాటిని అవలంబించడం.[2]

ఈ సూత్రాల ద్వారా, ఆయన నిండు వ్యక్తిత్వం తేటతెల్లం అవుతున్నది.

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహిని సక్సేనా., పు: 83.
పెన్

**2.2.9. రాజకీయ జీవితం :** విద్యార్థి దశనుండే వర్మగారికి రాజకీయాలంటే ఆసక్తి ఉండేది. అతడు ఝాన్సీలో 'మెక్‌డొనాల్' హైస్కూలులో మెట్రిక్ చదివేటప్పుడు అతనికి ఒక బెంగాలీ వ్యక్తితో పరిచయం ఏర్పడింది. ఇద్దరూ బెంగాల్ విభజన, విప్లవ వీరుల పట్ల బలంగా ప్రభావితులయ్యారు. వంగ విభజన సందర్భంగా గవర్నమెంటుకు వ్యతిరేకంగా జరిగిన ప్రజా ఆందోళనలో, లాలా లజపతిరాయ్, సూఫీ అంబాప్రసాద్, సర్దార్ అజిత్ సింహ్‌ల ఖైదు విషయం విన్న వర్మగారి మనస్సు కుతకుతలాడింది. అంతకు మునుపే జపాన్‌తో రష్యా యుద్ధంలో ఓడిపోయిన విషయం తెలిసి చాలా సంతోషపడ్డారు. ఈ సందర్భంలో అతని లేత మనస్సులో "ఒక నిర్బలుడు కూడ కఠిన ప్రయత్నం చేసిన పక్షంలో సబలుడు కాగలడనే ఆత్మ విశ్వాసం కలిగింది."[1] అతడు ఈ ఉద్దేశాన్ని పెంపొందించుకొనే కోరికతో అప్పటినుండి ప్రయాగ సమాచార్ పత్రిక, శ్రీ వేంకటేశ్వర పత్రిక, భారత మిత్ర పత్రికలు చదవడం మొదలుపెట్టారు. లాలా లజపతిరాయ్ మొదలైన వారి దేశ బహిష్కరణ వార్త విని అతని మనస్సుకు బాధ కలిగింది. స్వదేశం నుండి విదేశీయులను బహిష్కరించడం వర్మగారి లక్ష్యంగా ఉండేది. అందుకే స్వరాజ్య సంపాదనకై భూకామందులను రూపుమాపడానికి బాంబులు, పిస్తోలులు ఉపయోగించాలనుకొన్నారు. ఐదు, ఆరు తరగతుల్లో 'మార్సిడన్' గారి 'భారత్‌కా

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య్ - డా॥ మోహినీ సహాయ్, పు: 85.

ఇతిహాస్' చదివినప్పటి నుండి అతనికి ఆంగ్లేయులంటే అసహ్యం ఏర్పడింది. ఆ అసహ్యం తోనే, ప్రతీకార వాంఛతోనే వర్మాగారు వ్యాయామం చేయడం ప్రారంభించారు. ఏదైనా ఒక రోజు అవకాశం వస్తే ఆంగ్లేయులను తప్పక ఎదుర్కొని చిత్తు చిత్తు చేయాలనుకొనే వారు. వర్మగారు గ్వాలియర్ విక్టోరియా కాలేజీలో విద్యార్థిగా ఉండేటప్పుడు వారు రాసిన 'సేనాపతి ఊదల్' నాటకం గవర్న మెంటు వారి చేత నిషేధించ బడింది. దేశద్రోహులను ఏ విధంగానైనా అంతమొందింపవచ్చు ననడమే ఈ నాటకం సందేశం. ఫలితంగా వర్మగారంటే బ్రిటీష్ గవర్నమెంటు వారికి కోపం వచ్చింది. ఆయన కొద్ది రోజుల వరకు పోలీసుల పర్యవేక్షణలో ఉన్నారు. దీని ద్వారా వర్మ గారికి బ్రిటీష గవర్నమెంటు అంటే వ్యతిరేకభావం బలపడింది. 1913 వ సంవత్సరం సరస్వతీ పత్రిక సంపాదకుడుగా వుండగా, కాన్పూర్ నుండి వెలువడే 'ప్రతాప్' అనే పత్రిక సంపాదకుడైన 'గణేశ్ శంకర విద్యార్థి' గారితో పరిచయం కలిగింది.

పండిత్ బదరీనాథ్ భట్, శ్రీ మన్నవ ద్వివేదీలతో కలసి వర్మగారు 'గోల్ మాల్ కారిణి సభ'ను స్థాపించారు. వీరు ముగ్గురు కలసి 'చర్మ' పేరుతో హాస్య-వ్యంగ్యంతో కూడుకొన్న వ్యాసాలను రాసే వారు. వీరి ముగ్గురికీ ఎవ్వరంటేనూ భయం లేదు. ఎవ్వరినీ లక్ష్య పెట్టక ఎవరికి తోచింది వారు రాసి పత్రికలకు పంపే వారు. తాము రచించిన విమర్శలలో ఎవ్వరినీ వారు వదలి పెట్ట లేదు.

1916 నుండి ఒకవైపు న్యాయవాద వృత్తిలో ఉంటూనే మరోవైపు రాజకీయ విషయాలలో మొగ్గు చూపించారు. ఈ సందర్భంలోనే లక్నోలో జరిగిన కాంగ్రెసు సభకు వచ్చిన పెద్దపెద్ద నాయకులతో వర్మగారికి పరిచయ భాగ్యం కలిగింది. 1918 లో "ఝాన్సీలో ఇన్‌ఫ్లుయిన్‌జా వ్యాధికి గురైన ప్రజలకు సేవ చేయడమే గాక చనిపోయిన శవాలను మోసుకెళ్ళి దహన సంస్కారాలు చేసేవారు. ఆ సమయంలో ఆయన వందే మాతరం అని అరుస్తూ శవాలను మోసేవారు. మరియు రామనామంలో శక్తి ఉందని చెప్పేవారు."[1] 1919లో 'జలియన్ వాలా బాగ్' సంఘటనపై అతడు తన వకీలు స్నేహితుడైన బాబూరామ్ సక్సేనాతో కలిసి పట్టణంలో హర్తాళ్ చేయించారు.

1922 సంవత్సరంలో వర్మగారి మిత్రుడైన రాజ్ నారాయణ్ క్షయ రోగంతో బాధపడుతూ ఉండేవారు. వారికి ప్రభుత్వం వల్ల సరియైన సమయంలో చికిత్స జరుగలేదు. ఫలితంగా రాజ్ నారాయణ్ చనిపోయారు. దానితో వర్మగారు చాలా బాధపడ్డారు. ఈ విషయాన్ని వర్మగారు గాంధీగారికి ఫిర్యాదు చేశారు. "వర్మగారికి గాంధీగారన్నా, గాంధీ సిద్ధాంతాలన్నా శ్రద్ధ ఎక్కువ. అతని హృదయంలో గాంధీ గారంటే అభిమానం ఉండేది."[2]

1924 సంవత్సరం ఝాన్సీ జిల్లాలో సహకార సమితుల ఆందోళన ప్రారంభమైంది. గ్రామాల్లో సమితులు ప్రాధాన్యతను

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పు: 86.
2. వైదే.

వహిస్తాయి. సాధారణంగా భూస్వాములు దీనికి వ్యతిరేకులుగా ఉండేవారు. కానీ వర్మగారు వారికి నచ్చచెప్పి సహకార బ్యాంకుల్లో డబ్బు కట్టేందుకు ఒప్పించారు. ఈ బ్యాంకుల ద్వారా గ్రామీణ ప్రజలకు మేలు జరగవచ్చునని వర్మగారి ఉద్దేశం.

1936 నుండి 1948 వరకు వర్మగారు ఝాన్సీలో జిల్లా బోర్డు అధ్యక్షులుగా ఉండేవారు. ఆ సమయంలో వర్మగారు కొంత వరకు భ్రష్టాచారాలను రూపుమాపారు. 1943 లో గాయపడిన సిపాయిలకు రక్తదానం చేశారు. ఆ సమయంలోనే హిందూ ముస్లింల మధ్య వికృత లోపించింది. ప్రతిహింస చోటు చేసుకొనే పరిస్థితుల్లో సామాన్య మానవుడు బాధ పడకూడదనే ఉద్దేశ్యంతో, ఈ దమన కాండ నుండి ఆయన అక్కడి ప్రజలను రక్షించారు. 1951 లో వర్మగారు పార్లమెంట్ అభ్యర్థిగా పోటీ చేశారు. ఆ సమయంలో తన డైరీలో ఇలా రాసుకొన్నారు. "ఇప్పుడు ఎన్నికల యుద్ధం సాగుతుంది. నా మీద ఎంత తిట్ల వర్షం కురుస్తుందంటే నా పూర్వీకులు కూడ ఉలిక్కి పడుతారేమో? ఎన్నికల సమయంలో మానవ ప్రకృతి ఎంత నీచాతి నీచంగా అధోగతికి పోతుందో మాటలతో కాని, చేష్టలతో కాని చెప్పలేము. మన దేశంలో ఎన్నికల పరిస్థితి ఈ విధంగా ఉంది. సిద్ధాంతాలు కొంత వరకు ఉంటాయి. కానీ బురద చల్లడం ఎక్కువగా వ్యాప్తిలో ఉంది. అయినప్పటికి నన్ను సమర్థించే వారికి నా పట్ల నమ్మకం ఉంది."[1] కానీ ఈ ఎన్నికల్లో వర్మగారు

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పు: 89.

"రాజకీయం నాక్షేత్రం కాదు. నీ క్షేత్రం వేరొకటి ఉంది. ఆ క్షేత్రం మీద విరుచుకు పడు. అందులో మనసుంచు. దాని ద్వారా దేశానికి, సమాజానికి సేవ చేసేందుకు ప్రయత్నించు అని నా మనస్సు నాకు పదే పదే చెబుతుంది."[1]

వర్మగారికి, జనవరి 26, 1958 గణతంత్ర దినం నాడు కొద్ది మంది లోనే ఉత్సాహం, స్ఫూర్తి కనిపించాయి. ఎక్కువమంది కేవలం సంప్రదాయాన్ని పాటించడానికి వచ్చినట్లు అనిపించింది. అప్పుడు ఆయన మనస్సులో అనేక భావాలు కలిగాయి. ఈ విషయమై స్వయంగా ఆయన ఇలా రాశారు — "ప్రజల్లో కార్యదీక్ష, పట్టుదల లేకపోవడం, కర్తవ్య పాలనాశక్తి లేక పోవడం, భ్రష్టాచారం, పర పీడనం, ఒకరి నొకరు అర్థం చేసుకోలేని ప్రవృత్తి, అసహనం, అహంకారం, క్రమ శిక్షణా రాహిత్యం, ఆడంబర ప్రదర్శనం మొదలైనవి స్పష్టంగా కనబడుతున్నాయి. కానీ, వీటితో పాటు పౌరుషం, నిర్భయత్వం, స్వచ్ఛమైన భావన, జీవితంలో ఎదురయ్యే కష్టాలను ఎదుర్కోవాలనే పట్టుదల, స్త్రీలలో స్వావలంబన పెంపొందించాలనే ఆసక్తి, సాహసం, జీవితం పట్ల సరసభావన మొదలైన విషయాలు కూడా వృద్ధి పొందుతున్నాయి."[2]

పై రెండు భావాలను వర్మగారు మనస్సులో ఉంచుకొని

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పృ: 90.
2. పైదే.

దేశం మరియు సంఘం కోసం ఏది సిద్ధాంతాలను ప్రతి ఒక్కరు ఆచరించాలని చెప్పారు.

" ప్రగతిని ఎవరూ నిలపలేరు. ఇది ప్రకృతి నియమం. ఆ ప్రగతికి శక్తినివ్వడం మన అందరి కర్తవ్యం. ఏ యుగంలోనైనా పది అడుగులు ముందుకు, పది అడుగులు వెనక్కి, మరో యుగంలో ఈ రెండింటి కలయిక సాధారణంగా కనబడుతుంది. పది సంఖ్యను పెంచడం, తొమ్మిది సంఖ్యను తగ్గించడం దార్శనికుల, రాజనీతిజ్ఞుల, వైజ్ఞానికుల, సాహిత్యకారుల, కళాకారుల లక్ష్యం కావాలి. రాజనీతిజ్ఞుల వర్గం, శాసకుల వర్గం లేని ఈ ప్రయత్నాన్ని మాత్రం ఎల్లప్పుడు ముందుకు నడపాలి; అంటూ ఈ క్రింది విషయాలను తప్పకుండ పాటించాలని చెప్పారు.

1. ప్రతి మనిషికి కడుపునిండ తినేందుకు భోజనం దొరకాలి. తన కష్టానికి తగ్గ ఫలితం లభించాలి. అతనికి కష్టపడేటందుకు శక్తిలేనప్పుడు పోషణకు తగిన ఏర్పాట్లు చేయాలి.

2. ప్రతి మనిషికి నివసించడానికి వసతి కల్పించాలి.

3. ప్రతి ఒక్కరికి కూడు-గుడ్డకు లోటుండరాదు.

4. ప్రతి ఒక్కరు శుభ్రమైన, ఆరోగ్యవంతమైన జీవితాన్ని గడపాలి.

5. ప్రతి ఒక్కరికి తమ భాషలో రాయడానికి, సాధారణమైన పుస్తకాలను చదవడానికి అవసరమైన విద్యను నేర్పాలి.

6. ప్రతి ఒక్కరికి తమ సమయాన్ని, మనో వినోదం కోసమో లేదా ఏదేని

కళలను గూర్చి తెలుసుకోవడానికి వినియోగించే అవకాశం దొరకాలి.

7. పిల్లల మనో వికాసం, క్రమశిక్షణ పైన దృష్టి ఉంచాలి.

8. ప్రతి ఒక్కరికి తమ యోగ్యతకు తగినపని దొరికే అవకాశాలు కల్పించాలి.

9. ఇతరులకు హాని కలిగించకుండ ఐకమత్యంతో ముందుకు సాగేటట్లు చేయాలి.

10. ప్రతి ఒక్కరు శారీరక ఆరోగ్యాన్ని పెంచుకొని కష్టాలను ఓర్చుకోవడానికి, మనో నిగ్రహం సాధించడానికి తగిన కార్యక్రమాలు ఏర్పరచాలి."[1]

"1962 సంవత్సరం భారతదేశం పైన చైనీయుల ఆక్రమణ విన్న వర్మగారికి దుఃఖం కలిగింది. ఆయన ఇతరుల వలె సైనికుల కోసం రక్తదానానికి పూనుకొన్నారు. కాని అప్పుడు వర్మగారి వయస్సు డెబ్బై మూడు సంవత్సరాలు. ఆ వయస్సులో అతని శరీరం నుండి రక్తాన్ని తీసుకోవడం మంచిది కాదని డాక్టర్లు తిరస్కరించారు."[2] ఇలా వర్మగారి రాజకీయ జీవితం ముగిసింది. తరువాత తమ లక్ష్యసిద్ధి వైపు మనస్సు మరల్చారు.

**2.2.10. సాహిత్య జీవితం :** వర్మగారు కేవలం పలు సాహిత్యకారుల గ్రంథాలను చదవడమే గాక, అనేక సాహిత్య గ్రంథాలను కూడ రచించారు. వారికి పుస్తకాలు చదవడమంటే ఎంత వ్యసనమో, పుస్తకాలు

1. హిందీ సాహిత్య కా నిర్మాతా 'బృందావన్ లాల్ వర్మ' – డా॥ ప్రభాకర్ మాచవే., పు : 30,31.

2. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస సాహిత్య – డా॥ మోహిని సహాయ్, పు : 81.

రాయడం కూడా అంతే. ఒక్కొక్కసారి ఒక సంవత్సరంలోనే అనేక పుస్తకాలు రాసేవారు.

వర్మగారి సాహిత్య జీవితం 1904 లో ప్రారంభమైంది. అతడు ఎనిమిదవ తరగతి చదువుతున్నప్పుడే 'నరాంతక వధ' అనే నాటకాన్ని రచించారట. కేవలం రచన మాత్రమే కాకుండా ఆ నాటకాన్ని అభినయం చేసి చూపారట. 1904 లోనే ఇంకా మూడు నాటకాలను కూడా రచించారు. ఇలా వర్మగారికి చిన్నప్పట్నుండి రచనలు చేయాలనే తపన ఉండేది. ముఖ్యంగా చారిత్రక నవలలు రాయాలనే ప్రేరణ అతను పదవ తరగతి చదివేటప్పుడే కలిగింది. విదేశీ చరిత్రకారుడైన 'మార్స్డన్' రాసిన 'భారత్ కా ఇతిహాస్' అనే పుస్తకం చదివారు. అందులో "భారతదేశ వాతావరణం అచ్చట ప్రజల బానిసత్వానికి కారణం"[1] అని చెప్పాడట. 'పారసనీస్' అనే ఆంగ్లేయుడు "లక్ష్మీబాయికి శౌర్యం, దేశప్రేమ విధిలేని పరిస్థితుల్లో కలిగాయి. ఆమెకు మొదటి నుండి దేశభక్తి లేదు"[2] అని అన్నాడట. వర్మగారు ఆ సందర్భంలోనే "బెంగాలీ భాష నుండి హిందీలోనికి అనువదింపబడిన 'అశ్రుమతి' 'రాణా ప్రతాప్ కుమార్తె అనీ, అక్బరు పాదూషా తన కొడుకైన 'సలీం' ను రాణాప్రతాప్ పైకి యుద్ధానికి పంపించగా అశ్రుమతి సలీం ని చూచి అతణ్ణి ప్రేమించిందనీ రాసి ఉంది. వర్మగారికి ఈ వాక్యాలు రుచించలేదు. అతడు తన సందేహాన్ని తన తండ్రికి

---

1. హిందీ ఇతిహాస్ ఉపన్యాస్ ఔర్ మృగనయని – డా॥ శాంతి స్వరూప గుప్త, పు: 319.
2. పైదే.

చెప్పారు. వర్మగారి పినతండ్రి, "ఇలా ఎన్నటికీ జరగదు; ఎందుకంటే అక్బరు రాణా ప్రతాప్ పైకి యుద్ధానికి వచ్చినప్పుడు సలీమ్ అసలు పుట్టలేదు. ఒకవేళ పుట్టి ఉంటే చాలా చిన్నవాడుగా ఉండి ఉండాలి"[1] అని చెప్పాడు. ఇలాంటి అసత్యపు మాటలు చరిత్ర పుస్తకాలలో రాయడం అనే విషయం వర్మగారి పసి మనస్సును చాలా బాధ పెట్టింది. ఆ రోజు నుండి అతడు చరిత్ర పుటలను క్షుణ్ణంగా పరిశీలించి గాని కథలను రాయకూడదని నిశ్చయించుకొన్నారు. ఇలా ఆంగ్లేయులైన 'మార్సిడన్', 'పారసబీస్' భారతీయులను గురించి చెప్పిన విషయాలకు, స్వయంగా తాను చదివిన విషయాలకు పొంతన కుదరక పోవడం వర్మగారికి ఎంతో బాధ కలిగించింది. నిజం ఏమిటో తెలిసికోవాలనుకొన్నారు. వర్మగారి 16 వ యేట "కొంత మంది పంజాబీ మిత్రులు బుందేల్‌ఖండ్ ప్రాంతం గురించి అవహేళన చేయడం ఆయన చెవుల్లో పడింది."[2] అగ్నికి ఆజ్యం తోడైనట్లు బాలుడైన వర్మగారిలో పట్టుదల ఎక్కువై, చారిత్రక సత్యాలను అన్వేషించడానికి పూనుకొన్నారు. ఆయన స్వయంగా ఇలా రాసుకొన్నారు. "నేను నవల రాస్తాను. ఆ నవల చరిత్ర సమ్మతం గాను, చారిత్రక సత్యాలను వ్యక్తం చేసేది గాను ఉండాలి. చరిత్ర ఎముకల్లో మాంసాన్ని, రక్తాన్ని నింపేందుకు నాకు నవలలే ముఖ్య సాధనంగా తోచింది"[3]

---

1. హిందీకి సాహిత్య నిర్మాత - బృందావన్‌లాల్ వర్మ - డా॥ ప్రభాకర్ మాచవే., పు: 10.
2. పైదే., పు: 16.
3. ఝాన్సీకి రాణీ లక్ష్మీబాయి 'పరిచయ్' - డా॥ బృందావన్‌లాల్ వర్మ., పు: 4.

వర్మగారు తనకు 'సర్ వాల్టర్ స్కాట్' రచనల వలన కూడా చారిత్రక నవలా రచనకు ప్రేరణ లభించిందని చెబుతూ, " అతని మాదిరిగా మక్కికి మక్కీగా నేను నవలను రాయను. నేను స్కాట్ గారి తప్పుల నుండి తప్పించుకోవాలని చూస్తున్నాను. అంటే సుదీర్ఘమైన వర్ణనలు చూపించడం, రాజులు సామంతులను ముఖ్యులుగా గ్రహించి వారిని పొగడడం, సమాజం లోని అట్టడుగు వర్గీయుల్ని వదలి వేయడం నేను చేయను "[1] అని చెప్పుకున్నారు. అతడు తన నవలల్లో " ఏ యే ప్రదేశాల్ని వర్ణించాలని అనుకొన్నారో ఆయా ప్రాంతాలను దర్శించి, అనేక పుస్తకాల్ని అధ్యయనం చేసి, కొంత ఇతరుల ద్వారా విని రాశారు."[2] తన పూర్వీకుల గౌరవాన్ని, భారత జాతి గౌరవాన్ని కాపాడేందుకు వర్మగారు చారిత్రక నవలలు రాశానని చెప్పుకొన్నారు. అంతేగాక వర్తమాన సాంఘిక పరిస్థితుల్లోని లోటుపాట్లను చక్కదిద్దేందుకు, భారతీయ గౌరవాన్ని చిత్రించేటందుకు, భారతీయులలో నిద్రాణమై యున్న పౌరుషాన్ని మేల్కొలిపేటందుకు, సంఘాన్ని విచ్ఛిన్నం కావించే సంప్రదాయాలను నశింప చేసేటందుకు ఆయన చారిత్రక నవలల వైపు దృష్టి ప్రసరింప జేశారు. చారిత్రక నవలల్లో వర్తమాన కాలిక జీవిత సమస్యల్ని అప్రయత్నంగా పేర్కోవడం, వీలైన చోట్ల ఆ సమస్యలకు సమాధానాలివ్వడం అవసరమని వర్మగారు తలపోశారు

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య్ – డా॥ మోహినీ సహాయ్ ., పు: 93.
2. వైనే.

వర్మగారి చారిత్రక నవలల్లో 'బుందేల్ ఖండ్ లోని జానపద గేయాలు, జానపద కథలు, సంస్కృతి, ఆచార విశ్వాసాలు, వేష భాషలు, జీవిత విధానం, పండుగలు, ధార్మిక విశ్వాసాలు, పేదరికం మొదలైనవి చోటు చేసుకొన్నాయి. ఈ కారణంగా వర్మగారి నవలల్లో ప్రాదేశిక తత్త్వం సంపూర్ణంగా ప్రతిబింబించింది. వీరి రచనలు కేవలం ఒక ప్రాంతానికి సంబంధించినవే అయినా, సంపూర్ణ భారతదేశానికి ప్రాతినిధ్యం వహించేటట్లుగా ఉంటాయి. ఈ సందర్భంలో "ఓం శుక్ల" గారి అభిప్రాయం పేర్కొన దగ్గది.

"వర్మగారు చరిత్రను కల్పన అనే మూసలో పోసి తన బహుముఖమైన ప్రతిభను చాటారు. వాస్తవానికి గతకాలానికి చెందిన అస్పష్టమైన విషయాలను ప్రస్ఫుటం చేసేందుకు, ఒకానొక మహాపురుషుని ప్రభావం వ్యక్తం చేసేటందుకు ఆయన నవలల్ని రాశారు."[1]

వర్మగారి సాహిత్యసాధనకు ఆయన సంస్కారం, పరిసర వాతావరణం, నిరంతర అధ్యయనం, కార్యదీక్ష, ప్రాచీన సంప్రదాయాలపై గౌరవం, ఆధ్యాత్మిక భావన, రాజకీయ, సాంఘిక స్పృహ వీటితో పాటు ప్రకృతిని సూక్ష్మంగా పరిశీలించడం మొదలైనవి ఎక్కువ ఉపకరించాయి.

వర్మగారు అనేకమైన చారిత్రక నవలల్ని రాశారు. చారిత్రక పరిస్థితుల్ని కన్నులకు కట్టినట్లు అభివ్యక్తం చేయడమే

---

1. హిందీ ఉపన్యాస్ కే శిల్ప్ విధికా వికాస్ - డా॥ ఓం శుక్ల, పు: 15.

వర్మగారి చారిత్రక నవలల ముఖ్య ఉద్దేశం:- వర్మగారి నవలల్లో ప్రతిపాదింప బడిన కాల్పనికత ఆయన చారిత్రక నవలల సఫలతకు కారణం. ఈ భావాలను వర్మగారు తన నవలల్లో స్వేచ్ఛగా వ్యక్తీకరించి, పాఠకులకు ఆదినుంచి అంతం వరకు జిజ్ఞాస, ఆకర్షణ కలిగించారు. వర్మ తన ఆశయాలను, అభిరుచులను నిరూపించడానికే చారిత్రక నవలా రచన చేపట్టారు.

**వర్మగారు రచించిన చారిత్రక నవలలు :** "1. గఢ్ కుండార్, 2. విరాటాకీ పద్మినీ, 3. ముసాహిబ జు, 4. కచనార్, 5. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి, 6. మాధవ్ జీ సింధియా, 7. టూటే కాంటే, 8. మృగనయని, 9. అహల్యాబాయి, 10. భువన విక్రమ్."[1]

హిందువులపై విదేశీయులకున్న తప్పుడు అభిప్రాయాలతో విభేదించి, తన అవ్వ, ముత్తవ్వ, చిన్నాన్నల మాటలపై నమ్మకముంచి, కొందరు పంజాబీ మిత్రుల అవహేళనలను ఎదిరించి, పూర్వ భారతీయులపై గౌరవముంచి, మన హిందువులు వీరులు, శూరులు, పరాక్రమవంతులు అని నిరూపించాలనే తపన చెంది, చారిత్రక ప్రదేశాలను దర్శించి, చారిత్రక సత్యాలను అన్వేషించి, నిజానిజాలను మధించి, అసత్యాలనే హాలాహలాన్ని శివునివలె దిగమింగి, చారిత్రక సత్యాలనే అమృతాన్ని పుస్తకాలలో నింపి, కొన్ని హృద్యమైన మనోహరమైన కల్పనలు గావించి, చదువరులను ఆకర్షించే విధంగా

---

1. హిందీకే సాహిత్య నిర్మాత బృందావన్‌లాల్ వర్మ- డా॥ ప్రభాకర్ మాచవే., పు: 32.

ఆలోచించే విధంగా, దేశభక్తులుగా మార్చే విధంగా, భారతీయ సంస్కృతిని ఉన్నత శిఖరాలలో నిలబెట్టే విధంగా అమోఘ చారిత్రక నవలా సృష్టి చేసి భారత మాతకు ముద్దుబిడ్డయైన ధన్యజీవి వర్మగారు.

వర్మగారికి చారిత్రక నవలలపై మక్కువ ఎక్కువ ఉన్నా, రచనా వ్యాసంగం వారికి కరతలామలకం కాబట్టి అనేక ప్రక్రియల్లో తమ రచనలు చేశారు. వర్మగారు కేవలం చారిత్రక నవలతే గాక సాంఘిక నవలలు, కథానికలు, నాటకాలు, ఏకాంకికలు మొదలైనవి రాశారు.

**వర్మగారి సాంఘిక నవలలు :** 1. లగన్, 2. సంగమ్, 3. ప్రత్యాగత్, 4. కుండలీ చక్ర్, 5. కభీన కభీ, 6. అచల్ మేరాకోయీ, 7. సోనా, 8. అమర్ బేల్, 9. ఆహత్, 10. ఉదయ్ కిరణ్, 11. ప్రేమ్ కీ భేంట్[1]

వర్మగారు తమ సాంఘిక నవలల్లో జాత్యాభిమానం, అంతః కలహాలు, పేదల అణచివేత, వరకట్న దురాచారం, వివాహ వ్యవస్థలోని లోటు పాట్లు, రైతుల క్షీణదశ మొదలైన అనేక సమస్యలను చిత్రించారు. వర్మగారికి ఆర్యసమాజం వంటి సంఘ సంస్కరణా దృష్టి ప్రధానంగా గల సంస్థలతో దగ్గర సంబంధం ఉండేది. కాబట్టి ఆయన తన సాంఘిక నవలల్లో సంఘ సంస్కరణకు సంబంధించిన సమస్యలను ప్రతిపాదించారు. వైవాహిక సమస్యలతో పాటు సాంఘిక దురాచారాలు, బాల్య వివాహాలు, ప్రేమ వివాహాలు

---

1. హిందీకే సాహిత్య నిర్మాత - బృందావన్ లాల్ వర్మ - డా॥ ప్రభాకర్ మాచవే., పు. 51.

మొదలైన సమస్యల్ని కూడా చర్చించారు.

"భారతదేశం పతనం కావడానికి సామాజిక పరిస్థితులే మూలకారణం అని ఆయన దృఢ నిశ్చయం. అందుకే ఆయన అనేక సామాజిక సమస్యలను, దుష్ట సంప్రదాయాలను సాంఘిక నవలల్లో చిత్రీకరించారు."[1]

'ఝాన్సీ కీ రాణి లక్ష్మీబాయి' లో స్వాతంత్ర్య ఆందోళనను సమర్థించినట్లే, స్వాతంత్ర్య ఆందోళనలో ఉన్న హింస, అహింస విచారాల్ని 'అచల్ మేరా కోయీ' అనే సాంఘిక నవలలో నిరూపించారు.

**వర్మగారు రాసిన సాంఘిక నాటకాలు :** 1. "ధీరే ధీరే, 2. రాఖీ కీ లాజ్, 3. బాఁస్ కీ ఫాఁస్, 4. పీలే హాత్, 5. సగున్, 6. నీలకంఠ్, 7. కేవట్, 8. మంగళ్ సూత్ర్, 9. ఖిలౌనే కీ ఖోజ్, 10. నిస్తార్, 11. దేఖా దేఖీ"[2]

**కథానికలు :** 1. "కళాకార్ కా దండ్, 2. శరణాగత్, 3. అంబర్ పూర్ కే అమర్ వీర్, 4. ఐతిహాసిక్ కహానియాఁ, 5. మేంఢక్ కీ బ్యాహ్, 6. అంగూఠీ కా దాన్."[3]

**మహారాష్ట్ర చరిత్రను ఆధారంగా చేసుకొని రాసిన కథలు:** 1. "అణ్ణా జీ పంత్. 2. రామ శాస్త్రీకీ నిస్పృహతా, 3. మహాజ్ ఏక్ మామూలీ సవార్, 4. సత్తా ధారీ కా తమాచా"[4]

---

1. ఉపన్యాస్‌కార్ బృందావన్‌లాల్ వర్మ - డా॥ శశిభూషణ్ సింహాళ్, పు: 11.
2. హిందీ కే సాహిత్య నిర్మాత 'బృందావన్‌లాల్ వర్మ' - డా॥ ప్రభాకర్ మాచవే, పు: 72.
3. పైదే., పు: 64.
4. పైదే., పు: 66.

**రాజనీతికి సంబంధించిన కథలు :** "1. కాయదే కీ బాత్, 2. దేశ్ ద్రోహీ కా ముహ్ కాలా, 3. బద్‌లే కే సాథ్ ఇంగ్లాండ్ కా భీ భలా, 4. ఋణ్ సాఫ్ ఔర్ ఈమాన్ నహీ టూటా, 5. గుప్త్ సభా, 6. వే దిన్ లద్ గయే మేమ్ సాబ్, 7. ఘాయల్ సిపాయీ, 8. నానా సాహెబ్ ఔర్ కాన్పూర్ దుర్ఘటన, 9. బైలూర్ కా విద్రోహ్, 10. దయావాన్ యా, 11. అభీ మై జీవిత్ హూఁ, 12. ఢిల్లీ కే పతన్, 13. క్యా ఏక్ కారణ్ యహ్ భీ థా ?"[1]

**చారిత్రక నాటకాలు :** "1. ఝాన్సీ కీ రాణి, 2. ఫూలోఁ కీ బోలీ, 3. హాంస్ మయూర్, 4. బీర్బల్, 5. లలిత-విక్రమ్, 6. జహాఁదార్ షాహ్"[2]

**ఏకాంకికలు :** "1. కాశ్మీర్ కా కాంటా, 2. కనేర్, 3. లో భాయీ, పంచో! లో!"[3]

హిందీ సాహిత్యంలో విభిన్న ప్రక్రియల్ని చేపట్టి రచనలు గావించిన వారు చాల తక్కువమందేనని చెప్పవచ్చు. ఎందుకంటె ఒక ప్రక్రియలో సాఫల్యాన్ని పొందాలంటే ఎంతో కృషి, పరిశ్రమ చేయాల్సి ఉంటుంది. అటువంటి స్థితిలో విభిన్న ప్రక్రియల్ని చేపట్టి గ్రంథాలు రచించాలంటే ప్రతిభా పాటవాలు మెండుగా ఉన్న రచయితలకే సాధ్యం అవుతుంది. వర్మగారు ప్రతిభాశాలియైన

---

1. హిందీ కే సాహిత్య నిర్మాత 'బృందావన్ లాల్ వర్మ' – డా॥ ప్రభాకర్ మాచవే., పు: 68
2. పైదే., పు: 71.
3. పైదే., పు: 74.

రచయిత కాబట్టే పలురకాలైన ప్రక్రియల్ని చేపట్ట గలిగారు.

ఇన్ని ప్రక్రియల్ని చేపట్టినా వారికి చారిత్రక నవలా కారునిగా గొప్ప పేరు ప్రఖ్యాతులు లభించాయి. ఇతర హిందూ రచయిత లెవ్వరూ ఇన్ని కోణాలలో పరిశీలించి, ఇన్ని చారిత్రక గ్రంథాలు రాసి ఉండలేదు. వర్మగారి రచనలు హిందీ సాహిత్య గ్రంథాలయానికి గొప్ప నిధి వంటివి.

వర్మగారు ఎన్నో పుస్తకాలు చదివారు. అన్ని పుస్తకాల ప్రభావం వారిపైన లేక పోయినా కొన్నింటి ప్రభావం మాత్రం వారిపై తప్పక కనిపిస్తుంది. ఆ పుస్తకాలు 'భారతేందు హరిశ్చంద్ర' గారి 'భారత్ దుర్దశ', 'నీలాదేవి' అనే నాటకాలు; 'వాల్టర్ స్కాట్' గారి 'అయివే నహో', 'టెలిస్మై' అనే నవలలు; 'టాడ్' గారి 'రాజస్థాన్'; బుద్ధుని చరిత్రకు సంబంధించిన రెండు పుస్తకాలు; థియోసోఫికల్ సొసైటీకి సంబంధించిన 'అకల్ట్ వరల్డ్' (occult world); 'శామ్యూల్ స్మైల్' పుస్తకాలైన క్యారెక్టర్, సెల్ఫ్ హెల్ప్, 'చార్లెస్ డార్విన్' గారి 'ఆరిజన్ ఆఫ్ స్పీసీజ్'; 'వకీలు' గారి 'ఇంగ్లాండ్ మే( సభ్యతా సంస్కృతి'; స్పెన్సర్ మరియు మార్క్స్ ఎక్సన్ గార్ల పుస్తకాలు; 'దాంతే' గారి పుస్తకాలు, 'విక్టర్ హ్యూగో' గారి నవలలు. ఇవి మాత్రమే గాక 'మానవ విజ్ఞాన శాస్త్రం' (Anthropology) 'సమాజ విజ్ఞానం' మనో విజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు; 'మొపాసా' 'టాల్‌స్టాయ్' గారి పుస్తకాలు; 'పుష్కిన్' గారి కొన్ని పుస్తకాలు; 'ఇమర్సన్' 'షా'

మరియు 'గాల్స్ వర్ది' గారి నాటకాలతో వర్మగారికి పరిచయ ముంది. వీనితోపాటు చంద్రకాంత, రామాయణ్, మహాభారత్; జర్మనీ కవి 'గెథె' గారి 'ఫౌస్' కు ఆంగ్లానువాదం, 'శకుంతల', 'ముద్రారాక్షసం', 'గలివర్ ట్రావెల్స్', 'అరేబియన్ నైట్స్', 'అలిఫ్ లైలా' (ఈ మూడు పుస్తకాలు వర్మగారికి 3వ తరగతిలో బహుమతులుగా వచ్చాయి. 'రాబిన్ సన్ క్రూసో' (4వ తరగతిలో బహుమతి), 'రిజ్ డెవిడన్' గారి 'బుద్ధిస్ట ఇండియా'; 'ఎ బెదూ బెయో' గారి భారత్‌కు సంబంధించిన పుస్తకం (ఈ పుస్తకం వర్మగారికి మెట్రిక్ పరీక్ష ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనందు వల్ల వచ్చింది) చదివారు. భాషాభేదం లేకుండా ఈ విధంగా వర్మగారు అసంఖ్యాకంగా పుస్తకాలను చదవడం జరిగింది"[1]

అనేక పుస్తకాలు చదవడం, చారిత్రక ప్రదేశాలు దర్శించడం, పుస్తకాలు రాయడం వల్ల న్యాయవాద వృత్తికి న్యాయం చేకూర్చలేనని భావించి వర్మగారు ఆ వృత్తికి స్వస్తి చెప్పారు. పూర్తికాలం రచనలు చేయడంలోనే గడిపారు. చివరి రోజుల్లో కూడ ఆయన రచనలు చేయడం మానలేదు. "1964 లో (అప్పుడు వర్మగారి వయస్సు 75 సం॥) పాకిస్థాన్ భారతదేశంపైన యుద్ధం ప్రకటించింది. యుద్ధ వార్తలను స్త్రీపురుషులు, బాలురు, యువకులు వినేందుకు ఉత్సాహం చూపేవారు. ఈ ఉత్సాహాన్ని చూచి ప్రేరేపితుడై వర్మగారు

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పు: 81,82.

మరజ్యోతి' అనే నవలను రాశారు."[1]

2.2.11. లక్ష్యసిద్ధి : వర్మగారి జీవితం వేట, భ్రమణం, వకీలు, సమాజసేవ, పుస్తక పఠనం మొదలైన అనుభవాలన్నింటితో కూడుకొని ఉండడం చేత అతనిది పరిపూర్ణ జీవితం అని చెప్పవచ్చు. ఆయన శ్రమించి పొందిన జ్ఞానాన్ని తనలోనే దాచుకోలేదు. ఆ జ్ఞానాన్నంతా తన కథలు, నాటకాలు, నవలల్లో ప్రవేశపెట్టారు. జ్ఞానాన్ని పొందడంలో ఆసక్తి, దాన్ని పైకి చెప్పడంలో గల ఉత్సాహం అతని జీవితంలో ముఖ్యమైన విశేషాలు. "జ్ఞానం సంపాదించడంలో అతని మనస్సు ఎప్పుడూ తృప్తి పొందలేదు. అట్లాగే రాయడంలోనూ అతని కలం అలసిపోలేదు. అతని మనస్సు ఎప్పుడూ అనుభవాలతో నిండిపోగా అతని లేఖిని కాగితంపై ఎల్లప్పుడూ నాట్యం చేసేది"[2]

వర్మగారు లక్ష్యసాధనలో అమిత ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించారు. ఆయన స్వయంగా తన డైరీలో ఇలా రాసుకున్నారు. "న్యాయవాద పరీక్ష పాసైనా న్యాయవాద వృత్తిలో ఎక్కువ పని చేయను. ఏదైనా కాలేజీలో ఉపాధ్యాయుడుగా పని చేస్తాను. ఎప్పుడైతే ఎక్కువ డబ్బు జమచేస్తానో ఆ నాటికి ఇంగ్లాండు వెళ్ళి చరిత్రలో పట్టా పుచ్చుకొని చారిత్రక పుస్తకాలను విరివిగా రాస్తాను"[3] ఆ సమయంలో వర్మగారి తల్లి దివంగతురాలైనందున తన ఆశయం

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య- డా॥ మోహినీ సహాయ్., పు: 91, 92.
2. పైదే., పు: 94.
3. పైదే., పు: 72.

ప్రకారం ఇంగ్లాండు వెళ్ళలేక పోయారు. కాని చారిత్రక పుస్తకాలు మాత్రం విరివిగా రాశారు.

వర్మాగారికి పసితనం నుంచి ధార్మిక విశ్వాసం, ఆంగ్లేయుల బానిసత్వపు చర్యల పట్ల విరోధ భావం, పుస్తక పఠనంపై ఆసక్తి, వృత్తిపైన అభిరుచి, శ్రమ పట్ల గౌరవం మొదలైన ఉత్తమ లక్షణాలుండేవి.

కేవలం పుస్తకాలు చదవడమే గాక మంచి పుస్తకాలు రచించి లోకానికందించడం కూడ అతని లక్ష్యం. పుస్తకాలు చదవడానికి, రాయడానికి మనోబలం మాత్రమేగాక శారీరక దారుఢ్యం కూడ ఉండాలన్నది అతని విశ్వాసం. ఆ కారణంగా వ్యాయామం చెయ్యడం అతని దినచర్యగా ఉండేది. కర్తవ్య నిర్వహణకు, శారీరక, మానసిక సౌష్ఠవం అత్యంతావశ్యకమని వర్మాగారి నమ్మకం. ఆయన ఈ రెండు విషయాల్లో ఎల్లప్పుడూ జాగ్రత్తగా ఉండేవారు. అందువల్ల ఆయన జీవితంలో ఏ లక్ష్యాల్ని సాధించాలనుకొన్నారో ఆ లక్ష్యాల్ని సాధించి సఫలీకృతులయ్యారు. "సజీవత్వం, జీవకళ, ఆనందోల్లాసం మొదలైనవన్నీ వర్మాగారి జీవితాంతం వరకు ఆయన వద్ద పుష్కలంగా ఉండేవి. కావున డెబ్బై ఏడు సంవత్సరాల వయస్సులో కూడ ఆయన యువకుని వలె కనబడే వారు"[1]. "వార్ధక్యం జీవితంలో సమయాన్ని చక్కగా వినియోగించక పోవడం వల్ల వస్తుంది. మానవునిలో జీవనశక్తి ఉంటే

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్, పు: 94.

ముసలి తనం కూడ పడుచు తనపు మాతుంది అని మొగల్ పాదుషా అక్బర్ చరకాన్ని మననం చేసుకొంటూ వృద్ధాప్యంలో కూడ నేను యువకిశోరమే అని అనుకొంటూ ఉండేవారు."[1]

" జీవితంలో సుఖాన్ని, ప్రగతిని పొందాలంటే మిథ్యాభిమానం, వైభవ ప్రదర్శనం సాధనాలు కావు. శారీరక శ్రమ, ఉత్సాహం, కర్తవ్య నిష్ఠ మొదలైనవి ముఖ్య సాధనాలు "[2] అని వర్మగారే స్వయంగా చెప్పుకొన్నారు.

ఈ రకంగా నిరంతర కృషి, అధ్యయనంతో లక్ష్యసిద్ధిని పొందిన వర్మగారు హిందీ కవితామతల్లికి ముద్దు బిడ్డలై ఆయనకు ఆయనే సాటి అని అనిపించారు. అటువంటి వ్యక్తిత్వం 'నభూతో నభవిష్యతి' అని చెప్పవచ్చు.

**2.2.12. పురస్కారాలు ( గౌరవాలు ) బహుమతులు:**

బృందావన్ లాల్ వర్మగారి రచనలు హిందీ సాహిత్యానికి నిధి. వర్మగారికి ఆయన రచనల కారణంగా అనేక బహుమానాలు లభించాయి.

"వర్మ గారి 'మృగనయనీ' నవలకు అనేక బహుమతులు లభించాయి. వర్మ గారి ఈ నవలకు వచ్చినన్ని బహుమతులు మరి ఏ ఇతర నవలకు రాలేదు".[3] దీనికి—

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పృ: 94.
అక్బరు ఛందస్సు: "ఇఇథ జిందగీ మే వక్త్ కే జోశ్ రవానీ హై
అగర్ జిందాదిలీ హై తో బుఢాపా భీ జవానీ హై"
2. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పృ: 94.
3. పెదే.

"1. హారం జీమల్ దాల్మియా బహుమానం.

2. సాహిత్య సంఘానికి చెందిన శ్రీ సాహు జగదీశ్ ప్రసాద్ బహుమతి.

3. ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వానికి చెందిన సాహిత్య బహుమానం.

4. మధ్య ప్రదేశ్ ప్రభుత్వానికి చెందిన సాహిత్యానికి , కళలకు ఇవ్వబడే సర్వ శ్రేష్ఠమైన బహుమానం.

5. కాశీ నాగరీ ప్రచారిణీ సభకు చెందిన మహా వీర ప్రసాద్ సర్వ పతకం మొదలైన బహుమానాలు లభించాయి "[1]

ఇటీవలే 1992 సంవత్సరం 'మృగనయని' నవల ప్రముఖ హిందీ నటుడు అమోల్ పాలేకర్ దర్శకత్వంలో దూరదర్శన్‌లో ధారావాహికగా ప్రసారమైంది.

"వర్మ గారి 'ఝాన్సీ కీ రాణి లక్ష్మీబాయి' నవలకు 1954లో భారత దేశ ప్రభుత్వం రూ॥ 2000/- బహుమతి ఇచ్చి వర్మగారిని సత్కరించింది."[2] ఈ నవల ఆధారంగా ప్రముఖ హిందీ నటుడు, చిత్ర నిర్మాత, దర్శకుడు సొహ్రాబ్ మోడి గారు 'ఝాన్సీ కీ రాణి' అనే పేరుతో చలన చిత్రాన్ని నిర్మించారు.

"గణేశ్ శంకర్ విద్యార్థి గారు 'గఢ్ కుండార్' నవల ముద్రణకు అవకాశం కల్పించారు. అంతే కాకుండా వీరే ఈ నవల రచించిన వర్మగారికి 'సర్ వాల్టర్ స్కాట్' బిరుదు నిచ్చారు"[3]

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్ ., పు: 94.
2. హిందీకే సాహిత్య నిర్మాత 'బృందావన్‌లాల్ వర్మ–డా॥ ప్రభాకర్ మాచవే, పు: 25
3. పైదే., పు: 23.

"వర్మగారిని ఉత్తర భారత దేశానికి చెందిన విద్యాశిక్షా మంత్రాలయం సత్కరించింది. వీరికి మధ్యప్రదేశ్ సాహిత్య సంస్థ బహుమానం, హరంజీమల్ దాల్మియా బహుమానం, ఉత్తరప్రదేశ్‌కు చెందిన హిందూస్థానీ అకాడమీ బహుమానం, కాశీ – నాగరీప్రచారిణీ సభకు చెందిన మిక్కిలి అమూల్యమైన బహుమానం, సోవియట్ బహుమానంతో వర్మగారిని సత్కరించడం జరిగింది."[1]

"1958 లో వర్మగారిని భారత ప్రభుత్వం సత్కరించి అతనికి 'పద్మభూషణ్' గౌరవ ప్రదానం చేసింది."[2]

"ఆగ్రా వి॥ విద్యాలయం అతనికి గౌరవనీయమైన డి.లిట్ బిరుదు ఇచ్చింది."[3]

1967 సంవత్సరం వర్మగారు సాంస్కృతిక ప్రతినిధిగా రష్యా వెళ్ళి, ఒక నెల రోజులు అక్కడ పర్యటించారు.

**2.2.13 బృందావన్‌లాల్ వర్మగారి గురించి ప్రముఖుల అభిప్రాయాలు:**

బృందావన్‌లాల్ వర్మగారు ఫిబ్రవరి 23, 1969 లో దివంగతులైనారు. వీరి మరణాన్ని పురస్కరించుకొని అనేకులు ఈ విధంగా ప్రశంసించారు. శ్రీ వియోగి హరి గారు "బృందావన్ లాల్ వర్మలాంటి సాహిత్యకారుని పొంది భారతదేశ గౌరవం పెంపొందింది"[4]

ఆచార్య శివపూజన్ సహాయ్ గారు "హిందీ కథా సాహిత్యానికి

---

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహిణీ సహాయ్., పు:
2. హిందీ కే సాహిత్య నిర్మాత బృందావన్‌లాల్ వర్మ – డా॥ ప్రభాకర్ మాచవే., పు: 28.
3. పైదే., పు: 28.
4. పైదే. పు: 29.

సాహిత్య కృషి, నిరంతర అధ్యయనం వ్యక్తమౌతున్నాయి. ప్రాచీన సంస్కృతి పరంపర పై గల ప్రగాఢ విశ్వాసం, ఆధ్యాత్మిక భౌతిక వాదాల సమన్వయం, మానవతా దృష్టి, సృష్టిలోని సర్వప్రాణులపైన దయాదృష్టి. లోక కల్యాణ సాధన కాంక్ష వర్మగారికి జన్మతః సిద్ధించిన లక్షణాలుగా చెప్పవచ్చు.

సామాజిక స్పృహతో పాటు వారి రచనల్లో సనాతన భారతీయ చింతన మనకు అవగతమౌతుంది. వారి నవలల్లో ఒక నిశితమైన ఆదర్శముంది. భారతీయ పరంపరాగత భావాలను పరిణితి చెందిన ఆలోచనల ద్వారా తన నవలల్లో శృంగారాన్ని ప , ఆత్మీయ భావంగా చిత్రించడం వీరి ముఖ్యోద్దేశం.

పరంపరగా వచ్చే ఆచారాలను ఖండించడం ఆయనకు ఇష్టం లేదు. వారి నవలల్లో దృఢ విశ్వాసం, ఆదర్శం పెనవేసుకొన్నాయి. మానవ జీవితానికి సంబంధించిన శాశ్వత విలువలపై ప్రగాఢ విశ్వాసం, లోక మంగళదృష్టి వారి రచనల్లో ద్యోతక మౌతాయి.

శ్రేష్ఠమైన తన రచనల ద్వారా బృందావన్ లాల్ వర్మగారు ప్రతిభా సంపన్నమైన నవలాకారునిగానే గాక, హిందీ నవలా సాహిత్యానికి ఆదర్శప్రాయులు గాను, చారిత్రక సత్యాలను ఆవిష్కరించిన చరిత్రకారులు గాను, ఒక ప్రబల శక్తిగాను దర్శన మిస్తారు. హిందీ సాహిత్యంలో ప్రఖ్యాత నవలాకారులైన రాహుల్ సాంకృత్యాయన్, హజారీ ప్రసాద్ ద్వివేదీ, యశ్ పాల్,

రాంగేయ రాఘవ్ మొదలైన గొప్ప చారిత్రక నవలాకారులెందరో ఉన్నప్పటికీ, చారిత్రక నవలల్లో తన వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా వ్యక్తీకరించి, సాహిత్య చరిత్రలో తనదంటూ ప్రత్యేక స్థానాన్ని సంపాదించిన ఘనత వర్మగారికి దక్కుతుందనడంలో ఏమాత్రం సందేహం లేదు.

2.3.1. బాల్యం : అడివి బాపిరాజు గారు 1895 వ సంవత్సరం జన్మిస్తే, వర్మగారు 1889 వ సంవత్సరం జన్మించారు. అంటే వీరిద్దరిలో వర్మగారు బాపిరాజు గారి కంటే 6 సంవత్సరాలు పెద్దవారు. ఇద్దరూ చిన్న గ్రామం లోనే జన్మించారు. బాపిరాజు గారి తండ్రి కృష్ణయ్య గారి ప్రధాన వృత్తి వ్యవసాయం. అయినా తన చుట్టూ చేరిన వారు మిత్రులైనా, పనివాళ్లైనా కథలూ, కబుర్లూ చెబుతూండే వారు. ఆయన ఎప్పటికప్పుడు కథల్ని అల్లి, ఎంతో ఆసక్తికరంగా, రంజింపజేసే విధంగా చెప్పేవారట. అందుకే వీరి కథలు వినాలని చెవి కోసుకొని వచ్చి కూర్చునే శ్రోతలు ఎక్కువ. ఈ విధంగా శ్రోతల్ని ఆకట్టుకునే గుణం బాపిరాజు గారికి చిన్నప్పట్నుంచే అబ్బింది. తన తండ్రి గుణాల్ని పుణికి పుచ్చుకొని, దానికి పదును పెట్టి గొప్పకవి, రచయిత అయినారు బాపిరాజు గారు. అలాగే వాళ్లమ్మ సుబ్బమ్మగారు ఎంతో మధురంగా పాడేది. వాళ్లమ్మలాగే బాపిరాజు గారు కూడా మధుర గాయకుడు.

వర్మగారికి అతని ముత్తవ్వ అనేక సాహసకథల్ని ఎంతో ఆసక్తికరంగా, శరీరం గగుర్పొడిచే విధంగా చెప్పేది. ఇంకా రామాయణ మహాభారతాల్లోని రాముడు, భీముడు, అర్జునుడు, కృష్ణుడు మొదలైన ఆదర్శ పాత్రల సాహసోపేతమైన గుణ గణాల్ని వర్ణించి చెప్పేది. ఇవన్నీ వినడం వల్ల కథనా నైపుణ్యం, భారతీయ సంస్కృతిపై అభిమానం, నిర్భయత్వం, ధైర్య సాహసాలు వర్మగారిలో జీర్ణించుకు పోయాయి.

బాపిరాజు గారికి తొలిగురువు వారి తండ్రి కృష్ణయ్య గారైతే

వర్మ గారికి అతని ముత్తవ్వే మొట్టమొదటి గురువు. అంటే ఇద్దరికి కూడా కుటుంబ వ్యక్తులే వారిలోని సృజనాత్మక శక్తికి బీజంవేసి, వారి వ్యక్తిత్వాలను మలచేందుకు దోహదం చేశారు.

2.3.2 **విద్యాభ్యాసం :** బాపిరాజు గారు చిన్నప్పుడు వీధి బడిలో ప్రాథమిక విద్యను పూర్తి చేసుకొని, 1911-1914 కాలంలో ఆరవఫారం పాసై, 1917 లో రాజమండ్రి కాలేజీలో ఇంటర్ చదివారు. అప్పుడు ఆ కాలేజీ ప్రిన్సిపాల్ గారైన 'ఆస్వాల్డ్ కూల్డ్రే' గారు బాపిరాజు గారిలో విద్యార్థిపై ఉన్న కవితను, చిత్రకళను గుర్తించి మేల్కొలిపారు. చదువులో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్న బాపిరాజు గారు రాజమండ్రిలో B.A పూర్తి చేసి, తర్వాత 'మద్రాసు' లో 'లా' కాలేజీలో చేరి న్యాయ శాస్త్రాన్ని అధ్యయనం చేసి బి.యల్. పట్టా పుచ్చుకొన్నారు. 1924 వ సం॥ లో ఆయన బందరు కళాశాలలో చేరి శ్రీ ప్రమోద కుమార్ చటర్జీ వద్ద చిత్రకళా శిక్షణ పొందారు.

వర్మ గారు 'ఝాన్సీ' లోని ప్రాథమిక పాఠశాలలో చదువు కొని, లలితపురం లో 'మిడిల్' పరీక్షల్లో ఉత్తీర్ణులై తిరిగి ఝాన్సీలోని 'మెక్‌డొనాల్' మాధ్యమిక పాఠశాలలో మెట్రిక్ పూర్తి చేశారు. అంతటితో వారి కుటుంబ ఆర్థిక పరిస్థితుల వల్ల ఆయన చదువు ఆగి పోయింది. కాని చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ అనేక విషమ పరిస్థితులను ఎదుర్కొని, గ్వాలియర్ లోని విక్టోరియా కళాశాలలో B.A పరీక్ష, ఆగ్రాలో L.L.B (న్యాయవాద) పరీక్షల్లో ఉత్తీర్ణులైనారు. చిన్నప్పట్నుంచీ

ఇద్దరికీ పుస్తక పఠనం అంటే చాలా ఇష్టం. రాజు గారిలో నిద్రాణమై ఉన్న కవితను, చిత్రకళను గుర్తించి మేల్కొలిపిన కూర్మా దారగారి లాంటి వారు వర్మగారికి ఎవరూ తటస్థ పడలేదు. చిన్న వయస్సు లోనే వర్మగారి ముత్తవ్వ, చిన్నాయన ఆయనలోని సృజనాత్మక శక్తిని వెలికి తీశారు. తర్వాత వర్మగారే స్వయం కృషితో అభివృద్ధి చెందారు.

**2.3.3. వివాహం :** బాపిరాజు గారికి B.A. రెండవ సంవత్సరం చదువుతూ ఉండగానే వివాహం జరిగింది. ఆయన భార్య సుభద్రకి ఆయన పట్ల ఎనలేని అనురాగం. అనురాగం తోటే అనుమానం. తన భర్త ఎక్కడికీ వెళ్ళకుండా తన తోటే ఉండాలని ఆవిడ బాధ. బాపిరాజుగారు ఇంటికి ఆలస్యంగా వచ్చినా అనుమానమే. ఆ దంపతులకు ముగ్గురు మగ బిడ్డలు పుట్టి చని పోవడం, నాల్గవసారి కూతురు పుడ్తే ఆమెకు పోలియో వ్యాధి సోకడం, సుభద్రమ్మకు నరాల జబ్బు రావడం, ఇంతటి బాధాకర జీవితంలో కూడా బాపిరాజుగారు చెదరని ధైర్యంతో, చెరగని చిరు నవ్వుతో రచనా వ్యాసంగం మాత్రం మానలేదు.

వర్మగారి సాంసారిక జీవితం బాపిరాజు గారి కంటె పూర్తిగా భిన్నమైంది. ఆయనకు 11 సంవత్సరాలప్పుడు, ఆ కాల పరిస్థితులను బట్టి వివాహం జరిగింది. ఆయన భార్యపేరు సరయూదేవి. వారిది బాల్య వివాహమైనా ఎంతో అనుకూల దాంపత్యమై విలసిల్లింది. ఆమె అబలమైనా సబలలా అసాధారణ ధైర్యంతో దేవివలె పరి వారాన్ని రక్షిస్తూ, అద్వితీయమైన సేవ చేసేది.

సాంసారిక జీవితం వరకు వర్మగారికి బాపిరాజు గారి వలెగాక నల్లేరుపై బండి నడకలా హాయిగా సాగింది. బాపిరాజు గారికి మనః క్షోభ కల్గించిన ఘట్టాలు లాంటివి సాంసారిక జీవితంలో వర్మ గారికి తటస్థ పడలేదనే చెప్పవచ్చు. ఈ విషయంలో రాజుగారి కంటే వర్మగారు అదృష్టవంతులే.

**2.3.4. మాతృభూమిపై ప్రేమ:** ఇద్దరికీ మాతృభూమిపై ఎనలేని ప్రేమ ఉంది. బాపిరాజు గారు ఆంధ్రాభిమాని, వర్మగారు బుందేల్ ఖండ్ అభిమాని అని మనకు స్పష్టంగా తెలుసు. భిన్నత్వంలో ఏకత్వం అన్నట్లు దాని చివరిమెట్టు దేశాభిమానమే. వారి రచనల్లో కూడా ఆ భావమే తొణికిసలాడుతూ ఉంటుంది. వారి కథాంశాల లోని భావ సమైక్యత (emotional integration) వల్ల జాతీయ సమైక్యత (National Integration) ప్రస్ఫుట మౌతుంది. 'కూర్త్రే' దొరగారు మంచి ఉద్యోగం ఇప్పిస్తాను 'ఇంగ్లండు' రమ్మని ఆహ్వానిస్తే, భారతదేశాన్ని వదిలి వెళ్లేందుకు ఇష్టంలేక వినయంగా కూర్త్రేగారి ప్రతిపాదనను తిరస్కరించారు బాపిరాజు గారు. దేశ సేవకోసం నిరంతరం పాటుపడ్డారు. దేశ స్వాతంత్ర్యం కోసం సత్యాగ్రహాల్లో పాల్గొని జైలుకు కూడా వెళ్లారు. జైల్లో ఉండే రాజుగారిని చూచేందుకు ఆయన శ్రీమతి వస్తే ఆవిడను పలుక రించలేదు. కారణం ఆవిడ ఖద్దరు ధరించక పోవడమే.

వర్మగారికి కూడా మన భారతదేశమన్నా, భారతీయు లన్నా ఎనలేని ప్రేమ. వర్మగారి ముత్తాత 'ఆనందరావ్ మాధవ్' గారు

దేశ భక్తులు. ఆయన దేశభక్తి మనుమడైన వర్మ గారిలో చిన్నప్పట్నుంచి నరనరాల్లో ప్రాకిపోయి ఉంది. అందుకే హిందువుల శౌర్యాన్ని, దేశ భక్తిని వేనోళ్ల చాటాలనీ, ఆంగ్లేయ చరిత్రకారులైన 'మార్పిడున్', 'పారసనీస్'లు హిందువుల శౌర్య పరాక్రమాలను గురించి సందేహిస్తూ రాస్తే, వారి రాతలు తప్పనీ, హిందువులు అమిత శౌర్య పరాక్రమ వంతులనీ నిరూపించాలని తాపత్రయ పడ్డారు వర్మగారు. ఆ తాపత్రయం నుంచే 'ఝాన్సీ కీ రాణి లక్ష్మీబాయి', 'అహిల్యాబాయి' లాంటి నవలలు వర్మగారి కలం నుంచి వెలువడ్డాయి. అందుకే 'జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ' అన్న భావన మూర్తీభవించిన వారు వీరిద్దరు అని చెప్పక తప్పదు.

**2.3.5. ఉద్యోగ జీవితం:** నవలా రచయితలుగా స్థిర పడక ముందు బాపిరాజు గారు, బృందావన్‌లాల్ వర్మగారు చిన్న చిన్న ఉద్యోగాలు కొన్ని చేశారు. కాని ఏ ఉద్యోగంలోను స్థిర పడక వదిలేశారు. ఇద్దరూ న్యాయవాద వృత్తి ఆరంభించారు. కాని ఎక్కువ రోజులు చెయ్యలేదు. తమ రచనా వ్యాసంగానికి న్యాయవాద వృత్తి అడ్డుగా వుందనీ, ఆ వృత్తిలో ఇమడలేమనీ తెలిసి ఇద్దరూ మానేశారు. తర్వాత కాలమంతా వర్మగారు రచనలు చేయడంలోనే గడిపారు. కాని బాపిరాజు గారు రచనలు చేస్తూ కూడా సంసారం గడిచేందుకు ఉద్యోగం కోసం చాల శ్రమ పడ్డారు. కథలు రాసి పత్రికలకు పంపో, రేడియోలో 'ఎంగేజిమెంట్లు' సంపాదించో డబ్బులు సమకూర్చుకొనే వారు. కొన్నాళ్ళు

ఆంధ్ర జాతీయ కళాశాలలో కులపతిగా పని చేశారు. తర్వాత చిత్ర సీమలో కళాదర్శకులుగా పని చేసినా, ఆ కళారంగంలో కూడా ఇమడలేక వచ్చేశారు. ఆపై 'మీజాన్' పత్రిక సంపాదకునిగా పని చేశారు. విజయవాడ రేడియో స్టేషను వారికి సలహాదారుగా పని చేశారు. చివరి రోజుల వరకు బాపిరాజుగారు డబ్బుకు ఇబ్బంది పడుతూనే ఉన్నారు. చివరి రోజుల్లో వారికి డబ్బు సమస్య తీరింది. కానీ ఎక్కువ రోజులు జీవించలేక పోయారు. డబ్బు సంపాదనకు రాజుగారు పడినంత శ్రమ వర్మగారు పడలేదు.

2.3.6. **అభిరుచి :** రాజుగారికి, వర్మగారికి దేశ భ్రమణం చెయ్యడమన్నా, చరిత్ర ప్రసిద్ధాలైన ప్రదేశాలు దర్శించడమన్నా, సెలయేళ్ళు, నదులు, కొండలు మొదలైన ప్రాకృతిక సౌందర్యం గల ప్రదేశాలు తిరగడమన్నా, దేశసేవ, ప్రజాసేవ, సమాజసేవ చేయడమన్నా ఎంతో ఇష్టం. ఇక పుస్తక పఠనం అంటే వీరిద్దరికీ ఉన్న అభిరుచి అందరికీ తెలుసు. పుస్తకాలు రాయాలన్నా, ముఖ్యంగా చారిత్రక నవలలు రాయాలంటే వీరిద్దరికీ ఎంతో ఇష్టం. చారి( నవలల విషయ సేకరణకు ఆయా చారిత్రక ప్రదేశాలు ఎంతో ఉత్సాహంగా దర్శించేవారు.

పై విధంగా ఇద్దరి అభిరుచులు ఇంచుమించు ఒకటిగా ఉన్నా, కొన్ని వైషమ్యాలు కూడా ఉన్నాయి. వర్మగారికి చిన్నప్పట్నుంచీ వ్యాయామం, కుస్తీ, హఠయోగం, ప్రాణాయామం, వేట,

గుర్రప్పు స్వారీ, ఈత కొట్టడం, ఫుట్ బాల్, హాకీ, క్రికెట్టు మొదలైన క్రీడల్లో పాల్గొనడం అంటే ఎంతో ఇష్టం. కొన్నాళ్ళు తోటల పెంపకం పై కూడా ఆసక్తి కనపరచారు. తన ఆరోగ్యం పైన కూడా ఎక్కువ శ్రద్ధ చూపేవారు. రాజుగారికి పై అలవాట్లు ఉన్నట్లు కన్పించదు. ఒక్క ఈత కొట్టడం మాత్రం రాజుగారికి ఇష్టం. గంటల తరబడి రాజుగారు, కూర్మ్రి దొరగారు గోదావరి నదిలో ఈదేవారు.

రాజుగారు ఎక్కువగా వెన్నెలను ప్రేమించేవారు. ఆయన ఊహా సుందరి 'శశికళ'. ఆ 'శశికళను ఎంతో అభిరుచితో ఆరాధించేవారు. ఆ 'శశికళ'ను దృష్టిలో ఉంచుకొని అనేక గేయాలు రాశారు. వర్మగారికి ఊహాసుందరి అంటూ ఎవ్వరూ కనిపించరు. రాజుగారు చక్కగా పాటలు పాడేవారు. వర్మగారికి పాటలు పాడడం రాదుగాని, చక్కగా 'సితార్' వాయించేవారు. బాపిరాజుగారు వంటలు వండడంలో ప్రావీణ్యం సంపాదించారు. ఆయన వంట చేస్తే ఎంతో రుచిగా ఉండేది. ఆయన చేసిన వంటకాన్ని గురించి అనర్గళంగా ఉపన్యసించేవారు. ఆ ఉపన్యాసం ఇంకా ఎంతో రుచిగా ఉండేది. ఉపాధ్యాయుడుగా ఉండేటప్పుడు ఆయన గుత్తి వంకాయ కూరను గురించి వర్ణిస్తుంటే విద్యార్థులు లొట్టలు వేసేవారు. వర్మగారికి వంట వచ్చో, రాదో తెలియదు గాని సుష్టుగా భోజనం మాత్రం చేసేవారు. ఉదయం వ్యాయామం తర్వాత నాలుగు లేక ఐదు పెద్ద చపాతీలు తిని, రెండున్నర శేర్ల పాలు త్రాగేవారు. వ్యాయామం చేయడానికి తగిన

బలం కోసం సుష్టుగా భుజించేవారు వర్మగారు. అందుకే ఆయన 80 సంవత్సరాల వయస్సులో కూడా యువకుడిలా కనబడేవారు.

**2.3.7. ధార్మిక విశ్వాసం :** సత్యవాక్కు, ధర్మచింతన, ఉదార బుద్ధి, నీతి నిజాయితీగా బ్రతకడం వంటి సద్గుణాలు ఇద్దరిలోనూ ఉన్నాయి. నిరంతరం గుళ్ళూ గోపురాలూ చుట్టూ, వ్రతాలు పూజలూ భజనలు చేస్తూ ఆడంబరాలకు పోలేదు ఈ ఇద్దరు వ్యక్తులు. ఇద్దరూ తమ రచనలనే, మానవుల్లోని మంచితనాన్నే భగవంతునిగా భావించారు. పైపై మెరుగుల బాహ్య ప్రవర్తన కంటె చిత్తశుద్ధి కల్గిన వ్యక్తే గొప్ప ధార్మికుడు. అటువంటి కోవకు చెందిన వారే రాజుగారూ, వర్మ గారూను. 'మానవ సేవయే మాధవసేవ' అనే నమ్మకంతో ఒక ప్రక్క సాహిత్యసేవ ద్వారా మానవ సేవ చేస్తూ, మరొక ప్రక్క అడిగిన వారికి లేదనకుండా సహాయం చేసే ఉదార స్వభావం వీరిద్దరిదీ.

బాపిరాజు గారికి చిన్నప్పట్నుంచే దైవభక్తి ఉంది. వర్మగారు చిన్నప్పుడు 'హనుమాన్ చాలీసా' పఠించేవారు. 1906 వరకు దైవభక్తితో ఉండేవారు. కానీ ఆ సంవత్సరం ధర్మ సంబంధమైన ఆలోచనల్లో గొప్ప మార్పు వచ్చింది. ఆ సమయంలో ఆర్యసమాజంలోని ఒక గొప్ప వక్త ఉపన్యాసాలు అనేకం వినడం వల్ల, 'సత్యార్థ ప్రకాష్' అనే పుస్తకాన్ని అధ్యయనం చేయడం వల్ల, 'ఆర్య సమాజం' పట్ల నమ్మకం ఏర్పడి ఆర్యసమాజ సేవకుడుగా మారిపోయారు. చార్లెస్ డార్విన్, స్పెన్సర్, మార్క్స్, ఎక్టన్, దాంతే, విక్టర్ హ్యూగో

మొదలైన వారి ప్రస్తకాల ప్రభావాల వల్ల 'నాస్తికుడు' గా మారి పోయారు వర్మగారు. అయినా ప్రజాసేవ మాత్రం మానలేదు. వర్మగారిలోని మత సామరస్య దృక్పథం ఆయన నవలల్లో హిందూ మహమ్మదీయ మత సంఘర్షణను చిత్రించిన సందర్భాల్లో స్పష్టంగా వ్యక్తమయ్యింది.

**2.3.8. సాంఘిక జీవితం :** విద్యార్థి దశ నుండే బాపిరాజు గారు, వర్మగారు సాంఘిక సేవపట్ల మొగ్గు చూపే వారు. గాంధీగారి సిద్ధాంతాలు ఇద్దరినీ ప్రభావితం చేశాయి. 1918 లో 'ఝ్యూన్స్' లో 'ఇన్ఫ్లుయిన్జా' వ్యాధి భయంకరంగా వ్యాపిస్తే, వర్మగారు ఆ వ్యాధిగ్రస్తులకు ఎన లేని సేవలు చేశారు. ఆ వ్యాధితో చని పోయిన వారి శవాలను స్వయంగా మోశారు. 'ఆచారాలను మంటగలుపుతున్నావని' పెద్దలు పోరు పెడుతున్నా లెక్కచేయక హరిజనుల్ని ఇంటిలోనికి తీసుకొనివచ్చి భోజనాలు పెట్టడమే కాక, వారి విస్తళ్ళు ఎవరు తీస్తారని తర్జన భర్జన పడుతుంటే బాపిరాజు గారు తానే స్వయంగా విస్తళ్ళను తీసివేసి ఆ ప్రాంతాలను శుభ్రం చేశారు. హిందూ సమాజంలో అను స్యూతంగా వస్తున్నట్టి అంధ విశ్వాసాలను, సంప్రదాయాలను, సాంఘిక దురాచారాలను ఇద్దరూ ఖండించారు. సాంఘిక దురాచారాలైన సతీ సహగమనం, 'జౌహరువ్రతం', అంటరానితనం, వరకట్న పిశాచం, బాల్య వివాహం మొదలైన వాటి నివారణకు ఎంతో కృషి సల్పారు. హాని కలిగించే ఈ సాంఘిక దురాచారాలను రూపు మాపేందుకు

తగు సూచనలను తమ నవలల్లో సూచించారు. అడివి బాపిరాజు గారు మీజాన్ సంపాదకులుగా ఉన్నప్పుడు సాంఘిక దురాచారాలపై ఎన్నో సంపాదకీయాలు రాశారు. 'మీజాన్' పత్రికలో 'ధూప దీపాలు' అనే శీర్షికతో ఎంతో హాస్యయుతంగా, వ్యంగ్య స్ఫోరకంగా ఆ నాటి సంఘాన్ని దుయ్యబట్టారు. వర్మగారు కూడా బదరీనాథ్ భట్ట, శ్రీమన్నన ద్వివేదీలతో కలసి 'గోల్‌మాల్ కారిణి' సభను స్థాపించి 'ఛద్మ' అనే పేరుతో, హాస్య వ్యంగ్యాలతో కూడుకొన్న వ్యాసాలను రాసి పత్రికకు పంపేవారు. సంఘ దురాచారాలను ఎత్తి చూపేటప్పుడు విమర్శలలో ఎవ్వరినీ వదిలిపెట్టే వారు కాదు.

**2.3.9. రాజకీయ జీవితం :** బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మ గారు ఒక ప్రక్క రచనా వ్యాసంగంలో తలమునకలుగా నిమగ్నులై ఉన్నా, ఇంకో ప్రక్క ఆ నాటి రాజకీయాల్లో కూడా చురుకుగా పాల్గొన్నారు. ఆ నాడు మన భారత దేశం బ్రిటీష్ వారి పాలనలో, బానిసత్వంలో మగ్గుతూ ఉంది. ఇద్దరికీ గాంధీగారన్నా, ఆయన సిద్ధాంతాలన్నా శ్రద్ధ ఎక్కువ. విదేశీ వస్తువుల్ని బహిష్కరించడం ఇద్దరూ సమర్థించేవారు.

మార్స్‌డన్, పారసనీస్ లాంటి ఆంగ్ల చారిత్రక రచయితల వల్ల ఆంగ్లేయులంటేనే వర్మగారికి అసహ్యం ఏర్పడింది. ఆ అసహ్యంతో, ప్రతీకార వాంఛతో వర్మగారు వ్యాయామం చేయడం ప్రారంభించారు. ఏ నాడైనా అవకాశం వస్తే ఆంగ్లేయులను ఎదుర్కొని చిత్తు చిత్తు చెయ్యాలనుకొనే వారు. వర్మగారు కాలేజీలో చదివేటప్పుడే

బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా 'సేనాపతి ఊదల్' నాటకం రచిస్తే, ఆ నాటకాన్ని గవర్నమెంటు వారు నిషేధించారు. ఆయన కొద్దిరోజుల వరకు పోలీసుల పర్యవేక్షణలో ఉన్నారు. 1919లో 'జలియన్ వాలా బాగ్' సంఘటనపై తన స్నేహితుడైన 'బాబూరామ్ సక్సేనా' కలిసి పట్టణంలో హర్తాళ్ చేయించారు.

బాపిరాజు గారు గాంధీజీ ప్రారంభించిన సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని జైలుకు కూడా వెళ్లారు. జాతీయోద్యమ ప్రేరణతో ఎన్నో దేశభక్తి గేయాలు రాశారు. ఆ గేయాలు ఆ నాటి ఆంధ్ర ప్రజలందరి నోట్లోనూ నానుతూ ఉండేవి. 1962 లో భారతదేశంపై చైనా దురాక్రమణ జరిపినప్పుడు, క్షతగాత్రులైన సైనికులకు రక్తం ఇవ్వడానికి స్వచ్ఛందంగా వర్మగారు శిబిరానికి వచ్చారు. కాని అప్పుడు ఆయన వయస్సు 73 సంవత్సరాలు. ఆ వయస్సులో ఆయన శరీరం నుండి రక్తం తీసుకోవడానికి డాక్టర్లు నిరాకరించారు. బాపిరాజు గారు, వర్మగారు రచనల్లోనే కాకుండా నిజ జీవితంలో కూడా రాజకీయాల్లో చురుకుగా పాల్గొని, అమిత దేశభక్తిని ప్రకటించి ధన్యజీవులైనారు.

2.3.10. **సాహిత్య జీవితం:** బహుముఖ ప్రజ్ఞాశాలురైన బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మగారు కేవలం చారిత్రక నవలలను వ్రాయడమే గాక సాంఘిక నవలలు, నాటకాలు, కథానికలు, గేయాలు, వ్యాసాలు అనేకం రాశారు. చారిత్రక నవలా కారులుగా

పేర్కొనదగిన వీరిలా విభిన్న ప్రక్రియల్ని చేపట్టి రచనలు గావించిన వారి సంఖ్య చాల తక్కువ. వీరిద్దరి నవలలూ అనేక భాషల్లోకి తర్జుమా చేయబడ్డాయి. అనేక మంది పరిశోధకులు వీరి ప్రతిభా పాటవాలను గుర్తించి, వీరిపై వివిధ కోణాల్లో పరిశోధించి డాక్టరేట్ పట్టాలు పుచ్చుకొన్నారు. వర్మగారిపై పరిశోధించిన వారిలో డా॥ మోహినీ సహాయ్, డా॥ శశిభూషణ్ సింహాళ్, డా॥ శియారామ్-శరణ్ గుప్త, డా॥ ప్రభాకర్ మాచవే, డా॥ శాంతి స్వరూప్ గుప్త మొదలైన వారు ఉన్నారు. అలాగే బాపిరాజు గారిపై పరిశోధనలు చేసి పిహెచ్.డి. పొందిన వారిలో డా॥ విజయలక్ష్మి, డా॥ మన్నవ సత్యనారాయణ, డా॥ తిరుపతయ్య మొదలైన వారు ఉన్నారు. వర్మగారు రచించిన చారిత్రక నవల 'మృగనయనీ'ని ఇటీవలే దూరదర్శన్ వారు ధారావాహికగా ప్రసారం చేశారు. బాపిరాజు గారి 'హిమబిందు' నవల ప్రాతిపదికాధారంగా తెలుగులో 'సింహాసనం' అన్న చలన చిత్రం వెలువడింది. బాపిరాజు, బృందావన్‌లాల్ వర్మలు ఈ విధంగా రచనలు చేసి కళామతల్లికి ముద్దుబిడ్డలైనారు.

2.3.11. లక్ష్యసిద్ధి : ఇద్దరు రచయితలు చిత్తశుద్ధితో, లక్ష్యసిద్ధితో రచనలు గావించారు. ఇద్దరూ తమ రచనల్లో ధర్మం నిర్వహించేటప్పుడు ధర్మవేత్తలై, యుద్ధాలు వర్ణించేటప్పుడు సమరశాస్త్ర విశారదులై, సంభాషణల్లో రసమూర్తులై, శిల్ప చాతుర్యంలో శిల్పులై, వేట వర్ణించేటప్పుడు వేటగాళ్ళై, సంగీతం పాడించేటప్పుడు గాయకులై, శాస్త్ర చర్చ జరిపేటప్పుడు శాస్త్రవేత్తలై, పాత్రోన్మీలన సమయంలో

సహృదయులై మొత్తం మీద నవలా సంవిధానంలో మహా మనీషులైనారు. సజీవత్వం, జీవకళ, ఆనందోత్సాహాలు, కారుణ్యం వీరి నవలల్లోనే కాక వీరి నిజ జీవితంలో కూడా పుష్కలంగా ఉన్నాయి. కాని పరిస్థితుల ప్రభావాలననుసరించి, తాము లక్ష్యంగా ఉంచుకొన్న చిన్నచిన్న అంశాలను కొన్నింటిని సాధించుకోలేక పోయారు. వర్మగారికి ఇంగ్లండు వెళ్ళి డాక్టరు పట్టా పుచ్చుకొని రావాలని ఎంతో ఆశగా ఉండేది. కాని ఆ సమయంలో వారి తల్లి దివంగతురాలైనందున ఇంగ్లండు వెళ్ళలేక పోయారు. బాపిరాజు గారు జీవిత చరమాంకం వరకు ధనం సంపాదించాలనే లక్ష్యాన్ని సాధించలేక పోయారు. ఆ ధనం విస్తారంగా సంపాదించిన కొద్ది రోజులకే దివంగతులైనారు. తను రచించిన చారిత్రక నవల 'హిమబిందు'ను ఆనాడే చలన చిత్రంగా తీయాలని ప్రయత్నించారు. కానీ, అనివార్య కారణాల వల్ల తీయలేక పోయారు.

"జీవితంలో సుఖాన్ని, ప్రగతిని పొందాలంటే మిథ్యాభిమానం, వైభవ ప్రదర్శనం సాధకాలు కావు. నిరంతర శ్రమ, ఉత్సాహం, కర్తవ్య నిష్ఠ మొదలైనవి ముఖ్య సాధనాలు" అని చెప్పిన వర్మగారి మాటలు వర్మగారికే కాక బాపిరాజు గారికి కూడా అన్వయిస్తాయి. ఈ రకంగా నిరంతర కృషితో లక్ష్యసిద్ధిని పొందిన వీరిద్దరూ భారతీయ కవితామ తల్లికి ముద్దుబిడ్డలైనారు.

బహుముఖ ప్రజ్ఞాశాలురైన బాపిరాజు గారికి, వర్మగారికి

అడుగడుగునా ఎన్నో పురస్కారాలు, గౌరవాలు, బహుమానాలు లభించాయి. ఇద్దరిని గురించి ఇతర ప్రముఖులు వేనోళ్ల పొగిడారు. వర్మగారిని కీర్తించిన ప్రముఖుల్లో శ్రీ వియోగిహరి, ఆచార్య శివపూజన్-సహాయ్, శ్రీ లాల్ బహాదూర్ శాస్త్రి, శ్రీ గోవింద్ వల్లభ్ పంత్, శ్రీగణేష్-శంకర్ విద్యార్థి, ఆచార్య చతురసేన్ శాస్త్రి మొదలైన వారు ముఖ్యులు. అలాగే బాపిరాజు గారిని బుచ్చిబాబు గారు, బుద్ధవరపు కామరాజు గారు, విశ్వనాథ సత్యనారాయణ గారు, మొదలి నాగభూషణ శర్మగారు, ధూర్జటి వేంకట బాలాజీ గారు మొదలైన వారు ప్రశంసించారు.

ఇంతటి ప్రజ్ఞావంతులైన వీరిద్దరూ భౌతికంగా మరణించినా, మానసికంగా మాత్రం చిరంజీవులే. తమ రచనల ద్వారా అఖిల భారత ప్రజల హృదయాలలో జీవిస్తూ, భారతీయుల్లో దేశభక్తిని ప్రేరేపిస్తూ, భారత మాత ప్రియ పుత్రులై వేనోళ్ల కొనియాడ బడుతున్నారు.

జీవితాలను సాహిత్య కృషితో పండించుకున్న నిత్య కృషీవలులు బాపిరాజు, బృందావన్ లాల్ వర్మగార్లు. వారి సాహిత్య వ్యక్తిత్వాలు సర్వులకూ ఆదర్శ ప్రాయాలు.



### 3.1.1. హిమబిందు :

**3.1.1.1. చారిత్రక నేపథ్యం:** 'హిమబిందు' కథాకాలం శాతవాహనుల కాలం. "ఈ శాతవాహనుల యుగం క్రీ.పూ. 225 – క్రీ.శ. 225"[1] అయినా శ్రీముఖ శాతవాహనుడు 3వ శతాబ్ది వాడని చరిత్ర తెల్పుతున్నది. "ఈనాడు చారిత్రకులందరును శాతవాహనాంధ్రుల విజృంభణము క్రీ.పూ 3వ శతాబ్ది యందే ప్రారంభమయ్యెనని ఏకకంఠంగా చెప్పుచున్నారు. ఈ వంశప్రతిష్ఠను మొదట నెలకొల్పిన వాడు శ్రీముఖ-శాతవాహనుడు (ప్రాకృతంలో సిముకుడు)."[2] కాబట్టి క్రీ.పూ 3వ శతాబ్దంలో జరిగిన కథాంశం గురించిన ఆధారాలు అనేకాలు శిథిలం కాగా మిగిలిన ప్రాకృత, సంస్కృత శాసనాలు, జనశ్రుతుల ద్వారా విని బాపిరాజు గారు కథకు వస్తువు నిర్మించుకొన్నారు. కావున సహజంగా చారిత్రక సత్యాల కంటె కల్పనలకే ఈ నవలలో ప్రాధాన్యం ఉంటుంది.

రాజుగారు, శ్రీముఖ శాతవాహనుని కుమారుడు శ్రీకృష్ణ-శాతవాహనుడు అని రాశారు. కాని చారిత్రకాధారాలను బట్టి శ్రీకృష్ణ-శాతవాహనుడు శ్రీముఖ శాతవాహనుని తమ్ముడని, "శ్రీముఖ శాతవాహనుని తర్వాత అతని తమ్ముడు కృష్ణ శాతవాహనుడు 18 ఏండ్లు పాలించెను."[3] ముఖుడు మగధను, ఉజ్జయినిని, భరుకచ్ఛాలను జయించడం అనే చారిత్రక విషయాలను గ్రహించారు. "శాతవాహన రాజే మంత్రి-

---

1. 'ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి' – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం. పు:126.
2. పైదే., పు: 131.
3. పైదే., పు: 133.

సత్రమునకు భరుకచ్ఛమును దానము చేసెనని చెప్పబడినది."[1]

శాతవాహనుల కాలంలో ఉన్నవని చరిత్రకారులు వివరించిన పట్టణాలు, నగరాలు, రాజ్యాలు, నదులు, ఆ నాటి ప్రజల వేష భాషలు, ఆయుధాలు, యుద్ధ విధాన రీతులు, మత, సాంఘిక పరిస్థితులు మొదలైన అంశాలను బాపిరాజు గారు నేపథ్యంగా స్వీకరించి, నవలలో చారిత్రక వాతావరణాన్ని సృష్టించారు. ముద్రా రాక్షసంలో గల విషకన్య ప్రయోగాన్ని కూడా బాపిరాజు గారు చారిత్రక నేపథ్యంగా తీసుకొని 'చంద్రబాల' పాత్ర సృష్టించారు. చారిత్రక నేపథ్యంగా అనేక కల్పనలతో హిమబిందు నవలను రచించినా, అనేక పాత్రలు, సన్నివేశాలు కల్పనలే అయినా, ఆయన కల్పించిన చారిత్రక వాతావరణంలో ఇమిడిపోయి చారిత్రక పాత్రలే అన్నట్టుగా ప్రకాశించాయి.

3.1.1.2. **కథావస్తువు:** శ్రీముఖ శాతవాహనుడు ధాన్యకటకాన్ని రాజధానిగా ఆంధ్ర రాజ్యాన్ని పాలిస్తున్న సమయంలో, ఆ రాజ్యంలోనే చారుదత్తుడనే వర్తక శ్రేష్ఠుడుండే వాడు. చారుదత్తుడు ఆ రాజ్యంలోనే గాక జంబూ ద్వీపంలోనే అధిక సంపన్నుడు. అతని ముద్దుల కుమార్తె హిమబిందు. ఆమె లోకాద్భుతమైన సౌందర్యనిధి.

శ్రీముఖ శాతవాహనునికి శ్రీకృష్ణ శాతవాహనుడు, మంజుశ్రీ అనే ఇద్దరు కుమారులు ఉండేవారు. మంజుశ్రీని ఐదు సంవత్సరాల వయస్సు లోనే దొంగలు అపహరించుకొని వెళ్లారు. ఎంత వెతికించినా అతని

---

1. 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం పు.133.

జాడ తెలియదు. శ్రీకృష్ణ శాతవాహనుడు యువరాజుగా పట్టాభిషిక్తుడై తండ్రికి రాజ్యపాలనలో కుడిభుజంగా ఉండేవాడు.

చారుదత్తుడు తన కుమార్తె హిమబిందును శ్రీకృష్ణ - శాతవాహనునకు ఇచ్చి పెండ్లి చేయాలని నిశ్చయించుకొంటాడు. అందుకే శ్రీముఖ శాతవాహనుని అభిమానం సంపాదించాలని అతనితో పాటు జైత్రయాత్రకు బయలుదేరతాడు. అంతేగాక యుద్ధానికయ్యే ఖర్చు తానే భరిస్తాడు. శ్రీముఖ శాతవాహనుడు కూడ తన కుమారునికి హిమబిందును చేసుకోవడానికి ఒప్పుకుంటాడు. కాని హిమబిందు ఊహలే వేరు. ఆమె సువర్ణశ్రీ అనే శిల్పి కుమారుణ్ణి గాఢంగా ప్రేమిస్తుంది. శాతవాహన చక్రవర్తి జన్మదిన వేడుకల్లో ఒక భాగమైన ఎడ్లబండ్ల పందెంలో సువర్ణశ్రీ పాల్గొని విజయాన్ని సాధిస్తాడు. చారుదత్తుని మేనల్లుడైన సమవర్తి అనే వ్యక్తి సువర్ణశ్రీకి ఎడ్లబండ్ల పందెంలో ప్రత్యర్థిగా నిలిచి ఓడిపోతాడు. తన మేనబావను ఓడించినందువల్లే హిమబిందును సువర్ణశ్రీ ఆకర్షించగలుగుతాడు. సువర్ణశ్రీ కూడ హిమబిందు వైపు ఆకర్షితుడవుతాడు.

తండ్రి తనకు భర్తగా శ్రీకృష్ణశాతవాహనుని ఎంపిక చేశాడన్న విషయం తెలిసి హిమబిందు బాధపడుతుంది. తల్లిలేని హిమబిందు తన ప్రేమకథను తండ్రికి చెప్పలేక కుమిలిపోతుంది. తండ్రికూడ తనను ప్రాణప్రదంగా పెంచి ఆంధ్రరాజ్యానికే భావి సామ్రాజ్ఞిని చేయ దలచాడు కదా! ఆయన దృష్టిలో అది మంచిపనే కాబట్టి తండ్రిని ఎదిరించి

ఆ వృద్ధుని! మనస్తాపం కలిగించనూ లేదు, అలా అని తాను మనసారా ప్రేమించిన సువర్ణశ్రీని కాదని వేరొకరిని వివాహం చేసుకొని మనుగడ సాగించనూ లేదు.

సువర్ణశ్రీ కూడ హిమబిందు తోడిదే లోకమని భావించుకొన్నారు. ఆమె తనను వివాహం చేసుకొంటే కేవలం ఒక శిల్పి భార్యగానే, ఎలాంటి ప్రత్యేకత లేకుండా గృహిణి జీవితం గడపాలి. చక్రవర్తి కోడలైతే ఆమె భావి సామ్రాజ్ఞి అవుతుంది. కావున ఆమెను ఆటంక పరచనూ లేదు. అలా అని ఆమెను మరువనూ లేదు. ఇలా వీరిద్దరూ ఒకరినొకరు వీడలేక మానసిక సంఘర్షణతో కుమిలిపోతూ ఉంటారు.

ఇలా ఉండగా, చారుదత్తుడు లేని సమయంలో మాగధులు, మాళవులు కుట్రపన్ని దొంగల ద్వారా హిమబిందును, ఆమె అమ్మమ్మ ముక్తావళీ దేవిని అపహరిస్తారు. అలా అపహరించిన చోరులు వీరిని ఒక కొండ గుహలో బంధిస్తారు. ఆ చోరులు ఆ గుహలోనే శ్రీముఖ శాతవాహనుని కుమారుడైన మంజుశ్రీని కూడ బంధించి ఉంటారు. సువర్ణశ్రీ ఎంతో తెలివితేటలతో, ధైర్య సాహసాలతో వీరందర్నీ బంధ విముక్తుల్ని చేస్తాడు. నిజానికి హిమబిందుని వెదుకుతూ వెళ్ళిన సువర్ణశ్రీకి మంజుశ్రీ దొరకడం అదృష్టమే. మంజుశ్రీ అంతఃపురం నుండి మాయమైనప్పటి నుండి అతని జాడ తెలుసుకోవాలని చక్రవర్తి విశ్వప్రయత్నాలు చేస్తూనే ఉన్నా ఫలితం

మాత్రం శూన్యం. కాని సువర్ణశ్రీ వల్ల హిమబిందుతో పాటు మంజుశ్రీ కూడ దొరకడంతో చక్రవర్తికి కూడ సువర్ణశ్రీ అంటే అభిమానం ఏర్పడుతుంది.

సువర్ణశ్రీ తన స్నేహితుడైన మహాబల గోండునితో కలసి చక్రవర్తి సైన్యంలో చేరి, యుద్ధం చేసి, ఉజ్జయిని శాతవాహనుల కైవశం కావడానికి ముఖ్య కారకుడౌతాడు. తర్వాత తన గురువైన సోమదత్తాచార్యుని మాట ప్రకారం, యువరాజు శ్రీకృష్ణ శాతవాహనునకు అంగరక్షకునిగా వ్యవహరిస్తాడు. స్థూల తిష్యుల వారు, మాళవులు, మాగధులు, శివస్వాతి, సుశర్మ, శూర సేనాపతి మొదలైన వారు పన్నిన పన్నాగం, సువర్ణశ్రీ చాకచక్యం వల్లనే భగ్నమౌతుంది. ఆ తర్వాత సువర్ణశ్రీ పాటలీపుత్రం చేరుకొని తండ్రిని కలుసుకొంటాడు. శ్రీకృష్ణ శాతవాహనుడు, సోమదత్తాచార్యుడు, సమదర్శి మొదలైన వారితో కలసి పాటలీ పుత్రంలో కూడ తన యుద్ధ కౌశలాన్ని ప్రదర్శించి, పాటలీ పుత్ర విజయానికి ముఖ్య కారకుడౌతాడు. ఈ విజయ పరంపరలో శ్రీముఖ శాతవాహనుడు జంబూద్వీప మంతటికి చక్రవర్తి అవుతాడు.

శాతవాహనుల కాలంలో బౌద్ధమతం శాఖోప శాఖలుగా విస్తరించడం ఆర్షమతాభిమానులైన కొందరికి బాధ కలిగించింది. వీరిలో స్థూల తిష్యుల వారు ముఖ్యులు. ఈయన పట్టుదల గల ఆర్ష మతాభిమాని. శాతవాహనుల కాలంలో శాఖోప శాఖలుగా విస్తరిస్తున్న బౌద్ధమతాన్ని నశింపజేసి, ఆర్షమతాన్ని పునరుద్ధరించడానికి

స్థూల తిష్యులు కంకణం కట్టుకొంటారు. ఆఖరుకు ఈయన ఆర్ష మతాభిమానం ఎంత వెర్రి తలలు వేస్తుందంటే యువరాజైన శ్రీకృష్ణ శాతవాహనుని హతమార్చడానికి కూడ వెనుకాడడు. తన ఆశయ సిద్ధికోసం యువరాజును హతమార్చడానికి ఆయుధంగా తన మనుమరాలైన చంద్రబాలను విషకన్యగా మారుస్తాడు. అంతకు ముందు శ్రీముఖుని శత్రురాజులతో కుట్ర పన్ని, బాలుడైన మంజుశ్రీని అంతఃపురం నుంచి చోరుల ద్వారా అపహరింప చేసింది కూడ ఈయనే. ఎందుకంటే మంజుశ్రీకి వైదిక పద్ధతిలో శిక్షణ ఇచ్చి, యువరాజు శ్రీకృష్ణ శాతవాహనుని హత్యానంతరం మంజుశ్రీని రాజు చేసి, హిందూమతాన్ని పునరుద్ధరించాలని ఈయన పన్నాగం.

కాని విధి వక్రించింది. మంజుశ్రీని సువర్ణశ్రీ చెర విడిపించారు. శ్రీకృష్ణ శాతవాహనుడు యుద్ధయాత్ర నుండి తిరిగి వస్తుండగా, మార్గ మధ్యంలో విషబాల నగ్నంగా పడి ఉంటుంది. వైద్యుల చేత ఆమె శరీరంలో అణువణువులో ప్రవేశించిన విషం విరిగిపోయే విధంగా మందువిప్పించి, పరిచారికలతో సేవలు చేయించి, విషబాలను అమృతబాలగా మారుస్తాడు. అంతేగాక, ఆమె పట్ల అభిమానం పెంచుకొని ఆమెనే వివాహం చేసుకోవాలని నిశ్చయించుకొంటాడు. హిమబిందు నవలలోని స్థూలతిష్యుల పాత్రను పరిశీలిస్తుంటే ముద్రారాక్షసంలోని రాక్షస మంత్రి గుర్తుకు వస్తాడు.

శ్రీముఖ శాతవాహనుడు చారుల ద్వారా తన కుమారుని ప్రేమ వృత్తాంతాన్ని తెలుసుకొని, చంద్రబాలతో తన కుమారుని వివాహం జరిపించాలని నిశ్చయించుకొంటాడు. ఎటూ తన కుమార్తెను హిమబిందును యువరాజు వివాహమాడుతు; కాబట్టి చారుదత్తుడు కూడా హిమబిందు సువర్ణశ్రీల వివాహానికి ఒప్పుకొంటాడు. సువర్ణశ్రీ తనకు చేసిన సహాయాన్ని పురస్కరించుకొని శ్రీముఖుడు అతనిని కళింగాంధ్ర పతిని చేస్తాడు. చివరకు హిమబిందు సువర్ణశ్రీ, శ్రీకృష్ణ-శాతవాహనుడు చంద్రబాలల వివాహాలతో కథ సుఖాంతం అవుతుంది.

**3.1.1.3 ప్రాసంగిక కథలు:** శ్రీకృష్ణ శాతవాహనుడు, చంద్రబాల, హిమబిందు, సువర్ణశ్రీల వృత్తాంతాలకు, వారి వివాహాలకు సంబంధించింది ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా నాలుగు ప్రాసంగిక కథలున్నాయి.

1. శ్రీముఖ శాతవాహనుని చిన్న కొడుకైన మంజుశ్రీ అపహరణ, చక్రవర్తి యుద్ధయాత్రలో సుశర్మను ఓడించడం మొదలైన వాటికి సంబంధించినది మొదటిది.
2. విషబాల, స్థాలతిష్యులకు సంబంధించినది రెండవది.
3. స్థాలతిష్య - అమృతపాదార్హతులకు సంబంధించినది మూడవది.
4. సమవర్తి, నాగబంధునికల ప్రేమ వివాహానికి సంబంధించినది నాల్గవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ విశాలమైనది, సాంద్రమైనది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనతో ఆధికారిక కథ చక్కగా పోషింపబడింది.

## 3.1.2. అడవి శాంతిశ్రీ :

**3.1.2.1. చారిత్రక నేపథ్యం :** 'అడవి శాంతిశ్రీ' నవల ఇక్ష్వాకుల కాలం నాటిది. "ఇక్ష్వాకులు శాతవాహన రాజ్యము భగ్నమైన వెంటనే ధాన్యకటక ప్రాంతదేశమును ఆక్రమించుకొని, క్రీస్తుశకము రెండవ శతాబ్ది ద్వితీయ పాద ప్రాంతము నుండి పరిపాలించిరి"[1] ఇంకా "ఇక్ష్వాకు రాజ్యస్థాపకుడైన శాంతమూలుడు శాసనములలో 'వాసిఠీ పుత్ర సిరి చాంతమూల', అనగా 'వాసిష్ఠీపుత్ర శ్రీ శాంతమూలుడు' అని పేర్కొన బడెను. ఇతడు వైదిక మతావలంబి. సమ్రాట్టయినను కాక పోయినను శాంతమూలుడు బాహుబల పరాక్రమములు కలిగి, చుట్టు ప్రక్కల రాజులను జయించి ఇక్ష్వాకు రాజ్యమును స్థాపించిన రాజు. ఇతడు అనేక కోట్ల బంగారు నాణెములను, లక్షల కొలది గోవ్ర్యలను, నాగళ్ళను దానము చేసిన మహాదానపతి. ఇతడు విస్తారమైన భూమిని సేద్యములోనికి తీసుకొని వచ్చి, వ్యవసాయమునకు గొప్ప ప్రోత్సాహము కలిగించెను."[2]

"శాంతమూలునికి ఇద్దరు చెల్లెండ్రు - 'హమ్మసిరినిక', 'చాంతిసిరి'. వీరిలో 'చాంతిసిరి' (శాంతిశ్రీ) పూగీయ కులజుడైన 'వాసిఠీపుత్ర ఖందసిరి' (వాసిష్ఠీపుత్ర స్కందశ్రీ భార్య) ఈ స్కందశ్రీ మహాసేనాపతి; మహాతలవరుడు. శాంతిశ్రీకి కూడా

---

1. విజ్ఞాన సర్వస్వము — మూడవ సంపుటము
తెలుగు సంస్కృతి - 1 ., పు: 106.
2. పైదే., 106, 107.

మహా తలవరి , మహా దాన పత్ని అని బిరుదములు కలవు.
మహా తలవరుడు అనగా మహా సామంతుడు అని యర్థము.
శాంతిశ్రీకి 'ఖంద సాగరం ణాక' (స్కంద సాగరుడు) అని ఒక కుమారుడును, వేరొక కొమార్తెయు కలరు. కొమార్తె పేరు తెలియదు. శాంతిశ్రీ తన కొమార్తెను శాంతమూలుని కుమారుడును, తన మేనల్లుడును అయిన వీరపురుష దత్తునికి ఇచ్చి వివాహము చేసెను. ఇక శాంతమూలుని రెండవ సోదరి 'హమ్మసిరి' (హర్మ్యశ్రీ) కి ఇరువురు కొమార్తెలు. ఒకతె పేరు 'చాపిసిరినిక' (బాపిశ్రీ), రెండవ కూతురి పేరు 'చటిసిరి' (షష్ఠిశ్రీ). వీరినిద్దరిని వీరపురుష దత్తునికే ఇచ్చి పెండ్లి చేసిరి."[1]

"శాంతమూలునికి 'మాఢరి' యందు 'వీరపురుష దత్తుడు' జనించెను. అందువలన ఇతనికి 'మాఢరిపుత్ర వీరపురుష దత్తుడు' అని పేరు కలిగినది. వీరపురుష దత్తునికి ఒక సోదరి కలదు. ఆమె పేరు అటవి శాంతిశ్రీ. ఈమె ధనికకులజుడైన మహా సేనాపతి, మహాదండనాయక 'ఖందవిసాఖణకాక' అనగా స్కంధ విశాఖుని భార్య".[2]

ఈ స్కంధ విశాఖుడే బాపిరాజు గారి 'అడవి శాంతిశ్రీ' నవలలో కథానాయకుడు బ్రహ్మదత్తుడు. ఈ 'అటవి శాంతిశ్రీ' యే

---

1. విజ్ఞాన సర్వస్వము — మూడవ సంపుటము
   తెలుగు సంస్కృతి — 1 ,, పు: 107.
2. పైదే., పు: 107.

(అడవి శాంతిశ్రీ) కథానాయిక.

పైన చెప్పినది చరిత్ర. అడివి బాపిరాజు గారు కథా కల్పనలో పూర్తిగా చరిత్రనే అనుసరించారని చెప్పవచ్చు. ఇక్ష్వాకుల కాలం నాటి చారిత్రక సత్యాలెన్నో ఈ నవల్లో పొందుపర చారు రచయిత. చారిత్రక గ్రంథాలను, నవలలోని కథను తుల నాత్మకంగా పరిశీలిస్తే బాపిరాజు గారు సాధ్యమైనంత వరకు తమ నవలలో చారిత్రక సత్యాన్నే ప్రతిపాదించడానికి యత్నించారని చెప్పక తప్పదు.

**3.1.2.2. కథావస్తువు:** ఇక్ష్వాకు రాజ్య స్థాపకుడు, చక్రవర్తి అయిన శాంతిమూలునికి వీరపురుషదత్తుడు కుమారుడు, శాంతిశ్రీ కుమార్తె. శాంతిశ్రీ అతిలోక సౌందర్యవతి. వయస్సుతో పాటు ఆమె సౌందర్యం వికసించింది; కాని మనస్సు మాత్రం వికసించలేదు. విష్ణుస్కంధ శాతకర్ణి, మగధలోని గుప్త మహారాజులు, కౌశికీ పుత్ర ఈశ్వరసేన మహారాజు ఇలా ఎందరో ఆమె అందచందాలను గురించి విని, పరవశించి ఆమెనే వివాహమాడాలని నిశ్చయించుకొంటారు. ముఖ్యంగా పులమావి ఆమెను ఏ రకంగానైనా, చివరకు నిర్బంధించి అయినా వివాహం చేసు కోవాలనుకొంటాడు.

శాంతిశ్రీ మనః ప్రవృత్తి చాల విచిత్రమైంది. ఆమెకు ఎవరి పట్లా కోపతాపాలు లేవు; రాగద్వేషాలు అసలే లేవు. ఆమెకు నవ్వు అంటే అసలు తెలియదు. ఆనందాశ్రువులు గాని, దుఃఖాశ్రువులుగాని

ఎన్నడూ రాల్చి ఎరుగదు. ఆ అందాల రాశికి ఆభరణాలపై గాని, వస్త్రాలపై గానీ మోజులేదు. అలంకరణాపై గాని, లేపనాలపై గానీ అపేక్ష లేదు. వయస్సు పెరిగి యౌవ్వన మంకురించినా ఆమె ఎవరినీ ప్రేమించ లేదు. మారభావం పొడ చూపలేదు. ఆమెకు సంగీతమన్నా, మన్నా గిట్టదు. ఆమె అభిమానించేది బౌద్ధమతాన్ని మాత్రమే. ఆమెకు తెలిసింది బుద్ధభగవానుడు, ఆయన ప్రతిపాదించిన అహింసా సిద్ధాంతం. ఇష్టపడేది బౌద్ధమత తత్త్వం. ఆమె చదివేది బౌద్ధ జాతక కథలు. అంతమాత్రాన ఈమెను పెర్రి బాలికగా మాత్రం జమకట్టడానికి వీలులేదు. ఈమె ఏకసంథాగ్రాహి. అద్భుతమైన గ్రహణాశక్తి కలది. ఆ శక్తికి ఆమె గురుదేవులైన నాగార్జునాచార్యుల వారే ఆశ్చర్య పోయే వారు.

ఇలాంటి మనస్తత్త్వం కల్గిన శాంతిశ్రీ వివాహానికి మానసికంగా ఎలా సిద్ధపడుతుంది? ఈ స్వభావాన్ని చూచి శాంతి మూల మహారాజు వ్యధ చెందుతూ ఉంటాడు. కాని మేధావి అయిన శాంతిమూలుడు తన కుమార్తెలో చైతన్యం కలిగించ గలిగిన వాడు ఒక్క బ్రహ్మదత్తుడే అని భావిస్తాడు. శాంతిశ్రీ స్వభావాని, మార్చగల సమర్థుడు, ఆమెను వివాహం చేసుకోగల యోగ్యత కలవాడు ఒక్క బ్రహ్మదత్తుడే అని మహారాజు ఉద్దేశం. అందుకే మహారాజు, బ్రహ్మదత్తుని శాంతిశ్రీకి గురువుగా నియమి స్తాడు. మొదట్లో బ్రహ్మదత్తుని గురుత్వాన్ని అంగీకరించడానికి

శాంతిశ్రీ మనస్సు ఎంతమాత్రం ఇష్టపడదు. కాని తండ్రి మాట జవదాటలేక అతనిపట్ల అయిష్టతను, నిరసన భావాన్ని ప్రకటించదు. శాంతిమూలుని సలహా ప్రకారమే, వసంతోత్సవాల సందర్భంలో బ్రహ్మదత్తుడు ఆమెను రతీదేవిగా ఎన్నుకొంటాడు. కాని శాంతిశ్రీ కి అది ఇష్టం లేక విరాగిని అయిన యోగిని వలె నిర్వికార భావంతో వసంతోత్సవాలు జరిగే స్థలం నుండి వెళ్లి పోతుంది.

ఇక్కడ బ్రహ్మదత్తుని గురించి చెప్పాలి. ఇతడు రాజనీతి విశారదుడు. సంస్కృతాంధ్ర ప్రాకృత భాషల్లో సమానంగా కవిత్వం చెప్పగల దిట్ట. అంతేగాక, తాను రాసిన కావ్యాన్ని స్వరబద్ధం కావించి మధురంగా మనోహరంగా పాడగల మేటి గాయకుడు. రాజ్య చక్రాన్ని తిప్పే మహా తలవరి. మహా దండ నాయకుడు. మహా సేనాధిపతి. పండిత లోకం అతని గుణ గణాలకు మెచ్చి 'బ్రహ్మదత్తుడు' ని బిరుదు ఇచ్చింది. అతని పేరు స్కంధ విశాఖ నాగుడు. ఇంతటి మేధావియైన బ్రహ్మదత్తునికి కూడ మొట్టమొదట వివాహమంటే ఇష్టంలేదు. కాని శాంతిశ్రీ అద్భుత సౌందర్యాన్ని చూచిన తర్వాత ఆమెను మనసారా ప్రేమిస్తాడు. కాని తన ప్రేమను ఎక్కడా వ్యక్తం చేయడు. వసంతోత్సవాల సందర్భంలో శాంతిశ్రీని రతీదేవిగా ఎన్నుకొన్నప్పుడు, విరాగినియైన శాంతిశ్రీ అతని ప్రేమను నిరాకరిస్తూ వెళ్లి పోతుంది.

శాంతి శ్రీ తృణీకారాన్ని భరించలేక బ్రహ్మదత్తుడు, 'రగిబావికే

తన ఆత్మేశ్వరి, ఈ ప్రణయరహిత హృదయ, ఈ జన్మయోగిని తన ప్రేమ నిధానం. ఇంత లోకోత్తర సౌందర్యవతి అయిన ఈమె జీవితంలో ప్రేమరసార్ద్రత లేనేలేదే. తేనె లేని పుష్పమా ఈమె' అని పరి పరి విధాల ఆలోచించి నిరాశ, నిస్పృహలతో క్రుంగి పోతాడు. కాని ఉత్తమ సంస్కారవంతుడైన బ్రహ్మదత్తుడు తన ఆవేదనను అణచుకొని "రాజకుమారీ! శాంతశ్రీ నన్ను క్షమించు. నీ దివ్య సౌందర్యానికి ముగ్ధుడనై నిన్ను రతీదేవిగా ఎన్నుకొన్నాను ఆకాశాన్ని అందుకొనేందుకు కావాలని పోరుపెట్టిన బాలకుణ్ణి నేను" అని పలికి అక్కడ్నుంచి వెళ్లి పోతాడు.

శాంతిశ్రీ తొలుత బ్రహ్మదత్తుని ప్రేమను తృణీకరించినా కాలక్రమేణ అతని పాండిత్యం, ప్రతిభ, ఉదాత్తమైన వ్యక్తిత్వం, రూప సౌందర్యాల నన్నింటిని చూచి అతని యెడల ఆకర్షితురాలై, ఆమె కూడా అతనిని ప్రేమిస్తుంది. బ్రహ్మదత్తుని గురుత్వంలో శాంతిశ్రీ వ్యక్తిత్వం క్రమంగా పరిణామం చెందుతుంది

ఇది ఇలా ఉండగా శాతవాహన చక్రవర్తి తన అవసాన దశలో తన కుమారుడైన విజయశ్రీ శాతకర్ణిని, మనుమడైన చంద్రశ్రీ శాతకర్ణిని, రాజ్యభారాన్ని అల్లుడైన శాంతిమూలునికి అప్పగించి మరణిస్తారు. కాని కొంత కాలానికి విజయశ్రీ కూడ చనిపోవడం చేత, చంద్రశ్రీ దుర్బలుడు, అసమర్థుడు, స్త్రీలోలుడు అని తెలిసి కూడా అతనినే చక్రవర్తిని చేస్తారు

వాసిష్ఠీ పుత్ర శ్రీ పులమావి చక్రవర్తి రెండవ కుమారుని మనుమడైన పులమావి, చంద్రశ్రీ అసమర్థుడని తెలిసి తానే చక్రవర్తి కావాలని దండయాత్రకు ఉద్యమిస్తాడు. ఈ యుద్ధంలో మోసంతో చంద్రశ్రీ ప్రాణాలు తీస్తాడు. విధిలేక శాంతిమూలుడు రాజ్యభారం వహిస్తాడు. ప్రతినాయకుడైన పులమావి యజ్ఞశ్రీ-శాతకర్ణి మరణానంతరం తానే చక్రవర్తినని ప్రకటించుకొంటాడు. సామంతులను కప్పాలు తనకే కట్టాలని వేధిస్తాడు. అంతేగాక శాంతిశ్రీని తనకిచ్చి వివాహం చేయవలసిందిగా శాంతిమూలునికి బెదరిస్తూ లేఖ రాస్తాడు. పులమావి క్రూర స్వభావుడు, దుష్టుడు, కాముకుడు. రాకుమారి శాంతిశ్రీ సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను వివాహమాడాలని విశ్వ ప్రయత్నం చేస్తాడు.

శాంత స్వభావుడైన శాంతిమూలుడు పులమావి దుశ్చర్యలను శాంతంగా భరిస్తాడు. కాని, అతని కుటిల స్వభావానికి విసుగొంది ఎలాగైనా అతనికి బుద్ధి చెప్పాలని, శాంతిమూలుని చెల్లెలైన శాంతశ్రీ నాయకత్వంలో వీరవనితలంతా ఒక బృందంగా ఏర్పడి బయలుదేరుతారు. ఈ బృందంలో శాంతిశ్రీ కూడ ప్రముఖ పాత్ర వహిస్తుంది. కాని ఈ దండయాత్రలో పులమావి శాంతిశ్రీని బంధిస్తాడు. తన కామతృష్ణ తీర్చుకోవాలని మధువు సేవించి వస్తూవస్తూ హఠాత్తుగా వెన్ను విరుచుకొని పడి మరణిస్తాడు. ఈ లోపల పులమావి భార్య శాంతిశ్రీని బంధవిముక్తురాలిని చేసి చెరనుండి


దక్షిణ హిందూదేశము
పూర్వచాళుక్య కాలము
నర్మదా నది
త్రిపురి
సూరతు
నవసారి
తపతి నది
అచలపురము
మహానది
ఎల్లోరా
గోదావరి నది
చక్రకూటము
మాన్యఖేటము
వేంగిపురము
ఏలేశ్వరము
బెజవాడ
కృష్ణా నది
కూడలిసంగమము
కందుకూరు
అద్దంకి
దానవులపాడు
(పెన్న) నది
నెల్లూరు
కాళహస్తి
పులికాటు
వనవాసి
హెంజేరు
(హేమావతి)
గంగకూటము
కంచి
తంజావూరు
మధుర
సింహళము

తప్పిస్తుంది.

పులమావి మరణవార్త విని ప్రజలంతా సంతోషిస్తారు అనేక ప్రాంతాల నుండి తండోప తండాలుగా ప్రజలు వచ్చి శాంతి మూలుని చక్రవర్తిగా ఉండాలని అభ్యర్థిస్తారు. ప్రజల కోరికపై శాంతి మూలుడు సింహాసనాన్ని అధిరోహిస్తాడు.

బ్రహ్మదత్తునితో శాంతిశ్రీకి, వీరపురుష దత్తునితో శాంతశ్రీ, బాపిశ్రీ, రుద్ర భట్టారికలతోనూ వివాహాలు జరుగుతాయి. దీనితో కథ సుఖాంతమౌతుంది.

**3.1.2.3. ప్రాసంగిక కథలు :** అడవి శాంతిశ్రీ, బ్రహ్మదత్తుల పరిణయానికి సంబంధించినది ఆధికారిక కథ. ఈ కథకు పోషకంగా మూడు ప్రాసంగిక కథలున్నవి.

1. తార - నాగదత్తుల ప్రణయ వృత్తాంతం మొదటిది.

2. వీరపురుష దత్తుని కథ రెండవది.

3. బౌద్ధమత గురువు నాగార్జునాచార్యుల కథ మూడవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథలు సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించ బడింది.

**3.1.3. అంశుమతి :**

**3.1.3.1. చారిత్రక నేపథ్యం :** కుబ్జ విష్ణువర్ధనుడు తూర్పు చాళుక్య వంశాన్ని స్థాపించిన విషయం స్థూలంగా తెలుపడమే 'అంశుమతి'

నవలా లక్ష్యం. బాపిరాజు గారు విష్ణుకుండిన వంశం అంతర్ధానమై చాళుక్య వంశం ఆవిర్భవించిన యదార్థచరిత్రను 'అంశుమతి' నవలలో పొందు పరచారు. "కుబ్జ విష్ణు వర్ధనుడు (క్రీ.శ. 624-641) వేంగీ దేశమును పదునెనిమిదేండ్లు కాలము పాలించినట్లు, తూర్పు చాళుక్య శాసనములు తెలుపుచున్నవి. పల్లవ రాజ్యమును జయించుటకు ఎంచి పులకేశి వల్లభుడు దండెత్తి వచ్చి, కృష్ణానదిని ఉత్తరించి కర్మ రాష్ట్రమును ప్రవేశించి దానిని వశపరుచు కొనెను. ఈ దండ యాత్ర యందు యువరాజై ఉయిన కుబ్జ విష్ణువర్ధనుడు ఖడ్గ సహాయుడై, శత్రు నిఘాదనము నను, దుర్గ సాధనమునను నిర్వక్ర పరాక్రమ ప్రకటనవలన వినుతికెక్కెను. పులకేశి వల్లభుడు తమ్ముని ఘన సహాయ్యమునకు మెచ్చి అతనికిని, అతని సంతతి వారికిని వంశ పారం పర్యముగ వేంగీ రాజ్యాధి పత్యము నొసంగెను. తనకు లభించిన నూతన రాజ్యపద చిహ్నముగ కుబ్జ విష్ణు వర్ధనుడు మహారాజు పదమును వహించెను."[1] అంతేకాకుండా "కుబ్జ విష్ణువర్ధనుడు నేర్పరియైన దళనాయకుడు; అసమాన పరాక్రమ శాలి, ధైర్య శౌర్యములకు ఆటపట్టు. ఎంత విషమములైనను స్థల, జల, వన, గిరి దుర్గములను భేదించి కైవసము చేసికొనగల సమర్థుడగుట వలన 'విషమసిద్ధి' అనియు, చూపరి అగుట వలన 'మకరధ్వజుడు' అనియు బిరుదులు కలిగెను."[2]

---

తెలుగు సంస్కృతి - ౧

కాబట్టి కుబ్జ విష్ణువర్ధనుడు, పులకేశి మొదలైన వారు చారిత్రక వ్యక్తులే. పృథ్వీ మహారాజు, కళింగ గాంగులు, పల్లవులు మొదలైన వారి రాజ్యాల పతనానికి, విష్ణువర్ధనుని 'విషమసిద్ధి' బిరుద సార్థక్యానికీ చరిత్రనుండి రచయిత ఆధారాలు తీసుకున్నారని తెలుస్తుంది.

"కుబ్జ విష్ణువు పట్టమహిషి అయ్యణ మహాదేవి అని అతని సంతతి వారి శాసనముల వలన తెలియుచున్నది."[1] బాపిరాజు గారు ఈ అయ్యణ మహాదేవినే 'అంశుమతి' అనే పేరుగా మార్చి కథలో నాయికగా చేశారు.

అంశుమతి నవలలో 'మాధవ వర్మ' వృత్తాంతం కూడ ఒక విశేషం. దానికి ఖచ్చితమైన ఆధారాలు దొరకవు. అయినా చాలమంది చరిత్రకారులు 'మాధవ వర్మ' వృత్తాంతం పేర్కొన్నారు. "విష్ణుకుండి వంశజుడగు నాలుగవ మాధవ వర్మ చాల గొప్పవాడు. ఈతని న్యాయప్రీతిని గురించి కథలు చెప్పబడుచున్నవి. ఒకప్పుడీతని కుమారుడొకడు రాజ్యమునందలి యొక పేదరాలి కుమారునిపై రథము పోనిచ్చి వాని మరణమునకు కారకుడయ్యె నట. ముసలి పేదరాలు మాధవవర్మతో ఈ విషయము మొర పెట్టుకొనెను. న్యాయవిచారణ చేయించి రాజు తన కుమారునకు మరణ దండన విధించెను..... ఈ కథయొక్క సత్యాసత్యములు

1. విజ్ఞాన సర్వస్వము – మూడవ సంపుటము
తెలుగు సంస్కృతి – 1 ., పు: 143.

ఎట్లున్నను మాధవవర్మ న్యాయప్రియుడనుటకు ఇతర నిదర్శనములు కలవు."[1]

బాపిరాజు గారు పై కథను గోదావరీ తీరంలోని 'గోపాద' క్షేత్రానికి అతికించి, మాధవవర్మ కుమారుడు ఒక గోవు దూడ మరణానికి కారణం కాగా, తల్లి గోవు న్యాయగంటను మ్రోగించిందనీ, న్యాయ శీలుడగు మాధవవర్మ ప్రజా సమక్షంలో విచారించి తన కుమారునకు గోవుచే త్రొక్కి చంపించే శిక్ష విధించాడనీ, గోవు అతని ధర్మదీక్షకు మెచ్చి క్షమించిందనీ, ఆ గోవు పేరు మీద 'గోపాద క్షేత్రం' వెలసిందనీ మార్చి రాశారు. ఈ మార్పు వల్ల ప్రధాన కథకు భంగం వాటిల్లలేదు.

3.1.3.2. **కథావస్తువు:** అంశుమతి ఒక నవలిక. ఉన్నత పాఠశాల విద్యార్థుల పఠనీయ గ్రంథంగా బాపిరాజు ఈ నవలికను రాశారు. విద్యార్థులకోసం వ్రాసిన రచన కాబట్టి దీనిలో ఎక్కువ వర్ణనలు లేవు. కేవలం పదిహేను రోజులలో ఈ నవలికను పూర్తి చేశారు. ఈ నవలికలోని కథ చాళుక్యుల కాలానికి చెందింది.

విష్ణుకుండిన వంశీయుడైన మంచన భట్టారకుని ఏకైక కుమార్తె అంశుమతి. ఈమె కథానాయిక. అతిలోక సుందరి. అటువంటి అందగత్తెను పెండ్లాడాలని ఆనాటి రాకుమారులెందరో మంచన భట్టారకునికి రాయబారాలు పంపుతారు. కాని, ఏ కారణం

---

1. 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం. పు: 194, 195.

చేతనో రాయబారాలన్నింటిని అంశుమతి తిరస్కరిస్తుంది. కాని కళింగ యువరాజైన దానార్ణవుడు ఈమె సౌందర్యానికి ముగ్ధుడై ఈమెనే వివాహమాడాలని నిశ్చయించుకొంటాడు.

ఒకసారి అంశుమతి తీర్థయాత్రలు చేస్తూ గోవూరు వెళ్తూ ఉంటుంది. ఆ సమయంలో దానార్ణవుడు ఆమెను పట్టి బంధించి పిష్టపురంలో నిర్బంధిస్తాడు. కాని కుబ్జ విష్ణువర్ధనుడు ఆ నగరాన్ని జయించి దానార్ణవుని అనుచరుడైన కుంభమిశ్రుని, అతని పరివారాన్ని సంహరించి, అంశుమతిని ఆమె చెలికత్తెను నిర్బంధం నుండి కాపాడుతాడు.

కుబ్జ విష్ణువర్ధనుడు ఈ కథకు నాయకుడు. ఇతడు చాల పొట్టివాడు; కాబట్టి తనను ఏ స్త్రీ వివాహమాడదని భావించి, వివాహం పట్ల విముఖత వహిస్తాడు. కాని, కుబ్జ విష్ణువర్ధనుడు సత్ప్రవర్తన గలవాడు. తను పొట్టివాడుగా జన్మించినందువల్ల అది ఒక లోపంగా భావించి, తనని తానే చులకనగా భావించుకొంటూ ఆత్మన్యూనతా భావంతో వ్యథ చెందుతూ ఉంటాడు. పొట్టివాడైనా విష్ణువర్ధనుడు యుద్ధతంత్రాంగంలో ఎంతో గట్టివాడు. కుబ్జ విష్ణువర్ధనుడు దుర్భేద్యమైన పిష్టపురం కోటను అతి చాకచక్యంగా వశపరచుకొంటాడు. ఆ తర్వాత విజయవాటికను, వెలనాటిని, గుండు పడమటి రాజ్యాన్ని, గుండు తూర్పు రాజ్యాన్ని, పోక గ్రామాన్ని జయిస్తాడు. తర్వాత దక్షిణాపథంలో పల్లవులను

ఓడించి చాళుక్య సామ్రాజ్యాన్ని విస్తరింపజేస్తాడు.

దానార్ణవుని నిర్బంధం నుండి అంశుమతిని కాపాడిన తర్వాత, ఒక రోజు అంశుమతి విష్ణువర్ధనులు ఒక ఉద్యాన వనంలో కలుసుకొంటారు. తానే కుబ్జ విష్ణువర్ధనుడని అంశుమతికి చెప్పడు. తానొక రాజ బంధువని, తన పేరు ప్రియదర్శి అని మార్చి చెప్తాడు. అట్లే అంశుమతి కూడ తన అసలు పేరు దాచి తానెవరో చెప్పకుండా రాజకుమార్తె చెలికత్తెనని, తన పేరు 'కిరణావతి' అని చెప్తుంది.

అంశుమతి, కుబ్జ విష్ణువర్ధనుడు పొట్టివాడైనా అతని ధైర్య సాహసాలకు, మంచితనానికి ముగ్ధురాలై అతన్ని మనః పూర్వకంగా ప్రేమిస్తుంది. కుబ్జ విష్ణువర్ధనుడు తాను పొట్టివాడనే ఆత్మన్యూనతా భావంతో ఉండేవాడు. ఎప్పుడైతే అంశుమతి తనను మనస్ఫూర్తిగా ప్రేమిస్తోందని తెలుసుకుంటాడో అప్పట్నుంచి అతని ఆనందానికి అవధులే లేవు. సహృదయ, అతిలోక సౌందర్యవతి అయిన అంశుమతిని కుబ్జ విష్ణువర్ధనుడు ప్రేమించడంలో ఆశ్చర్యం లేదు కదా!

అంశుమతి తండ్రి కూడ తన కుమార్తెను విష్ణువర్ధనునికే ఇవ్వాలనుకొంటాడు. తన కూతురు ఒక సామంతుని కుమారుడైన ప్రియదర్శిని వివాహమాడదలచినట్లు తెలిసి, మంచన భట్టారకుడు వ్యథ చెందుతాడు. కాని చివరకు తన కుమార్తె ఇష్టపడిన వ్యక్తి

విష్ణువర్ధనుడే అని తెలిసి సంతోషిస్తాడు. అంశుమతి కూడా తన ప్రియుడు మహారాజని తెలిసి సంతోషపడుతుంది. చివరకు కుబ్జ - విష్ణువర్ధనునికి, అంశుమతికి వివాహం జరిగి కథ సుఖాంతం అవుతుంది.

"ప్రేమకు పొట్టి పొడుగులు ఆలంబనలు కావు. నిర్మల హృదయమే ఆలంబనం" అన్న సందేశాన్ని బాపిరాజు ఈ నవల ద్వారా అందించారు.

**3.1.3.3. ప్రాసంగిక కథలు:** కుబ్జ విష్ణువర్ధనుడు - అంశుమతిల వివాహానికి సంబంధించినది ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా రెండు ప్రాసంగిక కథలున్నాయి.

1. జయనంది, మాధవీలతాదేవిల ప్రణయ వృత్తాంతానికి సంబంధించినది మొదటిది.

2. గోదావరీ నదీ తీరంలోని గోపాదక్షేత్ర మాహాత్మ్యం - మాధవవర్మ వృత్తాంతం రెండవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

**3.1.4. గోన గన్నారెడ్డి:**

**3.1.4.1. చారిత్రక నేపథ్యం:** గోన గన్నారెడ్డి నవలలో కాకతీయ గణపతి దేవ చక్రవర్తి, రాణి రుద్రమదేవి, శివదేవయ్య మంత్రి,

గోన గన్నారెడ్డి, విరల ధరణీశుడు, చాళుక్య వీరభద్రుడు మొదలైన వ్యక్తులందరూ చారిత్రక వ్యక్తులే. "గోన గన్నయరెడ్డి యను సేనాని రాజ్యము లోపలి శత్రువులను ఎల్లరను అణచివేసెను."[1] ఈ చిన్ని చారిత్రక సత్యాన్ని గ్రహించి బాపిరాజు గారు గోన గన్నా రెడ్డి చారిత్రక నవల రచించారు. పుత్రులు లేని గణపతిదేవుడు, రుద్రమదేవిని కాకతీయ సామ్రాజ్ఞిగా నిర్ణయించడాన్ని సహించలేని సామంతులు తిరుగుబాటు చేయడం, రుద్రమ దేవి తన సేనా నాయకులతో సామంతులను అణచివేయడం, ఓరుగల్లు రాజధానిగా అఖండ కాకతీయ సామ్రాజ్యాన్ని పటిష్టం చేయడం, యాదవ మహారాజు ఓరుగల్లుపై దండెత్తి రాగా ఓడించి తరిమి కొట్టడం మొదలైన విషయాలన్నీ చారిత్రక సత్యాలే.

రుద్రమదేవి (క్రీ.శ.1262- క్రీ.శ.1296): "ఈ మహారాణి మిక్కిలి ప్రతిభావంతురాలు. స్త్రీ అయినను గొప్ప ధైర్య సాహసములతో అనేక కష్టముల నెదుర్కొని, ఈమె తండ్రి తన చేత బెట్టిన విశాల సామ్రాజ్యమును రక్షించి సమర్థతతో పరిపాలించెను. .... చోళరాజగు రాజేంద్ర చోళుడును, పల్లవరాజగు కొప్పెరజింగడును, ఏరువ మల్లిదేవుడను మరియొక రాజును, సామ్రాజ్యము లోపల ఎందరో రాజులు తిరుగుబాటు చేసిరి. అంబదేవుడను కాయస్థ సామంతుడు త్రిపురాంతకముపై దండెత్తి వచ్చిన శత్రువులను పారద్రోలెను.

1. విజ్ఞాన సర్వస్వము (మూ.సం) తెలుగు సంస్కృతి-1, పు: 231.

గోన గన్నయరెడ్డి అనుసేనాని రాజ్యము లోపల శత్రువులను ఎల్ల రను అణచి వేసెను. ఇంతలో ఉత్తర దిశనుండి యాదవ మహారాజు దండెత్తి వచ్చి ఓరుగల్లు నగరమును ముట్టడించెను. రుద్రాంబ ఈ శత్రువును బహు పరాక్రమముతో ఎదుర్కొని ఓడించి, గోదావరి వరకును తరిమి వేసెను."[1]

గన్నారెడ్డి చారిత్రక వ్యక్తి అయినా అన్నాంబిక తో వివాహం, గజదొంగగా మారడం, తిక్కన భారతంలో (కొన్ని పర్వాలు) రచించి గణపతి దేవునికి పంపడం, రుద్రమదేవి పురుష వేషం వేయడం, ముమ్మడమ్మను వివాహమాడడం మొదలైన వాటికి చారిత్రక ఆధారాలు లేవు. కాబట్టి రచయిత చరిత్రకు కల్పనలు జోడించి 'గోనగన్నారెడ్డి' అన్న చారిత్రక నవల రచించారనవచ్చు.

3.1.4.2. **కథావస్తువు :** హిమబిందు తర్వాత బాపిరాజు గారి ఉత్తమ చారిత్రక నవలగా 'గోనగన్నారెడ్డి' నవలను పేర్కొనవచ్చు. ఈ కథ కాకతీయుల కాలానికి చెందింది. ఈ నవల బాపిరాజుగారి సర్వతోముఖ ప్రజ్ఞకు, చారిత్రకాంశాల పరిశీలనకు మచ్చుతునకగా పేర్కొనవచ్చు. కాకతీయుల రాణి రుద్రమదేవికి కుడిభుజంగా నిలచిన గోన గన్నారెడ్డిని ఆధారంగా బాపిరాజుగారు అనేక చారిత్రకాంశాలతో ఈ నవలను రచించారు.

కాకతి గణపతిదేవ చక్రవర్తికి ఇరువురు కుమార్తెలు.

1. విజ్ఞాన సర్వస్వము (మూ.సం) తెలుగు సంస్కృతి-౧., పు: 231

చక్రవర్తి తర్వాత కాకతీయ సింహాసనాన్ని అధిష్ఠించడానికి వారసు డైన కుమారుడు పుట్టలేదే అనీ, వారసులు లేకుంటే సామంత రాజు లంతా తిరుగుబాటు చేస్తారేమో అని గణపతి దేవ చక్రవర్తికి బాధ, భయం ఉంటాయి. ఆ సమయంలో శివదేవయ్య మంత్రి సలహా ననుసరించి పెద్ద కుమార్తె రుద్రమ దేవిని బాలికగా గాక బాలునిగానే పెంచుతాడు. ఈమె స్త్రీ అని అంతఃపుర పరిజనంలో కొంతమందికి మాత్రమే తెలుసు. యుక్త వయస్సు వచ్చేవరకు తాను బాలికనన్న విషయం రుద్రమదేవికే తెలియదు. రుద్రమదేవుడు పురుషుడే అన్న భ్రమను కలిగించేందుకు, గణపతిదేవ చక్రవర్తి తన బావమరిది జాయపసేనాని కుమార్తె ముమ్మడాంబికకు, పురుష వేషంలో ఉన్న రుద్రమదేవికి వివాహం కూడ జరిపిస్తాడు.

గణపతిదేవ చక్రవర్తి సామంతుల్లో గోన బుద్ధారెడ్డి ఒకడు. గోన బుద్ధారెడ్డికి లకుమయారెడ్డి అనే సోదరుడు ఉన్నాడు. గోన బుద్ధారెడ్డి మరణిస్తూ తన కుమారులైన గోనగన్నారెడ్డి, విఠలులను లకుమయారెడ్డికి అప్పగించి, వారిని పెంచి పెద్ద చేసి వారి రాజ్యాన్ని వారికి అప్పగించవలసిందిగా చెప్పి మరణిస్తాడు. కాని లకుమయారెడ్డి స్వార్థపరుడై కాంక్షతో గన్నారెడ్డి సోదరులకు అన్యాయం చేస్తాడు. తన పినతండ్రి దుర్బుద్ధిని గమనించి గన్నారెడ్డి రాజ్యం విడిచి పారి పోయి, గజదొంగగా మారిపోతాడు. వందలాది యువకులు గన్నారెడ్డితో చేతులు కలిపి గన్నారెడ్డిని తమ నాయకునిగా

ఎన్నుకొంటారు. తనకు దొరికిన గుప్త నిధితో రహస్యస్థావరాన్ని నిర్మించుకొని, తన అనుచరులతో గన్నారెడ్డి రహస్యంగా నివసిస్తూ ఉంటాడు.

గణపతిదేవ చక్రవర్తి, శివదేవయ్య మంత్రి ఎంత రహస్యంగా దాచినా రుద్రమదేవి పురుషవేషంలో ఉన్న స్త్రీయే అన్న వార్త క్రమక్రమంగా అందరికీ తెలిసి పోతుంది. దీంతో ప్రతి సామంత రాజు తమ స్వాతంత్ర్యసిద్ధికి కుట్రలు పన్నుతారు. కొందరు చక్రవర్తి కావాలని కూడ కుట్రలు పన్నుతారు. వీరిలో లకుమయారెడ్డి ముఖ్యుడు. చక్రవర్తిపై తిరుగుబాటు చెయ్యాలంటే తగినంత బలం కావాలి. అందుకే లకుమయారెడ్డి తన కుమారుడైన వరదారెడ్డిని కోటారెడ్డి కుమార్తె అయిన అన్నాంబికతో వివాహం జరిపించాలనుకొని, కోటారెడ్డిని అడుగుతాడు. కోటారెడ్డి కూడ తన కుమార్తె నివ్వడానికి ఆనందంతో అంగీకరిస్తాడు. కాని పెండ్లి జరిగేటప్పుడు కళ్యాణమండపానికి గోనగన్నారెడ్డి వచ్చి వరదారెడ్డిని అపహరిస్తాడు. వరదారెడ్డి అన్నాంబికల వివాహం చెడుతుంది. ఒక వారం రోజుల తర్వాత వరదారెడ్డిని గన్నారెడ్డి తన చెరనుండి వదిలేస్తాడు. రెండవసారి కోటారెడ్డి తన కుమార్తెకు వరదారెడ్డితో వివాహం నిశ్చయిస్తాడు. కాని అన్నాంబికకు వరదారెడ్డిని పెళ్లాడడం ఇష్టం లేదు. అందుకే గన్నారెడ్డి సలహాపై ఆమె అంతఃపురం నుండి అదృశ్యమై, గన్నారెడ్డి సోదరి కుప్పాంబికతో కలసి బుద్ధవరం వెళ్లిపోతుంది. తర్వాత ఓరుగల్లు చేరుకొని రుద్రమదేవితో కలసి ఆమె అంతఃపురంలోనే

ఉంటుంది.

కొద్ది రోజులకు రుద్రమదేవి పురుషుడు కాదన్న విషయం బాహాటంగా అందరికీ తెలిసిపోయే సమయమాసన్నమైందని గ్రహించి గణపతిదేవ చక్రవర్తి తనకు పుత్రులు లేరని, ఇంతవరకు పురుషుడుగా చెలామణి అవుతున్న వ్యక్తి తన కూతురని, ఆమె యే తన తదనంతరం కాకతీయ సామ్రాజ్యానికి చక్రవర్తి అని నిండు సభలో ప్రకటిస్తారు. దీనితో రహస్యం బట్టబయలౌతుంది. చాలా మంది సామంత రాజులు చక్రవర్తికి కప్పాలు కట్టడం మాని వేస్తారు. ఉప్పల సోముడు, వందె భూపాలుడు, మేదపల్లి కాచయ నాయకుడు, పేర్మాడి రాయుడు మొదలైన రాజులు తిరుగుబాటు చేస్తారు. కానీ వీరుడైన గన్నారెడ్డి వీరి వ్యూహాలకు ప్రతివ్యూహాలు చేసి తిరుగుబాటును అణచి వేస్తాడు.

ఈ పరిస్థితుల్లో గణపతిదేవ చక్రవర్తి మరణం సంభవిస్తుంది శివదేవయ్య మంత్రిత్వంలో, చాళుక్య వీరభద్రుని సహకారంతో రుద్రమదేవి చక్రవర్తినిగా సింహాసనం అధిష్ఠిస్తుంది. కాని రుద్రమదేవి తాతగారైన ప్రతాపరుద్ర చక్రవర్తికి ఉంపుడుగత్తె వలన జన్మించిన సారంగదేవుని కుమారులైన హరిహర, మురారి దేవులు కాకతీయ సామ్రాజ్యాన్ని వశపరచుకొనేందుకు కుట్రలు పన్నుతారు. బుద్ధ గణపతిని పూజించి, ఏకవీరా దేవిని అర్చించి అన్నాంబికా ముమ్మడమ్మలతో నగరానికి తిరిగివస్తున్న రుద్రమదేవిని హరిహర, మురారి దేవులు నాలుగు వేల సైన్యంతో చుట్టుముట్టుతారు కానీ చాళుక్య వీరభద్రుడు

కొద్ది సైన్యంతో వచ్చి వీరోచితంగా పోరాడి, హరిహర, మురారి దేవుల్ని వధించి రుద్రమదేవిని కాపాడుతాడు.

ఇట్లే దేవగిరి సామంతుడైన యాదవ మహారాజు పెద్ద సైన్యం తో వచ్చి, ఓరుగల్లును ముట్టడిస్తారు. కోట లోపల నుండి రుద్రమదేవి చాళుక్య వీరభద్రుడు, వెలుపల నుండి గోన గన్నారెడ్డి తన అనుచరుల సహాయంతో యాదవ మహారాజు సైన్యాన్ని ఎదిరిస్తారు. ఇరువర్గాల మధ్య భయంకర యుద్ధం జరుగుతుంది. చివరకు మహా-దేవరాజు సైన్యం సర్వనాశనం అవుతుంది. మహాదేవ రాజు పలాయనం చిత్తగించినా అతనిని తరిమి తరిమి కొడ్తారు. చివరకు విధిలేక రుద్రమ దేవితో సంధి చేసుకొని లొంగిపోతాడు. విశాల హృదయంతో రుద్రమదేవి అతని సామ్రాజ్యాన్ని అతనికే అప్పగిస్తుంది. ఇలా గోన గన్నారెడ్డి, వీరభద్రుల సాయంతో రుద్రమదేవి, తనపై కుట్ర జరిపిన ప్రత్యర్థులందర్నీ ఓడించి, ఓరుగల్లు చక్రవర్తిని యై, తన సార్వభౌమత్వాన్ని సుస్థిరం చేసుకొంటుంది.

అన్నాంబికకు మొదట్నుంచి వరదారెడ్డి అంటే ఇష్టం లేదు. గోన గన్నారెడ్డి అంటే సదభిప్రాయం. అదే చివరకు వలపుగా మారుతుంది. కోటారెడ్డి కూడ చివరకు తన తప్పు తెలుసుకొని, తన కూతుర్ని గన్నారెడ్డికే ఇచ్చి వివాహం జరిపిస్తాడు. నిజానికి గన్నారెడ్డి గజదొంగ కాదు. చక్రవర్తి ఆశీస్సులతోనే కాకతీయ సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసేందుకు గజదొంగగా నటిస్తాడు. గన్నారెడ్డిలో

ఏటువంటి కల్మషం లేదు. ఎవరినీ దోచుకోవాలన్న తలంపు లేదు. నిస్వార్థ బుద్ధితో చక్రవర్తికి, రుద్రమదేవికి సాయపడిన గన్నారెడ్డి ప్రతిభ అసమానం.

విజయ యాత్రలు ముగిసిన తరువాత, గణపతి దేవ-చక్రవర్తి, శివదేవయ్య మంత్రులు ఆశించినట్లే రుద్రమదేవి చాళుక్య వీరభద్రుల మధ్య ప్రేమ అంకురించి వివాహానికి దారి తీస్తుంది. రుద్రమదేవి తాను చాళుక్య వీరభద్రుని వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకొన్నట్లు ప్రకటించి అతని మెడలో హారం వేస్తుంది. ముమ్మడాంబికకు చాళుక్య మహాదేవ మహారాజుతో వివాహం జరుగుతుంది. ఈ మూడు వివాహాలతో నవల సుఖాంతమౌతుంది.

**3.1.4.3. ప్రాసంగిక కథలు:** రుద్రమదేవి, చాళుక్య వీరభద్రులకు సంబంధించింది ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా నాలుగు ప్రాసంగిక కథలున్నాయి.

1. గన్నారెడ్డి, అన్నాంబికల వివాహకథ మొదటిది.
2. కామేశ్వరీ దేవి, అక్కిన ప్రెగ్గడల ప్రణయం, వారి వివాహం రెండోది.
3. యాదవ మహాదేవరాజు ఓరుగల్లు ముట్టడికి సంబంధించినది మూడవది.
4. హరిహర, మురారి దేవులు కాకతీయ సామ్రాజ్యాన్ని వశపరచుకోనేందుకు చేసిన ప్రయత్నాలు నాల్గవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారికకథ చక్కగా పోషించబడింది

# 3.2. బృందావన్ లాల్ వర్మ నవలలు - చారిత్రక నేపథ్యం , కథావస్తువు

3.2.1. భువన విక్రమ్ :

3.2.1.1. చారిత్రక నేపథ్యం : వర్మగారి చారిత్రక నవలల్లో 'భువన విక్రమ్' నవలకు విశిష్ట స్థానం ఉంది. ఇది చారిత్రక నవలల కంటె కథావస్తువులో భిన్నమైంది.

"ఈ నవల కథాకాలం ఉత్తరవైదిక కాలానికి చెందింది."[1]

"వర్మగారికి వేదకాలం నాటి ఏదో ఒక విషయం పైన కాంత రాయాలనే కోరిక చాలా కాలం నుండి ఉండేది".[2]

ఈ నవలను ప్రామాణికంగా రచించేందుకు రచయిత చారిత్రక సత్యాలను నిరూపించే గ్రంథాలను పెక్కింటిని పరిశీలించాడు. "వాటిలో డా॥ నారాయణ చంద్ర వందోపాధ్యాయ రచించిన 'Economic life and progress in Ancient India', వాల్మీకి రామాయణం, డా॥ రాధా కుముద్ ముఖర్జీ రచించిన 'హిందూ సివిలైజేషన్', 'మనుస్మృతి', 'శ్రీమద్భాగవతం', 'ఋగ్వేదం' 'అథర్వణవేదం', 'యజుర్వేదం', 'శౌనక సంహిత' మొదలైన గ్రంథాలను అధ్యయనం చేశారు."[3] ఈ గ్రంథాలలో లభించిన విషయాలను ఆధారంగా చేసుకొని ఆ నాటి వాతావరణాన్ని చక్కగా చిత్రించారు. ఇందులో వర్మగారు "ఆ నాటి రాజ్య వ్యవస్థ, సాంఘిక జీవితం, ఆచార వ్యవహారాలు, దాసీల పరిస్థితి, రాజకీయ కుట్రలు, సామాజిక పరిస్థితులు

---

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య-డా॥ మోహినీ సహాయ్., పు: 481.
2. భువన విక్రమ్ 'పరిచయ్' — బృందావన్‌లాల్ వర్మ., పు: 1
3. పై. పు 3, 4

మొదలైన వాటి సజీవ చిత్రణలో సఫలీకృతులయ్యారు."[1]

ఈ నవలలోని అయోధ్యారాజు రోమకుడు, అతని పుత్రుడైన భువన విక్రముడు, గురువు ధౌమ్యుడు మొదలైన వారు పురాణ ప్రసిద్ధమైన పాత్రలు.

మేఘవర్ణుడు, దీర్ఘబాహుడు, నీలమణి, పురోహితుడైన సోముడు, అధ్యాపకుడైన మేఘుడు, గౌరి, హిమానీ మొదలైనవారు

**3.2.1.2. కథావస్తువు :** కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం రోమకుడనే రాజు అయోధ్యను పాలిస్తూ ఉండేవాడు. అతని పాలనలో అనేక సంవత్సరాల పాటు వర్షాలు కురవక పోవడంచే రైతులు, పేదవారు చాల బాధలు పడసాగారు. రాజు స్వార్థపరుడవడం చేతను, తన శాసన వ్యవస్థను చక్కగా నిర్వర్తించక పోవడం చేతను, వ్యాపారుల శోషణా నీతివల్లనూ ఆ దేశంలోని ప్రజలు చాలా బాధలకు లోనయ్యారు. రోమకుని అసమగ్రమైన ప్రణాళికలవల్ల కార్మికులకు తక్కువ జీతం చెల్లించడం చేతనూ శ్రామిక వర్గం ఎదురు తిరిగింది. వీరేగాక, ధనికులైన వ్యాపారుల దుకాణాలనుండి ధాన్యాన్ని బలత్కారంగా తీసుకొనిపోయి రోమకుడు పేదలకు పంచిపెట్టేవాడు. కాబట్టి ధనిక వర్గం కూడ అతనికి వ్యతిరేకులయ్యారు.

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పు: 482

రోమకుని పుత్రుడైన భువనునికి అనేక అవగుణాలుండేవి. అతడు చంచల ప్రవృత్తి గలవాడు; మధుపాన మత్తుడు; గర్వపోతు; స్వేచ్ఛాజీవి; దుష్టుడు. దయా దాక్షిణ్యాలు లేక ఎవరిని పడితే వారిని చిన్నాపెద్ద అని, స్త్రీ పురుషులని చూడక అందర్నీ బాధించేవాడు. ఆ అయోధ్యలోనే నీలుడనే ధనవంతుడైన వర్తకునికి హిమానీ అనే కుమార్తె ఉండేది. ఇంచుమించు భువనుని గుణగణాలన్నీ ఆమెలోనూ ఉన్నాయి. ఒకసారి వీరిద్దరూ తగవులాడుకొన్నారు. హిమానీ ధనవంతురాలైనా, అధికారం తన దగ్గరుందని భువనుడు గర్వంతో మదమత్తుడై హిమానీని కొరడాతో కొట్టిస్తాడు. హిమానీ ఆ సమయంలో ఎదురు తిరగకుండ ప్రతీకారం కోసం పగతో ఎదురు చూస్తూ ఉంటుంది.

భువనునికి మేఘుడనే గురువు ఉండేవాడు. మేఘుడు స్వార్థపరుడు. రాజ్యాకాంక్ష కలవాడు. మేఘుడు, భువనుని దుష్టతనానికి రాజే కారకుడని ప్రజలను నమ్మించి రెచ్చగొడ్తాడు. రాజువల్ల తమకు లాభం లేకపోగా, ఎక్కువ నష్టం కలుగుతూ ఉందని కోపించిన వ్యాపారులు ఆచార్యుడైన మేఘుని రాజుగా చేయాలని భావిస్తారు. దాని ఫలితంగా ఆనాటి రాజ్యవ్యవస్థ ప్రకారం, అప్పటి గ్రామీణ సంఘం విషమస్థితిని చక్కబెట్టేందుకు రోమకుని గద్దె దింపి అధికారాన్ని మేఘునికి అప్పజెప్తారు. ఆచార్యుడైన మేఘుడు, తన అనుచరులైన దీర్ఘబాహు, నీలమణి, పురోహితుడైన సోముడు

మొదలైన వారందరితో కలసి ఒక సంఘాన్ని స్థాపించి రాజ్యాన్ని పాలిస్తూ ఉండేవాడు.

విధి వంచితుడైన రోమకుడు నిరాశచెంది నైమిశారణ్యంలో నివశించే మహాతత్వవేత్త అయిన ధౌమ్యమహర్షి ఆశ్రమానికి వెళ్తాడు. తన పుత్రునికి విద్యను నేర్పించి సక్రమమైన మార్గంలో నడిపించమని ప్రార్థిస్తాడు. అందుకు ధౌమ్యుడు అంగీకరిస్తాడు. తర్వాత రోమకుడు తన పతనానికి గల కారణాలను అన్వేషిస్తూ గ్రామాలలో సంచారం చేయసాగాడు. ప్రజల్లో తనను గూర్చి అనేక రకాలైన అభిప్రాయాలున్నట్లు తెలుసుకొంటాడు.

ధౌమ్యమహర్షి ఆశ్రమంలోని సాత్విక వాతావరణం, అతని గంభీరమైన వ్యక్తిత్వం వల్ల భువనుని ప్రవర్తనలో మార్పు కలుగుతుంది. అతని చంచల, దుష్టస్వభావం పూర్తిగా నశించి, కొద్ది సమయంలోనే గొప్ప విద్యావంతుడౌతాడు. వేదమంత్రాలకు అర్థం చెప్పగల జ్ఞానం అతనికి లభిస్తుంది. అంతేగాక, అతనికి కర్తవ్య పరాయణత, ఏకాగ్రత, స్థైర్యం మొదలైన మంచి గుణాలు అల వడ్డాయి.

రోమకుని రాజ్యభ్రష్టుని చేసి, పదవులను పొందిన మేఘుని వర్గం వారు రోమకుని కంటే హీనంగా ప్రజలను పీడించ సాగారు. ఆ వర్గంలోని నీలుడు ధనిక వ్యాపారి. ప్రజలకు ఎక్కువ వడ్డీలకు అప్పులిచ్చేవాడు. ఫలితంగా అప్పు తీర్చనివారు అతని దగ్గర

వెట్టి చాకిరి చేయాల్సి వచ్చేది.

క్షామ సమయంలో కపింజలుడనే శూద్రుడు నీలుని వద్ద అప్పు తీసుకొని తీర్చలేక, బానిసగా అతని వద్ద వెట్టిచాకిరి చేస్తూ ఉండేవాడు. అతడు నీలుని అత్యాచారాలను, బాధలను సహించలేక పారిపోయి, ధౌమ్యుని ఆశ్రమం చేరి ఆ మహర్షి అనుమతితో తపస్సు చేయనారంభించాడు.

ధౌమ్య మహర్షి ఆశ్రమానికి కొద్ది దూరంలో ఒక కుగ్రామంలో 'గౌరి' అనే పేద క్షత్రియ కన్య తన తల్లిదండ్రులతో నివసిస్తూ ఉండేది. గౌరి పేదపిల్ల, ఐనా గుణవంతురాలు. అందంగా ఉండేది. కష్టపడి పనిచేసుకుంటూ కాలం గడుపుతుండేది. భువనుడు భిక్షాటన నిమిత్తం ఆ గ్రామానికి వెళ్ళినప్పుడు గౌరి అందచందాలు, గుణగణాలచే ఆకర్షితుడై ఆమెను ప్రేమిస్తాడు. గౌరి కూడ భువనుణ్ణి ప్రేమిస్తుంది. గౌరిని కలుసుకోవాలనే ఉద్దేశం భువనుడు ఆమె ఇంటికి మాటిమాటికి భిక్షనెపంతో వెళ్తూ ఉండే వాడు. దీనిని గమనించిన గౌరితల్లి భువనుణ్ణి నిలదీయగా భువనుడు, తాను త్వరలో గౌరిని వివాహం చేసుకుంటానని ఆమెకు ప్రమాణం చేస్తాడు. గౌరి భువనుల ప్రేమ వృత్తాంతం ధౌమ్యునికి తెలుస్తుంది. అతడు భువనునితో, ఏ స్త్రీని ఏకాంతంగా కలుసుకోకూడదని, ఏ స్త్రీ వైపు కన్నెత్తి చూడకూడదని, ఏ గుమ్మం ముందు ఒకసారి కంటె ఎక్కువ సార్లు భిక్ష

అడుగ కూడదని మూడు ఆంక్షలు పెడ్తారు. భువనునికి ఇది ఇష్టంలేక పోయినా గురువు ఆజ్ఞ తన శ్రేయస్సుకే అని తలచి, అతని ఆజ్ఞను శిరసావహిస్తాడు.

రాజైన రోమకుడు దేశాటనం చేస్తూ నిరాశ చెందిన వాడై ధౌమ్యుని ఆశ్రమానికి వస్తాడు. తన పతనానికి నిజమైన కారణం ధౌమ్యుడొక్కడే తెలుపగలడని భావిస్తాడు. ఆశ్రమ ప్రాంతంలో తపస్సు చేసే కపింజలుని గూర్చి వింటాడు. శూద్రుడైన కపింజలుని తపస్సే తన పతనానికి కారణమై ఉండవచ్చునని సందేహంతో కొట్టుమిట్టాడుతాడు. అతని మనస్సులో కపింజలుని అంతం చేయాలనే హింసాత్మకమైన కోరిక కలుగుతుంది. ధౌమ్యుడు ఈ విషయాన్ని గ్రహించి, అతని వ్యక్తిత్వాన్ని మేలుకొలిపి బుద్ధి చెప్పాలనే ఉద్దేశంతో కపింజలుని చంపి, పాప విముక్తుడై రాజ్యాన్ని పొందమని చెప్తాడు. కాని, రాజుకు జ్ఞానోదయం కలిగించగల వ్యక్తి ఒక్క భువనుడే అని గ్రహించి, భువనుణ్ని రోమకునికి కపింజలుడున్న ప్రదేశం చూపమని పంపుతాడు. దారిలో భువనుడు తండ్రికి సత్య మాహాత్మ్యాన్ని గురించి చెప్పి రాజ్య కాంక్ష నుండి విముఖుడయ్యేటట్లు, కపింజలుని చంపే ప్రయత్నం నుండి విరమించేటట్లు జ్ఞానోపదేశం చేస్తాడు. అతని బోధలు రాజు మీద ఎక్కువ ప్రభావాన్ని చూపుతాయి. అతనికి రాజ్యకాంక్ష, అహంకారం నశించి జ్ఞానోదయం కలుగుతుంది. కపింజలుని చంపే

ప్రయత్నం నుండి విరమించుకొని, తరుణోపాయం సూచించమని ధౌమ్యుని ప్రార్థిస్తాడు. ధౌమ్య మహర్షి సత్కర్మలు ఆచరించమని అతనికి ఉపదేశిస్తాడు. చివరకు రాజు తన నాశనానికి శూద్రుని తపస్సు కారణం కాదని, తన అసమర్థ పరిపాలనా విధానమే కారణమని నమ్ముతాడు.

భువనుడు ఆశ్రమంలో తన విద్యాభ్యాసం పూర్తి చేసుకొని, గురువైన ధౌమ్యమహర్షి ఆశీర్వాదాన్ని, ఉపదేశాన్ని పొంది తన తండ్రితో కూడ అయోధ్యకు తిరిగివస్తాడు. అయోధ్యకు వచ్చిన వెంటనే రోమకుడు తన సమస్త సంపదను, భూమిని క్షామ పీడితులకు దానం చేస్తాడు. తన దానశీలత నిరాటంకంగా సాగేందుకు నీలుణ్ణి కాంత ధనం అప్పివ్వమని కోరుతాడు. నీలుడు ఆచార్యుడైన మేఘుని వర్గంలోని వాడు. ఆ వర్గంలోని వారు పదవిని కాంక్షించే వారు. వారు రోమకుని పేరు ప్రఖ్యాతులను సహించలేక అతన్ని అవమాన పరచాలని చూస్తూ ఉంటారు.

నీలుడు దీర్ఘబాహువనే వానితో తన పుత్రిక అయిన హిమానీ వివాహం జరిపించి, తన బలాన్ని పెంచుకోవాలనుకొంటాడు. కాని రోజు రోజుకి రోమకుని పేరు ప్రఖ్యాతులు పెరుగుతుంటాయి. ఈ సమయం లోనే రోమకుడు ధనాన్ని అప్పుగా ఇవ్వమని నీలుణ్ణి కోరుతాడు. దీన్ని మనస్సులో ఉంచుకొని నీలుడు, రోమకుని నాశనం చేసే అవకాశం దొరికిందని సంతోష పడ్తాడు.

అప్పుగారా ధనం ఇవ్వడం కన్నా, తన కుమార్తెను భువనున కిచ్చి వివాహం జరిపిస్తే వరకట్నంగా అపార ధనం ఇస్తానని ఆశ చూపు తాడు. రోమకుడు ఇందుకు అంగీకరిస్తాడు.

భువనుడు ఆశ్రమంలో ఉన్నప్పుడు గౌరిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తాడు. కానీ గురువైన ధౌమ్యుని ఆజ్ఞ శిరసావహించి మౌనం వహిస్తాడు. అయోధ్యకు వచ్చిన తరువాత గౌరి, ఆమె తల్లిదండ్రులు నదిలో పడి కొట్టుకు పోయారనే వార్త విని ఖిన్నుడౌతాడు. ఎటూ గౌరి తనకు దక్కలేదు కాబట్టి తన తండ్రికి సంతోషం కలిగించాలనీ, కట్నరూపేణా వచ్చే డబ్బుతో తన తండ్రి దానశీలత నిరాటంకంగా కొనసాగుతుందనీ తలచి హిమానీతో వివాహానికి అంగీకరిస్తాడు.

హిమానీ కూడా తన పాత పగను తీర్చుకొనే ఉద్దేశ్యంతో భువనునితో వివాహానికి అంగీకరిస్తుంది. వీరి కుట్రలు రోమకునికి కానీ, భువనునికి గాని తెలియవు.

ధౌమ్య మహర్షి రాజు ఆపదలో ఉన్నాడనే విషయం ఊహించి, కపింజలుని అయోధ్యకు వెళ్ళమంటాడు. కపింజలుడు తపస్సు చాలించి అయోధ్యకు వచ్చి, శీలుని వద్ద సేవకుడుగా చేరుతాడు. కానీ శీలుడు అతన్ని గుర్తించలేక పోతాడు. రోమకునికి సహాయం చేయడమే గాక, తను కూడా శీలుని వద్ద తీసుకొన్న అప్పును తీర్చి ఋణ విముక్తుడవ్వాలని కష్టపడి పనిచేసి విశ్వాస

పాత్రుడని అనిపించుకొంటాడు.

గౌరి తన తల్లిదండ్రులతో కలసి నదిలో మునిగి మరణించిందన్న వార్త నిజం కాదు. గౌరి చావలేదు, ఆమె తల్లిదండ్రులు మాత్రం మరణించారు. ఆమె ఏకాకియై, ఒంటరిగా జీవనాధారం వెతుక్కొంటూ వచ్చి, హిమానీ పంచన చేరి సేవలు చేస్తూ, ఆమెకు విశ్వాసపాత్రురాలైంది. ఇక్కడ కపింజలుడు, గౌరి ఒకర్ని ఒకరు గుర్తు పట్టారు. కానీ పైకి మాత్రం నిజ రూపాలు వెల్లడించక అన్నా చెల్లెళ్ళ వలె మెలుగుతూ, సమయం వచ్చినప్పుడు రోమకునికి సహాయం చేయాలని ప్రయత్నిస్తూ ఉంటారు.

భువనుని స్థితిగతులను తెలుసుకొనేందుకు ధౌమ్యుడు తన శిష్యులైన ఆరుణి, వేలుడు, కాల్పకుడు అనేవారిని అయోధ్యకు పంపిస్తాడు. వారి ద్వారా గౌరి బ్రతికి ఉన్నట్లు భువనునికి తెలుస్తుంది. కానీ ప్రస్తుతం ఏమీ చేయలేక, భగవంతునిపై భారం వేసి హిమానీతో వివాహానికి సిద్ధపడ్డాడు.

ఒకనాడు వీలుడు, రోమకునిపై తాము చేస్తున్న కుట్ర విషయమై ఒక జాబు కపింజలునకిచ్చి మేఘునకు చేర్చమంటాడు. అందులో తన కుమార్తె భువనుణ్ణి సంహరిస్తుందని, తాము రోమకుణ్ణి మిగిలిన పరివారాన్ని మట్టుపెట్టగలమని ఆ లేఖలో ఉంటుంది. కపింజలుడు ఆ జాబును మొదట రోమకునికి ఇచ్చి, విషయం తెలుసుకొని, ఆ తరువాత మేఘునికి చేరుస్తాడు. ఆ జాబు

చూచిన తరువాత రోమకుడు, అతని కుటుంబీకులు జాగ్రత్త పడతారు.

హిమానీ, తాము మొదట అనుకొన్న ప్రకారం, తమ దేశ ఆచార ప్రకారం భువనుణ్ణి 'బాలదేవ' అనే దేవీ మందిరం లోని ఒక గదిలోనికి తీసుకొని వెళ్తుంది. వారి కుట్రలోని ప్రణాళిక ప్రకారం ఇక్కడే భువనుణ్ణి సంహరించాలి. ఈ విషయం తెలుసు కొన్న గౌరి రహస్యంగా వారి వెంట వెళ్తుంది. భువనుడు దేవుడికి సాష్టాంగ దండప్రమాణం చేసేటప్పుడు హిమానీ అతణ్ణి కత్తితో పొడిచి చంపేందుకు ప్రయత్నిస్తుంది. ఆ క్షణంలో గౌరి భువనుణ్ణి ముందుకు నెట్టి వేసి హిమానీని బంధిస్తుంది. భువనుని పూర్వ ఆదేశానుసారం ఆరుణి దీర్ఘబాహువును, సోముడు మేఘుని, రోమకుడు నీలుని బంధిస్తారు. ఇలా నీలుని ప్రయత్నం విఫలమౌతుంది. ఈ సమయంలో కపింజలుడు తాను నీలుని వద్ద తీసుకొన్న అప్పును చెల్లించి ఋణ విముక్తుడౌతాడు.

నీలుని వర్గం వాళ్ళు చేసిన కుట్రలు ప్రజలకు తెలిపి, వారిని అయోధ్యనుండి వెడలగొడతారు.

భువనుని తల్లి గౌరి చేసిన ఉపకారానికి సంతోషించి, ఆమెను భువనునికిచ్చి వివాహం చేస్తుంది. గౌరి తాను సంపాదించిన ధనాన్ని రోమకునికి అర్పించి ఋణ విముక్తురాలౌతుంది. ఈ విధంగా రోమకుడు తాను పోగొట్టుకున్న అయోధ్యను తిరిగి పొందుతాడు.

**3.2.1.3. ప్రాసంగిక కథలు:** అయోధ్యరాజు రోమకుడు, అతని కుమారుడైన

భువనుని కథ ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా నాలుగు ప్రాసంగిక కథలున్నవి.

1. శూద్రుడైన కపింజలుని కథ మొదటిది.

2. నీలమణి, అతని పుత్రిక హిమానీ కథ రెండవది.

3. ఆచార్యుడైన మేఘుని కథ మూడవది.

4. మహర్షి ధౌమ్యుని కథ నాల్గవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషింపబడింది.

**3.2.2. గఢ్ కుండార్ :**

**3.2.2.1. చారిత్రక నేపథ్యం :** చరిత్రకు సంబంధించిన సత్యాలతో కల్పనను మేళవించి రాసిన చారిత్రక నవల గఢ్ కుండార్. ఇది 14వ శతాబ్దానికి చెందిన కథ. పీఠికలో నవలాకారుడు కథకు సంబంధించిన చరిత్రను సంక్షిప్తంగా రాశాడు.

"గఢ్ కుండార్‌ను గౌడులు, మౌర్యులు, చందేరులు, చౌహానులు, ఖంగారులు - మొదలైన రాజవంశీయులు పాలించారు. కుండారును పాలించిన చివరి రాజు హురమత సింహుడు. ఇతడు ఖంగారు రాజవంశీయుడు. ప్రస్తుత నవలతో ఇతనికి దగ్గర సంబంధం ఉంది. ఈ ఖంగారు రాజవంశీయులను బుందేల్ రాజవంశీయులు అంతం చేశారనేది చారిత్రక సత్యం."[1]

1. 'బృందావన్ లాల్ వర్మ- ఉపన్యాస్ ఔర్ కళా' — డా॥ శశి కుమార్ మిశ్ర., పు: 232.



# गढ़ कुण्डार

## ऐतिहासिक उपन्यास

व ावनलाल वर्मा

" ఈ నవలలోని హీరమత సింహుడు, సోహన్ పాలుడు, నాగదేవుడు, సహజేంద్రుడు, పుణ్యపాలుడు, ధీర ప్రదానుడు, విష్ణుదత్త పాండే మొదలైన పాత్రలు చరిత్రలో ఉన్నవే. అగ్నిదత్తుడు, తారా, దివాకరుడు, మానవతి మొదలైన పాత్రలు కల్పితాలు. 'గఢ్ కుండార్' మూలకథ మాత్రం చరిత్ర ప్రసిద్ధమనే చెప్పుకోవాలి."[1]

ఖంగారులకు, బుందేలులకు జరిగిన యుద్ధం, హేమవతిని నాగదేవుడు ప్రేమించి పెళ్ళాడమని కోరడం, హేమవతి నిరాకరించడం ఖంగారులు మధుపాన మత్తులై యుద్ధంలో చనిపోవడం మొదలైన సంఘటనలు చరిత్రలోనివే. ఈ నవలలో పేర్కొన్న ప్రదేశాలు కూడ చరిత్ర ప్రసిద్ధాలే. " నవలలో వర్ణించిన ప్రదేశాలను దుర్జన కుంహార్ అనే మిత్రునితో కలసి పర్యటించినట్లు వర్మగారే స్వయంగా చెప్పుకొన్నారు."[2] కల్పనతో నవల కొంత పెంచినా చాలవరకు సంఘటనలు చరిత్ర సత్యాలకు విరుద్ధంగా లేవనే చెప్పవచ్చు.

**3.2.2.2. కథావస్తువు :** గఢ్ కుండార్ వర్మగారి మొట్టమొదటి చారిత్రక నవల. దీని కథావస్తువు బుందేల్ ఖండ్ లో నివసించే రెండు జాతులకు సంబంధించినది. ఖంగారులు, బుందేలుల మధ్య జరిగిన పరస్పర యుద్ధాలు, మానావమానాలు, ఆత్మాభిమానం మొదలైన విషయాలను స్పష్టం చేయడమే ఈ నవల ముఖ్యోద్దేశ్యం.

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పు: 460.

2. గఢ్ కుండార్ 'పరిచయ్' – బృందావన్ లాల్ వర్మ., పు: 4.

పద్నాలుగో శతాబ్దంలో బుందేల్ రాజైన సోహన్ పాల్ తన తమ్ముని విశ్వాస ఘాతుకానికి గురై రాజ్యాధికారాన్ని కోల్పోతాడు. అతడు తన భార్యా బిడ్డల తోను, కొంతమంది విశ్వాస పాత్రులైన అను చరుల తోను పారిపోయి రహస్య జీవనం గడుపుతూ, రాజ్యాన్ని మరలా సంపాదించడానికి ప్రయత్నిస్తూ ఉంటాడు.

హారీ చందేల్ అనే పేరుగల సర్దారు భరత్ పుర్ లోని తన చందేల్ గఢ్ కోటలో వీరికి ఆశ్రయం ఇస్తాడు. సోహన్ పాల్ కుమార్తె హేమవతి గొప్ప సౌందర్యవతి. ఆమె సౌందర్య ప్రశంస ఖంగారు రాజైన హురమత సింహుని కుమారుడు నాగదేవునికి తెలుస్తుంది. అతడు ఆమెను చూడాలని తన స్నేహితుడైన అగ్నిదత్తునితో కలసి భరత్ పూర్ వెళ్తాడు. ఆ రాత్రే మహమ్మదీయులు భరత్ పూర్ పై దాడి జరుపుతారు. కోటను రక్షించడానికి నాగదేవుడు మహమ్మదీయు లతో భయంకర యుద్ధం చేస్తాడు. ఆ యుద్ధంలో మహమ్మదీయులు ఓడిపోతారు. కాని నాగదేవుడు గాయపడ్డాడు. అతనికి హేమవతి శుశ్రూష చేస్తుంది. ఆ సమయంలో ఆమె సౌందర్యం అతన్ని ఆకర్షి స్తుంది. సోహన్ పాల్ తో అతనికి పరిచయం ఏర్పడుతుంది. నాగదేవుడు ఆరోగ్యవంతుడైన తర్వాత సోహన్ పాల్ ను సపరివారంగా కుండార్ రమ్మని ఆహ్వానిస్తాడు. దానికి సోహన్ పాల్ అంగీకరించి సపరివారంగా కుండార్ చేరుకుంటాడు.

ఒకరోజు నాగదేవుడు హేమవతితో తన ప్రణయ వృత్తాంతాన్ని

చెప్తాడు. బుందేలులు ఖంగారులను తక్కువ జాతి వారుగా పరిగణిస్తారు. అందువల్ల ఆమె అతని కోర్కెను తిరస్కరిస్తుంది. నాగదేవుడు ఆ విషయాన్ని అవమానంగా భావిస్తాడు. తనకు అత్యంత సన్నిహితులైన సహచరులతో కలసి హేమవతిని అపహరించుకు పోవాలని తలుస్తాడు.

నాగదేవునకు మానవతి అనే చెల్లెలున్నది. నాగదేవుని స్నేహితుడైన అగ్నిదత్తుడు మానవతిని ప్రేమిస్తాడు. కుందార్ రాజ్య శ్రేయోభిలాషియైన విష్ణుదత్త పాండే కుమారుడే ఈ అగ్నిదత్తుడు. బ్రాహ్మణ వంశానికి చెందినవాడవడం చేత, పెద్దలు వీరి వివాహానికి సమ్మతించలేదు. పెద్దలను ఎదిరించి పారిపోయి వివాహం చేసుకుందామని అతడు మానవతిని అడుగుతాడు. మానవతి అతణ్ణి ఇష్టపడుతున్నా, తల్లిదండ్రులను ఎదిరించి పారిపోయేందుకు అంగీకరించదు. మానవతి రాజధరుల వివాహం నిశ్చయమౌతుంది. ఎలాగైనా మానవతిని తనదాన్నిగా చేసుకోవాలని, వివాహం జరిగే నాటి రాత్రి అగ్నిదత్తుడు తన చెల్లెలు తార వేషంలో వివాహ మంటపానికి వస్తాడు. అగ్నిదత్తుడు, తార అచ్చుగుద్దినట్లు ఒకే పోలికలో ఉంటారు. పైపెచ్చు వీరిద్దరు కవలలు. కాబట్టి తనను ఎవరూ గుర్తించరని అగ్నిదత్తుడు ఊహిస్తాడు.

ఇది ఇలా ఉండగా ఆ రాత్రే నాగదేవుడు హేమవతిని అపహరించడానికి కుట్ర పన్నుతాడు. కానీ స్వామి భక్తి పరాయణుడైన

దివాకరుని వల్ల నాగదేవుని కుట్ర ఫలించదు. ఈ దివాకరుడు సోహన్ పాల్ సేవకుడైన ధీర ప్రధాన్ కొడుకు. నిజానికి ధీరప్రధాన్ సేవకుడే కాని సోహన్ పాల్ అతనిని సేవకునిగా కాక మిత్రునిగానే చూశాడు. ఈ దివాకరుడు అగ్నిదత్తుని కవల సోదరియైన తారను ప్రేమిస్తాడు. తార బ్రాహ్మణస్త్రీ. దివాకరుడు కాయస్థుడు.

దివాకరునివల్ల తన కుట్ర విఫలమైందని నిరాశ చెంది నాగదేవుడు ఇంటికి వచ్చేస్తాడు. ఇంటికి రాగానే తార వేషంలో ఉన్న అగ్నిదత్తుని గుర్తిస్తాడు. అగ్నిదత్తుడు కూడ తనలాగే కుట్రపన్ని తన చెల్లెలు మానవతిని అపహరించుకు పోవడానికే తార వేషంలో వచ్చాడనే విషయం తెలుసుకుంటాడు. అసలే హేమవతిని దక్కించుకోలేక పోయాననే నిరాశ, నిస్పృహతో ఉన్న నాగదేవుడు అగ్నిదత్తుణ్ణి తీవ్రంగా మందలిస్తాడు. తెల్లవారే లోపల కుండార్‌ను వదలి వెళ్ళకపోతే రక్తం కళ్ళచూస్తానని బెదిరిస్తాడు. ఇలా అవమానం పాలైన అగ్నిదత్తుడు ఖంగారులను నాశనం చేస్తానని ప్రతిజ్ఞచేసి బుందేలులతో చేతులు కలుపుతాడు. నాగదేవుడు హేమవతిని అపహరించాలనుకొన్నాడన్న విషయం తెలిసి బుందేలులకు కూడ ఖంగారులను నాశనం చేయాలనే తలంపు కలుగుతుంది.

హేమవతి తండ్రి సోహన్ పాలుడు, అగ్నిదత్తుడు కలసి కుట్రపన్ని హురమతసింహుని వద్దకు హేమవతి వివాహం నాగదేవునితో జరిపిస్తామని వర్తమానం పంపుతారు. ఇది అన్యాయం అని ఎదిరించిన

దివాకరుని 'దేవరాగఢ్' అనే కోటలో బంధిస్తారు. బుందేలుల కాపట్యం తెలియని హమ్మీరమత సింహుడు పెళ్ళి ప్రస్తావనను స్వీకరిస్తాడు. పెండ్లి రోజు రాత్రి ఖంగారులు తమదేశ ఆచారప్రకారం బాగా అందరూ సురాపానం చేసి, అచేతనావస్థలో ఉంటారు. ఇదే సమయం అని తలచి బుందేలులు ఖంగారులపై దాడి చేస్తారు. ఆ దాడిలో ఖంగారులు కొంత ఎదిరించినప్పటికి మధుపానమత్తులై ఉండడం వల్ల ఓడిపోతారు. నాగదేవుడు, హమ్మీరమత సింహుడు, హరీచందేవ్, అగ్నిదత్తుడు గాక చాలమంది ఖంగారులు చనిపోతారు. కుండార్ పతనమౌతుంది. దివాకరుని తార విడిపిస్తుంది. బుందేలులు కుండార్‌ను ఆక్రమించుకొంటారు. హేమవతి వివాహం 'పంవార్' సర్దారు పుణ్యపాలునితో జరుగుతుంది.

బుందేలులకు, ఖంగారులకు యుద్ధం జరగడానికి ముందే దివాకరుడు, తార ఒకరినొకరు ప్రేమించుకొని ఉంటారు. ఇద్దరూ భిన్న జాతులకు చెందినవారవడం చేత వాళ్ళ వివాహానికి పెద్దలు ఒప్పుకోరు. ఇప్పటికే మానవతి - అగ్నిదత్తుడు, హేమవతి - నాగదేవుడు ఈ రెండు జంటల వల్ల ఘోర యుద్ధం జరిగి, రక్తపాతం జరిగింది. ఇక తాము కూడ పట్టుపడితే మరొక యుద్ధం జరగవచ్చని, రాబోయే వినాశాన్ని ఊహించి ఇద్దరూ భయపడతారు. మొదట వర్ణాశ్రమ ధర్మాలను అతిక్రమించి వివాహం చేసుకోవాలని వీరు అనుకొన్నా తెగించలేక పోతారు. అందువల్ల ఆత్మల కలయికే ఉత్తమం

అని భావించి సర్వస్వాన్ని వదులుకొని, పరమాత్మ చింతనలో జీవితాన్ని గడుపడానికై వాళ్ళిద్దరూ అరణ్యానికి వెళ్ళిపోతారు.

**3.2.2.3. ప్రాసంగిక కథలు:** కుండార్ రాజకుమారుడైన నాగదేవుని అసఫల ప్రణయానికీ, ఖంగారుల రాజ్య పతనానికి సంబంధించినది 'గఢ్ కుండార్' ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా మూడు ప్రాసంగిక కథలున్నవి.

1. అగ్నిదత్తుని భగ్న ప్రణయం, అవమానం, ప్రతీకార వాంఛకు సంబంధించినది మొదటిది.
2. తారా దివాకరుల ప్రేమకు సంబంధించినది రెండోది.
3. సైనికుడైన అర్జునుడు, సామంత రాజైన హరీ చందేవ్ కు సంబంధించింది మూడోది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

## 3.2.3. మృగనయనీ :

**3.2.3.1. చారిత్రక నేపథ్యం:** 'మృగనయని' చారిత్రక నవల రాసేందుకు తనకు కలిగిన ప్రేరణ గురించి వర్మగారే స్వయంగా ఇలా రాసుకున్నారు. "1949 వ సంవత్సరములో గ్వాలియర్ కు చెందిన ఒక ప్రముఖ స్త్రీ నాకు ప్రేరణ కల్గించారు. ఆ సమయంలో నా 'టూటే కాంటే' నవల పూర్తికావస్తోంది. ఆ నవల పూర్తిచేసిన తర్వాత

'మృగనయనీ' నవల ప్రారంభించాలను కొని, ఆ నవలకు సంబంధించిన అంశాలను అధ్యయనం చేశాను. ఆ కథకు సంబంధించిన చారిత్రక ప్రదేశాలను సందర్శించాను."[1]

'మృగనయనీ' నవలలోని పాత్రలైన "రాజా మానసింహ-తోమర్, మృగనయనీ, సికందర్ లోడీ, మహామూద్ బఘుర్రా, గయాసుద్దీన్, నసీరుద్దీన్, రాజసింహ కఛవాలా, లాఖీ, అటల్, బోధన్, విజయ జంగం మొదలైన పేర్లు చరిత్రలో ఉన్నవే."[2]

"మానసింహ తోమర్ అనే రాజు క్రీ.శ. 1486 నుండి 1516 వరకు గ్వాలియర్‌ను పాలించాడు. 'పరిస్తా' చరిత్ర కారుడు మానసింహుని వీరుడుగానూ, యోగ్యుడైన పాలకుడుగానూ వర్ణించాడు. ఆంగ్లేయ చరిత్రకారులు కూడా మానసింహుని రాజ్యకాలాన్ని 'స్వర్ణయుగమ'ని (Golden Age of Tomer Rule) వర్ణించి ఉన్నారు."[3]

మానసింహునికి చుట్టుపట్ల అనేకమంది శత్రురాజులున్నారు. అయినా ధైర్య సాహసాలతో, శౌర్యంతో ఢిల్లీకి చెందిన సికందర్ లోడీని, గుజరాత్‌కు చెందిన మహమ్మద్ బఘుర్రాను, మాళవ బాదుషా గయాసుద్దీన్‌ను మరికొందరు రాజులను ఎదుర్కొని, వారి కుట్రలను కుతంత్రాలను విఫలం కావించాడు. నిరంతరం ఇలాంటి అస్తవ్యస్త రాజకీయ సమస్యలతో మునిగి తేలుతున్నప్పటికీ

---

1. మృగనయనీ 'పరిచయ్' — బృందావన్ లాల్ వర్మ., పు:1
2. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య — డా॥ మోహినీ సహాయ్., పు: 474.
3. మృగనయనీ 'పరిచయ్' — బృందావన్ లాల్ వర్మ., పు:1.

మానసింహుడు సంగీత, నృత్య, చిత్ర, స్థాపత్య, మూర్తి కళలకు ఎంతో ప్రోత్సాహం ఇచ్చాడు. అనేక సుందరమైన కట్టడాలను నిర్మించాడు. "క్రీ.శ. 1526 లో బాబరు మానసింహుడు కట్టించిన 'మాన మందిర్', 'గూజరీ మహల్' లను దర్శించాడు. అతడు చూచేటప్పటికే ఆ భవన నిర్మాణాలు పూర్తి అయి దాదాపు 20 సంవత్సరాలు దాటి ఉండవచ్చు. క్రీ.శ. 1507 లో ఆ భవన నిర్మాణాలు ప్రారంభమై ఉండవచ్చు. క్రీ.శ. 1492 ప్రాంతంలో గూజరీ రాణి మృగనయనీ, మానసింహుల వివాహం జరిగి ఉండవచ్చు. మానసింహుని సభలో బైజునాథ్ అనే ప్రసిద్ధిచెందిన గాయకుడు ఉండేవాడు. 'గూజరీ టోడీ', 'మంగళ్ గూజరీ' అనే రాగాలు మృగనయనీ పేరు మీదే కొత్తగా సృష్టించాడు. ఇవన్నీ చారిత్రక సత్యాలు."[1]

సికందర్ లోడీ, మహమ్మద్ బఘర్రా, నసీరుద్దీన్, గయాసుద్దీన్ మొదలైన వారు మానసింహుని సమకాలీనులనేందుకు చారిత్రక ఆధారాలున్నాయి. "సికందర్ లోడీ క్రీ.శ. 1504 లో 'ఆగరా' ను తన నివాసం చేసుకొని గ్వాలియర్ పైన అనేక సార్లు దండయాత్ర చేశాడు. కానీ, మానసింహుని ఎదుర్కోలేక పరాజయం పొందాడు. చివరకు నర్‌వర్‌ను ఆక్రమించి అక్కడి మందిరాలను, మూర్తులను నాశనం చేశాడు. ఇవన్నీ చారిత్రక సత్యాలు."[2] మహమ్మద్ బఘర్రా, గయాసుద్దీన్

1. మృగనయనీ 'పరిచయ్' — బృందావన్‌లాల్ వర్మ., పు: 3.
2. పైదే., పు: 2.

# मृगनयनी



लेखकः—वृन्दावनलाल वर्मा

కుమారుడు నసిరుద్దీన్ మానసింహుని విరోధులు అని చెప్తూ, బఘ్రా నసిరుద్దీన్ గురించి చరిత్ర ఇంకా ఇలా తెలుపుతోంది. "మహమ్మద్ బఘ్రా భోజన ప్రియుడు అనీ, ఎప్పుడు భుజిస్తూ ఉంటాడు అనే విషయం 'మిరాతే సికందరీ' అనే ఫారసీ గ్రంథంలో రాసి ఉంది. 'నసీరుద్దీన్' దగ్గర 15000 మంది భార్యలు ఉన్నారనీ, అతడు స్త్రీ లోలుడనీ చరిత్ర ప్రసిద్ధం."

ఇలా మృగనయనీ నవలలోని అనేక పాత్రలు చరిత్రలోనివే నని రచయితే చెప్పారు. "ఆచార్యుడైన 'విజయ జంగం' ద్వారా రచయిత లింగాయత సిద్ధాంత సంప్రదాయాలు, కుల, మత, వర్ణ భేద తిరస్కారాలు, అహింస, సదాచారం, మాదక ద్రవ్యాల నిషేధం మొదలైన విషయాలను చర్చించడం చారిత్రక సత్యం."[2] రచయిత బోధన్ పండితుని చారిత్రక వ్యక్తిగా చిత్రించడమే గాక, మత వాద్యం, వర్ణాశ్రమాచార ధర్మాలలో ఎక్కువ పట్టుదల గల వ్యక్తిగా చూపడం జరిగింది. "శత్రువులు బోధన్ పండితుని చంపడం, సికందర్ సోదరుడైన జలాలుద్దీన్ తన అనుయాయులతో మానసింహుని శరణు పొందడం మొదలైనవి చారిత్రక సత్యాలు."[3]

**3.2.3.2. కథావస్తువు:** రాజా మానసింహ తోమర్ 'గ్వాలియర్'ను పరిపాలించే కాలంలో, ఆ రాజ్యంలోని 'రాయి' అనే ఒక చిన్న గ్రామంలో 'మృగనయనీ' (నిన్నీ) నివసిస్తూ ఉండేది. ఆమె తల్లిదండ్రులు చిన్నప్పుడే మరణించారు. ఆమెకు అటల్ అనే సోదరుడు తప్ప ఇంకెవరూ లేరు. వా

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్-సాహిత్య – డా॥ మోరేవానీ సహాయ్., పు: 474, 475.
మృగనయనీ 'పరిచయ్' – బృందావన్ లాల్ వర్మ., పు:4

బీదవాళ్ళైనా అసాధారణ ధైర్య సాహసాలు కలవారు. అటల్ తన చెల్లెలిని చాల ప్రేమతో చూచేవాడు. నిన్నీ కూడ అటల్‌ని చాల అభిమానించేది.

నిన్నీ చాలా అందమైనది. కేవలం అందమేగాక గంభీర స్వభావం, పరాక్రమం, ధైర్యసాహసాలు కలది. ఆమె స్వచ్ఛమైన ప్రకృతి ఒడిలో పెరిగింది. నిన్నీకి జీవితంలో ప్రకృతినుండి ఉత్సాహం, ప్రోత్సాహం లభించింది. ఆమె ప్రకృతి సౌందర్యంలో లీనమై తన్ను తాను మరచి పోయేది. నిన్నీ గూజర జాతికి చెందిన కన్య. ఆమె బాణం, బల్లెం ప్రయోగించడంలో సమర్థురాలు. అడవి పందులను, అడవి దున్నలను, చిరుత పులులను వేటాడడం ఆమెకు చాల సులభమైన పని. ఆమె పొలం పనులలో తన సోదరుడికి సహాయం చేస్తూ ఉండేది.

నిన్నీకి లాఖీ అనే స్నేహితురాలు ఉంది. ఆమె అహీరు జాతికి చెందిన కన్య. లాఖీ కూడా పేద అమ్మాయే. ఆమెకూ తల్లి తప్ప ఇంకెవరూ లేరు. ఆ ముసలి తల్లి కూడ చనిపోయిన తరువాత ఆమె నిన్నీ, అటల్‌లతో కలసి ఉండేది. లాఖీ, నిన్నీల మధ్య గాఢ మైత్రి, ఆత్మీయత అధికంగా ఉండేది. ఎప్పుడైనా ఇరువురి మధ్య మనస్పర్థలు వచ్చినా వారు వెంటనే సరిదిద్దుకొనే వారు. ఆమె కూడ నిన్నీ, అటల్‌లతో కలసి వేటకు పోతూ ఉండేది. లాఖీ, అటల్‌ల స్నేహం క్రమక్రమంగా ప్రేమగా పరిణమించింది. ఇరువురు ఒకర్ని ఒకరు వదలి జీవించలేనంతగా అభిమానాన్ని పెంచుకొన్నారు. నిన్నీ కూడ లాఖీ తమ జాతి కన్య కానప్పటికీ ఆమెను తన వదినగా

చేసుకొనే దానికి ఎంత మాత్రం సంకోచ పడలేదు.

బోర్ధన్ పండితుడు 'రాయి' గ్రామ పూజారి. అతడు తన గ్రామంలోని శిథిలమైన దేవాలయాన్ని బాగు చేయించాలనే ఉద్దేశంతో నిన్నీ, లాఖీల సౌందర్యాన్ని, వాళ్ళ ధైర్యసాహసాలను గ్వాలియర్ రాజైన మానసింహుని వద్దకు వెళ్ళి వర్ణించి, తమ గ్రామానికి రమ్మని ఆహ్వానిస్తాడు. సహజంగా సౌందర్యాభిలాషి అయిన రాజు వీరి గుణాల వల్ల ఆకర్షితుడై తన గ్రామానికి వస్తాడని బోర్ధన్ పండితుడు ఆశించాడు. కానీ రాజు రాజకీయ కార్యాలలో తల మునకలై ఉండడం వల్ల మరోసారి రాయి గ్రామం వస్తానని బోర్ధన్ పండితునితో చెప్తాడు. నిన్నీ, లాఖీల సౌందర్య పరాక్రమాలు మాండూ సుల్తాన్ గయాసుద్దీన్, ఢిల్లీ పాదుషా అయిన సికిందర్ లోడీ, గుజరాత్ సుల్తాను బఘర్రా మొదలైన రాజులకు తెలిసి, వాళ్ళను స్వంతం చేసుకోవడానికి ప్రయత్నాలు చేస్తారు. ముఖ్యంగా గయాసుద్దీన్ 'మటరూ' అనే తన అనుచరుని సహాయం నిన్నీ, లాఖీలను పట్టుకోవాలని ప్రయత్నిస్తాడు. మటరూ నిన్నీ, లాఖీల వృత్తాంతాన్ని తెలుసుకోవడానికి నటవర్గం (దొమ్మరివాళ్ళు) వారిని నియమిస్తాడు. వారి ద్వారా ఎప్పటికప్పుడు సమాచారాన్ని సేకరిస్తూ నిన్నీ, లాఖీలను వశపరచుకోవడానికి కుట్ర పన్నుతూ ఉంటాడు.

మటరూ నియమించిన నటవర్గం వారు రాయి గ్రామం చేరి నిన్నీ, లాఖీలతో పరిచయం చేసుకొంటారు. వీరిలో 'పిల్లి' అనే నటి చాల తెలివైనది. పిల్లి ద్వారా లాఖీ త్రాడుపై ఎక్కి నడవడానికి

నేర్చుకొంటుంది. మెల్లమెల్లగా నటవర్గం వారితో లాఖీ, నిన్నీల మైత్రి అధికం అవుతుంది. ఒకనాడు నటవర్గం వారు లాఖీ, నిన్నీలను వేటాడేందుకు తగిన ప్రదేశమనే పేరాశ చూపి ఒక మహారణ్యం వైపుకు వారిద్దరిని పంపిస్తారు. మటరూ పంపించిన నలుగురు గుర్రపు రౌతులు వాళ్ళను పట్టుకునేందుకు ప్రయత్నించారు. కానీ లాఖీ, నిన్నీలు వారిలో ఇద్దరిని అక్కడికక్కడే చంపేస్తారు. మిగిలిన ఇద్దరూ పారిపోతారు. ఈ గుర్రపు రౌతుల వృత్తాంతం ప్రతి గ్రామంలో వ్యాపించింది. నిన్నీ, లాఖీల కారణంగా గయాసుద్దీన్ తమ గ్రామాన్ని ఆక్రమించుకొంటాడని గ్రామ ప్రజలు మిక్కిలి భయపడ సాగారు. అంతకు ముందే సికిందర్ లోడీ ఆ గ్రామాలపై పడి భీభత్సం సృష్టించాడు. ఆ గ్రామాలన్నీ మానసింహుని అధీనంలో ఉన్నవే. సికిందర్ లోడీ తన రాజ్యానికి సరిహద్దులో ఉన్న ఈ గ్రామాలపై దాడి చేసి దేవాలయాలను పడగొట్టాడు. బావులు, చెరువులు విషపూరితం చేశాడన్న విషయం తెలిసి మానసింహుడు, శిథిలమైన దేవాలయాలను విషపూరితమైన బావులను బాగు చేయిస్తాడు.

మరలా రెండోసారి బోధన్ పండితుడు గ్వాలియర్ రాజు మానసింహుని వద్దకు వెళ్ళి, తమ గ్రామ పరిస్థితి గురించి చెప్పి తమ గ్రామానికి రమ్మని ఆహ్వానిస్తాడు. ఈ సారి అతని ఆహ్వానం అంగీకరించి మానసింహుడు బోధన్ పండితునితో కలసి 'రాయి' గ్రామం వస్తాడు. మానసింహుని రాకతో 'రాయి' గ్రామ ప్రజలకు ధైర్యం

చేకూరుతుంది. అతనికి ఆ గ్రామ ప్రజలు ఘన స్వాగతం చెప్పారు. ఆ స్వాగతోత్సవంలో నిన్నీ, లాఖీలు కూడ పాల్గొన్నారు. నిన్నీ సౌందర్యాన్ని చూచి రాజు ముగ్ధుడయ్యాడు.

ఒకరోజు అందరూ కలసి వేటకు వెళ్ళారు. ఆ వేటలో మృగనయనీ పరాక్రమాన్ని చూచి మానసింహుడు ఆశ్చర్య పడ్డాడు అతడామెను వివాహం చేసుకోదలచాడు. 'రాయి' గ్రామంలోనే వారి వివాహం వైభవంగా జరుగుతుంది. వివాహం తరువాత మానసింహుడు నిన్నీని 'మృగనయనీ' అని పిలువసాగాడు.

వివాహానంతరం మానసింహునితో కలసి నిన్నీ గ్వాలియర్ చేరింది. గ్వాలియర్ చేరిన పిమ్మట మానసింహునకు అంతకు ముందే ఎనిమిది మంది భార్యలున్నారనే విషయం నిన్నీకి తెలుస్తుంది. అంతమంది భార్యలున్నా రాజు హృదయంలో స్థిరమైన స్థానాన్ని పొంది, తన జీవితాన్ని చక్కటి మార్గంలో నడపాలని నిశ్చయించుకొంటుంది. గాయకుడైన బైజూనాథ్ వద్ద సంగీతాన్ని, కళ అనే నర్తకి వద్ద చిత్రకళ, నృత్యకళలను నేర్చుకొంటుంది.

మానసింహుని పట్టమహిషి సుమన మోహిని. ఆమె నిన్నీని చూచి ఈర్ష్య పడసాగింది. నిన్నీపై పగ తీర్చుకోవాలనే ఉద్దేశంతో మూడు సార్లు విషప్రయోగం చేయించింది. కాని ఆమె ప్రయత్నాలు ఫలించలేదు. అయినా నిన్నీకి సుమన మోహిని పై ద్వేషం కలుగలేదు.

'మృగనయనీ' తన సమయాన్ని సంగీత, చిత్ర, నృత్య కళల

అభ్యసించడంలో గడిపేది. చిన్నీ లలితకళలన్నింటిలో తన ప్రావీణ్యాన్ని మానసింహునికి చూపి అతని అభిమానాన్ని ఎక్కువగా చూరగొనింది. మానసింహునకు కళ, కర్తవ్యం, యుద్ధం అన్నవాటికి సమ ప్రాధాన్యాన్నివ్వమని చెప్పి, ఆదర్శవంతుడైన రాజుగా ఖ్యాతి గడించడానికి ప్రోత్సాహమిస్తూ ఉండేది.

ఇక రాయి గ్రామంలో లాఖీ, అటలులు ప్రేమికులై కలసి మెలసి తిరుగుతూ వివాహం చేసుకోవాలనుకొంటారు. కాని లాఖీ అహీరు జాతికి చెందిన కన్య; అటల్ గూజర జాతి యువకుడు కావడం వల్ల గ్రామపూజారి బోధన్ పండితుడు, గ్రామపెద్దలు ఈ వివాహానికి అంగీకరించరు. వారిని ఎదిరించి అటల్ గంగాజలం సాక్షిగా తీసుకొని లాఖీని పెండ్లి చేసుకొంటాడు. కాని గ్రామంలోని ప్రజలు వర్ణాంతర వివాహాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తారు. అందువల్ల లాఖీ, అటలులు నటవర్గం వారి సహాయంతో 'రాయి' గ్రామాన్ని వదలి 'మగరౌని' గ్రామం చేరారు.

నటవర్గంలోని పిల్లి, లాఖీని గయాసుద్దీన్ వద్దకు చేర్చాలని ప్రయత్నిస్తూ ఉండేది. ఈ విషయంలో ఆమె చాల చాకచక్యంగా ప్రవర్తించేది. ఆమె లాఖీని గయాసుద్దీన్‌కు అప్పగించి, అటల్‌ను తాను వివాహం చేసుకోవాలని ప్రయత్నాలు చేయసాగింది. ఆమె లాఖీకి విలువైన వస్త్రాభరణాలు, ముత్యాలు, రత్నాలు మొదలైన వాటిని చూపి, రాజమహల్ వైభవాన్ని వర్ణించి లాఖీ మనస్సును గయాసుద్దీన్ వైపు మరల్చడానికి ప్రయత్నిస్తూ ఉండేది. లాఖీకి విలాస జీవితంపై మోజు ఉన్నా, తాను కష్టించి

సుఖ జీవితం గడపాలని కోరుకొనేది. రాయి గ్రామాన్ని వదలి పెట్టేటప్పుడు, గ్వాలియర్ కు వెళ్ళి అక్కడ సుఖంగా జీవిస్తామని అటల్ చెప్తే, 'మనం స్వశక్తితో వైభవాన్ని పొంది సగౌరవంగా గ్వాలియర్ వెళ్ళాలే గానీ, యాచకులవలె పోరాద'ని లాఖీ తన అభిప్రాయాన్ని వెల్లడించింది.

'మగరౌని' గ్రామం 'నర్వర్' కోటకు దగ్గరగా ఉంది. గయాసుద్దీన్ నర్వర్ కోటను ఆక్రమించుకోవడానికి సైన్యాలతో వస్తున్నాడని తెలియడంతో, చుట్టు ప్రక్కల గ్రామాల వాళ్ళందరూ నర్వర్ కోటలో తలదాచుకునేందుకు వెళ్తారు. ఆ సమయంలో అటల్, లాఖీలు, నటవర్గం వారు మగరౌని గ్రామంలో ఉన్నందువల్ల వీళ్ళూ కోటలో వెళ్ళి తలదాచుకొంటారు. ఈ దొమ్మరి గుంపు (నటవర్గం) గయాసుద్దీన్ మనుష్యులని ఎవ్వరికీ తెలియదు. గయాసుద్దీన్ నర్వర్ కోటను ముట్టడిస్తాడు. గయాసుద్దీన్ కు సాయపడాలని దొమ్మరి గుంపులో ముఖ్యులైన పిల్లి, బోరటా, మటరూ, క్వాజా మొదలైన వాళ్ళు కుట్ర పన్నుతారు. ఈ విషయాలేవీ లాఖీ, అటల్ లకు తెలియవు. నటవర్గంలోని వారు ఒకరోజు రాత్రి రహస్యంగా కోట తలుపులు తెరవాలని ప్రయత్నిస్తారు; కానీ ప్రయత్నం ఫలించదు. 'పిల్లి' తాడు సహాయంతో కోట బురుజు నుండి దిగుతూంటే, ఆమె చేయబోయే ద్రోహాన్ని తెలుసుకొన్న లాఖీ తాడు కోసేస్తుంది. 'పిల్లి' కందకంలో పడి మరణిస్తుంది. తరువాత అటల్ లాఖీలు అప్రమత్తులై కోటలో మిగిలిన శత్రువులను బంధిస్తారు. మరుసటి రోజు ఉదయాన్నే మానసింహుడు వచ్చేసరికి గయాసుద్దీన్ సేనలు వెనక్కి పారిపోతాయి. నర్వర్ కోటను రక్షించింది

లాఖీ, అటల్‌లని తెలుసుకొని మానసింహుడు వారిని సగౌరవంగా గ్వాలియర్ కోటకు తీసుకొని వెళ్తాడు.

లాఖీ, అటల్‌లు గయాసుద్దీన్ మనుష్యులను చంపి నర్వర్ కోటను రక్షించినందుకు ప్రజలు వారిని వేనోళ్ళ పొగిడారు. నర్వర్ దుర్గాన్ని రక్షించిన లాఖీ, అటల్‌లు శివిగా ఏనుగుపై కూర్చొని గ్వాలియర్ చేర్తారు. అక్కడ మృగనయని, మానసింహులు లాఖీ, అటల్‌ల వివాహం వైభవోపేతంగా జరిపిస్తారు.

మానసింహుడు రాయిగ్రామం దగ్గర ఒక దుర్గాన్ని నిర్మించి అటల్, లాఖీలకు ఆ దుర్గరక్షణా భారం అప్పగించాడు. సికిందర్ లోడీ రాయి గ్రామంపై దండెత్తి వచ్చినప్పుడు దుర్గరక్షణలో లాఖీ, అటల్‌లు అప్రమత్తంగా ఉంటూ సికిందర్ లోడీని ఎదుర్కొంటారు. కానీ, ఒకనాటి రాత్రి లాఖీ ఒంటరిగా దుర్గ రక్షణలో నిమగ్నమై ఉండగా, కొంతమంది శత్రువులు దొంగచాటుగా కోటపైకి ఎక్కడాన్ని చూస్తుంది. లాఖీ వారితో పోరాడి కోటను రక్షించే ప్రయత్నం చేస్తుంది. కానీ ఈ ప్రయత్నంలో సరియైన సమయానికి సహాయం అందలేక గాయపడి మరణిస్తుంది. అటల్ కూడ శత్రువులను ఒంటరిగా ఎదుర్కొని ప్రభు భక్తిని నిరూపించుకొని మరణిస్తాడు.

యుద్ధం ముగిసిన పిమ్మట మానసింహుడు శిథిలమైన ఆ దుర్గాన్ని బాగు చేయిస్తాడు. మృగనయని స్వయంగా లాఖీ చిత్రాన్ని చిత్రించి ఆ మహలులో ఉంచుతుంది

'మృగనయనీ'కి ఇద్దరు కుమారులు జన్మించినా తన కుమారులకే పట్టం కట్టాలని కోరకుండా, పట్టమహిషి సుమనమోహిని పుత్రుడైన విక్రమాదిత్యుని గద్దెపై కూర్చుండబెట్టి, వంశ పరంపరా గత సంప్రదాయాన్ని కాపాడింది.

**3.2.3.3. ప్రాసంగిక కథలు:** 'మృగనయనీ' నవలలో మృగనయని మానసింహులకు చెందింది ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా ఆరు ప్రాసంగిక కథలున్నవి.

1. లాఖీ, అటల్‌ల వర్ణాంతర వివాహానికి చెందింది మొదటిది.

2. మాళవదేశపు పాదుషా అయిన గయాసుద్దీన్ ఖిల్జీ కామవాసనకు చెందింది రెండవది.

3. గయాసుద్దీన్ పుత్రుడు, అత్యంత కాముకుడైన నజరుద్దీన్‌కు చెందింది మూడవది.

4. నటవర్గపు నాయకుడు 'పోటా' అనే అతనికి 'పిల్లి' అనే స్త్రీకి చెందిన కథ నాల్గవది.

5. గ్వాలియర్‌కు చిర శత్రువైన సికిందర్ లోడి గ్వాలియర్‌పై దండెత్తి వచ్చిన విషయానికి చెందింది ఐదోది.

6. నరవర్ రాజ్యానికి పరంపర వారసుడైన రాజసింహునికి అతని ప్రేయసియైన కళ అనే యువతికి సంబంధించినది ఆరవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారక కథ చక్కగా పోషించబడింది.

### 3.2.4. విరాటా కీ పద్మిని :

**3.2.4.1. చారిత్రక నేపథ్యం :** "విరాటా కీ పద్మిని' శుద్ధ చారిత్రక నవలకాదు. చారిత్రక నేపథ్యంలో రచింపబడిన రొమాన్స్ కథ."[1]

"విరాటాకీ పద్మిని నవల చారిత్రక వాతావరణాన్ని ఆధారంగా చేసుకొని ఆహ్లాదకరమైన స్వతంత్రకథ కల్పించారు"[2] రచయిత.

"విరాటాకీ పద్మిని నవల శుద్ధ చారిత్రక నవలగాక శుద్ధ రొమాన్స్ కు చెందింది. ఎందుకంటె ఇందులోని సంఘటనలు కల్పితాలు కావచ్చు, జనశ్రుతులపై ఆధారపడ్డవీ కావచ్చు, కానీ నేపథ్యం మాత్రం చారిత్రకమే."[3]

"వర్మగారు ఈ నవలను రాయడానికి ముందు ఝాన్సీ జిల్లా మోంఠ్ పరగణా సుల్తాన్‌పురా నివాసియైన 'నందూ పురోహితుని' వద్ద ఈ కథను మొట్టమొదట విన్నారు. తర్వాత చారిత్రక సత్యాలను సేకరించడానికి విరాటా ప్రాంతం వెళ్ళారు. అక్కడ ఒక వయోవృద్ధుని నోట కూడ ఈ కథ విన్నారు. తర్వాత అప్పుడప్పుడు, అక్కడక్కడ జరిగిన సంఘటనలను ఒకేసారి జరిగినట్లు రాశారు. కొన్ని కొన్ని పేర్లు మార్చిరాసినా చారిత్రక సత్యమే రాశారు."[4]

"పద్మినీ లేక కుముద్ కథ చరిత్రకు సంబంధించినది. ఈ కథ

1. హిందీ ఉపన్యాస్ – శ్రీ శివనారాయణ శ్రీ వాస్తవ్., పు: 138
2. హిందీ ఉపన్యాస్ ఔర్ యథార్థవాద్ – డా॥ త్రిభువన సింహ్., పు: 247.
3. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ – మృగనయనీ – డా॥ శాంతి స్వరూప్ గుప్త., పు: 75.
4. ఉపన్యాస్ కార్ బృందావన్‌లాల్ వర్మ – డా॥ శశిభూషణ్ సింహాల్., పు: 63.

క్రీ.శ.1700 ప్రాంతంలో జరిగింది. విరాటా గ్రామ ప్రభుత్వ పత్రంలో క్రీ.శ. 1862 సం॥లో పద్మినికి సంబంధించిన ఘటన రాశారు. విరాటాలో దాంగీ జాతికి చెందిన పద్మినీ అనే స్త్రీ ఉండేదనీ, కాలపీ నవాబు దండెత్తి వచ్చినందు వల్ల ఆమె చేతవా నదిలో దూకి మరణించిందనీ ఉర్దూలో రాసి ఉంది"[1] అని రాశారు.

"భారత దేశంలో రాజకీయ పరిస్థితులు భయంకరం గాను, అస్తవ్యస్తం గాను ఉండే యుగం నాటి పరిస్థితులను ఆధారంగా చేసు కొని నవలాకారుడు ఈ నవలలను రచించాడు. ఆనాడు భారత దేశం దృఢమైన శాసకుని పాలనలో కాక 'ఫరుఖసియర్' వంటి దుర్బలుడైన పాదుషా శాసనంలో ఉండేది. చిన్న చిన్న రాజులు, నవాబులు కేంద్రీయ శాసనాన్ని ఎదిరించి తమ తమ స్వతంత్ర రాజ్యాలకు పునాది వేస్తూ ఉండేవారు. కుట్రలు, కుతంత్రాలు, సామంత రాజుల వ్యక్తిగత స్వార్థాలు మొదలైన వాటికి సాధారణ ప్రజలే బలిపశువులు అవుతూ ఉండేవారు. చిన్న చిన్న స్వతంత్ర రాజులు, నవాబులు తగిన సమయానికి పొంచి ఉండే వారు. ఈ నేపథ్యంలో 'విరాటాకీ పద్మిని' నవల వెలువడింది."[2] ఈ నవల కేవలం కల్పనే అయినా ఆ నాటి రాజకీయ, సాంఘిక, చారిత్రక పరిస్థి తులను అద్దం పట్టే విధంగా ఉంది.

"నవలలోని నాయక సింహుడు, దేవీ సింహుడు, లోచన సింహుడు,

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మ - డా॥ శశి భూషణ్ సింహాల్., పు: 63.
2. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ మృగనయని - డా॥ శాంతి స్వరూప గుప్త., పు: 76.

జనార్దన శర్మ, అలీమర్దాన్ మొదలైన పేర్లు మారుపేర్లు. వారి చరిత్ర మాత్రం సత్యం. నవలలోని సంఘటనలు సత్యాలు అయినప్పటికి వివిధ కాలాలకు సంబంధించిన సంఘటనలను ఒక చోట చేర్చడం జరిగింది."[1]

వర్మగారు రచించిన నవలలో మంత్రి 'జనార్దన శర్మ' ముగింపు ఒక విధంగానూ, నిజమైన చరిత్రలో మంత్రి మరణం ఇంకో విధంగానూ ఉంది. నిజమైన మంత్రి ముగింపు ఎంతో దుఃఖపూరితమైంది. వర్మ గారే నిజ సంఘటన ఇలా జరిగిందని రాశారు. "చరిత్రలో దలీప్ నగరరాజు (నవలలో నాయక సింహుడు) చనిపోయిన తర్వాత అతని చిన్న భార్య, మంత్రి (నవలలో జనార్దన శర్మ) తలనరికి తెచ్చేవరకు నేను భోజనం చేయను అని ప్రతిజ్ఞ పూనితే, రాణికి ప్రీతిపాత్రుడైన నౌకరు ఒకడు ఆ మంత్రి తలనరికి తెచ్చి రాణికి సమర్పిస్తాడు. అప్పుడు రాణి భోజనం చేసింది. ఈ సంఘటన ఝాన్సీ దగ్గర 'గోరా మఛియా' అనే గ్రామంలో జరిగింది."[2] ఇంకా నవలగురించి వర్మగారు ఇలా రాశారు. "నవలలో చర్చించిన సంఘటనలు సత్యాలు అయినప్పటికీ, ఈ సంఘటనలు అనేక కాలాలకు సంబంధించినవైనా, వాటిని సంగ్రహించి ఒకే కాలంలో జరిగినట్లుగా కూర్చాను. అందువల్ల ఎవ్వరైనా నవలలోని పాత్రలు గాని, సంఘటనలు గానీ తమకు సంబంధించిన పాత్రలని పిస్తే అన్యథా భావించకండి. ఈ కారణం చేత నేను నవలలో

---

1. విరాటాకీ పద్మిని 'పరిచయ్' — బృందావన్ లాల్ వర్మ., పు: 2.

2. పైదే., పు:2.

వర్ణించిన ముఖ్య చరిత్రలను విస్తృతంగా పరిచయం చేయలేక పోతున్నాను.[1] కాబట్టి "రచయిత జన జీవనానికి చెందిన ప్రగతిని పట్టించుకోకుండ ఆ నాటి ప్రవృత్తిని, ప్రేమకు చెందిన భావుకత, దాని ఆదర్శవాద స్వరూపాన్ని వర్ణించారు. పాఠకులకు కఠోరమైన వాస్తవాన్ని తెలియజేయకుండా కాల్పనిక లోకంలో సంచరింప జేయడం ఈ నవల ఉద్దేశం. ప్రేమ, భావుకత, ఆదర్శవాదం మొదలైన విషయాల పట్ల పాఠకుల హృదయంలో పవిత్ర భావాన్ని కలిగించి, చివరకు దుఃఖాంతం చేసి పాఠకుల్లో కరుణ, దుఃఖం, ఆవేదన కలిగించడమే నవలాకారుని లక్ష్యంగా కనబడుతుంది."[2]

**3.2.4.2. కథావస్తువు :** 'విరాటా కీ పద్మిని' నవలా 'పరుఖ సియర్' అనే పాదుషా యుగానికి చెందింది. అతని శాసన కాలంలో కుట్రలు కుతంత్రాలతో కూడిన సామంత రాజుల వ్యక్తిగత అత్యాచారాలకు సాధారణ జనులు బలై పోతూ ఉండే వారు. ఇటువంటి సమయంలో 'పాలర్' గ్రామంలో 'దాంగీ' జాతికి చెందిన ఒక గృహంలో ఒక బాలిక జన్మిస్తుంది. ఆమె రూప లావణ్యాలలో సాటిలేనిది కావడంతో ప్రజలు ఆమెను సాక్షాత్తు దుర్గాదేవి అవతారమని తలచి పూజించేవారు. ఆ బాలిక పేరు 'కుముద్'. ఆమెను దేవీ అవతారంగా తలచి, దూర ప్రాంతాలనుండి కూడ ప్రజలు తండోప తండాలుగా వచ్చి ఆమెను దర్శించేవారు.

ఆ రోజుల్లో దలీప్ నగరాన్ని నాయక సింహుడు పాలిస్తూ ఉండేవాడు

1. విరాటాకీ పద్మినీ 'పరిచయ్' – బృందావన్ లాల్ వర్మ., పు: 2
2. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య – డా|| మోహినీ సహాయ్., పు:

అతని దాసీపుత్రుడైన కుంజర సింహుడు కుముద్ సౌందర్యాన్ని గురించి విని, ఆమెను చూడడానికి సేనాధిపతి అయిన లోచన సింహునితో పాలర్ గ్రామానికి వస్తాడు. ప్రథమ దర్శనం లోనే కుముద్ సౌందర్యం అతన్ని ఆకర్షిస్తుంది. కుంజర సింహుని సౌందర్యాన్ని చూచి కుముద్ కూడ అతనిపై వలపు పెంచుకొంది.

నాయక సింహుడు తీర్థస్నానాలు చేస్తూ తన పట్టణానికి తిరిగి వెళ్ళేటప్పుడు 'కాలపీ' వద్ద కొందరు ముసల్మానులు (అలీ మర్దాన్ సేన) అతనిపై దాడి చేశారు. రెండు సేనల మధ్య భీకర యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో నాయక సింహుడు బలహీనుడైనాడు. ఇక అలీ మర్దాన్ సేనలు అతణ్ణి చంప బోతుండగా, బుందేల్ ఖండ్ వీరుడైన దేవీసింహుడు నాయక సింహుని రక్షిస్తాడు. తన ప్రాణాలు కాపాడినందుకు నాయక సింహుడు దేవీ సింహుని ఎంతగానో కొనియాడుతాడు. దేవీ సింహుడు నాయక సింహుని మన్ననకు పాత్రుడై, అతని మంత్రియైన జనార్ధన శర్మకు కూడా ఇష్టుడౌతాడు. అంతేగాక కుంజర సింహుని కంటే దేవీ సింహుడే సమర్థుడనీ, నాయక సింహునికి వారసుడనీ భావిస్తాడు.

కొన్నాళ్ళకు నాయక సింహుడు మరణిస్తాడు. మంత్రి జనార్ధన-శర్మ కుంజర సింహుని ఉపేక్షించి దేవీ సింహుని 'దలీప్' నగర రాజుగా ప్రకటిస్తాడు. కుంజర సింహుడు తనకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకొనేందుకై అవకాశం కోసం ఎదురు చూస్తూ ఉంటాడు.

కుముద్ సౌందర్యం అలీమర్దాన్ చెవిలో పడుతుంది. ఆమె

దైవాంశ సంభూతురాలు అనికూడ వింటాడు. కాని లెక్కచెయ్యక ఎలాగైనా ఆమెను పొందాలని తలచి సమయం కోసం ఎదురుచూస్తూ ఉంటాడు.

'పాలర్' గ్రామంలో తన కుమార్తె సురక్షితంగా ఉండదేమో అని కుముద్ తండ్రి నరపతి, ఆమెను విరాటా దుర్గంలో తన బంధువుల ఇంటిలో ఉంచుతాడు. విరాటా దుర్గం దగ్గర్లో 'బేతవా' నది ఉంది. ఆ నది గట్టున ఒక ప్రసిద్ధ మందిరం కూడ ఉంది.

కుంజర సింహుడు ప్రతీకార వాంఛతో తిరుగుతూ విరాటా దుర్గాన్ని చేరుతాడు. కుముద్ ఆ దుర్గం లోనే ఉందన్న విషయం తెలుసుకొని ఆమెను కలుసు కొంటాడు.

అలీమర్దాన్‌కు కూడా కుముద్ విరాటా దుర్గంలో ఉన్న విషయం తెలుస్తుంది. ఆమెను అపహరించుకు పోవాలన్న ఉద్దేశంతో పెద్ద సేనతో విరాటా దుర్గం పైకి దండెత్తుతాడు. ఈ విషయం దేవీసింహునికి తెలిసి ఆమెను రక్షించాలని కొంత సేనతో బయలుదేరు తాడు. కుముద్‌ను దేవీ అవతారంగా భావించే దాంగీ వంశీయులు ఎల్లప్పుడూ ఆమెను కంటికి రెప్పలా కాపాడుతూ ఉంటారు. దాంగీ వంశీయులకూ, అలీ మర్దాన్ సేనకూ మధ్య భయంకర యుద్ధం జరుగుతుంది. కానీ, దాంగీయులది కొద్దిపాటి సేన - శత్రువులది చాల పెద్ద సేన. కాబట్టి దాంగీసేన శత్రుసేనలతో పోరాడలేక పోతుంది. ఓటమి పాలౌతున్న దాంగీ సేన జౌహారు వ్రతాన్ని పాటించేందుకు పూనుకొంటారు. ఇంతవరకు మానవ ప్రయత్నం చేశారు ఇక దైవమే కుముద్‌ను రక్షించాలని వారి అభీష్టం. అందులో ఆమె దైవాంశ సంభూతురాలు అని గట్టినమ్మకమున్న

దాంగీ వంశీయులు దుర్గామాత ఆమెను కాపాడుతుందని కూడ నమ్మకం పెట్టుకొని ఆత్మాహుతి చేసుకొంటారు.

కుంజర సింహునకు కూడ పాలుపోక అలీమర్దాన్ తో పోరు సల్పడానికే నిశ్చయించుకొంటాడు. అలీమర్దాన్‌ను చంపి తను చచ్చినా పరవాలేదనుకొంటాడు. చివరిసారిగా 'కుముద్'ను చూడాలని వెళ్తాడు. కుముద్ కి కూడా దుఃఖం పొంగుకొస్తుంది. ప్రజలు తనను దైవాంశ సంభూతురాలని భావిస్తున్నారనే విషయాన్ని మరచి, క్షణికావేశంలో కుంజర సింహుడు తనని కౌగిలించుకున్నా అడ్డు చెప్పదు.

ఇంతలో దేవీసింహుడు కూడ తన సేనతో విరాటా దుర్గం చేరుకొంటాడు. అతన్ని చూచేటప్పటికి కుంజర సింహునిలో ప్రతీకార వాంఛ చెలరేగుతుంది. దేవీ సింహునిపై కత్తిదూస్తాడు. ఇరువ్వురూ భయంకరంగా కత్తి యుద్ధం చేస్తూ ఉంటారు. ఆ సమయంలో అలీ మర్దాన్ కుముద్‌ను పట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు. కుముద్ అలీమర్దాన్‌కు చిక్కకుండా పరుగెత్తుతుంది. అలీ మర్దాన్ కుముద్‌ను తరుముతూ వెంబడిస్తాడు. దేవీ సింహునితో ద్వంద్వ యుద్ధం చేస్తున్న కుంజర సింహుడు, భీత హరిణి క్షణ వలె పరుగెత్తుతున్న కుముద్‌ను, పులిలా కుముద్‌ను తరుముతున్న అలీ మర్దాన్‌ను చూచి ఒక్క క్షణం నిశ్చలుడౌతాడు. ఆ క్షణంలో దేవీ సింహుడు కుంజర సింహుని కంఠం నరుకుతాడు. తల ఒక ప్రక్క, మొండెం ఒక ప్రక్క పడిపోతుంది. దేవీ సింహుడు వెంటనే కుముద్‌ను రక్షించాలని అలీ మర్దాన్‌ను తరుముతాడు. కుముద్ పరిగెత్తుతూ ఉంటుంది.

కుముద్‌ను తరుముతూ అలీమర్దాన్ ; అలీమర్దాన్‌ను తరుముతూ దేవీసింహుడు. ఇలా ఒకరివెంట ఒకరు పరుగెత్తుతూ కొండ చరియను సమీపిస్తారు. కొండ చరియను ఆనుకొని 'బేతవా' నది ఉధృతం ప్రవహిస్తూ ఉంది. కుముద్ రెండు చేతులు జోడించి మృదువైన స్వరంతో, శాంత గంభీరంగా "తోట మాలికలు నందన వన మందలి పూవులను తెత్తురుగాక" అని పాడుతూ నదిలో దూకుతుంది. ఆమె నదిలో దూకబోయే ముందు అలీమర్దాన్ పరుగెత్తుకొంటూ వచ్చి ఆమెను పట్టుకొనేందుకు చేయి చాస్తాడు. కాని అతని చేతికి ఆమె చేలాంచలం మాత్రం చిక్కుతుంది. ఆమె శరీరం మాత్రం 'బేతవా' నదీ ప్రవాహంలో కొట్టుకొని పోతుంది. కుముద్ మరణం తో 'విరాటాకీ పద్మిని' నవల నాటకీయంగా ముగుస్తుంది.

**3.2.4.3. ప్రాసంగిక కథలు :** 'విరాటాకీ పద్మిని' నవలలో కుముద్, కుంజర సింహుల విషయం ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా మూడు ప్రాసంగిక కథలున్నాయి.

1. లోచన సింహుడు, అన్నరాణి, అలీమర్దాన్ మొదలైన వాళ్ళకు సంబంధించినది మొదటిది.
2. దేవీ సింహుడు, గోమతీల కథ రెండోది.
3. జనార్దన శర్మ, దేవీసింహులకథ మూడోది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషింపబడింది

### 3.2.5. టూటే కాంటే :

**3.2.5.1. చారిత్రక నేపథ్యం :** "మహమ్మద్ షా పాదుషా రాజ్యకాలం 1719-1748 అని అనేక చరిత్ర గ్రంథాలు తెలుపుతున్నాయి. ఇతని కాలం లోనే 'ఈరాన్'ను పరిపాలించే 'నాదిర్ షా' ఢిల్లీపై దండెత్తాడు. నాదిర్ షా ఆక్రమణ విషయాన్ని 'ఆనందరామ్ ముఖలిస్' అనే రచయిత తాను రచించిన 'తజకిరహ్' అనే ఫారసీ గ్రంథంలో పేర్కొన్నాడు. 'మౌలానా సాహెబ్' అనే వ్యక్తి సహాయంతో వర్మగారు పై గ్రంథంలోని కొన్ని విషయాలను హిందీలోనికి అనువదించుకొన్నారు."[1] "వర్మగారికి 'షివ బారీ ఆయా క్వాజా అబ్దుల్ కలీమ్ ఖాఁ కాశ్మీరీ' గారి 'బయానే బుకామ్' అనే పుస్తకం లాహోరు పబ్లిక్ లైబ్రరీలో దొరికింది. ఈ గ్రంథంలో 'నూర్ బాయి' వృత్తాంతం ఉంది."[2] "తర్వాత 'నూర్ బాయి' విషయాన్ని 'ఇర్విన్' అనే రచయిత 'Later Moguls vol II, (Page no 371)'లో రాశాడు. అందులో 'నూర్ బాయి' వృత్తాంతం సమగ్రంగా ఉంది."[3] ఆ పుస్తకంలో ఇలా రాసి ఉంది. " The conqueror allowed himself some relaxation after his ardons campaigns. Dances and songs were performed before him. one Indian dancing girl named Nur Bai so highly fascinated him by her musical powers and ode in honour of him that he ordered her to be Paid

1. టూటే కాంటే 'పరిచయ్' - బృందావన్ లాల్ వర్మ ., పు: 2.
2. పైదే., పు: 3.
3. పైదే., పు: 4.

Rs. 4000/- and taken to persia in his train. It was with the greatest difficulty that she could save her self from this last mark of his favour."[1]

ఇక నాదిర్‌షా లూటీ విషయం వర్మగారు ఇలా రాశారు. "నాదిర్‌షా ఢిల్లీలోని 'లాల్ ఖిలా' లో మహమ్మద్‌షా అతిథిగా బస చేశాడు. నష్టపరిహారంగా 20 కోట్ల రూపాయలు చెల్లించమని కోరాడు డబ్బుకు బదులుగా మహమ్మద్‌షా 'నూర్‌బాయి' ని, ఆమెతో పాటు 4000 మంది దాసీలను బహుమానంగా ఇచ్చాడు. వీళ్ళని స్వీకరించి నప్పటికీ, నాదిర్‌షా 20 కోట్ల రూపాయలూ ఇవ్వవలసిందేనని పట్టుపట్టాడు. అందుకు మహమ్మద్‌షా అంగీకరించలేదు. దీనిపై కోపించిన నాదిర్‌షా ఢిల్లీని లూటీ చెయ్యమని తన సైనికులను ఆజ్ఞాపించాడు. నాదిర్‌షా ఢిల్లీలో భయంకర రక్తపాతాన్ని సృష్టించాడు. చివరకు 17 కోట్ల రూపాయలు, నెమలి సింహాసనాన్ని తీసుకొని ప్రయాణమయ్యాడు. ఈ లూటీ విషయాన్ని 'అబ్దుల్ అజీజ్' తన ఆంగ్ల పుస్తకం 'The Imperial Treasury of the Indian Moguls' లో రాసి ఉన్నాడు."[2]

"నాదిర్‌షా 57 రోజులు ఢిల్లీలో ప్రళయం కావించి 1739 మే 5వ తేదీ నాడు ఈరాన్ కు ప్రయాణమయ్యాడు. తనతో పాటు 17 కోట్ల రూపాయల బంగారు నగదును, 4000 మంది దాసీలను, 130 మంది మున్షీలను, 300 మంది రాజ శిల్పులను, 200 మంది కమ్మరులను

---

1. టూటే కాంటే 'పరిచయ్' - బృందావన్ లాల్ వర్మ, పు: 4.
2. పైదే, పు:5.

# टूटे काँटे

टूटे काँटे

ऐतिहासिक उपन्यास



वृन्दावनलाल वर्मा

200 మంది వస్త్రాంగులను, 100 మంది రాతిపని చేయు వారిని తీసుకొని వెళ్ళారు. కానీ, దారిలో 'చీనాబ్' నది దగ్గర భారీ వర్షం కురిసింది. తుఫాను వచ్చింది. 2000 మంది నాదిర్‌షా సిపాయిలు వరదలో కొట్టుకు పోయారు. ఈ సువర్ణ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని మిగిలిన అందరూ తప్పించుకొని పారిపోయారు."[1]

"నూర్‌బాయి అందగత్తే కాక కళాకారిణి కూడా. ఆమెకు ఈ దేశాన్ని వదలి 'ఈరాన్' వెళ్ళడం ఇష్టం లేదు. కోట కాపలాదారుడైన జాట్ వ్యక్తి సహాయంతో ఆమె తప్పించుకొని పారిపోయింది."[2]

"సాదత్ ఖాన్ నూర్‌బాయిని ప్రేమించడం, విధిలేక ఢిల్లీ పాదుషా మహమ్మద్ షాకు అప్పగించడం, తర్వాత ఆమె విరహాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకోవడం, నాదిర్‌షా ఢిల్లీపై దండెత్తడం, నూర్‌బాయిని నాదిర్‌షా ఈరాన్ తీసుకు పోవాలనుకోవడం, ఆమె తప్పించుకొని పోవడం - ఇవన్నీ చారిత్రక సత్యాలే."[3]

ఈ నవలలోని స్థలాలన్నీ చరిత్ర ప్రసిద్ధాలు. నవలలోని ఉత్తరార్థం అధిక భాగం కల్పనపై ఆధారపడి ఉంది.

**3.2.5.2. కథావస్తువు:** 'టూటే కాంటే' నవల కథావస్తువు 18వ శతాబ్దానికి చెందింది. ఢిల్లీని విలాసవంతుడైన 'మహమ్మద్ షా' పరిపాలిస్తూ ఉండేవాడు. ఆ సమయంలో ఉత్తర భారతంలో అన్నిచోట్ల

1. టూటే కాంటే 'పరిచయ్' — బృందావన్‌లాల్ వర్మ., పు: 5,6.
2. పైదే., పు: 5.
3. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య్ — డా॥ మోహినీ సహాయ్., పు: 479.

అరాచకత్వం వ్యాపించి ఉండేది. ఒక ప్రక్క మరాఠీలు గొప్ప హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించాలని కోరుతూ హిందూ సైనికులను రెచ్చగొడుతూ అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉన్నారు. అప్పటికే ఆంగ్లేయులు పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి వాళ్ళు భారత దేశంలో ప్రవేశించారు. కేవలం వ్యాపారస్తులుగా వచ్చిన వారు, హిందూ దేశం లోని చిన్న చిన్న రాజ్యాలు కొట్లాడుకొంటూ ఉంటే, అగ్నిలో ఆజ్యం పోసినట్లు భారత దేశంలోని రాజులలో అంతః కలహాలు సృష్టించి, తాము సామ్రాజ్య నేతలై పోవాలనే ప్రణాళికలతో తలమునకలౌతున్నారు. ఇంకో ప్రక్క 'ఈరాన్' దేశీయుడైన నాదిర్షా నలువైపుల భీషణమైన రక్తపాతం కావిస్తూ భారత దేశం లోకి చొచ్చుకొని వస్తూ ఉన్నాడు. ఢిల్లీ పాలకుడైన మహమ్మద్‌షా బలహీనుడైనాడు.

ఈ 'టూటే కాంటే' నవలలోని నాయిక పేరు 'నూర్‌బాయి'. ఆమె ముసల్మాను జాతికి చెందిన స్త్రీ. ఆమె చాల అందకత్తె. గొప్ప నర్తకి; గాయని. మహమ్మద్‌షా ప్రధానాధికారి 'సాదత్ ఖాన్' అధీనంలో ఆమె ఉండేది. 'సాదత్ ఖాన్' ఆమెను ఎంతో గాఢంగా ప్రేమించాడు. ఆమెనే వివాహం చేసుకోవాలనుకున్నాడు. కాని నూర్‌బాయి మాత్రం తన నాట్య కౌశల్యాన్ని మహమ్మద్‌షా ఎదుట ప్రదర్శించి, గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించాలని ఉవ్విళ్ళూరుతుండేది. నవాబు కాముక ప్రవృత్తి తెలిసి ఉన్న సాదత్ ఖాన్, ఆమె అతని వద్ద నాట్యం చేసేందుకు ఇష్టపడలేదు. నూర్‌బాయికి ఎంతో చెప్పి చూశాడు. కాని చిన్నతనం వల్ల

అమాయకురాలైన నూర్ బాయి సాదత్ ఖాన్ మాటను పెడచెవిన బెట్టి మొండి పట్టు పట్టింది. ఆమె కోరిక కాదనలేక ఒకసారి పాదుషా ఎదుట నాట్య ప్రదర్శన ఏర్పాటు చేస్తాడు. సాదత్ఖాన్ ఊహించిన నట్లే కాముకుడైన మహమ్మద్ షా ను నూర్ బాయి అందం పిచ్చివాణ్ని చేసింది. ఆమెను ఎలాగైనా తన దాన్నిగా చేసుకోవాలను కొన్నాడు. సాదత్ ఖాన్ మహమ్మద్ షా ల మధ్య నూర్ బాయి వల్ల విరోధం పెరిగింది. సాదత్-ఖాన్ మహమ్మద్ షాని నేరుగా ఎదుర్కోలేడు. అందువల్ల కుట్రపన్ని భారత దేశం లోనికి చొచ్చుకొని వస్తున్న 'ఇరాన్' నవాబు నాదిర్షాను ఢిల్లీకి రమ్మని ఆహ్వానించాడు. ఆహ్వానం అందిన వెంటనే నాదిర్షా ఢిల్లీ చేరుకొన్నాడు. బలహీనుడైన మహమ్మద్షా, యుద్ధం జరిగితే ఓడిపోతానేమో నని సంధికి రాయబారం పంపించాడు. నాదిర్షాకు కొంత వినోదం కలిగించాలని 'నూర్ బాయి' నృత్య ప్రదర్శన ఏర్పాటు చేశాడు. ఆమె అందం, గాత్రం, నృత్య విన్యాసం చూసి 'నాదిర్షా' కూడా ఎంతో ఆకర్షితుడై ఆమెను తనతో పాటు ఇరాన్ దేశం తీసుకు వెళతానని కోరాడు. ఆమెతో పాటు నూరు కోట్ల రూపాయలు, 8000 మంది నాట్య కత్తెలను కప్పంగా ఇవ్వాలని కోరాడు. మహమ్మద్షా నూర్ బాయిని, నాట్య కత్తెలను ఇచ్చేందుకు అంగీకరించినా ధనాన్ని ఇచ్చేందుకు అంగీకరించ లేదు. దీనిపై కోపించిన నాదిర్ షా ఢిల్లీని లూటీ చేయమని తన సైనికులకు ఆజ్ఞాపించాడు. ఢిల్లీలో భయంకర రక్తపాతం జరిగింది. వీధులన్నీ రక్త మాంసాలతో, శవాలతో నిండి పోయాయి. రక్తం ఏరులై పారింది. చివరకు నాదిర్ షా

ఢిల్లీని కొల్లగొట్టి నూరు కోట్ల విలువగల సంపదను, నెమలి సింహాసనాన్ని, అనేక మంది ముస్లీలను, 4000 మంది నాట్యకత్తెలను, ఇంకా అనేక మందిని బంధించి ఈరానుకు తరలించుకొని వెళ్ళాడు.

ఢిల్లీలో రక్తపాతం జరుగుతున్న సమయంలో నూర్‌బాయికి కను విప్పు కలిగింది. రక్తపిపాసి అయిన నాదిర్‌షాతో 'ఈరాన్' వె అతని చెప్పు చేతల్లో దాసీగానో, వేశ్యగానో బ్రతకాలి. ఆమె అటువంటి బ్రతుకు కోరలేదు. ఈ తుచ్ఛ భోగాలపై ఆమెకు ఆసక్తి పోయింది. ఎలాగైనా నాదిర్‌షా కబంధ హస్తాల్లోంచి తప్పించుకోవాలని ప్రయత్నించింది. కోటను పహరా కాస్తున్న జాట్ సైనికుడు మోహన్ నూర్‌బాయిని చూచి జాలిపడ్డాడు. ఆమెను ఎలాగైనా తప్పించాలనుకొన్నాడు. ఒకనాటి రాత్రి తెగించి మోహన్, నూర్‌బాయిలు రహస్యంగా పారిపోతారు. ఆమెను అమితంగా ప్రేమించిన సాదత్‌ఖాన్ ఆమె జాడ తెలియక, ఎడబాటు భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడు.

నూర్‌బాయి, మోహన్‌లు ఎన్నో కష్టాలు ఎదుర్కొంటూ మధుర సమీపంలోని ఒక గ్రామం చేరుకొంటారు. ఆ గ్రామంలో 'చింతామన్' అనే జాట్ జాతికి చెందిన వ్యక్తి ఇంట్లో తాము భార్యా భర్తలమని చెప్పుకొని నివసిస్తూ ఉంటారు.

పాదుషా మహల్లో ఎంతో వైభవంగా జీవించిన నూర్‌బాయి ఇప్పుడు రహస్యంగా పేదరికంతో గడుపవలసి వస్తుంది. అయినా ఆమె బాధపడలేదు. గతంలో అనుభవించిన తుచ్ఛమైన సౌఖ్యాల కంటె ఈ

పేద జీవితమే ఆమెకు ఎంతో బాగున్నట్లు అనిపించింది.

నూర్‌బాయి ఢిల్లీనుండి పారిపోయి వచ్చేటప్పుడు కొన్ని అమూల్యమైన వజ్రాలను, నగలను తనతోపాటు తెచ్చుకొంది. చింతామన్ ఆమెవద్ద వజ్రాలు, నగలు ఉన్నట్లు పసికట్టాడు. ఎలాగైనా వాటిని అపహరించాలని కాచుకొని ఉంటాడు. ఇంతలో 'శుభరాతి' అనే పేరుగల గాయపడిన మహమ్మదీయ సైనికుడు ఒకడు చింతామన్ ఇంటికి వచ్చాడు. మోహానునికి అతనితో అంతకుముందే పరిచయం ఉంది. కొన్నాళ్ళు 'శుభరాతి' కూడ వీళ్ళతోనే చింతామన్ ఇంట్లో బస చేస్తాడు. ఇటువంటి దీన పరిస్థితిలో కూడ నూర్‌బాయి మోహాన్‌లు గాయపడిన శుభరాతికి శుశ్రూషలు చేస్తారు. 'శుభరాతి' కొంత కోలుకొంటాడు.

చింతామన్‌కు తమనగలపై కన్ను పడిందని భావించి ఒకరోజు రాత్రి నూర్‌బాయి, మోహాన్‌లు శుభరాతితో కలసి ఆ ఇంటి నుండి పారిపోతారు. ఎద్దులబండి ఏర్పాటు చేసుకొని మధురవైపు వెళుతుంటారు. కానీ, వీళ్ళనే రహస్యంగా గమనిస్తూ ఉన్న చింతామన్ తన అనుచరులతో మారువేషాల్లో అనుసరిస్తాడు. కొంతదూరం పోయాక అడవిలో వీళ్ళపై చింతామన్ అనుచరులు దాడి చేస్తారు. ఆ దాడిలో మోహానునికి బలమైన గాయం తగులుతుంది. మోహాన్‌ని కాపాడాలనే ఉద్దేశంతో నూర్‌బాయి తనవద్ద ఉన్న నగల సంచిని దొంగలకు ఇచ్చి వేసింది. దొంగలు పారిపోగానే నూర్‌బాయి మోహాన్‌ను పరీక్షించి, అతనికి ప్రాణాపాయం కలుగలేదని సంతోషిస్తుంది. కాని నూర్‌బాయి పరిస్థితి చూచి

మోహన్ దుఃఖపడ సాగాడు. నూర్‌బాయి మోహానునితో 'అల్పమైన నగలు పోతే పోయాయి, నీ ప్రాణాలు దక్కినందుకు నాకు చాల సంతోషంగా ఉంది. నీవు దుఃఖపడితే నేను చూడలేను' అంటూ ఓదార్చింది. తరువాత వారు మెల్లగా బృందావనం చేరుకొంటారు.

మోహానుని భార్య 'రోనీ' పరమ గయ్యాళి. ఆమె గయ్యాళి తనం భరించలేక చాల కాలం ముందే ఆమెతో గొడవ పడి, ఇంటి నుండి పారిపోయి ఢిల్లీ వచ్చి మహమ్మద్‌షా సైన్యంలో సైనికుడుగా మోహన్ చేరి పోయాడు. రోనీకి కూడ కొంతకాలానికి పశ్చాత్తాపం కలిగి బృందావనం చేరు కొంటుంది. బృందావన్‌లో మోహన్, రోనీలు కలుసుకొంటారు. మోహన్ ఆమెపై శ్రద్ధ చూపడు. నూర్‌బాయికి వారి వృత్తాంతం తెలిసి మోహన్‌కు నచ్చ చెప్పి రోనీ, మోహన్‌లను కలుపుతుంది. ఇలా నూర్‌బాయి విడిపోయిన దంపతులను ఒకటిగా కలిపేందుకు ప్రధాన పాత్ర వహిస్తుంది. 'శుభరాతి' కూడా బృందావన్ చేరాక తనను రక్షించిన 'నూర్‌బాయి, మోహాను'లకు ధన్యవాదాలు చెప్పి, తిరిగి తప్పిపోయిన తన సేనను కలుసుకొంటాడు.

నూర్‌బాయి బృందావనం వచ్చిన తరువాత తన పేరును 'సరూప' అని మార్చుకొంది. ఆమె కృష్ణ భక్తురాలై రసఖాన్, సూరదాస్, నందదాస్ మొదలైన కృష్ణ భక్త కవుల పాటలు పాడుకొంటూ ప్రశాంత జీవితాన్ని గడుపుతూ ఉంటుంది.

కొంతకాలం పోయాక మోహానుడు కొంతమంది పెద్దలను పిలుచుకొని వెళ్ళి 'చింతామన్'ని బెదిరించి, అతడు దొంగలించిన నగలను,

వజ్రాలను తెచ్చి నూర్ బాయికి ఇస్తాడు. కాని ఆమె వాటిని స్వీకరించదు. అప్పటికి వీటికి నూర్ బాయి అతీతురాలు. ఆమె మోహన్ తో పాటు యమునానది వైపుకు వెళ్ళి ఆ నగలు, వజ్రాలు అన్నీ యమునా నదిలో పారవేసి స్వచ్ఛమైన మనస్సుతో తిరిగి వస్తుంది. చివరకు 'మీరాబాయి' వలె కృష్ణ భక్తురాలై బృందావనం లోనే తన శేష జీవితం గడుపుతుంది.

**3.2.5.3. ప్రాసంగిక కథలు :** ఈ నవలలో నూర్ బాయి, మోహనుల కథ ఆధికారిక కథ. ఆ కథకు పోషకంగా తొమ్మిది ప్రాసంగిక కథలు కూడ ఉన్నాయి.

1. మోహన్ లాల్ భార్య అయిన కోనీకి సంబంధించింది మొదటిది.
2. మరాఠా సైనికుడైన 'శుభ రాతి' కి చెందింది రెండవది.
3. మీర్ బక్షీ, సాదత్ ఖాన్ లకు చెందింది మూడవది.
4. ఢిల్లీ మొగలాయి చక్రవర్తి అయిన మహమ్మద్ షాకు చెందింది నాల్గవది
5. పూనా బాజీరావు పీష్వా, మస్తాన్ లకు చెందింది ఐదవది.
6. దారి దోపిడీ చేసే చింతామన్ కు చెందింది ఆరవది.
7. నాదిర్ షాకు చెందింది ఏడవది.
8. సన్యాసి త్రిశూలానంద్ కు చెందింది ఎనిమిదవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పన చే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

### 3.2.6. అహిల్యాబాయి :

**3.2.6.1. చారిత్రక నేపథ్యం :** 'అహిల్యాబాయి' మహారాష్ట్ర చరిత్రకు సంబంధించిన నవల. 18వ శతాబ్దం నాటి చారిత్రక సంఘటనలు ఈ నవలకు ఆధారాలు. చరిత్రలో ప్రసిద్ధికెక్కిన 'సుబేదారు మల్హారావు హోల్కర్' పుత్రుడైన 'ఖాండేరావు హోల్కర్' భార్య 'అహిల్యాబాయి' చరిత్రే ఈ నవల.

'అహిల్యాబాయి' చరిత్ర ప్రసిద్ధి గాంచిన వీరవనిత. ఆమె జీవితానికి చెందిన సత్యమైన సంఘటనలు ఈ నవలకు పునాది. రచయిత నవలలో పేర్కొన్న ప్రదేశాలు నేటికీ ఉన్నాయి. చారిత్రకంగా వాస్తవిక సంఘటనలతో పాటు కాల్పనిక సంఘటనలు కొన్ని ఈ నవలలో రచయిత పొందుపరచారు.

'సింధూరి', 'ఆనంది', 'భోరిపత్' అనే పేర్లు చరిత్ర సమ్మతాలు కావు. అహిల్యాబాయి, తుకోజీరావు హోల్కర్, మల్హారావు, భారమల్ దాదా హోల్కర్ మొదలైనవి చరిత్ర ప్రసిద్ధి గాంచిన పాత్రలు.

"రాంపురా, మాన్‌పురా రాజపుత్రులపై అహిల్యాబాయి కోపించడం, మల్హారావు మద్యపాన మత్తుడై ఒక చెరువు వద్ద పడి ఉండడం, అహిల్యాబాయి యాత్రా స్థలాలలో మందిరాలను నిర్మించడం, నర్మదా నదీ తీరంలోని మాంధాత కొండపైనుండి దూకితే మోక్షం లభిస్తుందనే నమ్మకం, ఉజ్జయినిలో ఉన్న సిద్ధవటం (మర్రిచెట్టు) ను పూజించితే కోర్కెలు తీర్చడం మొదలైన విషయాలన్నీ చరిత్ర ప్రసిద్ధి గాంచినవి."[1]

---

బృందావన్ లాల్ వర్మా కా ఉపన్యాస్ సాహిత్య – డా॥ మోహినీ సహాయ్., పృ: 481

# अहिल्याबाई



डा. वृन्दावनलाल वर्मा

**3.2.6.2. కథావస్తువు :** అహిల్యాబాయి 'చౌండీ' గ్రామానికి చెందిన 'మానికోజీ సింధే' పుత్రిక. ఆమెకు 12 సంవత్సరాల వయస్సులో 'మల్హారావు హోల్కర్' పుత్రుడైన 'ఖాండేరావు హోల్కర్'తో వివాహం జరిగింది. ఆమె ఇండోర్ రాణి. ధార్మిక నిష్ఠ కలది. న్యాయంగా ప్రవర్తించేది. ప్రజలందరూ ఆమెను గౌరవించేవారు.

సుబేదారు తుకోజీరావు ఆమెకు దూరపు బంధువు. అతని కొడుకు మల్హారావు హోల్కర్. అతడు స్వేచ్ఛాజీవి. లోభి. చెడు సాంగత్యం చేసేవాడు. త్రాగుబోతు. కాముకుడు. మూర్ఖుడు. అహిల్యాబాయికి కొడుకులు లేనందువల్ల అతన్ని అభిమానిస్తూ ప్రేమతో చూస్తుండేది. ఆమె అతనిని తన వారసునిగా చేసుకోవాలని కోరుతూ ఉండేది. అంతే గాక అతన్ని సత్ప్రవర్తన కలవానిని గానూ, కర్తవ్య పరాయణుని గానూ మార్చాలని తాపత్రయ పడుతూ ఉండేది.

ఆమె దయకు పాత్రుడు కావాలనే ఉద్దేశంతో మల్హారావు మాంధాత పర్వతాన్నుండి దూకి ఆత్మహత్య చేసుకొంటానని అసత్య ప్రచారం చేయిస్తాడు. రాణి దాన్ని నమ్మి భారమల్ అనే వ్యక్తి ద్వారా అతన్ని ఆ ప్రయత్నం నుండి విరమింప చేస్తుంది. మల్హారావు అప్పుడప్పుడు మహేశ్వరం చేరి కపటోపాయంతో రాణి పాదాలకు నమస్కరిస్తూ ఆమె విశ్వాసాన్ని చూరగొంటూ ఉండేవాడు.

ఇదే సమయంలో 'జామ్ ఘాట్' అనే స్థలంలో 'గనపతరావు' అనే దొంగ యాత్రికుల నుండి పన్ను వసూలు చేస్తున్నాడని రాణికి సమాచారం అందుతుంది.

ఆ అత్యాచారాన్ని రూపుమాపేందుకు రాణి మల్హారును పంపుతుంది. మల్హారుకు స్వేచ్ఛగా ప్రవర్తించేందుకు అవకాశం లభించింది.

మల్హారు తన మిత్రుల సహాయంతో రహస్యంగా సిమరోల్ దుర్గంలో నివసిస్తూ, రహస్యంగా ఒక సేనను తయారు చేస్తూ ఉంటాడు. మల్హారుకు ఇక్కడ 'సూరందియా ఠాకూర భట్టూసింహా', 'ఆనంది' అనే స్త్రీతోనూ పరిచయం కలుగుతుంది. మల్హారు ఆంత్రీ నివాసి 'భూపత్-మోంధియా'ను, అతని చెల్లెలు 'సింధూరు'ను కూడ తన సేనలో చేర్చుకొంటాడు. సింధూరి చెవిటిది; మూగది కానీ అందమైంది. ఆమె అవివాహిత. భట్టూ సింహా, ఆనంది కూడ మల్హార్‌తో పాటు అదే కోటలో నివసిస్తూ ఉండేవారు.

మల్హార్ భట్టూసింహా, ఆనందిలతో కలసి లూటీ చేసేందుకు పూనుకొంటాడు. వారు 'సూల్' అనే గ్రామంలో పెండ్లి ఇంటిని లూటీ చేస్తారు. వారికి ఆ లూటీలో కొన్ని పాత్రలు, గుడ్డలు, కొద్దిగా నగలు మాత్రం లభిస్తాయి. ఆ గుడ్డల మూటలో మెరుస్తున్న ఒక జాకెట్టు కూడ ఉంటుంది. దానిని మల్హార్ ఆనందికి ఇస్తాడు.

మల్హార్ చేసే ఉపద్రవాలు, లూటీలు, అత్యాచారాల సమాచారం తుకోజీ, అహిల్యాబాయి ఇద్దరికీ స్పష్టంగా తెలుస్తుంది. కాని దీనిని రాణి నమ్మలేదు. ఈ పని మల్హార్ చేయడు. ఎవరో లూటీ చేసి ఆ నేరాన్ని అమాయకుడైన మల్హార్‌పై మోపి ఉంటారని తుకోజీరావుతో చెప్తుంది. అయినా ఈ విషయాన్ని గమనించమని తుకోజీని ఆదేశిస్తుంది.

మహేశ్వర పురంలో తనకు వ్యతిరేకంగా ప్రచారం జరుగుతున్నట్టు

మల్హార్ కు తెలుస్తుంది. ఇతనికి తండ్రి అంటే భయం లేదు కాని రాణి అంటే మాత్రం భయపడే వారు. ఒకవైపు దుబ్బుకారత, మరోవైపు భయం, ఇంకో వైపు మహాత్వాకాంక్ష ఈ మూడు సమస్యల మధ్య అతడు సతమత మౌతూ ఉంటారు.

అతడు సింధూరీ, భోపత్ లను మహేశ్వరపురం వెళ్ళి అంతఃపురంలో పని సంపాదించమని చెప్తాడు. అవకాశం దొరికినప్పుడు కొంత ధనాన్ని, నగలను సంపాదించి సిమరోల్ కు పంపమని, అక్కడ జరిగే సంగతులను తెలియజేస్తూ ఉండమని ఆదేశిస్తాడు. కాని రాణి అనవసరంగా అనేక మంది నౌకరులను ఉంచుకోదు కనుక వీరికి నౌకరీ దొరకదు. కానీ సింధూరీ మీద కొంచెం దయమాత్రం చూపుతుంది. భోపత్ మహేశ్వరంలో అల్లరి చిల్లరగా తిరుగుతూ, చిన్న చిన్న దొంగతనాలను చేస్తూ ఉంటాడు.

ఈ సమయంలోనే విధివశాత్తు రాణి అనేక సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. ఒకవైపు తన అల్లుడు 'యశ్వంతరావు ఫణసే' తరచుగా జబ్బుపడుతూ ఉండే వాడు. మరోవైపు మల్హారావు చేసే ఉపద్రవాలు, ఇంకోవైపు 'రామ్ పురా', 'మాన్ పురా' అనే ప్రాంతంలో చంద్రావత్ రాజపుత్రుల విద్రోహం ఆమెకు ఆవేదనను, ఆగ్రహాన్ని కలుగజేస్తూ ఉండేవి. ఆమె చంద్రావత్ రాజపుత్రుల విద్రోహాన్ని అణచివేసేందుకు గొప్ప సైన్యంతో బయలుదేరుతుంది. అంతకు మునుపే కొంత సైన్యాన్ని వాళ్ళని ఎదుర్కొనే నిమిత్తం పంపి ఉంటుంది. రాణికి ప్రయాణ సమయంలో కూడా దానం చేసే అలవాటుందని తెలిసి, వారితో బాటు ఒక భిక్షుక

సముదాయం కూడ బయలుదేరుతుంది. సింధూరీ, భోపత్‌లు కూడ భిక్షుక వేషంలో ఆమెతో బయలుదేరుతారు. 'ధమనార్' చేరే సరికి చంద్రావత్ రాజపుత్రులు ఒక చోట ఓడిపోయారనే సమాచారం తెలుస్తుంది. అందువల్ల ఆమె ఇంక ముందుకు పోక, తన చెలికత్తెలతో ధమనార్‌లో కొండలపై నున్న బుద్ధ విగ్రహాలను, బౌద్ధ విహారాలను చూచేందుకు వెళ్తుంది. ఆ సమయంలో సింధూరీ అసహాయ పరిస్థితికి జాలిపడి ఆమెకు ఆశ్రయ మిస్తుంది.

మార్గ మధ్యంలో ఆమె 'దూధార్ బేడి' లోని ఒక దేవతా మందిరాన్ని దర్శిస్తుంది. ఆ దేవికి మొక్కుకుంటే వారి వారి కోరికలు తప్పక నెరవేరుతాయని ప్రజల్లో విశ్వాసం ఉండేది. కాబట్టి రాణి, తన కూతురు, అల్లుడు ఆరోగ్యంతో ఉండాలని, చంద్రావతులపై పూర్తి విజయాన్ని సాధించాలని మొక్కుకొంటుంది. ఈ లోపల చంద్రావతులు పూర్తిగా ఓడిపోయినట్లు, 'రామపురా', 'మానపురా'లు పూర్తిగా తమ అధికారం లోకి వచ్చినట్లు ఆమెకు వార్త అందుతుంది. ఆమె సంతోషంతో మహేశ్వరం చేరుతుంది.

ఈ లోపల 'మల్హార్ రావు' ముఠా కోటీ పడావ్ అనే గ్రామంలో 'మనీరామ్' ఇల్లు లూటీ చేస్తారు. 'భీకాజీ' సలహాపై మల్హార్ 'గౌతమ్ పూర్' అనే గ్రామంలో లూటీ చేయాలని ప్రయత్నిస్తారు. కాని భట్టూసింహ అందుకు ఒప్పుకోడు. ఈ విషయమై మల్హార్‌కు భట్టూసింహాకు వాద వివాదం జరుగుతుంది. 'భట్టూసింహ', 'ఆనంది'

ఆ ముఠానుండి విడిపోతారు. కాని ఆనంది వివాహ విషయంలో తగాదా పడి భట్టూసింహ ఆమెను వదలిపెట్టి వెళ్ళిపోతారు. ఆనంది మల్హారును ప్రేమిస్తూ ఉండేది కాబట్టి అతడిచ్చిన రంగుల జాకెట్టును బంగారు దాచుకొన్నట్లు జాగ్రత్తగా దాచుకొని ఉంటుంది.

'గణపత రావు' 'జామ్ ఘాట్' వద్ద బండ్లల్లో వెళ్ళే వాళ్ళ వద్ద దారిపన్ను వసూలు చేస్తూ, రాణి వద్దకు వస్తూ ఉన్న ఒక బండిని ఆపి చూస్తారు. అందులో రాణికోసం కొద్దిగా బియ్యం, ఒక జత చీరలు, శివుని విగ్రహం మాత్రం ఉంటాయి. రాణి నిరాడంబర జీవితాన్ని చూచి ప్రభావితుడై, తాను సంపాదించిన లక్షరూపాయల మొత్తాన్ని రాణికి అర్పిస్తాడు. ఆ డబ్బుతో రాణి యాత్రికుల సౌకర్యార్థం ఒక భవనం కట్టిస్తుంది. గణపత రావును అక్కడే వుండి దైవోపాసన చేసుకోమని ఆదేశిస్తుంది.

ఒకసారి మల్హార్ 'భీకాజీ' అనే వానితో ఆలోచించి భిల్లుల ఉపద్రవాన్ని అణచేటందుకు రాణి అనుమతి తీసుకుంటారు. తన అనుచరులతో 'ఖరగోన్' అనే ప్రదేశానికి పోయి అక్కడ భిల్లుల యజమానిని కలుసుకొంటాడు. కొంత మంది భిల్లులు అతనికి సహాయం చేసేందుకు నిరాకరిస్తే, వారిలో చాల మందిని చంపివేసి వారి ఇండను కాల్చివేస్తాడు. అంతేకాక దేశంలోని ప్రజలను పీడిస్తాడు. అతని అత్యాచారాలు, అన్యాయాలు విని రాణి బాధ పడుతుంది. అయినా భవిష్యత్తులోనైనా బాగుపడతాడనే నమ్మకంతో ఊరటిల్లుతుంది.

మల్హార్ మహేశ్వరానికి వస్తాడు. మల్హార్ అంతఃపురంలో సింధూరిని చూచి సంతోషపడ్తాడు. ఆమె ఇప్పుడు కొంచెం కొంచెం మాట్లాడుతూ వుంది. ఈ లోపల మల్హార్ సొంత తల్లి రుక్మాబాయి మల్హార్ జేబులోంచి కొంత డబ్బు దొంగలిస్తుంది. తల్లీ కొడుకుల మధ్య వివాదం జరుగుతుంది. ఈ విషయాన్ని విని అహిల్యాబాయి బాధ పడుతుంది.

ఒకనాడు ఆనంది భిల్లస్త్రీ వేషం వేసుకొని ఇండోర్ బజారులో తాను దొంగలించిన గుడ్డలు ఒక సేఠ్‌కు అమ్ముతుంది. ఆ గుడ్డల్లో మల్హార్ ఆమెకిచ్చిన రంగు రంగుల జాకెట్టు కూడ ఉంటుంది. ఆమె ఆ రాత్రి ఆ సేఠ్ ఇంట్లోనే తలదాచుకొంటుంది. అందరూ నిద్రపోయిన తర్వాత తాను అమ్మిన గుడ్డలను తిరిగి సొంతం చేసుకొనేందుకు ప్రయత్నిస్తుంది. కాని సేఠ్ ఆమెను పట్టు కొంటాడు. రక్షకభటులు ఎంత పీడించినా ఆమె నిజం చెప్పదు. ఇంతలో మల్హార్ అక్కడికి వస్తాడు. ఆ రంగుల రవికె మాదేనని చెప్పి తీసుకొని పోతాడు. ఆనందిని గుర్తించి కూడ గుర్తుపట్టనట్టు నటించి వెళ్ళిపోతాడు. ఈ అపరాధిని విచారణ జరిపేందుకు రాణివద్దకు పంపిస్తారు. కాని రాణి ఆమెను క్షమించి వదలివేస్తుంది.

రాణి సింధూరి మొదలైన వాళ్ళతో కలసి మాంధాత, ఓంకారనాథ్ మొదలైన అనేక తీర్థాలకు యాత్రపోతుంది. అక్కడ చని పోయే స్థితిలో ఉన్న గణపతరావు చివరిసారిగా రాణిని దర్శించి

ప్రాణాలు వదులుతాడు.

రాణి తీర్థయాత్రలు ముగించుకొని మహేశ్వరం చేరేటప్పటికి ఆమె అల్లుడు మరణించాడని, కుమార్తె ముక్తాబాయి సహగమనం చేసిందనే వార్త తెలుస్తుంది. ఆమె నిరాశా నిస్పృహలతో కుమిలి పోతుంది. ఆమెకు సర్వత్ర అంధకారమే గోచరిస్తుంది. కాని ధైర్యం తెచ్చుకొని తన కర్తవ్యాన్ని పాలించడానికి సన్నద్ధమౌతుంది.

రాణి తుకోజీ మాటలు విని మల్హార్‌ను మహేశ్వరం పిలిపిస్తుంది. అతడు రాణి చెప్పినట్లు నడుచుకొంటానని మాట ఇస్తాడు. కానీ, ఇచ్చిన మాటను నిలుపుకోలేక తిరిగి చెడుకార్యాలు చేయ ప్రారంభిస్తాడు. మహలులో ఉన్న సింధూరి పట్ల అసభ్యంగా ప్రవర్తిస్తాడు. సింధూరి రాణికి మల్హార్ తనకిచ్చిన కొన్ని కాగితాలను, భోరిపత్‌తో కలసి అతడు చేసిన అత్యాచారాలను తెలియజేస్తుంది. ఆ నాటి రాత్రి మల్హార్ 'నీమాంద్' వెళ్ళి తిరిగి అత్యాచారం చేస్తాడు. అతని చెడు కార్యాలపై కోపించిన రాణి అతన్ని బంధించమని 'డుగల్ నేక్ ఫ్రాంసిస్' ని నియమిస్తుంది. అతన్ని బంధించడంలో ఆనంది సహాయ పడుతుంది. మల్హార్ తనను రక్షించుకొనే ప్రయత్నంలో ఆనందిని పిస్తోలుతో కాల్చి చంపుతాడు. మల్హార్‌ను బందిఖానాలో ఉంచడం జరుగుతుంది. అతడు ఆనందిని చంపినందుకు చాల పశ్చాత్తాప పడతాడు. మల్హార్ బంధించబడిన తరువాత రాజ్యంలో శాంతి నెలకొంటుంది. తుకోజీ తన పుత్రుని దురవస్థ గాంచి, తన కొడుకుని జైలునుండి విముక్తుణ్ణి చేయక పోతే

తాను ఆత్మహత్య చేసుకొంటానని రాణికి చెప్తాడు. రాణి దయ తలచి మల్హార్‌ను విడుదల చేస్తుంది.

అహిల్యాబాయి భాద్రపదమాసం, కృష్ణ పక్షం, చతుర్దసి తిథి నాడు స్వర్గస్థురాలౌతుంది.

**3.2.6.3. ప్రాసంగిక కథలు:** అహిల్యాబాయి జీవిత చరిత్రకు సంబంధించినది ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా మూడు ప్రాసంగిక కథలున్నవి.

1. భట్టూసింహా, ఆనందిల కథ మొదటిది.

2. సింధూరాలీ, భోపత్‌లకు సంబంధించినది రెండవది.

3. రుక్మాబాయి, తుకోజీలకు సంబంధించినది మూడవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

## 3.2.7. కచనార్:

**3.2.7.1. చారిత్రక నేపథ్యం:** "'కచనార్' నవల ధామానీ, సాగర్ రాష్ట్రాలకు చెందిన చారిత్రక నవల. ఈ నవల మొగలాయిల పతనం తర్వాత, బ్రిటీష్ పాలనకు ముందుగల మధ్యకాలం అంటే సంధి యుగానికి చెందింది. సంఘటనలు 'టిప్పుసుల్తాన్' కాలం నాటివి. అంటే సుమారు క్రీ.శ. 1790 నాటివి"

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పు. 470

" వర్మగారి చారిత్రక నవలల్లో 'కచనార్'కు విశిష్ట స్థానముంది. ఆయన చరిత్ర, కల్పనలను మేళవించి ఈ నవల రాశారు. ఇందులో వర్ణించిన సంఘటనలన్నీ సత్యాలే. కాని ఆ సంఘటనలు ఒకే ప్రాంతం, ఒకే కాలానికి చెందినవి కాకుండా విభిన్న ప్రాంతాలకు, విభిన్న కాలాలకు సంబంధించింది."[1]

వర్మగారు లక్ష్మీబాయి నవల తర్వాత 'కచనార్' నవల ప్రారంభించే దానికి ముందు 1935 మరియు 1936 లో అమరకంటక్ పర్వత ప్రాంతాలు పర్యటించారు. ఆ సంఘటనలను గురించి ఆయన ఇలా రాసుకొన్నారు. " అమరకంటక్ పర్వత ప్రాంతాలలో, ఒక చిన్న అందమైన కుటీరంలో సుందరమైన మూర్తిని చూశాను. ఆ మూర్తిని చూడగా నా మనస్సులో కచనార్ మెదలింది. కచనార్ కథకు ఒక రూపం తయారు చేసుకున్నాను."[2] విన్న జనశ్రుతిలో దలీప సింహునకు మొదట స్మృతిపోయి మరలా స్మృతి వస్తుంది. ఈ విషయాన్ని నిర్ధారణ చేసుకోవడానికి వైద్య మిత్రులను కలిశాను. ఒక డాక్టర్ " ఇలా స్మృతిపోయి మరలా వచ్చే అవకాశాలున్నాయా? లేవా? అనేది ఒక సమస్యగా మా డాక్టర్ల ముందు ఉంది. పరీక్షించి, యోచించవలసిన ప్రశ్న గతస్మృతి రావడం. కానీ ఒక ఫాంటసీగా నీవు కథలో రాసుకో. డాక్టర్లు కథలు చదవరు. చదివే పాఠకులకు ఉత్సాహం ఉంటుంది."[3] అని చెప్పారు. "నేను నవలలో

1. 'హిందీ ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ - ప్రయోగ్' - డా॥ గోవిందజీ., పు: 203.
2. కచనార్ 'పరిచయ్' - బృందావన్‌లాల్ వర్మ., పు: 1.
3. పైదే., పు: 5.

ఈ గతస్మృతిని వర్ణించాను. వైజ్ఞానిక మతంలో ఇది విపరీతం అనుకొంటే ఆ దోషం నాదే కాని డాక్టర్లది కాదు." [1]

"నేను ఈ నవల రాసేటప్పుడు గతస్మృతికి సంబంధించిన 'భవాల్ సన్యాసి కేసు' ఒకటి హైకోర్టుకు వచ్చింది. ఆ కేసు సంక్షిప్త వివరణ ఒక పుస్తకంలో రాశారు. ఆ పుస్తకంలోని విషయాలు 'కచనార్'లో 'దలీప సింహుని' విషయంలో వాడుకొన్నాను." [2] వర్మగారు ఈ రకంగా స్మృతి పోవడం, మరలా గతస్మృతి రావడం అనే విషయానికి వైద్యుల సలహాలు, భవాల్ సన్యాసి కేసు సంఘటనలు ఆధారాలుగా పేర్కొన్నారు.

వర్మగారే కాకుండా "బంగ్లా రాష్ట్రానికి చెందిన ప్రసిద్ధ చారిత్రక నవలాకారుడైన 'రాఖాల్ దాస్ బెనర్జీ' తన ప్రసిద్ధ చారిత్రక నవలయైన 'శశాంక'లో ఇటువంటి ఘటనే వర్ణించాడు. 'మేఘనద్' అనే యుద్ధంలో నాయకుడైన శశాంకునికి బలమైన గాయం తగలడం చేత స్మృతి కోల్పోయి, బాలుని వలె ప్రవర్తిస్తాడు. అతన్ని కాపాడిన బెస్తకన్య 'భవను ప్రేమిస్తాడు. మరలా కొన్ని దినాల తర్వాత వేరొక యుద్ధంలో గాయపడి మరలా స్మృతిని పొందుతాడు." [3]

ఈ కారణంగా స్మృతి పోవడం, రావడం అనే జనశ్రుతి నమ్మవచ్చని ఉద్దేశించి, రచయిత 'కచనార్' నవలలో గతస్మృతిని కథాంశంలో గ్రహించారు.

1. కచనార్ 'పరిచయ్' — బృందావన్ లాల్ వర్మ., పు: 5
2. పైదే., పు: 1
3. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసో మే ఇతిహాస్ ప్రయోగ్' — డా॥ గోవిందజీ., పు: 204.

"కచనార్ నవలలో 'దరూ' సోదరుని హత్యా చరిత్ర ప్రసిద్ధమైనది. కానీ, అది ధామానీకి చెందింది కాక 'ఓరఛా' నగరానికి చెందింది."[1]

"ఈ కథలోని 'దరూ' కర్నల్ పదవిని పొందడం, పిండారులు సాగర్ నగరాన్ని దోచుకోవడం మొదలైనవి చారిత్రక సత్యాలే. గోసాయిల పరాక్రమం, పిండారీల లూటీ చరిత్రప్రసిద్ధి కెక్కిన సంఘటనలు."[2]

**3.2.7.2. కథావస్తువు :** ధామానీ రాజ్యానికి 'రావ్ దలీప్ సింహ్' రాజు. అతడికి వివాహం కుదిరింది. కానీ, ఆ సమయానికి అస్వస్థుగా ఉన్నందువల్ల వివాహానికి బయలుదేరి వెళ్ళలేక పోతాడు. వరుడు లేకున్నా ఆనాటి సంప్రదాయాన్ననుసరించి పెద్దలు అతని కత్తిని అగ్ని చుట్టూ ప్రదక్షిణం చేయించి వివాహం జరిపిస్తారు. వధువు పేరు కళావతి.

దలీప సింహునకు మానసింహుడనే దూరపు బంధువు ఒకరున్నారు. వరుసకు సోదరుడు. మానసింహుడు దలీపసింహుని వివాహం అయిన తరువాత తన వదిన అయిన కళావతి మార్గ మధ్యంలోనే పరిచయం పెంచుకొంటాడు. ఆమె సౌందర్యాన్ని చూచి ముగ్ధుడౌతాడు. ఆమెను ఆకర్షించాలని ప్రయత్నిస్తాడు. నూతన వధువైన కళావతి కూడ విచిత్రంగా అతని ఆకర్షణకు

1. కచనార్ 'పరిచయ్' — బృందావన్‌లాల్ వర్మ, పు: 5.
2. పైదే., పు: 5.

లాంగ పోతుంది.

ధామహానీ వచ్చిన తరువాత వారి పరిచయం అధిక మవుతుంది. మానసింహుడు అవకాశం చిక్కినప్పుడు వదిన పరిహాసాలాడే వాడు. దలీపసింహుడును వారిని ఏమీ అనక మౌనం వహించేవాడు. ఆ రకంగా మానసింహ, కళావతుల సాన్నిహిత్యానికి అవకాశం ఏర్పడుతుంది. ఫలితంగా దలీపసింహ, కళావతుల మధ్య ఎడబాటు అధికమవుతుంది.

కళావతితో దాసీగా వచ్చిన కచనార్ సౌందర్యం దలీపసింహుని ఆకర్షిస్తుంది. కచనార్ కూడ దలీపసింహుని వైపు ఆకర్షితురాలౌతుంది. దలీపసింహుడు ఆమెను కాంక్షించగా వివాహం చేసుకోమని కోరుతుంది కానీ, ఉంపుడుగత్తెగా ఉండేందుకు ఏ మాత్రం ఇష్టపడదు.

ఈ పరిస్థితుల్లో ధామానీ మీద సాగరు సేనలు దండయాత్ర చేస్తాయి. దలీప్ సింహుడు శత్రువుల్ని ఓడించి విజయ గర్వంతో తిరిగి వస్తుండగా గుర్రం నుండి క్రిందపడి మూర్ఛపోతాడు. ఉపచర్యలు చేసినప్పటికి అతడు మూర్ఛనుండి తేరుకోలేక పోతాడు. మానసింహుడు కళావతిపైన వ్యామోహంతో దలీపసింహునికి సరియైన వైద్యం చేయించడు.

కొన్నాళ్ళకు దలీపసింహుడు చనిపోయాడని జనాన్ని నమ్మించి, అతన్ని దహనం చేసేందుకు శ్మశానానికి తీసుకొని

వెళ్ళేటప్పుడు మార్గ మధ్యంలో కుంభవృష్టి కురుస్తుంది. ఆ వర్షంలో శవాన్ని వదలి అందరూ దూరంగా చెట్టుకిందకు పరుగెత్తారు. ఆ సమయంలో సాధు సమాజం ఒకటి ఆ దారిన వెళ్తూ అక్కడికి వస్తుంది. ఆ సమాజానికి గురువు మహంత్ అచలపురి. అతడు దలీప సింహుని గుర్తించాడు. అతడు శవంలోని కదలికను గమనించి అతన్ని తన ఆశ్రమానికి చేరుస్తాడు.

మానసింహుడు, అతని అనుచరులు వాన వెలసిన తర్వాత తాము వదలిపెట్టిన చోట శవం లేదని గుర్తించి, బహుశ శవం నీటి వేగానికి కొట్టుకొని పోయి ఉండవచ్చు లేదా ఏదైనా అడవి మృగం ఈడ్చుకొని వెళ్ళి ఉండవచ్చునని ఊహించి వెళ్ళిపోతారు.

మహంత్ అచలపురి ఆశ్రమంలోని పరిచర్యల వల్ల దలీప సింహునికి క్రమక్రమంగా స్వస్థత చేకూరుతుంది. కాని అతనికి గతం గుర్తుకురాదు. పూర్తిగా మతి భ్రమించినందు వల్ల చిన్న పిల్లవాడి వలె అతడు ప్రవర్తిస్తూ ఉంటాడు.

దలీపసింహుడు లేనందువల్ల మానసింహుడు ధామానీ సింహాసనాన్ని అధిరోహిస్తాడు. కళావతిని వివాహం చేసుకొంటాడు. కానీ, దుర్మార్గుడైన మానసింహుని కామ పిపాస దీనితో శాంతించ లేదు. కచనార్‌ను కూడా చెరపట్టాలని ప్రయత్నిస్తూ ఉండేవాడు.

కచనార్ తన శీలాన్ని కాపాడుకొనేటందుకు ధామానీ నుండి పారిపోయి అచల్‌పురీ ఆశ్రమంలో చేరుతుంది. అక్కడ

దళీప సింహుడు సమంతపురీ అనే పేరుతో పిలువబడుతూ ఉండే వారు. కచనార్ అతన్ని చూస్తూనే దళీప సింహుని పోలికలు కనబడడం చేత సందిగ్ధంలో కొట్టు మిట్టాడుతూ ఉంటుంది. దళీప సింహుడు పూర్వస్మృతులను మరచినందువల కచనార్‌ను గుర్తించలేక పోతాడు. కచనార్‌ను ఆ ఆశ్రమంలో 'కంచన పురీ' అనే పేరుతో పిలిచేవారు.

గోసాయి అచల్ పురికి తాను రక్షించిన వ్యక్తి దళీపసింహుడని అతని రాజ్యం అతనికి తిరిగి ఇప్పించాలని కోరిక ఉండేది. కొంత కాలానికి గోసాయిలు మూకుమ్మడిగ ధామానీ మీద దండయాత్ర జరుపుతారు. ఈ యుద్ధంలో దళీపసింహుడు కూడ పోరాడుతాడు. ఒకచోట గోడపై నుండి దుమికేటప్పుడు క్రిందపడి తలపై పెద్ద దెబ్బ తగలడంతో తిరిగి పూర్వ స్మృతిని పొందుతాడు.

కచనార్‌కు సమంతపురే దళీప సింహుడని తెలిసినంతనే ఆమె సంతోషానికి మేరలేక పోతుంది. దళీప సింహుడు కూడ కచనార్‌ను గుర్తు పట్టాడు. యుద్ధంలో ఓడిపోయిన మానసింహుడు బందీ కాగా దళీపసింహుడు తిరిగి ధామానీ సింహాసనాన్ని అధిష్ఠిస్తాడు. అతడు కచనార్‌ను వివాహం చేసుకొని, మానసింహుని, కళావతిని క్షమించి వదిలివేస్తాడు. ఈ విధంగా కథ సుఖాంతం అవుతుంది.

**3.2.7.3. ప్రాసంగిక కథలు :** 'కచనార్'లో ఆధికారిక కథ కచనార్, దళీప సింహులకు చెందింది. ఈ అధికారిక కథకు పోషకంగా నాలుగు

ప్రాసంగిక కథలున్నవి.

1. కళావతి మానసింహుల ప్రేమ వివాహానికి చెందింది మొదటిది.

2. 'దరూ' అనే అతడు 'సోనే సాహు'ను చంపడం, దలీప సింహుని కోపానికి గురై పారిపోవడం మొదలైన విషయాలకు చెందింది రెండవది.

3. సాంగర్ రాజ్యంపై పిండారీలు ం, సాంగరు రాజ్యాన్ని జయించి లూటీ చేయడం మూడవది.

4. 'దరూ' అనే అతడు పిండారీలతో కలసి ధామానీ మీద దండెత్తి పరాజయం పొందడం మొదలైన విషయాలకు చెందింది నాల్గవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

**3.2.8. ముసాహిబజూ:**

**3.2.8.1. చారిత్రక నేపథ్యం:** "ఈ నవల 19వ శతాబ్ద ప్రారంభం లోనిది. దతియా రాజ్యం లోని కేరువా జాగీర్దారు 'ముసాహిబజూ దలీప్ సింహు'నకు సంబంధించినది."[1]

"ఈ నవల కథాకాలం నాటికి సామంత రాజుల వ్యవస్థ నశించడం ప్రారంభించింది. ఆంగ్లేయుల ప్రభావం ఎక్కువయింది. చిన్న చిన్న రాజులు, నవాబులు తమ అస్తిత్వాన్ని రక్షించుకోవడానికి ప్రయత్నిస్తూ ఉండేవారు. నాల్గు ప్రక్కల అరాచకత్వం వ్యాపించి ఉండేది.

---

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పృ: 466.

రాజపుత్రులు, మరాఠీలు, ముసల్మానులు తను అధికారాలను కోల్పోయే స్థితిలో ఉన్నారు."[1]

"నవలలోని అన్ని సంఘటనలు జనశ్రుతులపై ఆధార పడినప్పటికి అవన్నీ నిజాలే. నవలలోని 'ముసాహిబజూ దలీప్ సింహ్', 'రామ్ సింహ్ ధంధేరా' పాత్రలు చరిత్ర ప్రసిద్ధాలు. తక్కినవి కల్పిత పాత్రలు. నవలలో వర్ణించిన అన్ని ముఖ్య సంఘటనలు వాస్తవాలు; చారిత్రక సత్యాలు."[2]

"కాత్యాలు నవలలో ఏ ప్రకారం ముసాహిబజూనుండి తుపాకీ తీసుకొన్నాడో ఆ సంఘటన అదే విధంగా చరిత్రలో ఉంది. ఈ విషయాన్ని గురించి దతియాలోని బంకాజూ కాత్యాలు, సిపాయిల నౌకరు అయిన చోటీనాయి స్వయంగా వర్మగారికి చెప్పినట్లు ఆయనే రాసుకున్నారు. అప్పుడు చోటీనాయి వయస్సు ౮౦ సంవత్సరాలు."[3]

వర్మగారు ఈ నవలను చారిత్రక వాతావరణానికి చెందిన కొన్ని సత్యమైన సంఘటనలను ఆధారంగా చేసుకొని రచించారు. ఈ నవల కథావస్తువు క్లిష్టత లేనిది. అయినప్పటికి వర్మగారు తన రచనా నైపుణ్యంతో దీనిని ఆకర్షణీయంగా మలిచారు.

**3.2.8.2. కథావస్తువు:** దతియా రాజైన విజయ బహదూర్ సింహ్ దగ్గర పనిచేస్తున్న కేరువానగర ముసాహిబజూ (జాగీర్దారు) చాల

1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ మృగనయనీ – డా॥ శాంతి స్వరూప గుప్త., పు:78.
2. ముసాహిబజు (నవల) – బృందావన్‌లాల్ వర్మ., పు: 1.
3. పైదే., పు: 1.

ఉత్తముడు. రాజు గారికి అతణ్ణి చూస్తే ఎంతో ఇష్టం. అతని పేరు దళపసింహుడు. కానీ అందరూ అతణ్ణి అతని హోదా అయిన 'ముసాహిబజూ' అనే పిలిచే వారు. అతడు మంచివాడే కాక, ఎంతో ధైర్య సాహసాలు కల గొప్ప వీరుడు. అతని దగ్గర 1200 మంది సైనికులున్నారు. రాజుగారి దగ్గరనుండి 1200 మంది సైనికులను ఉంచుకొనే అధికారం ఆ నాడు ముసాహిబజూకు ఉండేది. అతని సైనికులందరూ నిమ్న జాతికి చెందిన వాళ్ళు. పేద వారు అయినా స్వామి భక్తి పరాయణులు. ముసాహిబజు అన్నా, అతని భార్య 'చరఖారీవాలీ' అన్నా ఆ సైనికులకు ఎంతో ఇష్టం. ముసాహిబజూకు కూడా తనను ఆశ్రయించుకొన్న అనుచరులంటే ఎంతో అభిమానం చూపే వారు. వారిని తన కన్న బిడ్డలవలె చూచుకొనే వాడు. వారికి రాజు ద్వారా సంక్రమించే జీతం తక్కువ. అందువల్ల అప్పుడప్పుడు వారికి అవసరమైతే తమ సొంత డబ్బులు ఇచ్చేవాడు. తన అనుచరులు భోజనం లేకుండా ఉన్నారంటే విలవిలలాడి పోయే వాడు. వారిని తన ఇంటికి భోజనానికి పిలిచేవాడు. వారు తృప్తిగా తిని లేచే వరకు తను భోజనం చేసే వాడు కాదు.

ముసాహిబజూ భార్య 'చరఖారీ వాలీ' కూడ అతనికి తగ్గ ఆదర్శ గృహిణి. నిరంతరం తన ఇంటికి ఎంతో మంది అనుచరులు భోజనానికి వస్తున్నా విసుక్కోకుండా, అందరికీ చక్కని రుచిగల వంటలు వండిపెట్టేది. అందువల్ల ముసాహిబజూ అనుచరులు ఆ దంపతులను తమ స్వంత తల్లిదండ్రుల కంటే ఎక్కువగా భావించే వారు.

ఇలా ఉండగా ఒకరోజు ముసాహిబజూ అతని అనుచరులు కొందరు వేటకు వెళ్తారు. ఆ వేటలో ఒక అడవిపంది విజృంభించి ముసాహిబజూను గాయపరుస్తుంది. ఇంతలో 'పూరన్' అనే అనుచరుడు వచ్చి అడవి పందిని చంపి ముసాహిబజూను రక్షిస్తాడు. ముసాహిబజూ అతనికి బహుమతి ఇవ్వడమే గాక అతన్ని తన ప్రియతమునిగా స్వీకరిస్తాడు. ఆ సమయంలో వేటనుండి తిరిగి వచ్చిన వారికి భోజన సౌకర్యం ఏర్పాటు చేయడానికి 'చరఖారీ' దగ్గర డబ్బులేదు. అందుకే ఆమె తన నగలను కుదువబెట్టి, ఆ డబ్బుతో వారందరికీ భోజనాలు ఏర్పాటు చేసింది. కేవలం రెండు మూడు వెండి నగలు తప్ప బంగారు నగలన్నింటిని ఆమె కుదువ బెట్టింది.

ఈ సమయంలో దతియా రాణివాసంలో జరిగే ఉత్సవానికి ఆమెకు ఆహ్వానం అందింది. ఆ ఉత్సవానికి నగలు ధరించకుండా వెళ్ళడానికి ఆమెకు అభిమానం అడ్డొచ్చింది. ఆమె ఆ ఉత్సవాలకు వెళ్ళకూడదని మనస్సులో అనుకొన్నా, వెళ్ళనందుకు ఆమె ఎక్కువగా దుఃఖిస్తూ ఉండింది ఆమె దుఃఖాన్ని చూచిన 'పూరన్' తాత అయిన 'రామూ' అనే సైనికుడు ఎలాగైనా ఆమె దుఃఖం పోగొట్టాలని తలుస్తాడు. కొంత మంది అనుచరులను కలుపుకొని లూటీ చేసియైనా నగలు తెచ్చియిచ్చి ఆమెను సంతోష పెట్టాలనుకొంటాడు. రాము, పూరన్, లల్లీ ఇంకా కొంతమంది కలిసి దోపిడీ దొంగల వేషం వేసుకొని అడవి మార్గంలో పెండ్లికి వెళుతున్న షావుకార్ల కుటుంబస్త్రీల నగలను దోచుకొంటారు. బంగారు నగలను

తమ రాణికి చరఖారీకి తెచ్చి ఇస్తారు. నిజం చెప్తే ఆమె ఒప్పుకోదని తలచి 'చిరులా' దగ్గర శిథిలాలు తవ్వుతుంటే ఈ నగలు దొరికాయని రాణికి అబద్ధం చెప్తారు. అది నిజమని నమ్మి 'చరఖారీ' ఆ నగలను ధరించి రాణీ వాసంలో జరిగే ఉత్సవానికి వెళుతుంది. అదే ఉత్సవానికి ఒక షావుకారి భార్యకూడ వస్తుంది. 'చరఖారీ' ధరించిన నగల్లో కొన్ని తన నగలు కూడ ఉన్నాయని గుర్తుపడ్తుంది. అంతేగాక దొంగిలించిన కొన్ని వెండి ఆభరణాలను 'లల్లీ' అనేవాడు తన ప్రియురాలు 'సుభద్ర'కు ఇస్తాడు. లూటీలో నగలు పోగొట్టుకొన్న వారిలో 'సుభద్ర' కూడ ఉంది. తన నగలే ఇవి అని ఆమె కూడా గుర్తుపడుతుంది. ఈ వార్త అందరికీ తెలిసిపోతుంది. తన సేవకులు ఇంతపని చేశారంటే మొదట్లో ముసాహిబజూ నమ్మలేక పోతాడు. తర్వాత నిదానంగా యోచించి, జరిగిన దానిని అర్థం చేసికొంటాడు. స్వామి భక్తి పరాయణులైన తన అనుచరులు తన కోసం, తన భార్య గౌరవ మర్యాదల కోసం ఈ దొంగతనం చేశారు. కానీ నిజానికి వారు దోపిడీ దొంగలు కారు అనే విషయం అర్థమౌతుంది. వారి మూఢ భక్తికి చలించిపోతాడు. వాళ్ళను తన ప్రాణాలొడ్డి అయినా కాపాడాలను కొంటాడు.

దోపిడీకి గురైన షావుకార్లు దతియా రాజుకు పిర్యాదు చేస్తారు. రాజు విచారణకు ముసాహిబజూను పిలిపిస్తాడు. విచారణా అనంతరం దొంగలను తనకు అప్పగించమని ముసాహిబజూకు చెబుతాడు. కాని ముసాహిబజూ తన అనుచరులు దొంగలు కాదని వాదిస్తాడు. కాని

రాజు వినడు. ఆ దొంగలను ఒక గంటలో తన ముందు హాజరు పరచమని ముసాహిబజూను ఆజ్ఞాపిస్తాడు. ముసాహిబజూ మౌనంగా బయటకు వచ్చేస్తాడు. ఒక గంట కాదు కదా రెండు గంటలైనా ముసాహిబజూ తన అనుచరులను రాజు ఎదుట హాజరు పరచ లేదు. చివరికి రాజు కొత్వాలు రామ్ సింహ్‌ను పిలిచి ఇలా చెప్తాడు. "ముసాహిబజూ తన అనుచరులను అప్పచెప్పక పోతే అతణ్ని బంధించి ఖైదులో పెట్టు; లేకుంటే ఈ దేశాన్నే వదలిపెట్టి పొమ్మను" అని ఆదేశాలు జారీ చేస్తాడు.

ఈ రాజాజ్ఞను విన్న ముసాహిబజూ చింత పడ లేదు. అతడు గొప్ప యోధుడు. ఆ కారణంగా రాజును ఎదిరించ డానికి సన్నాహాలు చేస్తుంటాడు. కాని కొత్వాలు జరగబోయే భయంకర పరిస్థితిని ఊహించి, దాన్ని తప్పించేందుకు నైపుణ్యంగా ముసాహిబజూతో అతని మంచి తనాన్ని పొగడుతూ, దతియా రాజు సేనలతో యుద్ధం చేసి స్వామిద్రోహం చేయడం మంచిది కాదని విన్నవించుకొని, భరత్ గఢ్ వదలి కేరువా వెళ్ళి పొమ్మని సలహా ఇస్తాడు. అతని జ్ఞాపక చిహ్నంగా అతని దగ్గర నున్న రెండుకన్నుల తుపాకీని అడిగి తీసుకొంటాడు. దృఢ నిశ్చయుడైన ముసాహిబజూ తనభార్య, అనుచరులతో కేరువా నగరానికి బయలు దేరుతాడు. కొత్వాలు రాజు దగ్గరికి వెళ్ళి ముసాహిబజూను పొగడుతూ, అతను మీ ఆజ్ఞను పాటించి ఈ దేశాన్నుండి వెడలి పోతున్నాడని అతని తుపాకీని చూపుతాడు. ముసాహిబజూ అంటే రాజుకి కూడ ఎంతో ఇష్టం. కానీ దొంగతనం జరిగిందని ఫిర్యాదు

వచ్చింది కాబట్టి ఆ దొంగను శిక్షించమని ఎంతో చెప్పి చూస్తారు. కాని ముసాహిబజూ మొండి పట్టుదలతో దేశం వదలి వెళ్ళేందుకు నిశ్చయించుకున్నాడని తెలిసి, అంతటి అభిమానధనుణ్ని పోగొట్టు కొంటున్నామని చింతిస్తారు. ముసాహిబజూ ధర్మ పరాయణుడని తెలిసినప్పటికి ఏమీ చెయలేక పోతారు. కేరువా నగరానికి దతియా రాజభవనం ద్వారం నుండే వెళ్ళాలి. ముసాహిబజూ ఆ దారివెంట వెళ్తూ కోటభవనం పైన కూర్చున్న రాజును చూచి, గుర్రం దిగి నమస్కరించి ముందుకు వెళ్ళిపోతాడు. ఈ దృశ్యాన్ని చూచి రాజుకు కండ్లు చెమ్మగిల్లాయి. గొంతు బొంగురు పోయింది. కొత్వాలైన రామసింహ పిలచి ముసాహిబజూను తిరిగి రాజ్యంలోకి రమ్మని కబురు చేస్తాడు.

ముసాహిబజూకు దేశ బహిష్కరణ శిక్ష విధించారని షావుకార్లకు తెలుస్తుంది. 'ముసాహిబజూ' అంటే వారికి ద్వేషం లేదు. అంతేగాక ముసాహిబజూ అంటే రాజుకు చాల ఇష్టం అని కూడ తెలుసు. తాము చేసినందు వల్ల రాజు ఈ నిర్ణయం తీసుకొన్నాడని, తమ ఫిర్యాదును ఉపసంహరించు కోవాలను కొంటారు. ముసాహిబజూ దేశ బహిష్కరణకు తామే కారణం కాబట్టి ఇక మీదట ముసాహిబజూ తమను పీడిస్తాడేమోననే భయం పట్టుకొంటుంది. ముసాహిబజూ దగ్గరికి వెళ్ళి తాము ఫిర్యాదు ఉపసంహరించుకొంటామని, దేశం వదలి వెళ్ళవద్దని ప్రార్థిస్తారు. రామ్ సింహ కూడ ముసాహిబజూ మనస్సులో దేశభక్తిని, ప్రభుభక్తిని చిగురింపచేసి అతణ్ని ముందుకు

వెళ్ళనీయకుండా చేస్తాడు. ముసాహిబజూ భరత్‌గఢ్‌కు తిరిగి రాక, కోట వెలుపల ఒక తోటలో తన బసను ఏర్పాటు చేసుకొంటాడు. అతడు దతియాపైన దండయాత్ర చేసే శత్రువులను ఓడించి, బతికి ఉంటే కేరువా చేరుతాను కాని వదలిపెట్టినటువంటి భరత్‌గఢ్‌లో అడుగు పెట్టనని శపథం చేస్తాడు. కానీ, చివరికి రాజే ముసాహిబజూ దగ్గరికి వచ్చి, అభిమానంతో ' నీవు యథావిధిగా నీ కార్యక్రమాలను ఆచరించు. సిపాయీల రక్షణాభారం స్వీకరించు. కరువు కాటకాలు రాకుండా చూసుకో. ఎందుకంటె ఏ రాజు రాజ్యంలో ప్రజలు దుఃఖపడుతారో, ఆ రాజు తప్పక నరకానికి పోతాడు అని చెప్పి ముసాహిబజూను బలవంతంగా రాజ్యానికి తీసుకొని పోవడంతో కథ ముగుస్తుంది.

3.2.8.3. **ప్రాసంగిక కథలు:** ముసాహిబజూ, అతని భార్య 'చరఖారీ', వారి అనుచరులకు సంబంధించినది ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా ఒకే ఒక ప్రాసంగిక కథ ఉంది.

1. ముసాహిబజూ సిపాయిలైన 'లః ప్రు( , సుభద్రులకు సంబంధించిన ఈ ప్రాసంగిక కథ సమ్మేళనంతో ముఖ్యకథ వికాసాన్ని పొందింది.

ఈ ప్రాసంగిక కథ సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

### 3.2.9. ఝాన్సీకీ రాణి – లక్ష్మీబాయి :

**3.2.9.1. చారిత్రక నేపథ్యం :** 'ఝాన్సీకీ రాణి - లక్ష్మీబాయి' వర్మగారి మొట్టమొదటి వాస్తవిక చారిత్రక నవలగా ప్రసిద్ధి చెందింది. ఈ నవల రాసేందుకు వర్మగారు పది సంవత్సరాలకు పైగా చారిత్రక సత్యాలను అధ్యయనం చేశారు. చారిత్రక సత్యాలను పూర్తిగా వెలుగులోకి తీసుకు రావడమే ఈ నవల యొక్క ముఖ్య ఉద్దేశం. "నేను నవల రాస్తాను. ఆ నవల చరిత్ర సమ్మతం గాను, చారిత్రక సత్యాలను వ్యక్తం చేసేదిగాను ఉండాలి. చరిత్ర ఎముకల్లో మాంసాన్ని, రక్తాన్ని నింపేందుకు నాకు నవలే ముఖ్య సాధనంగా తోచింది"[1] అని వర్మగారు రాసుకొన్నారు.

"'పారసనీస్' అనే ఆంగ్లేయుడు 'ఝాన్సీరాణి' విధిలేక ఆంగ్లేయులతో యుద్ధం చేసింది. ఆమె ఆంగ్లేయుల తరపున ఝాన్సీని పాలిస్తూ ఉండేది. ఆమె పరాక్రమం విధిలేని పరిస్థితుల్లో ఉత్పన్న మయిందని చెప్పాడు. ఈ విషయం వర్మగారికి చాల బాధ కలిగించింది."[2]

"రాణి, ఝాన్సీని ఆంగ్లేయుల అనుమతితో పాలిస్తూ ఉండేదన్న పారసనీస్ అభిప్రాయం మా అవ్వ, ముత్తవ్వ చెప్పిన మాటలతో సమన్వయం కిందలేదు"[3] అని వర్మగారు పరిచయంలో రాసి ఉన్నారు.

---

1. ఝాన్సీకే రాణి లక్ష్మీబాయి 'పరిచయ్' – బృందావన్‌లాల్ వర్మ, పు: 4.
2. పైదే., పు:1.
3. పైదే., పు:1.

# झाँसी की रानी लक्ष्मीबाई

— वृन्दावनलाल वर्मा



వర్మగారికి ఝాన్సీరాణి దేశ స్వాతంత్ర్యానికి యుద్ధం చేసింది - అనే నమ్మకం కలగడం వల్లనే ఆయన ఇందుకు సంబంధించిన విషయాలను సేకరించడానికి ప్రారంభించారు. 1857లో ఒకానొక ఆంగ్లేయ సైనికాధికారి లెఫ్టినెంట్ గవర్నరుకు ఝాన్సీ స్వాధీనమైన పిమ్మట రాసిన నలభై, యాభై జాబులు జడ్జి కచేరి అలమారులో వర్మగారికి దొరికాయి. ఈ జాబులు చదివిన తర్వాత వర్మగారి నమ్మకం మరీ అధికమయ్యింది.

ఆంగ్లేయుల వద్ద పోలీసు అధికారిగ ఉండిన 'మున్షీ తురాబ్ అలీ' అనే వ్యక్తి రాణికి సంబంధించిన చాల విషయాలు వర్మగారికి తెలియజేశారు. అతని మాటలు వర్మగారి నమ్మకాన్ని దృఢం కావించాయి.

'పారసనీస్' అభిప్రాయానికి ప్రతిక్రియా రూపంగా వర్మగారు చారిత్రక సత్యాలు అన్వేషించడానికి ప్రారంభించారు.

నవలలో వర్ణించిన ప్రదేశాలు కూడ చారిత్రకమైనవే. ఇందులో చారిత్రక విషయాలు చాలవరకు సత్యమైనవిగాను ఉన్నాయి. సుమారు నూటముప్పై సంవత్సరాలకు పూర్వం జరిగిన ఈ కథను ఎన్ను కొన్నారు. చారిత్రక సత్యాలను అన్వేషించడంలో వర్మగారికి అంత కష్టం అనిపించలేదు. అనేకమంది వ్యక్తులు వర్మగారికి సాయం అందించారు.

**3.2.9.2. కథావస్తువు:** 'ఝాన్సీ కీ రాణి - లక్ష్మీబాయి' అనే నవలలో

బృందావన్ లాల్ వర్మగారు ప్రథమ స్వాతంత్ర్య మహోద్యమానికి నాయకత్వం వహించిన 'ఝాన్సీరాణి లక్ష్మీబాయి' శౌర్య సాహసాలను, దేశభక్తిని వర్ణించి ఉన్నారు. 19వ శతాబ్దానికి చెందిన చారిత్రక ఇతివృత్తాన్ని ఆధారంగా చేసుకొని వర్మగారు ఈ నవల రాశారు. ఈ నవలను రచయిత 'ఉదయం', 'మధ్యాహ్నం', 'అస్తమయం' అనే మూడు శీర్షికలతో రాశారు.

**ఉదయం:** 'ఝాన్సీరాణి లక్ష్మీబాయి'ని బాల్యంలో 'మనూబాయి' అని పిలిచేవారు. ఆమె 'రెండవ బాజీరావు' ఆశ్రితుడైన 'మోరోపంతు' పుత్రిక. ఆమె బా వద్ద 'బిఠూర్'లో తన తండ్రితో కూడ ఉండేది. బాజీరావుకి నానాసాహెబ్, రావుసాహెబ్ అనే కుమారులుండేవారు. బాల్యంలో మనూబాయి వీళ్ళతో ఆటలాడుకొంటూ ఉండేది. ఆమెకు గుర్రపుస్వారీ, శస్త్రవిద్య, కుస్తీ, మల్లయుద్ధం మొదలైన అనేక విద్యల్లో ప్రవేశం ఉండేది. శాస్త్ర అధ్యయనంలో కూడ ఆసక్తి ఉండేది. ఆమె సహజంగానే చంచల స్వభావం కలది. దృఢమైన శరీరం కలది.

ఒకనాడు తాంత్యా దీక్షితుడనే ఒక జ్యోతిష్కుడు, ఆమె భవిష్యత్తులో రాణి అవుతుందని జోస్యం చెప్పాడు. తాంత్యా దీక్షితుడే కొన్నాళ్ళ తర్వాత 'ఝాన్సీ'కి రాజైన గంగాధరరావుతో ఆమె వివాహాన్ని జరిపిస్తాడు. వివాహం తర్వాతే ఆమె తన పేరు మనూబాయికి బదులు లక్ష్మీబాయిగా మార్చుకొంది. ఇలా ఆమె ఝాన్సీకి రాణి

తాంత్యా దీక్షితుని జోస్యం నిజం చేసింది.

వివాహ సమయంలో గంగాధరరావు లక్ష్మీబాయికి సుందర్, ముందర్, కాశీబాయి అనే ముగ్గురు దాసీలను కానుకగా ఇచ్చారు. రాణి వారిని తన చెలికత్తెలుగ స్వీకరించింది. ఆమె వారికి కూడ అస్త్ర, శస్త్రాల ప్రయోగం, గుర్రపుస్వారి మొదలైన విద్యలు నేర్పించింది. లక్ష్మీబాయితో వివాహానికి ముందు గంగాధరరావు విలాసవంతుడు, క్రూరుడు. కాని పెండ్లి తర్వాత లక్ష్మీబాయి వల్ల అతని ప్రవర్తనలో చాల మార్పు వస్తుంది.

లక్ష్మీబాయి రాణి అయినా సామాన్య ప్రజలను మరచిపోలేదు. వాళ్ళతో సంబంధాన్ని పెంచుకొంది. 'పసుపు కుంకుమ' ఉత్సవ సమయంలో ఆమె నగరంలోని స్త్రీలనందరిని ఆహ్వానిస్తుంది. వారితో కూడ కలసి మెలసి తిరుగుతూ ప్రజాభిమానాన్ని చూరగొంటుంది. అందుకే ప్రజలు రాజుకి భయపడినా ఆమెను ఎక్కువగా అభిమానించేవారు.

రాణి లక్ష్మీబాయికి మార్గశీర్ష శుక్ల పక్ష ఏకాదశి క్రీ.శ. 1851 తిథినాడు పుత్రుడు జన్మించాడు. రాజు చాల సంతోషం పుత్రోత్సవాన్ని జరిపించి సామంతులకు, సర్దారులకు అధికంగా బహుమానాలిస్తాడు. కాని ఆ బాలుడు మూడవ మాసంలో మరణిస్తాడు. ఈ దుర్ఘటన కారణంగా రాజైన గంగాధరరావు జబ్బుపడ్డాడు. చికిత్స ఏమాత్రం ఫలించలేదు. గంగాధరరావు

తాను చనిపోయే ముందు దామోదరరావు అనే బాలుడ్ని దత్త పుత్రునిగ స్వీకరించి, ఆ బిడ్డ సంరక్షణా భారాన్ని రాణికి అప్పగిస్తాడు తర్వాత కొద్ది రోజులకు రాజు స్వర్గస్థుడౌతాడు.

రాజు చనిపోయిన తర్వాత రాణి కుంగి పోలేదు. అమిత దుఃఖాన్ని దిగమింగి ధైర్యంగా రాజ్యపాలనా భారం స్వీకరించింది. తన బాల్యమిత్రులైన తాంతియా తోపే, నానా సాహెబ్‌లతో కలసి తనదేశ స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి కంకణం కట్టుకుంది.

'ఝాన్సీ' లో ఉన్నట్టి రాజకీయాధికారి 'ఎలిస్' అనే వ్యక్తి గంగాధరరావు దత్తు తీసుకొన్న విషయాన్ని ఆంగ్లేయ అధికారులకు తెలియజేశాడు. ఆంగ్లేయ ఉన్నతాధికారి అయిన 'మలకమ్' అనే వాడు 'ఝాన్సీ' రాజ్యాన్ని ఆంగ్ల రాజ్యంలో కలుపుకోమని, దత్త పుత్ర నియమం చెల్లదని తెలుపుతూ ఆదేశమిస్తాడు. నగరంలోని మహల్ మాత్రం రాణికి చెందుతుందని చెప్తాడు. కానీ, రాణి ఝాన్సీ రాజ్యాన్ని వదలుకొనేదానికి అంగీకరించదు. ఆంగ్లేయులు రాజ్యాన్ని బలవంతంగా స్వాధీనం చేసుకొన్నా, తాను ముమ్ముందు చేయబోయే స్వాతంత్ర్యోద్యమం ఫలించేంత వరకు విశ్రమించనని కంకణం కట్టుకొంటుంది.

ఇంతలో ఆంగ్లేయులు ఝాన్సీని స్వాధీన పరచుకొంటారు. విధిలేక రాణి సేవకులు ఆమె అనుమతితోనే ఆంగ్లేయుల వద్ద ఊడిగం చేయసాగారు. ఇలా అక్రమంగా ఝాన్సీని ఆక్రమించుకోవడం తగదని, తన రాజ్యాన్ని తనకిచ్చేయమని రాణి ఇంగ్లండు

ప్రభుత్వానికి అప్పీలు చేసుకుంది. కాని ఇంగ్లాండు నుంచి ఎలాంటి సమాధానం రాదు. ఇలా కొన్ని నెలలు గడచిన తర్వాత ఒకనాడు తాంతియా తోపే రాణి వద్దకు వస్తాడు. అతడు రాజస్థాన్, పంజాబు మొదలైన ప్రదేశాలు పర్యటించి వస్తాడు. ఆ ప్రాంతాల్లోని రాజులు ఆంగ్లేయుల సార్వభౌమత్వాన్ని సమర్థిస్తున్నా, ప్రజలు మాత్రం వ్యతిరేకిస్తున్నారని తెలుసుకొంటాడు. ప్రజలంతా ఆంగ్లేయులను పారద్రోలాలని తహతహలాడుతున్నారని కనుగొంటాడు. ఢిల్లీ ముసల్మానులూ, మహారాష్ట్ర ప్రజలు ఆంగ్లేయులతో పోరాడేందుకు సిద్ధంగా ఉన్నారని ఊహించాడు. ఈ విషయాలన్నీ రాణికి చెప్తాడు. రాణి కూడ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడమని అతనిని కోరుతుంది. అంతేగాక యుద్ధ సామగ్రి ఉత్పత్తులు పెంచమని, ఆంగ్లేయుల యుద్ధ పద్ధతులను జాగ్రత్తగా గమనించమని, విరోధులను అణచడానికి అనుకూల పరిస్థితికై ఎదురు చూస్తుండమని చెప్తుంది

'అలీ బహదూర్' అనేవాడు రాణి కార్యకలాపాలను జాగ్రత్తగా గమనిస్తూ, రహస్యంగా ఆంగ్లేయులకు తెలియజేస్తూ ఉండేవాడు. ఇటువంటి దేశద్రోహులు, చీడ పురుగులు, స్వార్థపరుల ఉనికి మన దేశ చరిత్రకే ఒక మాయని మచ్చ.

ఒక్క ఝాన్సీ లోనే కాక అటు అయోధ్య, బీహారు, బెంగాల్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, బుందేల్ ఖండ్ మొదలైన ప్రదేశాల్లో కూడ

స్వాతంత్ర్య వీచికలు వీచసాగాయి. ప్రజల హృదయాల్లో స్వాతంత్ర్య జ్వాలలు ప్రజ్వలించాయి. ఆంగ్లేయులతో పోరు సల్పే అదను వచ్చిందని రాణి గ్రహిస్తుంది. తన అనుయాయులను ఒకే మార్గంలో నడిపేందుకు సమయం ఆసన్నమైందని గమనించి, ఆమె దామోదర రావుకు ఉపనయనం చేయాలనే నెపంతో తన అనుయాయులను ఝాన్సీకి పిలిపిస్తుంది. సంప్రదింపుల తర్వాత మరికొన్ని దినాలు నిరీక్షించడం మంచిదని తలపోసింది. విప్లవ ప్రచారం మాత్రం అధికంగా జరుగసాగింది. దక్షిణ, ఉత్తర, పూర్వ ప్రదేశాల్లో సాధువులు, ఫకీరుల్లా రాణి అనుయాయులు **తిరుగుతూ** విప్లవాన్ని ప్రోత్సహించ సాగారు.

**మధ్యాహ్నం:** క్రీ.శ. 1856 వ సంవత్సరం. ఆ రోజు దీపావళి పండుగ. రాణి తన మహల్లో లక్ష్మీ పూజ చేయిస్తూ ఉన్నది. తాంతియా తోపే, నానా సాహెబ్‌లు కూడ అతిథులుగా వచ్చారు. పేరుకు లక్ష్మీపూజే గాని వారు రాజకీయ మంతనాలు చేయసాగారు. తాంతియా తోపే లక్ష్మీబాయితో సైనిక స్థావరాలలో నీ ప్రయత్నం నీవు చేస్తూ ఉండు. దేశంలోని అధికారులను నీ వైపు తిప్పుకో అని చెప్పాడు. నానా సాహెబ్ రష్యా, టర్కీ, కాబూల్, ఇరాన్ మొదలైన దేశాల సానుభూతి మనవైపు ఉందనే ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు. రాణి "మనం మంచి తుపాకులను నిర్మించే కార్మికులను ఒకచోట చేర్చేందుకు ప్రయత్నించాలి" అని చెప్తుంది.

ఇలా వీరు మంతనాలు చేసి, పటిష్టమైన వ్యూహాలతో ఆంగ్లేయులను చిత్తుగా ఓడించి, దేశం నుండి తరిమి వేయాలని పథకం

వేశారు. రాణి ఢిల్లీ, లక్నోలకు సంబంధించిన అధికారులతో కూడ సంప్రదించి 31-5-1858 ఆదివారం నాడు 11 గం॥కు విప్లవం ప్రారంభించేందుకు నిశ్చయించింది.

ఇలా రాణి తదితరులతో చర్చించి, నిదానంగా పటిష్టమైన వ్యూహంతో, మంచి బలమైన సైనిక అస్త్ర, శస్త్ర సమీకరణాల ఆంగ్లేయులను చావుదెబ్బ కొట్టాలని, తిరుగులేని ఘన విజయం సాధించాలని కలలు గంటుంది.

కానీ విధి వక్రిస్తుంది. భారతీయులలో ఆంగ్లేయుల పీచ మడంచాలన్న కోరిక తీవ్రంగా ఉన్నా, క్రమ శిక్షణా మాత్రం లోపించింది. నిజానికి రాణి ఊహించిన ప్రకారం ఒక పద్ధతిలో నడుచుకొని, క్రమ శిక్షణతో విప్లవం తీసుకొని వచ్చిఉంటే, ఆ నాడే మన భారత మాత విదేశీ దాస్య శృంఖలాల బంధం నుండి విముక్తి పొందేది. ఆ నాడే భారతావనికి స్వాతంత్ర్యం వచ్చి ఉండేది.

కొందరు భారతీయులు తొందరపడ్డారు. మరి కొందరు బాధ్యతా రహితంగా ప్రవర్తించారు. ఇంక కొందరు శ్రమించ వలసిన తరుణంలో విలాస వంతంగా గడిపారు. కొందరిలో క్రమ శిక్షణ, సరి యైన అవగాహన లోపించింది.

ఆంగ్లేయులు భారతీయ సైనికులను క్రైస్తవులుగా మార్చేందుకు సామ, దాన, భేద, దండోపాయాలు ప్రదర్శించారు. కొందరికి ధనాశ చూపించారు. కొందరిని బెదిరించారు. మరి కొందరిని తిట్టారు,

కొట్టారు. ఇలా బలవంతంగా క్రైస్తవులుగా మార్చడం వల్ల, భారత సైనికుల్లో అసంతృప్తి నెలకొన సాగింది. ఇది గాక క్రొవ్వుతో తయారు చేసిన 'కారతూస్' (తూటాలు) ప్రయోగించాలని ఆంగ్లేయులు, భారతీయ సైనికులను నిర్బంధించడంతో అగ్నికి ఆజ్యం తోడైనట్లు ఈ అసంతృప్తి ఇంకా ఎక్కువైంది. (ఈ తూటాలు ప్రయోగించాలంటే నోటితో కొరకాలి. ఈ తూటాలు పంది క్రొవ్వు, ఆవు క్రొవ్వులతో తయారు చేసినవి. 'పంది' అంటే ముసల్మానులకు అసహ్యం. 'గోవు' హిందువులకు అతి పవిత్రమైనది. కాబట్టి హిందువులు, ముస్లింలు కూడా ఈ తూటాలు కొరికే దానికి తిరస్కరించే వాళ్ళు) అందుకే భారతీయ సిపాయిలందరిలో క్రోధాగ్ని ప్రజ్వరిల్ల సాగింది.

లక్ష్మీబాయి నిర్ణయించిన విప్లవం 31-5-1858; అంటే మేనెల ఆఖరు రోజు. అంతవరకు మన సిపాయిలు ఆగలేక పోయారు. 1858 ఫిబ్రవరి నెలలోనే ఒక దుర్ఘటన జరిగింది. 'భారత్‌పూర్' శిబిరంలో 19వ,నంబరుగల 'పలటన్' (ప్లటూన్), క్రొవ్వుతో చేయబడిన 'కారతూస్' ను ప్రయోగించడానికి తిరస్కరించారు. 'మంగళపాండే' అనే సిపాయి చాలమంది ఆంగ్లేయులను ఊచకోత కోసి చంపివేశాడు. ఇది నిజంగా తొందరపాటు చర్యే. ఈ చర్యకు ప్రతిక్రియగా ఆంగ్లేయులు అతనికి ఉరిశిక్ష వేశారు. ఈ సంఘటన వల్ల భారత దేశంలోని ఇతర సైనిక శిబిరాలలో అశాంతి అధికం కాజొచ్చింది.

ఇంతలో వేసవికాలం వచ్చింది. పూర్వ నిశ్చిత కార్యక్రమాను

సారంగా విప్లవ చిహ్నాలైన తామరగింజ, రొట్టె రెండింటినీ భారత దేశమందలి ప్రతి సైనిక శిబిరానికి చేర్చారు. ఈ మధ్యలో మే 6వ తేదీన 'మీరట్' లో కూడ 'భారత్‌పూర్' లో జరిగిన సంఘటనే జరిగింది. అక్కడి సైనికులు కోపోద్రిక్తులై ఆంగ్లేయ అధికారులందరిని చంపి, ఆ మరునాడు ఢిల్లీ చేరుకొన్నారు. విప్లవ జ్వాల ఉత్తర భారత దేశమంతటా ప్రజ్వరిల్ల సాగింది.

ఆంగ్లేయులను భారత సైనికులు లూటీ చేయసాగారు. 'కమీషనర్ గార్డన్' అనే అతనిని చంపేశారు. జైల్ అధికారి 'బక్షీష్ అలీ' అనే వ్యక్తి చాలా మంది ఆంగ్లేయులను కాల్చి చంపాడు. ఆంగ్లేయులు లొంగిపోయి సాగర్ వెళ్ళడానికి అనుమతి కోరారు.

ఇలా ఆంగ్లేయులపై మండిపడుతున్న భారతీయ సైనికుల్లో క్రమశిక్షణ లోపించింది. రాణి నగరంలోని పెద్దల సలహా మేరకు శాసన భారాన్ని స్వీకరిస్తుంది. 'గౌస్‌ఖాన్' అనే వ్యక్తిని తుపాకులతో యుద్ధం చేసే సైనికులకు సేనాధిపతిగా నియమిస్తుంది. లక్ష్మీబాయి గూఢచారి విభాగానికి అధ్యక్షురాలైంది.

క్రీ.శ. 1858 సెప్టెంబరులో ఢిల్లీ ఆంగ్లేయుల వశమయ్యింది. లక్నో, కాన్పూరు, బిఠూర్ మొదలైన పట్టణాలు కూడ ఆంగ్లేయుల వశమయ్యాయి. రావు సాహెబ్, తాంతియా తోపేలు తమ సైన్యాన్ని కాలపీ వద్దకు చేర్చి అక్కడ యుద్ధానికి ఏర్పాట్లు చేయసాగారు. ఈ సమాచారం రాణికి తెలిసింది. కాని నిరాశ పడలేదు. ఝాన్సీని ఆంగ్లేయులు

ఆక్రమిస్తారనే విషయం ఆమెకు తెలుసు. - యుద్ధం తప్ప వేరే మార్గమే లేదు. చివరకు 15 రోజుల్లో 'ఝాన్సీ' ఆంగ్లేయుల వశమయ్యింది. రాణి సైనికులు అనేకమంది చనిపోయారు; కనుక విధిలేక రాణి ఝాన్సీ వదలిపెట్ట వలసి వచ్చింది.

**అస్తమయం:** అలా ఝాన్సీ వదలిన రాణి కాలపీలోని బాజీరావు-పీష్వా గుడారం చేరుకొంది. బాజీరావు పీష్వా సోమరి పోతు, విలాస వంతుడు. లక్ష్మీబాయి ఎంత బోధించినా అతడు చెడ్డ అలవాట్లను వదలిపెట్ట లేదు. ఝాన్సీపై విజయం పొందిన 'జనరల్ రోజ్' అంతటితో ఊరుకోలేదు. 'కాలపీ'ని కూడా ముట్టడించాడు. విజయం పొందేందుకు కావలసినన్ని సాధనాలున్నప్పటికీ క్రమశిక్షణ, అనుశాసనం లేక పోవడం వల్ల పీష్వా సేన ఓడిపోయింది. పీష్వా పారిపోయి గ్వాలియర్‌లో శరణు పొందాడు. అప్పుడు గ్వాలియర్ కోట రావుసాహెబ్ అధికారంలో ఉంది. రాణి ప్రోత్సాహ ఉత్సాహాల వల్లనే రావుసాహెబ్ గ్వాలియర్‌ను వశపరచుకొంటాడు. బాజీరావు పీష్వాకు గ్వాలియర్ అధికారం అప్ప చెప్పారు. కాని రాజ్యం, రాజ్యాధికారం చేజిక్కగానే బాజీరావు మరల విలాసవంతుడయ్యాడు.

ఈ విషయం తెలుసుకొన్న రాణి నిరాశ చెంది గ్వాలియర్ చుట్టుపట్ల తిరుగుతూ 'గంగాదాస్' అనే సన్యాసిని కలుసుకొనింది. గంగాదాస్ రాణికి కర్మయోగ మర్మాన్ని తెలిపి తన కర్తవ్యాన్ని నెరవేర్చమని ప్రబోధించాడు. అతని మాటలు విని కర్తవ్య పరాయణతతో

తిరిగి ఆంగ్లేయులతో యుద్ధం చేయడానికే నిశ్చయించుకొంటుంది.

'జనరల్ రోజ్' సరియైన సమయం చూచి గ్వాలియర్ పై దండెత్తాడు. గ్వాలియర్ సేన రావు ప్రవర్తన పట్ల అసంతృప్తి చెంది రాణిని శరణు కోరారు. రాణి ఆ సేన సహాయంతో దామోదర రావును వీపున కట్టుకొని సాహస నైపుణ్యాలతో యుద్ధం చేసింది. కానీ, యుద్ధంలో ఆమె వీర స్వర్గం అలంకరించింది.

దేశ భక్తులు, ఆమె సర్దారులు అయిన రఘునాథ సింహుడు, గులాం మహమ్మద్, దేశముఖ్ మొదలైన వారు గంగాదాస్ కుటీరంలో, ఆమె శవానికి దహన సంస్కారాలు చేశారు. ఆమె స్మారక చిహ్నంగా అచట ఒక సమాధి నిర్మించారు.

దేశ స్వాతంత్ర్యం కొరకు తన ప్రాణాలను సైతం తృణప్రాయంగా ఎంచి, చివరివరకు పోరాడి తన జీవితాన్నే అర్పించిన ధన్యజీవి లక్ష్మీబాయి.

**3.2.9.3. ప్రాసంగిక కథలు:** రాణి లక్ష్మీబాయి, గంగాధర రావుల కథ ఆధికారిక కథ. ఈ ఆధికారిక కథకు పోషకంగా నాలుగు ప్రాసంగిక కథలున్నవి.

1. మోతీబాయి, ఖుదాబక్షుల ప్రణయగాథ మొదటిది.

2. జుహీ, తాంత్యాటోపేల ప్రణయ వృత్తాంతం రెండవది.

3. ముందర్, రఘునాథ సింహుల ప్రేమకథ మూడవది.

4. నారాయణ శాస్త్రి, చోటీ భంగిన్‌ల ప్రేమకథ నాల్గవది.

ఈ ప్రాసంగిక కథల సమ్మేళనంతో ఆధికారిక కథ వికాసాన్ని పొందింది. అంతేగాక ఈ ప్రాసంగిక కథల సన్నివేశ కల్పనచే ఆధికారిక కథ చక్కగా పోషించబడింది.

3.3.0. ప్రవేశిక : అడివి బాపిరాజు, బృందావన్‌లాల్ వర్మ గార్లు పేరెన్నిక గన్న చారిత్రక నవలాకారులు. చారిత్రక నవలలే కాక సాంఘిక నవలలు, నాటకాలు, వ్యాసాలు, ఏకాంకికలు రాయడంలోనూ దిట్టలే. ఇద్దరూ భారతీయులే. అయితే బాపిరాజు గారు దక్షిణా భారత దేశంలోని ఆంధ్రదేశానికి చెందినవారు కాగా, బృందావన్‌లాల్ వర్మగారు ఉత్తర భారత దేశంలోని బుందేల్ ఖండ్ ( మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌ల లోని కొన్ని జిల్లాలు) ప్రాంతానికి చెందిన వారు. ఇద్దరికీ ప్రాంతీయ అభిమానం మెండుగా ఉంది. అందుకే వారు కథా వస్తువులుగా వారివారి ప్రాంతాలకు చెందిన చారిత్రకాంశాలనే ఎన్నుకొన్నారు.

"బాపిరాజు" వీరాంధ్రుడు. ఆంధ్రభూమిపై, ఆంధ్రజాతిపై ఈగను కూడ వ్రాలనిచ్చెడి వాడు కాడు. మానవ సభ్యతకు భారత సభ్యతయే గురువనియు, భారతీయ సంస్కృతి హారమున నాంధ్ర సంస్కృ నాయకమణి యనియు నాతని మతము."[1]

బాపిరాజు గారికి ఆంధ్రులపట్ల, ఆంధ్ర సంస్కృతిపట్ల గల గౌరవం అపారం. అదే విధంగా తెలుగు భాషను, తెలుగు వారి సంస్కృతిని ప్రాణ సమానంగా అభిమానించారు. ఇందుకు వీరి నవలలే ప్రత్యక్ష సాక్ష్యాలు. ఆంధ్రుల శౌర్యాన్ని, ధీరత్వాన్ని వర్ణించిన సందర్భాలలో ఆనందంతో తమని తామే మరచి పోయే వారు.

"ఆయన ఏ చారిత్రాత్మకమైన ప్రదేశాన్నో సందర్శించినప్పుడు

1. మా - బాపిరాజు - సాహిత్య దర్శనము — శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు., పు: 6.

అక్కడ ఏ రాతి మీదనో, రాగిరేకు మీదనో చెక్కబడిన శాసనాలనో, నుడులనో పురస్కరించుకొని చరిత్ర కారులతో తర్క వితర్కాలు, తర్జన భర్జనలు చేసి, చరిత్ర గ్రంథాలను కూలంకషంగా పరీక్షించి తేల్చుకొన్న అంశాలను మనశ్చక్షువుతో దర్శించి మేధా శక్తితో నాటి వాతావరణాన్ని సన్నివేశాలను పాత్రలను ఊహించి సృష్టి చేసినాడు తన చారిత్రాత్మక నవలలను"[1]

అంతే తప్ప ఏవేవో ఊహాలతో మాత్రం చారిత్రక నవల్లో కథలను అల్లలేదు. విద్యార్థి దశలో కూత్రేతోను, తరువాత కుటుంబ సభ్యులతోను, మిత్రులతోను కలిసి సుప్రసిద్ధ చారిత్రక ప్రదేశాలనేక ప యాలు సందర్శించి సంపాదించిన చారిత్రక పరిజ్ఞానం బాపిరాజు గారి నవలా రచనలో బాగా ఉపకరించింది.

ఆంధ్రాభిమానంగల బాపిరాజు గారు పూర్వ ఆంధ్ర చక్రవర్తుల చరిత్రలను నవలలుగా రాసి, పూర్వాంధ్రుల వైభవాన్ని చాటాలనుకొని శాతవాహనులు, ఇక్ష్వాకులు, చాళుక్యులు, కాకతీయుల చరిత్రలను తమ రచనల్లో కథా వస్తువులుగా గ్రహించారు. ఇంకా ఆంధ్రులను గురించి ఎంతో రాసే వారే కాని, ఆ లోపే ఆయన మరణించడం ఆంధ్రుల దురదృష్టం.

బృందావన్ లాల్ వర్మగారికి చారిత్రక నవలలు రాయాలనే ప్రేరణ బాల్యంలోనే కలిగింది. 1905 వ సంవత్సరం లో ఒక

1. కులపతి- అడివి బాపిరాజు — శ్రీ బుద్ధవరపు కామరాజు మధుమూర్తి., పు: 6.

పంజాబీ మిత్రుని పెండ్లికి వచ్చిన పంజాబీ అతిథులు బుందేల్‌ఖండ్ గురించి, అక్కడి ప్రజల్ని గురించి నీచంగాను, హేళనగాను మాట్లాడారట. "ఈ బుందేల్ ఖండ్ ఒక భాగ్యహీన ప్రాంతం. ఇక్కడి మగ వాళ్ళు బక్కచిక్కి పనికిరాని వాళ్ళు. ఆడవాళ్ళు ఒళ్ళు పెంచుకున్నారు. పర్వతాలు, అడవులు, నదులు, సెలయేళ్ళు తప్ప ఇక్కడ ఏమున్నాయి ? అంతా జంతుమయం."[1]

16 సంవత్సరాలు కూడ నిండని బాలుడైన వర్మగారి హృదయంలో ఈ మాటలు ఈటెల్లా గుచ్చినట్లయింది. తన జన్మ భూమిని గురించి, తన ప్రాంతీయులను గురించి ఇలా పరిహాసంగా మాట్లాడటం సహించలేక పోయాడు. ఆ రోజు నుండే వారి హృదయంలో ఎప్పటికీ ఆరని మంటలు రగులుకొన్నాయి. ఆ నాటి నుండి బుందేల్ ఖండ్ లోని ఒక్కొక్క రాయి, ఒక్కొక్క నీటి బొట్టు, ఒక ఆకు అతని హృదయంలో మెదల సాగాయి. అతను ఇలా అనుకొన్నాడు.

" ఏ భూమి నుండి నా తల్లిదండ్రులు, నేనూ జన్మించామో, ఎక్కడ లక్ష్మీబాయి పరాక్రమం చూపించిందో, ఏ భూ భాగంలో వీరులు ( చందేలులు, ఛత్రశాలులు) పరాక్రమం చూపారో వారా దరిద్రులు ! ఎవరి వీరత్వాన్ని అందరూ వేయి గొంతులతో పాడుతారో, ఎవరైతే ఔరంగజేబును, ఆంగ్లేయులను ఎదిరించి పోరాడినారో వారా ! బక్కచిక్కిన పనికిరాని వాళ్ళు. రాత్రింబవళ్ళు చెమటనుకార్చి

1. బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య - డా॥ మోహినీ సహాయ్., పు. 77.

కరువును ఎదుర్కొని ధైర్యంగా మనుగడ సాగిస్తున్నారో వారు, వారికి హాస్యాస్పదులైనారా!"[1]

ఇలా బాధపడి ఆ రోజు నుండే బుందేల్‌ఖండ్ అంతా తిరిగి, అనేక చారిత్రక ఆధారాలను సేకరించి బుందేల్‌ఖండ్ ప్రజల గొప్పదనాన్ని వేనోళ్ళ చాటే అనేక చారిత్రక కథలు రచించారు. చారిత్రక నవలా రచనకు ప్రేరణ కలిగించిన పై సంఘటన గురించి వర్మగారే తమ స్వీయ చరిత్రలో రాసుకున్నారు.

ఆ నాడు ఈ విధంగా పంజాబీయులు బుందేల్‌ఖండ్‌ని పరిహసించక పోయి ఉంటే, వర్మగారికి ప్రేరణ కలగక పోయి ఉంటే ఇంతటి గొప్ప చారిత్రక నవలలు వారి కలం నుండి వెలువడేవి కాదేమో! ఆ పంజాబీయుల పరిహాసం వల్ల ఒకరకంగా మేలే జరిగి, భారత చరిత్రను అద్దం పట్టే అనేక నవలలు వర్మగారి లేఖిని నుండి వెలువడ్డాయి. బృందావన్‌లాల్ వర్మగారికి బుందేలులన్నా, బుందేల్‌ఖండ్ భాష అన్నా, వారి సంస్కృతి అన్నా ప్రాణం అని, ఆ నవలలు చదివిన వారికి అర్థమౌతుంది. బుందేలుల శౌర్యాన్ని, ధీరత్వాన్ని వర్ణించే సమయంలో వారు ఆనందంతో తమని తామే మరచి పోయే వారు.

వీరిద్దరూ సమకాలికులైనా, వారి చారిత్రక నవలల్లోని కథావస్తువు మాత్రం వేరు వేరు యుగాలకు చెందింది. అట్లాగే వీరిద్దరి భాషలు వేరైనా, భావనాశక్తి, రచనా కౌశలం, సన్నివేశ పరికల్పన,

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య- డా॥ మోహినీ సహాయ్., పృ: 78.

కథా కథన సామర్థ్యం, పాత్ర పోషణా వైస్రల్యం, రసావిష్కరణా కౌశలం, సంభాషణా చాతుర్యం మొదలైన విషయాల్లో ఇద్దరికీ చెప్పుకోదగ్గ సమాన ధర్మాలున్నాయి. వీరు తమ చారిత్రక నవలలకు స్వీకరించిన కథా వస్తువులు దేశ కాలాదులను బట్టి వేరైనా, పరంపరగా భారతదేశంలో ఉండే రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితుల్లో వారి నవలల్లో ఎం సామ్యం కన్పిస్తుంది. అయితే కొంత వైషమ్యం కూడ లేకపోలేదు. వీరిద్దరి నవలల చారిత్రక నేపథ్యం, కథా వస్తువులల్లోని సామ్యావైషమ్యాలను తులనాత్మక దృష్టితో పరిశీలించడమే ఈ అధ్యాయం ముఖ్యోద్దేశ్యం.

**3.3.1. చారిత్రక నేపథ్యం :** బృందావన్ లాల్ వర్మాగారు తాను రచించిన ప్రతి చారిత్రక నవల ముందు ఆ నవల రాయడానికి దారితీసిన పరిస్థితులను, ఆయన పడిన శ్రమను, ఆవేదననూ 'పరిచయం'లో రాసుకొన్నారు. ఆ పరిచయం చదువుతున్నప్పుడే ఆ నవలల చారిత్రక నేపథ్యం పట్ల మనకు ఒక అవగాహన గలుగుతుంది.

బాపిరాజు గారు ఒక్క నవలలో కూడ ఈ విధంగా పరిచయం లేదా చారిత్రక నేపథ్యం గురించి రాయలేదు. ఇతర పరిశోధకుల ద్వారా, ఉపన్యాసాల ద్వారా అడివి బాపిరాజుగారి నవలలు చదివిన తరువాత ఆ నవలల చారిత్రక నేపథ్యం తెలుస్తుంది. ఈ విధంగా వర్మాగారు పరిచయం రాయడం, బాపిరాజు గారు రాయక పోవడం ఒక వైషమ్యం.

వీరిరువురూ కూడ వారివారి పద్ధతుల వల్ల ప్రయోజనమే

సాధించారని చెప్పవచ్చు. బృందావన్‌లాల్ వర్మ గారి నవలను పాఠకులు చారిత్రక నేపథ్యం వెలుగులో చదవగలుగుతారు. ఆ నవల చారిత్రకత పట్ల పాఠకుల్లో ఏ గందరగోళం ఉండదు. బాపిరాజు గారు ఈ రకంగా పాఠకునికి తమ నవలా నేపథ్యం గురించి ముందుగా తెలియజేయకుండా సూటిగా కథలోకి దిగడంవల్ల పాఠకుని మనస్సులో కథ పట్ల ఒక రకమైన ఉత్కంఠ, కుతూహలం కలిగే అవకాశం కల్పించారు. చారిత్రక నేపథ్యం పాఠకుడి ఊహాకు వదిలివేశారు. రచనలో ఇదొక రకమైన టెక్నిక్ అనవచ్చు.

**3.3.2. కథావస్తువుల కాలం:** బాపిరాజు గారు నాలుగు యుగాలకు సంబంధించిన నాలుగు చారిత్రక నవలల్ని రచించారు.

1. హిమబిందు ఆంధ్ర శాతవాహనుల కాలానికి
2. అడవి శాంతిశ్రీ ఇక్ష్వాకుల కాలానికి
3. అంశుమతి చాళుక్యుల యుగానికి
4. గోనగన్నారెడ్డి కాకతీయుల యుగానికి చెందినది.

అంటే క్రీ.పూ. 3వ శతాబ్దం - క్రీ.శ. 13వ శతాబ్దం మధ్యకాలాలు బాపిరాజు గారి కథావస్తువుల కాలం; ఇవి గాక మధురవాణి, శిలారథం, కైలాసేశ్వరుడు అనే చారిత్రక నవలల్ని కూడ ప్రారంభించారు. కాని అవి పూర్తి కాక మునుపే బాపిరాజు గారు దివంగతులైనారు.

**1. హిమబిందు:** 'హిమబిందు' కథాకాలం క్రీ.పూ. 3వ శతాబ్దం

నాటిదని భావించవచ్చు. "శాతవాహన యుగం క్రీ.పూ. 225 క్రీ.శ. 225"[1]

శ్రీముఖ శాతవాహనుని కాలమే హిమబిందు కథాకాలం కాని శ్రీముఖ శాతవాహనుని కాలం ఇదమిద్ధంగా తెలియలేదు.

"ఈ వంశ ప్రతిష్ఠను మొదట నెలకొల్పిన వాడు శ్రీముఖ శాతవాహనుడు (ప్రాకృతంలో సిముకుడు)"[2] "శ్రీముఖుడు క్రీ.పూ 211 –198 ల నడుమ రాజ్యము చేసియుండును"[3]

'శిముకుని' రాజ్యస్థాపన కాలము క్రీ.పూ. 270 కాని క్రీ.పూ 271 కాని యైయుండును.[4] పది ఏమైనా క్రీ.పూ 3వ శతాబ్దమే హిమబిందు కథాకాలం అని స్పష్టమౌతూ ఉంది.

**2. అడవి శాంతిశ్రీ:** 'అడవి శాంతిశ్రీ' కథాకాలం క్రీ.శ. 2వ శతాబ్దం.

"ఇక్ష్వాకులు, సాతవాహన రాజ్యము భగ్నమైన వెంటనే ధాన్యకటక ప్రాంతము నాక్రమించుకొని క్రీ.శ. రెండవ శతాబ్ద ద్వితీయ పాద ప్రాంతం నుండి పరిపాలించిరి."[5]

**3. అంశుమతి:** 'అంశుమతి' కథాకాలం 7వ శతాబ్దం. కుబ్జ-విష్ణువర్ధనుడు క్రీ.శ. 624 మధ్య వేంగిదేశమును పద్దెనిమిది ఏండ్లు కాలం పాలించెను.

---

1. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 125
2. పైదే., పు: 132
3. పైదే., పు: 134.
4. విజ్ఞాన సర్వస్వం., పు: 91.
5. పైదే., పు: 106
6. పైదే. పు 142.

**4. గోనగన్నారెడ్డి :** "'గోనగన్నారెడ్డి' కథాకాలం 12వ శతాబ్దం చివర మరియు 13వ శతాబ్దం. గణపతిదేవుడు క్రీ.శ. 1198 - క్రీ.శ 1262 - రుద్రమదేవి క్రీ.శ. 1262-1296."[1]

"'హిమబిందు'ను బాపిరాజు గారు 1922లో ప్రారంభించి 1945లో పూర్తి చేశారు. ప్రారంభానికి ముగింపుకు 23 సంవత్సరాల వ్యవధి ఉంది."[2]

"ఈ మధ్యకాలంలో అనేక నవలలు రాశారు. అడవి శాంతిశ్రీ, గోనగన్నారెడ్డి కూడ ఈ మధ్యకాలంలోనే రాశారు. గోనగన్నారెడ్డి, హిమబిందు, అడవి శాంతిశ్రీ నవలలు మీజాన్ పత్రిక ద్వారా మొదట సీరియల్‌గా వెలువడి తరువాత పుస్తకరూపం దాల్చాయి."[3] అంశుమతి నవలికను 1949లో రాశారు.

బృందావన్ లాల్ వర్మగారు 13-19వ శతాబ్దాల మధ్య కాలానికి సంబంధించిన చరిత్రనే కథావస్తువులుగా తమ అన్ని నవలలకు స్వీకరించారు. ఒక్క 'భువనవిక్రమ్' కథాకాలం మాత్రం ఉత్తర వైదిక కాలానికి చెందింది.

**1. గఢ్ కుండార్ ;** ఈ నవలలోని కథావస్తువు 13వ శతాబ్దం అంతిమ భాగానికి చెందింది. ఖంగారుల నాశనం తరువాత కథ ముగుస్తుంది. ఈ సంఘటన 1288 సం॥ నాటిది.

---

1. విజ్ఞాన సర్వస్వం., పు: 142.
2. అడివి బాపిరాజు నవలా సాహిత్యాను శీలనము డా॥ ముప్పవ సత్యనారాయణ., పు: 135, 136.
3. పైదే, పు: 16.

**2. మృగనయనీ :** మృగనయనీ కథాకాలం 15వ శతాబ్దం చివరి నుండి 16వ శతాబ్ది ప్రారంభం వరకు. మృగనయనీ భర్త 'మానసింహ-తోమర్' రాజ్యకాలం క్రీ.శ. 1489 నుండి క్రీ.శ. 1519 వరకు."[1]

**3. 'విరాటాకీ పద్మినీ', 'టూటే కాంటే', 'అహిల్యాబాయి', 'కచనార్'** అనే నాలుగు నవలల చారిత్రక కథాంశాలు 18వ శతాబ్దానికి చెందినవి.

1. విరాటాకీ ప. : క్రీ.శ. 1713 నుండి క్రీ.శ. 1719.
2. టూటే కాంటే : మహమ్మద్ షా రాజ్యకాలం క్రీ.శ. 1719 నుండి క్రీ.శ. 1739 వరకు.
   నాదిర్షా దండయాత్ర, దురాక్రమణ క్రీ.శ. 1739.
3. అహల్యాబాయి క్రీ.శ. (1755-1795) 13.8-1795 అహిల్యాబాయి మరణం.
4. కచనార్ : క్రీ.శ. 1790 నుండి క్రీ.శ. 1800 వరకు

**4. 'ముసాహిబజూ', 'ఝాన్సీ కీ రాణి లక్ష్మీబాయి' :** ఈ రెండు నవలల చారిత్రక కథా కాలం 19వ శతాబ్దానికి చెందింది. ముసాహిబజూ క్రీ.శ. 1800ల తర్వాత ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి కథాకాలం 1857 నాటిది. అంటే సిపాయిల కలహానికి దగ్గర కాలం.[2]

బృందావన్ లాల్ వర్మగారు ఒక నవల రాసిన తరువాతే రెండవ నవల రాశారు. వారు చారిత్రక నవలలు రాసిన సంవత్సరముల క్రమం -

---

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మ - డా|| శశిభూషణ్ సింహాల్, పు.36.
   పు 36

1. గఢ్ కుండార్ - (1927)
2. విరాటా కీ పద్మినీ - (1933)
3. కచనార్ - (1946)
4. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి - (1946)
5. ముసాహిబ్ బజూ - (1947)
6. టూటే కాంటే - (1949)
7. మృగనయనీ - (1950)
8. అహిల్యాబాయి - (1955)
9. భువన విక్రమ్ - (1956)

ఇవి కాక మాధవ్ జీ సింధియా, మహారాణి దుర్గావతి, రామ్‌గఢ్ కీ రాణీ, సోనీ ఆగ్ అనే చారిత్రక నవలల్ని రచించారు.

భువన విక్రమ్ తప్ప తక్కిన నవలల కథావస్తువులన్నీ మధ్యయుగానికి చెందినవి. భువన విక్రమ్ కథావస్తువు ఉత్తర వైదిక కాలానికి చెందినదైనా, చారిత్రక నేపథ్యాన్ని ఆధారం చేసుకొని రాసినందువల్ల చారిత్రక నవలగా ప్రసిద్ధి చెందింది.

**3.3.3. నవలల శీర్షికలు :** అడివి బాపిరాజుగారు తాను రచించిన నాలుగు చారిత్రక నవలల్లో మూడింటికి కథానాయికల పేర్లు, ఒక నవలకు కథానాయకుడి పేరు శీర్షికగా పెట్టారు. అంశుమతి అన్న నవలికలో తప్ప తక్కిన మూడు నవలల్లో చారిత్రకంగా అంత ప్రాధాన్యం లేని పాత్రలను నాయికా నాయకులుగా తీసుకొని, తర్వాత

చారిత్రక ప్రాధాన్యం గల పాత్రలను ఈ పాత్ర చుట్టూ తిప్పి కథను నడిపించారు. ఉదాహరణకు, గోనగన్నారెడ్డి విశాల కాకతీయ సామ్రాజ్యానికి ఒక సైన్యాధికారి మాత్రమే. నిజానికి రుద్రమదేవి, గణపతి రుద్రదేవుడు చరిత్ర ప్రసిద్ధికెక్కిన చక్రవర్తులు. కాని రాజుగారు గోన.గన్నారెడ్డి కథానాయకుడిగా ఈ చారిత్రక నవలను రచించారు. అలాగే 'హిమబిందు' లో చరిత్ర ప్రసిద్ధి చెందిన వ్యక్తులు శ్రీముఖ-శాతవాహనుడు, శ్రీకృష్ణ శాతవాహనుడు. నవలలో శిల్పి సువర్ణశ్రీ కథానాయకుడు అయినప్పటికి వణిక్సార్వభౌముని కూతురైన 'హిమబిందు' 'కథానాయిక' పేరే నవలకు శీర్షికగా పెట్టారు రాజుగారు. అట్లే 'అడవి శాంతిశ్రీ' లో కూడ వీర పురుష దత్తుడు, శాంతిమూలుడు చరిత్ర ప్రసిద్ధి చెందిన రాజులు. బ్రహ్మదత్తుడు కూడ ప్రముఖ దండనాథుడు. కాని శాంతిమూలుని కుమార్తె అడవి శాంతిశ్రీని కథానాయికను చేసి, ఆ పాత్ర చుట్టూ రచయిత కథను నడిపించారు. ఆమె పేరే నవలకు పెట్టారు.

కాని బృందావన్‌లాల్ వర్మగారు శీర్షికలకు పేర్లు పెట్టడంలో భిన్న పద్ధతులను అనుసరించారు. కొన్ని నవలలకు ప్రత్యక్షంగా నాయిక పేర్లే శీర్షికలుగా పెట్టారు. అవి - 1. కచనార్, 2. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి, 3. మృగనయనీ, 4. అహిల్యాబాయి. ఒక నవలకు 'విరాటాకీ పద్మినీ' అని పేరు పెట్టారు. ఆ నవలలో నాయిక పేరు కుముద్. నవలలో ఎక్కడా ఆమె పేరు పద్మినీ అని చెప్పలేదు.

కాని వర్మగారు ఈ నవల రాయక ముందు విరాట దుర్గ ప్రాంతాన్ని పర్యటించే టప్పుడు పద్మినీ అనే స్త్రీని, అక్కడి ప్రజలు దేవి అవతారంగా భావించే వారనీ, ఆ స్త్రీని చెరపట్టాలని ఆ నాటి సుబేదారు ప్రయత్నిస్తే ఆ స్త్రీ బేతవా నదిలో పడి మరణించిందనీ, ఇప్పటికీ బేతవా నదిలో ఆమె దూకిన చోట ఆమె పాదాల చిహ్నాలున్నాయనీ, ప్రతి సంవత్సరం అక్కడ మేళా జరుగుతుందనీ వర్మగారు రాశారు. తన కథలో కథానాయిక పేరు కుముద్ అయినా, పై కథ ప్రేరణ వల్ల తన నవలకు 'విరాటాకీ పద్మినీ' అనే పేరుపెట్టి ఉండవచ్చు. ఈ నవలకు ఈ పేరు పెట్ట డానికి ఇంకా చారిత్రక పద్మిని కథ కూడ ఆధారంగా వర్మగారికి దొరికి ఉండవచ్చు. "1302 సంవత్సరంలో అపురూప సౌందర్యవతి రాణి పద్మినికోసం చితోర్ పై అల్లా ఉద్దీన్ ఖిల్జీ దాడి చేశాడు. రాజైన రాణా రతన్ సింగ్ పద్మినీ భర్త యుద్ధంలో మరణించాడు. పద్మినీ తన పరివారంతో 'జౌహరు వ్రతం' పాటించి ఆత్మాహుతి చేసుకొంది."[1] చిత్తోడ్ రాణి పద్మినీ ఏ విధంగా అద్వితీయ సౌందర్యవతిగా ప్రసిద్ధి గాంచి చివరికి ఆత్మార్పణ గావించుకొందో, అదే విధంగా ఈ పద్మినీ (కుముద్) కూడ అద్వితీయ సౌందర్యవతి అని ప్రసిద్ధి గాంచి, చివరికి ఆత్మాహుతి గావించు కొంటుంది. ఈమె కథ జరిగిన స్థలం విరాటదుర్గం కాబట్టి, ఈమెను 'విరాటాకీ పద్మినీ' గా వర్మగారు ఈ నవలకు ఈ పేరు పెట్టారని భావించవచ్చు.

---

1. భారత దేశ చరిత్ర – జూనియర్ ఇంటర్మీడియట్ పాఠ్యపుస్తకం; 1971.

టూటే కాంటే శీర్షికగా గల నవలలో నాయిక నూర్‌బాయి. టూటే కాంటే అంటే 'విరిగిన ముల్లు' అని అర్థం. నూర్ బాయి మనస్సు విరిగిపోయి విరాగినిగా మారిపోయింది. అందుకే వర్మగారు ఈ నవలకు ఈ పేరు పెట్టి ఉండవచ్చు. మరొక నవల 'ముసాహిబజూ'. ముసాహిబజూ అనేది కూడ వ్యక్తి పేరు కాదు. ఆ వ్యక్తి చేసే ఉద్యోగపు హోదా. ముసాహిబజూ అసలు పేరు దలీప సింహ. అందరూ అతణ్ణి 'ముసాహిబజూ' అనే పిలుస్తారు. ఈ పేరును ఆధారంగా చేసుకొనే వర్మగారు ఈ నవలా శీర్షికను పెట్టారని చెప్పవచ్చు. ఇక 'భువన విక్రమ్' అనే శీర్షికతో రాసిన నవలలో నాయకుడు భువనుడు. భువనుని విక్రమాలు ఆ నవలలో వివరించడం వల్ల 'భువన విక్రమ్' అనే శీర్షికతో నవలను రాశారని ఊహించవచ్చు. 'గఢ్ కుండార్' నవల కథ 'కుండార్' దుర్గం చుట్టూ తిరుగుతుంది. ఖంగారుల దుర్గమే కుండార్. ఈ దుర్గం (గఢ్) లోనే బుందేలులకు, ఖంగారులకు భయంకర యుద్ధం జరిగి, ఆ యుద్ధంలో ఖంగారులు నాశనమౌతారు.

ఈ విధంగా బృందావన్‌లాల్ వర్మగారి నవలా శీర్షికల్లో ఎక్కువ శీర్షికలకు కథావస్తువు నేపథ్యం ప్రత్యక్షంగా గోచరిస్తే, అడివి బాపిరాజు గారి శీర్షికల్లో చారిత్రక కథావస్తువు పరోక్షంగా గోచరిస్తుంది.

**3.3.4. యుద్ధాలు :** బాపిరాజు తమ నవలలన్నింటిలో యుద్ధాన్ని

గురించి విపులంగా రాసి ఉన్నారు. యుద్ధం గురించి అనేక విషయాలు పేర్కొని ఉన్నారు. పురుషులే గాక స్త్రీలు కూడ యుద్ధంలో పాల్గొన్నారని, భయంకర యుద్ధాలు చేసి విజయం సాధించారని బాపిరాజు గారు రాశారు.

'హిమబిందు'లో యుద్ధ వర్ణన ఎంతో విపులంగా ఉంది. యుద్ధంలో పాల్గొనే ఏనుగులు, గుర్రాలు వాటి తిండి, వాటి రక్షణ గురించి ఆసక్తికరమైన అనేక విషయాలు పేర్కొన్నారు. సైన్యాన్ని గురించి, యుద్ధంలో ఉపయోగించే ఏనుగులు, గుర్రాల గురించి, కోటలు, బురుజులు, యుద్ధ విధానం, వ్యూహరచన గురించి విపులంగా చర్చించారు. సువర్ణశ్రీ చెల్లెలు నాగబంధునిక పురుషవేషం ధరించి సముద్రగుప్తతో సమానంగా యుద్ధం చేసినట్లు రచించారు. ఆమె యుద్ధం చేస్తూ – "ఆంధ్ర వీర రారా

అరి పైని దుముకరా!

పుష్పపురము నీదేరా!

పురంజయుడ నీవేరా!"[1] అని సైనికుల ఉత్సాహ పరచింది. ఇలా బాపిరాజు గారు తన ఆంధ్రాభిమానం చాటుకొన్నారు.

'అడవి శాంతిశ్రీ'లో పులమావి దండెత్తి వచ్చినపుడు అతనికి బుద్ధి చెప్పాలని శాంతమూలుని చెల్లెలైన శాంతిశ్రీ

---

[1] అడివి బాపిరాజు – హిమబిందు, పు: 412.

నాయకత్వంలో వీర వనితలంతా ఒక బృందంగా ఏర్పడి యుద్ధం చేస్తారు. ఈ బృందంలో అడవి శాంతిశ్రీ కూడ ప్రముఖ పాత్ర వహిస్తుంది. యుద్ధంలో పులమావి ఆమెను బంధిస్తాడు. కాని అతడు హఠాత్తుగా మరణించడం వల్ల శాంతిశ్రీకి మాన ప్రాణాలు దక్కుతాయి.

'అంశుమతి' లో కుబ్జ విష్ణువర్ధనుడు పిష్టపురాన్ని జయించ డానికి చేసిన వ్యూహ నిర్మాణం, చూపించిన ధైర్య సాహసాలు కొని యాడ దగినవి.

ఇక 'గోనగన్నారెడ్డి' నవలలో అడుగడుగునా యుద్ధాలే. గోనగన్నారెడ్డి కాకతీయ సామ్రాజ్య సుస్థిరతకు, దేశంలో అంతర్గతంగా దాగి ఉన్న శత్రువులను అణచివేయడంలో నిస్వార్థంగా గణపతిదేవ చక్రవర్తికి, రుద్రమదేవికి సాయపడతాడు. అతడి ప్రతిభ అనన్య సామాన్యం. చాళుక్య వీరభద్రుడు నాలుగు వేల సైన్యంతో చుట్టుముట్టిన, హరిహర మురారి దేవుల సైన్యాన్ని తన కొద్ది సేనలతో ఓడించి, వారిద్దరిని సంహరించి, రుద్రమదేవిని కాపాడుతాడు. ఇక రుద్రమదేవి, అన్నాంబికలు పురుషవేషం ధరించి భయంకర యుద్ధాల్లో పాల్గొంటారు. దేవగిరి యాదవరాజు మహాదేవుడు పెద్ద సైన్యంతో ఓరుగల్లు ముట్టడించి నప్పుడు రుద్రమదేవి, చాళుక్య వీరభద్రుడు, గోనగన్నారెడ్డి మొదలైన వీరుల సహాయంతో, భయంకర యుద్ధంలో యాదవరాజును ఓడించి, గోదావరి తీరం వరకు తరిమి తరిమి కొట్టింది. ఓరుగల్లు రక్షణకు కంపకోటలు, మట్టికోటల కట్టడం, కోట బురుజులపై సైనిక విన్యాసాలు

వంటి కళ్ళకు కట్టినట్లున్న వర్ణనలు చదువుతుంటే ఒళ్ళు గగుర్పాటు చెంది ఒక గొప్ప జానపద చలన చిత్రం చూచిన భావన కలుగుతుంది.

ఇక బృందావన్‌లాల్ వర్మగారు ఇంచు మించు తమ చారిత్రక నవల లన్నింటిలోనూ యుద్ధ వర్ణనలు గావించి ఉన్నారు. యుద్ధ పద్ధతి విషయమై కొంత ప్రస్తావించి ఉన్నారు. యుద్ధంలో గుర్రాలను మహమ్మదీయులు అధికంగా ఉపయోగించే వారు. హిందువుల వద్ద అధికంగా గుర్రాలు ఉండేవి కావు. కాని కొన్ని నవల్లో హిందువులు కూడ గుర్రాలనెక్కి యుద్ధాలు చేశారని రాశారు. పురుషులతో సమంగా స్త్రీలు కూడ యుద్ధాలు చేశారని కొన్ని నవల్లో బృందావన్ లాల్ వర్మగారు కూడ ప్రస్తావించారు.

'భువన విక్రమ్' నవలలో నీలుడు, మేఘుడు మొదలైన వారు, రోమకుడు సమర్థవంతమైన రాజు కాదని ప్రజలను నమ్మించి, అందరూ కలిసి కుట్రపన్ని అతణ్ణి పదవీ భ్రష్టుణ్ణి చేస్తారు. కానీ ఈ నవలలో ఎక్కడా యుద్ధాలు జరిగినట్లు కనిపించదు.

'గఢ్ కుండార్' నవలలో ఖంగారులకు, బుందేలులకు మధ్య భయంకర యుద్ధం జరిగింది. ఖంగారు జాతికి చెందిన నాగదేవుడు బుందేల్ కన్య హేమవతిని ప్రేమిస్తాడు. కాని ఖంగారులు తమకంటే తక్కువ జాతి వారని హేమవతి నాగదేవుని చులకనచేసి తిరస్కరిస్తుంది. అలాగే అగ్నిదత్తుడు నాగదేవుని చెల్లెలైన మానవతిని ప్రేమిస్తాడు. హేమవతిచే అవమానం పాలైన నాగదేవుడు తన చెల్లెలైన మానవతిని అగ్నిదత్తుడు ప్రేమిస్తున్నాడన్న విషయం తెలిసి తీవ్రంగా మందలించి, అవమానిస్తాడు. అగ్నిదత్తుడు ఖంగారులను

నాశనం చేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. నాగదేవుడు హేమవతిని అపహరించాలని కుట్ర పన్నుతాడు. కోపోద్రిక్తులైన బుందేలులు ఖంగారులపై యుద్ధం ప్రకటిస్తారు. ఈ యుద్ధంలో ఖంగారులు నాశనం అవుతారు. ఈ యుద్ధాన్ని వర్మగారు విపులంగా వర్ణించారు.

'మృగనయని' లో రాయి గ్రామం దగ్గర ఉన్న నరవర్ దుర్గాన్ని అటల్, లాఖీలు రక్షిస్తూ ఉంటారు. సికిందర్ లోడి ఆ దుర్గాన్ని ఆక్రమించుకోవాలని దండెత్తి వచ్చినప్పుడు, దుర్గ రక్షణకై శత్రువులతో పోరాడి మరణించి తమ ప్రభుభక్తిని నిరూపించుకొంటారు. తర్వాత మానసింహుడు యుద్ధరంగం ప్రవేశం చేసి శత్రువుల్ని ఓడిస్తాడు.

'విరాటాకీ పద్మినీ' నవలలో రెండు చోట్ల యుద్ధ వర్ణనలు ఎక్కువగా ఉన్నాయి. దలీప నగర రాజు నాయకు సింహుడు తక్కువ మంది అనుచరులతో పాలర్ గ్రామం సందర్శించి వచ్చేటప్పుడు అలీమర్దాన్ సేన్లు అతనితో యుద్ధం చేస్తాయి. నాయకసింహుడు ఇక అంతమై పోతాడనే పరిస్థితుల్లో బుందేల్ వీరుడైన దేవీసింహుడు పెండ్లి కుమారుడుగా పల్లకిలో వస్తూ పరిస్థితి చూచి, పల్లకి దిగి వచ్చి అలీమర్దాన్ సేనతో యుద్ధం చేసి వారిని తరిమివేసి నాయకసింహుని రక్షిస్తాడు. తర్వాత అలీమర్దాన్ కుముద్‌ను అపహరించుకు పోవాలని పెద్ద సేనతో విరాట దుర్గంపై దండెత్తుతాడు.

దుర్గాన్ని దాంగీ సేనలు రక్షిస్తూ ఉంటారు. దాంగీ సేనలకు సహాయంగా దేవీసింహుడు కుముద్‌ను రక్షించాలని తన సేనతో వస్తాడు. కాని కుంజర సింహుడు అపోహపడి దేవీసింహునితో యుద్ధం చేస్తాడు. ఆ యుద్ధంలో

కుంజర సింహుడు చనిపోతాడు. అలీ మర్దాన్ కుముద్‌ను చేజిక్కించు కోవాలని చూస్తాడు. కాని కుముద్ అలీ మర్దాన్‌కు చిక్కకుండ బేతవా నదిలో పడి మరణిస్తుంది. అలీమర్దాన్ దేవీ సింహునితో యుద్ధం చేయకుండా, సంధి చేసుకొని వెళ్ళి పోతాడు.

'టూటే కాంటే'లో ఈరాన్ దేశస్థుడైన నాదిర్‌షా అప్పటి ఢిల్లీ పాలకుడైన మహమ్మద్‌షాపై దండెత్తివచ్చాడు. ఢిల్లీలో భయంకర రక్తపాతం జరిగింది. వీధులన్నీ శవాలతో నిండిపోయాయి. చివరకు నాదిర్‌షా నాలుగువేల నాట్యకత్తెలను, నెమలి సింహాసనాన్ని, నూరుకోట్ల విలువగల సంపదను కొల్లగొట్టి 'ఈరాన్'కు తరలించుకొని వెళ్ళి పోతాడు. ఈ భయంకర రక్తపాతాన్ని వర్మగారు గగుర్పాటు కలిగించే టట్లు వివరించారు.

'అహిల్యాబాయి'లో 'రామ్‌పురా', 'మీన్‌పురా' ప్రాంతంలో చంద్రావత్ రాజపుత్రులు విద్రోహం చేస్తే, అహిల్యాబాయి గొప్ప సైన్యంతో వెళ్ళి వాళ్ళను అణచివేస్తుంది. ఈ యుద్ధంలో తుపాకులు, పిస్తోళ్ళు, ఫిరంగులు వాడినట్లు రచయిత రాశారు.

'కచనార్'లో ధామోనీ ని కుట్రతో అపహరించిన మానసింహునికీ ధామోనీ పూర్వరాజు దలీప సింహునికి మధ్యయుద్ధం జరుగుతుంది. దలీప-సింహునకు సాధు సమాజం, గోసాయిల సేన సాయపడుతుంది. మానసింహుడు ఓడిపోతాడు. యుద్ధంలో గాయపడిన దలీప సింహునకు పూర్వస్మృతి వస్తుంది.

'ముసాహిబజు' నవలలో 'కేరువా' రాజ్యాన్ని శత్రురాజులు ఆక్రమించుకోవడానికి వస్తారని తెలిసి, రాజుపై అలిగి వెళ్ళిపోయిన 'ముసాహిబజు' తన అనుచరులతో కేరువా రాజ్యానికి తిరిగి వచ్చి యుద్ధంలో పాల్గొని శత్రువులను నాశనం చేస్తాడు.

'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి'లో ఆంగ్లేయులపై వీరవనిత లక్ష్మీబాయి చేసిన యుద్ధాన్ని ఎన్నో కోణాల్లో వర్ణించారు రచయిత. చివరకు 'జనరల్ రోజ్' గ్వాలియర్ పై దండెత్తుతాడు. రాణి తన దత్తపుత్రుడు దామోదర రావును వీపున కట్టుకొని గుర్రంపై కూర్చొని, కత్తిపట్టి సాహసం, నైపుణ్యాంతో యుద్ధంచేసింది. కాని ఆ యుద్ధంలో రాణి వీరస్వర్గం అలంకరిస్తుంది. దేశ స్వాతంత్ర్యం కోసం చివరి వరకు పోరాడి అసువులు బాసిన ధన్యజీవి లక్ష్మీబాయి. ఈమె చరిత్రను, యుద్ధం చేసిన రీతిని ఒడలు గగుర్పాటుచే రీతిలో వర్మగారు వర్ణించారు. కాని ఈ యుద్ధంలో బ్రిటిష్ సేనలు ఫిరంగులను, నవీన ఆయుధాలను వాడబట్టి గ్వాలియర్ సేన ఓడిపోయింది.

పై విధంగా అడివి బాపిరాజుగారు, బృందావన్‌లాల్ వర్మగారు తమ చారిత్రక నవలలన్నింటిలోను యుద్ధాన్ని గురించి విస్తారంగా రాశారు. యుద్ధంలో స్త్రీలు కూడ పాల్గొని సాహసోపేతంగా యుద్ధం చేసినట్లు వర్ణించారు. యుద్ధాలలో ఏనుగును, గుర్రాలను వాడినట్లు ఇరువురూ రాశారు. ఇలా వీరిద్దరి యుద్ధ వర్ణనల్లో ఎన్నో సామ్యాలున్నా కొన్ని వైషమ్యాలు కూడ లేకపోలేదు.

బాపిరాజు గారి యుద్ధకాలం నాలుగో శతాబ్దం నుండి పన్నెండో శతాబ్దం వరకు. అందువల్లే రథాలు, గుర్రాలు, ఏనుగులు, కత్తులు, ఈటెలు, విల్లంబులు, మొసళ్ళు, కందకాలు, కంపకోట, మట్టికోట మొదలైన పూర్వయుద్ధ పరికరాలు, పరిసరాలు మనకు రాజుగారి నవలల్లో తారస పడతాయి.

కాని వర్మగారి యుద్ధకాలం 14, 18 శతాబ్దాల మధ్యకాలం (ఒక్క భువనవిక్రమ్ తప్ప) అందుకే వారి రచనల్లో కందకాలు, మొసళ్ళు, కంపకోట, మట్టికోట మొదలైనవి లేవు. తుపాకులు, ఫిరంగులు, పిస్తోళ్ళు ఎక్కువ. కత్తులు, ఖడ్గాలు, ఏనుగులు, గుర్రాలను వీరూ వర్ణించారు. కాని వీరు రథాల గురించి ప్రస్తావించినట్లు కనబడదు.

**3.3.5. నవలాంతం:** బాపిరాజు గారు సుఖాంతంగా ఉండే చరిత్రకల్గిన నవలల్నే తమ కథావస్తువులుగా గ్రహించారు. 'రుద్రమదేవి' కాకుండా 'ప్రతాపరుద్రుని' కథ రాసి ఉంటే కథ దుఃఖాంతం అయ్యేది. కాని రాజుగారికి దుఃఖాంత కథలు ఇష్టంలేదో ఏమో అన్నీ సుఖాంత కథలే గ్రహించారు. వారి కథానాయకుడు, నాయిక, ఉపనాయకుడు, ఉపనాయిక ఎవ్వరూ యుద్ధంలో మరణించినట్లు కనబడదు. ఆఖరుకు శత్రురాజులు కూడ తరిమికొట్ట బడ్డారే గాని ఎక్కడో ఒక్కరిద్దరు తప్ప ఎక్కువ మంది చంపబడినట్లు లేదు. 'ఫులమావి' కూడ తనంతట తానే చచ్చాడు, కాని శత్రువులెవరూ చంపలేదు.

బృందావన్ లాల్ వర్మగారు కొన్ని చారిత్రక నవలల్ని దుఃఖాంతం

చేశారు. 'విరాటాకీ పద్మినీ', 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి', 'గఢ్ కుండార్' దుఃఖాంతాలైనా నాయికా నాయకులు వీరులుగ, వీరస్వర్గం అలంకరించినట్లే రాశారు. 'టూటే కాంటే' కథ దుఃఖాంతం కాకపోయినా కరుణరస పూరితమైనది. కథాంతంలో అక్కడక్కడ విషాదాన్ని వ్యక్తీకరించడం ద్వారా వర్మగారు అడివి బాపిరాజు గారితో విభేదిస్తారు.

### 3.3.6. జౌహారు వ్రతం :

రాజులు యుద్ధంలో పరాజయం పొందనున్నారనే వార్త తెలిసి అంతఃపుర స్త్రీలు అగ్నిలో దూకి ఆత్మాహుతి గావించుకునే వ్రతాన్ని జౌహారు వ్రతం అంటారు. బాపిరాజు గారి నవలల్లోని స్త్రీలు, వర్మగారి నవలల్లోని కొన్ని స్త్రీపాత్రల వలె జౌహారు వ్రతం పాటించినట్లు కనబడదు. దీనికి కారణం విరోధులయిన స్త్రీలను కూడ గౌరవంగా చూచేవారని, ఓడిన శత్రువుల భార్యల మానప్రాణాలను గెలిచిన చక్రవర్తులు పరిరక్షించేవారని బాపిరాజు గారి నవలల వల్ల అర్థమౌతుంది. కాని నానాటికి స్వార్థం పెరిగినందువల్ల స్త్రీల మానప్రాణాలకు రక్షణ లేకనే వారు ఆత్మార్పణకు సిద్ధమయ్యే వారని బృందావన్‌లాల్ వర్మగారి నవలల వల్ల అర్థమౌతుంది. ఇది కాలానుగుణంగా వచ్చిన మార్పు. జౌహర్ అనే పదానికి రాజపుత్రస్త్రీలు తమ పతులను యుద్ధమునకు పంపిన పరాజయము కల్గినప్పుడు అగ్నిలో దూకి భస్మమగు వ్రతము అని అర్థం ఉంది.[1] వర్మగారు 'విరాటాకీ పద్మినీ' నవలలో, దాంగీ సైనికులు అలీ మర్దాన్, దేవీసింహుల సైన్యాన్ని ఎదుర్కోలేమని తలచినప్పుడు జౌహర్ వ్రతాన్ని అవలంబించారని

---

-తెలుగు కోష్ (ఒక్కనటి) – డా॥ రావలి సూర్యనారాయణ మూర్తి -, పు:217.

వర్మ గారు రాశారు. ఈ విషయాన్ని కుముద్ తండ్రి, నరపతి కుముద్‌తో "అందరు దాంగీయులు కాషాయ వస్త్రాలు ధరించి ఉత్సాహంగా గంతులు వేస్తూ తిరుగుతున్నారు"[1] అని చెపుతాడు. అదే సందర్భంలో కొంత సేపైన తరువాత కుంజర సింహుడు కుముద్ దగ్గరికి వచ్చి "ముసల్మానులు చొచ్చుకొని వస్తున్నారు. మన సైనికులందరూ జౌహరు వ్రతాన్ని అవలంబించారు"[2] అని అంటాడు. అందుకు 'కుముద్' నవ్వుతూ, "అందరూ జౌహర్ వ్రతాన్ని అవలంబించారా! మంచిపనే చేశారులే"[3] అని విరక్తిగా అంటుంది. పై మూడు వాక్యాల వల్ల స్త్రీలే కాక ఆ స్త్రీలను పరిరక్షించే పురుషులు, సైనికులు కూడ జౌహర్ వ్రతం పాటించేవారని అర్థమౌతుంది. ఇంకా మృగనయనీ లోనూ, గఢ్ కుండార్ లోనూ జౌహర్ ప్రస్తావన ఉంది.

**3.3.7. సతీ సహగమనం :** అడివి బాపిరాజు గారు, బృందావన్‌లాల్ వర్మ గారు సతీసహగమన ప్రస్తావనను వారి వారి నవలా కథావస్తువుల్లో ప్రస్తావించారు.

వర్మగారి 'విరాటాకీ పద్మినీ' నవలలో దలీప నగర రాజైన నాయక సింహుడు అస్వస్థుడైనప్పుడు అతని పెద్ద భార్య, దాసీ పుత్రుడైన కుంజర సింహునితో ఇలా చెప్పింది. "రాజుకు నానాటికి జ్వరతీవ్రత ఎక్కువ అవుతున్నది. బహుశ అతడు చనిపోతే నేను సతీ సహగమనం చేస్తాను"[4] అని అంటుంది. ఇక్కడ సతీ ప్రస్తావన జరిగింది.

---

1. విరాటాకీ పద్మినీ – బృందావన్ లాల్ వర్మ - పు: 354.
2. పైదే., పు: 362.
3. పైదే., పు: 362.
4. పైదే., పు: 44.

ఇక వర్మగారి 'అహిల్యాబాయి' నవలలో అహిల్యాబాయి కుమార్తె ముక్తాబాయి, భర్త అయిన యశ్వంతరావు మరణించగానే భర్తతో సహగమనం చేస్తుంది. అహిల్యాబాయికి తీర్థయాత్రలు చేసే టప్పుడు తన అల్లుడు చనిపోవడం, తన పుత్రిక ముక్తాబాయి సతీసహగమనం చేయడం అనే వార్త తెలుస్తుంది."[1]

అడివి బాపిరాజు గారు కూడ 'హిమబిందు' నవలలో ఈ ప్రస్తావన తెచ్చారు. "స్థాలతిష్యుని కుమారుడు నందిదత్తుడు (అమృతపాదార్హంతులు) పడవ ప్రమాదంలో చనిపోయాడని భావించి అతని భార్య సతీ సహగమనం చేసిందనే విషయాన్ని స్థాలతిష్యుల వారే తన శిష్యులతో స్వయంగా చెప్పినట్లు రాశారు. "మహా పండితుడు సుకుమారరత్నము దివంగతుడైనాడు. మహా పతివ్రత నాకోడలు పతి చిహ్నతో సహగమనము చేసినది" అని చెప్తారు.

బాపిరాజు గారు 'అడవి శాంతిశ్రీ' నవలలో కూడ సహగమన ప్రస్తావన తెచ్చారు. పులమావి మరణించగానే అతడి పెద్ద భార్య (మహారాణి), చిన్న రాణితో "చెల్లీ! రా! మనం భర్తతో సహగమనం చేసే సన్నాహాలు చేసుకోవాలి"[3] అంటుంది. కాని శాంతిశ్రీ ఆమెతో "మహారాణీ నీవు నిండు చూలాలివి సహగమన చితాగ్ని ఎలా అధివసించగలవు? అది దోషం. నువ్వు శిశుహత్యాదోషానికి పాలుపడతావా?"[4] అంటూ వారిస్తుంది.

---

1. అహిల్యాబాయి – బృందావన్‌లాల్ వర్మ., పు: 167.
2. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 112.
3. అడవిశాంతిశ్రీ – అడివి బాపిరాజు., పు: 306
4. పైదే., పు: 307

బాపిరాజు గారు క్రీ.పూ. 3వ శతాబ్దం, క్రీ.శ. 2వ శతాబ్దంలో జరిగిన సతీసహగమన సంఘటనను ప్రస్తావించారు. వర్మగారు 18వ శతాబ్దంలో జరిగిన సంఘటనను ప్రస్తావించారు. అంటే ఈ సాంఘిక దురాచారం శతాబ్దాలు మారినా మన దేశంలో నశించలేదని, ఈనాటికీ సహగమనం చేసేవారు ఒకరో ఇద్దరో కనబడుతున్నారనే తెలుస్తున్నది. ఇటీవల 'రాజస్థాన్'లోని దేవరాల గ్రామంలో రూప్ కన్వర్ అనే స్త్రీ సతీసహగమనం చేసినట్లు మనకందరికీ తెలిసిన విషయమే. ఎంతగానో నాగరికత అభివృద్ధి చెందినప్పటికీ ఈ అనాగరిక చర్య ఇంకా సమాజంలో సమూలంగా అంతరించి పోలేదనే విషయం గమనార్హం.

**3.3.8. మతం :** బాపిరాజుగారి నవలల కథావస్తువు ప్రాచీనాంధ్ర దేశానికి చెందింది. కనుక ఆనాటి మత పరిస్థితులు వారి నవలల్లో ప్రతిబింబించాయి. ఏ శాసన వ్యవస్థ అయినా, వర్ణాశ్రమాది సాంఘిక వ్యవస్థ అయినా ఆనాటి మతంతో ముడిపడి ఉంటుంది. ఆనాడు వైదిక, జైన, బౌద్ధ మతాలు మూడు ఆంధ్రదేశాన్ని ఏలాయి. ముఖ్యంగా వైదిక, బౌద్ధ మతాలు ప్రజల్లోకి చొచ్చుకొని వెళ్ళాయి. కాబట్టి మత సంఘర్షణలు తప్పనిసరిగా ఉండే అవకాశముంది. ఈ మతం గురించి, మత సంఘర్షణ గురించి బాపిరాజుగారు హిమబిందు, అడవి శాంతిశ్రీ, గోనగన్నా రెడ్డి నవలల్లో చర్చించారు. ఇంకా వైదిక మతంలోని శైవ-వైష్ణవ భేదాల, వాటి సంఘర్షణల గురించి 'గోనగన్నారెడ్డి' నవలలో చర్చించారు. 'అంశుమతి'లో మత విషయం అంతగా చర్చించ లేదు.

బాపిరాజు గారి కథావస్తువుల కాలం ప్రాచీనాంధ్ర దేశానికి చెందింది కాబట్టి ఆ నాడు క్రైస్తవ, మహమ్మదీయ మతాలు లేవు. అందుకే ఆ మతాల ప్రస్తావన రాలేదు. రుద్రమదేవి కాలంలో కూడా కాకతీయ రాజ్యంపై మహమ్మదీయుల ప్రభావం లేదు. తర్వాత రుద్రమదేవి దౌహిత్రుడు, ప్రతాపరుద్రుడు తురుష్కుల చేతిలో బందీ అయి మరణించాడు. అప్పుడు మహమ్మదీయుల ప్రస్తావన జరిగింది. కాబట్టి బాపిరాజు గారు తమ చారిత్రక నవలల్లో ఎక్కడా మహమ్మదీయ, క్రైస్తవ మతాల ప్రసక్తి తేలేదు. చారిత్రకంగా తెచ్చే అవకాశం లేదు.

'హిమబిందు' నవలలో వైదిక బౌద్ధ మతాల సంఘర్షణా స్థాలతిష్యులు అమృత పాదార్పాతుల ద్వారా ప్రతిపాదించారు. రాజులు బౌద్ధ మతావలంబులైనా, వైదిక మతాన్ని ఆచరించే ప్రజల్ని పీడించలేదు. పరమత సహనం చూపారు. 'అంశుమతి' నవలికలో మత విషయం గురించి బాపిరాజు చర్చించలేదు. ఈ నవలిక ఉన్నత పాఠశాల విద్యార్థులకు పఠనీయ గ్రంథానికి అనువుగా రచించడం వల్ల మత ప్రస్తావన ఎక్కువగా రాలేదు. అంతేగాక ఈ నవల తూర్పు చాళుక్య యుగానికి చెందింది. ఆ నాటికి బౌద్ధమతం తన ప్రభావాన్ని కోల్పోయింది. 'గోనగన్నారెడ్డి' నవలలో శైవ వైష్ణవ మతాల సంఘర్షణ ఉన్నప్పటికి శైవమతానికే ఆ నాటి ప్రజలు ప్రాధాన్యం ఇచ్చారని నవల ద్వార వ్యక్తమౌతుంది.

బృందావన్ లాల్ వర్మగారి నవలల్లో 'భువన విక్రమ్', 'విరాటాకీ పద్మిని', 'టూటే కాంటే', 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' నవలల్లో మత ప్రస్తావన

మిగిలిన నవలల కంటే అధికంగా ఉంది. బౌద్ధ జైన మతాలు ప్రాబల్యం వీరి నవలల్లో కనిపించదు. అంటే మధ్యయుగ కాలానికి బౌద్ధ జైన మతాలు తమ ప్రాభవాన్ని కోల్పోగా హిందూ మతంతో మహమ్మదీయ, క్రైస్తవమతాలు పోటీబడ్డాయి; ఘర్షణలకు దిగాయి. ఈ విషయాలను గురించి వర్మగారి నవలల ద్వారా తెలుసుకుందాం.

'భువన విక్రమ్' లో చక్రవర్తి రోమకుడు వైదిక మతాభిమాని. శూద్రుడైన కపింజలుడు తపస్సు చేస్తాడు. వైదిక మతానుసారం శూద్రునికి తపస్సు చేసే అధికారం లేదు. తన రాజ్యంలో సంభవించిన కరువు కాటకాలకు కపింజలుని తపస్సే కారణమని తలచి రోమకుడు అతణ్ణి చంపడానికి ప్రయత్ని స్తాడు. కాని మానవత్వం పెంచుకున్న అతని కుమారుడు భువనుడు రోమకుణ్ణి వారిస్తాడు. ఈ నవల వైదిక యుగానికి చెందింది. కాబట్టి వర్మగారు సత్యం, శాంతి, భూతదయ, శమదమాదులను తమ నవలలో ప్రతిపాదించారు.

'మృగనయనీ' లో శైవ వైష్ణవ మతప్రసక్తి విజయ జంగం కు వైష్ణవాచార్యునికి మధ్య జరిగిన వాదంలో వ్యక్తమవుతుంది. బోధన్ పండితుడు సికిందర్ లోడీ దర్బారులో వైదిక మతం గొప్పదని వాదించగా, మౌల్వీయుల ఆజ్ఞ ప్రకారం అతనికి సికిందర్ లోడీ మరణదండన విధిస్తాడు.

'విరాటాకీ పద్మినీ' నవలలో హిందూమతం కొంత వెర్రితలలు వేసినట్లు వర్మగారు వ్యక్తం చేశారు. పాలర్ గ్రామంలో పుట్టిన కుముద్ ను ప్రజలు దేవీ అవతారంగా కొలిచారు. మహమ్మదీయులు హిందువుల నమ్మకాన్ని దెబ్బతీయాలని చూశారు. అలీ మర్దాన్ సేన పాలర్ గ్రామంలో మందిరాలను

ధ్వంసం చేశారు. అలీమర్దాన్ కుముద్ దేవీ అవతారం కాదని నిరూపించా లని చూశారు.

'టూటే కాంటే' నవలలో మహమ్మదీయురాలైన 'నూర్ బాయ్' 'మహమ్మద్ షా' ఆస్థాన నర్తకి. ఆమె కృష్ణభక్తురాలై బృందావనంలో తన చరమ జీవితం గడిపినట్లు బృందావన్ లాల్ వర్మగారు రాశారు. మధ్య యుగంలో మహమ్మదీయుల దండయాత్రలతో సామాన్యప్రజలు భయభ్రాంతులై ఉండేవారు. వారు చేసే హత్యాకాండల వల్ల దేశంలో శాంతి భద్రతలు నశించాయి. ఆనాటి మహమ్మదీయ శాసకులు మతాచార్యుల చేతుల్లో కీలుబొమ్మలై ఉండేవారు.

'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి'లో హిందువులు, మహమ్మదీయులు కలసి క్రైస్తవులను ఎదుర్కొన్నారు. హిందువులకు గోవు పవిత్రమైనది. ముస్లింలకు వరాహం అసహ్యం. ఈ రెండు జంతువుల కొవ్వులతో తయారైన తూటాలను కాల్చి ప్రయోగించేదానికి హిందువులు, ముస్లింలు తిరస్కరించారు. ఈ కారణమే సిపాయిల కలహానికి నాందియై, భారత దేశ స్వాతంత్ర్య సమరానికి తొలిమెట్టుగా మారింది. కొంత మంది హిందూ సైనికులను క్రైస్తవులుగా మార్చడం వల్ల భారత సైనికుల్లో బ్రిటిష్ వారిపై ఎనలేని అసంతృప్తి నెలకొనింది. మిగిలిన నవలల్లో వర్మగారు మత ప్రస్తావన అంతగా తేలేదు.

ఈ విధంగా అడివి బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మగారు తమతమ చారిత్రక నవలల్లో హిందూ మతానికి, భిన్న మతాలకూ మధ్య జరిగిన సంఘర్షణ గురించి వర్ణించారు.

భారతీయులు శాంతి కాముకులు. బౌద్ధ జైన మతాల వల్ల హిందూమత

ప్రభావం తగ్గినప్పుడు పరమత సహనం చూపారు. గౌతమ బుద్ధుడు, మహావీర జినుడు హిందువులే అని, బౌద్ధ జైన మతాలు వైదికమతంలో అంతర్భాగమనీ, అందుకే భగవంతుని దశావతారాల్లో బుద్ధావతారం ఒకటిగా చేర్చి, ఆనాటి మత సంఘర్షణాల్లో వైదికమతం నిలిచేటట్లు చేశారు. శివకేశవులకు అభేధం కల్పించారు. లౌకికవాదం, పరమత సహనం ద్వారా సర్వమత సమానత్వాన్ని ప్రతిపాదించి భారత దేశాన్ని లౌకిక రాజ్యంగా రూపొందించారు. ఈ ఇద్దరు రచయితలు తమ రచనల్లో ఈ రకంగా మత ప్రస్తావన చేసి వైదిక మతం గొప్పదనాన్ని ప్రతిపాదించారు. ఆయా కథా వస్తువుల కాలాన్ని బట్టి జైన బౌద్ధ మతాలను బాపిరాజు గారు, మహమ్మదీయ క్రైస్తవ మతాలను వర్మగారు ప్రస్తావించడమే వైషమ్యం.

**3.3.9. కళలు ;** ఇద్దరు నవలా కారులు తమ నవలల్లో లలిత కళలను ప్రస్తావించి ఉన్నారు. బాపిరాజు గారు కళా పిపాసి. కాబట్టి హిమబిందులో ధర్మనందినిని, అతని కొడుకైన సువర్ణశ్రీని గొప్ప శిల్పులుగా సృష్టించారు. శాత వాహనుల కాలంలో స్త్రీలు సంగీత సాహిత్యాల్లో మంచి పరిజ్ఞానం కల్గి ఉన్నట్లు చరిత్ర వ్యక్తం చేస్తున్నది. హిమబిందు, చంద్రబాలల ద్వారా ఈ విషయాన్ని నిరూపించారు. వీరికి శాస్త్ర పరిజ్ఞానంతో పాటు మధురంగా పాడగలిగే నైపుణ్యం ఉంది. 'అడవి శాంతిశ్రీ'లో శాంతి శ్రీని, 'గోనగన్నారెడ్డి'లో కుద్రమదేవిని, అన్నాంబికదేవిని గొప్ప విదుషీ మణులుగా చిత్రించారు.

వర్మగారి నవలల్లో వాస్తుకళ, చిత్రకళ, సంగీతకళ, శిల్పకళ మొదలైన వాటిని గురించి ప్రస్తావన ఉంది. మృగనయనీ మధురంగా పాడగలిగేది.

ఆమె గ్వాలియర్ రాజైన మానసింహుని వివాహమాడిన తరువాత బైజునాథ్ వద్ద శాస్త్రీయ సంగీతం నేర్చుకొనింది. ఆమె సహకారంతో బైజూనాథ్ గూజరీ టోడీ, మాల్ గూజరీ, బాహార్ గూజరీ, మంగల్ గూజరీ అనే క్రొత్త క్రొత్త రాగాలను కల్పించాడు. మానసింహుడు వాస్తుకళలపై అభిమానం కలవాడు కాబట్టి ఆయన క్రొత్త క్రొత్త భవనాలను నిర్మించాడు.

'టూటే కాంటే' లోని నర్తకి నూర్ బాయి చక్కగా నాట్యం చేసేది. బృందావనంలో తన సంగీత, నాట్యశాస్త్ర నైపుణ్యాన్ని ప్రదర్శించింది.

**3.3.10. ఉత్సవాలు - పండుగలు :** భారత దేశంలో ఆయా కాలాల లో ఉత్సవాలు విరివిగా జరిగేవి. దసరా, దీపావళి, హోలీ, సంక్రాంతి మొదలైన ఉత్సవాలు ఇంచుమించు భారతదేశంలో అంతట జరుపుతుంటారు.

బాపిరాజు గారు, అడవి శాంతిశ్రీలో వసంతోత్సవాలను ఘనంగా జరుపుకొన్నట్లు చిత్రించారు. గోనగన్నారెడ్డిలో దసరా ఉత్సవాలకు ప్రాధాన్యత ఉంది. సాధారణంగా బాపిరాజుగారి చారిత్రక నవలలన్నింటిలోనూ చైత్రయాత్ర తరువాత ఉత్సవాలను ఘనంగా జరుపుకొనే వారని రాశారు.

వర్మగారు మృగనయనీ లో రాయి గ్రామంలోని ప్రజలు హోలీ ఉత్సవాన్ని జరుపుకొన్నట్లు చిత్రించారు. రాజకీయ బీభత్సాలవల్ల ప్రజలకు వైభవంగా ఈ ఉత్సవాన్ని జరుపుకొనేటందుకు అవసరమైన రంగులు లభించేవి కావు. కాబట్టి వారు పేడను, బురదను నీళ్లలో కలిపి చల్లు కొనే వారు.

గ్వాలియర్‌లో సైనికులు హోలీ పండుగను చాలా అసభ్యంగా

జరుపుకొన్నట్లు, ఆ దృశ్యాన్ని చూచి మృగనయనికి ఏవగింపు కలిగినట్లు వర్మగారు రాశారు.

'గఢ్ కుండార్' నవలలో అక్షయ తృతీయ అనే ఉత్సవాన్ని గురించి చెప్పారు.

'ఝాన్సీరాణి' లో కుంకుమ ఉత్సవం గురించి వర్ణించారు.

మన పూర్వీకులు ప్రజల్లో చైతన్యాన్ని, ఆనందాన్ని, సుహృద్భావాన్ని కలిగించేటందుకు, సౌందర్య దృష్టిని అలవరించేందుకు ఈ ఉత్సవాలను, పండుగలను కల్పించారేమో అని అనిపిస్తుంది. ప్రతి ఉత్సవం వెనుక ఒక అమూల్యమైన సందేశం ఉన్నట్లు తెలుస్తుంది.

**3.3.11. రాజకీయ కుట్రలు:** చక్రవర్తుల, రాజుల రాజ్యాధికారం కోసం ఇతరులు పన్నే కుట్రలు ఇద్దరు నవలాకారులూ పేర్కొన్నారు

బాపిరాజు గారు 'హిమబిందు' నవలలో రాజకీయ కుట్రలను చక్కగా వర్ణించి ఉన్నారు. స్థాలతిష్య మహార్షి, మాళవులు, శివస్వాతి, సుశర్మ మొదలైన వారితో రహస్యంగా మంతనాలు సాగిస్తూ చక్రవర్తికి వ్యతిరేకంగా కుట్రలు పన్నుతుంటాడు. స్థాలతిష్య మహార్షి శ్రీముఖ శాతవాహనుని రెండవ కుమారుడైన మంజుశ్రీని చక్రవర్తి చేసి అతని ద్వారా ఆర్షమతాన్ని వ్యాప్తి చేయాలనే ఉద్దేశంతో మంజుశ్రీని అపహరించి దాచిపెట్టాడు. ఇంకా శ్రీముఖ శాతవాహనుని పెద్ద కుమారుడైన శ్రీకృష్ణ శాతవాహనుణ్ణి చంపాలనే ఉద్దేశంతో తన మనుమరాలైన చంద్రబాలను విషకన్యగా మార్చి అతనిపై ప్రయోగించాలని కుట్ర పన్నుతాడు

'అడవి శాంతిశ్రీ' లో ఫ్రులమాని శాంతిమూలుని రాజ్యాన్ని అడవి శాంతిశ్రీని హస్తగతం చేసుకోవాలని మారువేషాలు వేసి, అనేక విధాలుగా పన్నాగాలు పన్నుతాడు. అలాగే 'అంశుమతి' లో దానార్ణవుడు, కుబ్జ విష్ణువర్ధనుని ఓడించి అంశుమతిని తనదాన్నిగా చేసుకోవాలని పథకం వేస్తాడు.

'గోనగన్నా రెడ్డి' లో రుద్రమదేవి రాజ్యాన్ని పాలించడం ఇష్టం లేని చాలమంది సామంతరాజులు ఆమెకు వ్యతిరేకంగా కుతంత్రాలు పన్నుతారు.

బృందావన్‌లాల్ వర్మగారు 'భువన విక్రమ్' నవలలో రాజైన రోమకుణ్ణి, మేఘుడు, నీలుడు మొదలైనవారంతా కలసి కుట్రపన్ని, రాజును పదవీ భ్రష్టుణ్ణి చేస్తారు. ఇంతేగాక నీలుడు, అతని కూతురు హిమానీ ఇద్దరూ కలసి రోమకుడి కుమారుడైన భువనుణ్ణి పెండ్లి సందర్భంలో హత్య చేయాలని పన్నాగం పన్నుతారు.

'గఢ్ కుండార్' నవలలో నాగదేవుడు, తనను వరించలేదన్న కోపంతో హేమవతినీ, అగ్నిదత్తుడు తనను ప్రేమించినా తల్లి తండ్రులను ఎదిరించలేక తనతో పారిపోయి రావడానికి తిరస్కరించిన మానవతిని మోసంతో అపహరించాలను కొంటారు. బుందేలులు ఖంగారు జాతివాడైన నాగదేవుడు బుందేలుకన్య హేమవతిని ప్రేమించినాడని తెలిసి కుట్రపన్ని, పెండ్లి చేస్తామనే నెపంతో కుయుక్తితో ఖంగారు జాతినే నాశనం చేస్తారు.

'మృగనయనీ' నవలలో నసీరుద్దీన్ సింహాసనాపేక్షతో తన తండ్రికి విషమిచ్చి చంపించాడు. మానసింహుని పెద్ద భార్యయైన

సుమన మోహిని తన కొడుకును రాజు చేయాలనే కాంక్షతో మృగనయనికి రెండుసార్లు విషప్రయోగం చేసి చంపాలని ప్ర...

'విరాటా కీ పద్మినీ' నవలలో మరోరకమైన రాజకీయ కుట్ర ఉంది. నాయకసింహుని రెండవ భార్య అయిన చిన్నరాణికి దేవీసింహుడు దలీప్‌నగర రాజు కావడానికి ఇష్టంలేక కాలపీ సుబేదార్ అలీమర్దాన్‌తో చేతులు కలిపేందుకై రక్షాబంధన్ పండుగను పురస్కరించుకొని రాఖీ పంపుతుంది. అతని సహాయంతో తను రాజ్యం పొందవచ్చునని పన్నుగడ పన్నుతుంది. అలీమర్దాన్ రాఖీని స్వీకరించి, ఆమె అనుచరుల సహాయంతో కుముద్‌ను సొంతం చేసుకోవచ్చునని కుట్ర పన్నుతాడు.

'టూటే కాంటే' నవలలో మహమ్మద్‌షాను ఢిల్లీ సింహాసనం నుంచి దించి వేయాలనే సాదత్‌ఖాన్ తన అనుచరులతో కుట్రపన్ని, నాదిర్‌షాను ఢిల్లీకి రమ్మని ఆహ్వానిస్తాడు.

'కచనార్' నవలలో ధామోనీ రాజైన దలీపసింహుడు యుద్ధంలో గాయపడగా, అతని సోదరతుల్యుడైన మానసింహుడు చికిత్స నెపంతో స్మృతి పోగొట్టి, అతణ్ణి చంపాలని విషప్రయోగం చేసి చనిపోయినట్లు ప్రకటించి రాజ్యాధికారాన్ని పొందుతాడు.

'అహిల్యాబాయి' నవలలో అహిల్యాబాయి పెంపుడు కొడుకు మల్హారావు తన తల్లి కంటె ఎక్కువగా తనను ప్రేమించే రాణిని మోసగించి రాజు కావాలని కలలు కనేవాడు.

బాపిరాజుగారు, బృందావన్‌లాల్ వర్మగార్ల నవలల్లో జరిగిన

రాజకీయ కుట్రలన్నింటికి ని ముఖ్యకారణం. సామంతుల రాజ్యాకాంక్ష లేదా స్వాతంత్ర్యకాంక్ష అనవచ్చు.

**3.3.12. వివాహ సంబంధాలు :** బాపిరాజు గారు తన నవలల్లో కులాంతర వివాహాలను గురించి పేర్కొన్నారు. హిమబిందు మాతామహు డైన కీర్తిగుప్తుడు యవనస్త్రీని వివాహమాడాడు. హిమబిందు, సువర్ణశ్రీల వివాహం కూడ కులాంతర వివాహం అని చెప్పవచ్చు. అడవి శాంతిశ్రీ నవలలో శాంతిశ్రీ, బ్రహ్మదత్తుల వివాహం కూడ కులాంతర వివాహమే. ఈ వివాహ సంబంధాల ఆధారంగా బాపిరాజుగారు కులాంతర వివాహాలను ప్రోత్స హించారనీ, కులాల పట్ల అతనికి పెద్ద పట్టింపు లేదనీ తెలుస్తుంది. మంచి-చెడు అనేవి మాత్రమే సమాజంలో కులాలుగా పరిగణించాలని చెప్పడమే బాపిరాజు గారి ఉద్దేశం అయి ఉండవచ్చు.

కాని వర్మ గారు తన నవలల్లో కులాంతర వివాహాల్ని సమర్థించ లేదు. 'గఢ్ కుండార్' నవలలో నాగదేవుడు ఖంగారు జాతి వాడు. హేమవతి బుందేలు జాతి స్త్రీ. అగ్నిదత్తుడు బ్రాహ్మణుడు. మానవతి క్షత్రియ కన్య. దివాకరుడు కాయస్థుడు, తార బ్రాహ్మణ స్త్రీ. ఆ నాటి సమాజంలో కులాభిమానం అధికంగా పాటించడం వల్ల ఈ మూడు జంటల కులాంతర వివాహాలు విఫలమయ్యాయి.

ఇలాగే మృగనయనీ నవలలో అటల్ గుజార జాతికి చెందిన వాడు. లాఖీ అహీరు జాతికన్య. వీరిరువురి కులాంతర వివాహాన్ని కూడ ఆ నాటి సమాజం అంగీకరించ లేదు. ఈ విషయంలో వర్మగారు బాపిరాజు గారితో విభేదిస్తారు.

అడివి బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మగార్ల కథావస్తువుల్లోని సామ్యాలకు కారణం పరిశీలిస్తే వారిరువురికి భారతీయ సంస్కృతిపై గల అభిమానం కారణం కాగా, వైషమ్యాలకు వారి కథావస్తువుల్లోని దేశ, కాల పరిస్థితులు భిన్నంగా ఉండడమే అని చెప్పవచ్చు

4.1.1. హిమబిందు :

4.1.1.1. హిమబిందు : 'హిమబిందు' నవలలోని నాయిక 'హిమబిందు' బాపిరాజు గారి అద్భుత సృష్టి. ఆయనకు గల భావనా బలానికి, సన్నివేశ కల్పనా చాతుర్యానికి, కథాకథన సామర్థ్యానికి, పాత్ర పోషణా నైపుణ్యానికి, రసావిష్కరణ కౌశలానికి, సంభాషణా చాతుర్యానికి హిమబిందు అక్షరదర్పణం. రచయిత ఆనాటి చరిత్రను దృష్టిలో పెట్టుకొని పాత్ర చిత్రణ విషయంలో ఎంతో జాగరూకత వహించారు.

హిమబిందు పాత్ర బాపిరాజుగారి స్వకపోల కల్పితం. అయినా ఆ పాత్రలో ఆనాటి చరిత్ర ప్రతిబింబిస్తుంది. హిమబిందును రచయిత శృంగార రసాధి దేవతగా సృష్టించారు. నవలలో ఈమె సామాన్య నాయిక మాత్రమే కాదు; ఈమె అత్యంత సౌందర్యవతి. బాపిరాజుగారు ఈ నవలకు ఈమె పేరునే పెట్టారు. ఈమెను గ్రీకు, రోమను, భారత సౌందర్యాలు కలబోసి సృష్టించిన కళకు ప్రతీకగా బాపిరాజుగారు మలచారు. నవలలో ఈమె అత్యంత ప్రధానమైన, ఆకర్షణీయమైన పాత్ర. నవలలోని తదితర పాత్రలతో పాటు కథాభాగం కూడా ఈమె చుట్టూ పరిభ్రమిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే హిమబిందు నవలకు కేంద్ర బిందువు.

హిమబిందు వణిక్సార్వభౌముడైన చారుగుప్తుడు ఏకైక పుత్రిక. తల్లి లేనందువల్ల చారుగుప్తుడు ఆమెను ఎంతో గారాబంగా పెంచాడు. కీర్తిగుప్తుడు, ముక్తావళీదేవి మనుమరాలైన హిమబిందులో మరణించిన తమకుమార్తె ప్రజాపతి మిత్రను చూచుకొంటూ హిమబిందు కోసమే

జీవిస్తూ ఉంటారు. వీరందరి పెంపకంతో హిమబిందు సార్వభౌముని పుత్రికలా పెరుగుతుంది. బాపిరాజుగారి మాటల్లో " సంకల్పములు జనించుటయే తడవుగా సిద్ధినందించుకొనజాలిన తనయ. తమ కనుసన్నల రాజ్యచక్రముల త్రిప్పగల కోటీశ్వరులకు మనుమరాలు. గగన కుసుమములు కూడ నామెకు దుర్లభములు కావు. అట్టియప్పుడామె కోర్కె వెల్లువలు వెన్నెల కరళ్ళుగాకుండుటెట్లు ?"[1] అని అనడం ఆమె గారాల పట్టి అని తెలుపుతుంది. బాపిరాజుగారు సౌందర్యోపాసకులు. అందుకే కాబోలు హిమబిందును అలౌకిక సౌందర్యవతిగా చిత్రించారు.

" ఆమె అపరాజితాదేవి. ఆమె ప్రజ్ఞాపరిమిత. ఆమె శ్వేతతార. ఆమె అనంత సౌందర్య భావోజ్జ్వల మూర్తి.

" ఆమె అందాల కుప్ప. విలాసముల మూట. ఒయ్యారముల కుప్ప. ఆమె పరమాద్భుత సౌందర్యమునకు ముగ్ధులై ప్రజలును, దశముఖగణా చమూపతులు, రాజోద్యోగులు, మంత్రులు, దండనాయకులు, ప్రాడ్వివాకులు ఒకరనవేల అందరును ఆమెనే చూచుచుండ్[3]

" స్నిగ్ధ శ్వేతకాంతి భాసమాన హిమబిందువా! ఆ బాల! ఆ తెలుపు ఎరుపులు ఔత్తరాహికములు. ఆమెలో గాంధార రక్తమున్నది. రోమక యవన జాతులు ఆర్యకర్త సమ్మిశ్రితములై మహోత్తమ మూర్తి దాల్చినట్లున్నది"

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 194.
2. పైదే., పు: 40.
3. పైదే., పు: 41.
4. పైదే., పు: 79.

" ఆమెలో భారత జాతి సుగుణములు, యవనజాతి సుగుణములు మేలు కలయిక పొందినట్లున్నది."[1]

" ఆమె నడకల్లో హాయి లాలికింప గలదు. పలుకులలో అమృతం కురిపింపగలదు. చూపుల్లో సుధలు చిలకింపగలదు. అపురూపమైన ఈ సౌందర్యాన్ని ఏ కవీ వర్ణించలేదు. ఏ చిత్రకారుడు చిత్రించలేదు. ఆనాటి ఆంధ్ర యోషా రత్నాలలో ఇలాంటి అందకత్తె లేదు."[2]

ఇలా బాపిరాజుగారు హిమబిందును ఎంతో సౌందర్యరాశిగా వర్ణించారు. ఈ వర్ణనలను బాగా పరిశీలించి చూస్తే బాపిరాజుగారి ఊహా ప్రేయసి శశికళనే ఈ హిమబిందుగా రూపకల్పన చేశారేమో అన్పిస్తుంది.

హిమబిందు అందకత్తె ధనవంతురాలే కాకుండా, అన్ని విద్యలను బాగా నేర్చి ఔపోసన పట్టిన గొప్ప విదుషీమణి. ఆంధ్ర, ప్రాకృత, పాళి, మాగధి, శూరసేని మొదలైన అనేక భాషల్లో పండితురాలు. సకల శాస్త్రాలు శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేసింది. చక్కగా నాట్యం చేయగలదు. గానం ఆలపించ గలదు. బౌద్ధమత సంబంధమైన త్రిపిటకాలు ధర్మ చక్ర ప్రవర్తన సూత్రాలు, అభిధర్మ సూత్రాలు, మహాపరి నిర్వాణ సూత్రాలు మొదలైన అనేక సూత్రాల్ని, సూత్ర వాఙ్మయాల్ని, బౌద్ధ జాతక కథలు ఇంకా అనేక ఇతర గ్రంథాలు అధ్యయనం చేసింది.

అంతే కాదు, యుద్ధ సంబంధమైన అశ్వారోహణం, కత్తిసాము, విలువిద్య, రథ చోదకత్వం మొదలైన విద్యల్లో కూడ ఆరితేరిన అతివ హిమబిందు

1. హిమబిందు - అడివి బాపిరాజు., పు. 81.
2. బాపిరాజు సాహిత్యానుశీలనం — డా॥ మన్నవ సత్యనారాయణ., పు. 143.

ఆమెకు సంగీత, సాహిత్య, నాట్యాల్లోనే కాక చిత్రలేఖనంలోనూ అపారమైన అభినివేశం కలదు.

ఇన్ని విద్యలు నేర్పించి ఆమె తండ్రి గొప్ప విద్వాంసురాలిగా చేశాడు. హిమబిందును శ్రీకృష్ణ సాతవాహనునకిచ్చి వివాహంచేసి భావి సామ్రాజ్ఞిని చేయాలనే ఊహల్లో ఉన్నాడు చారుగుప్తుడు. ఇంకొక ప్రక్క ఆమె మేనబావ సమదర్శి ఆమెను వివాహమాడాలను కొంటున్నాడు. కాని హిమబిందు సువర్ణశ్రీ అనే శిల్పిని ప్రేమిస్తుంది. చక్రవర్తి జన్మదినోత్సవాల సందర్భంలో ఏర్పాటు చేసిన ఎడ్లబండ్ల పందెంలో తన మేనబావ సమదర్శిని ఓడించి ప్రథముడుగా సువర్ణశ్రీ గెలుపొందుతాడు. క్రమంగా అతనితో హిమబిందు పరిచయం పెరిగి అతనినే ప్రేమిస్తుంది. సువర్ణశ్రీ కూడ ఆమె పట్ల అనురక్తుడౌతాడు. మొట్టమొదట సువర్ణశ్రీ విజయాన్ని పురస్కరించుకొని రాజమందిరంలో జరిగిన నాట్యంలో, హిమబిందు నాట్యం చేసేటప్పుడు వీరిద్దరి చూపులు కలసి వారి మధ్య ప్రణయానికి అంకురార్పణ జరిగింది. క్రమేపీ వారిద్దరి మధ్య విడదీయరాని బంధమేర్పడుతుంది.

హిమబిందు తండ్రి చారుగుప్తుడు తన కుమార్తెను శ్రీకృష్ణ-శాతవాహనుని కిచ్చి వివాహం జరిపించాలను కొని తన నిర్ణయాన్ని (చెప్పి) హిమబిందుకు తెలియజేస్తాడు. ఈ మాట వినడంతోనే హిమబిందు (కృంగి) పోతుంది. ఈ సంబంధాన్ని తిరస్కరించి, తల్లిలేని తనను ఎంతో అల్లారు ముద్దుగా పెంచిన తండ్రిని ఎదిరించనూ లేదు. అట్లని తండ్రి ఆజ్ఞను శిరసావహించి తనను మనసారా ప్రేమించిన సువర్ణశ్రీని మోసం చెయ్యనూలేదు. ఇటు తండ్రి

కష్టాన్ని కలిగించలేక, అటు సువర్ణశ్రీని క్షోభపెట్టనూలేక ఆమె మనస్సు తీరని ఆవేదనతో విలవిల్లాడి పోతుంది. కర్తవ్యం, ప్రేమల మధ్య సంఘర్షణకు తట్టుకోలేక నలిగిపోయి తీవ్ర ఆవేదనను అనుభవిస్తుంది. ఆ సమయంలోనే హిమబిందును, ఆమె అమ్మమ్మ ముక్తావళీదేవిని చోరులు అపహరిస్తారు. హిమబిందును వెతుకుతూ వెళ్ళిన సువర్ణశ్రీ ఎంతో చాకచక్యంతో, ధైర్యసాహసాలతో హిమబిందును, ఆమెతో బంధింపబడిన ఆమె అమ్మమ్మను, శ్రీముఖ శాతవాహనుని కుమారుడైన మంజుశ్రీని విడిపిస్తాడు. దీనితో చక్రవర్తికి కూడ సువర్ణశ్రీ అంటే అభిమానం ఏర్పడుతుంది. అతడు మొదట సైన్యంలో సైనికుడుగ, తరువాత శ్రీకృష్ణ-శాతవాహనునకు అంగరక్షకుడుగ, క్రమేపీ ఉపసైన్యాధ్యక్ష పదవిని చేపట్టి గొప్ప పేరును సంపాదించుకొంటాడు.

కళాతపస్వి అయిన బాపిరాజుగారు హిమబిందును సౌందర్యనిధిగా, ప్రేమదేవతగా చిత్రించారు. ప్రేమకు మనస్సులు ప్రధానం కాని ఐశ్వర్య భోగాలు కావని రచయిత ఈ పాత్రపరంగా నిరూపించారు. ప్రేమ ఎంతటి అవరోధాలనైనా ఎదుర్కొని, ఆర్థిక పరమైన అడ్డుగోడల్ని ఛేదించి, రాజకీయ కుతంత్రాలను సహితం నిర్మూలించి విజయాన్ని సాధిస్తుందని రచయిత నిరూపించారు.

నిర్మల ప్రేమను నిర్వచించడానికి బాపిరాజుగారు కల్పించిన పాత్ర హిమబిందు. సౌందర్య రూపమా? లేక సౌందర్యానికి మూలకారణమా! అన్నంత సౌందర్యరాశిగా, శ్రేష్ఠుడైన శిల్పిచెక్కిన సుందరిగా చిత్రీకరించి,

ఆమె శిల్పినే ప్రేమించినట్లు మిక్కిలి మనోజ్ఞంగా హిమబిందును మలచారు బాపిరాజు గారు.

హిమబిందును చూడగానే తాను ఎంతో కాలం నుండి వెతుకుతున్న సుందరి కనులముందు ప్రత్యక్షమైంది అనుకొన్నాడు శిల్పి సువర్ణశ్రీ. మొదటి చూపులోనే అతనికి పండువెన్నెల్లో పోతపోసిన సువర్ణ విగ్రహంలా హిమబిందు సాక్షాత్కరించింది.

హిమబిందు బాపిరాజుగారి స్వప్నబాల. ఊహాసుందరి. అందుకే నవలలో ఆ పాత్ర అంత సజీవంగా సాక్షాత్కరిస్తుంది. "సువర్ణశ్రీ తన నాథుడై తానతని శిల్పము, చిత్రలేఖనము చూచుచు ఆనందమున దివ్యపదాలకు బోవుచు, తన అద్భుత గాంధర్వమున అతని వోలలాడించుచు, అతనిచే చైత్యముల నిర్మాణము చేయించుచు ఈ జన్మము నాక మహదానంద ప్రవాహమును చేసుకొన గలుగుటయే చరితార్థత"[1] అన్న హిమబిందు మాటల్లో బాపిరాజు గారి లలితకళా రాధకత్వం ద్యోతకమౌతుంది.

హిమబిందు సువర్ణశ్రీని ప్రేమించింది. ఆమె మేనబావ హిమబిందును వివాహం చేసుకోవాలను కొంటాడు. తన మేనబావను ప్రేమించకున్నా హిమబిందుకు అతనిపై ఏ మాత్రం ద్వేషం లేదు. ఒకసారి సువర్ణశ్రీ చెల్లెలు నాగబంధునికతో సమదర్శిపై తన అభిప్రాయం ఇలా చెబుతుంది. "అతడు ఉత్తముడు. ప్రాణములకయిన వెనుదీయడు. అయినను తనకు జరుగవలసిన గౌరవములు జరిగి తీరవలయునను పౌరుషము గలవాడు"[2] అంటుంది.

---

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు. 321.
2. పైదే., పు: 263.

ప్రేమ, పెండ్లి విషయమై ఆమె విధిని నమ్ముతుంది. "ఒకొక్క యువకునకు ఒకొక్క యువతిని, యువతికి ఒకొక్క యువకుని విధి ఏర్పాటు చేసియుండునని నా నమ్మకం"[1] అని చెప్తుంది. కాని కొంతమంది పురుషులకు ఇద్దరు ముగ్గురు భార్యలున్నారే అని నాగబంధునిక ప్రశ్నిస్తే ఇలా అంటుంది. "స్త్రీ పురుషులు మూడు జాతులుందురు నాగబంధూ! ఉత్తమ, మధ్యమ, అధమ అని. ఉత్తమ శ్రేణి వారి విషయంలో నేను మాట్లాడుచుంటి"[2] అని చెప్తుంది. "అర్జునుడు కూడా ప్రేమ విషయంలో మధ్యముడే"[3] అంటుంది. ఉత్తములయిన పురుషులు ఏకపత్నీ వ్రతులుగా ఉండాలని బాపిరాజుగారి అభిప్రాయం కాబోలు. అది హిమబిందు పాత్ర ద్వారా సూచించారనిపిస్తుంది.

ఆమె మేనబావ సమదర్శి ఆమెను వివాహం చేసుకోవాలనే కోర్కెను చూచాయగా ఆమెకు తెలుపగా, అప్పటికే ఆమె సువర్ణశ్రీని ప్రేమించి ఉండడంతో అతడి ప్రేమను ప్రత్యక్షంగా తిరస్కరిస్తే, ఎక్కడ అతని మనస్సు బాధపడుతుందో అని, పరోక్షంగా అతనికి సూచిస్తుంది. సమదర్శి హిమబిందుతో, "నా కీర్తి ప్రతిష్ఠలన్నీ ఏ దేవిచెంత కానుక పెట్టదలచుకున్నానో ఆ దేవికి నా పట్ల అనుగ్రహం తప్పింది"[4] అంటాడు.

ఇదే మంచి సమయం అని "ఎవరా దేవి? మా అక్క కానున్న ఆ అదృష్టవతి ఎవరో మీరెంత దాచినా పెండ్లి నాడైనా చూడక పోముగా.

1. హిమబిందు — అడవి బాపిరాజు., పు: 264.
2. పైదే., పు: 264.
3. పైదే., పు: 264.
4. పైదే., పు: 90.

నీవు త్వరగా పెండ్లి చేసుకో బావా "[1] అని అంటుంది. అతని పెండ్లి సందర్భంగా రెండు లక్షల సువర్ణాలతో తయారు చేసిన హారాన్ని అతని భార్యకు బహుమానంగా ఇస్తానని, తన మెడలోని హారాన్ని తీసి సమదర్శి చేతికి ఇస్తుంది. ఆమె మాటలు నిజమో, నవ్వులాటకో తెలియక సమదర్శి ఆ హారాన్ని తీసుకొని ఆమె మెడలో వేయబోతాడు. కాని హిమబిందు " వద్దు బావా! నా హారం నేను తీసుకొంటానని" చేతులతో తీసుకొంటుంది.

ఈ విధంగా హిమబిందు తనకు తన మేనబావను వివాహం చేసుకోవాలనే కోరిక లేనట్లు ప్రవర్తిస్తుంది. ఆమే కాక, ఆమె తండ్రి చారుదత్తుడు కూడ హిమబిందును తనకు ఇవ్వడానికి సుముఖుడుగా లేడని తెలుసుకొని సమదర్శి, హిమబిందును ద్వేషించకుండా తనను అమితంగా ప్రేమించే నాగబంధునికను పెండ్లి చేసుకొంటాడు. శ్రీకృష్ణ-శాతవాహనుడు చంద్రబాలను వివాహం చేసుకొంటే, విధిలేక చారుదత్తుడు తన కుమార్తెను సువర్ణశ్రీ కిచ్చి వివాహం చేయిస్తాడు.

ఇట్లు హిమబిందు పాత్ర మంచి సన్నివేశాలతో అడుగడుగునా కుతూహలం రేకెత్తిస్తూ నడుస్తుంది. ఒక ప్రక్క మేనబావ తనను వివాహమాడాలనుకొంటాడు. మరియొక ప్రక్క తండ్రి తనను చక్రవర్తికి కోడలు చెయ్యాలనుకొంటాడు. కానీ హిమబిందు సువర్ణశ్రీని మనసారా ప్రేమించింది. మేనబావకు నిజం చెప్పలేక తండ్రిని ఎదిరించలేక ఆమె పడిన ఆవేదనను బాపిరాజుగారు చక్కగా వివరించారు.

1. హిమబిందు - అడివి బాపిరాజు. పు: 478, 49.

ఈ రకంగా " హిమబిందు , సువర్ణశ్రీల ప్రేమ అతిలోక సుందరమై , మహోద్భుత శిల్ప విన్యాసరూపమై , హిమబిందు వెన్నెలగా, సువర్ణశ్రీ శశికళా భావుకుడుగా , తన ఊహా సుందరి శశికళయే సువర్ణశ్రీ ప్రేమికురాలైన హిమబిందు అన్నట్లుగా రచించి, అడివి బాపిరాజు గారు చదువరుల ఒడలు పులకరింప జేశారనుటలో ఏ మాత్రం సందేహం లేదు.

4.1.1.2. **సువర్ణశ్రీ :** సువర్ణశ్రీ హిమబిందు నవలలో కథానాయకుడు. అతడు శిల్పి. అతని తండ్రి ధర్మనంది కూడా శిల్పాచార్యుడే. సువర్ణశ్రీకి బాల్యంలో అతని తండ్రే గురువు. తండ్రి వద్ద శిల్ప విద్యల్ని గ్రహించి , తర్వాత సోమదత్తాచార్యుల శిష్యుడై ఉత్తమ శిల్పిగా ప్రఖ్యాతి పొందుతాడు సువర్ణశ్రీ. ఒకసారి చక్రవర్తి జన్మదిన వేడుకల సందర్భంగా జరిగిన ఎడ్ల బండ్ల పందెంలో పాల్గొని, హిమబిందు మేనబావయైన సమదర్శిని ఓడించి ప్రథముడుగా వస్తాడు. సువర్ణశ్రీ విజయాన్ని పురస్కరించుకొని రాజమందిరంలో జరిగిన నాట్యంలో హిమబిందు పాల్గొంటుంది. ఆమె నాట్యం చూసి సువర్ణశ్రీ ముగ్ధుడౌతాడు. అప్పుడే వారిద్దరిలో ఒకరిపై ఒకరికి ప్రేమ అంకురిస్తుంది. ఎడ్లబండ్ల పందెంలో గెలిచినందుకు చక్రవర్తి శ్రీముఖ-శాతవాహనుడు సువర్ణశ్రీకి నవరత్న ఖచితమైన కృపాణాన్ని రాజ సత్కారంగా బహూకరిస్తాడు.

సువర్ణశ్రీ మహాశిల్పి , ధైర్య సాహసాలు గలవాడే గాక చాల అందగాడు. అతని అందాన్ని గూర్చి బాపిరాజు గారు " సువర్ణశ్రీ సుందరుడు;

పందొమ్మిది సంవత్సరాల ప్రాయపు వాడు. అతని మూర్తి సమున్నతము. కండలు తిరిగిన బాహువులు, విశాలవక్షము, కోలమొహము, అతని కన్నులు విశాలములు. అతని భ్రుకుటి యమునా గంగా సంశ్లేష పవిత్రము. అది హిమాచల సుమేరు పర్వతాలింగన సుందరము. అది కన్యాకుమారీ హృదయస్థ ప్రాక్పశ్చిమ సముద్రతరంగ సంయోగ గంభీరము"[1] అని వర్ణించారు.

కోటీశ్వరుని కూతురైన అందాల సిరిబొ, గారాలపట్టి సువర్ణశ్రీ లోని అందాన్ని, శిల్పకళా చాతుర్యాన్ని, ధైర్య సాహసాలను చూచి మనస్ఫూర్తిగా ప్రేమించింది. ఇంతేకాక సువర్ణశ్రీలో ఇంకా ఎన్నో గొప్ప గుణాలున్నాయి. అతడు గొప్ప వీరుడు, యుద్ధతంత్ర విశారదుడు, ప్రభుభక్తి పరాయణుడు, త్యాగశీలి, నిస్వార్థ బుద్ధి గలవాడు.

హిమబిందును చోరులు అపహరించి, నది మధ్యలో ఉన్న గుహలో బంధిస్తే సువర్ణశ్రీ తన మిత్రుడైన మహాబల గోండుని సహాయం హిమబిందును కాపాడుతాడు. హిమబిందుతో పాటు బందీలైన మంజుశ్రీని కూడా రక్షిస్తాడు. తన కుమారుడైన మంజుశ్రీని చోరుల బారినుండి కాపాడినాడని తెలిసి చక్రవర్తి శ్రీముఖ శాతవాహనునికి సువర్ణశ్రీపై ఎంతో అభిమానం ఏర్పడి తన సైన్యంలో చేర్చుకొంటాడు.

అలా సైన్యంలో చేరిన సువర్ణశ్రీ శత్రువులకు ఉజ్జయిని కోట పట్టు పడకుండ శాయశక్తుల పోరాడుతాడు. సోమదత్తాచార్యుల వారి

---

1. హిమబిందు - అడివి బాపిరాజు., పు:10.

ఆదేశాన్ని అనుసరించి శ్రీకృష్ణ శాతవాహనునికి అంగరక్షకత్వం వహిస్తారు. అంగరక్షకుడిగా అద్వితీయమైన ప్రతిభను చూపి శ్రీకృష్ణ శాతవాహనుణ్ణి మెప్పించి ఉపసైన్యాధ్యక్ష పదవిని చేపడతాడు. పాటలీపుత్రం ఎలాగైనా చక్రవర్తి పరం చెయ్యాలని కంకణం కట్టుకొని, సర్వసైన్యాధ్యక్షునికి అనేక సమస్యా పరిష్కారాలు తెల్పి, జటిలమైన పాటలీపుత్ర ప్రవేశాన్ని అవలీలగా తన ఆంధ్రసైనికులచే జరిపించి, పాటలీపుత్రాన్ని జయిస్తారు. ఈ విజయానికి కారకుడు సువర్ణశ్రీ అని గ్రహించి చక్రవర్తి తన మెడలోని విద్రుమ మాలను అతని కంఠాన అలంకరింపజేస్తారు.[1]

చిత్తశుద్ధితో, ధైర్య సాహసాలతో, ప్రజ్ఞా పాటవాలతో యుద్ధరంగంలో పాల్గొని చక్రవర్తి విజయానికి ఎంతో కృషి చేసిన సువర్ణశ్రీని, శ్రీముఖ శాతవాహనుడు పాటలీపుత్రానికి రాజప్రతినిధిగా నియమిస్తాడు. ఇలా చక్రవర్తి ఆదరాభిమానాలు సంపాదించిన ప్రభుభక్తి పరాయణుడు సువర్ణశ్రీ.

సువర్ణశ్రీ మహాశిల్పి, వీరుడు, ప్రభుభక్తి పరాయణుడే కాదు నిస్వార్థ ప్రేమికుడు. హిమబిందును మనసారా ప్రేమించాడు. ఆమెను వివాహమాడి ఆమె తోడిదే లోకంగా ఆనందమయ జీవనం గడపాలని ఎన్నో కలలు కంటూ ఉంటాడు. కానీ విధి వక్రించింది. హిమబిందును ఆమె తండ్రి శ్రీకృష్ణ శాతవాహనున కిచ్చి వివాహం చేయ సంకల్పించాడు. ఈ విషయం

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 299.

హిమబిందు పెళ్ళిచికే దుఃఖంతో చెప్పలేక చెప్తుంది. ఇది విన్న సువర్ణశ్రీ హృదయం వెయ్యి వ్రక్కలౌతుంది. ఆమె లేని జీవితం ఎండిన మ్రోడు. ఎడారి కాచిన వెన్నెల. ఇలా పరితపిస్తూనే ఆమె యోగక్షేమాల కోసం తన ప్రేమను త్యాగం చెయ్యాలనుకొంటాడు. ఆమె తనను వివాహమాడితే కేవలం ఒక శిల్పి భార్యగా ఏలాంటి ప్రత్యేకత లేకుండా ఒక గృహిణిగా జీవితం గడపాలి. కానీ చక్రవర్తి కోడలైతే ఆమె భావి సామ్రాజ్ఞి అవుతుంది. తాను మనస్ఫూర్తిగా ప్రేమించిన హిమబిందు మహారాణి అయితే ఇంత కన్నా కావలసిందేముంది? ఆమెకు సేవకుడై సేవలు చేస్తూ తృప్తి పడతాను. ఈ జన్మకు ఇది చాలు అని ఎంతో గొప్పగా ఆలోచించి తన ప్రేమను ఆమె శ్రేయస్సుకై త్యాగం చేయాలనుకొంటాడు. "సువర్ణా! నీ వెఱ్ఱికాని ఆంధ్ర సింహాసనమెక్కదగిన ఆ దేవి ఎక్కడ? శిల్పి మాత్రుడవు నీవెక్కడ? ఆ దేవి సౌందర్యశ్రీని వేభంగుల శిల్పించుకొమ్ము. లోకమెల్ల నా సౌందర్యముతో నింపుము. నీ జన్మమునకదియే చరితార్థకత"[1] అనుకొని వేడి నిట్టూర్పు విడిచినట్లు రాజుగారు వర్ణించినారు.

హిమబిందును చోరులు అపహరించినప్పుడు "హిమబిందును తానెట్లైన వెదకి యామెను శత్రువుల బారినుండి రక్షించి వణిక్సార్వభౌముడు చారుగుప్తున కప్పగించు పుణ్యము లభించునా?"[2] అని వ్యధ చెందుతాడు. ఇంకా "చారుగుప్తునకా సౌందర్యనిధిని అప్పగించి తాను హిమాలయములకు పోవుట మంచిది"[3] అని అనుకొంటాడు.

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 304
2. పైదే., పు: 304.
3. పైదే., పు: 304.

పై మాటల వల్ల సువర్ణశ్రీ త్యాగబుద్ధి, నిస్వార్థ ప్రేమ మనకు అర్థమౌతుంది. అపహరింపబడిన యువతి తన ప్రియురాలు; అందువలన ఆమెను కాపాడాలి అని ఎంత మాత్రం యోచించలేదు. నిజంగా సువర్ణశ్రీలో స్వార్థబుద్ధి ఉంటే ఆమెను రక్షించి, ఆమెతో దూర ప్రదేశాలకు వెళ్ళి, ఆమెను వివాహమాడాలని అనుకొని ఉంటాడు. కానీ తండ్రికి అప్పగించాలని అనుకొని ఉండడు. సామాన్యుడైతే ఆమె ఎవరిసొత్తో నేనెందుకు రక్షించాలి అనుకొని ఉంటాడు. కాని మూర్తీభవించిన త్యాగమూర్తి కనుక సువర్ణశ్రీ తన ప్రాణాలకు తెగించి, ఆమెను దాచిన గుహలోనికి ప్రవేశించి ఆమెను రక్షిస్తాడు.

"సువర్ణశ్రీ హిమబిందును ప్రేమించెను. ఆమె తనది కాదు అని తెలిసికూడా ఆమెను రక్షించెను. కోరికల్లేక ధర్మమార్గాన నడుచు పురుషుడు వీరోత్తంసుడు. సువర్ణశ్రీ అట్టివాడు."[1] అని బాపిరాజుగారు రచించారు.

ఇలా బాపిరాజుగారు సువర్ణశ్రీని నిష్కామకర్మ చేయువానిగా చిత్రించారు.

హిమబిందుకు దూరంగా వెళ్ళిపోతే క్రమంగా తన జ్ఞాపకాలను మర్చిపోయి, చక్రవర్తిని పెండ్లాడి సుఖపడుతుందని తలచి ఎవ్వరికీ చెప్పకుండా తీర్థయాత్రలకు బయలుదేరుతాడు సువర్ణశ్రీ. కాని ఈ విషయం తెలుసుకొని హిమబిందు అతణ్ణి రహస్యంగా వెంటాడుతుంది

---
1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 417.

సువర్ణశ్రీ కపిలవస్తు, లుంబినీ వనం, మధురానగరం దర్శించి చివరకు కాశీలోని మృగవన సంఘారామం చేరుకుంటాడు. అక్కడనే బౌద్ధ దీక్ష స్వీకరించి, శిల్పాలు చెక్కుకుంటూ తన శేష జీవితం గడిపేయాలని అనుకొంటాడు. కానీ సువర్ణశ్రీని వెతుక్కొంటూ బయలుదేరిన హిమబిందు మృగవన సంఘారామంలో అతన్ని కలుసుకొంటుంది. శ్రీకృష్ణ శాతవాహనుడు చంద్రబాలను వివాహం చేసుకోవాలని ఉన్నాడని వారికి తెలుస్తుంది. వీరి నిర్మల ప్రేమను గమనించిన చారుగుప్తుడు కూడ తన సంకల్పాన్ని వదలి వీరిద్దరికీ వివాహం జరిపిస్తాడు.

సువర్ణశ్రీ, హిమబిందులది నిర్మల ప్రేమ. తనకంటే చక్రవర్తిని వివాహమాడిన ఆమె సుఖపడుతుందని, తన ప్రేమను త్యాగం చెయ్యాలనుకుంటాడు సువర్ణశ్రీ. తాను ప్రేమించినది సామాన్య శిల్పి అయినా, ఆ వ్యక్తి కోసం మహారాణి పదవినే త్యాగం చెయ్యాలనుకొంటుంది హిమబిందు. కాని దైవయోగం వేరుగా ఉంది. నిస్వార్థమైన ప్రేమ ఏలాంటి అవరోధాలైనా దాటగల్గుతుందని ఈ పాత్రల ద్వారా నిరూపించారు బాపిరాజు గారు. వ్యక్తిగతంగా బాపిరాజు గారు రచయిత మాత్రమే గాక గొప్ప చిత్రలేఖకుడు. చిత్రలేఖనం, శిల్పం అంటే బాపిరాజు గారికి ఆరవప్రాణం. అందుకే సువర్ణశ్రీని మహాశిల్పిగా మలచారు

శిల్పిగా, చిత్రకారునిగా, సౌందర్యోపాసకుడుగా, ఆదర్శప్రేమికునిగా, సాహసవంతునిగా, దేశభక్తుడుగా సువర్ణశ్రీ పాత్ర బాపిరాజు గారి చేతిలో జీవం పోసుకుంది.

4.1.1.3. **చంద్రబాల:** బాపిరాజు గారు సృష్టించిన చంద్రబాల ఒక విశిష్టమైన పాత్ర. చంద్రబాల వృత్తాంతం ఎంత విచిత్రమైందో, ఆమె ప్రణయం అంత మహోదారమైనది. ఈమె బ్రహ్మ విద్యాధిపుడైన స్థౌలతిష్యుని మనుమరాలు. బాల్యంలోనే ఆమె తల్లిదండ్రులు మరణించగా ఆమె తాత అయిన స్థౌలతిష్యుడే ఆమెను పెంచి పెద్ద చేశాడు. ఈమె పాత్ర స్థౌలతిష్యుల మనస్సు లోని విష భావాలకు భౌతిక రూపం. అమృత పాదార్హతుల మనస్సులోని అమృత భావాలకు మానసిక రూపం.

స్థౌలతిష్యులు వేదమతాన్ని ఉద్ధరించడానికే పుట్టాను అనుకొంటాడు. బౌద్ధమతం అన్నా, బౌద్ధులన్నా అతనికి గిట్టదు. కాని ఆనాడు ఆంధ్ర మహా సామ్రాజ్యాన్ని పరిపాలించుచున్న శ్రీముఖ శాతవాహనుడు బౌద్ధుడు. అతని కుమారుడు శ్రీకృష్ణ శాతవాహనుడు కూడా తండ్రి వలెనే బౌద్ధమతావలంబి. వీరి వల్ల ఆంధ్ర దేశంలో వైదిక మతం అంతరించి బౌద్ధమతం ప్రబలి పోతోందని స్థౌలతిష్యులు తల్లడిల్లి పోతాడు. అతని ఆర్షమతాభిమానం ఎంత వెర్రితలలు వేసిందంటే శ్రీముఖుని శత్రువులతో కుట్రపన్ని బాలుడైన మంజుశ్రీని అపహరిస్తాడు. యువరాజు శ్రీకృష్ణ శాతవాహనుని హతమార్చి, మంజుశ్రీకి వైదిక పద్ధతిలో శిక్షణనిచ్చి మంజుశ్రీని భావి సమ్రాట్టు చేయాలని, తద్వారా వైదిక మతాన్ని పునరుద్ధరించాలని కుట్ర పన్నుతాడు. శ్రీకృష్ణ శాతవాహనుణ్ణి హతమార్చడానికి అద్భుతసౌందర్యవతియైన చంద్రబాలను విషబాలగా మార్చి యువరాజుపై ప్రయోగించాలనుకొంటాడు.

చంద్రబాల గుణశీలాలను చిత్రించడంలో బాపిరాజు గారు

అద్భుత రసాన్ని పోషించి పాఠకుల్లో ఆసక్తిని కలిగించారు. బాపిరాజు గారు చాణక్య, చంద్రగుప్తుల కథనుండి ఈ పాత్రకు ఆధారాలు తీసుకున్నా, ఈమె ఆ విషకన్య వలె ప్రాణాలు కోల్పోలేదు. అమృత కన్యగా మారి, ఆంధ్ర సామ్రాజ్ఞియై చరిత్రలో అమృతంగా నిలిచిపోయింది. హిమబిందు నవలలో అమృత బిందువు ఈ చంద్రబాల.

చంద్రబాల బాల్యమంతా విచిత్రంగా గడుస్తుంది. "బాల్యం నుండీ చంద్రబాలకు విష ఉరగాలతో నేస్తం. విషజల స్నానం - విషాన్నభుక్తి. ఆమె రక్తం విషమయమై పోయింది. నరనరం విషపూరితం. ఆమె నిశ్వాసమే విషోద్గారి అయింది. ఆమెను సమీపించుట మృత్యువును సమీపించుట. ఆమెను తాకుట మృత్యువును కోరుకుట."[1]

ఇలా స్థాలతిష్యుడు చంద్రబాలను విషబాలగా మార్చేందుకు హోమం చేస్తాడు. అభిచార హోమం చేస్తూ, "ఓ అగ్ని, వాయు, సూర్య, చంద్ర, జలములారా, మిమ్మెవడు ద్వేషించుచున్నాడో, ఎవ్వనిమేము ద్వేషించుచున్నామో అట్టివానిని మీ తాప శక్తిచే తపింపజేయుడు."[2] "ఓ విషశక్తీ నీవు ఈ భయంకర సౌందర్యనారీ రత్నమునందు సంపూర్ణ వేగంతో కూడెదవు గాక."[3]

"ఈ సుందరి శ్రీకృష్ణ శాతవాహనుని అగ్నిశలభమును ఆకర్షించునట్లు ఆకర్షించు గాక. ఈ సుందరి శ్రీకృష్ణ శాతవాహనుని మృత్యువగు గాక"[4]

---

1. ఆంధ్ర నవలా పరిణామము – బొడ్డు పాటి వెంకట కుటుంబరావు., పు; 293.
2. హిమబిందు – అడవి బాపిరాజు., పు; 109.
3. పైదే., పు; 110.
4. పైదే., పు; 111.

"బాల్యంలోనే ఆమెచేత స్థాలతిష్యుడు విషసదృశ ఆహారాన్ని భుజింప చేస్తాడు. ఆమెచే గుజ్జనగూళ్ళలో విషము కలిపిన పాలలో నాభిని కలిపి తినిపిస్తాడు. ఆమె మూడవ ఏడు వచ్చేటప్పటికి సౌరాష్ట్రకము తిలప్రమాణం ఆరగింప కలిగింది. అయిదవ ఏడు వచ్చేటప్పటికి శాక్లికేయలు, యవగింజలు తినగలిగింది. తర్వాత దారదము, వత్సనాభము ఆమెకు ఫలహారములైనవి."[1]

"చంద్రబాల ఇలా విషాన్ని భుజిస్తూ, 12వ యేట మహావిషమైన కాలకూటాన్ని, దక్షిణ దందు కాటవి, మహానాగ, దంష్ట్రాంచిత, కాకోలం తాతగారి ఆజ్ఞపై భుజిస్తుంది. అప్పటినుండి ఆమె పూర్తిగా విషబాల అయింది. ఆమె హస్త స్పర్శచే మల్లెలు మాడిపోయాయి. ఆమె నిశ్వాసంలో విషవాయువులున్నాయి. ఇప్పుడామె మూర్తీభవించిన మృత్యుస్వరూపిణి."[2]

బాపిరాజుగారు చంద్రబాల విషస్వరూపిణిగా మారడంలో గల క్రమ పరిణామాన్ని ఇలా నిరూపించారు. "స్థాలతిష్యుని మహావిద్యవల్ల ఆ బాలికలోని మానవత్వము వెనుకకు పోయి పశువులలో ఉత్తమమైన గోవుస్థితి పొందినది. అటు తర్వాత ఆమె ఏనుగు స్థితికి చేరుకున్నది. ఒక్కొక్క వర్షం గడచినకొలది ఆమె శునక జాతికి, మార్జాల జాతికి, శార్దూల జాతికి దిగింది. ఇప్పుడామె భయంకరమైన శార్దూలోరగం."[3]

రచయిత గొప్ప మేధావి. శాస్త్రానుభవం కలవాడు కావడంచే పై విధంగా

---

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 151.
2. పైదే., పు: 151.
3. పైదే., పు: 151.

రచించ గలిగాడు.

ఇలా ఆమె యవ్వనవతి అయ్యేసరికి సంపూర్ణ విషకన్యగా మారింది. అంతవరకు ఆమెకు స్త్రీ పురుష భేదం తెలీదు. వివిధ భాషలు తెలీదు. సంగీత సాహిత్యాదులలో ప్రవేశం లేదు. కాబట్టి స్థాలతిష్యులు తన కార్యసాధనం కోసం ఆమెకు స్త్రీపురుష భేదాన్ని తెలుసుకొనే ఏర్పాటు చేస్తాడు. వివిధ భాషలు, సంగీతాదులు నేర్పి ఆమెను ప్రజ్ఞావంతురాలిగా చేస్తాడు.

ఆమె శరీరం విషపూర్ణం అయినా మనస్సు మాత్రం అమృతం గానే ఉంటుంది. ఒకనాడు ఈమె అందాన్ని చూసి వివశుడై మలయనాగుడు ఆమెను కౌగలించుకొని ముద్దుపెట్టుకోవాలనుకొంటాడు. కాని విషపూరిత మైన ఆమె నిశ్వాసం చే తన ప్రాణాలు పోగొట్టుకొంటాడు. ఈ సంఘటనతో చంద్రబాల క్రుంగిపోతుంది. మలయనాగుని మరణానికి తాను కారణభూతురాలైనానే అని బాధపడుతుంది. తన్ను ఏ పురుషుడు తాకినా, లేక తాను ఏ పురుషుణ్ణి తాకినా వారు ఇలా నాశనమై పోవలసిందేనా అని దిగులు పడుతుంది.

చంద్రబాల ఆశ్రమానికి దగ్గరలోనున్న మర్రిచెట్టుపై కూర్చొని, వెన్నెల రాత్రులలో క్రీడించుచున్న దుగ్గసామి, బాపిశ్రీ దంపతులను ఎన్నో సార్లు చూస్తుంది. ఆమె కూడ అటువంటి అనుభూతిని కోరుకొంటుంది. తాను వలచిన, తనకు నచ్చిన పురుషునితో వివాహమాడి సంతానవతియై సంసార సుఖాన్ని అనుభవించే పరిస్థితి లేదే అని కృంగిపోతుంది.

ఇలా ఉండగా ష్ణ శాతవాహనుడు యుద్ధ యాత్ర నుండి తిరిగి వస్తూ, స్థూలతిష్యుడు ఉండే ప్రాంతానికి వస్తాడు. అప్పుడు స్థూలతిష్యుడు చంద్రబాలను అతనిపై ప్రయోగించాలను కొంటాడు. ఆమెను ఒక పీటపై కూర్చుండబెట్టి మంత్రం జపిస్తూ ఆమెను ప్రయోగించడానికి సిద్ధమయ్యాడు. అప్పుడు ఆమె "తాతగారూ! ప్రయోగింపకుడు. నేను ఒప్పను. నేను మృత్యువును కాను"[1] అని అరుస్తుంది.

కాని స్థూలతిష్యుడు తన ప్రయత్నం మానక ఆమెకు గాఢనిద్ర కలిగించి, ముళ్ళపొదలతో కూడిన ఒక మహారణ్యంలో ఆమెను దిగంబరిగా వదలి వెళతాడు. కాని తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లు, శ్రీకృష్ణ శాతవాహనునితో వచ్చిన వైద్యగురువు దూరం నుంచే విషబాలను చూచి రాజును ఆమె దగ్గరకు పోకుండా ఆపుతాడు. "మహాప్రభూ! ఆ బాలిక కి యున్నది. కొన యూపిరితో నున్నది. ఆమెకు వెంటనే చికిత్స చేయకున్నచో చనిపోవును.... కాని ఆమె ఏ మహత్తర విషమో సోకి అట్లయి యుండవచ్చు. ఆమె దగ్గరకు పోవుటే మృత్యువదనమున బడుట."[2]

ఇలా రాజుని ఆపి ఆ వైద్యుడు ఆమె విషం తనకు సోకకుండా ఇంకాక మహా విషాన్ని మింగి ఆమెను సమీపించి, ఆమెపై తన ఉత్తరీయాన్ని కప్పి ఆమెను తీసుకొని వెళతారు. తర్వాత రాజు గొప్ప గొప్ప వైద్యులచే వైద్యం చేయించి, ఆమె విషాన్ని పోగొట్టి ఆమెను అమృతబాలను చేస్తాడు. ఆమె అమాయకత్వము, సౌందర్యాన్ని చూసి ఆమెనే వివాహం చేసుకోవాలను కొంటాడు.

---

1. హిమబిందు – అడివి బాపిరాజు, పు: 181
2. పైదే, పు: 296.

చంద్రబాల కూడ అతణ్ణి వరిస్తుంది. కాని ఇంకను తన శరీరంపై నమ్మకము కలుగలేదు ఆమెకు. "నన్ను కుట్టిన చీమయు చచ్చిపోవును కదా. ఈ మహారాజు నన్ను ప్రేమించుచున్నాడు. అతని చూచిన మొదటి దృష్టిలోనే నాథుని గ ప్రేమించితిని"[1] అని బాధ పడుతుంది.

ఆమె పూర్తిగా అమృతబాల అయినదని వైద్యుల ద్వారా తెలిసికొని, ఆమె కౌగిలికై దగ్గరకు రాబోయాడు శ్రీకృష్ణ శాతవాహనుడు. అప్పుడు ఆమె "మహారాజా! నేను మృత్యుదేవతను. నన్నేల కోరుదురు? నాకు నీ నామస్మరణమే చాలు! మీ రూప మననమే చాలు. ఈ జన్మమున నా కింత కంటె భాగ్యము లేదు. మిమ్ము దూరమునుండి పూజింపుచు, మీ నామము స్మరింపుచు, అగస్త్యగనుల వలె యోగినినై యుండెదను"[2] అంటుంది. దీనిని బట్టి చంద్రబాల ఎంత ఉన్నతురాలో మనకు అర్థమౌతుంది.

కాని శ్రీకృష్ణ శాతవాహనుడు ఆమెకు నిజాన్ని తెలుపుతాడు. వారి వివాహానికి శ్రీముఖ శాతవాహనుడు అంగీకరిస్తాడు. ఇలా ఆమె శ్రీకృష్ణ శాతవాహనుణ్ణి వివాహమాడి భావి సామ్రాజ్ఞి ఔతుంది.

ఇలా స్థాలతిష్యుని మంత్రశక్తి ఎందుకూ పనికిరాదని, చంద్రబాల మనస్సు అమృత కలశం అని బాపిరాజు గారు ఈ పాత్ర ద్వారా మనస్సుకు గల ప్రాధాన్యాన్ని చక్కగా వివరించారు.

విషబాల పాత్రచిత్రణ పరిశీలిస్తే బాపిరాజు గారి పాత్రోన్మీలనంలో

---

1. హిమబిందు - అడివి బాపిరాజు., పు: 369.
2. పైదే., పు: 374.

గల నైపుణ్యం అనన్య సామాన్యం అని తెలుస్తుంది. హిమబిందు కథ విపరిణామానికి విషబాల పాత్ర ముఖ్యమైనది. ఆమెను శ్రీకృష్ణ శాతవాహనుడు ప్రేమించడం చేతనే, తన కుమార్తెను సామ్రాజ్ఞిగా చేయాలనుకొనే చారుగుప్తుని మనోరథం ఈడేరలేదు. ఒక విధంగా హిమబిందు, సువర్ణశ్రీల వివాహానికి విషబాలయే ముఖ్యకారణం అవుతుంది.

4.1.1.4. **శ్రీకృష్ణ శాతవాహనుడు:** "ఇప్పటి వరకు లభించిన చారిత్రక ఆధారం ప్రకారం శ్రీకృష్ణ శాతవాహనుడు, శ్రీముఖ శాతవాహనునికి సోదరుడు. శాతవాహనరాజులు పరాక్రమవంతులు. వారు సుమారు నాలుగున్నర శతాబ్దాలు ఆంధ్రదేశాన్ని సుఖింప చేశారు. దక్షిణాపథ పతులనియు, త్రిసముద్రాధి పతులనియు కీర్తింపబడిరి."[1] ఇట్టి ప్రతిష్టను సంపాదించిన శాతవాహనుల చరిత్రను ఆధారంగా చేసికొని బాపిరాజుగారు హిమబిందు నవలను రచించిరి.

బాపిరాజు గారు శ్రీముఖ శాతవాహనునికి సోదరుడైన శ్రీకృష్ణ శాతవాహనుని, ఆతని పెద్ద కుమారునిగా చిత్రించాడు. "శ్రీకృష్ణ శాతవాహనుడు మాతా పితరులపై భక్తి శ్రద్ధలు గలవాడు. గురుజన విధేయుడు. ఉత్తమగుణ సంపన్నుడు. పరోపకార నిరతుడు. అంతేగాక అతనిలో ఉత్తమ క్షత్రియునికి ఉండవలసిన గుణాలన్నీ మెండుకొని ఉండినవి. శత్రువుల పట్ల దాక్షిణ్యం ఇసుమంతయు కనబఱచువాడు కాడు."[2]

స్థాల తిష్యుని కుట్రవల్ల అతని తమ్ముడు మంజుశ్రీని చోరులు

---

1. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య బాలేందు శేఖరం., పు: 107.

2. హిమబిందు - అడివి బాపిరాజు., పు: 119.

తస్కరించారు. పుత్ర వియోగంతో బాధపడుచున్న తన తల్లిని ఓదారుస్తూ, శ్రీకృష్ణ శాతవాహనుడు ఆరుమాసాల్లో వెదకి మంజుశ్రీని ఆమెకు అప్పగిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. అతని ప్రతిజ్ఞవల్ల అతనికి గల మాతృభక్తి, సోదరప్రేమ వ్యక్తమౌతాయి. శత్రువులతో ఉజ్జయినీ, పాటలీ పుత్రాలలో అతడు చేసిన యుద్ధాలు అతని యుద్ధ విశారదకు ఉదాహరణాలు.

'రాజానే బహువల్లభాః' అనే ఆర్యోక్తి చక్రవర్తులకు బహుభార్యాత్వం సహజమని చాటుచున్నది. అయితే శాతవాహన చక్రవర్తులు ముఖ్యంగా శ్రీముఖ, శ్రీకృష్ణ శాతవాహనులు ఏకపత్నీ వ్రతులు. అందగత్తెలు ఎందరో తమ చుట్టూ ఉన్నా శ్రీకృష్ణ శాతవాహనుడు వారిని స్పృశింపలేదు. ఎందరో చక్రవర్తులు తమతమ కుమార్తెలను అర్పించడానికి సిద్ధమైనా శ్రీకృష్ణుడు మాత్రం వారిని వివాహమాడటానికి ఇష్టపడలేదు. శారీరక సౌఖ్యం కంటే మానసిక ప్రేమే ముఖ్యమని తలుస్తాడు. "తుచ్ఛానందము దేహ సంయోగము మాత్రమున జనించును. గాఢమై, గంభీరమై, అనంతమై అత్యంత గోప్యమగు మానవ ప్రకృతికా సౌఖ్యము తృప్తినీయగలదా ?"[1] అన్న శ్రీకృష్ణ శాతవాహనుని వాక్యాలు అతనిలోని చిత్త సంస్కారాన్ని వ్యక్తం చేస్తాయి.

తనకు ఆత్మేశ్వరి కాగల యువతి ఎవ్వరో శ్రీముఖ శాతవాహనుడు లీలగా ఊహాల్లో ఊహించు కొంటాడు. తండ్రి తనకు రాసిన ఉత్తరంలో హిమబిందును తనకు భార్యగా నిశ్చయించినట్లు చదివి శ్రీకృష్ణుడు ఎంతో

---

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 115.

కలవర పడుతాడు. మనసులో ఇలా అనుకొంటాడు. "తానా హిమబిందు కుమారిని సువర్ణశ్రీ శకటవిజయ మందిన దినమున చూచినాడు. ఆమె అద్భుత సౌందర్యవతి యనిన మాట నిజము. కాని ఆ సౌందర్యము తనకానశ్వర్యము మాత్రం కలిగించినది. ఆమె యందు యవసౌందర్యము, ఆంధ్ర సౌందర్యము మధురముగ మిశ్రమ మందినవి. కాని ఆమెను తానాడు చూచినప్పుడు తనలోని రసార్ద్రవమైన పులకరింపలేదు."[1]

దీనిని బట్టి హిమబిందు అతిలోక సుందరియైనా శ్రీకృష్ణ-శాతవాహనుని ఊహాసుందరి కాదు. అతని సహధర్మచారిణి కాజాలదు. అతని బదులు పులకరెత్తించిన బాలిక చంద్రబాల. వేట నెపంతో పరివారంతో అడవికి వెళ్ళిన శ్రీకృష్ణునికి కంటకావృత మహారణ్య మధ్యంలో, అపస్మారక స్థితిలో దిగంబరంగా పడి ఉన్న ఒక కన్య కనిపిస్తుంది. ఆమెను రక్షించాలని ముందుకురికినాడు. కాని వైద్యగురువు ఆమెకు ఏ మహత్తర విషమో సోకి ఇట్లా అయి ఉంటుంది; ఆమె దగ్గరకు వెళ్ళడం మృత్యువు దగ్గరకు వెళ్ళినట్లే అని చెబుతున్నా భయపడక శ్రీకృష్ణుడు, "మరి కర్తవ్యమేమి? వ్యవధి లేదు. ఆ దేవాంగన చనిపోవును. మీరు రానిచో నేను పోయెదను. ఏదిరా ఆ గొడ్డలి"[2] అని, వైద్యగురువు చెప్పే మాటలు లెక్కపెట్టకుండా ముందుకు దూకబోయినాడు. దీనిని బట్టి శ్రీకృష్ణ శాతవాహనునికి గల ధైర్యము, అసహాయులను రక్షించాలనే కర్తవ్యపాలన అర్థమవుతుంది.

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 364, 365.
2. పైదే., పు: 296.

కాని ఋషితుల్యుడైన ఆ వైద్యగురువు, యువరాజు ఆమె దగ్గరకు వెళ్తే అపాయమని తలచి "ప్రభూ! ఒక్క అడుగు ముందుకు వేసితిరా, తథాగతునిపై నాన"[1] అని అతన్ని వారించి, తనే ఒక విరుగుడు విషాన్ని మ్రింగి చంద్రబాలను రక్షిస్తాడు.

శ్రీకృష్ణ శాతవాహనుడు ఆమెను చూచిన తక్షణమే ఆమె యందు మరులు గొని ఆమెనే వివాహ మాడాలను కొంటాడు. వైద్యులచే ఆమెకు చికిత్సలు చేయిస్తాడు. చికిత్స మధ్యంలో ఆమెను చూడాలను కొంటాడు. కాని ఆమెను చూడాలంటే విషవైద్యులు రాజు చేతకూడా దివ్యౌషధాలు సేవింప చేస్తారు. అంతేకాక వైద్యులు వత్సాదని, సోమవల్లి, నిర్గుండి, శ్వేత సురస, మధూలికా, కర్పూర శిలాజిత్తు ఇంకా హిమవత్పర్వతోద్భవములైన తొమ్మిది మూలికలతో రచించిన మహౌషధాన్ని రాజు సేవించాలి. అటు వెనుక దివ్యలేపనాన్ని అతని ఒళ్ళంతా పూయాలి. ఇంత తతంగం చేస్తేగాని చంద్రబాలను రాజు దర్శించ కూడదు అంటారు.[2]

ఈ తతంగానికంతా ఒప్పుకొని చంద్రబాలను శ్రీకృష్ణ-శాతవాహనుడు చూడడానికి వెళతాడు. దీనివల్ల శ్రీకృష్ణ శాతవాహనునికి ఆ బాలికపై గల ప్రేమాభిమానాలు మనకు వ్యక్తమౌతాయి. అంతేగాక బాపిరాజు గారికి ఆయుర్వేదంలో గల ప్రవేశం కూడా తెలుస్తుంది.

---

1. హిమబిందు – అడివి బాపిరాజు, పు: 296.

2. పైదే., పు: 366.

చివరకు తల్లిదండ్రుల అనుమతితో చంద్రబాలను వివాహం చేసుకొంటాడు. సార్వభౌమునితో సరితూగగల చారుగుప్తుని కుమార్తెను కాదని, అడవిలో అనాథగా పడిఉన్న విషకన్యను అమృత కన్యగా మార్చి ఆమెనే వివాహం చేసుకొంటాడు. దీనివలన శ్రీకృష్ణ శాతవాహనుని ఔదార్యం ఎంత ఉత్కృష్టమైనదో మనకు అర్థమౌతుంది. అతని వ్యక్తిత్వం యెంత ఉన్నతమైందో తెలుస్తుంది. ఇది చారిత్రక సత్యమైనా, కాకపోయినా బాపిరాజు గారు ఈ పాత్రద్వారా ప్రతిపాదించిన ఆదర్శం ఉత్తమమైంది. బాపిరాజు గారి రచనా కౌశలానికి ఇది చక్కని ఉదాహరణ.

**4.1.1.5. నాగబంధునిక :** 'హిమబిందు' నవలలో 'నాగబంధునిక' కథానాయకుడైన సువర్ణశ్రీకి సోదరి. శిల్పాచార్యుడైన ధర్మనందుల వారి పెద్ద కుమార్తె. ఆమెను గురించి బాపిరాజు గారు ఇలా రాశారు. "నాగబంధునిక సంపూర్ణారోగ్య సమన్వితమైన యోషారత్నము. ఆమె కృష్ణానదిని వరదలు పొంగి పరవళ్లెత్తి పోవుచున్నను అన్నగారితో సమంగా నీదగలదు. గుఱ్ఱపు పందెమున అన్నగారితో సమంగా పరిగెత్త గలదు. తమ ఇంటనే పెరుగుచు తనకు చిన్నన్న వలెనున్న మహాబల గోండు యువరాజు కడ ఆటవిక విద్య నాగబంధునిక అభ్యసించి, అడవులలో సంచరించు మృగముల జాడ తీయుటలో, పక్షుల కూతల వైచిత్రము లన్నియు నవలీలగ చెప్పుకొనుటలో మేటి అయినది."[1]

ఇంకా అన్నగారితో కలసి చిత్రలేఖనం నేర్చుకొంది. సంగీతంలో

---

1. హిమబిందు - అడివి బాపిరాజు -, పు: 260, 261.

గాత్ర గానం అంటే ఆమెకెంతో ఇష్టం. ఆమె, సువర్ణశ్రీ, అచ్చు పోత పోసి నట్లు ఉంటారు. మిక్కిలి కోల మొహం, విశాల నేత్రాలు, సమనాసిక, గంభీరమైన చుబుకము ఇవన్నీ చూస్తే సువర్ణశ్రీయే స్త్రీవేషం వేసినా భ్రమ కలుగుతుంది.

"నాగ బంధునిక కడు హాయలుగురిపించు శృంగార లక్షణముల కన్న నిశిత కృపాణ సదృశమగు వీరవనితా లక్షణములు పెక్కులున్నవి"[1] ఆమె తోటి స్త్రీలు ప్రాచీన శృంగార గాథలను వింటూ సంతోష పడుతుంటే నాగబంధునిక ఆంధ్ర వీరగాథలు, రామాయణ భారత కథలు చదువుకునేది.

నాగబంధునిక అల్లరిపిల్ల అయినా చిత్రలేఖనం, శిల్పం, సంగీతం మొదలైన విద్యలను కూడ చక్కగా అభ్యసించింది. కాని శృంగార రసమంటే విముఖత చూపేది. సువర్ణశ్రీ శృంగార రస భావ పూర్ణమైన పాటలు పాడితే, ఈ చక్కెరకేళి పండ్లు నాకిష్టం కావు అని వెళ్లిపోయేది. ఆమెకు నగల యందు అభిరుచి లేదు. ఆమె ఆర్షమతాభిమాని. ఒకసారి సువర్ణశ్రీ దివ్య గుణాఢ్య పండితునిచే రచింపబడిన బృహత్కథ తాళపత్ర గ్రంథం ఇస్తే ఆమె తిరస్కరించింది. ఆమెకు బుద్ధుడు అన్నా, బౌద్ధమత గ్రంథా లన్నా ఇష్టంలేదు. కాబట్టి సువర్ణశ్రీతో "అన్నా! బుద్ధ భగవానుని బోధ నాకు విసుగు జనింప చేయును. అహింసయుట, అష్టమార్గము లట. కాలము చెల్లిన వృద్ధులకే శ్రమణకుని బోధ నచ్చునేమో? నాకు మాత్రం స్థాలతిష్ఠ మహర్షి బోధనలు ఆనందోత్సాహములు కలుగజేయును."[2] అంటుంది.

---

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 32.
2. పైదే, పు: 33.

నాగబంధునిక సూక్ష్మబుద్ధి కలది. "ఆమెకు మైత్రేయి, గార్గి, సంఘమిత్రలు అనిన గౌరవం. సత్యభామ అనిన పరమప్రీతి. స్త్రీ కత్తి పట్టినగాని లోకంలో దుఃఖం నశించదు"[1] అంటుంది. "స్త్రీ ప్రేమించును. తల్లియగును. కాని ప్రేమ మాత్ర జీవనయగు బాలిక స్త్రీ మాత్రమగునని ఆమె అన్నతో వాదించును."[2]

నాగబంధునిక సమవర్తిని ప్రేమిస్తుంది. గంభీర హృదయ కనుక ఎవరికీ తన భావాలు తెల్పదు. నాగబంధునిక తన అన్న సహాయంతో పురుషవేషం వేసుకొని సమదర్శికి అంగరక్షకునిగా వెళ్ళి అతన్ని అనేకసార్లు ఆపదనుండి రక్షిస్తుంది. తనకు అంగరక్షకత్వం వహించిన వ్యక్తి పురుషుడు కాదని, స్త్రీ అని, సువర్ణశ్రీ చెల్లెలని సమదర్శి తెలుసుకొంటాడు. ఆమె ధైర్య సాహసాలు, ప్రేమను చూచి ఆమెనే వివాహం చేసుకొంటాడు. నాగబంధునిక సమదర్శిని పెండ్లియాడిన తర్వాత, భార్యగా మాత్రమే కాక అతనికి మంత్రిగాను, అంగరక్షకురాలిగాను తోడ్పడుతుంది. రాజప్రతినిధిగా నియమింపబడిన సమదర్శికి అన్ని విషయాలలో ఆమె తన సహకారాన్ని అందిస్తుంది. "ఇరువురు సమముగ యుద్ధములకు బోదురు. ఇరువురు సభయందధివశించి తీర్పులనిత్తురు. ఇరువురు ఆలోచనా మందిరాన చంద్రస్వామి మొదలగు మంత్రులతో రాజ్య వ్యవహారం ఆలోచింతురు."[3] అంతేగాక ఆమె ఆంధ్రుల సంస్కృతి, నాగరికతలు భిన్న ప్రదేశాలకు విస్తరింప జేయవలసిందిగా

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 261.
2. పైదే., పు: 261.
3. పైదే., పు: 476.

భర్తను ప్రోత్సహిస్తుంది.

హిమబిందు, సువర్ణశ్రీలు తమకు శాశ్వత వియోగం కలుగనున్నదని తెలిసి ఒకరికోసం ఒకరు పరితపిస్తున్న సమయంలో వారిని ఓదార్చి ధైర్యవచనాలు చెప్తుంది నాగబంధునిక. ఆమె మాటల వల్ల వాళ్ళలో క్రొత్త ఆశలు రేకెత్తుతాయి. హిమబిందును చోరులు తస్కరించినప్పుడు, ఆమెను వెతికేందుకు వెళ్ళే సువర్ణశ్రీతో నాగబంధునిక "అన్నా! నీవు క్షేమముగా వెళ్ళిరా. మా అన్న వీరుడని చెప్పుకొనుట ఎంతో ముచ్చట నాకు. హిమబిందును రక్షించుకొనుము. ఆ పని ఇంక ఎవ్వరును చేయలేరు. నేను నీకు తమ్ముడనైనచో, ఈ విపత్తులో నీ వెనువెంట వచ్చియుందును. ఆంధ్ర శత్రువుల నాశనము చేసి నీ ప్రియురాలిని నీవే తీసికొనిరా"[1] అంటుంది.

హిమబిందు నవలలో నాగబంధునిక పాత్ర అంత ప్రధానమైనది కాకున్నా, బాపిరాజు గారి చేతిలో పడిన తర్వాత ఆ పాత్ర కూడా ప్రధానమే అన్పిస్తుంది. విడిగా నాగబంధునిక కథమాత్రం చెప్పుకుంటే ఆమె కథానాయిక కాబోలు అనే సందేహం వస్తుంది. ఆంధ్రులపై అభిమానంతో, ఆంధ్రవీరులు పిరికివారు కారని, యుద్ధంలో ధైర్యసాహసాలు చూపగలరని, స్త్రీలు పురుషులకు ఏ మాత్రం తీసిపోరని బాపిరాజు గారు ఈ పాత్ర ద్వారా వివరించారు. నాగబంధునిక సమవర్తితో సమానంగా యుద్ధం చేస్తూ, అపర అపరాజితాదేవియై పకపకమని నవ్వుచూ-

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 272, 273.

" ఆంధ్ర వీర రారా !

అరిపైని దుముకరా!

పుష్ప పురము నీదేరా

పురంజయుడు నీవేరా! "[1]

అని ఆంధ్ర వీరులకు హుషారు నొసగినట్లు రాసి బాపిరాజుగారు తమ ఆంధ్రాభిమానాన్ని చాటుకొన్నారు. బాపిరాజుగారు ఈమెను హిమబిందు, చంద్రబాలల వలె శృంగార నాయికను చేయకుండా వీర వనితగా మలచారు.

**4.1.1.6. సమదర్శి:** సమదర్శి, ప్రియదర్శి శాతవాహనుని కుమారుడు. ఇతడు మహావీరుడు. సమర్థుడైన సేనాధిపతి. శాతవాహన సామ్రాజ్యంపై ఎత్తి వచ్చిన అభీరులపైకి శ్రీముఖ శాతవాహనుడు సమదర్శిని సైన్యమిచ్చి పంపాడు. సమదర్శి అభీరుల నోడించి, తరిమి వేసి వారి పతాకములన్నియు కొనివచ్చి సార్వభౌముని పాదాలచెంత అర్పిస్తాడు. అప్పుడు ఆనందించిన చక్రవర్తి, నిండుసభలో సమదర్శికి " శాతవాహన శత్రు సమవర్తి "[2] అనే బిరుదు ప్రసాదిస్తాడు. అందుకే అతని బంధువులు, మిత్రులు ' సమవర్తి ' అని కూడ పిలుస్తారు.

సమదర్శి చారుగుప్తుని మేనల్లుడు. చక్రవర్తికి ప్రీతిపాత్రుడు. సమదర్శి దళపతిగా ఆంధ్ర సైన్యంలో చేరినాడు. ఒక సంవత్సరంలో అతడు ముఖపతి, గణపతి, వాహినీ పతియై మరుసటి సంవత్సరంలో చమూపతి యైనాడు. ఎన్నో యుద్ధాలలో పాల్గొని, ఆంధ్రసైన్యానికి మంచికీర్తిని తెచ్చిపెడతాడు.

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 412.
2. పైదే., పు: 16.

చక్రవర్తి జన్మదినోత్సవాల సందర్భంలో ఎడ్లబండ్ల పందెంలో చారుగుప్తుని తరఫున సమదర్శి పందెంలో పాల్గొంటాడు. ప్రజలంతా అతని విజయాన్ని ఊహించి ఇలా అనుకొంటారు. "సమవర్తి జయము గాంచునని అందరికీ తెలియును. లాటి దేశములకు బోయి, యచ్చట జరిగిన ప్రదర్శనముల విజయమొంది ఆంధ్ర గౌరవము నిలిపినది సమవర్తియే గదా! అతడు నడుపజాలని రథము లేదు. ఎక్కజాలని గుఱ్ఱము లేదు. అతడు చెప్పిన వినని బలీవర్ణమున్నదా?"[1] అని ప్రజలంతా అనుకొంటూ ఉంటారు. కాని అపజయమే ఎరుగని సమదర్శి సువర్ణశ్రీతో ఉక్ష శకట పరీక్షలో ఓడిపోతాడు. తొలుత అది తీరని అవమానంగా భావిస్తాడు. కాని నిదానంగా యోచించి క్రీడాస్ఫూర్తితో సువర్ణశ్రీని మెచ్చుకుంటాడు.

చారుగుప్తుడు హిమబిందును ఆంధ్ర సామ్రాజ్ఞి చేయాలని కలలు కంటాడు. అందుకు సమదర్శి అడ్డుకాకుండా ఉండేందుకు అతనిని మాళవ దేశంపై ఉపసేనాధ్యక్షునిగా నియమింపజేసి తన అడ్డుగోడ తొలగించుకొంటాడు. చారుగుప్తుని రాజకీయప్రత్తెత్తులు తెలియని సమదర్శి, వీరహృదయం ఉత్సాహంతో ఉరకలు వేస్తూఉంటే మాళవదేశం వెళుతాడు.

సమదర్శి దేశభక్తి, ప్రభుభక్తిగల గొప్ప వీరుడు. ఆంధ్రులకు, మాళవులకు భయంకర పోరాటం జరుగుతున్న సందర్భంలో మాళవరాజు సమదర్శిని తనవైపు లాక్కొనే దానికి సమదర్శికి ఇలా ఆశలు చూపిస్తాడు. "మీరు వీరాగ్రేసరులు, యౌవనవంతులు. మీరు మాలోన చేరిపొండు.

1. హిమబిందు — అడివి బాపిరాజు, పు: 38.

మీకు మా రాజభయము మిడుటయే గాక ఆంధ్ర సామ్రాజ్యము సమస్తము జయించి మీ కాధిపత్యం కట్టం గలవారు. మా యొడయనికి స్నేహితులై సేనా నాయకులై మీరు ఆంధ్రభూమిని పాలించెదరు గాక!"[1] అని మాళవ రాయబారి సందేశాన్ని విని, ప్రలోభ పడక, మాళవ రాజుపై అసహ్యం వేయగా మాళవులపై యుద్ధాన్ని తీవ్రతరం చేస్తాడు. దీనిని బట్టి సమదర్శి ఎంత ప్రభు భక్తి, దేశభక్తి గలవాడో తెలుస్తుంది.

సమదర్శి గొప్పవీరుడు. అతనిలో చురుకుపాలెక్కువ. వెనుక ముందు చూడని సాహసి. ఉజ్జయినికి నాలుగు గోరుతల, 1260 ధనువుల దూరాన ఉన్న మాళవసైన్యాన్ని మబ్బులు లేని సూర్యుని వలె చండప్రచండుడై తాకుతాడు. తన వీర ప్రతాపంతో మాళవసైన్యాన్ని చీకాకు పరుస్తాడు. అతడు యుద్ధతంత్రంలో ఆరితేరిన బంటు కావడం వల్లనే ఎంత సైన్యం వచ్చినా, ధైర్యం వీడకుండా యుద్ధ నైపుణ్యాన్ని ప్రదర్శించే వాడు. సమదర్శి యువకుడైనా సేనా నాయకుల్లో ఉత్తముడు. తాము వెంట తెచ్చుకొన్న ఆహార పదార్థాలు, వైద్య సౌకర్యాలు అయిపోతున్నా మొక్కవోని ధైర్యంతో ఈ సమస్యల్ని ఎదుర్కొనే వాడు. సైన్యానికి ధైర్యం చెప్తూ వారిని ఉత్సాహపరచే వాడు. సమదర్శి సహకారమే లేకపోతే ఉజ్జయిని చక్రవర్తి వశమయ్యేది కాదు. అందుకే అతని సాహసాన్ని, ధైర్యాన్ని, ప్రభుభక్తిని, దేశభక్తిని గుర్తించి చక్రవర్తి అతనిని భరుకచ్ఛపురానికి రాజ ప్రతినిధిని చేస్తాడు. " సమవర్తి ఉత్తమ వీరుడు. మహాపురుషుడు. ఉజ్జయిని కోటనాతడు రక్షించిన విధానము, ఆ నగరప్రజల నాతడు కాపాడిన రీతి,

---

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు; 266.

వారిపై ఆ వీరుడు వర్షము కురిపించిన ప్రేమ , ఆంధ్రసైనికుల ఆ సైన్యాధ్యక్షుడు తంత్రివలె కాపాడిన చరిత్ర ఒక్క మహా ప్రబంధమునకు విషయమై తీరును "[1] అని బాపిరాజుగారు శ్లాఘించారు.

సమదర్శి గొప్ప ఆశాజీవి కూడా. మనస్సు పరిపక్వం కాని దశలో హిమబిందుపై ఎన్నో ఆశలు పెట్టుకుంటాడు. ఒకసారి హిమబిందుకూడా అతనిపై ఇచ్ఛలేనట్లు తెలుపుతుంది. హిమబిందు " నువ్వు త్వరగా పెండ్లి చేసుకో బావా ! మా అత్తయ్య కోడలి మొహంకోసం వాచివుంది. మేమంతా నీ పెండ్లి ఎప్పుడెప్పుడని కానుకలతో కనిపెట్టుకొని యున్నాము "[2] అని చెప్తుంది. చారుగుప్తుడు కూడా హిమబిందు వివాహం శ్రీకృష్ణ శాతవాహనునితో జరపడానికి నిశ్చయించుకొన్నాడనే విషయం తెలుస్తుంది. సమదర్శి నిరాశ చెందక తన మనస్సును సమాధాన పరచుకొని , త్యాగశీలియై తనను ప్రాణప్రదంగా ప్రేమిస్తున్న నాగబంధునికను తన తల్లి అనుమతితో వివాహం చేసుకొంటాడు.

హిమబిందు సువర్ణశ్రీని ప్రేమించినా తన మేనబావ సమదర్శి అంటే గౌరవముండేది. ఒకసారి నాగబంధునికతో సమదర్శిని గురించి ఇలా అంటుంది. " అతడు ఉత్తముడు. ప్రాణములకయినా వెనుదీయడు. అయినను తనకు జరుగవలసిన గౌరవములు జరిగి తీరవలయునను పౌరుషము గలవాడు. "[3]

---

. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 287.

2. పైదే., పు: 90

3. పైదే., పు: 263.

ఇలా సమదర్శి చక్రవర్తికి విశ్వాస పాత్రుడై, 'శాతవాహన శత్రు సమవర్తి' బిరుదాంకితుడై, బంధు మిత్రులు సమవర్తి అనే బిరుద నామంతో పిలువగా, సువర్ణశ్రీ చెల్లెలు నాగబంధునికను వివాహం చేసికొని భరు కచ్ఛానికి రాజప్రతినిధియై పరిపాలిస్తూ సంతోషంగా జీవిస్తాడు. ఆశాజీవి ఎలా తన జీవితాన్ని సుఖమయం చేసుకోగలడో బాపిరాజుగారు స పాత్రద్వారా నిరూపించారు.

**4.1.1.7. స్థాలతిష్యులు:** అడివి బాపిరాజు గారి హిమబిందు నవలలో స్థాలతిష్యుని పాత్ర ఒక విలక్షణమైన పాత్ర. ముద్రారాక్షసం లోని రాక్షస మంత్రి పాత్రను ఆధారం చేసికొని ఈ పాత్రను బాపిరాజుగారు సృష్టించారేమో అనిపిస్తుంది. రాక్షసమంత్రి సృష్టించిన విషకన్య నాశనం కాగా, స్థాలతిష్యుని విషబాల అమృతబాలగా మారి భావి సమ్రాట్టుకు పత్నిగా ఔతుంది. ఇదే బాపిరాజు గారి ప్రత్యేకత.

స్థాలతిష్యుడు ఆంధ్ర బ్రాహ్మణుడు. ఆపస్తంబ సూత్రుడు. వేదవేదాంగాలను గళగ్రాహ్యమొనరించుకొనటంతో పాటు సర్వశాస్త్రాల్ని అధ్యయనం చేసిన మహామనీషి. "స్థాలతిష్యులు సర్వవిద్యా మహార్ణవ స్వరూపులు. వేదములాయన ముఖమునందు ప్రజ్వరిల్లుచుండును. వేద భాష్యములాయన ఫాలమున తేజరిల్లును. ఉపనిషత్తులన్నియు ఆయన చూపులలో తాండవించును. ప్రస్థానత్రయము మాతని హృదయము. అథర్వణ వేదమాతని ఊడిపుగత్తె. ధన్వంతరి వలె ఆతని దక్షిణ హస్తమున అమృత కలశమున్నది. తక్షకుని వలె అతని వామహస్తమున విషకుంభమున్నది."[1]

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 108.

స్థూల తిష్యునికి ఒకే ఒక పుత్రుడు నందిదత్తుడు పడవ ప్రమాదంలో కొట్టుకొని పోయాడు. అతడి దేహం కూడా లభించ లేదు. "అతని భార్య తన పతి చిహ్నంతో సహగమనం చేసింది"[1] వారికి చంద్రబాల అనే ఒకే ఒక పుత్రిక కలదు. తన పుత్రుని, కోడలిని కోల్పోవడంతో స్థూలతిష్యుని హృదయం కరడు కట్టుకొని పోతుంది. మార్దవం మరగున పడి పోతుంది. అతని శేష జీవితాన్ని వైదిక మతాభివృద్ధి కోసం అంకితం చేస్తాడు. ఆ నాడు సాతవాహన రాజులు బౌద్ధ మతావలంబులై, బౌద్ధ మతాన్ని శాఖోప శాఖలుగా విస్తరింప చేస్తారు. అట్లని వైదిక మతాన్ని నిర్లక్ష్యం చేయరు. వారు ఆచరించేది బౌద్ధ మతమైనా, వేద, బౌద్ధాలను రెండింటిని సమదృష్టితోనే చూశారు. కాని ఎక్కడ బౌద్ధ మత విస్తరణతో వైదిక మతం బీటలు వారుతుందో అని, ఆర్ష మతం నామరూపాలు లేకుండా పోతుందో అని భయపడి విస్తరిస్తున్న బౌద్ధ మతాన్ని నాశనం చేసి, ఆర్ష మతాన్ని పునరుద్ధరించడానికి స్థూలతిష్యుడు కంకణం కట్టుకొంటాడు. తన దృఢ దీక్షకు తన మనుమరాలిని కూడా పావుగా వాడుకోవడానికి సంకోచించ లేదు. స్థూల తిష్యుడు కంపిత హస్తము చాచి "పండితులారా! ఈమె నా ముద్దుల మనుమరాలు. నా కుమారునకీమె యొక్కతే సంతానము. నేను నా పుత్రునెట్లు ప్రేమించి యుంటినో అది లోకమున కెఱుక. ఈమెను మన యజ్ఞమునకు ధారబోసితిని. ఈమె దేహ ప్రాణములు, మానము అంతయు జగద్ధాత్రి లోకపావని యగు మహాశక్తికి అర్పించినాను.

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 112.

ఈమెను పరమేశ్వరుని కంకిత మిచ్చితిని. నా విధానమును వైదిక ధర్మాగ్నిలో కల్పితిని. ఈమెయే మన సర్వవాంఛలను దీర్చు కల్ప వృక్షము. ఈమెయే ఈ పుణ్యభూమిని పవిత్రమొనరింప జన్మించిన కామధేనువు"[1] అని పల్కుతాడు. ఇలా తన ఆశయ సిద్ధికోసం తన మనుమరాలినే యజ్ఞ పశువుగా చేసిన వెఱ్ఱి ఆర్షమతాభిమాని స్థూలతిష్యుడు చంద్రబాలను విషకన్యగా మార్చి శ్రీకృష్ణ శాతవాహనుని హతమార్చడం, అతని సోదరుడైన మంజుశ్రీని బంధించి అతనికి వైదికధర్మాలను నూరిపోసి, ఆర్షమతోద్ధారకుడుగా మార్చి అతన్ని ఆంధ్ర సింహాసనంపై కూర్చోపెట్టడం, ఆ రకంగా వైదిక మతాన్ని పునరుద్ధరించడం స్థూలతిష్యుని సంకల్పం.

మనుమరాలిని విషకన్యగా మార్చేందుకు ఎంతో శ్రమ తీసుకొంటాడు. గంభీరోచ్చాటనల శత్రుమారణ రూపమైన అభిచార హోమం చేస్తాడు.

"ఓ అగ్నివాయు సూర్యచంద్ర జలములారా!
మమ్మెవ్వడు ద్వేషించుచున్నాడో,
ఎవ్వని మేము ద్వేషించుచున్నామో,
వానిని మీ తాపశక్తిచే తపింపజేయుడు"[2]

"ఓ మంత్రమా! నీవు మహాశక్తిచే మా విరోధుల నీ బాలిక కడకు ఆకర్షింపుము. నీవామె వాక్కులలో, చూపులలో, ఆమె స్తనములలో చేరుము"

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 112.
2. పైదే., పు: 103.
3. పైదే. పు: 110.

" ఈ సుందరి శ్రీకృష్ణ శాతవాహనుని అగ్ని శలభము నాక ర్షించినట్లు ఆకర్షించు గాక."

"ఈ యువతి శ్రీకృష్ణ శాతవాహనుని దగ్ధము చేయుగాక."

ఇలా స్థూలతిష్యుడు మంత్రం జపించి చంద్రబాలను శ్రీకృష్ణ శాతవాహను నిపై ప్రయోగించే దివ్యాస్త్రం చేస్తాడు. కాని విధి వక్రించింది. స్థూలతిష్యుని పన్నాగం ఫలించలేదు. ఎవరిని తాను ఈ బాలిక అనే అస్త్రంచే దగ్ధం చేయాలనుకొంటాడో, ఆ శ్రీకృష్ణ శాతవాహనున్నే చంద్రబాల వరించి, వరింప జేసుకొని, వివాహమాడి సామ్రాజ్ఞి అయింది.

చివరకు తన కుమారుడు నందిదత్తుడు మరణించలేదని, అతడే అమృత పాదార్పుతులు అని గుర్తించి, గతస్మృతి కోల్పోయిన అతని తల పగులగొట్టి చికిత్సచేసి అతణ్ణి మామూలు మనిషిని చేస్తాడు.

ఈ సంఘటనతో స్థూలతిష్యుని లోని క్రౌర్యం నశించి సాత్వికభావం అబ్బుతుంది. చక్రవర్తి శ్రీముఖ శాతవాహనుడు కూడా అతని దుష్కృత్యాలను మన్నించి అతని పట్ల భక్తి భావాన్ని ప్రకటిస్తాడు. అతణ్ణి, అతని పరివారాన్ని శిక్షింపగల సమర్థుడై యుండీ చక్రవర్తి ఉదాసీన వైఖరి వహిస్తాడు. రచయిత ఉద్దేశ్యం ఇలా ఉండవచ్చు. స్థూలతిష్యుడు ఏ కృత్యం చేసినా తన స్వార్థానికి చేయలేదు. అందుకే అతన్ని దుష్టుడు, దుర్మార్గుడు అనకుండా నవల పొడుగునా స్థూలతిష్య మహర్షి అనియే రచయిత సంబోధించాడు. " జీవితంలో కాపట్యం ఎరుగని వాడు కావడం

హిమబిందు – అడివి బాపిరాజు., పు: 111.

తుదకు స్థాలతిష్యుల వారిలో కూడా మానసికమైన మార్పుని సూచించి దివ్యునిగా చేశారు బాపిరాజుగారు."[1] అని శ్రీ మొదలి-నాగభూషణ శర్మగారు తెలుగు నవలా వికాసంలో అభిప్రాయపడ్డారు.

స్థాలతిష్యుడు ఆర్షమతాభిమాని. ఆర్షమతాన్ని పునః ప్రతిష్ఠించాలనే కోరికతోనే తనను, తన ఆత్మీయులను, తన జీవితాన్ని ధారబోశాడు. అతని ఉద్దేశ్యం ఒకరకంగా మంచిదే అయినా, అతడు ఎన్నుకున్న పద్ధతి సక్రమమైంది కాదు. ఈ విషయాన్ని స్పష్టం చేసేందుకే రచయిత ఈ పాత్రని సృష్టించారని పిస్తుంది.

శివభక్తులు, విష్ణుభక్తుల కొట్లాటలవల్ల దేశంలో అరాచకత్వం ప్రబలుతుంటే, కవిబ్రహ్మ తిక్కన సోమయాజి హరిహరులకు అభేదం కల్పించి తన కావ్యాన్ని హరిహరులకే అంకితం చేస్తాడు. అట్లే ఆర్షమతానికి ప్రతినిధిగా స్థాలతిష్యుని, బౌద్ధమతానికి ప్రతినిధిగా అతని కుమారుడైన నందిదత్తుని (అమృతపాదార్హాతులు) సృష్టించి, ఆర్ష, బౌద్ధ మతాలకు కూడా అభేదం కల్పించి, ఆ రెండు మతాల జన్యజనక సంబంధాన్ని చెప్పక చెప్పిన 'నవీన కవిబ్రహ్మ' బాపిరాజుగారని చెప్పుటలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు. మతం కంటే మానవత్వం గొప్పదని బాపిరాజుగారీ నవల ద్వారా సందేశమిచ్చారు.

1. తెలుగు నవలా వికాసం — శ్రీ మొదలి నాగభూషణశర్మ., పుః 279.

## 4.1.2. అడవి శాంతిశ్రీ :

**4.1.2.1. అడవిశాంతిశ్రీ :** శాంతిశ్రీ ఇక్ష్వాకు చక్రవర్తి అయిన శాంతి-మూలుని కుమార్తె. ఈ విషయం చారిత్రక సత్యం. "శాంతమూలునికి 'మాఢరి' యందు వీరపురుషదత్తుడు జనించెను. వీరపురుష దత్తునికి ఒక సోదరి కలదు. ఆమె పేరు అటవి శాంతిశ్రీ. ఈమె ధనక కులజుడైన మహా సేనాపతి, మహా దండ నాయక 'ఖంద విసాఖంణాక' అనగా స్కంద విశాఖుని భార్య."[1]

శాంతిశ్రీ అతిలోక సౌందర్యవతి. అలాంటి అందగత్తె యుగానికి ఒకరో, ఇద్దరో పుడతారు. వయస్సుతో పాటు ఆమె సౌందర్యం వికసించిందే గాని, మనస్సు మాత్రం వికసించలేదు. ఆమె సౌందర్యానికి ముగ్ధులై విష్ణుస్కంధ శాతకర్ణి, పులమావి, మగధలోని గుప్తమహారాజులు, అపరాంతక పతి అభీర కులార్ణవ చంద్రుడు, కౌశికీ పుత్ర ఈశ్వర సేన మహారాజు మొదలైన వారెందరో ఆమెను వివాహమాడడానికి నిశ్చయించుకొంటారు. ముఖ్యంగా దుష్టుడైన పులమావి ఆమెను ఎలాగైనా, చివరకు నిర్బంధించైనా వివాహం చేసుకోవాలను కొంటాడు. బ్రహ్మదత్తుడు కూడా ఆమె అద్భుత సౌందర్యాన్ని చూచి ఆమెనే వివాహమాడాలని తలపోస్తాడు.

కాని ఇంతటి అసమాన సౌందర్యరాశి అయిన శాంతిశ్రీ మనః ప్రవృత్తి మాత్రం చాల చిత్రమైంది. ఆమెకు ఎవరిపట్లా కోపతాపాలు లేవు. రాగ ద్వేషాలు అసలే లేవు. నవ్వు అంటే ఏమో తెలియదు. ఆనందాశ్రువులుగాని,

---

1. 'విజ్ఞాన సర్వస్వము' (మూ.సం) - పు:107.

దుఃఖాశ్రువులుగాని ఎన్నడూ రాల్చి ఎరుగదు. ఆ అందాలరాశికి ఆభరణాలపై గాని, వస్త్రాలపై గాని మోజు లేదు. అలంకరణపై గాని, లేపనాలపై గానీ అపేక్షలేదు. వయస్సు పెరిగి యౌవనమంకురించినా ఆమె ఎవరినీ ప్రేమించ లేదు. మారభావం పొడసూపలేదు. ఆమెకు సంగీతమన్నా, కవిత్వమన్నా గిట్టదు. ఆమె అభిమానించేది ఒక్క బౌద్ధమతాన్ని మాత్రమే. ఆమెకు తెలిసింది బుద్ధభగవానుడు, ఆయన ప్రతిపాదించిన అహింసాసిద్ధాంతం. ఆమె ఇష్టపడేది బౌద్ధమత తత్త్వం. ఆమె చదివేది బౌద్ధ జాతక కథలు. కాని ఈమె వెట్టి బాలిక కాదు. ఈమె గ్రహణ ధారణ శక్తికి ఈమె గురుదేవులే ఆశ్చర్యచకితులౌతారు. బ్రహ్మదత్తుని అభిప్రాయ ప్రకారం "ఆమె వాసనలేని పువ్వు. ఆమె ఎవ్వరితోను వేళాకోళంగా మాట్లాడి ఎరుగదు. ఎవరితోనూ, ఎప్పుడూ హాస్యోక్తులు పలుకదు. ఇతరులు ఎంత హాస్యం చేసినా, అది నిజమనే అనుకొంటుంది గాని తనను ఆటపట్టిస్తున్నారు అనుకోదు."[1]

శాంతిశ్రీకి సంగీతం పట్ల అభిమానం లేకున్నా శ్రావ్యంగా పాడేది. ఆమె కంఠంలో వెలువడిన మధురమైన గీతాల్ని విన్నవారు ఆశ్చర్యపడేవారు. ఇలాంటి మనస్తత్త్వం కల్గిన శాంతిశ్రీ వివాహానికి మానసికంగా ఎలా సిద్ధపడుతుంది. ఈ స్వభావాన్ని చూచి శాంతిమూల మహారాజు లోలోపల బాధపడుతూ ఉంటాడు. ఎలాగైనా తన కుమార్తెను మార్చి వివాహానికి యోగ్యురాలిగా చెయ్యాలని

---

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు., పు: 31.

తహతహలాడుతుంటాడు. కాని శాంతిమూలుడు మేధావి. తన కుమార్తె స్వభావాన్ని మార్చగల సమర్థుడు, యోగ్యుడు బ్రహ్మదత్తుడొక్కడే అని గుర్తించి, బ్రహ్మదత్తుని శాంతిశ్రీకి గురువుగా నియమిస్తాడు. మొట్ట మొదట బ్రహ్మదత్తుని గురుత్వాన్ని అంగీకరించడానికి శాంతిశ్రీ మనస్సు ఇష్టపడదు. కాని తండ్రి మనస్సు నొప్పించలేక బ్రహ్మదత్తుని పట్ల అయిష్టతను, నిరసన భావాన్ని ప్రకటించదు.

బ్రహ్మదత్తుడు శాంతిశ్రీకి చదువు చెప్పుటకు ముందు తానను కొన్న మాటలు ఆమె స్వభావాన్ని వ్యక్తం చేస్తాయి.

“ఆ బాల భిక్షుకిని, కావాలని సంకల్పం పూనినదంటారు. ఆమె హృదయంలో కామగ్రంథం లేదట. తల్లిదండ్రులన్న ప్రేమ లేదట. వారి ఎడల గౌరవంతో సంచరిస్తుందట. ఆమె హృదయం శుద్ధ శూన్యం, తెల్లటి రాయి అంటారు. కాని ఆమె స్వభావం సాత్వికమట. ఓహో! ఏమి అందం! అలౌకికమా సౌందర్యం! ఆ పరమసుందరికి తాను, యువకుడు, అవివాహితుడు ఎలా చదువు చెప్పడం”[1]

శాంతిశ్రీకి విద్యనేర్పడానికి బ్రహ్మదత్తుడు అవలంభించిన విధానం చాల చిత్రమైంది. సాధారణంగా శిష్యులు ప్రశ్నిస్తే గురువులు ఉపదేశించి శిష్యుల సందేహాలు తీరుస్తారు. కాని ఇక్కడ గురువే పృచ్ఛ చేయడం, శిష్యురాలు సమాధానం ఇవ్వడం జరిగింది. ఇది విచిత్రమైన విద్యాభ్యాసం. “ఆమె బ్రహ్మదత్తునితో సంభాషించిన

---

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు, పు: 52.

విధానం, ఆమెకున్న అపారమైన ధార్మిక బుద్ధి, ఆధ్యా నిష్ఠ, సునిశిత మేధ, గ్రహణ శక్తి వ్యక్తమౌతాయి."1

వసంతోత్సవాల సందర్భంలో బ్రహ్మదత్తుడు శాంతిశ్రీని రతీదేవిగా ఎన్నుకొని తన ప్రేమను పరోక్షంగా ఆమెకు తెల్పుతాడు. కాని శాంతిశ్రీ విరాగియై నిర్వికార భావాన్ని ప్రకటిస్తుంది. ఇలా తొలుత బ్రహ్మదత్తుని ప్రేమను తృణీకరించినా క్రమంగా అతని పాండిత్యం, ప్రతిభ, ఉదాత్తమైన వ్యక్తిత్వం, రూప సౌందర్యాల నన్నింటిని చూచి అతని యెడల ఆకర్షితురాలై శాంతిశ్రీ కూడ బ్రహ్మదత్తుని ప్రేమిస్తుంది.

రాయబారిగా వెళ్ళిన బ్రహ్మదత్తుని పులమావి బంధించగా శాంతిశ్రీ వీరనారియై యువతీ సైన్యాన్ని తీసికొని పులమావిపై దండెత్తి, అతనిని బంధించి బ్రహ్మదత్తుడ్ని బంధ విముక్తుడ్ని చేస్తుంది. మరొక పర్యాయం పులమావికి బుద్ధి చెప్పాలని, శాంత మూలుని చెల్లెలైన శాంతిశ్రీ నాయకత్వంలో వీర వనితలంతా ఒక బృందంగా ఏర్పడి బయలు దేరుతారు. ఈ బృందంలో శాంతిశ్రీ కూడా ప్రముఖ పాత్ర వహిస్తుంది. కాని ధూర్తుడైన పులమావికి బందీగా చిక్కుతుంది. పులమావి ఆజ్ఞపై దాసీలు శాంతిశ్రీని తల్పంపై పరుండబెట్టి త్రాళ్ళతో కట్టేస్తారు. తన కామతృష్ణ తీర్చుకోవాలని మధువు సేవించి వస్తూ వస్తూ హఠాత్తుగా వెన్ను విరుచుకొని పడి మరణిస్తాడు. ఈ లోపల పులమావి భార్య శ్వేతశ్రీ దేవి శాంతిశ్రీని కాపాడుతుంది.

అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు, పు; 54,55.

ఇలా విరాగిగా ఉన్న శాంతిశ్రీ చివరకు తనకు తెలియకుండానే బ్రహ్మదత్తుని ప్రాణప్రదంగా ప్రేమిస్తుంది. బ్రహ్మదత్తుడు పడవ ప్రమాదంలో చిక్కినప్పుడు ఆమె పడ్డ ఆవేదన, ఫ్రులమావి అతన్ని బంధించినప్పుడు ఆమె చేసిన సాహసం ఇందుకు నిదర్శనం. చివరికి బ్రహ్మదత్తునికి తన ప్రేమను తెలిపి, వివాహమాడి తన వారికందరికీ ఆనందం కలిగిస్తుంది. అడవుల్ని నిర్మూలించి, ఆ ప్రాంతాల్ని సస్యశ్యామలం చేసి, 'అడవి' బిరుదం పొందిన ధనక కులజుడైన అడవి బ్రహ్మదత్తుని పెండ్లాడి, శాంతిశ్రీ రాకుమారి అడవి శాంతిశ్రీ అవుతుంది. ఈ నాయిక పేరు మీదనే అడివి బాపిరాజు గారు నవలకు 'అడవి శాంతిశ్రీ' అనే నామకరణం చేశారు.

4.1.2.2. **బ్రహ్మదత్తుడు:** అడివి బాపిరాజు గారు రచించిన 'అడవి శాంతిశ్రీ' నవలలో కథానాయకుడు బ్రహ్మదత్తుడు. ఇతడు రాజనీతి విశారదుడు. సేనాపతి. సంస్కృతాంధ్ర, ప్రాకృత భాషల్లో మహా పండితుడు, కవి. అంతేగాక తన కావ్యాలను స్వరబద్ధం చేసి శ్రావ్యంగా గానం చేయగల మేటి గాయకుడు. వేద వేదాంగ పారంగతుడు. బ్రహ్మజ్ఞుడు. బాపిరాజు గారు ఈతని పాత్రను ఇంచుమించు చరిత్రానుసరణంగానే సృష్టించారు అని చెప్పవచ్చు.

బ్రహ్మదత్తుని గుణగణాలను వర్ణిస్తూ రచయిత "పండిత లోకము ఆయనకు బ్రహ్మదత్త బిరుదం ఇచ్చెనట"[1] అని రాశారు.

బాపిరాజు గారి అభిప్రాయానుసారం బ్రహ్మదత్తుడు అన్నది

---

1. అడవిశాంతిశ్రీ — అడివి బాపిరాజు, పు: 20.

ఒక బిరుదు మాత్రమే అని స్పష్టమౌతుంది. దీనిని బట్టి బ్రహ్మదత్తునికి తల్లిదండ్రులు పెట్టిన పేరేదో ఉండి ఉండాలి. బాపిరాజు గారు బ్రహ్మదత్తుని ఆ పేరును నవలలో ఎక్కడా ప్రస్తావించలేదు.

కాని చరిత్ర కథనం ఇలా ఉంది –

1. "శాంతి మూలుని కుమార్తె అడవి శాంతిశ్రీ. ఈమె ధనిక కుటుంబానికి చెందిన మహాతలవరి, మహాదండనాయిక, మహాసేనాపతి స్కంద విశాఖ నాగుని పెండ్లియాడెను."[1]

2. "వీర పురుష దత్తునికి ఒక సోదరి కలదు. ఆమె పేరు అటవి శాంతిశ్రీ. ఈమె ధనక కులజాడైన మహాసేనాపతి, మహాదండనాయక 'ఖంద – విసాఖంణాక' అనగా స్కంద విశాఖుని భార్య."[2]

పై రెండు చారిత్రక సత్యాల్ని గ్రహించి, నిశితంగా పరిశీలించి బాపిరాజు గారు తమ అడవి శాంతిశ్రీ నవలలో కూడ మహాతలవర, మహాదండనాయక, మహాసేనాపతి అనే పదాలు బ్రహ్మదత్తుని పరంగా ప్రయోగించారు.[3] దీనిని బట్టి స్కంధ విశాఖనాగుడే బ్రహ్మదత్తుడని అనుమానించవచ్చు.

ఈ బ్రహ్మదత్తుడు శాంతిమూలునికి ఆంతరంగిక సచివుడు. రాజ్యపాలన విషయంలో ఇతని సలహాలు, సంప్రదింపులు లేకుండ శాంతిమూలుడు ఏ పనీ చెయ్యడు. శాంతిమూలుని కుమార్తె శాంతిశ్రీ

---

1. 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' – ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 125.
2. విజ్ఞాన సర్వస్వము (మూ.సం)., పు: 107.
3. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు., పు: 10.

మనస్సు చాలా విచిత్రమైనది. ఆమె వయస్సు పెరిగినదే కాని, మానసికంగా ఎదగలేదు. బాల్యంనుండి ఆమె మితభాషి. ప్రశాంతమైన మనస్సు కలది. ఆమె లోకోత్తర సౌందర్యవతి అయినా, ఆమెలో ఎలాంటి చిత్తవికారం కన్పించదు. ఆమె స్వభావాన్ని మార్చాలి. ఆమెలో చైతన్యం కలిగించాలి. ఆమెను వివాహానికి సుముఖురాలిగా చెయ్యాలి. ఇంతటి సమర్థుడు బ్రహ్మదత్తుడు ఒక్కడే అని శాంతిమూలుని అభిప్రాయం. అందుకే బ్రహ్మదత్తుని తనకుమార్తెకు గురువుగా నియమిస్తాడు. ఆమె హృదయంలో చైతన్యం కలిగించి, ఆమెను వివాహానికి సుముఖురాలినిగా చెయ్యడమే గాక, ఆమెను వివాహమాడగల సమర్థుడు కూడా బ్రహ్మదత్తుడొక్కడే అని శాంతిమూలుని దృఢ విశ్వాసం. ఇలా శాంతిమూలుని అభిమానానికి పాత్రుడైన బ్రహ్మదత్తుడు ఎంత ఉదాత్తమైన పురుషుడో మనం ఊహించవచ్చు. తనపై శాంతి-మూలునికి గల నమ్మకాన్ని బ్రహ్మదత్తుడు వమ్ము చేయలేదు. బ్రహ్మదత్తుని గురుత్వంలో శాంతిశ్రీ వ్యక్తిత్వం క్రమంగా పరిణామం చెందుతుంది.

బ్రహ్మదత్తుడు శాంతిశ్రీని తన శిష్యురాలుగా స్వీకరించి ఆమెకు చదువు చెప్పడానికి ప్రారంభిస్తాడు. బ్రహ్మదత్తుడు ప్రారంభంలోనే ఆత్మ అంటే ఏమిటి? అని ప్రశ్నించాడు. అందుకు శాంతిశ్రీ ఆత్మ అంటే "ఉపనిషన్మత ప్రకారం సత్పదార్థం. తక్కినవన్నీ ఆ పదార్థానికి ఆభాసాలు"[1] అంటుంది. ఇలా బ్రహ్మదత్తుడు ప్రశ్నలు అడుగుతుంటే శాంతిశ్రీ నిశ్చలమైన

---

1. అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు., పు: 52.

మనస్సుతో ప్రత్యుత్తరాలు ఇస్తుంది.

" శిష్యులు ప్రశ్నించడం - ఆచార్యులు ఉపదేశించడం సాధారణ విధానం. కాని ఈ విచిత్రమైన విద్యాభ్యాసంలో గురువే పృచ్ఛ చేయడం, శిష్యురాలు ప్రత్యుత్తరాలు ఇవ్వడం జరిగింది."[1]

ఈ విధంగా బ్రహ్మదత్తుడు శాంతిశ్రీకి గురువై విద్యాభ్యాసాన్ని కావించిన సందర్భాన్ని పరిశీలిస్తే అతని ధార్మిక బుద్ధి, ఆత్మవిద్యా ప్రావీణ్యం వ్యక్తమౌతాయి.

బ్రహ్మదత్తుడు మొట్టమొదట శాంతిశ్రీకి చదువు చెప్పడానికి సంకోచించాడు. శిష్యురాలు అందగత్తె. 16 సంవత్సరాల యువతి; తానేమో యువకుడు. కాబట్టి ఆమెకు గురువుగా విద్య బోధించడంలో ఔచిత్యం లేదని తలంచాడు. కాని శాంతిమూలుడు బలవంతం చెయ్యగా శాంతిశ్రీకి గురువుగా అంగీకరించాడు. దీనివల్ల అతని యుక్తాయుక్త విచక్షణా, పెద్దలయెడ గౌరవము స్పష్టమవుతున్నవి.

శాంతిశ్రీ అద్భుత సౌందర్యాన్ని చూచి, తొలుత వివాహానికి సుముఖంగా లేని బ్రహ్మదత్తుడు క్రమంగా ఆమెను మనసారా ప్రేమిస్తాడు. తన ప్రేమను వెల్లడించే సమయం కోసం ఎదురుచూస్తూ ఉంటాడు. ఒకసారి వసంతోత్సవ సమయంలో యువతీయువకులు బ్రహ్మదత్తుని మన్మథునిగా ఎన్నుకొంటారు. ఇదే తనప్రేమను బహిర్గతం చేసేందుకు తగిన సమయం అని భావించి బ్రహ్మదత్తుడు శాంతిశ్రీని రతీదేవిగా ఎన్నుకొంటాడు

1. అడవి శాంతిశ్రీ - అడివి బాపిరాజు, పు: 56.

కాని ఆమె నిరాకరించి వెళ్ళిపోతుంది. ఆ తృణీకారాన్ని సహించలేక బ్రహ్మదత్తుడు విలవిల్లాడిపోతాడు.

"ఈ బాలిక తన ఆత్మేశ్వరి! ఈ ప్రణయ రహిత హృదయ, ఈ జన్మయోగిని తన ప్రేమ నిదానము. ఇంత లోకోత్తర సౌందర్యవతియైన ఈమె జీవితంలో ప్రేమ రసార్ద్రత లేనే లేదే! తేనె లేని పుష్పమా ఈమె"[1] అని ఎన్నో విధాల పరితపించి, నిరాశతో కృంగిపోతాడు. కాని సంస్కారవంతుడైన బ్రహ్మదత్తుడు తన బాధను తనలోనే అణచుకొంటాడు. బహిర్గతం చెయ్యడు. నేరుగా ఆమె దగ్గరకు వెళ్ళి "శాంతిశ్రీ రాజకుమారి! నన్ను క్షమించు. నీ దివ్య సౌందర్యానికి ముగ్ధుడనయి నిన్ను రతీదేవిగా ఎన్నుకొన్నాను. ఆ ఆశాన్ని ఆడుకొనేందుకు కావాలని పోరుపెట్టిన బాలకుణ్ణి నేను"[2] అని పలికి ఆ ప్రదేశాన్నుంచి వెళ్ళిపోతాడు. బ్రహ్మదత్తుని సుకుమారమైన మనస్తత్వానికి, ఉత్తమ సంస్కారానికి ఈ సంఘటన ఒక మచ్చుతునక.

ఒకసారి బ్రహ్మదత్తుడు ఎక్కిన నౌక గాలివాటుకు ఎటో కొట్టుకొని పోతుంది. సముద్రంలో ప్రళయ ఝంఝా మారుతం వీచి బ్రహ్మదత్తుడు ప్రయాణించే ఓడ జాడైనా తెలియలేదు. ఈ వార్త విని శాంతిమూల మహారాజు, బ్రహ్మదత్తుని తల్లి, వీర పురుషదత్తుడు, శాంతిశ్రీ అందరూ ఆందోళన చెందుతారు.

ముఖ్యంగా శాంతిశ్రీ ఆ నౌక సురక్షితంగా ఉండాలని, ఆవలి

1. అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు, పు: 56
2. పైదే., పు: 56.

తీరం చేరాలని కోరుకొంటుంది. అప్పుడు తండ్రితో ఇలా అంటుంది. "నాకు మంచి గురువు లభించారని సంతోషించాను నాన్నగారూ!"[1] అని దుగ్గుత్తిక తాల్చింది.

"వారి ఓడ సురక్షితంగా ఉంటుందని ఎందుకో నాకు తోస్తున్నది నాన్నగారూ!"[2] అని శాంతిశ్రీ కళ్ళనీరు నింపింది.

"బ్రహ్మదత్త ప్రభువు విద్య అనన్యము నాయనగారూ! ఆయనంత జ్ఞాని ఎవ్వరూ ఉండరు. నాకు బోధించిన గురువులలో ఉత్తములు."[3]

పై మాటల వల్ల వివాహంపైనే ఇచ్ఛలేని శాంతిశ్రీ క్రమ క్రమంగా బ్రహ్మదత్తుని గుణగణాలను, ప్రతిభా పాండిత్యాలను, ఉదార వ్యక్తిత్వాన్ని, రూప సౌందర్యాన్ని చూచి అతని పట్ల ఆకర్షితురాలైందని మనకు అర్థమౌతుంది. చివరకు అతణ్ణే మనస్ఫూర్తిగా ప్రేమిస్తుంది.

శ్రీ నాగార్జున దేవునకు బ్రహ్మదత్తుని నౌక గాలివానలో ఏమైందో తెలియదని, అది తిరిగి రాలేదని వార్త విన్పించినారు ముఖ్య శిష్యులు. వెంటనే ఆ దివ్యమూర్తి నవ్వి "బ్రహ్మదత్తుడు చేయవలసిన మహోత్తమ కార్యాలు ఎన్నో అలా ఉండగా ఎలా మాయం కాగలడు?"[4] అన్నారట.

---

1. అడవి శాంతిశ్రీ అడివి బాపిరాజు, పు:154.
2. పైదే., పు.:154.
3. పైదే., పు:154.
4. పైదే., పు:158.

తుఫానుకు గురైన బ్రహ్మదత్తుని నావ సువర్ణద్వీపం చేరుతుంది. కొన్ని దినాలు పడవలో అనేక కష్టాలు పడినప్పటికీ అతడు ధైర్యం కోల్పోలేదు. సువర్ణద్వీపం చేరి అచట రాజుచే సన్మానం పొంది కుశలంగా స్వరాజ్యం చేరుకొంటాడు.

బ్రహ్మదత్తుడు మహాతత్త్వవేత్త. అతడు శాంతిశ్రీకి చేసిన ఉపదేశం ద్వారా మనకీ విషయం స్పష్టం కాగలదు.

"స్థితప్రజ్ఞునికి అరిషడ్వర్గములు నాశనమై పోవాలి. దేహము వేరు, తాను వేరు అన్న సంపూర్ణ జ్ఞానం రావాలి. నిర్వాణానికి మారవిజయం అత్యావసరం. జంతుధర్మాలు ఆహార నిద్రా భయాదులు. ఆహారం బ్రతకటానికి, నిద్ర శ్రమతీర్చుకోడానికి, భయం జాతినీ వ్యక్తినీ రక్షించడానికి, నాల్గవది జాతిని వృద్ధి చేయడానికి. ఈ జంతుధర్మాలు ఎవ్వరూ మానలేరు. ఏదో ఉగ్రమైన తపస్సు చేసే వారే మానగలుగుతారు. నిష్కామకర్మ అంటే ఈ నాలుగు ధర్మాలు నిష్కామంగా ఆచరించ గలగడమే."[1]

తత్త్వజ్ఞానాన్ని చక్కగా అవగతం చేసుకొన్న బ్రహ్మదత్తుని అభిప్రాయం సత్యసమ్మతమైంది.

ఇలా బ్రహ్మదత్తుడు శాంతిశ్రీ స్వభావాన్ని పూర్తిగా మార్చివేసి ఆమెలో చైతన్యం కలిగించాడు. శాంతిశ్రీ అతనిలోని అన్ని గుణగణాలను అతన్నే మనసారా ప్రేమిస్తుంది. ఇలా బ్రహ్మదత్తుని ఆశలు, శాంతిమూలుని

---

1. అడవి శాంతిశ్రీ - అడివి బాపిరాజు, పు: 244, 245.

ఆశయం ఫలిస్తాయి. శాంతి మూలుడు తన కుమార్తె శాంతిశ్రీని ఆనందంతో బ్రహ్మదత్తునికిచ్చి వివాహం జరిపిస్తాడు.

బ్రహ్మదత్తుడు భరుకచ్ఛపాల్ని జయించడంలో చూపిన ధైర్యసాహసాలు, ప్రజ్ఞాపాటవాలు, రాజనీతి కుశలత అనిర్వచనీయాలు అతడు దిగ్విజయం చేసి శాంతిమూలుని రాజ్యంలో ధర్మాన్ని నాలుగు పాదాల నడిపిస్తాడు. శాంతిమూలుడు చక్రవర్తిగా సింహాసనాన్ని అధిష్టించిన పిమ్మట, రాజనీతిజ్ఞుడైన బ్రహ్మదత్తుడు మహామంత్రిగా, మహాతలవరిగా, సేనాపతిగా, దండనాయకుడిగా పరిపాలనాభారాన్ని వహించి శాంతి మూలునితో సహకరిస్తాడు. బ్రహ్మదత్తుని తోడ్పాటుతోనే శాంతి మూలుడు తన దేశంలో ధర్మం నాలుగు పాదాల నడిచే విధంగా, ప్రజలు సుఖశాంతులతో జీవించడానికి అనువుగా రాజ్యపాలన కొనసాగిస్తాడు. మహాకవి, మహా పండితుడైన బ్రహ్మదత్తుడు భగవద్గీతకు గొప్ప వ్యాఖ్యానాన్ని రాసినట్లు, అది మహత్తర భాష్యంగా ప్రఖ్యాతి చెందినట్లు పేర్కొనబడింది.

బాపిరాజు గారు బ్రహ్మదత్తుని పాత్రను ఎంతో ఉదాత్తతతో చిత్రించారు. బ్రహ్మదత్తుని జీవిత విధానం భారతీయులకు ఆదర్శప్రాయం.

4.1.2.3. **శాంతి మూలుడు:** " శాంతి మూలుడు ఇక్ష్వాకు వంశాని చెందినవాడు. ఇతడు శాతవాహన చక్రవర్తులకు సామంతుడు. చక్రవర్తియైన యజ్ఞశ్రీ శాతకర్ణికి అల్లుడు. ఆర్షమతాన్ని అభిమానించే వాడు; కాని ఇతర మతాలను ద్వేషించే వాడు కాదు. చరిత్ర ప్రకారం వాసిష్ఠీపుత్ర-

శాంతిమూలుడు పరమ ధార్మికుడు. ప్రజాహిత తత్పరుడుగ కానిపించును."

"శాతవాహన సామ్రాజ్యము భగ్నమయిన తర్వాత, అంత వరకు వారికి సామంతులుగనో, దండనాయకులుగనో, వారి కొలువులో పనిచేసిన వారో వేరువేరు ప్రాంతములను వశపరచుకొని తెలుగు దేశమున క్రొత్త రాజ్యములను స్థాపించిరి. ఇట్టి వారిలో కృష్ణా ప్రాంతపు ప్రాగాంధ్ర దేశమును పరిపాలించిన ఇక్ష్వాకు వంశజులు ఒకరు. నాగార్జునుని కొండలో దొరికిన ప్రాకృత శాసనముల వలన నాగార్జునుని కొండకు క్రీస్తు శకారంభ శతాబ్దములలో శ్రీ పర్వతమను పేరు ఉండినట్లు తెలియుచున్నది."[2]

"ఇక్ష్వాకు రాజ్య స్థాపకుడైన శాంతమూలుడు శాసనములలో 'వాసిఠీ పుత సిరి చాంతమూల' అనగా 'వాసిష్ఠీ పుత్ర శ్రీ శాంతమూలుడు' అని పేర్కొన బడెను. ఇక్ష్వాకు రాజ్య స్థాపకుడైన శాంతమూలుడు వాసిష్ఠీ పుత్రుడు. ఇతడు వైదిక మతావలంబి. శాంతమూలుడు అనేక కోట్ల బంగారు నాణెములను, లక్షల కొలది గోవులను, లక్షల కొలది నాగళ్ళను దానము చేసిన మహా దానపతి."[3]

బాపిరాజు గారు కూడ తన 'అడవి శాంతిశ్రీ' నవలలో శాంతి మూలుడ్ని చరిత్రలో ఉన్నట్లే చిత్రించారు. ప్రభుభక్తి పరాయణుడిగ, స్వార్థ రహిత వ్యక్తిగా, పరమ ధార్మికునిగ చిత్రించారు. శాతవాహన చక్రవర్తుల్లో చివరి వాడైన యజ్ఞశ్రీ శాతకర్ణి అవసాన దశలో తన అల్లుడైన

---

'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' - ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 125.
2. విజ్ఞాన సర్వస్వం - మూడవ సంపుటం ., పు: 105.
3. పైదే., పు: 106, 107.

శాంతి మూలుడ్ని పిలిచి తనకుమారుడైన విజయశ్రీ సాతకర్ణిని, మనుమడైన చంద్రశ్రీ సాతకర్ణిని కూడ అప్పగించి, వీరిని, రాజ్య భారాన్ని కూడా వహించమనీ చెప్పి మరణిస్తాడు. తన మామగారికి చేసిన వాగ్దానం ప్రకారం శాంతిమూలుడు విజయశ్రీని, తర్వాత చంద్రశ్రీని చక్రవర్తులను చేసి తాను సామంతుడిగానే ఉంటూ రాజ్యం విస్తరింప చేస్తాడు.

యజ్ఞశ్రీ శాతకర్ణి మరణానంతరం అతని రెండవ కుమారుని మనుమడైన పులమావి తానే చక్రవర్తినని ప్రకటించుకొని, సామంతుల నుండి కప్పాలు కట్టించుకొంటూ శాంతిమూలునికి తలనొప్పిగా తయారవుతాడు. అంతేగాక శాంతిమూలుని కుమార్తె అయిన శాంతిశ్రీని తనకిచ్చి వివాహం చేయవలసిందిగా బెదరిస్తూ లేఖకూడా వ్రాస్తాడు.

శాంత స్వభావుడైన శాంతిమూలుడు పులమావి ఆగడాలన్నింటిని భరిస్తాడు. కాని పులమావి చేష్టలు మితిమీరి రాజ్యాన్నే కబళించడానికి యుద్ధానికి వస్తాడు. శాంతిమూలుడు చక్రవర్తి విజయశ్రీ శాతకర్ణి పక్షాన నిలబడి యుద్ధంలో పులమావిని ఓడిస్తాడు. పులమావి ఓడిపోయాడనే వార్త విని ఆ సంతోషం భరించలేక గుండె ఆగి విజయశ్రీ సాతకర్ణి మరణిస్తాడు. విధిలేక శాంతమూలుడు, విజయశ్రీ కుమారుడైన చంద్రశ్రీ సాతకర్ణి చిన్నవాడైనా అతణ్ణి చక్రవర్తి చేస్తాడు. కాని చంద్రశ్రీ అంతసమర్థుడు కాడు. దుర్బలుడు. పైగా స్త్రీలోలుడు.

శాంతి మూలుడు అతన్నే చక్రవర్తి చేసి అతన్ని చక్కదిద్దడానికి ఎంతో ప్రయత్నం చేస్తాడు. అతనికి కుడి భుజమై ఉత్తమ చక్రవర్తిగా మార్చడానికి నిరంతరం కృషిచేస్తాడు.

పులమావి మరలా యుద్ధానికి వస్తాడు. యుద్ధంలో పులమావి చేతిలో చంద్రశ్రీ మరణిస్తాడు. చంద్రశ్రీ కూడ మరణించేటప్పటికి శాంత-మూలునికి దిక్కుతోచదు. చిన్న పిల్లవానిలా విలపిస్తాడు. చక్రవర్తిగా ఎవర్ని చేయాలి? అని నిరంతరం యోచించాడేగాని తాను చక్రవర్తి కావాలని శాంతి మూలునికి ఏ కోశానా లేదు. అటువంటి రాజ్యకాంక్ష శాంతిమూలునికి ఉండి ఉంటే యజ్ఞశ్రీ శాతకర్ణి తర్వాత దుర్బలులైన విజయశ్రీ, చంద్రశ్రీలను తుద ముట్టించో లేక దాచో శాంతిమూలుడే చక్రవర్తి అయ్యేవాడు. పరిస్థితులు తనకు అనుకూలంగా ఉన్నా, చక్రవర్తి కావాలన్న తలంపు శాంతి మూలునికి ఏ కోశానా లేదని అర్థమౌతుంది. ఇది అతని మంచి తనానికి స్వామిభక్తి పరాయణతకు, నిస్వార్థ సేవకు నిదర్శనం. అతని విరోధి, చక్రవర్తి కావాలనుకొన్న పులమావి కూడ మరణిస్తాడు. ఇంక శాంతి మూలునికి అడ్డు లేదు. తానే చక్రవర్తినని ప్రకటించుకోవచ్చు. కాని అలా చెయ్యలేదు. శాతవాహన సామ్రాజ్యానికి చక్రవర్తి కాదగిన వ్యక్తికోసం అన్వేషించ సాగాడు. కేవలం సామంతుని గానే తన విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తూ, శాతవాహన సామ్రాజ్య రక్షణకే తన జీవితాన్ని అంకితం చేసిన ఉదాత్త పురుషుడు శాంతి మూలుడు.

అతని మంచితనం, సమర్థతను ప్రజలు గుర్తించి తండోపతండాలుగా

వచ్చి శాంతి మూలుని సింహాసనం అధిష్టించమని, రాజ్యాన్ని పాలించమని అభ్యర్థిస్తారు. విధిలేక శాంతిమూలుడు అంగీకరిస్తాడు.

"రాజ్యం ధర్మంగా నడపాలి. ప్రజలు భగవంతుని అవతారం. ప్రజల సంరక్షణ పరమధర్మంగా ఎంచని రాజెందుకు? సామ్రాట్టెందుకు?"[1] అని ప్రజాభిప్రాయానికి తల వొగ్గి చక్రవర్తిగా అంగీకరిస్తాడు.

అయోధ్యను పాలించిన శ్రీరామచంద్రుడు ఇక్ష్వాకు వంశీయుడు. శాంతి మూలుడు కూడ ఇక్ష్వాకుల వంశానికి చెందినవాడు. ఇతడు కూడ శ్రీరాముని ఆదర్శంగా రాజ్యపాలన చేసినట్లు ఈనాటి పాలకులు కూడ శాంతి మూలుని ఆదర్శంగా తీసుకొంటే దేశం బాగుపడుతుందనే అభిప్రాయాన్ని బాపిరాజుగారు వెలిబుచ్చారు.

బాపిరాజుగారు ఇలాంటి ఆదర్శ పాత్రలను మలచడంలో దిట్ట. ముఖ్యంగా అడవి శాంతిశ్రీ నవలలో శాంతిమూలుని పాత్రను ప్రభుభక్తి పరాయణునిగా, నిస్వార్థ జీవిగా, వైదిక మతావలంబిగా, బౌద్ధ మతాభిమానిగా, బంగారు నాణెములను, గోవులను, నాగళ్ళను దాన మొనర్చిన మహాదాన పతిగా, పరమ శాంతమూర్తిగా, ఉత్తమ మానవునిగా మలచి ప్రజల అభిమానాన్ని చూరగొన్న పాత్రగా అతనిని తీర్చిదిద్దారు.

**4.1.2.4. నాగార్జునాచార్యులు :** నాగార్జునాచార్యులు మహామేధావి అద్వితీయ ప్రతిభాశాలి. వేదాంతం, తర్కశాస్త్రాలలో దిట్ట. ఇంకా రసాయనిక శాస్త్రం, వృక్షశాస్త్రం, వైద్యశాస్త్రం మొదలైన అనేక

---

1. – అడివి బాపిరాజు., పు: 45.

శాస్త్రాలలో నిష్ణాతులు. అడివి బాపిరాజు గారు తన 'అడవి శాంతిశ్రీ' నవలలో నాగార్జునా చార్యుల వారి పాత్రను కూడా స్వీకరించారు.

"గౌతమ బుద్ధుని తర్వాత బుద్ధ ధర్మ నిర్మాతలలో ఇతడు అగ్రేసరుడుగా పరిగణింప బడుచున్నాడు. ఇతనిని మహాముని అనియు, బోధిసత్వు డనియు బౌద్ధులు గౌరవింతురు. ఇతడు మొదట బ్రాహ్మణుడై వేద విద్యలను తుదముట్ట నభ్యసించెను. తర్వాత నీతడు బౌద్ధ ధర్మము నవలంబించి శ్రీపర్వత సంఘారామమును తన నెలవుగా చేసికొనెను. ఇక్కడ శాతవాహన రాజు ఆచార్య నాగార్జునుని కొఱకై గొప్ప వైభవోపేతమైన సంఘారామమును నిర్మించి ఇచ్చెను. చీనా యాత్రికులగు ఫాహియాన్, యువాన్ చాంగు లిద్దరును శ్రీపర్వత సంఘారామమును అద్భుతావహముగ వర్ణించిరి"[1]

బహుముఖ ప్రజ్ఞాశాలియైన అడివి బాపిరాజు గారు నాగార్జునా చార్యుల గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని కథానుగుణంగా ఎంతో నైపుణ్యంగా రచించారు. వేద వేదాంగాలను బాల్యంలోనే అధ్యయనం చేసిన ఆచార్యుల వారు బౌద్ధ మత ప్రాశస్త్యాన్ని క్షుణ్ణంగా తెలుసుకొని, దేశదేశాలు పర్యటించి చివరకు ఆంధ్ర దేశానికి వచ్చి శ్రీపర్వతంపైన స్థిర నివాసం ఏర్పరచుకొంటారు. నాగార్జునుని బౌద్ధమతస్థులు బుద్ధుని అవతారం గానూ, ఆర్షమతం వారు శివుని అవతారం గాను భావించేవారు. 'ఆ మహాభాగుని నామం తెలియని భూభాగం ఈ జంబూ ద్వీపంలో

---

1. 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' — ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య ఖండవల్లి బాలేందుశేఖరం పు: 146, 147.

ఎక్కడా లేదు అని చరిత్రకారుల అభిప్రాయం"[1] అని రచయిత రాశారు.

శాతవాహనుల చివరి చక్రవర్తి యైన యజ్ఞశ్రీ సాతకర్ణికి ఆచార్య నాగార్జునుల వారు సమకాలికులు. నాగార్జునుడు యజ్ఞశ్రీ మరణానంతరము కూడ బ్రతికియుండి ఇక్ష్వాకుల రాజైన శాంతమూలుని కాలంలో కూడా ఉండినట్లు రచయిత వ్రాశారు. అనేకమంది రాజులు, సామంతరాజులు నాగార్జునుని ఆశ్రమాన్ని పోషిస్తూ, ఆశ్రమానికి అనేక సౌకర్యాలు కూర్చడమే కాక, తమ పరిపాలనా విషయంలో కూడా నాగార్జునుని సలహాలు తీసుకునే వారు. అటు బౌద్ధమతస్థులు, ఇటు హిందూ మతస్థులు కూడా నాగార్జునాచార్యుల సలహాలు శిరోధార్యంగా భావించే వారు. శాంతిమూల చక్రవర్తి కుమార్తె శాంతిశ్రీ బౌద్ధమతాభిమాని, బౌద్ధ మతావలంబి. నాగార్జునుని బోధనలవల్ల బుద్ధుని అహింసా సిద్ధాంతాన్ని అవలంబిస్తూ, అష్టమార్గాలను అభిమానిస్తూ, బౌద్ధ జాతక కథల్ని పఠిస్తూ అమందానందంలో మునిగి పోయేది. బ్రహ్మదత్తుడు ఆర్షమతావలంబి. ఒకసారి సందిగ్ధ మనస్సుతో వచ్చిన బ్రహ్మదత్తుని తన మధుర వాక్కులతో ప్రోత్సహించి అతన్ని కార్యోన్ముఖునిగా చేస్తారు ఆచార్యుల వారు. బ్రహ్మదత్తుడు ఓడ ప్రమాదానికి గురైన వార్తవిని ఆందోళన చెందుతున్న శాంతిమూలుని తన వాక్చాతుర్యంతో ఓదారుస్తారు. బ్రహ్మదత్తుడు తప్పక తిరిగి వస్తాడని

1. అడవి శాంతి – అడివి బాపిరాజు., పు: 130.

శాంతి మూలుని ఆందోళన వెళ్లగొడ్తాడు... శాతవాహనుల పతనానంతరం నాగార్జునాచార్యులే ఇక్ష్వాకు వంశీయుడైన శాంతి మూలునికి పట్టాభిషేకం చేసి ఆశీర్వదిస్తాడు.

బౌద్ధ, ఆర్ష మతాలకు సమన్వయాన్ని సాధిస్తూ నాగార్జునాచార్యులు మాధ్యమిక వాదాన్ని ప్రతిపాదిస్తాడు. "ఈతని సిద్ధాంతమును శూన్యవాదమని చెప్పుదురు. ప్రపంచము పూర్ణమైన సత్తుగాని, అసత్తుగాని కాదు. ప్రపంచ అస్తిత్వము కొన్ని నిబంధనలకు లోనై యుండును. ఏ పదార్థమునకును స్వతః అస్తిత్వము లేదు. అట్లగుటచే ప్రపంచ కారణానుబంధము కలదై కూపఘటీ యంత్రము వలె తిరుగుచుండును. సృష్టి ప్రళయములును, జనన మరణములును, సంబంధానుబంధముల భావములును, ఇవన్నియు యదార్థముగ అయదార్థములు. దీని వలన రాగద్వేషములు పుట్టుచున్నవి. వానియందే అశాంతి దుఃఖ బీజములు నిక్షిప్తములై ఉన్నవి. శూన్యత్వమే నిర్వాణము. ఇది కారణ రహితమైన అస్థిత్వము. దానియందన్ని పరిణామములును సమత్వము నొందుచున్నవి. ఇది నాగార్జునుని శూన్యవాద సారాంశము."[1] తన వాదాన్ని శిష్యులకు నిత్యం ప్రబోధించే వారు.

"ఆంధ్ర దేశమంతా సర్వమత వ్యాప్తమై కళకళలాడి పోతూ ఉన్నది. బోధిసత్వ నాగార్జున దేవుని బోధనలు ఆర్షధర్మ పరులైన బ్రాహ్మణ పండితులకు నచ్చినవి. వారు కూడ తమ దర్శన వ్యాఖ్యానాల యందు నాగార్జున దేవుని వాదనలనేకం చేర్చుకొన్నారు."[2]

1. ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి — ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 148.
2. అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు., పు: 129, 130.

అనేక శాస్త్రాలలో నిష్ణాతులైన నాగార్జునాచార్యుల వారు తమ శిష్యులకు ఎలా విద్య గరిపే వారో బాపిరాజు గారు ఇలా రాశారు.

"ఒకరు తాటాకుల గ్రంథము, గంటము తో సిద్ధముగానుందురు. ఇరువురు ఏకసంథాగ్రాహులు స్వచ్ఛమై మధురమై, గంభీరమైన శుద్ధాంధ్ర ప్రాకృత భాషలో ఆ మహాభాగుడు వారికి నూతన సూత్రములు, ప్రాచీన గ్రంథాలకు భాష్యాలూ, వ్యాఖ్యానాలు ఉపదేశింతురు. నలుగురకు నాలుగు గ్రంథాలుపదేశింతురు. ఆ సమయంలో ఆయన పెదవుల వెడలిన మాటలు అమృత కిరణాలై లోకమంతా ప్రసరించును."[1]

ఈ నవలలో నాగార్జునాచార్యుల అవసానదశ కూడా రచయిత వివరించారు. ఒకసారి శాంతమూలునితో నాగార్జునాచార్యులు ఇలా అంటారు. "నాయనా నా తల్లి ఆంధ్రి. నేను విశ్వామిత్ర గోత్రుడను. సర్వవేదాలను మూర్తించుకొన్న గాయత్రిని కనుగొన్న వంశం మాది. ఏ నాడు ఏ సంప్రదాయం చెడిపోయినా ఆ సంప్రదాయానికి మళ్ళీ జీవం పోసేందుకు ఉద్భవించిన వంశం మాది. సర్వశాస్త్ర సమన్వయం, సర్వధర్మ సమన్వయం, సర్వ సంప్రదాయ సమన్వయం లోకానికి అవసరమైన దిప్పుడు. ఆర్ష ధర్మం సమన్వయించినాను. భౌతిక సత్యం, ఆధ్యాత్మిక సత్యం లోవిదే అని రసవాదం వల్ల నిరూపించినాను"[2] అని అంటూ, చివరలో శాంతిమూలుని, అనేక సామంతరాజుల్ని, తన శిష్యుల్ని అందర్నీ ఆహ్వానించి కడసారి వారినందరిని ఆశీర్వదించి ఆచార్యుల వారు అదృశ్యులౌతారు.

1. అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు., పు: 165.
2. పైదే., పు:311.

ఈ విధంగా చారిత్రక సత్యం చెడకుండా నాగార్జునాచార్యుల జీవితాన్ని గ్రహించి, రచయిత ఎంతో చక్కగా మలచిన తీరు ప్రశంసనీయం. ఇందువల్ల బాపిరాజుగారికి గల చారిత్రక పరిజ్ఞానం మనకు తేటతెల్లమవుతుంది.

## 4.1.3. అంశుమతి :

**4.1.3.1. అంశుమతి :** అడివి బాపిరాజు రచించిన 'అంశుమతి' చారిత్రక నవలిక. ఈ నవలిక చాళుక్యుల కాలానికి సంబంధించినది. ఈ నవలికలో అంశుమతి నాయిక. ఈమె విష్ణుకుండిన వంశీయుడైన మంచన భట్టారకుని ఏకైక పుత్రిక.

"ఆమె జగదేక సుందరి. సర్వకళాభిజ్ఞ. శారద రాకా పూర్ణిమను కూడ నలుపు సేయగల కాంతికలది"[2] అని బాపిరాజుగారు ఆమెను వర్ణించారు.

ఆమె సుగుణాల రాశి. నియమనిష్ఠలతో పూజా పునస్కారాలు చేసేది. కావుననే ప్రతిశుక్రవారం తలస్నానం చేసి శుభ్రమైన వస్త్రాలు ధరించి, సర్వ భూషణాలను అలంకరించుకొని, ఇష్టసఖులతో తన భవనానికి దగ్గరలో నున్న గోమాతృదేవాలయానికి పూజకు వెళుతుండేది. ఈ గోమాతృదేవాలయం గోదావరి తీరపు గట్టుపై ఉండేది. గోమాతృదేవిని పూజిస్తే సకల పాపాలు నశిస్తాయన్న ప్రజల విశ్వాసాన్ని, పెద్దల మాటను గౌరవించి పూజించేది

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు., పు: 253.

2. అంశుమతి – అడివి బాపిరాజు., పు: 90.

ఆమె జాతకంలో గ్రహదోషం ఉందని రాజ జ్యోతిష్యుడు తెలుప, ఆ దోష నివారణార్థం ఆమె గోపాదక్షేత్రంలో గోదావరి స్నానం చేస్తూ, ఉత్తమ బ్రాహ్మణులకు దానాదులర్పించి, నలుపది రోజులు వ్రతాన్ని పూర్తి చేసిన సుగుణశీల. ఇలాంటి సౌశీల్యాన్ని, అందాన్ని గురించి విన్న ఆనాటి రాజకుమారులందరూ మంచన భట్టారకునికి రాయబారాలు పంపారు. కాని ఆమె అందరిని తిరస్కరిస్తుంది.

కళింగ యువరాజైన దానార్ణవుడు ఆమె అందానికి ముగ్ధుడై, ఆమెను వివాహమాడితే ఆమె రాజ్యం తన రాజ్యంలో కలుస్తుందని, వారి సహాయంతో అనేక దేశాలను జయింపవచ్చుననెడి దురాశతో రాయబారం పంపిస్తారు. కాని అంశుమతి తిరస్కరిస్తుంది. అందుకు కోపించిన దానార్ణవుడు స్నానమాచరించి పడవల్లో తిరిగి వస్తున్న అంశుమతిని ఆమె చెలికత్తెలతో పాటు బంధిస్తారు.

ఇంతలో చాళుక్య యువరాజైన కుబ్జ విష్ణువర్ధనుడు పిష్టపురాన్ని ముట్టడిస్తారు. ఆ సమయంలో దానార్ణవుడు తన అనుచరులతో తప్పించుకొంటారు. దానార్ణవుని బందీలో ఉన్న రాజకుమార్తె విషయం తెలిసిన విష్ణువర్ధనుడు రాజవైద్యుడైన కాలకంపనుని పంపుతారు.

అంశుమతికి స్వస్థత చేకూరి రాజోద్యానవనంలో ఒకరోజు విహరిస్తూ, సరోవరం గట్టుపై కూర్చొని మధుర కంఠంతో పాడుతున్న విష్ణువర్ధనుని చూస్తుంది. విష్ణువర్ధనుడూ ఆమెను చూస్తారు. ఆమె నిజాన్ని దాచి తాను రాకుమారి అంశుమతి చెలికత్తెనని పరిచయం చేసుకొంటుంది. యువరాజును

తాను చాళుక్య యువరాజైన విష్ణువర్ధనుని సమీప బంధువని పరిచయం చేసుకొంటాడు. మొదటి చూపులోనే ఒకరినొకరు ప్రేమించుకొంటారు.

ఇప్పటి వరకు అంశుమతి ఎందరో రాకుమారులను తిరస్కరించినా, మొదటి చూపులోనే విష్ణువర్ధనుని ఇష్టపడుతుంది. ఆమె చెలికత్తె మాధవి, నీవు ప్రేమించిన వాడు వయసుకు తగిన పొడుగరి కాడని చెప్పగా నవ్వి "పొట్టి పొడుగులకు ప్రేమకును సంబంధమేమి చెలీ"[1] అని చెప్పి, నేనతనినే వివాహమాడుతా నంటుంది. ఈ విషయం ఆమె తల్లిదండ్రులకు ఇష్టంలేక పోయినా కుమార్తె అభీష్టాన్ని కాదనలేక పోయారు.

కుబ్జ విష్ణువర్ధనుడు దిగ్విజయ యాత్ర కొనసాగించుకొంటూ వేంగీపురం వస్తాడు. అక్కడ రాకుమారి అంశుమతిని చూచి, తాను ప్రేమించిన కన్య ఈ రాజకుమారియే అని తెలిసి ఆనందభరితుడవుతాడు.

అంశుమతి కూడా తాను ప్రేమించిన యువకుడే చాళుక్య రాకుమారుడైన విష్ణువర్ధనుడని, తన చెలికత్తె మాధవి ద్వారా తెలిసి సంతోష పడుతుంది.

విష్ణువర్ధనుడు వేంగీపురంలో ఉన్న సమయంలోనే దానార్ణవుని చే పంపబడిన కుంభమిత్రుడు, అతని అనుచరులు మరల అంశుమతిని అపహరించే ప్రయత్నం చేస్తారు. కాని విష్ణువర్ధనుడు వీరోచితంగా పోరాడి కుంభమిత్రుని తల నరుకుతాడు.

చివరకు ఒక శుభ ముహూర్తాన కుబ్జ విష్ణువర్ధనునకు, అంశుమతికి

---

1. అంశుమతి — అడివి బాపిరాజు., పు: 85.

వైభవోపేతంగా వివాహం జరుగుతుంది.

అంశుమతి రాజ పరివారంలో జన్మించినా సత్ప్రవర్తన కలది. వినయశీలి. ధార్మిక బుద్ధి కలది. కనుకనే తన పురోహితుడైన నారసింహ భట్టు ఆదేశానుసారం అన్ని వ్రతాలు ఆచరిస్తుంది. విష్ణువర్ధనుడు పొట్టివాడైనా, ప్రేమకు పొట్టి పొడుగులు అడ్డంకులు కావని స్పష్టంగా చెప్తుంది. ఆజాను బాహువులైన, మదమత్తులైన రాజకుమారుల కంటె నిరాడంబరుడు, పొట్టివాడైన విష్ణువర్ధనుడే ఆమె కళ్ళకు మన్మథుడై తోచాడు. 'Love at first sight' అనే 'Shkespeare' సిద్ధాంతం ఈ ఆమె విషయంలో స్పష్టమయింది. చివరకు ఆమె మనోభీష్టం నెరవేరుతుంది.

4.1.3.2. **విష్ణువర్ధనుడు:** విష్ణువర్ధనుడు అంశుమతి నవలలో నాయకుడు. చాళుక్య చక్రవర్తి పృథ్వీవల్లభ పులకేశి మహారాజు చిన్ని తమ్ముడు. "ఇరువదెనిమిది సంవత్సరముల ప్రాయము వాడై యున్నను రూపమున బాలకుని వలె నుండెను. అతడు నాలుగడుగుల పదునాకం డంగుళముల పొడుగు వాడు. అందుచే గాజోలితనిని గుబ్జ విష్ణువర్ధనుడని పిలుచుకొందురు"[1]

"పచ్చని బంగారు చాయ, పదునారేండ్ల వయసు మిసిమిచే వెలుగు నాతని మోమున నూనూగు మీసాలు గాంచిన వారాతని బాలకుడనియే అనుకొందురు. అయిననూ విష్ణువర్ధనుని శరీరాంగములు నిర్మించినవి"[2]

1. అంశుమతి – అడివి బాపిరాజు., పు: ll
2. పైదే., పు: 12.

" నీవు దక్క మాతృభూమి యైన యాంధ్ర దేశమున శాంతిని నెలకొల్పువారింకొకరు లేరు తమ్ముడా!" "విష్ణువర్ధనా! పిష్టపుర దుర్గము కొండపై నిర్మింపబడుక పోయినను నభేద్యమగు కోట కావున నా నగరమునే నీవు రాజధానీ నగరము సేసికొని యాంధ్ర సామ్రాజ్యమొకటి పునర్నిర్మాణము సేయుదుని నిన్నాశీర్వదించు చున్నాను."[1]

పై మాటల వల్ల సార్వభౌముడైన పులకేశి మహారాజుకు తమ్ముని సామర్థ్యము పై గల నమ్మకము తెలియుటయే గాక, క్షీణించిన ఆంధ్ర సామ్రాజ్యము ఒక్క విష్ణువర్ధనుని వల్లే పునర్నిర్మిత మగునని అర్థమగుచున్నది. సైన్యము నడుపుటలో, వ్యూహము పన్నుటలో, నెదిరి బలమును అంచనా వేయుటలో అతడికతడే సాటి. అభేద్యమైన పిష్టపురదుర్గాన్ని అతడు జయించిన తీరు ఇందులకుదాహరణం. ఇంత గట్టి వాడైనా తాను పొట్టివాడగుట చే ఆత్మన్యూనతా భావంతో బాధ పడే వాడు. తన కుబ్జ రూపము చూసి ఏ స్త్రీ మోహించదని వివాహానికే విముఖత చూపే వాడు. తాను పూర్వజన్మలో ఏదో ఒక కుబ్జను చూసి పరిహాసించి ఉండడం చేతనే తానట్లు పుట్టినాడని అనుకొనే వాడు. కాని అంశుమతీ రాకుమారి మొట్టమొదటి సారి తనను చూచిన వెంటనే తనను ప్రేమించిందని తెలుసుకొని, అతడు పొందిన ఆనందానికి మేరలేదు ఎంతో ఆశ్చర్య పోయాడు. తాను మహారాజు గారికి సామంతుననీ, సమీప బంధువనే చెప్పుకొన్నాడు కాబట్టి తన అధికారమును చూచి గానీ,

---

1. అంశుమతి – అడివి బాపిరాజు., పు: 12.

తన సంపత్తు చూచిగానీ రాకుమారి తనను ప్రేమించలేదని, కేవలం మొదటి చూపులోనే తనను మోహించిందని అతనికి అర్థమైంది.

"రాకుమారీ! నీవు విష్ణుకుండినుల చుట్టమవు. మీరు బ్రాహ్మణ క్షత్రియులు గదా! ఇక నేనెట్టి కులము వాడనో! హీన వంశజులు కూడా సామంతులు కావచ్చును గదా!"[1] అంటాడు. అప్పుడు రాకుమారి "ప్రభూ! సామంతత్వము గాని, మహారాజాధికారము గాని అంతఃకరణ వృత్తికి ఉద్దీపనమెట్లగును? నిజమును గోచరింప జేయునది అంతస్సాక్ష్యము. నాకా పిష్టపురముననే సత్యము దర్శనమిచ్చినది"[2] అంటుంది.

ఇలా రకరకాలుగా ప్రశ్నించి విష్ణువర్ధనుడు అంశుమతి కేవలం తనను తననుగానే ప్రేమించి, తనపై వలపు పెంచుకొనిందని తెలిసి సంతోషంతో ఆత్మన్యూనతా భావం వదలి, ఆమెను వివాహమాడ డానికి సిద్ధపడతాడు.

విష్ణువర్ధనునిపై రాకుమారికి గల అభిప్రాయం ఇంకా ఆమె అనుంగు చెలికత్తె మాధవితో నడపిన సంభాషణాల వల్ల మనకు అర్థమవుతుంది.

"ఆయన యెవ్వడో తెలియునా నీకు?" అని మాధవి అడుగగా, "ఎవ్వరైననేమి! ఉత్తమ చరిత్రుడు"[3] అని అంశుమతి అంటుంది. ఇంకో సందర్భములో "పొట్టి పొడుగుల కును, ప్రేమకును

1. అంశుమతి – అడివి బాపిరాజు, పు: 107
2. పైదే., పు: 108.
3. పైదే., పు: 109.

సంబంధమేమి చెలీ ! "[1] అని తన సఖి మాధవితో అంటుంది.

ఇంతేల విష్ణువర్ధనుని తోనే ఇలా అంటుంది. " ప్రభూ! నేను కులీనను. ప్రేమకు జాత్యి పొడుగులాలంబనములు గావు. నిర్మల హృదయమే యాలంబనము. తొలిసారి మిమ్ము పిష్టపురములో చూచినప్పుడే నా హృదయ కుసుమమునకు మీరే తావియని దివ్యభావము స్ఫురించినది"[2] అంటుంది.

ఇలా అంశుమతి తనను మనఃపూర్వకంగా ఇష్టపడుటచే, వివాహానికే విముఖత చూపే విష్ణువర్ధనుడు ఆమెను వివాహమాడటానికి అంగీకారం తెలిపాడు.

విష్ణువర్ధనుడు దిగ్విజయ యాత్ర సల్పుతూ, రాజ్యాలను అవలీలగా జయిస్తూ, విశాలాంధ్ర సామ్రాజ్యాన్ని నిర్మించేందుకు ప్రయాసపడ్డాడని 'అంశుమతి' నవల ద్వారా మనకు అర్థమౌతుంది. వ్యక్తిగతంగా కూడ అతని మంచితనం, పరాక్రమం, సాహసం, శక్తి యుక్తులు నవలలో ఒకటరెండు చోట్ల వివరించారు బాపిరాజు గారు. ఒకసారి దానార్ణవుడు అంశుమతిని, ఆమె చెలికత్తె మాధవిని పిష్టపురంలో బంధించి చెరపట్టే ప్రయత్నం చేస్తాడు. ఈ విషయం తెలుసుకొన్న విష్ణువర్ధనుడు, అబలలను హింసించి, మాడ్చిన దానార్ణవుని నీచ మనస్తత్వానికి అసహ్యించుకొంటాడు. అబలలను బంధవిముక్తులు చేస్తాడు.

1. అంశుమతి – అడివి బాపిరాజు., పు: 85.
2. పైదే., పు: 85.

ఇంకో సారి దానార్ణవుని ప్రేరణతో అతని అనుంగు మిత్రు డైన కుంభ మిత్రుడు, అతని అనుచరులు అంశుమతిని అపహరించేందుకు ప్రయత్నం చేస్తారు. అప్పుడు అక్కడే ఉన్న విష్ణువర్ధనుడు నిరాయుధుడైనా, సింహం వలె మారిపోయి భయంకర పోరాటం సల్పి క్షణంలో కుంభమిత్రుని నడుమున గట్టిన అతని మహాఖడ్గమునే లాగి, తూలిక వలే త్రిప్పుచు ఏటుకొక ముష్కరుని, తీతకొక రాక్షసుని హతమార్చుచు, చివరకు కుంభ మిత్రుని తల నరుకుతాడు.

ఇలా తన పరాక్రమాన్ని ప్రదర్శించి విష్ణువర్ధనుడు అంశుమతి హృదయాన్ని పూర్తిగా చూరగొంటాడు.

పెద్దలందరి ఆశీర్వాదంతో అంశుమతి, విష్ణు వర్ధనుల వివాహం వైభవోపేతంగా జరుగుతుంది.

చాళుక్య వంశానికి చెందిన రాజులు చాల పరాక్రమవంతులు. వారు ఆంధ్ర రాజ్యాన్ని చాల కాలం పాలించారు. వారిలో కుబ్జ విష్ణువర్ధనుడు తన యుద్ధ తంత్ర చాతుర్యంతో కళింగ దేశాన్ని జయించి, ఆంధ్ర రాజ్యాన్ని విస్తరింప చేశాడు. చరిత్రలో కుబ్జ విష్ణువర్ధనుని పేరు చిరస్థాయిగా నిలిచి పోయింది.

## 4.1.4. గోన గన్నారెడ్డి :

**4.1.4.1. గోనగన్నారెడ్డి:** అడివి బాపిరాజు గారు రచించిన 'గోనగన్నారెడ్డి' నవలలో గోన గన్నారెడ్డి నాయకుడు. ఇతడు చారిత్రక వ్యక్తి. కాకతీయ చక్రవర్తి గణపతి దేవుడు. అతని కుమార్తె రుద్రమ దేవి పరిపాలించిన

కాలంలో ఉండెడివారు. రాణి రుద్రమదేవికి కుడిభుజమై కాకతీయ రాజ్యాన్ని సుస్థిరం చేయడానికి ఎంతో సహాయం చేశారని చరిత్ర చెప్తున్నది. "గోన గన్నయ రెడ్డి యను సేనాని రాజ్యములోపలి శత్రువులను ఎల్లరను అణచి వేసెను"[1] ఈ చిన్ని చారిత్రక సత్యాన్ని గ్రహించి అడివి బాపిరాజు గారు 'గోన గన్నారెడ్డి' అనే గొప్ప చారిత్రక నవలను రచించారనడంలో సందేహం ఏమాత్రం లేదు.

గోన గన్నారెడ్డి తండ్రి పేరు గోన బుద్ధారెడ్డి. గోన బుద్ధారెడ్డికి ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె కలరు. పెద్దవాడు గోన గన్నారెడ్డి, రెండవ వాడు విఠ్ఠల ధరణీశుడు. వీరిద్దరికి అక్కగారు కుప్పమాంబ. గోన బుద్ధారెడ్డికి లకుమయా రెడ్డి అనే తమ్ముడున్నాడు. "గోన బుద్ధారెడ్డి భువనగిరి రాజధానిగా ముచికుంద సీమను ఏలుతుండేవాడు"[2] ముప్పై గవ్యూతుల దూరంలో ఉండే వర్ధమాన పురం మానువనాటి మహా మండలానికి రాజధాని. గోన బుద్ధారెడ్డి ఈ రాజ్యాన్ని జయించి, కాకతీయ రుద్రదేవ చక్రవర్తికి సామంతుడై ఏలుచుండే వాడు. తర్వాత శ్రీ గణపతిదేవ చక్రవర్తి రాజ్యానికి వచ్చిన నలభై ఏండ్లు ఈ రెండు సామంత రాజ్యాలను పాలిస్తూ, అవసానదశలో దేహం చాలిస్తూ తన తమ్ముడు లకుమయారెడ్డిని పిలిపించి, తన పెద్దకుమారుడైన గన్నభూపతి తరఫున రాజ్యం చేయవలసిందనీ, వాడు పెద్దవాడు కాగానే వాడిరాజ్యం వాడికిచ్చి "నువ్వు

1. విజ్ఞాన సర్వస్వం – మూడవ సంపుటం., పు. 231.
2. గోనగన్నారెడ్డి – అడివిబాపిరాజు., పు. 30.

భువనగిరి పరిపాలించవయ్యా లకుమయా !"[1] అని సెలవిచ్చి లింగైక్యమంది నాడు.

అంటే మానువనాటి మండలాన్ని (వర్ధమానపురం రాజధాని) గోనగన్నారెడ్డికి ఇచ్చి, ముచికుంద సీమను (భువనగిరి రాజధాని) లకుమయారెడ్డి పరిపాలించాలని బుద్ధారెడ్డి అభిప్రాయం.

కాని లకుమయారెడ్డికి రాజ్యకాంక్ష మొలకెత్తి తన అన్న కొడుకులైన గన్నారెడ్డి, విఠల ధరణీశులను నిర్లక్ష్యం చేయసాగాడు. గన్నారెడ్డి రాజ్యాన్ని పూర్తిగా కబళించి "అనుమకొండ లో విద్యాలభ్యాసిస్తున్న రాజకుమారులకు మహారాజ భూతాది ఖర్చులు పంపించడం మానివేశాడు."[2]

గోనగన్నారెడ్డికి తన పినతండ్రి అంటే అసహ్యం వేసింది. గన్నారెడ్డి గజదొంగగా మారిపోతాడు. అతని తమ్ముడు విఠల ధరణీశుడు, సోమయామాత్యుని కుమారుడు అక్కిన మంత్రి, సూరనరెడ్డి, సుబ్బ-నాయకుడు మొదలైన మూడువందల నలభై మంది దిట్టలైన యువకులు గన్నారెడ్డితో అడవులకు వెళ్ళిపోతారు.

"మేమందరం గజదొంగలం, శ్రీ శ్రీ గణపతిదేవ చక్రవర్తి వృద్ధులై రాజ్యభారం వహించలేని స్థితిలో, ఈ దేశంలో అరాచకత్వం వచ్చింది. కాబట్టి మేము మా ఇష్టం వచ్చినట్లు దేశాలను దోచుకుంటాము. అధర్మంతో అధర్మమౌతాము. రాక్షసులలో రాక్షసుల మౌతాము"[3] అని

---

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 33
2. పైదే., పు: 33.
3. పైదే., పు: 177.

శివదేవయ్య మంత్రికి జాబు వ్రాసి వాళ్ళు అడవుల్లోకి వెళ్ళిపోతారు.

శ్రీశైలానికి పడమరగా ఉండే నల్లమల అడవులే వారి స్థావరం. ఆ అడవుల్లో, భయంకర ప్రదేశంలో, ఆంధ్ర శాతవాహన చక్రవర్తుల కాలం నాటి పాడుపడిన పట్టణం ఒకటి గోనగన్నారెడ్డి కనిపెట్టి, ఆ పట్టణాన్ని బాగుచేసి తన స్థావరంగా మార్చుకున్నాడు. ఆ పట్టణంలోనే గన్నారెడ్డికి గుప్తనిధులు దొరికాయి. ఆయుధాగారం బయటపడింది. క్రమక్రమంగా తన అనుచరులను విస్తరిస్తూ ఒక గొప్ప సైన్యాన్ని సమీకరించుకున్నాడు. ఆ రహస్య దుర్గానికి చుట్టూ ఉన్న చెంచులూ, బోయలూ గోన గన్నారెడ్డి సైన్యానికి ఉపసైన్యాలుగా ఉంటూ ఆ దుర్గ రహస్యం ఎవరికీ తెలియకుండా కాపాడుతున్నారు. ఆ పరిసర ప్రాంతాల్లో ఎక్కడో గన్నారెడ్డి దుర్గం ఉందని మాత్రం అందరికీ తెలుసు. కానీ అది ఎక్కడుందో ఎవరికీ తెలియదు.

అనివార్య కారణాల వల్ల గన్నారెడ్డి గజదొంగగా మారినా అతడు ఎవరినీ దోచలేదు. కష్టాల్లో ఉన్నవారిని ఆర్థికంగా ఆదుకొని, వారి అవసరాలు తీర్చేవాడు. సామంతుడెవడైనా ప్రజల్ని పీడిస్తుంటే అతన్ని శిక్షించేవాడు. దీనిని బట్టి గన్నారెడ్డి ఉదార హృదయుడు అని తెలుస్తుంది. అతన్ని మనస్ఫూర్తిగా ప్రేమించిన అన్నాంబిక "ఎంత ఉన్నత మూర్తి! అతడు గజదొంగా! ఎక్కడ దొంగతనం చేసినాడాయన? ఎందువల్ల? ఏమిటా గజదొంగతనం? ఇందేదో మహా రహస్యమున్నది. ఆ మహాపురుషుని మూర్తిలో మోములో, చూపులో గజదొంగతనం ఏది?

గజదొంగలు అందంగా ఉండగలరా ?"[1] అని ఒక సందర్భంలో అనుకొంటుంది.

ప్రజలంతా అనుకొంటున్నట్లు నిజానికి గన్నారెడ్డి గజదొంగ కాదు. అసలు గన్నారెడ్డి గజదొంగా ? కాదా? నవల ప్రారంభంలో లకుమయారెడ్డి కుమారుని వివాహాన్ని ఎందుకు రెండుసార్లు చెడగొట్టాడు? ఎందుకు చోళుల్ని, పాండ్యుల్ని, కటకాధీశుల్ని, భల్లాణుల్ని, యాదవుల్ని, గాంగుల్ని నానా చిక్కులు పెట్టాడు ? ఎందుకు చక్రవర్తికి, రుద్రమదేవికి పరోక్షంగా సహాయం చేస్తూ వచ్చాడు? అనే ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి కాతూ పాఠకులు ఉత్కంఠతతో నవలను చదువుతూ, 384 పుటలు చదివేసరికి, హమ్మయ్య, గన్నారెడ్డి గజదొంగ కాదు అని నిట్టూర్పు వదులుతారు.

శివదేవయ్య మంత్రి, రుద్రమదేవి చక్రవర్తిగా సింహాసనం అధిష్టించే రోజు గన్నారెడ్డిని సభకు ఇలా పరిచయం చేస్తాడు. "ఈ మహా సభలోని నేను ఒక ముఖ్య విషయం ముందుగా చెప్పాలి. మీరంతా చాళుక్య వీరభద్ర మహారాజు ప్రక్కనే ఉన్న శ్రీ గోనగన్నారెడ్డి మహారాజును చూస్తున్నారు కదా! ఆయన గజదొంగ ! ...... కాని ఈ మహావీరుడు ఆ ఉత్తమ కార్యాలన్నీ శ్రీ చక్రవర్తి అనుమతి మీదనే చేశాడు.

ఈయన గజదొంగ కావడం చక్రవర్తి అనుమతి మీదనే.

ఈ మహావీరుడే జన్మించక పోతే కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమై యుండును"[2] ఇలా శివదేవయ్య మంత్రి గోనగన్నారెడ్డి రహస్యాన్ని

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 84
2. పైదే., పు: 384.

బయట పెట్టారు.

శ్రీ గణపతి చక్రవర్తి తనకు వారసురాలుగా రుద్రమదేవిని ప్రకటించే సరికి, ఆడది రాజ్యం చేయడమా అని సామంతులెందరో కుట్రపన్నారు. వారిలో గోన గన్నారెడ్డి పినతండ్రి లకుమయారెడ్డి ముఖ్యుడు. లకుమయారెడ్డి తనకే కాక చక్రవర్తికి కూడా అన్యాయం తలపెట్టాడని తెలిసి గన్నారెడ్డి మొట్టమొదట రెండుసార్లు లకుమయారెడ్డి కుమారుడు వరదారెడ్డి పెండ్లి భగ్నం చేస్తాడు. ఎందుకంటె ఆదవోని వర్ధమాన మండలేశ్వరుడు కోటారెడ్డి. కోటారెడ్డి కుమార్తె అన్నాంబికకు, తనకుమారుడు వరదారెడ్డికి పెండ్లి జరిగితే, రెండు రాజ్యాలు ఒకటై చక్రవర్తిని పదవీచ్యుతుని చేయవచ్చని కుట్రపన్నాడు లకుమయారెడ్డి. మొదటి సారి వరదారెడ్డిని ఎత్తుకుపోయి వారం రోజులు బందీగా ఉంచుకొని విడుదల చేస్తారు. రెండవసారి అన్నాంబిక అనుమతితోనే ఆమెను అపహరిస్తారు. ఒక విధంగా గోన గన్నారెడ్డి అపహరించాడు అనడం కంటె అతని వెంట అన్నాంబికే వెళ్ళిందని చెప్పవచ్చు. ఆమెను అపహరించే ముందు 'రాజకుమారీ! ఈ పెళ్ళి వల్ల దేశంలో రాజద్రోహం రుద్రతాండవం చేస్తుంది. నీవు వరదారెడ్డి రాకుమారునే వివాహం చేసుకోవచ్చును. కాని కొంతకాలం ఈ వివాహం కాకూడదు."[1] అంటాడు. అసలు వరదారెడ్డిని పెండ్లి చేసుకోవడానికి అన్నాంబికకు బొత్తిగా ఇష్టంలేదు. విధిలేక కన్యకు తండ్రి ఆజ్ఞ అనుల్లంఘనీయం కనుక ఒప్పుకొనింది. ఇలా పెండ్లి తప్పిపోవడం

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 92.

ఆమె కిష్టమే.

తనకు రాజకీయంగా ఎంతో అన్యాయం చేసిన తన పిన తండ్రి లకుమయారెడ్డిపై కక్ష సాధించడానికి తగిన శక్తి ఉండి కూడా గన్నారెడ్డి తన పిన తండ్రిని ఎదిరించలేదు. తన రహస్య స్థావరాన్ని పట్టుకొని తనను, తన అనుచరులను పూర్తిగా మట్టుపెట్టడానికి వచ్చిన లకుమయారెడ్డి సైన్యాన్ని నేర్పుగా విచ్ఛిన్నం చేసి, లకుమయారెడ్డిని బంధిస్తాడు. కాని అతన్ని హతమార్చక ఓరుగల్లుకు పంపుతాడు. ఇది గన్నారెడ్డి ఔదార్యానికి మచ్చుతునక. తనను ఎదిరించిన సామంతులు దాసోహమంటే వారిని క్షమించి వదిలిపెట్టే వాడు. విధిలేక, కాకతీయ రాజ్య సుస్థిరత కొరకు కొందరు సామంతులను చంపవలసి వచ్చింది.

ఇలా గోనగన్నారెడ్డి, చక్రవర్తిపై కుట్ర పన్నిన కాకతీయ సామంతులు, ఇతర శత్రువులు ఎందరినో జయించాడు, ఎందరినో మట్టుపెట్టాడు. వారిలో కటకాధీసుడు, కదుప్రులూరి పురవరాధీశ్వరుడు, అరిగండ భైరవుడు, శ్రీ హరి ముప్వరులు, శ్రీ కోన గిమ్మైలితల గొండుడు, శ్రీ ఉప్పుల సోముడు, శ్రీ నంది భూపాలుడు, శ్రీ అక్కినాయకుడు, శ్రీ మేడిపల్లి కాచయ నాయకుడు, కందూరి కేశి నాయకుడు, శ్రీ రాపాక భీముడు, శ్రీ తెల్లాల కాటయ దిశుడు, శ్రీ ఏరువ తొండ గోదూమ ఘట్టుడు, శ్రీ చేడ చెలుకి నాయుడు, శ్రీ కోట పేర్మి రాయుడు మొదలైన వారు గోనగన్నారెడ్డి చేతిలో నాశనమై పోయారు. ఇంతమందిని నిర్జించి దుస్తరమైన రుద్రమదేవి పరిపాలనను సుస్థిరం చేశాడు.

ఇంతటి వీరుడైన గోనగన్నారెడ్డి ఉదార హృదయుడు, సుందరాకారుడు, మేధావి, రాజనీతిజ్ఞుడు. అసాధారణ బలపరాక్రమాలు కలవాడు. అశ్వ హృదయాన్ని తెలుసుకొన్న ధీశాలి. యుద్ధనీతి విశారదుడు. వ్యూహరచనా సమర్థుడు. అంతేగాక 'మేటి సింహాల పూలచెండులా ఆడగల సమర్థుడు. "గోనవంశ కలశాంబోధి రాకా సుధాకరుడు."[1] ఇతడు గుర్రపు స్వారిలోనూ, విలువిద్యలోనూ బాల్యంలోనే మంచి నైపుణ్యం సంపాదించాడు. "రుద్రదేవి అశ్వసాహిణులలో మహోత్తమ సాహిణి. ఆ నాడా మెను అశ్వశిక్షలో మించిన పురుషుడు ఒక్క గోన గన్నారెడ్డి మాత్రమే"[2] అని బాపిరాజు గారు రాశారు.

గన్నారెడ్డిని అన్నాంబిక తొలి చూపులోనే ప్రేమించింది. 'ఈ వీరుడు గజదొంగ అగును గాక. తానును గజదొంగ అవుతుంది! ఆయన రాజ్యాలు, నగరాలు దోచనీ, తానునూ అలాగే చేయగలదు. ఆయన ప్రేమకై తపస్సు చేసి, ఆయన చూపులకై తేజస్సుల వెలిగించి, ఆయన ప్రేమ భాషణలకై సర్వశ్రుతులూ స్పందింప జేసి, ముల్లోకాలను గగ్గోలు పరచగలదు తాను"[3]

తొలుత గన్నారెడ్డి ఎవరినీ ప్రేమించడు. కాకతీయ రాజ్యాన్ని సుస్థిరం చేయడమే అతని ధ్యేయం. క్రమంగా అన్నాంబిక తనను ప్రేమిస్తూ ఉందని తెలుసుకుంటాడు. పురుష వేషం వేసి తనకు అంగరక్షకుడుగా, కంటికి

1. గోనగన్నారెడ్డి — అడివిబాపిరాజు., పు:
2. పైదే., పు: 40.
3. పైదే., పు: 107.

రెప్పలా కాచుకొంటున్న వ్యక్తి అన్నాంబికయే అని గ్రహిస్తాడు. అంతేకాక ప్రేమంటే ఏమిటో తన సహచరుడు, ఆప్తమిత్రుడు తిక్కన మంత్రి ద్వారా తెలుసుకుంటాడు. తిక్కన "జీవితానికి పరమావధి మోక్షం. మోక్షానికి దారి జ్ఞానపూర్ణ భక్తి. భక్తికి ఉత్తమరూపం కావ్య, సంగీత, నాట్య, చిత్ర శిల్పాది విద్యలు. ఈ విద్యలకు ప్రాణం రసము. ఈ రసాలలోకి మకుటం శృంగార రసము. అది తెలియడానికి స్త్రీని ప్రేమించాలండీ"[1] అంటాడు. రాణి రుద్రమదేవి, చాళుక్య వీరభద్రులు కూడా గన్నారెడ్డికి అన్నాంబికను గురించి చెప్తారు. ఇలా అందరి మాటలు విన్నతర్వాత ప్రేమంటే ఏమిటో తెలిసి గన్నారెడ్డి కూడా అన్నాంబికను ప్రేమిస్తాడు. వారి వివాహం వైభవోపేతంగా జరుగుతుంది.

ఇలా మహావీరుడైన గన్నారెడ్డి తొలుత శ్రీ గణపతి దేవ చక్రవర్తికి, తర్వాత రుద్రమదేవికి కుడిభుజంగా నిలచి, పరిపాలన నిష్కంటకంగా సాగేందుకు సాయపడ్డాడు అనే చారిత్రక విషయాన్ని బాపిరాజు గారు గన్నారెడ్డి పాత్రను నవలలో కడు రమ్యంగా, ఉత్కంఠ భరితంగా చిత్రించారు. బాపిరాజు గారు యువతరాన్ని ఉత్తేజ పరిచేటట్లు, గన్నారెడ్డిని ఆదర్శంగా యువకులు దేశరక్షణకు కదలిరావాలని ప్రబోధించేటట్లు, యువతరం వల్లే దేశం ఛిన్నాభిన్నం కాకుండా సుస్థిరంగా ఉండగలదు అన్నట్లు గోన గన్నారెడ్డి పాత్రను సృష్టించి ధన్యజీవి అయినారనుటలో అతిశయోక్తి లేదు.

---

1. గోన గన్నారెడ్డి — అడివి బాపిరాజు, పు: 305.

4.1.4.2. **రుద్రమదేవి :** రుద్రమదేవి కాకతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీ గణపతిదేవ చక్రవర్తి కుమార్తె; కాకతీయ సామ్రాజ్యానికి తొమ్మిదవ చక్రవర్తి. రుద్రమదేవి గణపతిదేవ చక్రవర్తి కుమార్తె అన్నది చారిత్రక సత్యం. ఆమెను గురించి - "ఈ మహారాణి మిక్కిలి ప్రతిభావంతురాలు. స్త్రీ అయినను గొప్పధైర్య సాహసములతో అనేక కష్టములను ఎదుర్కొని ఈమె తండ్రి తన చేత బెట్టిన విశాల సామ్రాజ్యమును రక్షించి సమర్థతతో పరిపాలించెను"[1] అని రాసి ఉంది.

ఈ చారిత్రకాంశమును గ్రహించి బాపిరాజు గారు, తన గోనగన్నారెడ్డి నవలలో రుద్రమదేవినే ప్రధాన భూమికగా చేశారు. గోనగన్నారెడ్డి భార్య అన్నాంబిక పాత్రకంటే, రుద్రమదేవి పాత్రయే ఈ నవలలో ప్రముఖంగా కనిపిస్తుంది. రుద్రమదేవి కథలన్నో ప్రజల్లో వ్యాప్తి చెందాయి. అనేకమంది ఆంధ్ర రచయితలు రుద్రమదేవి కథను ఇతివృత్తంగా స్వీకరించి నవలలు, నాటకాలు రాశారు. జానపదులు కూడ రుద్రమదేవి కథలను రచించారు. వీరనారిగా కీర్తించి గానం చేశారు. ఆమె పేర వెలసిన బుర్రకథలు కోకొల్లలు. ఆ కథల్లో చారిత్రక సత్యం, కాల్పనికత పడుగు పేకల వలె కలసి పోయాయి. ఇంతటి చరిత్ర ప్రసిద్ధి చెందిన రుద్రమదేవి పాత్రను బాపిరాజు గారు తన నవలలో మలచిన తీరు మిక్కిలి కొనియాడదగినది.

పుత్రులు లేని గణపతి దేవ చక్రవర్తి రాజకీయ కారణాల వల్ల

---

1. విజ్ఞాన సర్వస్వము — మూడవ సంపుటము., పుః 231.

తన పెద్ద కుమార్తె రుద్రమ దేవిని పుత్రుని వలె పెంచుతాడు. తనకు బాలుడు జన్మించాడనే ప్రచారం చేస్తాడు. ఆమె బాలుని వలె వీర విద్యలన్నీ నేర్చుకొని ప్రావీణ్యం సంపాదిస్తుంది. అంతేగాక సంగీత, సాహిత్య, నాట్యాది కళల్ని ఆసక్తితో అధ్యయనం చేస్తుంది. ఆమె గుర్రపుస్వారీ చెయ్యడంలో దిట్ట. "రుద్రమదేవి అశ్వసాహిణుల్లో మహోత్తమ సాహిణి". "రుద్రమదేవిని ప్రేమించని గుఱ్ఱం లేదు. చక్రవర్తి అశ్వశాలలో ఆమె అడుగుల చప్పుడు ప్రతి గుఱ్ఱమునకు తెలియును"[1]

గణపతిదేవుడు మరియు కాకతీయ సామ్రాజ్యాన్ని తన భుజస్కంధాలపై నడిపిస్తున్న శివదేవయ్య మంత్రి, రుద్రమ దేవి స్త్రీ అని బయటి ప్రపంచానికి తెలియకుండా అనేక జాగ్రత్తలు తీసుకొన్నారు. చక్రవర్తికి పుత్రులు లేరు. ఆయన తర్వాత భావి సామ్రాజ్యానికి వారసులు లేరని తెలిస్తే సామంత రాజులంతా తామే చక్రవర్తి కావాలని కొట్లాడుకుంటారు. ఈ అంతః కలహాల్లో ఆంధ్ర సామ్రాజ్యం భిన్నాభిన్నమై, సర్వనాశనమై పోతుంది. అందుకే ఆంధ్ర సామ్రాజ్య సుస్థిరత కోసం రుద్రమదేవిని తన కుమారుడుగా ప్రచారం చేసుకొంటున్నాడు. ఆమె స్త్రీ అన్న విషయం రుద్రమదేవి తల్లిదండ్రులకు, శివదేవయ్య మంత్రికి, కొద్దిమంది ఆంతరంగికులకు తప్ప ఇతరులకు ఎవ్వరికీ తెలియదు. "అభ్యంతర మందిరాలలో కాపుండే వాళ్ళందరూ స్త్రీలే. అలంకార, శయన మందిరాలలోకి అతి నమ్మకం గల ఇరువది మంది దాసీలు, ఇరువది మంది

---

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు. 40.

అంగరక్షకులు , ఇరువది మంది చెలికత్తెలు తప్ప ఇతరులెవ్వరూ వెళ్ళడానికి అధికారం లేదు."[1]

రుద్రమదేవి పురుషుడు అని నమ్మించడానికి ఆమెకు ఒక స్త్రీతో వివాహం కూడా చేస్తారు. "చక్రవర్తి బావమరిది రాజభక్తి పూరితుడు. ఉత్తమ సంస్కారి. మహాసేనానాయకుడు అయిన జాయప సేనానికి ముమ్మడమ్మ అనే అందాల కూతురు కలదు. చక్రవర్తి , శివదేవయ్య మంత్రి కలసి జాయప సేనానిని పిలిపించి రుద్రమదేవి స్త్రీ అనే రహస్యాన్ని వెల్లడిస్తారు. అంతేగాక ఆంధ్ర మహారాజ్య సంరక్షణార్థం రుద్రమదేవికి ఒక స్త్రీ. వివాహం చెయ్యవలసి ఉందని , చిన్నప్పట్నుంచి పురుష వేషంలో ఉన్న రుద్రమదేవితో కలసి మెలసి పెరిగిన ముమ్మడమ్మను రుద్రమదేవికి వధువుగా నిశ్చయించామని చెప్తే , దేశక్షేమం కోసం జాయప సేనాని సంతోషంతో ఒప్పుకొంటాడు."[2]

"రుద్రదేవ ప్రభువు స్త్రీ అని లోకానికి తెలిపే కాలం వచ్చేసరికి ముమ్మడమ్మను రుద్రమదేవితో పాటే ఒక ఉత్తమ మండలేశ్వరునకిచ్చి వివాహం చేస్తామని కూడ శివదేవయ్య మంత్రి జాయప సేనానికి హామీ ఇస్తాడు."[3]

రుద్రమదేవికి ముమ్మడమ్మతో మహా వైభవంగా వివాహం జరుగుతుంది. శోభనం గదిలో రుద్రమదేవి ముమ్మడమ్మతో "మహారాణీ!

1. గోన గన్నారెడ్డి - అడివి బాపిరాజు , పు: 45.
2. పైదే., పు: 58.
3. పైదే., పు: 58.

నాకో వ్రతమున్నది. అది గౌరీ ప్రియమైన అసిధారావ్రతం. అందుకనే నా జుట్టు పెంచుకొంటున్నాను చూడు. ఆ అసిధారా వ్రతోద్యాపన సమయం వచ్చే వరకు నీ పుత్రలాభోత్సవానికి అంకురార్పణ జరుగరాదు".[1] అని చెప్పి తన రహస్యం కాపాడుకొంటుంది. కాని ఈ రహస్యం ఎంత కాలమని దాగగలదు. ఆంతరంగిక చెలికత్తెలో, దాసీజనమో, అంగరక్షకుల్లో ఎవరో ఒకరు ఈ రహస్యాన్ని ఇతరుల చెవిలో వేసి ఉంటారు. గుసగుసగా రుద్రమదేవి పురుషుడు కాదు స్త్రీ అని బయటకు పొక్కుతున్నది. ఆమె పురుషుడు కాదన్న రహస్యం కొద్దికొద్దిగా తెలిసిన సామంతులు కుట్రలు పన్నుతుంటారు. కాని కాకతీయ గణపతి రుద్రదేవ చక్రవర్తికి వృద్ధాప్యం వచ్చాక, రుద్రమదేవిని పురుషవేషంలో మహాసామ్రాజ్యానికి యువ రాజుగా పట్టాభిషేకం చేస్తారు.

అసలు రుద్రమదేవి చిన్నప్పట్నుంచి బాలుడిగా పెరిగినందు వల్ల యుక్తవయస్సు వచ్చేదాకా తాను స్త్రీ అనే విషయమే గ్రహణకు రాలేదు. తానొక బాలిక అన్న సత్యాన్ని రుద్రమదేవి గ్రహించిన తీరును బాపిరాజు గారు అద్భుతంగా కల్పించారు. ఒకసారి రుద్రమదేవి ఉత్సవాలలో ఒక స్త్రీ ప్రతిమను చూస్తుంది. ఇదివరకు అటువంటి దేవి విగ్రహాన్ని ఆమె ఎప్పుడూ చూడలేదు. ఆలయాలకు పోకుండా, నృత్యాలు చూడకుండా, ఇతర బాలికల నగ్నదేహాన్ని చూపకుండా, మహారాజులు జాగ్రత్తలు తీసుకొన్నారు. కాని ఆ రోజు ఉత్సవంలో చూచిన స్త్రీప్రతిమకు ఉన్న ఉత్తుంగ

---

1. గోనగన్నారెడ్డి – అడివిబాపిరాజు., పు: 61.

వక్షోజాలు, సన్నని నడుము, చూచాయగా ప్రదర్శింపబడిన నగ్నత చూచి ఆమెకు సందేహం వచ్చింది. ఆ స్త్రీ ప్రతిమ అవయవాలకు, తన శరీరాంగాలకు ఎలాంటి భేదం లేక పోవడాన్ని గమనిస్తుంది. వెంటనే తన తాతగారి అన్న రుద్రదేవ చక్రవర్తి నిర్మించిన మహాదేవాలయం చూడాలని బుద్ధి పుడుతుంది. వెంటనే గుడిలోనికి వెళ్తుంది. గుడిలో రకరకాల విన్యాసాలలో ఉన్న శిల్పాలను చూచి, అక్కడ ఉన్న రాజకుమారుల మాటలు వినిన తరువాత స్త్రీ, పురుష భేదం ఆమెకు పూర్తిగా అవగాహనం ఔతుంది. తాను స్త్రీ అనీ, పురుషుడు కాదనీ పూర్తిగా అర్థమై పోతుంది. వెంటనే వెంటనే మహా వేగంతో ఓరుగల్లు చేరి తన తల్లి దగ్గరకు వెళ్ళి "అమ్మగారూ! నేను మీవంటి బాలికనై ఉంటే నన్ను బాలకుణ్ణిగా ఎందుకు పెంచి లోకాన్ని మోసం చేస్తున్నారు"[1] అని అడుగుతుంది. అందుకు తల్లి బిత్తర పోయి మహారాజుకు వార్త పంపింది. ఆయన కంగారు పడిపోయి శివదేవయ్యమంత్రిని క్షణాలమీద రమ్మని కబురుచేశాడు. అప్పుడు శివదేవయ్య రుద్రమదేవికి అసలు విషయం ఇలా చెప్తాడు. "చక్రవర్తికి తమ్ములన్నా లేరు. ప్రతాప రుద్ర చక్రవర్తికి ఉంపుడు కత్తెకు పుట్టిన సారంగధర దేవునకు మాత్రం ఇద్దరు పుత్రులు హరిహర మురారిదేవులున్నారు. వాళ్ళకే రాజ్యం కబళించాలని ఉన్నది. ధర్మసంరక్షణార్థం ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క రాజే ఉండాలి. మన తెలుగు సామ్రాజ్యం[2] అనేక చిన్న చిన్న రాజ్యాలుగా ముక్కలై ఉంటే ధర్మ సంరక్షణ జరగదు" అంటాడు.

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 51.
2. పైదే., పు: 53.

తండ్రికూడ "ఈ మహాసామ్రాజ్యానికి యువరాజులేడు. నీ జాతకమందు మహా సామ్రాజ్ఞీత్వము వ్రాసి ఉంది" అంటాడు. మరల శివదేవయ్య "ప్రభూ! ఈ భూమిలో ధర్మం కొనసాగడానికే ఈ విధానం అవలంభించాము. మీరు బాలిక అని చెప్పగల శుభ ముహూర్తం వస్తుంది. మీరు అఖండ సామ్రాజ్యానికి సింహాసనం అధిష్ఠించాలని మిమ్ము బాలకునిగా పెంచాము తల్లీ! వీరపురుషోచిత మైనవిద్యలన్నీ మీకు నేర్పినాము. మీరు ఉత్తమోత్తమ చక్రవర్తులు కాగలరు. ఇదీ రహస్యం"[2] అంటాడు. అప్పుడు రుద్రమదేవి తలవాల్చుకొని "నన్ను క్షమించండి బాబయ్యగారూ! నన్ను ఆశీర్వదించండి గురుదేవా! అమ్మగారూ! మీ సహజోదార హృదయంతో నన్ను మీ హృదయంలోకి తీసుకోండి. మీ నాకర్పించిన ఈ దివ్య ధర్మాన్ని నా ప్రాణాలతో కాపాడుకొంటాను"[3] అంటుంది.

ఆమె స్త్రీకాదనే రహస్యం ఎంత కాలం దాగి ఉంటుంది. ఆమె స్త్రీ అని సభాముఖంగా ప్రకటించాలని శివదేవయ్యమంత్రి కూడ యోచిస్తున్నారు. ఒకరోజు ముమ్మడమ్మ బాధ పడుతుందని తెలిసి, తాను స్త్రీ అనే రహస్యం రుద్రమదేవి చెప్పివేస్తుంది. పరిస్థితి అర్థమై తొలుత బాధపడ్డా తర్వాత ఉపశమిస్తుంది ముమ్మడమ్మ.

తర్వాత "స్వస్తి, శ్రీ శాలివాహన శక 1183 దుర్మతి సంవత్సర వైశాఖ బహుళ పంచమీ సోమవారం నాడు మహాసభలో రుద్రదేవ-

---

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 54.
2. పైదే., పు: 54.
3. పైదే., పు: 54.

ప్రభువు శ్రీ గణపతిదేవ సార్వభౌముని పుత్రిక అనీ, ఆమె భావి చక్రవర్తి అనీ శివదేవయ్యా మంత్రి ప్రకటిస్తాడు."[1]

తల్లి, తండ్రి, పెద్దల ఆజ్ఞకు బద్ధురాలైన రుద్రమదేవికి ఒక మనస్సుంది. ఆమె చాళుక్య వీరభద్రుని మనసారా ప్రేమించింది ఆమె వీరవనిత మాత్రమే కాదు అపురూపసౌందర్యవతి కూడ. "ఈమెలో సత్యభామా దేవి అందాలన్నీ కూడుకొన్నాయి. ఈమెలో లలితాదేవి మహా సౌందర్యం మూర్తీభవించింది. ఆదిశంకర భారతీ తీర్థ స్వాములవారు రచించిన సౌందర్యలహరే ఈమెగా మూర్తీభవించింది."[2] చాళుక్య వీరభద్రుడు యువరాజును (అంటే పురుష వేషంలోని రుద్రమదేవిని) మొట్టమొదటిసారి చూచి ఇలా అనుకున్నాడు "మన్మథునిలో ఎక్కువ ఆడతనం ఉంది. కుమారస్వామిలో ఎక్కువ మగతనం ఉంది. జయంతునికి వారిరువురిలో లేని తేజస్సులేదు. నలకూబరుడు మనుష్యుల దగ్గరివాడు. వసంతుడు ఒక్క ఋతుకాల మాత్ర సౌందర్యం కలవాడు. వీరందరిలో లేని ఏదో ఒక మహా సౌందర్యోజ్జ్వలత ఈ బాలునిలో ఉన్నది"[3] అనుకొన్నాడు. తర్వాత క్రమంగా ఆమె స్త్రీ అని తెలుసుకొని ఆమె తన్ను మనస్పూర్తిగా ఇష్టపడుతూందని తెలిసి ఆమెను వివాహం చేసుకొంటాడు. దేశ సుస్థిరత కోసం విశాల హృదయంతో ఆమెనే చక్రవర్తిగా అంగీకరిస్తాడు.

రుద్రమదేవి గొప్ప రాజనీతిజ్ఞురాలు. పరిపాలనా దక్షురాలు.

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 131.
2. పైదే., పు: 42.
3. పైదే., పు: 49.

గణపతిదేవ చక్రవర్తి మరణించగానే రాజ్యభారాన్ని తన భుజస్కంధాలపై వేసుకొని చక్కగా రాజ్యపాలన చేసింది. తన పరిపాలన నిష్కంటకంగా సాగడానికి గోనగన్నారెడ్డి ఎంతో సహాయ పడుతున్నాడని తెలిసి అతనంటే ప్రత్యేక అభిమానం చూపించింది. అతని ప్రియురాలు అన్నాంబికను తన అంతరంగిక స్నేహితురాలుగా భావించి, ని ఎదిరించి వచ్చిన అన్నాంబికకు తన అంతఃపురంలో ఆశ్రయం ఇచ్చింది. గన్నారెడ్డి వివాహానికి అంతగా సుముఖురుగా లేదని తెలిసి తనభర్త చాళుక్య వీరభద్రునితో కలసి గోనగన్నారెడ్డిని అన్నాంబిక తండ్రి కోటారెడ్డిని ఒప్పించి అన్నాంబికతో వివాహం జరిపించింది. అట్లాగే తాను వివాహమాడిన ముమ్మడాంబికకు చాళుక్య మహారాజుతో వివాహం జరిపి తన బాధ్యత నెరవేర్చుకొంటుంది.

"ఆడది రాజ్యం చేయడమా!" అని హేళన చేసిన వారందరికీ బుద్ధి చెప్పినట్లు చక్కగా పరిపాలన చేస్తూ శత్రువులను తరిమి తరిమి కొట్టింది. ముఖ్యంగా ఓరుగల్లును జయించాలని గొప్ప సైన్యంతో వచ్చిన యాదవరాజు మహాదేవరాజును గోదావరీ తీరం వరకు తరిమి తరిమి కొట్టింది. ఇలా రుద్రమదేవి స్వయంగా యుద్ధనాయకత్వం వహించి లోకానికి స్త్రీశక్తి అకుంఠితమని చాటింది.

ఇలా కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించిన చక్రవర్తుల్లో ప్రఖ్యాతి గాంచిన రుద్రమదేవిని ముఖ్యపాత్రగా గ్రహించి బాపిరాజుగారు 'గోనగన్నారెడ్డి' నవలలో కథకు అనుగుణంగా మలచిన తీరు ప్రశంసించదగింది. రుద్రమదేవి మనస్తత్వాన్ని యథాతథంగా చిత్రించడంలో రచయిత కృతార్థులైనారు.

**4.1.4.3. అన్నాంబిక:** గోనగన్నారెడ్డి నవలలో 'అన్నాంబిక' నాయిక. ఈమె ఆదవోని ప్రభువైన కోటంరెడ్డికి ఏకైక పుత్రిక. ఈమె మిక్కిలి సౌందర్యవతి. "అన్నాంబిక పొడగరి. కోలమోము, మరీ పెద్ద కళ్ళు, నల్ల పాదోలలో ఏదో ఒక లోతు ...... తీర్చిదిద్దిన అవయవ స్ఫుటత్వము పసిమి ఎరుపుల తీరంలో దొరికే బంగారువలె శరీరచ్ఛాయ"[1] అని బాపిరాజు గారు వర్ణించారు. "ఆదవోని మహారాజుకు ఈమె ఒక్కతే సంతానమవడం చేత ఆదవోని ప్రభువు, తన చక్రవర్తి గణపతి రుద్రదేవ మహారాజు రీతిగా తానున్నూ అన్నమాంబికా దేవికి పురుషవేషం వేయించి వీరవిద్యలన్నీ నేర్పించెను."[2] "ఆ బాలిక బాలికయని రాజ బంధువులకూ, ఉన్నత రాజోద్యోగులకూ తప్ప మరెవ్వరికీ తెలియదాయెను"[3] పై వాక్యాల వల్ల అన్నాంబిక కూడ చాలుత పురుషుడుగానే వ్యవహరిస్తుందని మనకు అర్థమౌతుంది.

ఆమె సంస్కృత కావ్యాలు చదువుకొన్నది. భరతుని నాట్య శాస్త్రం, గుప్తరత్నాకరం, అలంకార శాస్త్రాలు, మనుధర్మశాస్త్రం, శుక్ర నీతిసారం, చాణుక్యనీతి, మానసోల్లాసము, భారత భాగవత రామాయణాదులు, ఆంధ్ర భాషలో అనుభవసారం, శివతత్త్వసారం, పండితారాధ్య చరిత్ర, పురుషార్థసారం, నన్నయ, తిక్కన కవి విరచిత ఆంధ్రమహాభారతం, మార్కండేయపురాణం ఇలా ఎన్నో కావ్యాలు చదివిన గొప్ప విదుషీమణి.

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 12
2. పైదే., పు: 12.
3. పైదే., పు: 13

అన్నాంబిక కోలమోము, పొగ కన్నుల్లోని వాలు చూపు, చిన్ననోరు, బంగారు సంపెంగవలె ఉన్న నాసిక, సరియైన శృతిలో కూర్చబడిన ఆమె మోమును చూచి ఆదవోని రాజ్య ఆస్థానకవి త్రిపురాంతకేశ్వర మంత్రి ఇలా వర్ణించారు.

"ఆ వనమోహనాంగి దరహాస వికస్వర లోచనద్వయా
నూనతి చూచి యేమో యతను ధ్వజమందలి మీన మట్టులే
నాన వహించె, శ్రీకర వినమ్రము పద్మము వాడి పోయె, ప
లో వనలెల్ల రాలెను, విలుంఖితమై యది వాలి పోవగన్"[1]

ఇలాంటి అన్నాంబికకు ఈడు రాగానే ఆమె తండ్రి కోటారెడ్డి అన్నాంబికను స్త్రీగా అందరికీ చెప్పివేయాలనుకొంటాడు. చక్రవర్తి రుద్రమదేవిని పురుషుడిగానే చెలామణి చేయిస్తూ ముమ్మడమ్మతో వివాహం కూడ జరిపిస్తాడు. ఈ రహస్యం తెలిసినా ప్రజలు చక్రవర్తిని విమర్శించడానికి సాహసించరు. చక్రవర్తి ఏం చేసినా చెల్లుతుంది. స్త్రీని పేడివానిలా మగవాడ్డై తిరగమనడం, అపకీర్తి, అధర్మం, రౌరవాది నరకం అనుకొని కోటారెడ్డి అన్నాంబిక పురుషుడు కాదని, స్త్రీ అని చెప్పివేస్తాడు. ఆ రోజునుంచి అన్నాంబిక పురుష వేషధారణ వదలిపెట్టి స్త్రీ ధరించే దుస్తులు ధరిస్తుంది.

క్రమక్రమంగా ఆమె స్త్రీ అనీ, అద్భుత సౌందర్యవతి అనీ ఆంధ్రదేశమంతా తెలుస్తుంది. "అన్నాంబిక విద్య, అన్నాంబిక శేముషీ సంప:

---

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 87.

ధూప కరండము నుండీ దెసలన్నీ కమ్మే పరిమళం లా దేశాలన్నీ ప్రస రించింది"[1]

మహారాష్ట్ర యాదవుడు, చోళ పాండ్య దేశ దాక్షిణాత్య ప్రభు వులు, కదంబ గాంగులు, కుంతల చాళుక్యుడు అన్నాంబికను వాంఛించారు."[2] పెండ్లి ఆడుతామని కోటారెడ్డికి కబురుపెట్టారు. కాని కోటారెడ్డి రాజకీయ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని లకుమయారెడ్డి కొడుకైన వరదారెడ్డితో అన్నాంబిక వివాహం జరిపించాలను కొంటాడు. ఆ వివాహం అన్నాంబికకు ఏ మాత్రం ఇష్టం లేదు. కాని తల్లిదండ్రుల మనస్సు బాధపెట్ట కూడదని పెండ్లికి ఒప్పుకొనింది. వరదారెడ్డి, అన్నాంబికల వివాహం గోనగన్నారెడ్డికి కూడా ఏమాత్రం ఇష్టం లేదు. వీరిద్దరికీ వివాహమైతే లకుమయారెడ్డి, కోటారెడ్డి ఒకటై చక్రవర్తిని ఎదిరిస్తారు. కాబట్టి గన్నారెడ్డి రెండు సార్లు ఈ వివాహాన్ని భగ్నం చేస్తాడు. మొదట వరదారెడ్డిని అపహరిస్తాడు. వివాహం ఆగి పోతుంది. కొంత కాలం తర్వాత కోటారెడ్డి మరలా వరదారెడ్డితో అన్నాంబిక వివాహం జరిపించాలని ప్రయత్నిస్తాడు. ఈ సారి గోనగన్నారెడ్డి అన్నాంబికనే అపహరిస్తాడు. ఆమె ఎక్కడ బాధ పడ్తుందో అని ఇలా అంటాడు. "రాజకుమారీ! ఈ పెళ్ళి వల్ల దేశంలో రాజద్రోహం రుద్రతాండవం చేస్తుంది. నీవు వరదారెడ్డి రాకుమారునే వివాహం చేసుకోవచ్చును. కాని కొంత కాలం ఈ వివాహం కాకూడదు"[3] అంటాడు.

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 80.
2. పైదే., పు: 80.
3. పైదే., పు: 113.

కాని అన్నాంబిక తనకు ఈ వివాహం అసలు ఇష్టం లేదనీ "కన్యకు ఆజ్ఞ అనుల్లంఘనీయము "[1] కనుక ఒప్పుకొన్నాను అంటుంది. అప్పుడు గన్నారెడ్డి "ఇప్పుడు ఆ ఆజ్ఞ లేదా?"[2] అని అడుగుతాడు

"ఇప్పుడు మీ మాటలలో వ్యక్తమయిన చక్రవర్తి ఆజ్ఞ జనకాజ్ఞ కన్న బలవత్తరమైనది ప్రభూ!"[3] అంటుంది.

కోటారెడ్డి అన్నాంబికకు మాత్రం తండ్రి మైతే చక్రవర్తి ప్రజలందరకూ తండ్రి కాబట్టి, ఒక విధంగా అన్నాంబిక దేశక్షేమం కోసం చక్రవర్తి అవే జనకాజ్ఞ మన్నించి వివాహాన్ని తిరస్కరించినా దోషం లేదని బాపిరాజు గారు చమత్కరించారు. గోనగన్నారెడ్డి ఆమెను అపహరించక పోతే ఆ మరుసటి ఉదయం ఆమె మరణించడానికే నిశ్చయించుకొంది. కాని ఆమెను ఆత్మహత్యా ప్రయత్నం మానమనీ, తనతో రమ్మని ఒప్పించి, ఆమె అనుమతి మీదనే ఆమెను తన అక్కగారైన కుప్పాంబిక నివాసస్థానం చేరుస్తాడు. అక్కడనుండి అన్నాంబిక బుద్ధపురం రాజైన మల్యాల గుండయ్య భవనానికి వెళ్తుంది. అక్కడ కూడా క్షేమంగా ఉండనేమో అని తలచి, అన్నాంబిక ఓరుగల్లు పాలించే రుద్రమదేవి వద్దకు చేరాలని కోరుతుంది. ఆమె కోరిక ప్రకారం కుప్పాంబిక, ఆమె భర్త ఇద్దరూ అన్నాంబికను ఓరుగల్లుకు చేరుస్తారు

అన్నాంబిక మొదటి చూపులోనే గోనగన్నారెడ్డిని ప్రేమిస్తుంది. "తానీ మహాపురుషుని, ఈ గజదొంగను, ఈ పరమోత్తమ వీరుని ప్రేమిస్తున్న

---

1. గోనగన్నారెడ్డి — అడివి బాపిరాజు., పు: 92.
2. పైదే., పు: 92.
3. పైదే., పు: 92.

మాట నిజం !. ఈ ఉత్కృష్ట మూర్తి ఈ విధంగా తన జీవితాకాశం ఆక్రమించిన వెలుగుమూర్తి అయినా తేమి? అదే నా ప్రేమ ? ఈ ప్రేమనే నా శకుంతల దుష్యంత దర్శనముచే అనుభవించినది. తన్ను ఆ మహాపురుషుడు ప్రేమించగలడా ? ఈ వీరాధి వీరుడు, ఈ ఉత్తమ దుర్జయాన్వయుడు తన్ను ప్రేమించక పోయిన క్షణం తన జన్మ తీరినట్లే !. లోకమే తలక్రిందులగును గాక. సర్వభువనాలు మండి పోవును గాక తాని వీరుని చెట్ట పట్టకుండ నెవరు వారింపగలరు ? "[1]

ఇలా గాఢంగా ప్రేమిస్తూ, రాత్రింబవళ్ళు అతన్నే స్మరిస్తూ ఉంటుంది. అన్నాంబిక. గోన గన్నారెడ్డి వంటి మహాపురుషుడు గజదొంగ కాడని, అతడు ప్రజాక్షేమానికే గజదొంగగా మారాడని అన్నాంబిక తలుస్తుంది. గోనగన్నారెడ్డి దుష్టుడు కాదనీ, రాజకీయ ప్రభావంచే గజదొంగగా మారి ఉండ వచ్చునని, అతన్ని క్షమించమని ఒకసారి అన్నాంబిక రుద్రమదేవి పాదాలపై బడి ప్రార్థిస్తుంది. ఓరుగల్లులో తరచు పండుగలు, ఉత్సవాలు జరుగుతుండేవి. అన్నాంబిక ఆ ఉత్సవాల్లో శ్రద్ధగా పాల్గొనేది. దుర్గాష్టమి మొదలైన పండుగ దినాల్లో ఆమె ఉపవాసం ఉండేది. కాక తమ్మ దేవతను పూజిస్తూ ఉండేది. ఆమె చేసే పూజలు, ఉపవాసాలు గోనగన్నారెడ్డి విజయాలు సాధించాలని, తనభర్త కావాలని కోరికతోనే చేసేది.

రుద్రమదేవికి గోనగన్నారెడ్డి అన్నా, అన్నాంబిక అన్నా ఎంతో అభిమానం. అన్నాంబికకు కూడా రుద్రమదేవి స్వేచ్ఛగా మాట్లాడేదానివల్ల, తనతో కలసి మెలసి ఆటలు, పాటలు, సాహిత్య చర్చలు చేసేందువల్ల

---

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు; 107.

రుద్రమదేవి అంటే చనువు ఏర్పడుతుంది. ఆ చనువుతో ఒకసారి "అక్కా! నా వివాహం ఏర్పాటు చేసిన దినాన ఒక పురుషుణ్ణి చూశాను. ఆ చూచినది మూడు నాలుగు క్షణికాలు మాత్రం. 'ఆ పురుషుని కొరకే నేను జన్మ ఎత్తినది' అని నా హృదయానికి తట్టినది. నాకా వివాహం కాదని, ఆ పురుషుడే నా భర్త అవుతాడని నాకు తొలకరి మెరుపులా తత్క్షణం తోచింది."[1]

అది విన్న రుద్రమదేవికి ఆ పురుషుడెవరో తెలిసిపోయింది. నవ్వుతూ "నీ రహస్యం నేను గ్రహించలేదనుకున్నావా? అతడు గజదొంగ! ఇది నీలో దాగి ఉన్న మనోవ్యథ. అందుకనే నా సేనాపతులకూ, సైన్యాలకూ ఆ గజదొంగని ఏ విధంగానూ బాధించక బందీగా పట్టుకోవలసిందని ఆజ్ఞ ఇచ్చాను"[2] అని చెప్తుంది. ఇలా రుద్రమదేవి అన్నాంబికను స్వంత చెల్లివలె చూస్తుంది. అన్నాంబికకు కూడా రుద్రమదేవి అంటే ఎంతో ఇష్టం. అందుకే రుద్రమదేవి గుంటూరుపై యుద్ధానికి పోయినప్పుడు, ఆమెను ఒప్పించి ఆమెకు అంగరక్షకురాలిగా ఉంటుంది. ఇంకా రుద్రమదేవితో ఇలా అంటుంది. "అక్కా! మీరు ఒప్పుకుంటే మన రాజ్యంలో వీర స్త్రీదళం ఒకటి సిద్ధం చేసి, 'ఆంధ్ర వీరరమణులు శ్రీశ్రీ రుద్రదేవ పరిపాలనలో ఉన్నారు' అని లోకానికి చాటిస్తాను."[3] ఈ మాటలవల్ల అన్నాంబిక ఎంతటి వీర వనితో మనకు తెలుస్తుంది. ఒకానొక సందర్భంలో ఆమె, "గన్నారెడ్డి సమున్నత విగ్రహమూ, ఆయన సింహ పరాక్రమమూ, ఆయన పరమాద్భుత యుద్ధ నిర్వహణాశక్తీ,

---

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 215.
2. పైదే., పు: 215, 216.
3. పైదే., పు: 248.

~~వ్యూహ రచనా చమత్కృతి లోక సమ్మోహనకరాలు~~ అలాంటి ఉత్తమ పురుషుడు పినతండ్రి తనకన్యాయం చేసినంత మాత్రాన గజదొంగగా పోవాలా? అని బాధ పడ్తుంది.

గన్నారెడ్డి శ్రీశైల ప్రాంతంలో తన నివాసాన్ని ఏర్పరచుకున్నాదని తెలిసికొని అన్నాంబిక, తన చెలికత్తెయైన మల్లికతో పురుష వేషాలు ధరించి అతని దగ్గరకు వెళ్తారు. గన్నారెడ్డి కూడా వారు భటులనే తలచి తనతో కూడా యుద్ధంలో పాల్గొనేందుకు అనుమతిస్తాడు. అన్నాంబిక తన పేరు విశాలాక్ష రెడ్డి అనీ, తన చెలికత్తె పేరు మల్లికార్జున రెడ్డి అని పరిచయం చేసుకుంటారు. అన్నాంబిక, విశాలాక్షునిగా ఎన్నోసార్లు గోనగన్నారెడ్డిని ఆపదనుండి కాపాడుతుంది. కొద్ది రోజుల్లోనే గన్నారెడ్డి విశాలాక్ష రెడ్డి వేషంలో ఉన్నది అన్నాంబిక అని గ్రహిస్తాడు.

దేవగిరి రాజైన మహాదేవరాజు కొన్ని లక్షల సైన్యాలతో ఓరుగల్లు ముట్టడిస్తాడు. కాకతీయ సైన్యానికి, మహాదేవ సైన్యానికి భయంకర యుద్ధం జరుగుతుంది. ఆ యుద్ధంలో గన్నారెడ్డి ప్రముఖ పాత్ర వహించి దేవగిరి సైన్యాన్ని ఎన్నో రకాలుగా బాధిస్తాడు. అడుగడుగునా అడ్డుకొంటాడు. గన్నారెడ్డి వల్ల దేవగిరి సైన్యం మందకొడిగా ఓరుగల్లు చేరుతుంది. మధ్యలోనే దాదాపు లక్షకు మించి సైన్యాన్ని గన్నారెడ్డి సేనలు మట్టుపెడతాయి. చివరకు చిరకాల శత్రువైన దేవగిరి సైన్యాలు ఓడిపోతాయి. ఓరుగల్లు ప్రజలంతా విజయోత్సవాలు చేసుకుంటారు.

---

1. గోన గన్నారెడ్డి — అడివి బాపిరాజు., పు: 249.

ఆ విజయోత్సవ సందర్భంగా రుద్రమదేవి ~~గోనగన్నా~~ రెడ్డిని సత్కరిస్తుంది. ఆ సందర్భంలో అన్నాంబిక ప్రేమను గన్నారెడ్డికి వివరిస్తుంది. అన్నాంబిక తండ్రి కోటారెడ్డిని వివాహానికి ఒప్పిస్తుంది. ఇలా అన్నాంబిక స్వచ్ఛమైన ప్రేమ ఫలిస్తుంది. తల్లిదండ్రుల అంగీకారంతో తాను వలచిన గోనగన్నారెడ్డిని అన్నాంబిక వివాహం చేసుకొంటుంది.

ఇలా బాపిరాజుగారు ఆనాటి ఆంధ్ర స్త్రీల ధైర్య సాహసాలకు, వీరోచిత కృత్యాలకు, ముగ్ధ మనస్సుకు ప్రతీకగా ఈ అన్నాంబిక పాత్రను చిత్రించారు.

**4.1.4.4. చాళుక్య వీర భద్రుడు:** చాళుక్య వీరభద్రుడు కాకతీయ నవమ చక్రవర్తి. రుద్రమదేవి భర్త. ఇతడు శ్రీ గణపతిదేవ చక్రవర్తికి సామంత రాజైన నిదురదవ్రోలు చాళుక్య మహారాజు ఇందుశేఖరుని పెద్ద కుమారుడు. ఇతడు కూడ చారిత్రక వ్యక్తి. ఈ చారిత్రక వ్యక్తిని ఆధారంగా కొంత కల్పన చేసి గోనగన్నారెడ్డి నవలలో చాళుక్య వీరభద్రుని పాత్రను అడివి బాపిరాజు ఎంతో గొప్పగా మలిచారు. ఈ నవలలో గోన గన్నారెడ్డి, రుద్రమదేవి, అన్నాంబికల కంటె ఎక్కువగా ఈయన ప్రస్తావన రాలేదు. కాని వచ్చినంతలో చాళుక్య వీరభద్రుని గురించి చాల చక్కగా వివరించారు రచయిత.

ప్రథమ దర్శనంలోనే చాళుక్య వీరభద్రుని సుందరాకారాన్ని చూచి రుద్రమదేవి ఆకర్షణకు లోనవుతుంది. శ్రీశ్రీ గణపతి రుద్రదేవ చక్రవర్తి జన్మదినోత్సవాలకు తండ్రితో పాటు చాళుక్య వీరభద్రుడు కూడ వస్తాడు.

"ఆ మహా సభలో చాళుక్య వీరభద్రుడు ఆకాశాన సూర్యదేవుని వలె ఒక్కడే ప్రత్యక్ష మయినాడు రుద్రమదేవికి "[1]

రుద్రమదేవికి వివాహం చెయ్యాలనుకొంటే, ఆమెకు తగిన వ్యక్తి చాళుక్య వీరభద్రుడే అని శివదేవయ్య మంత్రి ఉద్దేశం. అందుకే చాళుక్య వీరభద్రుణ్ణి రప్పిస్తాడు. "యవ్వన హృదయాన్ని యవ్వన హృదయమే గ్రహిస్తుంది. చాళుక్య వీరభద్ర మహాప్రభువు యౌవనవంతుడు, మహావీరుడు కామినీ జయంతుడు. ఆయనకు యువ మహారాజుల హృదయం అర్థం కాకూడదా అని రప్పించాను"[2] అని శివదేవయ్య మంత్రి శ్రీ రేచెర్ల ప్రసాదిత్యుల వారితో ఒక సందర్భంలో చెబుతాడు. వారిద్దరికీ ఎన్నో పర్యాయాలు కలుసుకొనేందుకు వీలు కల్పించాడు. వేట, గుర్రపుస్వారీ, విలువిద్యా ప్రదర్శనం మిషపై ఎన్నో సార్లు రుద్రమదేవి, వీరభద్రులు కలుసుకొన్నారు. రుద్రమదేవి, వీరభద్రుని మనస్సులోనే ప్రేమించింది. మొదట వీరభద్రుడు అందరివలె రుద్రమదేవి బాలకుడే అని భ్రమ చెందుతాడు. ఆమెను రుద్రదేవ ప్రభువుగా భావించి గౌరవిస్తాడు. ఒకసారి రుద్రమదేవి (పురుష వేషంలో ఉన్నప్పుడు) "వీర భద్రుని రెండు చేతులు తన రెండు చేతుల పట్టుకొని తన మూర్ధాన ఉంచుకొన్నాడు. ఆ క్షణంలో వేయి విద్యుల్లతలు ఒక్కసారి వీరభద్రుని దేహమంతా ప్రసరించినట్లు ఝల్లుమని పోయినాడు. వీరభద్రునికేదో సిగ్గు వేసింది. అతడు వెంటనే కాకతీయ మహాప్రభువు చేతులు రెండూ

1. గోనగన్నారెడ్డి — అడివి బాపిరాజు., పు: 49.

2. పైదే., పు: 30

వదలి వేసినాడు."[1]

ఒకసారి వేటకు ఇద్దరూ వెళ్ళే ఏర్పాటు చేస్తాడు శివదేవయ్యా మంత్రి. ఆ వేటలో చాళుక్య వీరభద్రుడు, రుద్రమదేవిని పులిబారి నుండి కాపాడుతాడు. ఆ సమయంలో చాళుక్య వీరభద్రుడు ఆమె స్త్రీ అని గ్రహిస్తాడు. అప్పటినుండి చాళుక్య వీరభద్రునికి ఆమెపట్ల గల అభిమానం అనురాగంగా పరిణమిస్తుంది. కానీ రుద్రమదేవి తన్ను ప్రేమిస్తూ ఉందో? లేదో? అనే సందేహం వీరభద్రునికి కలిగింది. "ఆమె చక్రవర్తి. తాను సాధారణ సామంతుడు. తన్నేల ఆమె ప్రేమించవలెను? బాలికయైనా ఆమె పరిపాలనా జ్ఞానము, దక్షతా వర్ణనాతీతము. బాలికయై కూడ బాలుని వేషంలో ఎంత అందంగా ఉన్నది."[2] అని అనుకొంటాడు. తనకు స్త్రీ అని తెలిసినట్లు ఆమెకు ఇంకా తెలియదేమో అని కూడా అనుకొంటాడు. ఆమెను బాలుడు అని అనుకొన్న దినాల్లో ఆమెను స్నేహితుడుగా ప్రేమించాడు. ఇప్పుడు ఆమెను ప్రియురాలుగా ప్రేమిస్తూ, నిజమైన విరహవేదన అనుభవిస్తున్నాడు. రుద్రమదేవి కూడ "ఓహోహో చాళుక్య వీరభద్ర ప్రభువెంత యందగాడు. ఎంతటి వీరుడీయన! ఆయన మనముష్టి వినిర్ముక్త శరము ఇనుప కుడ్యాలైనా భేదించుకు పోగలదు గాబోలు. ఆ పెద్దపులి కళ్ళ మధ్యనుంచి మెదడులోకి సువ్వున దూసిపోయింది. ఒక్క ఏటుతో గిర్రున తిరిగి ఆ అటవిరాజు నేల కూలింది. ఈ ప్రభువెంత చదువుకున్నాడు ఎంతశాంతము.

---

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 49, 50.
2. పైదే; పు: 42.

ఏ విషయంలోనూ చెక్కుచెదరదు. కోపము వీరి జీవితంలో ఎప్పుడైనా వచ్చునా? ఉత్తమ ధర్మం ఈయనలోనే మూర్తమై ఉందా! ఎంతటి మహా పురుషుడు! సింహం లాంటి బలం కలవాడు, సింహాలను కుక్కల వలె తోల గల విక్రమం కలవాడు"[1] అని యోచించేది. ఇలా ఇద్దరూ మూగగా ఒకరి నొకరు కాంక్షిస్తున్నారు.

ఒకసారి రుద్రమదేవి కొద్దిమంది అంగరక్షకులతో మొగిలిచర్ల కాకతమ్మ గుడి దర్శించడానికి వెళ్ళింది. ఈ విషయం తెలిసి హరిహర మురారిదేవులు పెద్దసైన్యంతో వచ్చి ఆమెను ఆకస్మికంగా బంధించాలని చూస్తారు. కాని ఆమె కొద్దిమంది అంగరక్షకులతో మాత్రమే వెళ్ళిందని తెలుసుకొన్న చాళుక్య వీరభద్రుడు అపాయాన్ని శంకించి తన సేనతో బయలు దేరి తగిన యుద్ధ కౌశలాన్ని ప్రదర్శించి హరిహర మురారి దేవులను వధించి వారి సైన్యాన్ని నాశనం చేస్తాడు. ఇలా రుద్రమదేవిని రక్షిస్తాడు. ఇంకొకసారి యాదవ మహారాజు కొన్ని లక్షల సేనతో ఓరుగల్లు ముట్టడించి వచ్చుడు రణ రంగంలో రుద్రమదేవికి బాసటగా నిలిచి విరోధి సైన్యాలను సంహ రిస్తాడు. ఈ విధంగా చాళుక్య వీరభద్రుడు రుద్రమదేవిపట్ల ప్రేమతో ప్రభు భక్తి ప్రకటిస్తాడే గాని తన ప్రేమను వెల్లడించడు చాళుక్య వీరభద్రుడు "రుద్రమదేవి రాజ్యపాలనను నిష్కంటకము చేసి తాను హిమాలయాలకు పోవుటే యుక్తమని నిశ్చయించుకొంటాడు."[2] "చాళుక్య వీరభద్రుడు రుద్రమదేవి కాత్యాయనీదేవి అవతారమే అని నమ్మినాడు. ఆమె తన్ను

---

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 41.
2. పైదే., పు: 315.

ప్రేమించుట అసంభవము. అవతారమూర్తి కానిచో ఏ స్త్రీ తన స్వీయ సత్వముచే సామ్రాజ్ఞి కాగలదు"[1] అని అనుకొంటాడు.

"చాళుక్య వీరభద్రుడు శ్రీ కాకతీయ రుద్రమాంబా దేవిని గాఢంగా ప్రేమించిన మాట వాస్తవమనీ, సీతా మహాదేవిని రాముడు ప్రేమించినట్లే, కుణాలుడు కాంచనమాలను ప్రేమించినట్లు ప్రేమించాడని"[2] శివదేవయ్య మంత్రి గ్రహిస్తాడు. అందుకే చాళుక్య వీరభద్రునితో శివదేవయ్య మంత్రి "రుద్రమదేవి వారి విషయం అంతా వేరు ప్రభూ! ఆమె చక్రవర్తిని అయి తీరాలి. ఆమె సాటి మహారాజుని వివాహం చేసుకొంటే రెండు రాజ్యాలు ఏకమౌతాయి. ఏ కళింగాధిపతినో, ఏ యాదవ మహారాజునో, ఏ పాండ్య భూపతినో ఆ రుద్ర మహారాణి వివాహం చేసుకొంటే ఆంధ్రరాజ్యం అంతరించి పోతుంది"[3] అంటాడు. ఇంకా "మహారాజా! మీరు మా మహారాణి రుద్రమదేవిని ప్రేమిస్తున్నారు. మీప్రేమను సామ్రాజ్యాలు, రాజనీతులు అడ్డుకోలేవు"[4] అని చెప్తూ, గణపతి దేవుల కోరిక కూడ చెప్తాడు. (ఆ కోరిక ఏమంటే) "రుద్రమదేవిని వివాహం చేసుకున్న పురుషుడు ఎంత మహోత్తముడైనా ఆయన చక్రవర్తి కాకూడదు. రుద్రమదేవికి కుమారుడు పుడ్తే అతడు రాజ్యభారం వహించే ముందు కాకతీయ వంశానికి దత్తుడు కావాలి"[5] ఇంకా "తాము, మా మహారాణి లోక కల్యాణం

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 316
2. పైదే., పు: 262, 263.
3. పైదే., పు: 263.
4. పైదే., పు: 264.
5. పైదే., పు: 244.

కోసం వివాహం చేసుకొని తీరాలి"[1] అని కూడా చెప్తాడు. దానికి సమాధానంగా చాళుక్య వీరభద్రుడు శివదేవయ్య మంత్రితో "మహా భాగా! గురుదేవా! తమ ఆజ్ఞ నా శిరస్సున కిరీటం కన్న ఎక్కువ గౌరవంగా తాల్చబడుతుంది"[2] అని అంటాడు. దీనిని బట్టి చాళుక్య వీరభద్రునికి రుద్రమదేవిపై గల అపారమైన ప్రేమ వెల్లడి అవుతుంది.

ఇక్కడ గోనగన్నారెడ్డికి, చాళుక్య వీరభద్రునికి చాల తేడాలున్నాయి. గోనగన్నారెడ్డి కాకతీయ సామ్రాజ్య విచ్ఛిన్నం కాకూడదని పరోక్షంగా సహాయం చేస్తాడు. కాని చాళుక్య వీరభద్రుడు రాణితో పాటు యుద్ధాల్లో పాల్గొని సామ్రాజ్యాన్ని రక్షిస్తాడు. రుద్రమదేవి మొదట తన తండ్రి అవసాన దశలో కోరిన కోర్కె ప్రకారం, తానే విశాల సామ్రాజ్యానికి చక్రవర్తిగా ఉంటానని శపథం చేస్తుంది. కాని తండ్రి మరణానంతరం ఓరుగల్లు రాజ్యానికి ఆమెను చక్రవర్తిని చేశాక నిండు సభలో తన ప్రేమను వెల్లడిస్తూ "మహారాజా! కాకతీయ సామ్రాజ్యంతో ఈ దాసురాలిని స్వీకరించ ప్రార్థన"[3] అని చాళుక్య వీరభద్రునితో చెప్తుంది. విశాలహృదయం గల చాళుక్య వీరభద్రుడు తాను ఆమెను వివాహమాడినా, ఆమె రాజ్యానికి ఆమె తండ్రి కోరిక ప్రకారం ఆమెనే చక్రవర్తినిగా చేసి, తాను సామంత రాజుగా ఉంటానని స్పష్టం చేసి, ఆమె చేసిన ప్రతిజ్ఞకు ఎలాంటి భంగం కలుగకుండా ప్రవర్తిస్తాడు.

---

1. గోనగన్నారెడ్డి — అడివి బాపిరాజు, పు: 264.
2. పైదే., పు: 265.
3. పైదే., పు: 389.

ఇంతటి ఉదార స్వభావుడు, వీరుడు, నిష్కపటి అయిన చాళుక్య వీరభద్రుని పాత్రను ఎంతో మధురంగా తీర్చిదిద్దిన బాపిరాజు గారు అభినందనీయులు. చరిత్రకంటె ప్రేమకే అధిక విలువ ఇచ్చిన రాజుగారు చాళుక్య వీరభద్రుని పాత్రకు కొంత కల్పనను జోడించారన డంలో సందేహం లేదు. "రుద్రాంబను చాళుక్య వీరభద్రునకిచ్చి వివాహము చేసిరి. ఈమెకిరువురు కుమార్తెలు. రుద్రాంబ యౌవనముననే భర్తను కోల్పోయెను. తన యనంతరము రాజ్యభారమును వహింపవలసినదని తన కుమార్తెనే రాజ్ఞీ పదమునకు సమర్థురాలిని చేసెను"[1] ఇలా చరిత్ర తెల్పుతుంది. అంటే గణపతి దేవుడు బ్రతికి ఉన్నప్పుడే చాళుక్య వీరభద్రుడు తనువు చాలించాడనీ, లేకుంటే అతడే రాజ్యపాలన చేసి వుంటాడనీ అర్థం వస్తుంది.

నిజం ఏది యేమైనను చాళుక్య వీరభద్రుని ఒక మహోన్నత వ్యక్తిగా సృష్టించారు బాపిరాజుగారు.

4.1.4.5. **శివదేవయ్య మంత్రి:** అఖండ కాకతీయ సామ్రాజ్యాన్ని శ్రీశ్రీ గణపతి రుద్రదేవ చక్రవర్తి, అతని తరువాత అతని కుమార్తె రుద్రమదేవి చక్రవర్తి పరిపాలించుచున్న సమయంలో శివదేవయ్య వాళ్ళకు మంత్రిగా ఉండి, రాజ్య చక్రాన్ని తన చేతులతో తిప్పుతూ కాకతీయ సామ్రాజ్యాన్ని భిన్నాభిన్నం కాకుండా కాపాడిన మహామేధావి.

శ్రీకృష్ణదేవరాయలకు తిమ్మరుసు, ప్రతాపరుద్రునకు

1. 'ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి' - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య బాలేందుశేఖరం., పు:293.

యుగంధరుడు , చంద్రగుప్తునకు చాణక్యుడు ఎలా మంత్రిత్వం నెరిపారో, అలాగే శివదేవయ్య కూడా కాకతీయ చక్రవర్తులిద్దరికీ తోడ్పడ్డాడు. రాజ నీతిజ్ఞుడైన శివదేవయ్య సహకారం లేకుంటే గణపతిదేవ చక్రవర్తి తోనే కాకతీయ సామ్రాజ్యం అంతరించి పోయి ఉండేది అనేది చారిత్రక సత్యం.

అంతర్గత శత్రువులు , బాహ్యశత్రువులు కాకతీయ రాజ్యాన్ని కబళించాలని ఎత్తులు వేస్తుంటే , వాటికి పై ఎత్తులు వేసి. శ్రీకృష్ణ పరమాత్మ పాండవులకు ఆయుధం ధరించకుండా సహాయ పడినట్లే , శివదేవయ్య కాకతి చక్రవర్తులిద్దరికి సహాయపడి కాకతి ఆంధ్ర సామ్రాజ్యాన్ని సుస్థిరం చేశాడు.

అటు శత్రువుల కుట్రలను చారులద్వారా తెలిసికొని వాటికి విరుగుడు మంత్రం వేయడమే కాక , రుద్రమ దేవికి పురుష వేషం వేసి ముమ్మడమ్మతో వివాహం జరిపించి కొంత కాలం రుద్రమ దేవిని పురుషు డని ప్రజల్ని నమ్మించడం , గోనగన్నారెడ్డిని , అతని అనుచరులను గజదొంగ లుగా నాటకమాడించడం , చాళుక్య వీరభద్రరాజే రుద్రమ దేవికి తగిన వరుడని తలచి అతనిని పిలిపించి , అతనిని రుద్రమదేవిని ఎన్నోసార్లు ఒంటరిగా కలుసుకునే అవకాశాలు కల్పించడం , అందువల్ల రుద్రమ దేవికి , చాళుక్య వీరభద్రునిపై ప్రేమ కలుగుతుందని ఊహించడం , సమయం చూసి చాళుక్య వీరభద్రునికి రుద్రమదేవి స్త్రీ అని తెలిపి ఆమెను వివాహం చేసుకోవలసిందిగా కోరడం ఇవన్నీ శివదేవయ్య మంత్రాంగాలే.

శివదేవయ్య మంత్రిని గురించి అడివి బాపిరాజు గారు 'గోనగన్నారెడ్డి' నవలలో ఇలా రాశారు.

"శివదేవయ్య మంత్రి ఏబది రెండేండ్లు యీడువాడు; చామన చాయ వాడు. సన్నగా, పొడుగ్గా వంగిపోయి వుంటాడు. మహామాత్యులైన చెన్నా ప్రగడ-గణపామాత్యుల మేనల్లుడు. ఆరాధ్యుడైన వీరశైవుడు కాడు. విష్ణుభక్తి కలవాడు. అఖండ పండితుడు. వేద వేదాంగ పారంగతుడు. సకలశైవాగమవేత్త. మేనమామ వలె అఖండ వైద్యుడు. చక్రవర్తి చేత అనేక వైద్యాలయాలు, ప్రసూతి ఆలయాలు, వైద్యవిద్యా పరిషత్తులు ఏర్పాటు చేసిన ధర్మశీలి. సర్వతంత్ర స్వతంత్రుడు. తన బావగారైన గోపరాజు రామ ప్రధానిచే త్రైలింగ మహాసామ్రాజ్యంలో రాజ్య పాలన నిర్వక్రమంగా జరిగేటట్లు చూస్తున్నవాడు. శివపూజా దురంధరుడు"[1]

ఇంకా "శివదేవయ్య మంత్రి ఆరాధ్య ఆరువేల నియోగి బ్రాహ్మణుడు, ఉత్తమ రాజ్య తంత్రజ్ఞుడు, పండితుడు, సకలశాస్త్ర పారంగతుడు, మహాకవి. శివదేవయ్య చక్రవర్తితో పాటు గోళకీ మఠ శైవగురు పరంపరలోని విశ్వేశ్వర శివాచార్యులకు శిష్యుడై, తమ గురువు గుప్తమైన వెనుక తాను శివదేశికులై, రాజమంత్రియై శ్రీకాకతి గణపతి రుద్ర ప్రభునిచే ఆంధ్రమహాసామ్రాజ్యము అఖండముగ, రామరాజ్యముగ, పరిపాలనము చేయించుచున్న పరమాద్భుత సత్త్వుడు. ఇసు మంత్రైనా రోగమెరుగని తపస్సంపన్నుడు. సర్వవేదాంత సారము లూర కూలంకషంగా తెలుసుకొని, శంభు మహిమను పూర్తిగా ఎరిగిన ముముక్షువు. జనక చక్రవర్తి వలె రాజధర్మం అనే తామరాకులో నీటి బిందువులా ప్రకాశిస్తూ, యుద్ధం చేయని పార్థసారథిలా, కాకతీయ మహారాజ్య

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 29.

పరిపాలనా రథానికి చోదకుడై నడుపుతున్నాడు. ఆయన మాట గణపతి రుద్రదేవునకు శివాజ్ఞ."[1]

ఇంకనూ "శివదేవయ్య దేశికులు మహాకవి. తెలుగు నుడికారం అమృత ప్రవాహాలు కట్టే 'పురుషార్థసార' మను నీతి గ్రంథం రచించారు. ఈ మహాభాగుని గురించే తిక్కన మహాకవి,

"వసుమతీ నాథ యాతఁ డీశ్వరుడు గాని
మనుజ మాత్రుడు గాడు పల్కులు నితని
యను మతంబున నీవు రాజ్యంబు నేలు"[2] అని పాడియున్నారు.

ఇలా చారిత్రకంగా ఉదాత్త పురుషుడైన శివదేవయ్యను నవలాగతంగా మరింత ఉదాత్త పురుషుడుగా చిత్రించారు బాపిరాజుగారు.

రుద్రమదేవిని చిన్నప్పట్నుంచి బాలునిగా పెంచినందు వల్ల ఆమెకు యౌవనం వచ్చినా ఆమె స్త్రీయని గ్రహించలేక పోయింది. కాని ఒకసారి ఆమె స్త్రీ ప్రతిమను చూచి, తర్వాత ఆలయములోని స్త్రీ పురుష శిల్పాలను చూచి, అక్కడి రాజకుమారుల మాటలు విని స్త్రీపురుష భేదం అవగాహనయై, తాను స్త్రీ అని తెలుసుకొని వాయువేగంతో ఓరుగల్లు వెళ్ళి తల్లిని, ఎందుకు బాలికనైన నన్ను బాలునిగా పెంచి లోకాన్ని మోసం చేస్తున్నారు అని అడిగింది. తల్లి బిత్తరపోయి ఆమె తండ్రి గణపతి దేవుని పిలిపించింది. ఆయన కంగారు పడిపోయి శివదేవయ్యా మంత్రిని పిలిపించి మహామాత్యా! రుద్రప్రభువు

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 122.
2. పైదే., పు: 349.

తాను బాలికయై ఉండగా ఏల పురుషునిగా తన్ను పెంచినారు అని అడుగుతున్నారు అని చెప్తారు. అప్పుడు శివదేవయ్య మంత్రి, చక్రవర్తికి పుత్రుడు పుట్టలేదని తెలిస్తే సామంతులు కొందరు తామే చక్రవర్తులు కావాలని తిరగబడతారు. కొట్లాటలు జరుగుతాయి. దేశం భిన్నాభిన్న మౌతుంది. అలా మన తెలుగు సామ్రాజ్యం అనేక చిన్న రాజ్యాలుగ ముక్కలై ఉంటే ధర్మ సంరక్షణ జరుగదు. ఈ భూమిలో ధర్మం కొన సాగడానికే ఈ విధానం అవలంబించాము అని రుద్రమదేవికి నచ్చచెప్తాడు. అంటే ఆ సందర్భంలో ఒక్క శివదేవయ్య మంత్రికి తప్ప ఎవ్వరికీ రుద్రమదేవితో మాట్లాడి నచ్చజెప్పి ఒప్పించగల ధైర్యంలేదని రాజుగారి

ఓరుగల్లును ముట్టడించిన దేవగిరి యాదవరాజును జయించిన తర్వాత రుద్రమదేవి శివదేవయ్య మంత్రితో "నాయనగారూ! ఇంతవరకూ మనదే జయం. మహాదేవరాజు చిందర వందర అయి పోయినాడు, విన్నారా?"' అని శివదేవయ్య మంత్రిని 'నాయన గారూ!' అని సంబోధిస్తుంది. దీనిని బట్టి రుద్రమదేవికి శివదేవయ్య అంటే ఎంత అభిమానమో అర్థమౌతుంది. తండ్రి తర్వాత శివదేవయ్యే ఆమెకు తండ్రి, రక్షకుడు. అందుకే ఆయన ఇలా ఆశీర్వదిస్తాడు. "మీ మనస్సులలో ద్వాదశార్యులు ప్రతిఫలింతురుగాక!

---

'గోనగన్నారెడ్డి — అడివి బాపిరాజు., పు: 368.

మీ హస్తాల్లో పాశుపతాది దివ్యాస్త్రాలు భాసించు గాక! మీ చూపులలో ఫాలనేత్రాగ్ని వెలిగిపోవు గాక! మీ శత్రువు పరాభూతుడగు గాక! మీకు శుభమగు గాక!"[1]

ఇలా బాపిరాజుగారు శివదేవయ్య మంత్రిని ఎంతో ఉత్తముడుగా, తెలివితేటలు గలిగిన వాడుగ, రాజనీతిజ్ఞుడుగా, మంత్రిగా మలచి, శివదేవయ్య పాత్ర పాఠకుల మనస్సులో చిరస్థాయిగా వుండేటట్లు తీర్చిదిద్దినారు.

1. గోన గన్నారెడ్డి - అడివి బాపిరాజు, పు: 368

# 4.2. బృందావన్ లాల్ వర్మ

# చారిత్రక నవలలు - పాత్ర చిత్రణ

4.2.1. భువన విక్రమ్:

4.2.1.1. భువనుడు: బృందావన్ లాల్ వర్మగారు ఉత్తర వైదిక కాలానికి చెందిన కథావస్తువును తీసుకొని, ఐతిహాసిక సంఘటనలకు కల్పనలను మేళవించి అపూర్వంగా 'భువన విక్రమ్' అనే పేరుతో చారిత్రక నవలను రచించారు. ఈ నవలలో నాయకుడు భువన విక్రమ్.

'భువనుడు' రోమక మహారాజు ఏకైక పుత్రుడు. అందమైన వాడు. పరాక్రమవంతుడు. కాని చంచలమైన స్వభావం కలవాడు. వర్మగారు ఇతనిని "సుమారు 15 సంవత్సరాల వయస్సు కలిగి, బలిష్ఠమైన శరీరం, ఆకర్షణీయమైన మొహం, వయస్సుకు తగ్గ మానసిక పరిణామం లేని యువకు"[1]నిగా వర్ణించారు.

"ఇతను గర్విష్ఠి అయినప్పటికీ చెడ్డవాడు మాత్రం కాదు. అతని హృదయంలో మానవత్వం మెండుగా ఉండేది. అందువల్లనే కష్టాలకు లోనైన కపింజలుని పట్ల ఉదారంగా వ్యవహరించి, అతన్ని దయనీయ స్థితినుండి రక్షించి తన లక్ష్యం వరకు చేర్చేటందుకు సంసిద్ధుడవుతాడు."[2] అందువల్లనే దెబ్బలు తిన్న కపింజలుని ఓదారుస్తూ ఇలా అంటాడు. "నేను నిన్ను గుర్రంపై కూర్చో బెట్టుకొని వైద్యుని వద్దకు సుకు వెళ్ళి వైద్యం చేయిస్తాను"

రోమకుడు భువనుని చంచల ప్రవృత్తిని చక్కదిద్దమని

1. భువన విక్రమ్ - బృం. లాల్ వర్మ., పు: 2.
2. బృం. లాల్ వర్మా - సాహిత్య ఔర్ సమీక్ష - సియారామ్ శరణ్ ప్రసాద్., పు: 186.
3. భువన విక్రమ్ - బృం. లాల్ వర్మ., పు: 77.

ధౌమ్య మహర్షిని ఆశ్రయిస్తాడు. ధౌమ్య మహర్షి ఆశ్రమంలో అతను సంయమనం తోను, క్రమ శిక్షణ తోను వ్యవహరించి తన చంచల ప్రవృత్తిపై విజయం సాధిస్తాడు. ధౌమ్యుని పర్యవేక్షణలో అతనిలో సానుభూతి, క్రమ శిక్షణతో కూడిన మానవీయ ప్రవృత్తి తగిన రీతిలో వికాసాన్ని పొందుతుంది.

భువనుడు గౌరిని మనసారా ప్రేమిస్తాడు. కాని పట్ల దృష్టి, పట్టుదల కలవాడు కాబట్టి ప్రేమకు దాసుడు కాలేక పోతాడు. ధౌమ్యుని ఆజ్ఞానుసారం ఆమెతో కలసి మాట్లాడడం కూడ మానుకొంటాడు. అయినా ఆమె పట్ల అతని హృదయంలో పవిత్ర ప్రేమ ఉంటుంది. గౌరి చనిపోయిందని తెలుసుకొని చింతిస్తాడు. ఆమెను మాటి మాటికి తలచుకొంటూ, "ఆమె శరీరం, మొహం రెండింటిలో వయస్సుకు మించిన గాంభీర్యం కనబడేది. కోమలత్వం, స్నేహం, సౌందర్యం మూర్తీభవించిన ఆమెను నా జీవన సహచారిణిగా చేసుకొంటానని ప్రతిజ్ఞ చేశాను. కాని నా దురదృష్టం వల్ల నానుండి దూరమయ్యింది"[1] అని విలపిస్తాడు. ఇంతేగాక ముందు జరిగిన సంఘటనలను మాటి మాటికీ స్మరిస్తూ ఇలా అనుకొంటాడు. "నైమిశారణ్యంలోని పుష్పాలు ఆమె నాకు ఇస్తూ ఉండేది. ఆమె పెంచే ఆవు మెడవంచి మా ఇద్దరి వైపు చూస్తూ ఉండేది. నేను ఆమెకు చాలా కష్టం కలిగించాను. అమాయకంగాను, అందంగాను

---

1. బృందావన్ లాల్ వర్మా - సాహిత్య ఔర్ సమీక్ష — సియారామ్ శరణ్ ప్రసాద్, పు. 187.

ఉండే ఆమె సాక్షాత్తు గౌరీదేవి వలె కనిపించేది. ఆమె వెళ్ళిపోయింది. నేనిక్కడ విలపిస్తున్నాను. నేను దయలేని వాణ్ణి. పాషాణమూర్తిని"[1]

అని ఎప్పుడూ బాధపడుతూ ఉంటాడు.

"భువనుడు సాటిలేని పితృభక్తి కలవాడు. తనకిష్టం లేకపోయినా తన తల్లిదండ్రులను సంతోష పెట్టడానికి హిమానీని పెండ్లాడేందుకు అంగీకరిస్తాడు."[2]

భువనుడు బాల్యదశలో ఉద్దండుడుగా ఉన్నా, అతనిలో నిగూఢంగా పవిత్ర భావాలుండేవి. అవి సరైన సమయంలో వికసించాయి. ధౌమ్యుడు అతని స్వభావాన్ని పూర్తిగా మార్చివేస్తాడు.

ధౌమ్యమహార్షి ఆశ్రమంలోని సాత్విక వాతావరణం వల్ల భువనుని ప్రవర్తనలో మార్పు కలిగింది. అతని చంచల దుష్ట స్వభావం నశించి కొద్ది సమయంలోనే గొప్ప విద్వాంసుడౌతాడు. వేదవేదాంగాలు అర్థం చేసుకోగల జ్ఞానం అతనికి లభిస్తుంది. నీతి, నిజాయితీ, కర్తవ్యపరాయణత, ఏకాగ్రత, స్థైర్యం మొదలైన మంచి గుణాలు అతని స్వంతమయ్యాయి.

రాజ్య భ్రష్టుడైన రోమకుడు తన పతనానికి కారణం కపింజలుడనే శూద్రుడు తపస్సు చేయడమే నని భావించి, ఆ కపింజలుని అంతం చెయ్యాలనుకొంటున్నప్పుడు గురువు ఆజ్ఞ గైకొని భువనుడు

---

1. భువన విక్రమ్ - బృం. లాల్ వర్మ, పు: 221
2. బృందావన్ లాల్ వర్మ-సాహిత్యకార్ సమీక్ష - సియారామ్ శరణ ప్రసాద్, పు: 187.

తన తండ్రికి నీతిని బోధించి కపింజలుని చంపే ప్రయత్నం నుండి విరమింప జేస్తాడు. అతని బోధలు విన్న రోమకునికి రాజ్యకాంక్ష, అహంకారం నశించి జ్ఞానోదయం కలుగుతుంది.

గౌరిని భువనుడు మనస్ఫూర్తిగా ప్రేమించినా, గురువు ఆజ్ఞ జవదాటలేక ఆమెను కలుసుకొనే ప్రయత్నం చేయడు. రోమకునికి అయోధ్య తిరిగి సంక్రమించిన తరువాత భువనుడు కూడా తండ్రితో రాజ్యానికి వచ్చేస్తాడు. అయినా తన ప్రేయసి గౌరిని మరువలేడు. కాని దురదృష్ట వశాత్తు గౌరి నదిలో పడి కొట్టుకు పోయిందని తెలిసి మూగగా బాధ ననుభవిస్తాడు.

అయోధ్యకు వచ్చిన వెంటనే రోమకుడు తన సమస్త సంపదలను ప్రజలకు పంచిపెట్టాడు. కోశాగారంలోని సంపద తరిగి పోగా, తన దానశీలత నిరాటంకంగా సాగేందుకు కొంత ధనం అప్పుగా ఇవ్వమని నీలుడనే వర్తక శ్రేష్టుణ్ని అడుగుతాడు. ఎలాగైనా రోమకుని పదవీ భ్రష్టుణ్ని చేయాలని భావించే నీలుడు ఇదే అవకాశంగా తీసుకొని అప్పుగా ధనం ఇవ్వడంకన్నా తనకుమార్తె హిమానీని భువనునకిచ్చి వివాహం చేస్తే వరకట్నంగా అపార ధనం ఇస్తానని ఆశ చూపుతాడు. భువనుడు కూడ తన ప్రియురాలు మరణించిందని తలచి, ఎటూ గౌరి తనకు దక్కలేదు కాబట్టి తండ్రినైనా సంతోష పెట్టాలని, కట్న రూపేణా వచ్చే డబ్బుతో తన దానశీలత నిరాటంకంగా కొనసాగుతుందని తలచి హిమానీతో

వివాహానికి అంగీకరిస్తాడు. ఇదంతా హిమానీ, ఆమె తండ్రి నీలపణీభూషల కుట్ర అని భువనునికి తెలియదు. హిమానీ కుట్రపన్ని భువనుణ్ణి చంపే ప్రయత్నం చేస్తుంది. కాని గౌరి భువనుణ్ణి రక్షించి హిమానీని బంధిస్తుంది. శత్రువుల పన్నాగం బయట పడుతుంది. హిమానీకి ఇతరులకు శిక్షలు పడ్తాయి. గౌరి బ్రతికే ఉందని భువనుడు ఆనందించి సంతోషంగా ఆమెను వివాహం చేసుకొంటాడు.

ఇలా తొలుత దుర్మార్గుడైన భువనుడు ధౌమ్యుని శిష్యరికం వల్ల సన్మార్గుడై తండ్రికి నీతి బోధించి, రాజ్యాకాంక్ష, అహంకారం నశింప జేసి, తన ప్రేయసి గౌరినే వివాహమాడుతాడు.

వర్మగారు భువనవిక్రమ్‌లో భువనమోహనుని పాత్రను ఎంతో హృద్యంగా మలచారనడంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు.

**4.2.1.2. గౌరి :** "గౌరి క్షత్రియ వంశానికి చెందిన స్త్రీ. భారతీయ ఉన్నత ఆదర్శానికి ఆమె ప్రతీక. ఆమెలో పరిపూర్ణ ప్రేమ, గంభీర భావం, నైతిక దృఢత, సేవాతత్పరత మొదలైన సద్గుణాలు మెండుగా ఉన్నాయి."[1] వర్మగారి స్త్రీ పాత్రల్లో అనేక మంది ఉన్నత ఆదర్శాన్ని స్థాపించిన వారే. అహిల్యాబాయి, మృగనయనీ, ఝాన్సీ కీ రాణీ లక్ష్మీబాయి, కచనార్ - వీరందరూ ఆదర్శ నారీమణులు.

అయోధ్యను పాలించే రోమకుడు విధివంచితుడై, రాజభ్రష్టుడై నిరాశ చెంది తన పుత్రుడు భువనమోహనునితో కలసి నైమిశా

---

1. బృందావన్ లాల్ వర్మ - సాహిత్యకార సమీక్ష — సియారామ్ శరణ్ ప్రసాద్, పు: 187.

హిమానీ, మేఘుడు మొదలైన వారిచే భువనమోహనుడు సర్వనాశనం కాబోతున్నాడని తెలిసినప్పుడు గౌరి సుకోమలమైన నారీ హృదయం పరితపిస్తుంది. ఆమె భగవంతుణ్ణి 'ప్రభూ! అతణ్ణి కాపాడు. అతని బదులు నా ప్రాణాలు తీసుకో' అని ప్రార్థిస్తుంది. స్త్రీజాతికి సహజంగా ఉండే దౌర్బల్యం గౌరికి కూడా ఉండేది.

హిమాని భువనమోహనుణ్ణి చంపాలని నిశ్చయించుకొని అతణ్ణి ప్రేమిస్తున్నట్లు నటిస్తుంది. ఆమెది నటన అని తెలియక, ఎటు తిరిగి తన ప్రేయసి మరణించింది కనుక, తన తండ్రికి ఆర్థిక ఇబ్బంది తప్పించాలని భువనుడు హిమానీతో వివాహానికి అంగీకరిస్తాడు.

ఈ విషయం గౌరికి తెలిసి తన దురదృష్టాన్ని నిందించుకొంటుంది. ఆమె మనస్సు పరిపరి విధాల ఆలోచిస్తుంది. ఆయన నన్నిప్పుడు బహుశా గుర్తించక పోవచ్చు. గుర్తించినా ఉపేక్షా భావంతో ఉండవచ్చు. ఏమైనా ఆయన సుఖంగా ఉంటే నాకంతే చాలు. నా సర్వస్వం ఆయనే. ఆయన క్షేమమే నా క్షేమం అనుకొంటుంది. పై విషయం వల్ల గౌరి భువనుని ఎంతగా ప్రేమించేదో, ఆమె ప్రేమ ఎంత పవిత్రమయ్యిందో స్పష్టమౌతుంది. ఆమె శరీరమందలి ప్రతి అణువు భువనమోహనుని శ్రేయస్సే కోరుతుంది. "నేను భువనమోహనుని ప్రేమిస్తున్నాను. ఆయన ఇష్టపడినా, ఇష్టపడక పోయినా ఆయనను కాపాడేందుకు నా ప్రాణాలను సహితం అర్పిస్తాను. ఆ సమయం దగ్గరలోనే రావచ్చు. ఆయన కొరకై అగ్నిలో దూకేందుకైనా సిద్ధంగా ఉన్నాను"[1] అనుకొంటుంది.

---
[1] వృందావన్‌లాల్ వర్మ- సాహిత్యకార్ సమీక్ష — సియారామ్ శరణ ప్రసాద్, పు: 187.

నివసించే ధౌమ్య మహర్షిని ఆశ్రయిస్తాడు. తన పుత్రునికి విద్యను నేర్పించి సత్క్రమ మార్గంలో పెట్టమని ప్రార్థిస్తాడు. ధౌమ్యుడు అందుకు అంగీకరిస్తాడు. ధౌమ్యుని శిష్యునిగా మారిన తర్వాత భువనునిలోని దుష్ట స్వభావం పూర్తిగా నశించి, .. సుగుణాలు అబ్బి గొప్ప విద్వాంసుడౌతాడు.

ధౌమ్య మహర్షి ఆశ్రమానికి కొద్ది దూరంలోని కుగ్రామంలో ఉన్న గౌరిని భిక్షాటనకై వెళ్ళిన భువనుడు ప్రేమిస్తాడు. గౌరి కూడా భువనుణ్ణి ప్రేమిస్తుంది. గౌరి పేదపిల్ల అయినా గుణవంతురాలు. అందగా ఉండేది. కష్టపడి పనిచేసుకొంటూ కాలం గడిపేది. గౌరి భువనుణ్ణి ఎల్లప్పుడు ఉన్నత భావాలు కలవాని గాను, ఆదర్శమూర్తిగాను భావించేది. గౌరి, భువనుల ప్రేమ వృత్తాంతం ధౌమ్యునికి తెలిసి ఆమెను కలుసుకో కూడదని ఆంక్షలు పెడతాడు. భువనునికి ఇది ఇష్టం లేక పోయినా విధిగా గురువు ఆజ్ఞను శిరసా వహిస్తాడు. రాజ్య భ్రష్టుడైన రోమకునికి తిరిగి రాజ్యం లభిస్తుంది. భువనుడు కూడా తన విద్య పూర్తి చేసుకొని అయోధ్య చేరుకొంటాడు.

తర్వాత గౌరిని కలుసుకొని వివాహం చేసుకోవాలనుకొంటాడు. కాని గౌరి, ఆమె తల్లిదండ్రులు నదిలో కొట్టుకు పోయారనే వార్త విని ఖిన్నుడౌతాడు. కాని నిజానికి గౌరి చావలేదు. ఆమె తల్లిదండ్రులు మాత్రం మరణించారు. ఆమె ఏకాకియై ఒంటరిగా జీవనాధారం వెతుక్కొంటూ వచ్చి హేమానికి సేవకురాలుగా చేరి ఆమెకు విశ్వాస పాత్రురాలైంది. తర్వాత తన ప్రియుడే అయోధ్య రాకుమారుడని తెలిసినా ఆమె తన నిజరూపం బయట పెట్టదు.

హిమానీ తాను భువనమోహనుని ప్రేమిస్తున్నట్లు చెప్పమని గౌరిని కోరినప్పుడు, ఆమె దగ్గుతూ వస్త్రంచే తన ముఖాన్ని కప్పుకొంటుంది. తన ప్రేమికునికే హిమాని ప్రేమవృత్తాంతం చెప్పవలసి వచ్చిందే అని బాధపడ్తుంది. తన దుఃఖాన్ని కన్నీటి ద్వారా శాంతింప జేసుకొంటుంది. గౌరి ప్రేమ ప్రశాంతమైంది. త్యాగపూరితమైంది. నిరాడంబరమైంది. చివరికి తన ప్రేమనే త్యాగం చెయ్యాలనుకొనే త్యాగశీలి గౌరి.

క్షత్రియ జాతికి చెందిన సాహసం కూడ గౌరిలో ఉంది. హిమాని భువనమోహనుని వివాహమాడుతానని నమ్మించి అతణ్ణి చంపేటందుకు ప్రయత్నించినప్పుడు, అతణ్ణి దూరంగా నెట్టి హిమానీని గట్టిగా పట్టుకొంటుంది. ఇలా భువనుణ్ణి కాపాడుతుంది. తన తండ్రి రోమకుని వద్ద తీసుకున్న అప్పు కూడ చెల్లిస్తుంది. చివరికి కథ సుఖాంతమై గౌరి, భువనులకు వివాహం జరుగుతుంది.

స్త్రీల మానసిక చైతన్యాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొన్న వర్మగారు స్త్రీజాతి పవిత్రత, ఔన్నత్యం మొదలైన గుణాలకు ప్రతిరూపంగా గౌరి పాత్రను తీర్చిదిద్దినారు. నవలలో ఆదినుండి అంతం వరకు ఆమె ప్రవర్తన ఆదర్శప్రాయంగాను, అనుసరణీయంగానూ మలిచారు రచయిత వర్మగారు.

**4.2.1.3. రోమకుడు:** "రోమకుడు ఇక్ష్వాకు వంశానికి చెందినవాడు. ఇతని వయస్సు ఇంచుమించు నలభై సంవత్సరాలు. బలిష్ఠమైన శరీరం కలవాడు. అతని మొహం అందంగాను, ఆకర్షణీయంగాను ఉండేది.

అతని వస్త్రధారణ సామాన్యంగా ఉండేది : నడుముకు బిగించిన ఒరలో ఖడ్గం ఉండేది. మెడలో ముత్యాల హారం, భుజంపై సువర్ణ భుజకీర్తులు మోచేతులకు కడియాలు ఉండేవి."[1]

రోమకుడు ఉదార బుద్ధి కలవాడు. అతని రాజ్యంలో కరవు వచ్చినప్పుడు ప్రజలకు ధాన్యాన్ని పంచుతాడు. రాజ్యం సుభిక్షంగా ఉండాలని అనేక యజ్ఞాలు చేయిస్తాడు. అతడు యజ్ఞంలో పశుబలి అంగీకరించడు. అతనికి దాస్య పద్ధతి ఇష్టం ఉండేది కాదు. ఈ విషయమై కొంతమంది తమ అసమ్మతిని వ్యక్తం చేస్తే, వారిలో ప్రధానుడైన 'నీలఘణేష్' నకు ఇట్లా సమాధానం చెప్తాడు. "నేను దాస్య పద్ధతిని అంగీకరించను. ప్రతి వ్యక్తి ఔన్నత్యం పొందేందుకు జీవితంలో అభివృద్ధిని సాధించేటందుకు అధికారముంది. వీటిని సాధించడమే ప్రతి ఒక్కరి లక్ష్యం. కపింజలుని కానీ, మరొకరిని గానీ దాసునిగా స్వీకరించడానికి నేనంగీకరించను"[2] అంటాడు.

అతడు ఆనాటి సమాజంలో ప్రచారంలో ఉన్న సిద్ధాంతాలకు వ్యతిరేకంగా నడవడం వల్ల మేఘుడు, నీలుడు మొదలైనవారు విరోధులౌతారు.

రోమకుడు మహాజ్ఞాని. ఆయన తన పుత్రునికి వేదాలను, ఋక్కులను నేర్పిస్తాడు. ఆయన సిద్ధాంతాలలో కొన్ని లోపాలుండేవి. ఒకప్పుడు ఏమీ చేయకుండా ఉండడం. మరొకప్పుడు తొందరపాటుతో, అభిలాషతో ఒకపని చేయడానికి బదులుగా మరియొక పని చేయమని చెప్పడం చేత

---

1. భువన విక్రమ్ – బృం. లాల్ వర్మ., పు: 18,19.
2. బృందావన్ లాల్ వర్మా – సాహిత్యకార సమీక్ష – సియారామ్ శరణ ప్రసాద్, పు: 189.

ఆయన ప్రయత్నాలు ఫలించవు. వీటి వల్ల పతనోన్ముఖుడై రాజ్యాన్ని పోగొట్టు కొంటాడు.

రోమకుడు రాజ్య భ్రష్టుడై తన పతనానికి కారణాలను అన్వేషిస్తూ నైమిశారణ్యంలో తిరుగుతూ ఉంటే, కపింజలుడనే శూద్రుడు తపస్సు చేసుకొంటూ ఉండడం గురించి విని, ఒక శూద్రుని తపస్సే తన పతనానికి కారణం అనే నిర్ణయానికి వచ్చి కపింజలుని చంపడానికి నిశ్చయించుకొంటాడు. కాని ధౌమ్యుని శిష్యరికంలో జ్ఞానిగా మారిన భువనుడు తన తండ్రి రోమకునికి సన్మార్గం బోధించి జ్ఞానోపదేశం చేస్తాడు. దానితో రోమకునికి రాజ్యకాంక్ష, అహంకారం నశిస్తుంది. కపింజలుని చంపే ప్రయత్నం నుండి విరమించుకొని తరుణోపాయం సూచించమని ధౌమ్యుణ్ణి ప్రార్థిస్తాడు. ధౌమ్య మహర్షి అతనికి సత్కర్మలు ఆచరించమని ఉపదేశిస్తాడు. చివరకు రాజు తన నాశనానికి శూద్రుని తపస్సు కారణం కాదని, తన అసమర్థ పరిపాలనా విధానమే కారణమని నమ్ముతాడు. రాజ్యం తిరిగి సంపాదించాక తన సమస్త సంపదలు క్షామ పీడితులకు దానం చేస్తాడు.

రాజ్యంలో జరిగే అరాచకాలకు శూద్రుని తపస్సే కారణం అంటూ, వశిష్ఠ మహర్షి మాటలు విని శ్రీరామ చంద్రుడే తపస్సు చేసుకొనే 'శంబూకుడు' అనే శూద్రుని వధించాడని ఉత్తర రామ చరిత్రలో 'భవభూతి' రాశారు. వర్మగారు భవభూతిని విభేదించినట్లు భువన విక్రమ్ నవలలో కపింజలుని కథ రాశారు. ఈ కథద్వారా వర్మగారి మానసిక పరిణితి వ్యక్తమౌతున్నది.

ఈ నవల ఉత్తర వైదిక కాలానికి చెందింది. ఇది పూర్తిగా కల్పనలతో

కూడిన చారిత్రక నవలగా విశ్లేషించినా, కొన్ని చారిత్రక సత్యాలను వర్మగారు ఈ నవలలో పొందుపర్చారు. అందులో కపింజలుని కథ ఒకటి. ఆ ఉత్తర వైదిక కాలంలోనే ప్రజలు ఇలాంటి చర్యలను నిరసించారని వర్మగారు సూచన ప్రాయంగా మనకు తెల్పినట్లు అనిపిస్తుంది.

**4.2.1.4. హిమానీ :** వర్మగారు రచించిన 'భువన విక్రమ్' నవలలో హిమానీ ఒక దుష్ట పాత్ర. ప్రతినాయిక అని చెప్పవచ్చు. రోమకుడు అయోధ్యను పాలించే కాలంలో అయోధ్యా నగరంలో పేలుడనే ధనవంతుడైన వర్తకుడు ఉండేవాడు. అతని కూతురే హిమానీ.

హిమానీ ఎంతో అహంకారి. గర్విష్ఠి. కపట బుద్ధి కలది. పొగరు బోతు. ఈర్ష్య, అసూయ, పగ మొదలైన దుష్ప్రవృత్తులు ప్రకటించి పుచ్చుకొన్న స్త్రీ. తన శత్రువులపై పగ, ప్రతీకారం తీర్చుకోవడానికి కుట్రలు పన్నడంలో అందె వేసిన చెయ్యి. చివరికి తన శత్రువులను చంపడానికి కూడా వెనుకాడదు. ఆమె అందగత్తె. కానీ తానే ఎంతో అందగత్తెనని గర్వంతో విర్రవీగేది.

హిమానీ తొలి పరిచయాన్ని నవలలో వర్మగారు ఇలా నాటకీయంగా రచించారు. "ఎదురెదురుగా రెండు రథాలు. ఒక రథంపై ఒక యువతి రెండో రథంలో ఒక యువకుడు. యువతి వయస్సు 14 సం॥లు. యువకుని వయస్సు 16 సం॥లు. ఇద్దరూ కోపంతో కనుబొమలు చిట్లించుకొని ఒకరి నొకరు చూస్తూ ఉన్నారు. అందగత్తె అయిన ఆ యువతి కళ్ళు చాలా పెద్దవి. విశాలంగా ఉన్న కళ్ళు కోపంతో అరుణిమ దాల్చాయి. ఎదురుగా ఉండే రథాన్ని తప్పించేందుకు ఆ రథం గుర్రాలను కొరడాతో కొట్టి పక్కకు తోలే ప్రయత్నం చేసింది.

యువకుడు రథాన్నుండి దిగాడు. ఆమె రథాన్ని ఒక వైపుకు తోలమని చెప్పాడు. కొరడాను చేతిలో తీసుకొని యువతి కూడా తన రథాన్నుంచి దిగింది. కొరడా ఝుళిపిస్తూ "రథాన్ని ఎక్కడికి తీసుకువెళ్ళేది? చోటు లేదు. నీవే తప్పుకో" అని కఠోరంగా మాట్లాడింది. అప్పుడు ఆ యువకుడు 'నేనెవరనుకొన్నావు? అయోధ్యా రాజకుమారుడ్ని తెలియదా?" అని గట్టిగా బదులిచ్చాడు. అయినా ఆమె నిర్లక్ష్యంగా అతడ్ని చూసి "నేనెవరను కొన్నావు? ప్రఖ్యాతి గాంచిన శ్రీమాన్ నీల ఫణీష్ కుమార్తెను. ఆయన పేరు సముద్రానికి ఆవలి వైపు కూడా వ్యాపించింది"[1] అని చెప్పింది. ఆ యువతియే హిమానీ. హిమానీ పాత్రను పరిచయం చెయ్యడంలోనే ఆమె అహంకార పూరితమైన స్వభావాన్ని పాఠకుల ముందు ఆవిష్కరించారు బృందావన్ లాల్ వర్మగారు.

హిమానీ తండ్రి నీలుడు గొప్ప ధనవంతుడే కాని పరమ లోభి. పైకి మంచివాడుగా కనబడినా లోలోపల చాలా క్రూర స్వభావం గలవాడు. హిమానీ ఒక్కతే కూతురు. తల్లిలేని ఆమెను ఎంతో ముద్దుగా పెంచాడు. ఆమెను ఎక్కువగా ప్రేమించేవాడు. ఎంతో గారాబంగా సంపదల మధ్య పెరిగింది కాబట్టి, ఆమె పెరిగిన వాతావరణ ప్రభావం వల్ల చెడ్డ ప్రవృత్తి కల స్త్రీగా రూపొందింది. నీలుడు తన కుమార్తెను ఎంత ఎక్కువగా ప్రేమించాడో అంతకంటే ఎక్కువగా సంపదలను, అధికారాన్ని కూడా వాంఛించాడు. కూతురి బాగోగుల కంటే తన భవిష్యత్తుపైనే అతని దృష్టి ఉండేది.

ఇలా గారాబంగా పెరిగిన హిమాని ప్రవృత్తి స్వార్థపూరితంగా

---

1. భువనవిక్రమ్ – బృం. లాల్ వర్మ, పు: 288.

పరిణమించింది. ఆమె దేవుణ్ణి "మమ్మల్ని ద్వేషించే వాడు సర్వనాశనం కావాలని, తమ శత్రువుల్ని చంపమని, తమశక్తి ప్రపంచం అంతా వ్యాపించాలని, గొప్పగొప్పవారిని కూడా ఎదిరించే శక్తి తమకు ఇమ్మని"[1] ప్రార్థించేది.

ఆమె ప్రవర్తన దోష భూయిష్ఠమైంది. తన కపట ప్రవర్తన ద్వారా దీర్ఘబాహువుని తనవలలో వేసుకొని, వివాహం చేసుకొంటానని మభ్యపెట్టి తన స్వార్థానికి ఉపయోగించుకొంటుంది.

యువరాజు భువనుడు ఒకసారి గర్వంతో మదమత్తుడై హిమానీని కొరడాతో కొట్టిస్తాడు. అది తగిన సమయం కాదని హిమానీ ఎదురు తిరగక పగబట్టిన త్రాచువలె ప్రతీకారం కోసం ఎదురుచూస్తూ ఉంటుంది. కుమారునిపై కోపం తండ్రి రోమకుడిపై చూపిస్తుంది. రాజును సింహాసనం నుండి దింపే ప్రయత్నం చేస్తుంది. "రాజ్యంలో ఉండే అల్లకల్లోలానికి రాజు రోమకుడే బాధ్యుడు. అతణ్ని సింహాసన భ్రష్టుణ్ని చేయండి. అతణ్ని వ్యతిరేకించండి"[2] అని దీర్ఘబాహుణ్ని, అతని మిత్రుణ్ని పురికొల్పుతుంది. మేఘుడు మొదలైన వారి సహాయంతో రోమకుడి పుత్రుడైన భువన-మోహనుణ్ని సర్వనాశనం చెయ్యడానికి భయంకరమైన కుట్ర పన్నుతుంది. భువనుని పెండ్లి చేసుకొనే నెపంతో చంపాలనుకొంటుంది. ఆమె భువనుణ్ని చంపబోయే విషయాన్ని తన నమ్మకమైన సేవకురాలు గౌరితో నిస్సంకోచంగా చెబుతుంది. కాని కుట్ర వివరాలను మాత్రం ఎవరికీ చెప్పకుండా

1. భువనవిక్రమ్ – బృం. లాల్ వర్మ, పు: 30
2. పైదే., పు: 32.

రహస్యంగా ఉంచుతుంది. భువనుణ్ని చంపుతానని గౌరితో చెప్పే టప్పుడు హిమానీలో ఎలాంటి బాధ కాని, సానుభూతి కాని కనిపించదు. ఆ విషయాన్ని గొప్ప కార్యంగా భావిస్తుంది.[1]

కాని ఆమె కుట్ర గౌరివల్ల విఫలమౌతుంది. కుట్రలో ప్రకాళిక ప్రకారం భువనుణ్ని 'బాలదేవ' మందిరానికి రప్పించి, భువనుడు దేవుడికి సాష్టాంగ దండ ప్రమాణం చేసేటప్పుడు అతణ్ని కత్తితో పొడిచి చంపేందుకు ప్రయత్నిస్తుంది. ఆ క్షణంలో గౌరి భువనుణ్ని ముందుకు నెట్టవేసి హిమానీని బంధిస్తుంది. ఇలా హిమానీ చివరకు తాను త్రవ్వుకొన్న గోతిలో తానే పడ్డట్టు బంధింపబడి, దేశ బహిష్కరణ శిక్ష అనుభవిస్తుంది.

హిమానీ భువన విక్రమ్ నవలలో ముఖ్యమైన దుష్ట స్త్రీ పాత్ర. రోమకుని పతనానికి, రాజ్యంలో అల్లకల్లోలం చెలరేగడానికి ఆమే మూలకారణం. దీర్ఘబాహువు మొదలైన వారిని తన వశం చేసుకొని రోమకుని సింహాసనం నుండి దింపించ గలుగుతుంది. కడకు కపటంతో భువనమోహనుణ్ని చంపేందుకు ప్రయత్నం చేస్తుంది. ఇటువంటి దుష్ట ప్రవృత్తి గల స్త్రీలు ప్రపంచంలో చాల అరుదుగా ఉంటారు. వర్మగారు ఆమె పాత్ర చిత్రణలో ఎన్నో మెలకువలు తీసుకొని, దుష్ట పాత్రల్ని కూడా ఎలా ఆకర్షణీయంగా మలచవచ్చో అని హిమానీ పాత్రద్వారా నిరూపించారు.

భువన విక్రమ్ — బృం. లాల్ వర్మ., పు: 40.

4.2.1.5. **ధౌమ్య మహర్షి:-** కొన్నివేల సంవత్సరాలకు పూర్వం, ఉత్తర వైదిక కాలంలో రోమకుడు అనే రాజు అయోధ్యను పరిపాలిస్తుండే వాడు. అప్పుడు అయోధ్యకు దరిదాపుల్లోనే నైమిశారణ్యంలో ధౌమ్య మహర్షి ఆశ్రమం ఉండేది. ధౌమ్య మహర్షి మహా తత్త్వవేత్త. మహాజ్ఞాని. అతనిది గంభీరమైన తత్త్వం. ఆశ్రమ వాతావరణం ఎంతో సాత్త్వికంగా ఆహ్లాదకరంగా ఉండేది.

రోమకుడు విధి వశాత్తు రాజ్యభ్రష్టుడై తన కుమారుడు భువనునితో సహా వెళ్ళి ధౌమ్య మహర్షిని ఆశ్రయిస్తాడు. తనకు జ్ఞానబోధ చేయమని, తన పుత్రునికి విద్యను నేర్పించి సక్రమమైన మార్గంలో పెట్టమని ప్రార్థిస్తాడు. ధౌమ్యుడు చిరునవ్వుతో అంగీకరిస్తాడు.

ధౌమ్యుని ఉపదేశం వల్ల భువనునిలో ఎంతో మార్పు వస్తుంది. తొలుత దుష్ట స్వభావం కల్గిన భువనుడు ధౌమ్యుని శిష్యరికం వల్ల కొద్ది రోజుల లోనే ఉత్తముడుగా, మహా విద్వాంసుడుగా మారిపోతాడు.

భువనుడు భిక్షాటన నిమిత్తం ప్రక్క గ్రామాలకు వెళ్తుంటాడు. అలా వెళ్తూ ఒక కుగ్రామంలో గౌరి అనే అందాల పేద క్షత్రియ కన్యను ప్రేమిస్తాడు. గౌరి కూడ భువనుణ్ని ప్రేమిస్తుంది. వీరి ప్రేమ వృత్తాంతం ధౌమ్యునికి తెలుస్తుంది. భువనునితో ఇలా అంటాడు. "నీవు ఏ స్త్రీని ఏకాంతంలో కలుసుకో కూడదు... ఏ స్త్రీ వైపు కన్నెత్తి చూడ కూడదు. ఏ గుమ్మం ముందు ఒకసారి కంటే ఎక్కువసార్లు భిక్ష అడుగ కూడదు"[1] అని మూడు ఆంక్షలు పెడతాడు. భువనునికి ఇష్టం లేకపోయినా గురువచనం తన శ్రేయస్సుకే నని తలంచి గురువుగారి ఆజ్ఞను శిరసావహిస్తాడు.

1. భువనవిక్రమ్, బృందావన్ లాల్ వర్మ, పు; 136, 137

పతనోన్ముఖుడై రాజ్యాన్ని పోగొట్టుకున్న రోమకుడు తన పతనానికి కారణం కపింజలుడు అని నిర్ణయానికి వచ్చి అతణ్ని చంపే ప్రయత్నంలో ఉంటాడు. ఈ విషయం ధౌమ్యునికి తెలిసి అతని వ్యక్తిత్వాన్ని మేలుకొలిపి, బుద్ధి చెప్పాలనే ఉద్దేశ్యంతో కపింజలుని చంపి పాప విముక్తుడై రాజ్యాన్ని పొందమని చెబుతాడు. కాని రాజుకు జ్ఞానోదయం కలిగించగల వ్యక్తి ఒక్క భువనుడే అని గ్రహించి, భువనుణ్ని రోమకునికి కపింజలుడున్న ప్రదేశం చూపమని పంపుతాడు. దారిలో భువనుడు తన తండ్రికి సత్య మాహాత్మ్యాన్ని విశదీకరిస్తాడు. దీనితో జ్ఞానోదయం పొంది రోమకుడు అహంకారం విడిచి పెడ్తాడు. రాజ్యకాంక్ష కూడా పోతుంది. కపింజలుని చంపే ప్రయత్నం నుండి విరమించుకొంటాడు. ఇలా ధౌమ్యుడు ముల్లును ముల్లుతోనే తీసినట్లు రోమకుని అహంకారాన్ని అతని పుత్రునిద్వారానే నశింపచేస్తాడు.

చివరకు తన తప్పు గ్రహించిన రోమకుడు తనకు తరుణోపాయం సూచించమని ధౌమ్యుణ్ని ప్రార్థిస్తాడు. ధౌమ్య మహర్షి అతనికి రాజనీతి ఇలా బోధిస్తాడు " రాజ్యాన్ని చక్కగా పాలించని వాడు పాపాన్ని పొందుతాడు. సోమరిపోతు, దూరదృష్టి లేనివాడు తన కర్తవ్యాన్ని చక్కగా నెరవేర్చలేడు. వ్యవసాయానికి, శిల్పకళకు సహాయం చేయనివాడు, మహర్షులను ధిక్కరించేవాడు, దొంగలను దండించనివాడు, లక్షలకొలది ఎకరాలను స్వాధీనం చేసుకొని స్వయంగా పండించుకొనేవాడు, భూమిలేని వాళ్ళను బాధించే వాడు, ప్రారంభించిన పనిని మధ్యలో వదలిపెట్టేవాడు, పేరాశ కలవాడు రాజ్యపాలనకు అనర్హుడు."[1]

1. భువన విక్రమ్ – బ్రిం. లాల్ వర్మ., పు: 166

ఈ యదార్థాన్ని చక్కగా అవగాహన చేసుకొని రోమకుడు తన తప్పులను సవరించుకొని విజయాన్ని పొందుతాడు.

ఇలా వర్మగారు తన భువన విక్రమ్ నవలలో ధౌమ్య మహర్షి పాత్రను చిత్రించి మహర్షులు ఎంతటి ఆదర్శ ప్రాయులో, క్రాంత దర్శులో, రాజులకు ప్రజలకు ఎలా ఉపయోగపడ్డారో విపులంగా వివరించారు.

## 4.2.2. గఢ్ కుండార్:

**4.2.2.1. నాగదేవుడు:** గఢ్ కుండార్ నవలలో నాగదేవుడు ఒక ముఖ్యమైన పాత్ర. ఇతడు చారిత్రక వ్యక్తి. గఢ్ కుండార్ రాజైన హురమతసింహుని ఏకైక పుత్రుడే ఈ నాగదేవుడు. ఇతడు ఖంగారు జాతికి చెందిన వాడు. ఇతనికి ఈ కథా కాలానికి 24 లేక 25 సంవత్సరాల వయస్సు ఉంటుంది. మంచి ఆరోగ్యవంతుడు. ధైర్య, శౌర్య, సాహసాలు కలవాడు. బలిష్ఠమైన వ్యక్తి. తండ్రి అతణ్ని ఎంతో గారాబంగా, ప్రేమగా పెంచుతాడు. తండ్రి ప్రేమ అతణ్ని దుష్టునిగా, కర్కశునిగా మారుస్తుంది. అందుకే ఏదైనా ఒక పని అనుకొంటే అది మంచిగాని, చెడుగాని ఆ కార్యాన్ని సాధించే వరకు నిద్రపోడు. తన కార్యాన్ని నెరవేర్చుకోవడానికి ఎలాంటి నీచ ప్రయత్నాన్నైనా చేస్తాడు. అతడు ఎంతో దురభిమానం కలవాడు. తన జాతే గొప్పదని భావిస్తాడు. ఇలా అనేక చెడు స్వభావాలున్నా నాగదేవునికి కొంత ఉదారత, మానవత్వం కూడా ఉన్నాయి. కాని అహంకారం పొరలు అతన్ని మంచితనాన్ని కప్పివేస్తాయి. అతడు భైరవుని పూజించే వాడు. అందుకే సురాపానం చేసే వాడు. భైరవ భక్తులకు సురాపానం పవిత్రమైనది అనుకొనే వాడు.[1]

1. గఢ్ కుండార్ – బృం.లాల్ వర్మ., పు:13.

సోహన్ పాల్ అనే క్షత్రియుడు బుందేల్ జాతికి సంబంధించిన క్షత్రియుడు. ఇతడు తన సోదరుని అత్యాచారాలకు గురియై, తన కుటుంబ సభ్యులతో కూడా పారిపోయి వచ్చి భరత్‌పూర్ కోటలో శరణార్థిగా తలదాచు కొంటాడు. సోహన్ పాల్ కుమార్తె హేమవతి మిక్కిలి సౌందర్యవతి. ఆమె సౌందర్యాన్ని విని ఉన్న నాగదేవుడు ఆమెను చూడాలని తన మిత్రుడైన అగ్నిదత్తు నితో కలసి భరత్‌పూర్ వెళ్ళాడు. అతడు భరత్‌పూర్ చేరిననాడే మహమ్మ దీయులు భరత్‌పూర్‌పై దండెత్తి వస్తారు. నాగదత్తుడు మిక్కిలి సాహసంతో మహమ్మదీయులను ఎదుర్కొంటాడు. ఆ యుద్ధంలో గాయపడిన నాగదత్తు గాయానికి కట్టు కట్టడానికి హేమవతి తన చీరను చించి తన సోదరుడైన సహాజేంద్రునికి ఇస్తుంది. నాగదత్తునికి సోహన్ పాల్ తన ఇంటిలోనే వైద్యం చేయిస్తాడు. ఆ సందర్భంలో ఒకరోజు నాగదత్తుడు హేమవతిని చూస్తాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను వివాహం చేసుకోవాలని అనుకొంటాడు. స్పష్టుడైన పిమ్మట హేమవతికి ఒక ప్రేమలేఖ రాసి తన నౌకరు అయిన అర్జునునితో పంపుతాడు. కాని ఈ లేఖ హేమవతికి చేరదు. ఈ లేఖకు ఆమె నుండి ఏలాంటి సమాధానం రాకపోవడం చేత ఆమె తనను ప్రేమిస్తూ ఉందని భావి స్తాడు. కాని బుందేలుల వంశము, ఖంగారుల జాతి కంటే గొప్పదని భావించిన హేమవతి అతని ప్రేమను తిరస్కరిస్తుంది. అది తెలిసి నాగదేవుడు ఎంతో బాధ పడ్డాడు. బాధ కోపంగా మారుతుంది. ఆ కోపంతో పగ పెంచుకుంటాడు. పగ, ప్రతీకారంతో ఆమెనూ, ఆమె వంశాన్నీ కూడా నాశనం చెయ్యాలని ప్రతిజ్ఞ పూనుతాడు. అతనిలోని పరస్పర విరుద్ధ భావాలను రచయిత చాల చక్కగా

వర్ణిస్తాడు. "ఒకవైపు సామంతుడైన నాగుడు ; మరియొకవైపు హేమవతిచే అవమానింప బడిన నాగుడు; ఒకవైపు మానవత గల నాగుడు; మరియొక వైపు అహంకారంతో కూడిన నాగుడు. ఒకవైపు రాజకుమారుడైన నాగుడు; మరియొకవైపు ప్రణయోన్మత్తుడైన నాగుడు. ఒక వంక వీరనాగుడు; మరియొక వంక దుష్టనాగుడు. ఒకవైపు దైవత్వం గల నాగుడు; మరియొకవైపు రాక్షసత్వం గల నాగుడు. చివరకు దైవికమైన అతని గుణాలపై రాక్షస గుణాలు పూర్తిగా విజయం పొందాయి."[1] నాగదేవునిలో మానవత్వం పూర్తిగా నశిస్తుంది. హేమవతిని బలత్కారంగా ఎత్తుకు పోవాలని కుట్రపన్నుతాడు. కాని ఆ కుట్ర ఫలించదు.

సోహన్ పాల్ వర్గానికి చెందినవారు ఖంగారులను ఎదిరించలేరు. కాని నాగదత్తునిపై ఎలాగైనా ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటారు. బలవంతులైన ఖంగారులతో విరోధం మంచిది కాదని తలచి నాగదత్తునితో హేమవతి పెండ్లి జరిపిస్తామని నమ్మించి తరలి రమ్మంటారు. ఖంగారులు పెండ్లి సమయంలో సురాపానం చేసి కైపులో ఉంటారు. ఇదే మంచి సమయమని సోహన్ పాల్ వర్గీయులు అకస్మాత్తుగా వారిపై దాడి జరిపి అందర్నీ ఊచకోత కోస్తారు. ఈ దాడిలో నాగదత్తుడు కూడా మరణిస్తాడు.

నాగదత్తుడు సాహసం కలవాడు. వీర పురుషుడు. కొంత మానవత్వం, ఉదారత్వం ఉన్నా అతని ప్రేమ ఆదర్శ ప్రాయం, పవిత్రమైంది కాదు. అతడు కామ పిపాసి, మహత్వాకాంక్షి, అత్యాచారిగా కనిపిస్తాడు. అందుకే

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ., పు: 306.

కేవలం ఇతని ఒక్కని వల్లే ఖంగారుల జాతే నాశనమైంది. దుర్యోధనుడు, కీచకుడు లాంటి వ్యక్తి నాగదేవుడని చెప్పవచ్చు. అతడు మధ్య యుగానికి చెందిన సామంతీయ అహంకారానికి ప్రతినిధి అని చెప్పవచ్చు.

వర్మగారు నాగదత్తుని పాత్రను మిక్కిలి నైపుణ్యంతో, స్వాభావికంగా చిత్రించారు. మధ్య యుగానికి చెందిన సామంతరాజుల అత్యాచారాలకు కుట్రలకు, కామ పిపాసా పీడితుల స్వార్థ సిద్ధికై తమ ప్రాణాలను కూడా లెక్క చేయక పోరాడే స్వార్థపరులకు ప్రతినిధి నాగదత్తుడు అని చెప్పవచ్చు. అందుకే 'గఢ్ కుండార్' నవలలో నాగదత్తుని ప్రధాన భూమిక అనవచ్చునే కాని కథానాయకుడని, ప్రతి నాయకుడని చెప్పలేము.

**4.2.2.2. హేమవతి:** హేమవతి సోహన్ పాలుని కుమార్తె. మిక్కిలి అందగత్తె. ఆమె దేశభక్తి కలది. తమ జాతి మాత్రమే ఉత్తమ జాతి అనే అహంకారం గలది. ఆమె సౌందర్యం విని నాగదేవుడు ఆమెను చూడాలని తన మిత్రుడైన అగ్నిదత్తునితో కూడా భరత్ పూర్ వెళుతాడు. ఆ రాత్రే మహమ్మదీయులు భరత్ పూర్ పై దాడి జరుపుతారు. నాగదేవుడు మహమ్మదీయులతో వీరోచితంగా పోరాడి గాయపడ్డాడు. గాయపడిన నాగదేవుని గాయానికి కట్టు కట్టడానికి హేమవతి తన చీరను చించి ఇస్తుంది. అప్పుడే నాగదేవుడు హేమవతిని చూచి ఎలాగైనా ఆమెను వివాహం చేసుకోవాలనుకుంటాడు. తమకు సాయపడడానికి వచ్చిన నాగదేవుడు గాయపడ్డాడే అన్న అభిమానంతో తన చీర చించి ఇస్తుందే గాని, నాగదేవుని ఆమె ప్రేమించినట్లు కనబడదు.

రచయిత ఆమె సౌందర్యాన్ని ఇలా వర్ణిస్తాడు "వెన్నెల ప్రకాశంలో ఆమె సంపూర్ణ ఆకారం స్పష్టంగా కనబడలేదు. అతడు (నాగదేవుడు) అస్పష్టంగా చూచినా ఆమె అందం అతనికి చెప్పలేని గగుర్పాటు కలుగుతుంది. ఆమె అతనికి సాక్షాత్తు దుర్గాదేవిలాగ కనబడుతుంది."[1]

ఆమె దుర్గాదేవిలా నాగదేవునికి కనబడినా ఆమె పట్ల అతనికి పూజ్యభావం కలుగలేదు. ఒక సామాన్య యువకుడు, సామాన్య యువతిని చూచినప్పుడు కలిగే భావం మాత్రమే కలిగింది. హేమవతి సౌందర్యానికి ముగ్ధుడై నాగదేవుడు ఒక ప్రేమలేఖ రాసి అర్జునుని ద్వారా పంపిస్తాడు. కానీ అది హేమవతికి చేరదు. చేరి ఉంటే ఆమె అతనిని తిరస్కరించి ఉండేది. కాని నాగదేవుడు తన ప్రేమలేఖ ఆమెకు చేరి ఉంటుందనే తలపోస్తాడు. ఏదో కారణం చేత ఆమె సమాధానం రాయలేదని అనుకొంటాడు.

భరత్‌పూర్ నుండి కుండార్ చేరిన తర్వాత మరలా నాగదేవుడు తన ప్రేమను తెలుపుతాడు. కాని హేమవతికి ఖంగారుల జాతి కన్నా తమ బుందేలులే గొప్పవారన్న అహంకారంతో నాగదేవుని ప్రేమను తిరస్కరిస్తుంది. ఆమె అభిమానం ఎంత గొప్పదంటే నాగదేవుని ప్రేమను మృదువుగా తిరస్కరించి ఉంటే బాగుండేది. కాని త్రాచుపామువలె బుసకొడ్తూ ఇలా చెప్పింది. "మీరు ఇక్కడ నుండి వెళ్ళిపోక పోతే నేను వెళ్ళిపోతాను. బుందేలు జాతికి చెందిన కన్య ఇటువంటి మాటలు వినజాలదు. విన్నను ఓర్చుకో జాలదు. ఖంగారు రాజైనప్పటికీ బుందేలు కన్యను ఇలా

1. గఢ్‌కుండార్ - అడివిబాపిరాజు, పు: 42.

అవమానించడానికి సాహసం చెయ్యడం సమంజసం కాదు"[1] అంటుంది.

తనను తిరస్కరించిందన్న కోపంతో, ఆత్మాభిమానం దెబ్బ తిన్న నాగదేవుడు ఆమెను అపహరించడానికి కుట్ర పన్నుతాడు. దివాకరుని వల్ల ఆ కుట్ర భగ్నమౌతుంది. నాగదేవుని పట్ల చెప్పరానంత ద్వేషాన్ని, ఏవగింపును కలిగి ఉన్న హేమవతి అదే రాత్రి కుండార్ వదలిపెడ్తుంది. తన్ను అపహరింప చూశాడన్న నాగదేవుడంటే ఆమెకు అసహ్యమేర్పడడమే గాక, స్వాభిమానంగల హేమవతి ఖంగారులనే నాశనం చెయ్యాలని నిశ్చయించుకొంటుంది.

తమజాతే గొప్పదని, ఖంగారు జాతి తక్కువదని, తక్కువ జాతివాడు తనను ప్రేమించుటయా? తనను అపహరించుటయా? ఎలాగైనా వారి జాతినే సర్వనాశనం చేస్తాను - ఇలా ఆమెలో కలిగిన అభిప్రాయం ఆనాటి సామంత రాజ కుటుంబాలలో అధికంగా ఉండేది. ఈ సత్యాన్ని హేమవతి పాత్ర ద్వారా రచయిత సూచించారు.

బుందేలులు, ఖంగారులను నేరుగా ఎదుర్కొని గెలవడం అసాధ్యం. అందుకే వారు కపటోపాయంతో ఖంగారులను నాశనం చెయ్యడానికి పూనుకొంటారు. హేమవతి నాగదేవుని వివాహం చేసుకొంటుందని కబురు పంపిస్తారు. అది వినగానే నాగదేవుడు చెప్పరానంత ఆనందాన్ని పొందుతాడు. భైరవ ఉపాసకులైన ఖంగార్లు వివాహం ముందు రోజు సురాపానం చేసి మత్తులై అప్రమత్తంగా ఉంటే బుందేలులు దాడి

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ., పు: 295.

చేసి ఖంగారులనందరిని ఊచకోత కోస్తారు. నాగదేవుని గుడ్డిప్రేమ ఖంగారుల వంశ నాశనానికి దారి తీస్తుంది.

హేమవతికి తన బుందేలులే గొప్పవారన్న అహంకారమున్నా అది సమంజసమే అని రచయిత ఉద్దేశం. ఎందుకంటే ఆమెకు జాత్యహంకారం, ఆత్మాభిమానం, సామంతీయ ప్రవృత్తి ఉన్నా ఆమె ఆదర్శ క్షత్రియ కన్య, ధైర్యసాహసాలు కలది. దేశభక్తి పరాయణురాలు. తల్లి దండ్రుల మాటకు ఎదురు చెప్పదు. అందుకే పృథ్వీపాలునితో ఆమె వివాహాన్ని ఆమె తల్లిదండ్రులు నిశ్చయిస్తే ఆమె అంగీకరిస్తుంది. కాని పృథ్వీపాలునితో ఇలా అంటుంది. "బుందేలు రాజ్యాన్ని కాపాడడం మీ ముఖ్య కర్తవ్యం. మీరు మీ కర్తవ్యాన్ని నెరవేర్చండి" అంటే పృథ్వీపాలుడు "నా కర్తవ్యాన్ని నెరవేరుస్తాను. నీవు నన్ను ప్రేమిస్తున్నావా? లేదా?" అంటాడు. అందుకు ఆమె "బుందేల్ ఖండ్ స్వాతంత్ర్యం అయినప్పుడే నేను నిన్ను వివాహమాడు తాను. నీ జీవితం దేశరక్షణకే అని నా ఉద్దేశం"[1] అని అంటుంది.

ఇలా హేమవతి వర్ణాంతర వివాహాన్ని తిరస్కరించి దేశభక్తి పరాయణురాలైన ఆదర్శ క్షత్రియ కన్యగా చరిత్రకెక్కింది.

**4.2.2.3. అగ్నిదత్తుడు:** అగ్నిదత్తుడు 'కుండార్'లో ధనవంతుడైన విష్ణుదత్తుని కుమారుడు. బ్రాహ్మణుడు. బాల్యం నుండి అతనికి రాజమహాలులో ప్రవేశం ఉండేది. అతడు రాజకుమారుడైన నాగదేవుని

---

1. గఢ్ కుండార్ - అడివి బాపిరాజు, పు: 168.

మిత్రుడు. అలా రాజమహాలుకు వస్తూ పోతూ ఉన్నందువల్ల రాజకుమారి యైన మానవతితో పరిచయం ఏర్పడుతుంది. ఇద్దరూ సమవయస్కులు కాబట్టి వారిద్దరి పరిచయం యవ్వనంలో ప్రేమగా మారుతుంది. వారిద్దరిది నిష్కల్మషమైన ప్రేమ. మానవతి క్షత్రియ కన్య. ఇద్దరి జాతులు భిన్నమైనందు వల్ల ఆనాటి సమాజం వారిద్దరి వివాహాన్ని అంగీకరించదనే భయం వారిద్దరి లోనూ ఉంది.

"అగ్నిదత్తుడు పదహారు సంవత్సరాల యువకుడు. దృఢ చిత్తుడు. స్వాభిమాని. మహత్వాకాంక్ష గలవాడు. ఉత్సాహవంతుడు. పైగా రసికుడు. కులమత భేదాలను పాటించని వాడు. పగతీర్చుకోవడంలో పట్టుదల కలవాడు."[1]

అగ్నిదత్తుడు తన చెల్లెలైన మానవతిని ప్రేమిస్తున్నాడనే విషయం నాగదేవునికి తెలియదు. మాటల సందర్భంలో అగ్నిదత్తుడు ఒక యువతిని ప్రేమిస్తున్నాడని తెలుసుకొన్నా, ఆమె తన చెల్లెలని నాగదేవునికి ఏ మాత్రం అనుమానం రాలేదు. అగ్నిదత్తుడు మాత్రం "ప్రపంచం తారుమారైనా జన్మలో వివాహం చేసుకొంటే మానవతినే చేసుకొంటాను"[2] అనే స్థిర నిశ్చయంతో ఉన్నాడు. మానవతి కూడ అతన్ని హృదయ పూర్వకంగా ప్రేమించింది. కష్టసుఖాలు అతనితో పాలుపంచుకోవడానికి ఇష్టపడింది.

అగ్నిదత్తుడు మానవతితో చనువుగా మాట్లాడడం ఆమె

---

1. ఉపన్యాస్ కార్ బృందావన్ లాల్ వర్మా – శశిభూషణ్ సింహాళ్., పు: 155.

2. గఢ్ కుండార్ – బృం. లాల్ వర్మా., పు: 94.

తల్లికి ఇష్టం లేదు. తన కూతురు తప్పటడుగు వేస్తుందేమో అన్న భయం ఆమెకు కలిగి, మానవతికి తొందరలో వివాహం చేయాలని తన భర్తతో చెప్తుంది. హరమత సింహుడు తన మంత్రి గోపీ చంద్రుని కొడుకైన రాజధరునితో తన కుమార్తె వివాహం జరిపించాలని నిశ్చయించుకొంటాడు. ఒకనాడు రాజధరుడు తన పెండ్లి సమాచారాన్ని అగ్నిదత్తునితో చెప్తాడు. ఆ సమాచారం విన్నవెంటనే అగ్నిదత్తుడు దెబ్బతిన్న సింహం వలె అటు ఇటు తిరుగుతాడు. ముహం నిప్పులో కాలిన రాగిరేకువలె ఎర్రగా మారుతుంది. "నేను బతికి ఉండగా రాజధరుడు మానవతికి భర్త కాలేడు"[1] అని అనుకొంటాడు

మానవతి, రాజధరుల వివాహం అక్షయ తదియ నాడు జరుగుతుందని అగ్నిదత్తునికి తెలుస్తుంది. పెండ్లిరోజు మానవతిని తనతో తీసుకు పోవడానికి పన్నాగం పన్నుతాడు. అతడు తన చెల్లెలైన తార వేషం వేసుకొని రాజభవనానికి వెళ్తాడు. అక్కడ ఏకాంతంగా మానవతిని కలుసుకొంటాడు. మనం సామాజిక బంధనాన్ని తెంచుకొని పారిపోదామని ఆమెతో చెప్పి, తనవద్ద పదిలక్షల వరహాలు ఉన్నాయని, తాము ఈ సమాజానికి దూరంగా సుఖంగా జీవించవచ్చునని అంటాడు. కాని మానవతి అందుకు అంగీకరించదు. మొట్టమొదట ఉత్సాహాన్ని ధైర్యాన్ని చూపిన మానవతి చివరకు పిరికిగా మారి పోతుంది.

ఇలా వారిద్దరూ మాట్లాడుతూ ఉండేటప్పుడు మానవతి సోదరుడు నాగదేవుడు అక్కడికి వచ్చి చూస్తాడు. నిజానికి అగ్నిదత్తుడు

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ., పు: 275.

నాగదేవుడు మిత్రులే కాని వారి జాతులే వేరు. ఎంత మిత్రుడైనా తన చెల్లెల్ని అపహరించుకు పోవాలనుకున్న అగ్నిదత్తునిపై నాగదేవునికి చెప్పలేనంత కోపం వస్తుంది. అగ్నిదత్తుని కాలితో తన్ని కుండార్ వదలి పొమ్మని ఆజ్ఞాపిస్తాడు తనకు జరిగిన అవమానానికి అగ్నిదత్తుడు తొలుత ఆత్మహత్యా చేసుకోవాలనుకొంటాడు. కాని ప్రతీకార వాంఛవల్ల చనిపోవడానికి మనస్సు అంగీకరించదు. పగ, ప్రతీకారంతో నాగదేవుని మాత్రమే కాక ఖంగారు వంశాన్నే నాశనం చెయ్యాలని కంకణం కట్టుకొంటాడు.

నాగదేవుడు అగ్నిదత్తుని అవమానించే దానికి ముందు అతనికి కేవలం 'రాజధరుని' పైన మాత్రం కోపం ఉండేది. తను ప్రేమించిన మానవతిని రాజధరుడు వివాహమాడుతాడని, ఆ రాజధరునిపై మాత్రం పగ వాలనుకొంటాడు. కాని అవమానం పొందిన తర్వాత ఖంగారు జాతినే పూర్తిగా నాశనం చెయ్యాలనే ఉద్దేశం అతనిలో ప్రబలుతుంది. నిద్రలో కూడ ఖంగారులను నాశనం చెయ్యాలని కలవరిస్తూ ఉండేవాడు. "రణచండి పుత్తెలో ఖంగారుల రక్తాన్ని నింపక పోతే నాజన్మ వ్యర్థమవుతుంది. ఆ పుత్తెలోనే బ్రాహ్మణుడయిన అగ్నిదత్తుని రక్తం కూడ కలుస్తుంది. అదే బ్రాహ్మణ, ఖంగారుల సమ్మేళనం అవుతుంది"[1] అని తలుస్తాడు.

బుందేలులకు, ఖంగారులకు యుద్ధం జరుగుతుంది. యుద్ధం చేస్తూ చేస్తూ పొలంలో నిస్సహాయంగా ప్రసవ వేదన అనుభవించే మానవతి

1. గఢ్ కుండార్ – బృం. లాల్ వర్మ., పు: 411.

వద్దకు చేరుతాడు. అప్పుడతనికి పశ్చాత్తాపం కలుగుతుంది. కానీ ప్రతీకార వాంఛ మరల యుద్ధానికి ప్రేరేపిస్తుంది. అతడు పిచ్చివాని వలె బుందేలులతో యుద్ధం చేస్తూ, నేను మృత్యువును ఆహ్వానిస్తున్నాను. రండి నన్ను ఎవరు చంపినా నేను బాధపడను అని అంటాడు. ఇంతలో ఒక పాలుడు అక్కడికి వచ్చి అగ్నిదత్తుని చంపుతాడు. ఈ విధంగా అగ్నిదత్తుడు పగ, ప్రతీకారంతో తను నాశన మవడమే కాక, ఖంగారుల నాశనానికి తోడ్పడుతాడు.

అగ్నిదత్తుని స్వభావం విలక్షణమైంది. పరిస్థితులు అతన్ని ప్రేమోన్మాదిగాను, దుస్సాహసవంతునిగాను, ప్రతీకారం తీర్చుకోవాలనే పట్టుదల కలవానిగాను మారుస్తాయి. అతని ఉగ్రస్వభావం మెల్లగా ఉద్వేగాన్ని పొందుతుంది. అతని హింసాత్మక పన్నాగానికి ఫలితంగా ఖంగారులు నాశనమవుతారు. అగ్నిదత్తుని అనుభూతి, దృఢమైన సంస్కారం, స్వాభిమానం పాఠకులను ఆకర్షిస్తాయి. పాఠకులు అతని సంతోషంతో సంతోషాన్ని, దుఃఖంతో దుఃఖాన్ని పొందుతారు. అగ్నిదత్తుని భగ్నప్రేమికుడిగా వర్మగారు చిత్రించారు. అగ్నిదత్తుడు ఆనాటి సాంఘిక నియమాలకు, కట్టుబాట్లకు, సంప్రదాయాలకు బలియైన ప్రేమజీవి.

**4.2.2.4. మానవతి:** కుండార్ రాజైన హురమత సింహుని కుమార్తె మానవతి; నాగదేవుని చెల్లెలు. అగ్నిదత్తుడు నాగదేవునికి మిత్రుడు. కుండార్‌లో ధనికుడు, ప్రతిష్ఠ కలవాడు అయిన విష్ణుదత్తుని కుమారుడు ఈ అగ్నిదత్తుడు. ఇతడు బ్రాహ్మణుడు. కాని బాల్యంనుండి అగ్నిదత్తుడు, మానవతి తరచు

కలుసుకొంటూ ఉండడం వల్ల యవ్వనం వచ్చేసరికి ఇద్దరూ ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకొంటారు. మానవతి, అగ్నిదత్తులు రాజమహల్లో శస్త్రాభ్యాసం చేస్తుండే వారు. అప్పుడప్పుడు శస్త్రాభ్యాసం మిషతో ఇద్దరూ ఏకాంతంగా కలుసుకొని తమ హృదయాలలోని భావాలను ఒకరికొకరు చెప్పుకొనే వారు. అగ్ని దత్తునికి ఒక సందేహం పీడించేది. "మనం భిన్న జాతులకు చెందినవారం కాబట్టి మన వివాహం జరగడం సంభవమా? మన పెద్దలు అంగీకరిస్తారా?" అని మానవతితో చర్చించినప్పుడు మానవతి "ఇక ముందెన్నడూ ఇటువంటి మాటలు చెప్పవద్దు. ఈ విశాల ప్రపంచంలో మనిద్దరికీ కావలసినంత చోటు ఉండక పోదు"[1] అని చెప్తుంది. ఆ మాటలు విన్న తర్వాత అగ్నిదత్తునికి ఎంతో ఉత్సాహం, సంతోషం కలుగుతుంది. ఇలా మానవతి, అగ్నిదత్తునిపై ప్రేమకులోనై అతన్ని ప్రేరేపిస్తుంది. ఆమె యుక్తాయుక్తాన్ని మరచి పోతుంది. ఆమె మానసిక అవస్థను అతిక్రమించి శారీరక సంపర్కం వరకు చేరు కొంటుంది. వీరిద్దరూ ఏకాంతంగా కలుసు కొంటూ ఉంటే ఒకరోజు మానవతి తల్లి చూస్తుంది. తన కూతురికి ఏదో అన్యాయం జరగ బోతోందని శంకించి, ఆమె వివాహం త్వరలో జరిపించేస్తే బాగుంటుందని తలచి భర్తను కోరుతుంది. వెంటనే కూతురి వివాహం జరగాలని, లేకుంటే పరిస్థితులు తీవ్రరూపం దాలుస్తాయని తన భర్తతో పోరుపెడ్తుంది. రాజు విధిలేక తన మంత్రి కుమారుడైన 'రాజధర్' తో ఆమె వివాహాన్ని నిశ్చయిస్తాడు. అప్పట్నుంచి మానవతి తల్లిదండ్రులు

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ., 184.

ఆమెను అగ్నిదత్తుని కలుసుకొనేందుకు వీలులేకుండా కట్టుదిట్టం చేస్తారు.

మొదట అగ్నిదత్తుని గాఢంగా ప్రేమించిన మానవతి, తల్లి దండ్రులను ఎదిరించేందుకు భయపడ్తుంది. ఎక్కడ తన తండ్రి తనను, అగ్నిదత్తుడ్ని చంపివేస్తాడేమోనని భయపడి మానవతి తనలోనే కుములుతూ తల్లిదండ్రుల అభీష్టాన్ని ఎదిరించదు. మౌనంగా రోదిస్తూ తన ప్రేమను చంపుకొంటుంది.

ఒకనాడు రాజధరుడే మాటల సందర్భంలో అగ్నిదత్తునితో తన వివాహం మానవతితో జరుగుతుందని చెప్తాడు. ఈ విషయం విన్న అగ్నిదత్తుడు ఎంతో నిరాశ చెందుతాడు. దెబ్బతిన్న సింహం వలె అటూ ఇటూ తిరుగుతాడు. చివరికి ధైర్యం చేసి మానవతిని కలుసుకోవడానికి విఫల ప్రయత్నం చేస్తాడు. ఒకనాడు అతని ప్రయత్నం ఫలించి మానవతిని కలుసు కొంటాడు. తనతో వచ్చేయమని, ఇద్దరూ పారిపోదాం అంటాడు. కాని హృదయ దౌర్బల్యం వల్ల మానవతి భయపడి అతనితో వెళ్ళేందుకు తిరస్క రిస్తుంది.

అలాగని మానవతి రాజధరునితో వివాహాన్ని ఇష్టపడదు. తన అయిష్టతను ఎవరికీ చెప్పదు. మౌనంగా దుఃఖిస్తూ ఉంటుంది. ఉత్సాహం కోల్పోయి జీవచ్ఛవంలా ఉంటుంది.

అగ్నిదత్తునికి, మానవతి వివాహం అక్షయ తదియనాడు నిశ్చయించినట్లు తెలుస్తుంది. ఆ రోజు ఆమెను ఎలాగైనా, అపహరించుకొని వినా రాజమహాలు దాటాలని పన్నాగం పన్నుతాడు. కోట గోడ దగ్గర

ఒక గుర్రాన్ని సిద్ధం చేసి , తన చెల్లెలు తారవేషం వేసుకొని మానవతి దగ్గరకు వస్తాడు. అప్పుడు మానవతి దుఃఖిస్తూ ఉంటుంది. "ఆమె ఏ వినోదంలోనూ పాల్గొనేది కాదు. బలిపశువును బలివ్వడానికి ముందు అలంకరించినట్లుగా ఆమెను స్త్రీలు అలంకరించారని"[1] రచయిత వర్ణించాడు.

తార వేషంలో ఉన్న అగ్నిదత్తుడు ఆమె వద్దకు వెళ్ళి, తన నిజ రూపాన్ని చూపి, నీ కొరకై సమస్తం త్యాగం చేసినట్టి, ప్రేమించినట్టి అగ్నిదత్తుణ్ని నేనే, నా వద్ద 10 లక్షల మొహరుల రత్నాలున్నాయి. గోడ వెనుక అలంకరించిన గుర్రం సిద్ధంగా ఉంది. మనం మెరుపు వేగంతో పారిపోదాం, అని ఎంతో నమ్మకంతో పిలుస్తాడు. కాని భీరువైన మానవతి అతని కోరికను తిరస్కరిస్తుంది. అగ్నిదత్తునిలో తీవ్ర నిరాశ కలిగింది. ఇంతలో నాగదేవుడు అక్కడికి వచ్చి అగ్నిదత్తుణ్ని కాలితో తన్ని అక్కడ్నుంచి తరిమేస్తాడు.

మొట్టమొదట అగ్నిదత్తుని ప్రేమించి, అతనితో పారిపోయేందుకు కూడ సిద్ధపడిన మానవతి స్వభావానికి, చివరలో సంఘానికి భయపడి అతనితో పారిపోవడానికి నిరాకరించిన మానవతి స్వభావానికి ఎంతో తేడా కన్పిస్తుంది. అగ్నిదత్తుణ్ని ఆమె మనస్ఫూర్తిగా ప్రేమించినప్పటికి,

కలుసుకోవాలనే కోరిక ఉన్నప్పటికీ ఆనాటి పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కోలేక భీరురాలై వాటికి తల ఒగ్గుతుంది. ఖంగారుల పతనానికి ఆమె పిరికితనం కూడ కొంతవరకు కారణమని చెప్పవచ్చు.

---

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ., పు: 367.

నేడు కూడ వేలకొలది మంది భావుకత, పిరికితనం, దౌర్బల్యం కలిగిన యువతులు తమ తల్లిదండ్రులకు, సమాజానికి భయపడి, తమ ప్రేమను పొందలేక, సమాజంలో ఇమడలేక, ప్రేమించని భర్తతో జీవితం గడుపలేక సతమత మాతూనే ఉన్నారు.

ఇలాంటి స్త్రీలకు ప్రతీకగా మానవతి పాత్రను వర్మగారు ఎంతో సహజంగా మలిచారు.

**4.2.2.5. దివాకరుడు :** దివాకరుడు సోహన్ పాల్ మంత్రియైన ధీర ప్రధానుని పుత్రుడు. అతడు అందమైన యువకుడు. పవిత్ర శీలం గలవాడు ప్రభు భక్తి పరాయణుడు. అలాగని సోహన్‌పాలుని గుడ్డిగా సమర్థించే నమ్మిన బంటు అని చెప్పలేము. అన్యాయం అనిపించే చోట సోహన్ పాలుని పన్నాగాలను అతడు సమర్థించడు. మోసంతో స్వార్థాన్ని సాధించడం సరియైన మార్గం కాదని అతని అభిప్రాయం. తన ప్రాణాలు పోయినా దుష్కార్యాలు చేయడానికి అంగీకరించేవాడు కాడు. అతడు సోహన్‌పాలుని కూతురైన హేమవతిని ఆపదనుండి కాపాడుతూ ఉండేవాడు. అతడు అగ్నిదత్తుని చెల్లెలైన తారను ప్రేమిస్తాడు. మొదట తారను ప్రేమించాలనే భావం అతనికి కలుగలేదు. కాని అతనికి తెలియకుండానే తార పట్ల అతనికి ప్రేమ భావం అంకురిస్తుంది. ఆమెను మూగగా ఆరాధిస్తూ ఉంటాడు. ఇంతలో దైవ వశాత్తు అతనికి తారకు చేరువయ్యే అవకాశం లభిస్తుంది. వేటలో అగ్నిదత్తుడు గాయపడ్డాడు. అతనిని ఇంటికి చేర్చి అతనికి సపర్యలు చేస్తాడు. రాత్రంతా మేలుకొని అతనికి శుశ్రూష చేస్తుంటాడు. అది చూసి తార దివాకరునికి

కృతజ్ఞతలు తెల్పుతుంది. అప్పట్నుంచి దివాకరుని మంచితనం , సౌంద ర్యం ఆమెను ఆకర్షించి ఆమె కూడా అతనిని ప్రేమిస్తూ ఉంటుంది.

తన తండ్రి ఆదేశానుసారం తార కుందార్‌కు కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న భైరవశక్తి మందిరంలో మూడు నెలల వరకు పూజలు చేయ వలసి వస్తుంది. ఆ పూజకు 'దేవర' అనే ప్రదేశంలో లభించే కాండగోగు పూలను తెచ్చి యిచ్చే బాధ్యత అగ్నిదత్తునిపై పడుతుంది. కాని అగ్నిదత్తుడు మానవతి ప్రేమ సంక్షోభంలో చిక్కుకొని ఉండడం వల్ల అప్పుడప్పుడు ఆ పనిని దివాకరునికి అప్పచెబుతాడు. అలా పూలు తేవడం, తారకు ఇవ్వడం – ఇలా ఒకరికొకరు సన్నిహితం అవడం వల్ల బీజంగా మనసులో ఉన్న వారి ప్రేమ అంకురించి పల్లవిస్తుంది.

కాని దివాకరుడు కాయస్థుడు. తార బ్రాహ్మణ స్త్రీ. వారిద్దరి జాతులు వేరైనందువల్ల వారికి పెండ్లి జరగడం అసంభవమని అతనికి తెలుసు. జాతికి ప్రాధాన్యమిచ్చే ఆ యుగంలో తార ఉన్నత జాతికి చెందిన స్త్రీకాబట్టి తన ప్రేమ సఫలం కాదని దివాకరుడు మనసులోనే బాధపడు తుంటాడు. పెద్దలనెదిరించి ఆమెను అపహరించుకుపోవాలనే స్వార్థబుద్ధి అతనిలో లేదు. తార అంటే అతనికి పంచప్రాణాలు. ఒక సందర్భంలో తారను పాము కరుస్తుంది. అప్పుడు దివాకరుడు ప్రాణాలకు తెగించి, తన నోటతో రక్తాన్ని పీల్చి ఆమెను రక్షిస్తాడు. దీనితో తారకు అతనిపై అభిమానం ఇంకా పెరుగుతుంది. దివాకరుడు ఎల్లప్పుడూ తార క్షేమమే కాంక్షించేవాడు. ఆమెకు యోగ్యుడైన బ్రాహ్మణ వరుడు దొరకాలని, ఆమె సుఖంగా జీవించాలని మనస్ఫూర్తిగా

కోరు కొంటాడు.

దివాకరునిలో సామాజిక సాంప్రదాయాలను ఎదుర్కొని తారను తనదానిగా చేసుకోవడానికి తగినంత సాహసం లేదు. తన స్వార్థం కోసం ఎలాంటి దుస్సాహసాన్ని చేయలేడు. అతనికి ప్రేమించడం మాత్రం తెలుసు. కాని ప్రతిఫలం ఆశించడు. శారీరక సంబంధమే శాశ్వతం కాదని భావించే నిష్కామ ప్రేమికుడు దివాకరుడు అని చెప్పవచ్చు.

'విరాటాకీ పద్మిని' నవలలోని కుంజర సింహుని ప్రేమకంటే ఇతని ప్రేమ పవిత్రమైనది. అట్లే ఈ నవలలోని నాగదేవుని, అగ్నిదత్తుల శీలం కంటె ఇతని శీలం ఎంతో గొప్పది; పవిత్రమైనది. నాగదేవుని ప్రేమ కామవాసన అనే విషంతో కూడింది. దివాకరుని ప్రేమ స్వచ్ఛమైన అమృతం వలె పవిత్రమైనది. అగ్నిదత్తుని ప్రేమలో అమానుషమైన హింస ప్రబలంగా ఉండేది. కాని దివాకరుని ప్రేమ త్యాగబుద్ధితో ఆత్మార్పణ కావించడానికి సిద్ధంగా ఉంటుంది.

చోహాన్ పాలుని వర్గం వారు (బుందేలులు) ఖంగారులకు విరుద్ధంగా కుట్ర పన్నడానికి దివాకరుడు అంగీకరించడు. ధైర్యంగా తన భావాలు ఇలా చెప్తాడు. "ఖజరాహలో అనేవాడు ఈ దేశాన్ని పాలించాడు. అతని తర్వాత కలింజరుడు రాజైనాడు. అతడు గతించాడు. అటుపై మహోబా జన్మించాడు. అతడూ గతించాడు. ఇప్పుడున్న కుండార్ కూడ కొద్ది రోజుల్లో పతనమై పోతుంది. ఈ ప్రపంచం అనిత్యమైంది."[1]

---

1. గఢ్ కుండార్ – బృం. లాల్ వర్మ., పు: 409.

దివాకరుని వైరాగ్యం తమకు ఉపద్రవాన్ని కలిగిస్తుందని బుందేలులు అతన్ని చెరసాలలో బంధిస్తారు. కాని తార తన ప్రాకారాలకు తెగించి అతన్ని చెరసాలనుండి తప్పిస్తుంది. అత్యాచారాలతో, అన్యాయాలతో కలుషితమైన ఈ వాతావరణాన్ని (ఈ రాజ్యాన్ని) వదిలి దూరంగా పవిత్రమైన ప్రదేశానికి పోయి తమ జీవితాల్ని గడపాలి అనుకొంటారు. దివాకరుడు తారతో ఇలా అంటాడు "వర్ణాశ్రమ ధర్మాలు మన శారీరక సంయోగాన్ని దూరం చేయవచ్చు. కాని రెండు ఆత్మల సంయోగాన్ని ఎవరూ అడ్డుకోలేరు. ఇదే మన సంయోగం. యోగసాధన చేద్దాం"[1]

దివాకరుని ఈ మాటల బట్టి ఆనాటి సాంఘిక ఆచారాలను గమనిస్తే శారీరకంగా వారిద్దరి సంయోగం జరగడానికి వీల్లేదని అర్థమవుతుంది.

దివాకరుడు - తార ల పాత్రల ద్వారా రచయిత శారీరక వాంఛల కంటె మానసిక ప్రేమే గొప్పదని చాటి చెప్పారు. ఇలా 'గఢ్ కుండార్' నవలలోని దివాకరుని పాత్ర, ఒక విలక్షణమైన పాత్ర. అతడు జీవితంలో తానొక ఆదర్శాన్ని కల్పించుకొని దానికనుగుణంగా ప్రవర్తిస్తాడు. కుళ్ళు సమాజంలో దివాకరుడు - తారల్లాంటి మనస్తత్వం గలవారు ఇమడలేరని, అందుకే సమాజాన్ని వదలి దూర ప్రదేశాలకు వెళ్ళిపోయారని రచయిత వర్మగారి ఉద్దేశ్యం.

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ., పు: 442

4.2.2.6. **తార :** తార విష్ణుదత్తుని కూతురు. అగ్నిదత్తుడు, తార కవల పిల్లలు. అగ్నిదత్తునికి ఆడవేషం వేస్తే అచ్చం తారలా ఉంటాడు. శరీరంలోని చామనచాయ, సొకుమార్య్య తప్ప మిగిలిన విషయాలలో ఇద్దరికీ భేదం లేదు. తార రూపం ఎంతో ఆకర్షణీయమైంది. రచయిత ఆమె శారీరక సౌందర్యాన్ని ఇలా వర్ణించారు. "తార కండ్లు ప్రశాంతమైనవి, పెద్ద కనురెప్పలు కలవి. ఆమె దేహకాంతి స్వచ్ఛంగా ప్రకాశించేది. ఆమె కళ్ళలో ఏ కోశానా కపటం, మోసం కన్పించేవి కావు. శరీరం సన్నగా, మృదువుగా ఉండేది. ఆమె ఆకారంలో దేవతా స్వరూపం ప్రతి ఫలించేది. బ్రహ్మ ముహూర్తమందలి ఉషః కాంతి వలె, మహర్షుల హోమం వలె, విష్ణు భక్తులు పూజించే లక్ష్మీదేవి వలె"[1] ఉండేది.

శారీరక సౌందర్యంతో బాటు ఆమె మానసిక సౌందర్యాన్ని గూర్చి ఎన్నో చోట్ల ప్రస్తావించారు వర్మగారు. ఆమెకుగల ధార్మిక భావం, నిర్వికార చిత్తవృత్తి, సౌశీల్య స్వభావం, నిష్కల్మషమైన మానసిక ప్రవృత్తి, ప్రకృతి సిద్ధంగా లభించిన నైసర్గిక ప్రేమ ప్రవృత్తి, ఇతరులందు జాలి - మొదలైన గుణాలు ఆమెకు మెండుగా ఉన్నాయని వర్మగారు తమ నవలలో ఎన్నో చోట్ల వర్ణించారు.

ఇటువంటి అందాల రాశి, అమాయకురాలైన తారను దివాకరుడు మనసారా ప్రేమించాడు. ఒక విందు సందర్భంలో దివాకరుడు ఆమెను చూడడం తటస్థిస్తుంది. తొలుత ఆమె సౌందర్యాన్ని చూచి ముగ్ధుడౌతాడు. తర్వాత వేటలో గాయపడిన తన సోదరుడైన అగ్నిదత్తునికి శుశ్రూష చేయడానికి

1. గఢ్ కుండార్ - బృం.లాల్ వర్మ., పు: 142.

తార దివాకరుని ఇంటికి వస్తుంది. అలా వారిద్దరూ దగ్గరౌతారు.

కాని తార బ్రాహ్మణ కన్య. దివాకరుడు కాయస్థుడు. ఆనాటి సంఘంలో వారిద్దరి వివాహం అసంభవం. ఈ విషయం దివాకరునికి తెలుసు. ఆమెను మూగగా ఆరాధిస్తూ ఉంటాడు. అప్పటికి దివాకర్ అంటే తార మనస్సులో ఏలాంటి అభిప్రాయం లేదు.

తార తండ్రి ఆమెకు మంచి వరుడు దొరకాలనే ఉద్దేశ్యంతో కుండార్ కు కొన్ని మైళ్ళ దూరంలో ఉండే భైరవ మందిరంలో మూడు నెలల వరకు పూజలు చేయమని తారను ఆజ్ఞాపిస్తాడు. తండ్రి ఆజ్ఞానుసారం అమాయకురాలైన తార ధార్మిక భావనతో పూజలు చేస్తుంది. ఆ పూజకు 'దేవర' అనే ప్రదేశంలో లభించే కొండగోగు పూలు అవసరం. ఆ పూలు తెమ్మని విష్ణుదత్తుడు తన కుమారుడైన అగ్నిదత్తుణ్ణి నియమిస్తాడు. కాని అగ్నిదత్తుడు మానవతితో ప్రేమ కలాపాలు జరపడం వల్ల ఆ పనిని దివాకరునకు అప్పచెబుతాడు. దివాకరుడు శ్రమకోర్చి నిత్యం పూలు తెచ్చి తారకు ఇస్తుంటాడు. తన పూజకై కొన్ని మైళ్ళ దూరాన్నుండి కొండగోగు పూలు తెచ్చే దివాకరుని చూడగానే ఆమెకు కృతజ్ఞతా భావం ఏర్పడుతుంది. ఆ కృతజ్ఞతా భావమే క్రమక్రమంగా దివాకరుని పట్ల ప్రేమగా మారుతుంది. ఇలా ఉండగా ఒక సందర్భంలో తారను పాము కరుస్తుంది. అప్పుడు దివాకరుడు ప్రాణాలకు తెగించి తన నోటితో రక్తాన్ని పీల్చి ఆమెను రక్షిస్తాడు. దీనితో తారకు అతనిపై ప్రేమ ద్విగుణీకృత మౌతుంది. మొట్టమొదట దివాకరుడు మాత్రమే తారను ఆరాధించేవాడు. కానీ ఇప్పుడు ఇద్దరి హృదయాలలోను ఒకరిని విడిచి మరొకరు

ఉండలేనంత ప్రేమ అంకురించింది. కాని వారి ప్రేమ వారి మనస్సుల్లోనే అణిగి ఉండేది.

దివాకరునిపై తారప్రేమ దినదినానికి అధికం అవుతూ ఉండింది. ఒకనాడు ఆమె దేవుని యెదుట కండ్లు మూసుకొని తనప్రాణాలను లెక్కచేయక నన్ను రక్షించిన వ్యక్తి చిరంజీవి అయ్యేటట్లు వరం ఇమ్మని ప్రార్థించింది. ఆమె తన శరీరాన్ని అదుపులో ఉంచుకొనింది కాని, మనస్సులో దివాకరుని పైగల ప్రేమను ఆపేందుకు ఆమెకు శక్యం కాలేదు. ఒకనాడు తార వణుకుచున్న చేతులతో మారేడు పూలమాలను, కొండగోగు మాలను దివాకరుని మెడలో వేసింది. ఇలా దివాకరుని పట్ల ఆమె ప్రేమభావం ప్రకటించింది. మౌనంగా, ఆత్మార్పణ బుద్ధితో తన దోష రహితమైన ప్రేమను ప్రకటించింది.

వర్మగారి "విరాటా కీ పద్మిని" నవలలోని కుముద్ తో తారను పోల్చ వచ్చు. ఆమె కూడా ఇదే విధంగా తన ప్రేమ చిహ్నంగా కొంగులో దాచు కొన్న మాలను తన ప్రియుడైన కుంజర సింహుని మెడలో అలంకరించి మౌనంగా తన ఆత్మ సమర్పణను తెలియ జేస్తుంది."[1]

ఒకనాడు దివాకరుడు తన్ను మరచి పొమ్మని తారతో చెప్తాడు. అందుకు తార "నీవు మరచిపోయి నంత మాత్రాన నేను కూడా మరచి పోవలసిన అవసరమేముంది. నేను ప్రపంచంలో కోరదగింది ఏదీలేదు. నా దగ్గర సర్వస్వం ఉంది"[2] అంటుంది. సంయమనంతో కూడిన ఆమె ప్రేమ

1. హిందీ కే స్వచ్ఛందా వాది ఉపన్యాస్ – డా॥ కె. కమలకుమారి జౌహరి., పు: 281.

2. గఢ్ కుండార్ – బృం. లాల్ వర్మ., పు: 333.

సాంఘిక కట్టుబాట్లను తెంపుకొని బహిర్గత మౌతుంది.

దివాకరుని దేవర చెరసాలలో బంధించారని విన్న తర్వాత తార తండ్రిమాటను కూడా లెక్క చెయ్యక, తన ప్రియుణ్ని విడిపించాలని బయలు దేరుతుంది. తండ్రి ఆమెను ఆపే ప్రయత్నం చేస్తాడు. అప్పుడు ఆమె "నేనెవరికీ భయపడను. నేను తప్పకుండా పోతాను. నన్ను ఆపేందుకు ప్రయత్నిస్తే నేను ఆత్మహత్య చేసుకొంటాను"[1] అని చెప్పి గుర్రంపై ఎక్కి వెళ్ళి పోతుంది.

ఇలా తార తన ప్రాణాలకు తెగించి దివాకరుణ్ని బంధవిముక్తుణ్ని చేస్తుంది. ఆమెనే మనస్ఫూర్తిగా ప్రేమించిన దివాకరుడు ఆమె క్షేమాన్ని కోరి ఆమెను ఇంటికి వెళ్ళమని కోరుతాడు. కాని తార ఒప్పుకోదు. కష్టమైనా సుఖమైనా నీతోనే నా జీవితం ముడిపడి ఉంటుందని అంటుంది. ఇలా ఇద్దరూ వాగ్వివాద పడి చివరకు, అత్యాచారాలతో, అన్యాయాలతో కలుషితమైన ఈ వాతావరణాన్ని (రాజ్యాన్ని) వదిలి దూర ప్రాంతాలకు వెళ్ళిపోవాలని నిశ్చయించుకొంటారు. దివాకరుడు "తారా! వర్ణాశ్రమ ధర్మాలు మనదేహాలు కలియడంలో నిషేధించ గలవు కాని, ఆత్మల సంయోగాన్ని నిషేధించలేవు. మనం యోగసాధనం చేస్తాం"[2] అంటాడు. అప్పుడు తార "నేను కుటీరాన్ని చక్కదిద్దే ప్రయత్నం చేస్తాను"[3] అంటుంది. ఆ తర్వాత వారిద్దరూ గుర్రాన్ని అధిరోహించి వెళ్ళి పోతారు.

---

1. గఢ్ కుండార్ – బృం. లాల్ వర్మ., పు: 424.
2. పైదే., పు: 443.
3. పైదే., పు: 443.

## 4.2.3. మృగనయనీ :

**4.2.3.1. మృగనయనీ (నిన్నీ) :** బృందావన్ లాల్ వర్మ గారి చారిత్రక నవలా రాజం అయిన 'మృగనయనీ' నవలలో నాయిక 'మృగనయనీ'. ఈమె తల్లిదండ్రులు సికందర్ లోడీ ఆక్రమణ వల్ల చిన్నప్పుడే మరణించగా, అన్న అటల్ సింహుడు మృగనయనీని పెంచి పెద్ద చేశాడు. తల్లిదండ్రులు లేని లోటు తీర్చి ముద్దుగా పెంచాడు. మృగనయనీ ఎంతో అల్లారు ముద్దుగా పెరిగినా, తన అన్న సాహచర్యంతో అడవిలో వేటాడడం, గురిచూసి బాణాలు వేయడం, బల్లెం విసరడం, పొలాల్లో రాత్రి పూట ఒంటరిగా కాపలా కాయటం మొదలైన విద్యలన్నీ నేర్చుకుని తనకంటూ ఒక ప్రత్యేకతను నిలుపుకొంటుంది. మృగనయనీకి మరో ముద్దు పేరు నిన్నీ. నిన్నీ అంటే అటల్‌కు, అటల్ అంటే నిన్నీకి ఎంతో ప్రాణం. ఇద్దరూ ఎంతో విశాల హృదయం, విశాల భావాలు కలిగిన వారు. అందుకే సికందర్ లోడీ ఆక్రమణ వల్ల నిరాశ్రయులై వచ్చిన లాఖీ, ఆమె తల్లికి ఆశ్రయమిచ్చి తమ స్వంత వ్యక్తుల్లా చూచుకొంటారు. నిన్నీ గూజర జా జాతి స్త్రీ. లాఖీ అహీరు జాతి పడుచు. గూజరులు, అహీరుల కంటె ఉన్నత వంశం వాళ్ళు. కానీ ఆ జాతిభేదం పాటించకుండా నిన్నీ, అటల్‌లు ఆశ్రయమిచ్చారు. ముఖ్యంగా ఈ విషయంలో నిన్నీ ప్రమేయం ఎక్కువ.

బృందావన్ లాల్ వర్మగారు నవలలో 16 సంవత్సరాల వయస్సు కలిగిన నిన్నీని హోలీ పండుగ సందర్భంగా మొట్టమొదట పరిచయం చేస్తారు. ఆమె అందం గురించి, శరీరాకృతి గురించి నవలలో అక్కడక్కడా ఇలా వర్ణించారు. "నిన్నీ బలిష్ఠమైన యువతి. సంపూర్ణ శారీరక పుష్టి కలది. ఆమె కండ్లు చాలా పెద్దవి.

ఆమె కనురెప్పలు మిక్కిలి పొడవైనవి. ఆమె కండ్లు జింక పిల్ల కండ్ల వలె విశాలంగా ఉండేవి. ఆమె ముక్కు కొనదేలి ఉండేది. ఇంకా ఆమె కంఠస్వరం మధురమైనది. ఆమె పాట పాడుతూ ఉంటే కోయిల కూసినట్లుండేది"[1] అని వర్ణించారు. ప్రకృతి సిద్ధమైన గ్రామీణ వాతావరణంలో పెరిగినందువల్ల ఆమె శరీరం పుష్టిగా, బలంగా, దృఢంగా తయారయింది. నిరంతర పరిశ్రమ వల్ల నాజూకుగా, చలాకీగా, చాకులా ఉండేది.

నిన్నీ అపూరూప సౌందర్యవతి అనీ, అమిత ధైర్య సాహసాలు కల యువతి అనీ దేశం నలుమూలలా వ్యాపిస్తుంది. ఈమెతో పాటు లాఖీ సౌందర్య, సాహసాలు కూడా ప్రచారం పొందుతాయి. కాని నిన్నీకి మాత్రం ఆమెను ఎవరైనా అందగత్తె అని పొగడడం ఇష్టంలేదు. ఆమెకు తన అందాన్ని, శౌర్యాన్ని ఎవరికీ చూపాలనే అపేక్ష ఉండదు. అందుకే ఆమె అన్న అటల్, చెల్లెలు గొప్పతనాన్ని బోధన్ పండితుని ముందు పొగిడితే నిన్నీకి కోపం వస్తుంది. అటల్ బోధన్ పండితునితో "బాబాజీ! ఈ పిల్లే సింహాన్ని, అడవి దున్నను, అడవి పందిని ఒక్క బాణంతో క్రింద పడతోస్తుంది. ఈ పనిని గ్వాలియర్ రాజు మానసింహుడు చూస్తే ఈమెను అధికంగా ప్రశంసిస్తారు"[2] అంటాడు. బోధన్ పండితుడు "తప్పకుండా ఈమెను గ్వాలియర్ తీసుకువెళ్ళి రాజుకు పరిచయం చేస్తాను"[3] అంటాడు. దీనికి నిన్నీ రోషంతో "గ్వాలియర్ లేదు గ్వేలియర్ లేదు, రాజు వద్దు - గీజు వద్దు. ఎవరి ఎదుటికి వెళ్ళ వలసిన అవసరం నాకులేదు"[4]

1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ మృగనయనీ - శాంతిస్వరూప్ గుప్త, పు: 162.
2. మృగనయనీ - బృం. లాల్ వర్మ., పు: 21.
3. పైదే., పు: 21.
4. పైదే., పు: 21.

ఉంటుంది. ఆమెకు 16 సం॥ల వయస్సులో కూడా ప్రేమంటే ఏమో తెలియదు. ఆమె కథల్లో మాత్రమే ప్రేమ ఉంటుందనుకొంటూ ఉండేది. గ్రామీణ వాతావరణంలో పెరిగిన ఈ అమ్మాయి తొందరగా అలుగుతుంది. ఎంత తొందరగా అలుగుతుందో అంత తొందరగా తనతప్పు ఒప్పుకొంటుంది. చిన్న పిల్లవలె కోపం వస్తుంది. మళ్ళీ వెంటనే ప్రేమ పూర్వకంగా మాట్లాడుతుంది. ఒకసారి లాఖీ అడవి దున్నను చంపేందుకు నిన్నీని ఇనుప బాణం అడుగుతుంది. కాని అప్పటికే ఒక ఇనుప బాణం వృథా అయినందు వల్ల నిన్నీ ఇవ్వదు. కాని లాఖీ తాను పేదరాలైనందు వల్ల డబ్బులులేక, ఇనుప బాణం కొనుక్కోలేక ఒకరిని అడిగి లేదనిపించుకున్నానే అనే బాధతో ముఖం ముడుచుకొని మౌనంగా వెళ్ళిపోతుంది. తను చేసింది పొరబాటని నిన్నీ వెంటనే అర్థం చేసుకుని, పరిగెత్తుకొంటూ వెళ్ళి ఇనుప బాణం ఇస్తుంది. కాని లాఖీ తిరస్కరిస్తుంది. అప్పుడు నిన్నీ లాఖీకి క్షమాపణ చెప్తుంది. "నీవు, నేను ఇద్దరం పేదవారమే. ఇద్దరం ఒకటే. నీకు సంపద నీ తల్లి అయితే నాకు సంపద మా అన్న ...ఏమీ అనుకోకు లాఖీ"[1] అంటుంది. ఇంకోసారి నిన్నీ లాఖీని వేళాకోళం చేస్తుంది. ఆ వేళాకోళం భరించలేక లాఖీ బాధ పడ్తుంటే నిన్నీ "ఇదిగో! చెంప తీసుకొని ఒట్టు పెట్టుకొంటున్నాను. ఈ రోజు నుంచి మరలా ఇటువంటి వేళాకోళం ఆడితే అప్పుడడుగు. ఒట్టు"[2] అంటుంది. లాఖీ కూడా నిన్నీని వేళాకోళం పట్టిస్తుంది "నీవు గ్వాలియర్ రాజుకి రాణి కాబోతునావ"[3] ని ఆటపట్టిస్తుంది.

---

1. మృగనయని – బృం.లాల్ వర్మ., పు:58.
2. పైదే., పు:52.
3. పైదే., పు:52.

"అప్పుడు నిన్నీ రోషంతో " ఎవరో అభాగిని అవుతుంది రాణి. నాకేం ?.... సాంక నదీ - ఈ విశాల వనాలు విడిచి నేను గ్వాలియరు కోటలో ఖైదీ నవడానికి వెళ్ళను. పిచ్చి ఎక్కిందా నీకు ? "[1] అంటుంది. ఇలా నిన్నీ, లాఖీలు పరస్పరం వేళాకోళాలు చేసుకున్నా మరలా క్షమాపణలు చెప్పుకుని, బొట్టు పెట్టుకుని హాయిగా కలసిపోయే వారు. దీనిని బట్టి నిన్నీ ఎంతో అమాయకురాలు, పసి హృదయం కలది అని అర్థమౌతుంది.

నిన్నీ అమిత సౌందర్యవతి అనీ, ధైర్య సాహసాలు గల యువతి అనీ. ఆమెను పొందాలనీ, ఆమెతో బాటు లాఖీని వశపరచుకోవాలనీ ఢిల్లీ పాదుషా సికందర్ లోడీ, మాండూ సుల్తాన్ గయాసుద్దీన్, గుజరాత్ పాదుషా మహమ్మద్ బఘర్రా మొదలైన వారంతా ప్రయత్నిస్తూ ఉంటారు. గ్వాలియర్ రాజైన మానసింహుడు కూడా వీళ్ళ కథలను విని స్వయంగా రాయి గ్రామం వచ్చి వీళ్ళను చూడాలనుకొంటాడు. గయాసుద్దీన్ అయితే ఏకంగా నిన్నీ, లాఖీలను అపహరించుకు పోవాలనే పన్నాగం పన్ని నలుగురు అనుచరులను పంపిస్తాడు. కానీ నిన్నీ, లాఖీల ధైర్య సాహసాలవల్ల గయాసుద్దీన్ పన్నాగం ఫలించదు. నిన్నీ ఆ తురుష్క సైనికుల్లో ఒకణ్ణి బల్లెం విసరి చంపివేయగా, లాఖీ ఇంకొకణ్ణి బాణం వేసి చంపేస్తుంది. మిగిలిన ఇద్దరూ భయపడి పారిపోతారు. ఈ విధంగా తనను అవమానించే టందుకు ప్రయత్నించే శత్రువుల్ని తన బాహుబలంతో మట్టికరిపించేది.

ఆమె ఇతరులపై ఆధారపడేది కాదు. స్వయంగా శ్రమించి

---

[1] మృగనయనీ — బృం. లాల్‌వర్మ, పు: 52.

జీవించాలనే కోరిక అధికంగా ఉండేది. కష్టపడి పనిచేయడమంటే ఆమెకు చాలా ఇష్టం. అడవి జంతువుల్ని వేటాడటంలో ఆమె చాలా నైపుణ్యం కలది. అడవి పందినికాని, అడవి దున్నను కాని, సింహాన్నికాని ఒక్క బాణంవేసి చంపి వేసేది. ఆమె రాత్రులందు కూడా ఒంటరిగా కాపలాకాచి, తన పొలాన్ని అడవి జంతువుల బారినుండి స్వయంగా రక్షించుకొనేది. ఈ విధంగా ప్రచండ ధైర్య సాహసాలు కలిగి ఉండే మృగనయనిలో మార్దవం, రసికత్వం, మాధుర్యం మొదలైన సౌమ్యగుణాలు కూడ ఉండేవి. ఇట్ల పరస్పర విరుద్ధాలైన గుణాలకు మృగనయని నిలయం.

మృగ నయని చిన్నప్పట్నుంచి రాయి గ్రామంలోనే ఉంటున్నందు వల్ల ఆ గ్రామానికి చుట్టు ప్రక్కల ఉండే సాంకానది, కొండలు, అడవులు, పొలాలు, అడవి జంతువులు మొదలైన వన్నీ ఆమె వ్యక్తిత్వ నిర్మాణానికి దోహద పడ్డాయి. మృగనయని ఎంత బీద పరిస్థితుల్లో ఉన్నప్పటికి ఎవరి ముందు చేయి చాచి యాచించదు. ఎవరి కృతజ్ఞతకు తలవంచదు. సాధారణంగా స్త్రీలు స్వభావ సిద్ధంగా మంచి గుడ్డలు, ఆభరణాలు కావాలనే కోరుతారు. కానీ నిన్నీ దీనికి పూర్తిగా విరుద్ధం. గయాసుద్దీన్ పంపిన నటవర్గం వాళ్ళు నిన్నీ, లాఖీలకు అమూల్యమైన వస్త్రాలను, వస్తువుల్ని ఇచ్చి ఆకర్షించే ప్రయత్నం చేస్తారు. కాని నిన్నీ వారి నుండి కొన్ని పండ్లను తీసుకొన్నప్పటికీ తాను వేటాడిన జంతువుల్ని దానికి బదులుగా ఇస్తుంది. ఇంకా బెల్లం, బియ్యం మొదలైనవి తీసుకోవాలనుకున్నప్పుడు కూడా "నేను వేటాడిన జంతువుల్ని మీకిచ్చి మీ వస్తువులు తీసుకుంటా గాని ఊరికే

తీసుకోవడం నాకిష్ట ముండదు"[1] అని చెప్తుంది. ఇలా స్వాభిమానం, నిరాడంబరత్వం, సమానత్వం, స్నేహభావం మొదలైన అనేక మంచి గుణాలు మృగనయనీలో ఉన్నాయి.

రాయిగ్రామం వచ్చిన మానసింహుడు ప్రథమ దర్శనం లోనే మృగనయనీ సౌందర్యానికి ముగ్ధుడై "ఈమె ఎవరు? ఇక్కడికి ఎలా వచ్చింది. ఈ పల్లెటూరులో ఇంతటి సౌందర్య రాశా ?!"[2] అని ఆశ్చర్య పోతాడు. తర్వాత మృగనయనీ, లాఖీలు అడవి జంతువులను వేటాడటంలో గొప్ప నేర్పరులు అని విని స్వయంగా వారి నైపుణ్యాన్ని పరీక్షించి తృప్తి పడుతాడు. నిన్నీ సింహాన్ని ఒకే బాణంతో చంపడం, అడవి దున్నతో పోరాడి చంపడం కళ్ళారా చూసిన మానసింహుడు, ఆమెను మెచ్చుకొంటూ తన మెడలో నుంచి రత్నాలు పొదిగిన బంగారు హారాన్ని నిన్నీ మెడలో వేస్తాడు. తర్వాత ఆమె అనుమతి పొంది రాయిగ్రామం లోనే ఆమెను వివాహం చేసుకొంటాడు. వివాహానికి ముందు నిన్నీ రెండు కోరికలు మానసింహుని కోరుతుంది. అవి 1. సాంకా నది నుంచి కాలువను గ్వాలియర్ కోటవరకు త్రవ్వించాలి. ఆ నది నీరే నేను త్రాగుతాను[3] 2. గ్వాలియర్‌లో కూడా ఘోషా పాటించను.[4] ఈ రెండు కోరికలను రాజా మానసింహుడు అంగీకరిస్తాడు.

గ్వాలియర్ చేరిన తర్వాత మృగనయనీ కొద్ది కొద్దిగా అక్కడి

---

1. మృగనయని – బృం. లాల్ వర్మ., పు: 113.
2. పైదే., పు: 165.
3. పైదే., పు: 185.
4. పైదే., పు: 185.

పరిస్థితులను అర్థం చేసుకొంటుంది. గ్వాలియర్ చేరిన కొత్తలో ఆమె ఇలా అనుకున్నది. "వీరంతా నన్ను గురించి ఏమనుకుంటారో? మనస్సుల్లో పల్లెటూరు మొద్దు అనుకుంటారేమో. వీరంతా బాగా చదువుకున్న వారై ఉంటారు... మరల మా ఊరు వెళ్ళేటప్పటికి బాగా చదువుకొని, ఇవన్నీ నేర్చుకొని వెళ్ళాలి"[1] అనుకొంటుంది. తన భర్తకు ఎనిమిది మంది భార్యలున్నారనే విషయం గ్వాలియర్ వచ్చిన తర్వాతే మృగనయనీకి తెలుస్తుంది. ఆమె మనస్సులో ఇలా అనుకొంటుంది. "ప్రతి రాణితోను ఆరంభంలో ఈ ప్రకారం గానే (అంటే తనతో మాట్లాడినట్లే) మృదు మధురంగా మాట్లాడి ఉంటారు. నాతో ఎల్లాకాలం ఇట్లాగే ప్రవర్తిస్తారా? లేక పదో ఆమెను వివాహమాడుతారా?!"[2] అనుకొంటూ, నేను ఇతర రాణుల్లా కాక, నా ప్రత్యేకతను కాపాడుకొంటూ నా భర్త అనుగ్రహానికి ఎల్లప్పుడు పాత్రురాలై ఉంటాను అని నిశ్చయించుకొంటుంది.

ఈ విధంగా ప్రకృతి ఒడిలో పెరిగిన మృగనయనీ గ్వాలియర్ చేరిన తర్వాత, కోటలో బందీ అయినట్లు బాధపడకుండా తనలో అంతర్గతంగా దాగియున్న సంగీతాన్ని, చిత్రలేఖనాన్ని అభివృద్ధి చేసుకొంటుంది. రాజా మానసింహుడు కూడా ఆమెను ప్రోత్సహిస్తాడు.
ఆమె సంగీతాన్ని ఎంతో తొందరగా నేర్చుకొంటుంది. ఆచార్య బైజూ ఆమెను గురించి రాజుతో "మహారాజా! ఆమె పూర్వజన్మలో సంగీత అవతారంగా

1. మృగనయని – బృం. లాల్ వర్మ., పు: 194, 195.
2. పైదే, పు: 229.

ఉంది ఉండవచ్చు. నేను ఆచార్య పదవిని బలపరచుకోవాలంటే విశేషమైన కృషి చేయాలి"[1] అంటాడు. అందరూ ఒక నెల రోజుల్లో నేర్చుకొనే విద్యను అపార కృషితో ఒక రోజులో నేర్చుకొనేది. ఆమె ఒక సందర్భంలో మానసింహునితో ఇలా అంటుంది. "కళ గొప్పగాయని. అయినా నేను ఆమెకంటే అధికంగా కనీసం ఆచార్య బైజూతో సరి సమానంగా పాడడం నేర్చుకోక పోతే, నా మనస్సుకు శాంతి లేదు. నేను సంగీతానికి అధిక సమయం కేటాయించాలను కొన్నాను."[2] ఇంకా మాన సింహునితో ఇలా అంటుంది "నేను చదువు కొంటాను. చిత్ర కళ నేర్చుకొంటాను. సంగీతం లోనూ, వాయిద్యం లోనూ ఎంతగా ప్రావీణ్యం పొందుతానంటే, ఎప్పుడైనా మీరు వింటే మైమరచి పోవాలి."[3] ఆమె చెప్పినట్లే పై కళలన్నింటిలో ప్రావీణ్యం సంపాదిస్తుంది. ప్రావీణ్యం సంపాదించాక కూడా తను గొప్ప కళాకారిణి అనే గర్వం ఏ కోశానా లేదు. ఆమె సహకారం, ప్రేరణ, ప్రోత్సాహం తో ఆచార్య బైజూనాథ్ "గూజరీ, మాల్ గూజరీ, బాహుల్ గూజరీ, మంగళ్ గూజరీ"[4] మొదలైన కొత్త రాగాలను సృష్టించగలిగాడు.

రాయి గ్రామంలో ఉండే నిన్నికి, రాణి అయిన నిన్నికి తేడా నవలలో కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. రాణి అయిన తర్వాత ఆమెలో సహనశీలత, సౌమ్యత, ఉదారత అధికం అవుతాయి. తన స్నేహితురాలు లాఖి, అన్న అటల్ ఒక చిన్న మాట అన్నా రోషపడి అలిగే నిన్ని ఇక్కడ

1. మృగనయని – బృం.
2. పైదే., పు: 228.
3. పైదే., పు: 229.
4. పైదే., పు: 439.

పట్టపురాణి సుమన మోహిని, ఇతర రాణులు ఆమెను ఎన్నిసార్లు అగౌరవ పరచినా రోష పడదు. ఒకసారి తాంబూలంలో విషం ఇచ్చి చంపించాలనీ, ఇంకోసారి సంతానం కలుగకుండా పానీయంలో చూర్ణ భస్మం కలిపి ఇవ్వమనీ సుమన మోహిని చేసిన రెండు ప్రయత్నాలు మృగనయనీ తెలుసుకొని తెలివిగా తప్పించు కొంటుంది; కానీ భర్తకు చెప్పదు. ప్రతీకారం తీర్చుకోదు. ఇటువంటి విషయాలు భర్తకు చెప్పి అనవసరంగా ఆయనను బాధ పెట్టడం, గృహ శాంతి లేకుండా చేయడమేనని తలచి సహనంతో, తనకు జరిగిన అన్యాయాలను భరిస్తుంది. దీనిని బట్టి మృగనయనీ ఎంత ఉన్నత శిఖరాలకు ఎదిగిపోయిందో మనకు అర్థమవుతుంది.

స్త్రీ పురుషునికి ప్రేరణ శక్తి. భర్తకు మంచి మార్గం చూపడమే స్త్రీ కర్తవ్యం అనుకొని, తనపై విపరీతమైన ప్రేమ వల్ల మరచిన మానసింహునితో అనునయంగా మాట్లాడి కర్తవ్యోన్ముఖునిగా చేస్తుంది. ఒక సందర్భంలో మానసింహునితో ఇలా అంటుంది. "మీ శరీరం ఉత్సాహపూరితంగా ఉండాలని, మీ కీర్తి, శౌర్యం దినదినాభివృద్ధి చెందాలని, మీరు చాలా వివేకంగా ప్రవర్తించాలని నా కోరిక. ఈ గుణాలు లేని ఏ రాజు కూడా తన రాజ్యాన్ని రెండు నెలల పాటు కూడా పాలింపలేడు. మీరు సంయమనాన్ని పాటించండి. నన్ను కూడ పాటించనివ్వండి."[1] ఇంకా "సంకల్పం, భావన ఈ రెండూ జీవితమనే తక్కెడలో రెండు భాగాలు. సంకల్పం కర్తవ్య బుద్ధిని కల్గిస్తుంది. భావన కళా కౌశలాన్ని పెంపొందిస్తుంది.

మృగనయని – బృం. లాల్ వర్మ., పు:

ఈ రెండింటి సమన్వయం ఆదర్శప్రాయమైన రాజు అవశ్యం పాటించాల్సి ఉంటుంది"[1] అని అంటుంది.

మృగనయని లో దేశం బాగుపడాలనే ఆకాంక్ష, ప్రజా క్షేమానికై పాటుపడాలనే అభిప్రాయం మెండుగా ఉండేవి. ఈ విషయమై ఆమె మానసింహునితో ఇలా అంటుంది. "అస్త్ర శస్త్రాల ద్వారా దేశాన్ని రక్షించి దేశం సుభిక్షంగా ఉన్నప్పుడే శాస్త్ర విచారణ చేసేందుకు వీలుంటుంది. కళ, కర్తవ్యాలకు సమ ప్రాధాన్యం ఇవ్వండి. మనోబలం దృఢ నిశ్చయం సమానంగా ఉండాలి. ఇంతకంటె మీకు ఎక్కువ చెప్పాల్సిన పనిలేదు."[2]

మృగనయని స్వభావంతోనే వీర వనిత. స్త్రీ అబల అనే విషయాన్ని ఆమె అంగీకరించేది కాదు. యుద్ధ సమయాల్లో స్త్రీలు 'జౌహరు' వ్రతాన్ని పాటించడం పిరికి పందల లక్షణం అని ఆమె తలచేది. జౌహరు వ్రతంపై ఆమె తన అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చింది. "రాజులు తమ బంధువుల్ని ఏదో ఒక దుర్గంలో వదలి పెట్టి యుద్ధం చేస్తూ చేస్తూ చనిపో తారు. వారి భార్యలు అగ్నిలో దూకి ~~ఆత్మాహుతి~~ చేసుకొంటారు. వారికి బాణాలను ప్రయోగించడం తెలియదా? వాళ్ళు రాణులు కాబట్టి పరదాలో మొహం దాచుకొని ఉంటారా? వారిని కన్నెత్తి చూచే పురుషుల్ని వారెందుకు ఎదుర్కోలేరు? వారిని అవమానించే వాళ్ళను చంపే బదులు వారే అగ్నిలో

1. మృగనయని — బృం. లాల్ వర్మ., పు: 449.
2. పైదే., పు: 389.

దూకి చావడం తగని పని. నేను ఎటువంటి పరిస్థితుల్లోనూ ఈ విధంగా చావను"[1] అని మృగనయని తలచేది.

మృగనయనీ పాత్రద్వార వర్మగారు ఉదాత్తమైన స్త్రీని ప్రదర్శించారు. ఆమె ఉదాత్త త్యాగనిరతిని స్పష్టం చేశారు. ఆమె పట్టుపట్టి ఉంటే రాజ సింహాసనం తన కొడుకులకే వచ్చి ఉండేది. కాని పట్టపు రాణి తనకెంత అపకారం చేసినా పట్టించుకోకుండా, సుమన మోహిని కొడుకుకే పట్టం కట్టమని మాన సింహునికి ఉత్తరం రాసి ఇస్తుంది. నకలు సుమనమోహినికి పంపిస్తుంది. అందులో "రాజసింగు, బాలసింగులు సింహాసనానికి గాని, జాగీరులకు గాని అధికారులు కారు. వారు తమ అన్నగారి ఆజ్ఞలను పాలిస్తూ కర్తవ్యాన్ని నిర్వహిస్తూ ఉంటారు."[2] దీనిని చదువుకున్న మానసింహుని నేత్రాలు జలపూరితాలయ్యాయి. ఇలా అనుకొంటాడు. "స్త్రీ గౌరవం, సౌందర్యం, మహత్వం అన్నీ స్థిరత్వంలో ఉన్నాయి. వర్షాకాలపు నది బురద, చెత్తా చెదారంతో బూడిద వర్ణం కలిగి ఉధృతంగా ప్రవహిస్తూ, ఉరవడి అనంతరం శరదృతువులో నీలపు వర్ణంతో మందగతిని ప్రవహిస్తూ, దూరం నుండి చూచేవారికి ఆ నది స్థిరంగా ఉన్నట్లు కనిపించినప్పటికీ దగ్గరకు వెళ్ళి చూస్తే ముందుకు పోవడం కనిపిస్తుంది."[3]

ఈ విధంగా మానసింహుని పాత్రద్వారా వర్మగారు, ఎక్కడో పల్లెటూరులో పుట్టి పెరిగిన మృగనయనిని వర్షాకాలంలో ఉధృతంగా

1. మృగనయని – బృం. లాల్ వర్మ., పు: 16.
2. పైదే., పు: 446.
3. పైదే పు 448

ప్రవహించే నది తోను , అదే మృగ నయనీ ని గ్వాలియర్ రాణిగా శరదృతువులో గాంభీర్యంగా ప్రవహించే నది తోను పోల్చి విశ్లేషించారు.

ఈ అభిప్రాయాన్ని బలపరుస్తూ డా॥ సత్యేంద్ర గారు "తరళత్వం, సరసత్వం, ప్రతిబింబత్వం కలిగి బరువైన వస్తువులను దిగమింగు కాని, తేలికమైన చెత్తాచెదారాలను ఒడ్డున పారవేసి , స్వచ్ఛమైన పూలతోనూ అలరిస్తూ , ఇరు పార్శ్వాల ప్రదేశాలను పచ్చదనంతో ఉంచుతూ, పొలాలను సారవంతంగానూ , ఉత్ఫుల్లంగానూ చేస్తూ ప్రవహించే నదివలె మృగనయనీ ఉండేది"[1] అని అభివర్ణించారు.

**4.2.3.2. మానసింహుడు:** మృగనయనీ నవలలోని పురుష పాత్రలలో ప్రధాన పాత్ర మానసింహుడు. అతడు నవలలో నాయకుడు. గ్వాలియర్ రాజ్యానికి రాజు .

బృందావన్ లాల్ వర్మగారు మానసింహుని ఇలా వర్ణించారు. అతడు మధ్య వయస్కుడు . కన్నులు నల్లగాను, పెద్దవిగాను ఉన్నాయి. కనుబొమలు దట్టంగా ఉన్నాయి. ముక్కు కొనదేలి పొడుగ్గా ఉంది. గంభీర ..మైన ముఖం. దృఢమైన చుబుకం. అతని పెదవులు మెత్తగా, ఎర్రగా ..న్నాయి. వ్యాయామం చేయడంతో శరీరం దృఢంగా తయారయింది. ..స్థలం విశాలమయింది. మీసాలు దట్టంగానూ, అందంగాను ఉన్నాయి."[2]

..శలక్షణాన్ననుసరించి అతడు పరాయణుడని, ప్రజ్ఞావంతుడని

· హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ మృగనయనీ — డా॥ శాంతిస్వరూపగుప్త., పు: 161.

·· మృగనయని — బృం. లాల్‌వర్మ., పు: 38.

ధైర్య సాహసాలు కలవాడని ఊహించేటందుకు అవకాశం ఉంది.

మానసింహుని వ్యక్తిత్వం ఆకర్షణీయమైంది. కర్తవ్యాన్ని చక్కగా నెరవేర్చేవాడు మానసింహుడు. శాస్త్రికి, విజయ జంగమానికి జరిగిన ధార్మికమైన వివాద సమయంలో విజయ జంగంతో ఇలా అంటాడు. "ఈ వాగ్వివాదం వ్యర్థం. కర్తవ్యం ముఖ్యమైంది. కర్తవ్యాన్నుండి తప్పించుకోకోరేవాడు అడ్డదిడ్డంగా మాట్లాడుతాడు. నేను పండితుణ్ని కాను. మీరు పని చేయండి. ఆ తరువాత మిగతా విషయాలు ఆలోచించండి."[1] అని చెప్తాడు.

మృగనయని ప్రేరణతో అతడెల్లప్పుడూ కర్తవ్య నిర్వహణలో నిమగ్నమై ఉండేవాడు. ఎప్పుడైనా అతడు ఈ సిద్ధాంతాన్నుండి తప్పటడుగు వేస్తే మృగనయనీ అతనికి కర్తవ్యాన్ని తెల్పేది.

మానసింహుడు కర్మ సిద్ధాంతాన్ని దృఢంగా నమ్మేవాడు. తన ప్రజల సాధారణ అవసరాలపై దృష్టి ఉంచేవాడు. ధార్మికమైనట్టి, ఆధ్యాత్మికమైనట్టి విషయాలపై అతనికి నమ్మకం ఉన్నా, ప్రజాక్షేమాన్నే ముఖ్యంగా కోరేవాడు. బోధన్ పండితుడు శిథిలమైన దేవాలయాన్ని సరిచేయమని కోరినప్పుడు "ఇప్పుడు సమయం కాదు విషంతో కలుషితమైన బావుల్ని బాగు చేయించాలి. దిగుడుబావులు, కాలువలు, చెరువులు మొదలైన వాటిని చక్కబెట్టిన తరువాతనే దేవాలయాల పునర్నిర్మాణం చేపట్టడం మంచిది"[2] అంటాడు.

---

1. మృగనయని – బృం. లాల్ వర్మ, పు: 42.
2. పైదే., పు: 39.

మాన సింహుడు జాతి మత భేదాల్ని అంగీకరించే వాడు కాదు. బోధన్ పండితుడు లాఖీ, అటల్ సింహుల వివాహ విషయంలో ఆక్షేపణ చేసినప్పుడు అతడు బోధన్‌తో - "శాస్త్రిగారూ! మీరునమ్మే జాతి మత భేదం హిందువుల్ని ఎంత వరకు కాపాడ గలదు?" అని అతని వాదాన్ని ఖండించాడు.

మాన సింహునికి లలిత కళలంటే ఎంతో ప్రేమ. అతను యుద్ధ సమయాల్లో కూడా కళాకారులను తన వెంట పెట్టుకొని వెళ్ళేవాడు. సంగీతంపై ఆసక్తి ఎక్కువ. సంగీత గోష్ఠులను ఏర్పాటు చేసేవాడు. అతని ఉద్దేశంలో ప్రజాపాలన, కళాపోషణ రెండూ ముఖ్యమైనవి. ప్రజలను, కళలను పోషించడానికి ప్రాణాలను అర్పించేటందుకైనా సిద్ధంగా ఉండాలి. ఈ రెండింటి రక్షణయే ధర్మపరిపాలన.

మానసింహుడు స్వభావతః రసికుడు. ఆనాటి రాజ వంశాలలో రాజు చాలామందిని వివాహ మాడడం సర్వసాధారణం. మృగనయనీని వివాహం చేసుకునేందుకు ముందు ఎనిమిది మంది భార్యలుండేవారు. వివాహానంతరం అతని మొదటి భార్యయైన సుమన మోహిని అతనిపై కోపించి ఎల్లప్పుడు వ్యంగ్యంగా మాట్లాడేది. ఆమె ఎన్నో కుట్రలు పన్నింది. కానీ అతడు తటస్థంగా ఉంటూ, ఇవన్నీ రాజ కుటుంబాలలో సాధారణమనే భావనతో ఉండేవాడు.

అతడు ఎల్లప్పుడూ ఉత్సాహంగా ఉంటూ, రాజకీయ వ్యవహారాల్లో

---

1. మృగనయని - బృం. లాల్ వర్మ; పు; 351.

మంచి నిర్ణయాలు తీసుకొనే వాడు. కళా ప్రేమ, యుద్ధ వీరము, ప్రజాను రాగం అనే గుణాలు అతనిలో మెండుగా ఉండేవి.

అతనికి చిత్రకళ, వాస్తుకళ, శిల్పకళ మొదలైన వాటిలో మంచి అభిరుచి ఉండేది. మహమ్మదీయులు దండెత్తి వచ్చిన సమయంలో కూడ అతడు లలిత కళలందు ఉండే ఆసక్తిని, అభిరుచిని మానలేదు.

ప్రజల కష్ట సుఖాలు తెలుసుకునేందుకు "మానసింహుడు మారువేషం వేసుకొని తిరుగుతూ ఉండేవాడు. ఒకనాడు ఒక రైతు ఇంటిలో ప్రవేశించి అతని కష్టాలను తెలుసుకొని, అప్పటికి తప్పనిసరి అయినందు వల్ల తిరుగలిలో పిండి విసరెను. ఇది అతనిలోని మానవతా దృష్టికీ, ప్రజానురంజకతకూ నిదర్శనం."[1]

మానసింహుడు జాతి మత భేదం పాటించనివాడు. పర మత సహనం కలవాడు. హిందువైనా, మహమ్మదీయుడైనా అతనిదృష్టిలో సమానమే. వంశ పారంపరగా వచ్చిన శరణాగత రక్షణ మూలంగానే అతడు సికిందర్ లోడీ కోపానికి పాత్రుడవుతాడు. సికిందర్ లోడీకి శత్రువైన జలాలుద్దీనుకు ఆశ్రయమిస్తే తన రాజ్యానికి ముప్పు వస్తుందని తెలిసికూడా అతడు ధర్మ మార్గాన్ని విడనాడలేదు. "నా విరోధం సుల్తానుల శాసన విధానంతోనే కాని ముసల్మానులతో కాదు. పనిచెయ్యండి. రాజభక్తిని చూపించండి. గౌరవంగా జీవించండి"[2] అని ఒక పర్యాయం మహమ్మదీయులతో న్నాడు

గనయనీ. బృం. లాల్ వర్మ., పు: 346
నే., పు: 445

ఔదార్యం, ఓర్పు, వినయం మొదలగు గుణాలు మానసింహుని వ్యక్తిత్వాన్ని పెంపొందింప చేస్తాయి. ఒకసారి కళ అనే చిత్రకారిణి క్షమించరాని తప్పు చేస్తుంది. ఆమె మహాలులోని కోటలు, రహస్య ప్రదేశాలు మొదలైనవన్నీ రహస్యంగా చిత్రిస్తుంది. నిజానికి ఆమె రాజసింహుని గూఢచారి. ఆమె కుట్ర మానసింహునికి తెలుస్తుంది. ఆమె దగ్గర్నుంచి చిత్రం తీసుకున్నారు తప్ప మానసింహుడు ఏలాంటి దండన విధించలేదు. పైపెచ్చు ఆమెను గౌరవించి మర్యాదతో పంపుతాడు. ఈ కార్యం రాజకీయంగా సమర్థింపదగింది కాకపోయినా మానసింహుని ఔదార్యాన్ని వ్యక్తం చేస్తుంది.

కళోపాసన, కళాకారుల్ని ప్రోత్సహించడం మానసింహుని ఔదార్యాన్ని వ్యక్తం చేస్తాయి. స్వయంగా మానసింహునికి చాల కళలలో ప్రవేశం ఉంది. "ఒక సమర్థుడైన రాజులో ఉండాల్సిన గుణాలన్నీ మానసింహునిలో మెండుగా ఉన్నాయి. కాబట్టి ఆంగ్లేయ చరిత్రకారులు ఆ యుగాన్ని తోమర్ శాసనకాలం నాటి స్వర్ణయుగంగా"[1] పేర్కొన్నారు.

మానసింహుని శీల చిత్రణలో వర్మగారు మృగనయనీ శీల చిత్రణలో చూపినట్టి శ్రద్ధ చూపినట్లు కనబడదు. అతని వ్యక్తిత్వాన్ని చాల సంకుచితంగా చిత్రించాడని కొందరి అభిప్రాయం. సికిందర్ మొదటి ఆక్రమణ తర్వాత అతడు ధనుర్విద్య క్రొత్తగా నేర్చుకొన్నట్లు వర్మగారు చెప్పిఉన్నారు.

---

1 బృందావన్‌లాల్ వర్మ - సాహిత్య ఔర్ సమీక్ష — సియారామ్ శరణ ప్రసాద్, పృ: 146.

మృగనయని శౌర్యం ముందు అతని సాహసం చాల దీనంగాను, బోధన్ పండితునితో వాదించడంలో అసమర్థుడుగను, విజయజంగంతో మాట్లాడినప్పుడు నిరుత్సాహిగను, సుమన మోహిని సమక్షంలో భీరువుగను, తన కొరకు ప్రాణాలు అర్పించిన నిహాల్ సింగ్ విషయంలో కృతఘ్నుడుగను మానసింహుని చిత్రీకరణ జరిగిందని కొందరి వాదన.

రాజనీతి విషయంలో కూడ అతడు తగిన గౌరవాన్ని పొందలేదు. తన కుటుంబ విషయంలో జాగ్రత్త పడినట్లు కనబడదు. రాజభవనంలో మృగనయనిపై రెండుసార్లు విష ప్రయోగం కుట్ర జరిగింది. కాని కుట్రను తెలిసికోవడానికి అతడు ప్రయత్నించలేదు. నరవర్ మొదలైన రాజ్యాలతో జరిగిన దండయాత్రల్లో కూడ అతనికి ఎక్కువ ఉత్సాహం ఉన్నట్లు కన్పడదు. మానసింహుని వ్యక్తిత్వాన్ని రచయిత చారిత్రక ఘటనల ఆధారంగా వర్ణించాడు. అందువల్ల చారిత్రిక వాస్తవ పాత్ర అయిన మానసింహునిలోని కొన్ని సహజ గుణదోషాలను అలాగే చిత్రించారనుకోవచ్చు.

**4.2.3.3. లాఖీ :** 'మృగనయనీ' నవలలో మృగనయనీ తరువాత పేర్కొనదగిన స్త్రీపాత్ర లాఖీ. లాఖీ కపటం లేని పల్లెటూరి పిల్ల. సన్నగా ఉండినప్పటికి చాల చురుగ్గా ఉండేది. ఈమె అహీరు (గొల్ల) జాతికి చెందింది. ఈమె జీవితమంతా ఒడిదుడుకులతో, సంఘర్షణాలతో గడచింది. సికందర్ లోడీ ఆక్రమణచే ఆమె గ్రామం సర్వనాశనమైంది. ఆమె తండ్రిని, సోదరులను నికులు చంపేశారు. పశు సంపదను

నాశనం చేశారు. విధిలేక లాఖీ, ఆమె తల్లి నిరాశ్రయులై రాయి గ్రామం చేరుకొంటారు. వారికి నిన్నీ, అటల్‌లు ఆశ్రయమిచ్చారు. వాళ్ళు ఆవు పాలు అమ్మి, కూలీనాలీ చేసుకొని జీవించేవారు. లాఖీ తన కర్తవ్యాన్ని గుర్తెరిగి బుద్ధికుశలతతో వ్యవహరించేది.

లాఖీ స్వతహాగా తెలివైంది కనుక కొత్త కొత్త విషయాలు నేర్చుకోవాలనే ఉబలాటం ఉండేది. నిన్నీవలె ఈమెకూడా బాణాలను ప్రయోగించడం, బల్లెం విసరడం మొదలైన విద్యల్లో నైపుణ్యం సంపాదించాలనుకొనేది. "గూజర కన్య నేర్చుకో గలిగిన విద్య అహీరు కన్యకు రాదా? అహీరు కన్య దేనిలో తక్కువైంది? నేను చాలా తొందరగా నేర్చుకొంటాను... నేర్చుకొన్న తర్వాత గ్వాలియర్ రాజు ముందు నా విద్యను ప్రదర్శిస్తాను. నిన్నీ సిగ్గు పడవచ్చు గాక! నేను సిగ్గుపడను. నేను సిగ్గుపడను"[1] అని అనుకొంటుంది. ఆమె అనుకొన్నట్లుగానే నిన్నీ, అటల్‌ల సాయంతో బాణాలు వేయడం, బల్లెం విసరడం, వేటాడడం మొదలైన విద్యలన్నీ అతి తక్కువ కాలంలో నేర్చుకొని నిన్నీతో సమానంగా నైపుణ్యం సంపాదిస్తుంది. తర్వాత ఇద్దరూ అడవికి వెళ్ళి అడవి పందులను, అడవి దున్నలను వేటాడేవారు. రాత్రి పూట బాణాలు, విల్లు చేతబూని ఒంటరిగా పొలాన్ని కాపలా కాచేవారు. లాఖీకి నిన్నీకంటే ఇంకా ఎన్నో కొత్త కొత్త విద్యలు నేర్చుకోవాలనే కోరిక బలంగా ఉండేది. ఆమె జిజ్ఞాస ఎంతవరకు వెళ్ళిందంటే గారడీ వాళ్ళైన నటులు, పిల్లలదగ్గర తాడుపైన నడవడం, శరీరాన్ని వంచడం, శ్వాసను

---

1. మృగనయని – బృం. లాల్ వర్మ., పు: 21.

నిలపడం లాంటి విద్యలు కూడా నేర్చుకోవాలని ఉబలాట పడేది. "ఇంట్లో దారం ఉంది. అడవి నుండి వెదురు, కర్రలు తెచ్చుకొంటాను.... అడవిలో మృగాలను వేటాడి గారడీ వాళ్ళకు ఇచ్చి, వాళ్ళ గారడీ విద్యలు నేర్చుకొంటాను"[1] అని అనుకొంటూ ఉండేది లాఖీ. అలాగే పట్టుదలతో గారడీ విద్యలు నేర్చుకొంటుంది.

లాఖీ గ్రామంలో అందరితో కలసిమెలసి ఉండేది. ఉత్సవ సమయాలలో నిన్నీతో కలసిమెలసి పాటలు పాడేది. లాఖీ, నిన్నీల మధ్య స్నేహం దినదినాభివృద్ధి కాసాగింది. తండ్రిని, సోదరులను పోగొట్టుకొని నిరాశ్రయులై వచ్చిన తనను, తన తల్లిని ఆదరించడమే కాక తమ స్వంత కుటుంబ వ్యక్తులుగా చూచే నిన్నీ, అటల్‌లు అంటే లాఖీకి ఎంతో అభిమానం, కృతజ్ఞత. లాఖీ నిన్నీ సుఖం కోసం ఎంతటి త్యాగాన్నైనా చేసేదానికి సిద్ధపడుతుంది. నిన్నీ గ్వాలియర్ రాణి అవుతుందంటే అందరి కంటే ఎక్కువగా సంతోషించింది లాఖీ. ఒక సందర్భంలో నిన్నీతో "నా శిరస్సు కాళీమాతకు అర్పించిన పక్షంలో నీవు గ్వాలియర్ రాణి అయ్యేటట్లుంటే, నా శిరస్సు అర్పించేదానికి ఏమాత్రం సంకోచించను"[2] అంటుంది. దీనిని బట్టి మృగనయనీ అంటే లాఖీకి ఉండే నిశ్చలమైన, గాఢమైన ప్రేమ, అభిమానం తెలుస్తుంది. ఇంతటి పట్టుదల, సహృదయత, మంచితనం, సహజంగా ఉండే అందం వీటన్నిటి వల్ల నిన్నీ సోదరుడు అటల్ లాఖీని

1. మృగనయనీ – బృం. లాల్ వర్మ, పు: 110.

2. పైదే, పు: 170

మనస్ఫూర్తిగా ప్రేమించసాగాడు. లాఖీ కూడా అటల్‌ని ఎంతో ఇష్టపడుతూ ఉంటుంది.

ఇంకా లాఖీలో స్వాభిమానం, ఆత్మగౌరవం మెండుగా ఉంది. తనను అనవసరంగా ఎవరైనా లోకువ చేసి కించపరిస్తే ఒప్పుకోదు. ఒక సందర్భంలో నిన్నీ "మా అన్న అటల్ నిన్ను ఉంపుడుగత్తెగా ఉంచుకొంటే గ్రామపెద్దలు ఏమీ అనరు. పెండ్లి చేసుకొంటే మాత్రం వాళ్ళపై పిడుగు పడినట్లు బావిస్తారు"[1] అంటే, లాఖీ "నేను ఒంటరిగానైనా ఉంటాను గానీ ఉంపుడుగత్తెగా ఉండను. ఉంపుడుగత్తెగా ఉండేదానికి బదులు రాయి (సాంక) నదిలో మెడకు బండ కట్టుకొని దూకి చనిపోవడం మంచిది"[2] అంటుంది. లాఖీ పేదరాలైనా తన ఆత్మగౌరవాన్ని పోగొట్టుకోదు. ఆమె దగ్గర ఇనుప బాణాలు కొనుక్కునేందుకు డబ్బులు లేక, వెదురు పుల్లలతో తానే బాణాలు తయారు చేసుకొని వేటాడేది. కానీ ఒకసారి అడవి పందిని చంపాలని, వెదురు పుల్లల బాణాలైతే కేవలం పక్షులు చస్తాయి గాని, అడవి పంది చావదని తలచి, నిన్నీని ఇనుప బాణం అడుగుతుంది. కాని అప్పటికే నిన్నీకి వేటలో రెండు ఇనుప బాణాలు వృథా అయినందువల్ల ఇనుప బాణం ఇవ్వదు. దీనితో లాఖీలో స్వాభిమానం తలెత్తి వెళ్ళిపోతుంది. తర్వాత నిన్నీ ఆమెను ఎంత బ్రతిమాలినా వినదు. "నీ పంది నీవు తీసుకెళ్ళిపో. నీవు గూజర జాతిదానివని అహం ఉంటే, నాకు అహీరు జాతి కన్యనని అభిమానం ఉంది"[3] అంటుంది.

---

1. మృగనయని — బృం. లాల్ వర్మ., పు: 79.
2. పైదే., పు:79.
   పైదే పు. 50,51.

అలా అని లాఖీ అంటే నిన్నీకి ఎలాంటి కోపం లేదు. అప్పుడప్పుడూ ఇలాంటి గిల్లి కజ్జాలు వచ్చినా, అవి వెంటనే మర్చిపోయి ఒకరికొకరు క్షమాపణ చెప్పుకుని మరల కలుసుకునేవారు.

మృగనయనీకి మానసింహునితో వివాహం జరిగి గ్వాలియర్ వెళ్ళిపోతుందని తెలిసి ఊరి ప్రజలు, నిన్నీ చెలికత్తెగా లాఖీ గ్వాలియర్ వెళ్ళి నిన్నీ తాంబూలపు ఉమ్మును అరచేత పడుతుందనీ, రాజు పరుపు సర్దుతుందనీ, ఇంకా అనేకమైన నౌకర్లు చేసే పనులు చేస్తుందని ఎగతాళి చేస్తారు. ఇది మనస్సులోనే ఉంచుకొన్న లాఖీ, రాయి గ్రామ పూజారి, గ్రామ పెద్దలు వారి వివాహాన్ని ఒప్పుకోనప్పుడు అటల్ మనం కూడా గ్వాలియర్ వెళ్ళిపోదాం అంటే, నేను రాను అని ఖచ్చితంగా చెప్తుంది. "ఎవరైనా నన్ను ఫలానా రాణికి చెలికత్తె అని చెప్పినా, బహుశా ఆ రాణి స్వయంగా నా ఆడపడుచే అయినా ఆ మాటలు సహించను. ఇంకా నిన్ను రాజుగారి సేవకుడు లేక వంటవాడు అని చెప్పడం కూడ నేను భరించలేను. మనకు భగవంతుడు చేతుల్లో శక్తిని, శ్రమించి పనిచేసేదానికి మనస్సును ఇచ్చాడు. కాబట్టి ఏదైనా గొప్ప కార్యాన్ని సాధించి సగౌరవంగా గ్వాలియర్‌కు వెళదాం"[1] అంటుంది. దీనివల్ల ఆమె ఆత్మాభిమానానికి ఎంత విలువ ఇస్తుందో తెలుసుకోవచ్చు.

ఒకసారి గయాసుద్దీన్ అనుచరులు నలుగురు నిన్నీ, లాఖీలను అపహరించాలని రెండు గుర్రాలపై వస్తారు. నిన్నీ బల్లెం విసిరి ఒకర్ని, లాఖీ

---

1. మృగనయని – బృం. లాల్‌వర్మ, పు: 200.

బాణం వేసి ఇంకొకర్ని చంపేస్తారు. మిగిలిన ఇద్దరూ భయపడి పారిపోతారు. ఈ సందర్భంలో నిన్నీ కంటే లాఖీయే కొంచెమెక్కువ ధైర్య సాహసాలు ప్రదర్శించి నట్లనిపిస్తుంది. నిన్నీ కొంచెం బెదిరిపోయి తను విసిరిన బల్లెం ఆ తురుష్కుని శరీరం నుండి లాక్కోలేక పోతే లాఖీ లాగి ఇస్తుంది. పై సంఘటన వల్ల లాఖీ శౌర్య పరాక్రమాలు, ధైర్య సాహసాలు, పట్టుదల మొదలైనవి వ్యక్త మవుతున్నాయి.

గ్వాలియర్ రాజు మానసింహుడు నిన్నీని వివాహం చేసుకొని ఆమెను గ్వాలియర్ పిలుచుకొని వెళ్ళిన తర్వాత లాఖీలో చాల నిశ్శబ్దత చోటు చేసుకొంటుంది. తన ప్రియ స్నేహితురాల్ని స్మరిస్తూ దిగులుగా ఉంటుంది. ఆమె దిగులు చూచి అటల్ ఆమె ఒంటరితనం పోగొట్టాలని ఆమెను వివాహం చేసుకోవాలనుకుంటాడు. కాని వీరిద్దరూ భిన్న జాతులైనందున ఆ గ్రామ పెద్దలు వీరి వివాహాన్ని అంగీకరించరు. అటల్ ఆ గ్రామ పెద్దల్ని లెక్కచేయక గంగాజలాన్ని సాక్షిగా తీసుకొని లాఖీని వివాహం చేసుకొంటాడు. గ్రామ పెద్దలు అటల్, లాఖీలను వెలివేస్తారు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనీ, అటల్, లాఖీలను తమ వైపు లాక్కోవాలనీ గయాసుద్దీన్ చే నియమింపబడిన పిల్లీ, పోటాలు దురాలోచన చేస్తారు. వారి మాటలు నమ్మి అటల్, లాఖీలు వారితో మగరౌని గ్రామం చేరుతారు. పిల్లీ లాఖీని గయాసుద్దీన్‌కు అప్పగించి, అటల్‌ను తన వాడిగా చేసుకోవాలని వ్యూహం పన్నుతుంది. ఇవేవీ తెలియని లాఖీ, అటల్‌లు పిల్లీ, పోటాలను గుడ్డిగా నమ్ముతారు. గయాసుద్దీన్ సేనలు దండెత్తి వస్తున్నాయని తెలిసి అందరితో

అటల్, లాఖీలు నర్‌వర్ కోటలో తలదాచు కొంటారు. పిల్లీ, ఖోటా ఇతర నటవర్గం వారు అర్ధరాత్రి నర్‌వర్ కోట నుండి తప్పించుకొని పోయి గయాసుద్దీన్‌కు సహాయ పడాలనుకొని పన్నాగం పన్ను తారు. కానీ లాఖీ ధైర్య సాహసాల వల్ల నటవర్గం వారి కుట్ర భగ్నమౌతుంది. పిల్లీ తప్పించుకు పోవాలని త్రాటిపై చకచకా దిగుతుంటే లాఖీ ఆ త్రాడును కోసివేస్తుంది. పిల్లీ భయంకరంగా అరుస్తూ కందకంలో పడి చని పోతుంది. ఈ విధంగా నర్‌వర్ కోటను లాఖీ, అటల్‌లు రక్షించారన్న విషయం తెలిసికొని మానసింహుడు వాళ్ళని సగౌరవంగా గ్వాలియర్ తీసుకొని వెళుతాడు. గ్వాలియర్ లో మానసింహుడు అటల్, లాఖీల వివాహం జరిపిస్తాడు. తర్వాత రాయి గ్రామంలో ఒక దుర్గాన్ని నిర్మించి అటల్ సింహుని దుర్గాధి పతిగా నియమిస్తాడు.

లాఖీ, అటల్‌లు రాయి దుర్గాన్ని రక్షిస్తూ ఉంటారు. ఇంతలో సికందర్ సైనికులు రాయి దుర్గంపై దాడి చేస్తారు. లాఖీ కోటను రక్షించడానికి పూనుకొంటుంది. రాత్రి సమయం అంతవరకు కళ్ళుకాయలు కాచేటట్లు మేలుకొన్న అటల్ అప్పుడే ఒక చిన్న కునుకు తీయడానికి లోపలికి వెళ్తాడు. శత్రువులను లాఖీ ఒంటరిగా ఎదుర్కొంటుంది. ఆమె అనేక మందిని హతమార్చి చివరకు తాను కూడా ప్రాణాలను కోల్పోతుంది. చనిపోయే ముందు అటల్‌ను పిలిపిస్తుంది. అటల్ వచ్చాక చివరి కోర్కెగా ఇంకో గూజర జాతి యువతిని పెళ్ళి చేసుకొమ్మని కోరుతూ అటల్ ఒడిలో చివరిశ్వాస విడుస్తుంది.

ఈ విధంగా చివరి వరకు లాఖీ తన ఆత్మాభిమానాన్ని, గౌరవాన్ని,

క్రోల్పోకుండా శౌర్య, ధైర్య, సాహసాలతో , పట్టుదలతో కష్టాల నెదుర్కొని మనుగడ సాగించి తనకంటూ ఒక ప్రత్యేకత నిలుపుకొంది. సమాజం నుండి వెలివేయబడి , అడుగడుగునా అవమానింపబడినా ఆమె గౌరవంగా జీవించిందే తప్ప అగౌరవంగా బ్రతకలేదు. మరణించేటప్పుడూ వీరనారిగా మరణించిందే తప్ప హీనంగా మరణించలేదు. పేద కుటుంబంలో జన్మించి మొదట తండ్రినీ , సోదరులనూ , ఆస్తిపాస్తులనూ , తర్వాత తల్లినీ పోగొట్టుకొని ఒంటరిగా బ్రతుకు తెరువుకై పోరాడిన , కరుణరస పూరిత మైన లాఖీ పాత్రను వర్మగారు ఎంతో నైపుణ్యంతో మలచారు. వారే అటల్ రూపంలో ఆమెకు చేదోడు వాదోడుగా నిలిచారేమో అన్పిస్తుంది. ఈ నవలలో మృగనయనీ కంటె ఎక్కువ సానుభూతి పొందే పాత్ర లాఖీ. దుకే డా॥ సత్యేంద్రగారు " లాఖీ, మృగనయనీలను తులనాత్మక దృష్టితో పరిశీలిస్తే స్వయంగా వర్మగారే లాఖీగానూ, అతనిలోని అహంకార పూరి తుడైన నవలాకారుడు మృగనయనీగానూ స్పష్టమౌతుంది. లాఖీ కాళ్ళు పరిస్థితుల ప్రాబల్యం వల్ల భూమిపై ఉండగా , మృగనయనీ కాళ్ళు వివాహమైన తర్వాత భూమినుంచి పెళ్ళగించబడ్డాయి. అలా భూమినుంచి పెళ్ళగించబడిన ఆ కాళ్ళను వర్మగారు తన లేఖిని అనే హస్తాలతో ఉద్ధరించేందుకు పూనుకొంటే, తన స్వహస్తాలతో లాఖీ వీపు తట్టి ధైర్యం చెప్పినారు " అనడంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు .

1. హిందీ ఐతిహాసిక్ ఉపన్యాస్ ఔర్ మృగనయనీ — డా॥ శాంతి స్వరూప్ గుప్త , పు: 172

4.2.3.4. **అటల్ సింహుడు :** 'మృగనయని' నవలలో మానసింహుని తర్వాత పేర్కొనతగిన పురుష పాత్ర అటల్. అటల్ గూజర జాతికి చెందిన యువకుడు. రాయి గ్రామ నివాసి. నవలలో హోలీ పండుగ జరిగే సందర్భంలో గ్రామీణ యువతీ యువకులు హోలీ రంగులు చల్లుకొనే సందర్భంలో అటల్ మొదటిసారిగా మనకు కన్పిస్తాడు. అటల్‌ని గురించి వర్మాగారు ఇలా వర్ణించారు. "అటల్ బలిష్టమైన యువకుడు, అతని తల వెంట్రుకలు పొడవైనవి. చాల సంవత్సరాల పాటు కఠోరమైన అడవి జీవితం అతని పొడవైన మొహాన్ని, ముక్కును మరింత పొడవుగా చేసినట్లు అనిపిస్తుంది."[1]

అటల్ చిన్నప్పుడే సికందర్ లోడీ ఆక్రమణ వల్ల అతని తల్లి దండ్రులను పోగొట్టుకొంటాడు. అతని చెల్లెలు నిన్నీ మాత్రం అతనితో ఉండేది. నిన్నీ అంటే అతనికి ఎంతో ప్రేమ. తల్లిదండ్రులు లేని లోటు రానీయకుండా ఎంతో అల్లారు ముద్దుగా పెంచి పెద్ద చేశాడు. ఎంత ముద్దు చేసినా, ఆమె కాళ్ళపై నిలబడి బ్రతికేందుకు కావలసిన , సాహసాలు ఆమెలో నూరి పోశాడు. అటల్ పర్యవేక్షణలో నిన్నీ వేటాడడం, రాత్రి పూట పొలం కాపలా కాయడం, బాణాలు వేయడం, బల్లెం విసరడం మొదలైన విద్యలన్నీ నేర్చుకొంది అటల్ అంటే నిన్నీకి కూడా ఎంతో అభిమానం. అన్నా చెల్లెళ్ళిద్దరూ ఒకరి కొకరు ఎంతటి త్యాగం చెయ్యడానికైనా సిద్ధపడే వారు. నిన్నీకి యుక్తవయస్సు రాగా ఆమెకు వివాహం చెయ్యాలని మంచి సంబంధాలు వెతుకుతాడు. గ్వాలియర్ వెళ్ళి ఒక మంచి సంబంధం చూచి వస్తాడు. కాని నిన్నీ ఈ

1. మృగనయని — బృం. లాల్ వర్మ, పు; 12.

సంబంధానికి ఒప్పుకోదు. అయినా అటల్ బాధ పడకుండా, స్నేహ పూర్వకంగా "తల్లీ! నీ మనస్సుకు విరుద్ధంగా ఎప్పుడూ నేనేమీ చెయ్యను"[1] అంటాడు.

అతనికి కొద్దిగా పొలముండేది. దానిలో పండిన ధాన్యంతోను, అడవి జంతువులను వేటాడడంతో అతని కుటుంబం గడచేది. అటల్ అభిమాన వంతుడు. తన కున్నంతలో తృప్తి పడేవాడు కాని ఎదుటి వారిని యాచించి కుటుంబాన్ని పోషించాలనుకొనే వాడు కాదు. ఆకలితో నైనా చస్తాడు కానీ ఇతరులను ఆశ్రయించడు. ఆఖరుకు తన దగ్గర ధాన్యం అయిపోతే, తాము ఆశ్రయమిచ్చిన లాఖీ దగ్గరనుండి కూడా ధాన్యాన్ని తీసుకునే దానికి ఒప్పుకోడు. లాఖీ నిష్ఠూరమైన మాటలతో బలవంతం చేస్తే తరువాత తీసుకుంటాడు. కానీ లాఖీ చంపిన దున్నపోతు చర్మాన్ని అమ్మగా వచ్చిన డబ్బును తీసుకోడు. లాఖీకి తన ఇంట్లో భోజనం పెడతాను అనుకుంటాడే గాని ఆమె ఆస్తిని తనసొత్తులా అమ్ముకోవడం దొంగతనమే అవుతుందని అటల్ విశ్వాసం. "ఒక పేద బాలిక తన ప్రాణాన్ని సహితం లక్ష్యపెట్టక ఇంత సాహసకార్యం చేసింది. నేను నక్కలాగున తొంగి తొంగి చూచి దాన్ని దొంగిలించడమా? రామ రామ. చర్మం పూర్తిగా ఆమెదే. నేను దానిలోంచి ఒక్క పీసం కూడా తీసుకోను"[2] అనుకుంటాడు.

అటల్ లాఖీ అంద చందాలను, గుణగణాలను, ధైర్య సాహసాలను చూసి మనస్ఫూర్తిగా ప్రేమిస్తాడు. లాఖీ కూడా అటల్‌ని ప్రేమిస్తుంది. అటల్‌ది గూజర జాతి. లాఖీది అహీరు జాతి. భిన్న జాతులైన వీరిద్దరి వివాహానికి గ్రామపెద్దలు అంగీకరించరేమో అన్న భయం అటల్‌లో

1. మృగనయని – బృం॰ లాల్ వర్మ., పు: 129.
2. పైదే, పు: 59.

ఉంది. అందుకే ఆ గ్రామ పూజారి బోధన్ పండితుణ్ని మంచి చేసుకోవాలనుకుంటాడు. ఆ నాటి ఆచార ప్రకారం రైతులు పండించిన పంటలో ఆరవ భాగం రాజుగారికి, ఇరవయ్యో వంతు దైవానికి, ముప్ఫయ్యో వంతు బ్రాహ్మణునికి (పూజారికి) చెందుతుంది. కాబట్టి పంటలో పన్నెండవ వంతు పూజారికివ్వాలి. రాయి గ్రామానికి వచ్చిన రాజభటులు ఆరవ భాగం పంట వసూలు చేసుకొని వెళ్లిపోయారు. కాని పూజారి వసూళ్ళు అంత సులభంగా జరగలేదు. ఎందుకివ్వాలని కొందరు రైతులు తిరగబడ్డారు. అప్పుడు అటల్ అక్కడికి వచ్చి, బోధన్ పండితుడు రైతులతో తగవు పెట్టుకోవడం విన్నాడు. పూజారి సానుభూతి తనకు భవిష్యత్తులో బాగా ఉపయోగపడుతుందని తలచాడు. అంటే తమ వివాహానికి గ్రామపెద్దలు అంగీకరించకపోతే పూజారి వాళ్ళను ఒప్పిస్తాడనుకున్నాడు. అందుకే పూజారి పక్షం వహించి రైతులతో వాదించి అతనికి చెందవలసిన పంట భాగాన్ని ఇచ్చేటట్లు చూస్తాడు. తను కూడ పంటలో పన్నెండవ భాగం ఇచ్చేస్తాడు. ఇంకా బోధన్ పండితుణ్ని పొగడుతూ "మహాశయా! తమరింత జ్ఞానాన్ని ఎలా సంపాదించారు? పుస్తకాలు కానీ, పంచాంగాలు కానీ తమవద్ద లేనే లేవు. అయినా మీరు ప్రపంచ విషయాలన్నీ ఎలా తెలుసుకుంటారు"[1] అని ప్రశ్నిస్తాడు. అప్పుడు పూజారి 'అంతా భగవదేచ్ఛ' అని చెబుతాడు. ఇంకా రామాయణ, మహాభారతాల్లో అనేక సందర్భాలలో మనుష్యులు జాతిమతాలను అతిక్రమించినట్లు కవులు రాశారనే విషయాన్ని బోధన్ పండితుడు తన ఉపన్యాసాలలో ఎన్నో

1. మృగనయనీ – బృం. లాల్ వర్మ, పు: 28.

స్తార్లు చెప్తాడు. ఆ విషయాన్ని గుర్తు చేస్తే బోధన్ పండితుడు, "ఆ కథల్లోని వర్ణాంతర వివాహాలు పూర్వకాలాలైన త్రేతాయుగం, ద్వాపర యుగాలలో జరిగే వని, కలియుగంలో మాత్రం సమర్థనీయం కాదని "[1] అంటాడు. అప్పుడు అటల్ కలియుగంలో కూడా కొందరు రాజులు నిమ్న జాతి వారిని వివాహం చేసుకోలేదా? అని ప్రశ్నిస్తాడు. అప్పుడు బోధన్ పండితుడు, గొప్ప గొప్ప వారి విషయాల్లో జాతి మతాల పట్టింపు ఉండదు కాని నిమ్న వర్గీయులకు మాత్రం ఈ పట్టింపు ఉంటుంది అని చెప్తాడు.

ఈ విధంగా బోధన్ పండితునికి పంటలో భాగం ఇప్పించినా, మతాంతర వివాహాలను గురించి వాదించినా కూడా బోధన్ పండితుడు అటల్, లాఖీల వివాహానికి సమ్మతించడు.

నిన్నికి వివాహం జరిగి గ్వాలియర్ వెళ్ళిపోగా అటల్ లాఖీతో మనం కూడా గ్వాలియర్ వెళ్ళి పెళ్ళి చేసుకొని సుఖంగా ఉంటాం అని చెప్తే, లాఖీ ఒప్పుకోదు. 'ఏదైనా గొప్పకార్యం చేసి, పేరు ప్రఖ్యాతులతో గ్వాలియర్ వెళ్ళాలి కానీ ఈ విధంగా వెళ్ళకూడదు' అని చెప్తే, ఆమె బాధ అర్థం చేసుకొని ఆమె మాటలకు గౌరవం ఇస్తాడు.

నిజానికి అటల్ ఎంతో ధైర్య సాహసాలు కలవాడు; కాని, సంఘాన్ని ఎదిరించడానికి ఇష్టంలేక, గ్రామ పూజారి గ్రామపెద్దలు అందరిని ఒప్పించి వివాహం చేసుకోవాలని ఎంతో ప్రయత్నం చేస్తాడు. కాని ఎన్ని చేసినా గ్రామ ప్రజలు, గ్రామ పూజారి వీరిద్దరి వివాహాన్ని

---

1. మృగనయని — బృం. లాల్‌వర్మ, పు: 30 .

ఒప్పుకోరు. అటల్, లాఖీని ఉంపుడుకత్తెగా ఉంచుకొనేందుకైనా గ్రామ పెద్దలు అంగీకరిస్తారు కానీ, వివాహం చేసుకొనేందుకు ఒప్పుకోరు. ఈ కట్టుబాట్లు, ఈ నియమాలు అటల్‌కి ఎంతో అసహ్యం వేస్తాయి. అందుకే గ్రామ పూజారినీ, గ్రామ పెద్దల్ని ఎవ్వర్నీ లెక్కపెట్టకుండా, దృఢ నిశ్చయంతో లాఖీతో చెంబులో నీళ్ళు పట్టుకురమ్మని, ఆ చెంబును రెండు చేతుల్లో తీసుకొని ఆకాశం వైపు చూస్తూ "ఓ భగవంతుడా! నేను అవివాహితుడను. లాఖీ కన్య. నేను గంగాజలం సాక్షిగా - దీని మీద ఒట్టు వేసుకు చెబుతున్నాను. ఈమెను జీవితాంతం నా సహధర్మ చారిణిగా స్వీకరిస్తాను"[1] అని ప్రతిజ్ఞ చేస్తాడు. ఇంకా లాఖీ చేతిలో చేయివేసి "ఈ క్షణం నుండి నీవు నా దానివి. దీనికి సంఘం సమ్మతించినా, సమ్మతించక పోయినా, గ్రామ ప్రజలు నన్ను రాళ్ళతో కొట్టినా, ఈ గ్రామం నుంచి తరిమి వేసినా ఈనాటి మన సంబంధం ఎన్నటికీ విడిపోదు"[2] అని దృఢ నిశ్చయంతో శపథం చేస్తాడు. ఇలా సాంఘిక కట్టుబాట్లు అతని అచంచల ప్రేమకు అడ్డుగోడగా ఉన్నప్పటికీ, ఆ అడ్డుగోడను ఛేదించి, తన నిజమైన ప్రేమను నిరూపించి లాఖీని వివాహం చేసుకొంటాడు. ఈ చర్యకు రాయి గ్రామం వీరిని బహిష్కరిస్తుంది. అయినా లెక్క చేయకుండా కష్టాలను ఆహ్వానిస్తూ, వాటిని ఎదుర్కొనే దానికి శక్తి, సామర్థ్యాలు కూడగట్టుకొంటూ ఆ అపూర్వ దంపతులు, ఆ గ్రామం నుంచి వెళ్ళిపోయి, రాయి గ్రామానికి దాదాపు

1. మృగనయనీ — బృం. లాల్ వర్మ., పు: 199
2. పైదే., పు 199

ఇరవైరెండు క్రోసుల దూరంలో ఉండే మగరానీ గ్రామం చేరుతారు. లాఖీని అపహరించుకు రమ్మని పంపిన నటవర్గంలోని పిల్లీ అటల్‌ను ప్రేమిస్తుంది. లాఖీని గయాసుద్దీన్‌కి అప్పగించి, అటల్‌ను తాను పెండ్లి చేసుకోవాలనుకొని పన్నాగం పన్నుతుంది. ఈ పన్నాగం తెలుసుకొన్న అటల్ పిల్లీని అసహ్యించుకొంటూ "ఛీ! అది ఆడుదా?! చెత్తా చెదారంపై తిరుగాడే సీతాకోక చిలుక స్త్రీ అవుతుందా? ..... మలం మీద విహరిస్తుందదానికి నేనేమైనా ఈగనా?"[1] అంటాడు. ఈ మాటలవల్ల పిల్లీలాంటి చెడు ప్రవర్తన గల స్త్రీలంటే అటల్‌కి గల ఏహ్యాభావం ప్రస్ఫుటమౌతుంది.

మగరానీ గ్రామం చేరిన అటల్, లాఖీలు గయాసుద్దీన్ దండయాత్రవల్ల నర్‌వర్ కోటలో దాక్కొని నటవర్గం వారి కుట్రను భగ్నం చేసి నర్‌వర్ కోటను రక్షిస్తారు. తర్వాత మానసింహుడు వీరు చేసిన గొప్ప సహాయానికి సగౌరవంగా గ్వాలియర్ తీసుకువెళతాడు. అక్కడ వీరిద్దరికీ ఘనంగా వివాహం జరిపిస్తాడు. చివరకు రాయి గ్రామంలోనే ఒక దుర్గాన్ని కట్టించి దుర్గాధిపతిగా అటల్‌ను నియమిస్తాడు

కొద్ది రోజులకు రాయి కోటను సికందర్ లోడీ సైన్యం ముట్టడించినప్పుడు, కోట గోడలపై ఎక్కి శత్రువులతో పోరాడి లాఖీ అనేక మందిని చంపి మరణిస్తుంది. మరణించే ముందు అటల్‌ని పిలిచి "నీవు వేరే గూజర జాతి అమ్మాయిని వివాహం చేసుకో" అనిచెప్పి

1. మృగనయని — బృం. లాల్ వర్మ, పృ: 275.

వీరస్వర్గం అలంకరిస్తుంది. ఆమె వియోగాన్ని భరించలేని అటల్ పిచ్చి కోపంతో శత్రువులపై విరుచుకపడి భయంకరంగా పోరాడుతూ, శత్రువులను చీల్చి చెండాడుతూ, శత్రువుల బాణాలవల్ల దెబ్బతిని లాఖీని స్మరిస్తూ "నేను పెళ్లి చేసుకుంటాను. కాని అక్కడే, ఆమెనే, ఆమె వెళ్ళిన చోటుకు నేనూ వెళుతున్నానుగా"[1] అంటూ మరణిస్తాడు.

ఈ విధంగా సాంఘిక దురాచారానికి, దుష్ట సంప్రదాయానికి బలి అయిన అటల్ పాత్రను వర్మగారు కడు హృద్యంగా పోషించారనడంలో సందేహం ఏ మాత్రం లేదు.

**4.2.3.5. బోధన్ పండితుడు:** 'మృగనయని' నవలలో బోధన్ పండితుని పాత్ర సర్వోత్కృష్టమైంది. బోధన్ పండితుడు గ్వాలియర్ రాజ్యంలోని ఒక చిన్న గ్రామం అయిన రాయిలో శిథిలమైన ఒక దేవాలయానికి పూజారి. ఇతడు మిక్కిలి సహృదయుడు. కలగలుపు మనిషి. కాబట్టి హోలీ పండుగ సమయంలో అందరిపైనా రంగు చల్లుతాడు. ప్రసాదంగా అందరికీ బెల్లాన్ని పంచిపెడతాడు. అందరితో కలిసి హోలీ పాటలు పాడుతాడు.

"ఎల్లప్పుడు పాడి పంటలు సమృద్ధిగా ఈ గ్రామానికి ఉండుగాక. అందరి ఇండ్లల్లో ధనధాన్యాలు సమృద్ధిగా ఉండుగాక. శిథిలమైన మందిరాన్ని పునర్నిర్మాణం చేసేశక్తి భగవంతుడు మాకు ప్రసాదించుగాక. ఇక్కడ ఎల్లప్పుడు నాట్యం, రాసలీలలు వైభవంగా జరుగుగాక"[2] అని

---

1. మృగనయని – బృం.లాల్ వర్మ., పు: 432.
2. పైదే. పు:

ఆ

బోధన్ పండితునికి తాను చాల తెలివిగల వాడననే గర్వం ఉండేది. మరీ పేరాశ కలవాడు కావుననే "రైతులతో వారు తమ పంటలో 20వ భాగం దేవతలకు, 30వ భాగం బ్రాహ్మణులకు చెందాలని చెప్తారు. అలా ఇవ్వకుంటే వారికి ఇహపర లోకాలలో సుఖముండదనే భయాన్ని కల్గిస్తాడు"[1]

అటల్ అతనితో "తమరింత జ్ఞానాన్ని ఎలా సంపాదించారు? పుస్తకాలు గాని, పంచాంగాలు కాని తమవద్ద లేవు. కాని మీరు ప్రపంచ విషయాలన్నీ ఎలా తెలుసుకొంటారు"[2] అనే మాటల ద్వారా ఎంతో కొంత జ్ఞానం కలిగిన వాడేనని ఒప్పుకోవచ్చు. ఈ మాటలవల్ల అతడు చాల సంతోషిస్తాడు.

అతడు నిన్నీ, అటలున్ని చిన్నప్పట్నుంచి ప్రేమతో పెంచి పెద్ద చేస్తాడు. నిన్నీ, అటల్‌ల శారీరక శక్తిని చూచి వారిని ఎల్లప్పుడు సమర్థిస్తూ ఉంటాడు. అటల్ ఒకసారి బోధన్ పండితునితో – మీరీ గ్రామంలో ఉండే కంటే వేరేదైనా మహానగరానికి పోకూడదా అనిచెప్పగా- "నేను ఈ శిథిలమైన మందిరాన్ని బాగు చేయించి ఒక అందమైన మూర్తిని స్థాపిస్తానని ప్రతిజ్ఞ చేసి ఉన్నాను. ఆ పని పూర్తి అయిన తరువాత వేరొక చోటకి పోయే విషయమై ఆలోచిస్తాను"[3] అని చెప్తాడు.

అతడు రూఢివాది. ప్రాచీన సంప్రదాయాలను పాటించే

1. మృగనయనీ – బృం. లాల్ వర్మ., పు: 27.
2. పైదే., పు: 28.
3. పైదే., పు: 31.

బ్రాహ్మణ పూజారి. సాధారణ పూజారి వినా తాను నమ్మిన సిద్ధాంతాలను చక్కగా పాటిస్తాడు. ప్రాణం పోయినా ఇతరుల ఎదుట తల వంచడు. ఎవరికీ భయపడే వాడు కాడు.

సికిందర్ రాజ్య సభలో మహమ్మదీయ మతగురువులైన ఖాజీలు - బోధన్ పండితునితో 'నీవు మహమ్మదీయ మతాన్ని స్వీకరిస్తే క్షమిస్తామని, లేకపోతే వధిస్తామని' భయపెట్టినప్పుడు అతడు "నా మతం ఏ మతానికంటె కూడ తక్కువయింది కాదు. కాబట్టి నేను నా మతాన్ని వదలి ఇతర మతాన్ని స్వీకరించను. మీరు కావాలంటే నా తలను నరికి వేయండి. ఆ తల నాది కాదనుకొంటాను"[1] అని చెప్తారు.

అతడు ధార్మిక నిష్ఠ కలవాడు. వర్ణాశ్రమాచార ధర్మాలను పాటించడంలో చాల పట్టుదల కలవాడు. అతని దృష్టిలో వర్ణాశ్రమ ధర్మ రక్షణ ప్రాణాల కంటె ముఖ్యమయింది. అటల్, లాఖీతో తన వివాహాన్ని జరిపిస్తే అధికంగా ధనం ఇస్తానని బోధన్ పండితునికి ఆశ చూపించారు. కాని అతడు ససేమిరా ఒప్పుకోలేదు. రాజైన మానసింహుడే లాఖీ, అటల్ సింహుల వివాహాన్ని జరిపించమని కోరినప్పుడు కూడ అతడు అంగీకరించలేదు. "అతడు మానసింహునితో రాజు కోపపడినా లెక్క చేయను. సద్బ్రాహ్మణుడు తన ధర్మాన్ని ఎప్పుడూ విడనాడడు. అని నిర్భయుంగా మానసింహునితో చెప్తాడు. ఇంతేగాక మత విషయమై నా ప్రాణాలను ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నాను కాని,

---

[1] మృగనయని – బృం. లాల్‌వర్మ., పు: 372.

ధర్మ విరుద్ధమైన కార్యాన్ని చేయను"[1] అని కూడా చెప్తాడు. "బ్రాహ్మణుడు హిందూ ధర్మానికి నేత్రం వంటి వాడని, అతడు లేకపోతే హిందూమతం గుడ్డిదని అతని విశ్వాసం."[2] స్త్రీలు, శూద్రులు వేదాధ్యయనం చేయకూడదని అతని అభిమతం. కేవలం మత విషయాల లోనే గాక, సంగీత విషయంలో కూడ తన రూఢీ వాదాన్ని చూపిస్తాడు. మానసింహుడు 'బైజూనాథ్'కు 'నాయక్' అనే బిరుదు ఇవ్వాలని తలిస్తే బోధన్ పండితుడు దాన్ని వ్యతిరేకిస్తాడు. ఈ సందర్భంలో ఇలా చెప్తాడు.

"భారత దేశం లోని సంగీతాచార్యులను ఒక చోట చేర్చి వారి ముందర ఈ విషయాన్ని ప్రస్తావించి వారందరూ 'బైజూ' ప్రాచీన ఆచార్యుల కంటే గొప్పవాడని చెప్పినప్పుడు మాత్రమే ఇతనికా బిరుదు ఇవ్వడం సమంజసం"[3] అని అంటాడు. మరియు ప్రాచీన ఋషులు, మునులకు తెలిసిన విషయాలలో లేశ మాత్రం కూడ ఈనాటి శాస్త్రజ్ఞులకు తెలియదని అతని దృఢ విశ్వాసం.

అతడు "సంగీతం ఒక శాస్త్రం. ప్రాచీన కాలం నాటి పురుషులు ఏర్పరచిన కట్టుబాట్లను ఇప్పుడెవరు కూడా మార్చలేరు. వాళ్ళు చెప్పని క్రొత్త విషయాలు వీళ్ళు ఏమి చెప్పగలరు"[4] అని రాజుతో వాదిస్తాడు.

మతాన్ని గురించి, వర్ణాశ్రమాచార ధర్మాన్ని గురించి చర్చించే

1. మృగ నయని – బృం. లాల్ వర్మ., పు: 241.
2. పైదే., పు: 241.
3. పైదే., పు: 339.
4. పైదే., పు: 338.

దానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండేవాడు. ఒక్క విజయ జంగంతోనే కాదు, రాజుతో కూడా దీన్ని గురించి వాద వివాదం చేసేవాడు. అతని దృష్టిలో విజయ జంగం జాతి గౌరవాన్ని మంటగలిపి అధర్మంగా ప్రవర్తించే వాడు. ఈ వాద వివాద ప్రవృత్తే అతని చావుకు కారణమైంది. ఈ ప్రవృత్తి మూలంగానే అతడు సికిందర్ దర్బారులో మత పిచ్చిగల మౌల్వీల కోపాగ్నికి పాత్రుడై మృత్యు దండన అనుభవిస్తాడు.

మృత్యువు ఎదుట నున్నప్పుడు కూడ అతడు తన పట్టుదలను వదలడు; ఏ మాత్రం భయపడడు. మరణ దండన అమలు జరిపేవాడు భయంకరమైన కత్తిని చేత పట్టుకొని అతన్ని చంపేందుకు సిద్ధం కాగా ఆ....తో "ఎందుకాలస్యం చేస్తావు ? ఆలస్యం చెయ్యవద్దు. నీ కర్తవ్యాన్ని నెరవేర్చు"[1] అని ధైర్యంగా చెప్తాడు.

అప్పటి అతని మనస్థితిని వర్ణిస్తూ రచయిత ఇలా చెప్తాడు. "చనిపోయేటప్పుడు అతడు స్థిర చిత్తుడుగా, శాంతుడుగా, నిర్భయుడుగా, నిశ్చలుడుగా ఉంటాడు. భగవంతుడు సర్వత్ర ఉంటాడు. నాలో, ఈ హంతకునిలో, ఈతని ఖడ్గంలో, నా తలలో అతనే ఉంటాడు. అతని దృష్టిలో అందరూ సమానులే. లాఖీ, అటల్ సింహులలో కూడా ఉన్నాడు. కాని నేను వారిద్దరిలో ఎందుకు జాతిభేదాన్ని కల్పించి వారి కన్యాయం చేశాను"[2] అని పశ్చాత్తాప పడతాడు. ఇప్పుడు నా మనస్సులో ఎవరిపైనా ద్వేషలేదని చెప్తాడు.

---

1. మృగనయని – బృం. లాల్ వర్మ., పు: 374.

2. పైదే., పు: 374.

అతని శాంత, గంభీర స్వభావం, మానసిక అంతర్యుద్ధం, పశ్చాత్తాపం, రాగద్వేషాతీతమైన మనస్సు మొదలైన గుణాలు పాఠకుని మనస్సులో అతనిపట్ల సానుభూతిని కల్గిస్తాయి. ఇతను నవల ప్రథమ భాగంలో పాఠకుల సానుభూతికి పాత్రుడు కాకున్నా, ఉత్తరార్థంలో సానుభూతికి పాత్రుడవుతాడు.

బోధన పండితుని వృత్తాంతం మృగనయనీ లోని ఆధికారిక కథకు, లాఖీ అటల్ సింహుల ప్రాసంగిక కథకు సంబంధించింది. బోధన్ పండితుడు మాటిమాటికి రాజును, రాయి గ్రామం లోని మందిరాన్ని బాగు చేయమని కోరడం వల్లనే రాజు ఆ గ్రామానికి రావడం, మృగనయనిని వివాహమాడడం జరుగుతుంది. అతడు తిరస్కరించడం వల్లనే లాఖి అటల్ సింహులు గ్రామాన్ని వదలిపెట్టి పోవడం, నటవర్గం వారి కుట్ర నుండి తప్పించుకోవడం, నర్‌వర్ కోటను రక్షించి, స్వామి భక్తి పరాయణులుగా, త్యాగమూర్తులుగా నిలిచేందుకు అవకాశం కలిగింది.

ఒక విధంగా బోధన్ పండితుని పాత్ర నవలలో ప్రాముఖ్యం కలిగిందని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

**4.2.4. విరాటాకీ పద్మిని :**

**4.2.4.1. కుముద్ :** వర్మగారు రచించిన 'విరాటాకీ పద్మినీ' నవలలో నాయిక 'కుముద్'. ఆమె పాలర్ గ్రామంలోని దుర్గామాత భక్తుడైన నరపతి కుమార్తె. 'కుముద్' జన్మించిన విధానాన్ని రచయిత ఇలా రాశారు.

"గర్భంలో ఉన్నప్పుడు కుముద్ తల్లి విచిత్రమైన స్వప్నాలు కంటూ ఉండేది.

బాలిక జన్మించిన తర్వాత ఆమె తండ్రి కాంతి ప్రపంచమే మన ఇంట్లో పుట్టింది అని అనుకొన్నారు. నరపతి దుర్గాదేవి భక్తుడు. అతడు మేలుకొని కూడా స్వప్నావస్థలో దుర్గాదేవిని దర్శించే వాడు. గ్రామ ప్రజలు అతనిని భయ భక్తులతో చూచే వారు... ఆ బాలిక పుట్టినప్పుడే అందాల రాశిగా పుట్టింది. అందుకే ఆమెకు దేవీత్వం ఆపాదించడానికి ఎక్కువ కాలం పట్టలేదు. అంతటి రూప సౌందర్యాలు కలిగిన బాలికను దాంగీ వంశంలో అంతవరకు ఎవ్వరూ చూడలేదు."[1]

ఆమె రూప లావణ్యాలు సాటి లేనివి. కావడంతో ప్రజలు ఆమెను సాక్షాత్తు దుర్గాదేవిగా భావించే వారు. ఆ బాలిక దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతూ వచ్చే కొద్దీ, ఆమెను దేవీ అవతారంగా తలచి, దూర ప్రాంతాల నుండి కూడా ప్రజలు తండోప తండాలుగా వచ్చి ఆమెను దర్శించే వారు. అందు వల్ల కుముద్ బాల్యం నుండి భిన్న వాతావరణంలో పెరిగింది. సమ వయస్కుల నుండి ఆమెను దూరంగా ఉంచారు. ఆ గ్రామం లోని ప్రజలు తమ బిడ్డలను ఆడుకోనీకుండా చేశారు. ఆమె తండ్రి నరపతి కూడా ఆమె దేవి అయితే తను 'దేవి' తండ్రిగా పేరు ప్రతిష్ఠలతో వెలగవచ్చును అనే స్వార్థంతో జన సామాన్యానికి, ఆచార వ్యవహారాలకు దూరంగా ఉంచాడు.

దలీప్ నగర రాజు నాయక సింహునికి తీర్థ యాత్రలు చేయడం, నదుల్లో స్నానాలు చేయడం అలవాటు. ఆ అలవాటు చొప్పున 'పాలర్'

---

1. విరాటాకీ పద్మిని — బృం. లాల్ వర్మ.

గ్రామంలో ఉండే 'గఢ్ మవ్' తీర్థానికి అప్పుడప్పుడు వచ్చే వాడు. ఆ సందర్భంగా అతనికి కుముద్ విషయం తెలుస్తుంది. అతనితో పాటు వచ్చే దాసీ పుత్రుడు కుంజర సింహునికి కూడా కుముద్ విషయం తెలిసి, ఆమెను దర్శించాలని అతని చెలికాడు లోచన సింహునితో కలిసి వస్తాడు. నరపతి వాళ్ళతో 'కుముద్'ను మందిరం లోనే దర్శించాలంటాడు. వాళ్ళు మందిరానికి వెళ్ళి 'కుముద్'ను చూస్తారు. ప్రథమ దర్శనం లోనే ఆమె సౌందర్యం కుంజర సింహుణ్ని ఆకర్షిస్తుంది. 'కుముద్' కూడా కుంజర సింహుని చూచి ఆకర్షణకు లోనవుతుంది. తండ్రి, ప్రజలు ఆమెను దేవీ అవతారంగా భావించినా, మానవ బలహీనతలు కొన్ని ఆమెలోనూ ఉన్నాయి. రాజకుమారుడు, అందగాడు, యువకుడు అయిన కుంజర సింహుని చూచి ప్రథమ దర్శనం లోనే కుముద్ కూడా ఆకర్షణకు లోనవుతుంది.

ఆమెను దర్శించి కుంజర సింహుడు, లోచన సింహుడు బయటకు వస్తుండగా, ఇద్దరు మహమ్మదీయులైన కాలపీ సైనికులు 'కుముద్'ను చూడాలని మందిరం బయట కాచుకొని ఉంటారు. లోచన సింహుడు ఆ సైనికులతో గొడవ పెట్టుకుంటాడు. కొంత మంది గుంపు చేరుతారు. లోచన సింహునికి సాయంగా కొంతమంది దలీప్ రాజ్య సైనికులు వస్తారు. మహమ్మదీయ సైనికులకు మద్దతుగా కొంతమంది కాలపీ సైనికులు వస్తారు. ఇరు వర్గాల వారికి ఘర్షణ జరుగుతుంది. ఆ ఘర్షణలో అనేక మందికి దెబ్బలు తగులుతాయి. ఉద్దండ స్వభావులైన

లోచన సింహుడు ఒక మహమ్మదీయ సైనికుణ్ణి చంపేస్తాడు. ఈ విషయం కాలపీ సుబేదారు అలీ మర్దాన్‌కు తెలిస్తే, ఎక్కడ 'పాలర్'పై విరుచుకు పడతాడో అని ఆ గ్రామ ప్రజలు భయపడుతూ ఉంటారు. ఇకపై 'కుముద్'కి కూడా 'పాలర్'లో రక్షణ ఉండదని తలచి ఆమె తండ్రి నరపతి ఆమెను బేతవానది ఒడ్డున ఉన్న విరాటా దుర్గంలో రహస్యంగా దాస్తాడు.

పాలర్ గ్రామంలో తన సైనికుణ్ణి లోచన సింహుడు చంపాడన్న విషయం తెలిసి అలీ మర్దాన్ ఉగ్రుడౌతాడు. అంతకు మునుపే అలీ మర్దాన్‌కు 'కుముద్' చాల అందగత్తె అనే విషయం తెలుసు. కాముకుడైన అలీమర్దాన్ ఎలాగైనా 'కుముద్'ను పట్టి తెచ్చి వివాహం చేసుకోవాలనుకొంటూ ఉంటాడు. ఆమె దేవీ అవతారం అనే మాట నమ్మడు అదంతా బూటక ప్రచారంగా భావిస్తాడు. ఇప్పుడు అవకాశం వచ్చింది. 'కుముద్'ను పట్టి తెచ్చేందుకు పాలర్ పై తన సేనను పంపిస్తాడు. కానీ కుముద్ ఆచూకీ తెలియక కోపంతో పాలర్ లోని దేవీ మందిరాలను ధ్వంసం చేస్తారు అలీమర్దాన్ సైనికులు.

దలీప్ నగర రాజ్యానికి నాయక సింహుని తర్వాత అతని వారసునిగా మంత్రి జనార్ధన శర్మ దేవీసింహుని నియమిస్తాడు. ఈ విషయం దలీప్‌నగర చిన్నరాణికి ఇష్టం లేదు. ఆమె అలీమర్దాన్‌తో చేతులు కలిపి తన అనుచరుడు రామదయాళును అతనికి సాయంగా పంపుతుంది. 'కుముద్'ను విరాటా దుర్గంలో ఎక్కడో రహస్యంగా దాచి ఉంచారనే

విషయం అలీమర్దాన్‌కు తెలిసి ఆమె ఆచూకీ తెలుసుకొని రమ్మని రామ-దయాళును కోరుతాడు. అందుకు రామదయాళు అంగీకరిస్తాడు.

విరాటా దుర్గంలో కుముద్‌కి తోడుగా ఆమె ప్రియ స్నేహితురాలు గోమతి కూడా ఉంటుంది. గోమతి కుముద్ స్నేహితురాలై ఉండీ కుముద్‌ను దేవీ అవతారంగా భావిస్తుంది. ఆమె కుంజర సింహునీ, మర్దాన్‌నీ దుర్మార్గులుగా భావిస్తుంది. కుముద్‌తో వాళ్ళను సర్వనాశనం చెయ్యి దేవీ అని ప్రార్థిస్తుంది. 'కుముద్'కు మాత్రం కుంజర సింహుడంటే ఎంతో అభిమానం. అతన్ని మనసారా ప్రేమిస్తుంది. కాని చెప్పుకోదు. మనసులోనే మూగగా కుంజర సింహుని ఆరాధిస్తూ ఉంటుంది.

ఒకసారి గోమతి కుముద్‌ని ఇలా అడుగుతుంది "దేవీ! కుంజర సింహుని విద్రోహాన్ని, అలీ మర్దాన్ అధర్మ ప్రవృత్తులను నాశనం చేసే బలం దలీప్ నగర కొత్త రాజుకివ్వండి"[1] అంటే, కుముద్ "తరువాత చూద్దాంలే"[2] అంటుంది. కాని గోమతి మొండి పట్టుదలతో "లేదు దేవీ, ఈ రోజు నీ కిష్టం లేకున్నా నాకు వరం ఇచ్చితీరాలి. నీకు కుంజర సింహుని పక్షం న్యాయమని తోస్తే, దలీప నగరమే కాదు ఈ ప్రపంచమే సర్వనాశనమవుతుంది. దలీప్ నగర కొత్త రాజు కుంజర సింహునితో ఓడిపోతే, అలీ మర్దాన్ ఇలాంటి అనిశ్చిత స్థితిలో రాజ్యం పొందినట్లయితే నీ మందిరం గతి ఏమిటి? ఇతర రాజులెవ్వరూ నీ మందిరాన్ని రక్షించేదానికి పూనుకోరు.

---

1. విరాటాకీ పద్మినీ – బృం. లాల్ వర్మ., పు: 89.

2. పైదే., పు: 89.

విరాటనగరం లో అలీ మర్దాన్ ను అణచే శక్తి లేదు. అందువల్ల తల్లీ! నీవు పూనుకొని విరాటనగరాన్ని రక్షించు"[1] అంటూ కుముద్ రెండు కాళ్ళు పట్టుకొని భోరుమని ఏడుస్తుంది.

దీనిని బట్టి గోమతికి ఆమె దైవత్వం పై గల అపార విశ్వాసం తెలుస్తున్నది. ఆమె గాని వరమిచ్చిందంటే ఆ వరానికి తిరుగు లేదని గోమతి నమ్మకం. కానీ కుముద్ మాత్రం తాను మానవస్త్రీ అనే నమ్ముతుంది. విధిలేక చాల ప్రయత్నంతో "తప్పకుండా నీవు చెప్పినట్లుగా దుర్గా మాతను ప్రార్థిస్తాను. అలీమర్దాన్ వల్ల దుర్గామాత గుడి నాశనం కాకుండా దుర్గామాతే రక్షించుకొంటుంది"[2] అని గోమతిని తన కాళ్ళ దగ్గర నుండి లేపి ప్రక్కన కూర్చోబెట్టుకొంటుంది. ఇక్కడ కూడా ఆమె కుంజర సింహుని గురించి చెడ్డగా ప్రార్థించదు.

కుంజర సింహుడు కూడా ఒకసారి ఆమెను దేవీ అవతారంగా భావించి ఆమె కాళ్ళు పట్టుకొంటాడు. అప్పుడు కుముద్ "ఇలాంటి పని మరెప్పుడూ చేయవద్దు. నేను దేవీ అవతారం కాను సాధారణ స్త్రీని. దుర్గా మాతకు నిజమైన పూజారిణిని. నన్ను నీవు దేవీ అవతారంగా తలంచవద్దు" అని చెప్తుంది.

నిజంగా ఆమె దేవీ అవతారం కాదు. ఒక ప్రక్క అలీ మర్దాన్ సేనలు కోటను ఆక్రమించాయి. రెండో ప్రక్క దేవీ సింహుడు అలీ మర్దాన్ని

1. విరాటా కీ పద్మిని — బృం. లాల్ వర్మ., పు: 89,90.
2. పైదే, పు: 90.
3. పైదే, పు: 228.

విరోధించేందుకు బయలుదేరాడు. కుముద్ దేవి అవతారం అయితే, ధర్మ సంస్థాపనార్థం అలీ మర్దాన్ సైన్యాన్ని నాశనం చేసి విరాట దుర్గాన్ని రక్షించేది. దేవీసింహుని సేన వచ్చేలోపలే అలీ మర్దాన్ సేన విరాట నగరంపై విరుచుక పడ్డాయి. కొద్దిపాటి దాంగీ సేన కొంతసేపు ప్రతిఘటించి ఇక ఓడిపోతామనే నిశ్చయానికి వస్తారు. ఈ విషయం తెలుసుకొని విరాట దుర్గంలోని సైనికులందరూ జౌహారు వ్రతానికి పూనుకొంటారు. అప్పుడు నరపతి సహజమైన తండ్రి ప్రేమతో కుముద్‌ను మాత్రం తప్పించాలని వస్తాడు. కాని కుముద్ అతనితో తప్పించుకొని వెళ్ళడానికి ఇష్టపడదు. అసలు తన కోసమే ఈ యుద్ధం జరుగుతుందని కూడా చివర వరకు తెలియనంత అమాయకురాలు. తండ్రి నరపతితో "నేను ఎప్పుడైనా మరణించే దానికి సిద్ధమే. ఈ యుద్ధానికి కారణం (అయిన నేను) మొదటే పరిసమాప్తి అయిన్టుంటే ఈరోజు విరాటలోని ఇంతమంది శూరులైన సామంతుల వ్యర్థ బలిదానం జరిగి ఉండేది కాదు. నేను ఇంకా ఎందుకు జీవించి ఉన్నాను? ఎవరి కోసం?"[1] అంటుంది. తన కారణంగా ఇంతమంది మరణిస్తున్నారే అని పరిపరి విధాల తపిస్తుంది. ఇంకా "నా వాళ్ళందరూ ఇక్కడే ఉన్నారు. నేనూ ఇక్కడే ఉంటాను... నా తల్లి బేతవా నది ఇక్కడే ఉంది. నేను ఏ భూమాత వాడిలో జన్మించి నానో అది నాశనం అవడం నేను చూడలేను. దేవి ఆజ్ఞ అయింది. దుర్గామాత ఆదేశం ఇచ్చింది. ఇక మీరు వెళ్ళండి"[2] అని

1. విరాటాకీ పద్మినీ — బృం. లాల్ వర్మ., పు: 354.

2. పైదే., పు: 254.

నరపతితో చెప్తుంది. నరపతి వెళ్ళిపోతాడు.

కుంజర సింహుడు కుముద్ ను వెతుక్కొంటూ వస్తాడు. కుముద్ ను చూచి మన సైనికులందరూ జౌహరు వ్రతం ఆచరిస్తున్నారు అని చెప్తే "అందరూ జౌహరు ఆచరించారా? మంచి పని చేశారు. పద మనం కూడా వెళ్దాం. కాని ఎక్కడికి?"[1] అని అడుగుతుంది. అప్పుడు కుంజర సింహుడు "నదికి ఆవలి ఒడ్డు, దుర్గానికి తూర్పువైపు. అక్కడికి ఎవ్వరూ చేరుకోలేరు. మనిద్దరం వెళదాం"[2] అంటాడు. దానికి సమాధానంగా కుముద్, ఇద్దరం విడివిడిగా వెళ్దాం అంటుంది. కుంజర సింహుడికి కుముద్ చెప్పేది సరిగా అర్థం కాలేదు. సరిగ్గా చెప్పమని ఆమెను అడుగుతాడు. అప్పుడు కుముద్ "నేను ఎవరూ రాని వైపు నుంచి వస్తాను. నీవు జౌహరు జరిగే వైపునుంచి రా. మనమంతా చివర్లో అక్కడ కలుసుకుంటాం"[3] అంటుంది. అంటే ఆమె ఉద్దేశం పై లోకంలో అని. కాని కుంజర సింహుడికి ఆమె మాటలు అర్థం కాక ఆమె తనతో వచ్చేస్తుందనే ఊహలోనే ఉన్నాడు. కుముద్ పై మాటలు అంటూ తన వళ్ళో దాచుకొన్న అడవి పూల మాలను అతని మెళ్ళో వేస్తుంది. ఆమెకు దుఃఖం ఆగలేదు. కుంజర సింహుడు ఆమెను గాఢంగా హత్తుకొంటాడు. ఆమె తెప్పరిల్లి ఇంతకన్నా నా దగ్గర ఏమీ అని చెప్పి ఒక వైపుగా వెళుతూ ఉంటాడు. ఇంతలో విరాట దుర్గాన్ని రక్షించేందుకు వచ్చిన దేవీ సింహుని చూచిన కుంజర సింహుడు తన రాజ్యాన్ని కబళించాడనే

1. విరాటా కీ పద్మినీ — బృం. లాల్ వర్మ., పు: 362.
2. పైదే, పు: 362.
3. పైదే, పు: 362.

క్రోపంతో దేవీ సింహునిపై కత్తి దూస్తాడు. ఇద్దరూ పోరాడుతుంటే అలీమర్దాన్ దూసుకొని వచ్చి కుముద్‌ను తరుముతాడు. అది చూచి నిశ్చేష్టుడైన కుంజర సింహుని తల నరుకుతాడు దేవీ సింహుడు. కుముద్ అలీమర్దాన్‌కు చిక్కకుండా పరుగెత్తు కొంటూ పోయి కొండ చరియను ఆనుకొని ఉన్న బేత్వా నదిలో దూకుతుంది. నదిలో దూకే ముందు కుముద్ రెండు చేతులు జోడించి, మృదువైన స్వరంతో, శాంత గంభీరంగా " తోట మాలికలు నందన వన మందలి పూవులను తెత్తురుగాక ....."[1] అని పాడుతూ నదిలో దూకుతుంది.

ఈ రకంగా 'విరాటాక్షి పద్మిని' నవలా నాయిక 'కుముద్' శీలాన్ని వర్మగారు సూక్ష్మాతి సూక్ష్మ రేఖలతో మనస్సుకు హత్తుకొనే టట్లు గానూ, కరుణరస పూరితంగానూ చిత్రించారు. కుముద్‌ను ప్రజలు దేవీ అవతారంగా భావించారని వర్మగారు చెప్పారు. కాని ఆమె దేవీ అవతారం అని నిరూపించే టటువంటి అద్భుత కార్యాలేవీ చేయలేదు. పూర్తిగా మానవ కన్యగానే చూపించారు. కాని ఆమె అపురూప సౌందర్యాన్ని, గుణ గణాలను ఆధారం చేసుకొని ప్రజలు ఆమెకు దేవీత్వాన్ని ఆరోపించారు. ఆమెకు దేవీత్వాన్ని నిరూపించే ఎటువంటి మానవాతీత శక్తులూ లేవు. మానవుల్లో ఉండవలసిన సరళత్వం, సౌకుమార్యం, సచ్చరిత్ర, నిష్కపట బుద్ధి, శాంత స్వభావం, ఆత్మవిశ్వాసం, దృఢత్వం, దేవుని పైన నమ్మకం, దయ, మమత, ప్రేమ మొదలైన ఎన్నో సద్గుణాలు కుముద్‌లో ఉన్నాయి. అలాగే దుర్గుణాలైన కోపం, అహంకారం,

1. విరాటాక్షి పద్మిని – బృం. లాల్ వర్మ., పు: 365.

అభిమానం, ఈర్ష్య, మోసం, కపటం, స్వార్థం మొదలైన వాటిల్లో ఏ ఒక్క గుణమైనా ఆమెలో ఇసుమంత కూడా కనిపించవు. పైన చెప్పిన మంచి గుణాలన్నీ పుణికి పుచ్చుకొని, ఏ ఒక్క చెడ్డ గుణం కూడా లేకుండా జన్మించిన ఏసుక్రీస్తు, గౌతమ బుద్ధుడు, మహమ్మద్ ప్రవక్త, మహాత్మా గాంధీ మొదలైన వారు దైవాంశ సంభూతులైతే, 'కుముద్' కూడా దైవాంశ సంభూతురాలే. ఏసుక్రీస్తు తనను చిత్రహింసలు పెట్టి శిలువ వేస్తున్న శత్రువులను కూడా, వాళ్ళు అమాయకులు, వాళ్ళేం చేస్తున్నారో వాళ్ళకే తెలియదు. వాళ్ళను క్షమించు ప్రభూ! అని దేవుణ్ణి వేడుకొన్నాడు. అలాగే గోమతి అలీమర్దాన్‌ను నాశనం చెయ్యమని కుముద్‌ని కోరినా, ఆమె దుర్గామాతే అన్నీ చూచుకొంటుంది అని చెప్తుంది గాని అలీమర్దాన్ నాశనం కోరుకోదు. ఏసుక్రీస్తు దేవుని కుమారుడు అయినట్లే కుముద్ దేవీత్వం ఆరోపించబడిన, మానవత్వం కలిగిన ఒక ఉత్తమ ఆదర్శవంతమైన స్త్రీ అని వర్మగారి ఉద్దేశం. ఆమె సాక్షాత్తు దేవీ అవతారం అని చెప్పడం కూడ కవి ఉద్దేశం కాదు. కాబట్టే సియారామ్-శరణ్ ప్రసాద్ గారు "ఈమె (కుముద్) దేవీత్వాన్ని అలౌకిక తత్త్వాన్ని నిరూపించుకునే కార్యం ఏ ఒక్కటీ చేయలేదు. పోనీ ఆమెలో మృగనయనీ, లక్ష్మీబాయి, లాఖీలలో ఉండే వీరత్వం ఉందా అంటే అదీలేదు... కానీ ప్రతి ఒక్కరూ ఆమెను దేవీ అవతారంగా భావించి, ప్రాణాలర్పించే దానికి నడుం కట్టారు. అందువల్ల ఆనాటి ప్రజల్లో వ్యాప్తిచెందిన మూఢ నమ్మకం, తెలివిలేని తనం, అమాయకత్వం, ధర్మ సంబంధమైన నమ్మకం మొదలైన విషయాలు తెలుస్తాయి. సాధారణ ప్రక్రియలో ఆమె పరిపూర్ణమైన మామూలు,

అని చెప్పవచ్చు."

ఏది ఏమైనా ప్రజల మూఢ విశ్వాసం వల్ల, స్వార్థం వల్ల, అజ్ఞానం, అమాయకత్వం వల్ల కుముద్ జీవితం, ఆమెను ప్రాణప్రదంగా అభిమానించే దాంగీ సైనికుల, విరాటా దుర్గం ప్రజల జీవితం నాశనమైంది. వర్మగారు ఆనాటి హిందువుల మతమౌఢ్యాన్ని ఈ నవలలో కన్నులకు కట్టినట్లు చూపారు. అలీమర్దాన్ లాంటి కాముకుల ప్రవృత్తిని వివరించారు. దైవత్వం ఆరోపించ బడిన మానవస్త్రీగానూ, మూఢాచారాలకు బలిపశువుగా మారిన స్త్రీగానూ వర్మగారు 'కుముద్' పాత్రను సహజంగానూ, ప్రబోధాత్మకంగానూ, కరుణ రసాత్మకంగానూ చిత్రించారు.

**4.2.4.2. కుంజర సింహుడు:** బృందావన్ లాల్ వర్మగారు రచించిన 'విరాటా కీ పద్మిని' అనే నవలలో కుంజర సింహుడు నాయకుడు. నాయకుడు అనిచెప్పే బదులు అసమర్థ నాయకుడంటేనే బాగుంటుంది. "ఇతడు దలీప నగర రాజైన నాయకసింహుని కుమారుడు. దాసీపుత్రుడు."[1] "అతడు ఇరవై లేక ఇరవై ఒకట్టి సంవత్సరాల అందమైన బలమైన యువకుడు."[2] రాజుకు ఇద్దరు రాణులున్నా వారిద్వారా సంతానం లేక పోవడం చేత కుంజర సింహునకే రాజ్యాధికారం సంక్రమించాలి. అందుకే పెద్దరాణి కుంజర సింహుడంటే ప్రత్యేక అభిమానం చూపిస్తుంది. అందువల్ల చిన్నరాణికి కుంజర సింహుడంటే ఇష్టం ఉండదు. కుంజర సింహుడు జన్మతః పిరికివాడు. ఆత్మన్యూనతా

1. విరాటాకీ పద్మిని – బృం.లాల్ వర్మ., పు: 3.

2. పైదే., పు: 3.

భావంతో కృంగి పోయేవాడు. కావున, తన హక్కుల్ని, రాజ్యాధికారాన్ని పొందడానికి ప్రయత్నించ లేదు. ఎల్లప్పుడూ ఊహాలోకాల్లో విహరిస్తూ వాస్తవానికి అతీతంగా భావుకతతో జీవించే వాడు. సంకోచ స్వభావం కలవాడు. జీవితం లోని క్లిష్ట పరిస్థితుల నుండి తప్పించుకోవడానికి మార్గాలు వెతికే స్వభావం గలవాడు.

అతని తండ్రి నాయక సింహుడు మరణ శయ్యపై ఉంటే పెద్దరాణి కుంజర సింహుని పిల్చి ఇలా అంటుంది. "నాయనా వ్యాధి గ్రస్థుడైన రాజు జీవించడం అనేది దుర్లభం. అతడు ఏ పరిస్థితిలోనైనా చనిపోతే నేనూ అతనితో సహగమనం చేస్తాను. అప్పుడు ఈ రాజ్యాన్ని రక్షించే వారెవ్వరు?"[1] అని కుంజర సింహుని రాజ్యాధికారం పొందడానికి ప్రోత్సహిస్తుంది. దానికి సమాధానంగా కుంజర సింహుడు "ఇలాంటి మాటలు విని నా మనస్సు బాధ పడుతుంది. నేను సాధ్యమయినంత వరకు ఇట్టి బాధ్యతల నుండి దూరంగా ఉండ గోరుతాను"[2] అని చెప్తాడు. దీనిని బట్టి కుంజర సింహునకు రాజకీయ విషయాలను తెలుసుకోవాలనే కుతూహలం కానీ, రాజ్యకాంక్ష కానీ ఏ మాత్రం లేదని తెలుస్తుంది. రాజ్యాధికారం శాశ్వతం కాదని అతని అభిప్రాయం.

మనో వైజ్ఞానిక దృష్టితో అతని స్వభావాన్ని విశ్లేషించి చూస్తే అతనిలోని ఆత్మ న్యూనతా భావం స్పష్టమవుతుంది. అతడు దాసీ పుత్రుడు. రాజకుటుంబంలో దాసీ పుత్రులకు గౌరవింపదగిన స్థానం ఉండదు. దాసీ పుత్రులకు పాలన పోషణలో అన్ని సౌకర్యాలున్నప్పటికీ, వారి స్థానం

1. విరాటా కీ పద్మినీ - బృం. లాల్ వర్మ., పు: 44.
2. పైదే., పు: 44.

తక్కువ స్థాయిలోనే ఉంటుంది. కుంజర సింహుని హృదయంలో తాను హీనుడు అన్న భావన ఉంటుంది. ఆ ఆత్మన్యూనతా భావమే అతని ఉపేక్షకు, నిరుత్సాహానికి కారణమయింది. రాజ కుటుంబంలో అతనికి ప్రేమే కరువైంది. అది అతని దౌర్బల్యానికి కారణమై, ప్రేమకోసం అర్రులు చాస్తూ ఊహాలోకాల్లో మునిగిపోయే స్థితికి తెచ్చింది.

ఆ పరిస్థితుల్లో 'పాలర్' గ్రామంలో 'దాంగీ' జాతికి చెందిన గృహంలో ఒక బాలిక జన్మించింది. ఆమె రూప లావణ్యాలలో సాటిలేనిది కావడంతో ప్రజలు ఆమెను దుర్గాదేవి అవతారమని పూజించేవారు. ఆ బాలిక పేరు 'కుముద్'. ఆమెలో ఏ మహత్తు ఉందోగాని ఆమెను చూడగానే సాక్షాత్తు దుర్గాదేవిని చూచినట్లే పొంగిపోయేవారు.

కుంజర సింహుడు కూడా దేవీ అవతారంగా భావింపబడే 'కుముద్'ను చూడాలని చాలసార్లు అనుకునేవాడు. కాని సహజంగా సంకోచ స్వభావం కలవాడు కావడంతో, కుముద్‌ను చూడాలనే ఉత్కంఠ, ఆకాంక్ష మెండుగా ఉన్నా, ఒంటరిగా పోయి దర్శించడానికి సాహసం చేయలేక పోతాడు. చివరకు అతని చెలికాడైన లోచన సింహుని సహాయంతో కుముద్ దగ్గరకు వెళ్తాడు. కుముద్ తండ్రి కఠోరంగా ప్రవర్తిస్తే భయపడి కుముద్‌ను చూడకుండానే వెళ్ళిపోవాలనుకుంటాడు. కాని లోచన సింహుని సహాయంతో కుముద్ దగ్గరకు వెళ్తాడు. ప్రథమ దర్శనంలోనే 'కుముద్' అతణ్ని ఆకర్షిస్తుంది. అలాగే నిశ్చేష్టుడై ఆమె సౌందర్యాన్ని చూస్తూ నిలబడి పోతాడు. అతనిది ఆరాధనో, భక్తో, నిశ్చల ప్రేమో ఏదీ తెలియని ఒకలాంటి స్థితి. ఆమెనే

తన ప్రాణేశ్వరిగా భావించుకుంటాడు. కుముద్ కూడ అతనిని చలిస్తుంది. సమాజం ఆమెకు దైవత్వం అంటగట్టినా, మానవ సహజ గుణమైన ప్రేమించడం అనేది ఆమెలో ఉన్నందు వల్ల ఆమె హృదయంలో కుంజర సింహుని ప్రతిబింబం నిలిచింది.

కుంజర సింహునిలో కొన్ని బలహీనతలున్నా అతనిలో స్వాభిమానం, శౌర్యం, రణోత్సాహం మొదలైన క్షత్రియ గుణాలు కూడ ఉన్నాయి.

రాజకుటుంబంతో ఎలాంటి సంబంధంలేని 'దేవీసింహుడు' ఒకసారి దలీపరాజు నాయకసింహుని అలీమర్దాన్ సేనలు చంపబోతుంటే కాపాడుతాడు. ఇలా దేవీ సింహుడు నాయకసింహుని మన్ననకు పాత్రుడై మంత్రి జనార్ధన శర్మకు కూడా ఇష్టుడౌతాడు. కొన్నాళ్ళకు నాయకసింహుడు మరణించేటప్పుడు కుంజరసింహుని కంటె దేవీ సింహుడే సమర్థుడని తలచి, మంత్రి దేవీ సింహుని దలీప్ నగర రాజుగా ప్రకటిస్తాడు.

తనకంటె దరిద్రుడైన దేవీసింహుని ఆధీనంలో ఉంటే స్వాభిమానం దెబ్బతింటుందనే ఉద్దేశంతో, కుంజర సింహుడు రాజ్యకాంక్ష లేకపోయినా కొంత పౌరుషాన్ని ప్రదర్శించి, రాజ్యంలోని 'సింహ గఢ్' ప్రాంతాన్ని స్వాధీనం చేసుకొని తన నివాసం చేసుకొంటాడు. కానీ రాజకీయ పరమైన నైపుణ్యత, దూరదృష్టి లేనివాడు కావడం చేత అతని సింహ గఢ్ విజయం నిరర్థకమౌతుంది. 'సింహ గఢ్' మరల దేవీసింహుని వశమవుతుంది.

కుంజర సింహునిలో యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం ఉండి ఉంటే, చిన్నరాణి సలహాను పాటించి 'కాలపీ' సుబేదారు అలీమర్దాన్ సహాయంతో

దలీప నగరానికి రాజు అయ్యేవాడు. కానీ అలీ మర్దాన్ సహాయాన్ని నిరాకరిస్తూ సింహ గఢ్ నుండి వెళ్ళిపోతాడు. అంటే కుంజర సింహుని ఉదాసీనతకు, రాజ్య కాంక్ష లేక పోవడానికి 'కుముద్' కారణం అని చెప్పవచ్చు. కుముద్ పై కుంజర సింహునికి ప్రేమాభిమానాలు లేకుండా ఉంటే అతడు రాజ్య ప్రాప్తికి ప్రయత్నం చేసి ఉండేవాడని ఊహించవచ్చు. అతనిలో రాజ్యకాంక్ష కన్నా భావుకతే ఎక్కువగా కనబడుతుంది. కుముద్ ప్రేమలో అతడు తన్నుతానే మరచిపోతాడు. అతని ప్రవృత్తులన్నీ 'కుముద్' లోనే కేంద్రీభూతం అవుతాయి. రాజ్యప్రాప్తి, శత్రువులపై ప్రతీకార వాంఛ అన్నీ కుముద్ ప్రేమ భావనలో అంతరించి పోతాయి. అతడు కుముద్ తో "నేను ఈ పాదాలను రక్షించడానికి నా సర్వస్వాన్ని అర్పించవలసి వచ్చినా, ఈ సేవాభావం అనే తాపంలో ఎదురుగా ప్రవహించే నదిలో విలీనం అయే పరిస్థితి వచ్చినా, దలీప్ నగరమే కాదు, ప్రపంచమంతా నాకు అధీనమైనట్లు భావిస్తాను. నాకు ఈ పాదసేవ చేయడానికి అవకాశం లభిస్తే దలీప నగరాన్ని ఎవరు పాలించినా సరే! ప్రపంచం ఎవరికి స్వాధీనమైనా సరే! నాకు సర్వస్వం లభించినట్లే"[1] అని అంటాడు. దీనిని బట్టి కుంజర-సింహునకు కుముద్ అంటే ఎంత అభిమానమో తెలుస్తుంది. అతనికి కుముద్ పై గల ప్రేమ ఎంత పవిత్రమైందో, ఎంత అనన్యమైందో అర్థమవుతుంది. పవిత్రమైన ప్రేమతోనే ఆమె వద్దకు పోయేవాడు. మానవ స్వభావ సిద్ధమైన మోహావేశం అతనిలో ఉండేది కాదు. అతడు ఆమె సేవయే పరమార్థంగా భావించేవాడు. ఆమెతో ఒకసారి "నేను నీ కోసం ఏ త్యాగమైనా చేస్తాను.

1. విరాటా కీ పద్మిని – బృం. లాల్ వర్మ., పు: 225,226.

నీ కోసం నవాబుతో యుద్ధం చేయడం నా ధర్మం. ధర్మాన్ని రక్షించడం కర్తవ్యం అవుతుంది. కర్తవ్యాన్ని నెరవేర్చడం ధర్మంగా చెబుతారు. నీ ఆజ్ఞను పాటించడం నాకు ధర్మం, కర్తవ్యం, సమస్తం అవుతుంది. నీ పాదాలను సేవించే భాగ్యం నాకు దొరికితే ప్రపంచం నన్ను తిరస్కరించినా బహిష్కరించినా లెక్కించను. నీ పాదసేవ లభిస్తే దేవీ సింహుడు నా నౌకరు. నవాబు నా బానిస. ప్రపంచంలోని ప్రజలందరూ ఆత్మీయులుగా భావిస్తాను"[1] అని అంటాడు. ఇలా మాట్లాడుతూ భావావేశంతో కుంజర సింహుడు కుముద్ పాదాలను పట్టుకొంటాడు. కుముద్ గాభరాగా తన పాదాలను వెనక్కి తీసుకొంటూ నువ్వు చేసే పని బాగాలేదు అంటుంది. కాని కుంజర సింహుడు "నీవు నాకు పూజ్యురాలవు. నా శ్రద్ధకు నిలయం. నేనేమీ చేయరాని పని చేయలేదు"[2] అంటాడు. అందుకు కుముద్ గద్గద స్వరంతో "ఇలాంటి పని మీరెన్నడూ చేయవద్దు. నేను దేవీ అవతారం కాను. సాధారణ స్త్రీని, దుర్గామాతకు నిజమైన పూజారిణిని. నన్ను నీవు అవతారంగా తలంచవద్దు"[3] అని చెప్తుంది.

అలీ మర్దాన్ కుముద్ విరాటా దుర్గంలో ఉన్న విషయం తెలుసుకొని ఆమెను అపహరించుకు పోవాలని పెద్ద సేనతో వస్తాడు. ఈ విషయం దేవీ సింహునకు తెలిసి ఆమెను రక్షించాలని కొంత సేనతో బయలుదేరుతాడు. ఆమెను కంటికి రెప్పలా కాపాడుతున్న దాంగీ సేనలు

1. విరాటాకీ పద్మినీ – బృం.లాల్ వర్మ., పు: 227.
2. పైదే., పు: 227.
3. పైదే., పు: 228.

అలీ మర్దాన్ సేనను ఎదుర్కోలేక జౌహారు వ్రతాన్ని అవలంబించాలని నిశ్చయించుకొంటారు. అప్పుడు కుంజర సింహుడు ఆ ప్రస్తావనను వ్యతిరేకిస్తాడు. అందుకు కారణం అతనికి కుముద్ పై గల వ్యామోహమే. అందరూ జౌహారు వ్రతం ఆచరిస్తే కుముద్ తన కళ్ళ ముందే భస్మమౌతుంది. ఆమె మరణం తను చూడలేడు. ఇలాంటి వ్యక్తిని పొగడుతూ 'శశిభూషణ్ సింహాళ్' గారు "కుంజర సింహుడు గంభీరమైన ఆలోచన గలవాడు. పరంపరాగతమైన మూఢ నమ్మకాలను, సంప్రదాయాలను నమ్మేవాడు కాదు"[1] అని రాశారు. కాని సింహాళ్ అభిప్రాయం సమంజసం కాదని తోస్తుంది. 'జౌహారు'ను వ్యతిరేకించినంత మాత్రాన మూఢ నమ్మకాలను, సాంప్రదాయాలను నమ్మేవాడు కాదు అని చెప్పలేము. కుముద్ పై వల్లమాలిన ప్రేమచే వ్యతిరేకించాడు. కుంజర సింహుడు భావుకుడు. భావుకుడయినవాడు దీర్ఘంగా ఆలోచించడు. ఇతడు చేసిన పనులన్నీ భావుకతలోనే చేశాడని చెప్పవచ్చు.

కుంజర సింహుడు ప్రతీకార వాంఛతో, దాంగీ వాసులకు రక్షణగా వచ్చిన దేవీ సింహునితో యుద్ధం చేస్తాడు. అంతే కాకుండా అతడు విరాట రాజు 'సబదర సింహు'నితో దేవీ సింహుడు ప్రతీకార వాంఛతో వచ్చి ఉన్నాడని అబద్ధం చెప్తాడు. ఇతడు చేసిన మోసం చేతనే విరాట పతనమౌతుంది. అలీ మర్దాన్ సేన విరాట దుర్గాన్ని ధ్వంసం చేస్తుంది. దీని ద్వారా అతడెంతటి బాధ్యతా రహితుడో స్పష్టంగా తెలుస్తుంది.

దేవీ సింహుని చేతిలో కుంజర సింహుని మరణాన్ని వర్మగారు

---

1. విరాటాకీ పద్మినీ — బృం. లాల్ వర్మ., పృ: 151.

నాటకీయంగా చిత్రించారు. ఒకవైపు యుద్ధం జరుగుతున్నప్పుడు కుంజర సింహుడు చివరి సారిగా 'కుముద్'ను చూడాలని వెళ్తాడు. కుంజర సింహుడు వెళ్ళేందుకు ముందే కుముద్ తండ్రి ఆమెను అక్కడ నుండి తప్పించి సురక్షిత స్థానానికి తీసుకు పోవాలని వస్తాడు. కాని కుముద్‌కు పరిస్థితి అర్థమౌతుంది. తనకోసం ఎంతో మంది వీరులు ఆత్మ బలిదానం చేస్తుంటే, పిరికిదానిలా తప్పించుకొని వెళ్ళి ఎవరికోసం బ్రతకాలి? అని అనుకొంటుంది. నేను ఏ భూమాత ఒడిలో పుట్టి పెరిగానో అది నాశనం అవుతుంటే, నేను తప్పించుకొని పోయి శ్మశానంగా మారిన ఈ ప్రాంతం చూడలేను. దుర్గామాత ఆజ్ఞ అయింది. మీరు వెళ్ళండి అని తండ్రిని పంపేస్తుంది. ఆ సమయంలో కుంజర సింహుడు అచ్చటికి వస్తాడు. అతడు కుముద్‌తో అందరూ జౌహర్ వ్రతాన్ని ఆచరిస్తున్నారు. నీవు నాతో వస్తే నిన్ను సురక్షిత స్థానానికి చేరుస్తానని చెప్తాడు. అందుకు కుముద్ "మంచిది నేను ఎవరికీ కనిపించని 'ఆ వైపు' నుండి వస్తాను. నీవు జౌహార్ జరిగే 'ఇంకో వైపు' నుండి రా! మనం చివర్లో 'అక్కడ' కలుసుకొంటాము"[1] అని చెప్తూ తన వళ్ళో దాచుకున్న అడవి పూల మాలను అతని మెళ్ళో వేస్తుంది. కుంజర సింహుడు ఆమెను గాఢంగా హత్తుకొంటాడు. ఆమెకు దుఃఖం ఆగలేదు. ఆమె తెప్పరిల్లి, ఇంతకన్నా నా దగ్గర ఏమీ లేదు అని చెప్పి ఒక వైపు వెళుతూ ఉంటుంది. కుంజర సింహుడు ఇంకో వైపు వెళుతూ ఉంటాడు. ఆ సమయంలో 'దేవీ సింహుడు అక్కడికి వస్తాడు. కుంజర సింహుడు దేవీ సింహుని చూచి ప్రతీకార

1. విరాటాకీ పద్మిని – బృం. లాల్ వర్మ., పు.: 362.

వాంఛతో అతనిపై కత్తి దూస్తాడు. ఇరువ్వురు భయంకరంగా పోరాడు తుంటారు. ఆ సమయంలో అలీమర్దాన్ కుముద్ ను తరముడం చూచి ఒక్క క్షణం కుంజర సింహుడు నిశ్చేష్టుడు కాగా దేవీసింహుడు కుంజర- సింహుని తల నరుకుతాడు. కుముద్ కూడ అలీమర్దాన్ బారినుండి తప్పించుకొని బేత్వానదిలో దూకి మరణిస్తుంది.

ఇలా కుంజర సింహుడు కుముద్ కోసం తపించి తన రాజ్యాన్ని వదులుకొని వచ్చినా అతనికి, కుముద్ కు మరణం తప్పలేదు. జీవితంలో అన్నీ సాధించ గలిగే శక్తి ఉండీ సమయానికి సరైన నిర్ణయాలు తీసుకోలేక తన జీవితాన్ని నాశనం చేసుకుంటాడు. చివరకు తన ప్రియురాలిని కూడ రక్షించలేక పోతాడు. వర్మగారు కుంజర సింహుణ్ని అసమర్థ నాయకుడిగా చేశా రనడంలో సందేహం లేదు. అతని కథ విన్నవారికి అతని పట్ల జాలి కలుగు తుంది. అంత మాత్రం చేత అతని చర్యలను ఎవరూ సమర్థించరు. దాసీ పుత్రుడైన తాను హీనుడు, అల్పుడనే ఆత్మన్యూనతా భావం కుంజర సింహుని మాటల్లోను, చేతల్లోనూ అడుగడుగునా కనబడుతుంది.

**4.2.4.3. దేవీ సింహుడు:** దేవీసింహుడు బుందేల్ ఖండ్ కు చెందిన ఒక బీద ఠాకూర్ వంశస్థుడు. అతడు గొప్ప వీరుడు. అతనికి వివాహం నిశ్చయ మౌతుంది. పెండ్లి కుమారుని వేషంలో పెండ్లి మంటపానికి అతడు పల్లకిలో వెళ్తూ ఉంటాడు. ఊరిబయట ఒక విశాలమైన దారివెంట పల్లకి వెళ్తూ ఉంటుంది. ఇంతలో దలీప నగర రాజు నాయక సింహుడు, పాలర్ గ్రామం దగ్గరలో ఉన్న 'గఢ్ మవ్వు' తీర్థంలో స్నానం చేసి వెళ్తూ ఉంటాడు. అతడి

దగ్గర కొద్ది సేన మాత్రం ఉంటుంది. అతడి విరోధి అయిన అలీ మర్దాన్ సేనల్లో కొంత మంది మాళవ్రులపై దండెత్తి వెళతారు. కాని మాళవ్రులతో పారిపోయి వస్తూ దారిలో నాయక సింహుని చూచి అతన్ని చంపడానికి ప్రయత్నిస్తారు. నాయక సింహుడు వృద్ధుడు. అనారోగ్య వంతుడు. విధిలేక కొద్ది మందే అయినా అతని అనుచరులు కాలపీ సైనికుల్ని ఎదిరిస్తారు పోరు కొంత సేపు సాగింది. నాయక సింహుడు యుద్ధంలో బలహీన పడి తనకు చావు తప్పదనుకుంటూ ఉండగా, ప్రక్కనే పల్లకీలో వెళుతున్న దేవీ సింహుడు ఈ సంఘటన చూసి రాజును రక్షించడానికి వస్తాడు. "పెండ్లి దుస్తులు కిరీటం ధరించిన ఒక పెండ్లి కొడుకు, కత్తి ఝుళిపిస్తూ ప్రళయకాల రుద్రుని వలె వచ్చి కాలపీ సేనపై పడ్తాడు."[1] "ఆ యుద్ధంలో అతని పెండ్లి దుస్తులు చీలికలు పేలికలు అవుతాయి. కిరీటం ముక్కలు ముక్కలవుతుంది. శరీరమంతా రక్తం కారుతూ ఉంటుంది. అయినప్పటికి అతనిలో ఏ మాత్రం అధైర్యం లేదు. అంటే అతను ఉక్కు మనిషని చెప్పవచ్చు"[2] అని వర్ణించారు వర్మగారు.

దేవీ సింహుడు ఉన్నట్టుండి వచ్చి అడ్డు పడే సరికి కాలపీ సేనలు బెంబేలెత్తి పారిపోతాయి. తనను రక్షించిన దేవీసింహుని మెచ్చుకొని నాయక సింహుడు "దేవీ సింహా నేను నీకు గొప్ప సత్కారం చేస్తాను. నీ పెండ్లి ముహూర్త సమయం ఆసన్నమయింది. పెళ్లి చేసుకో.

---

1. విరాటా కీ పద్మినీ – బృం. లాల్ వర్మ., పు: 29.

2. పైదే., పు: 30.

తరువాత మరచి పోకుండా దలీప నగరానికి రా"[1] అని చెప్పగా దేవీసింహుడు "రాజా! నా పెండ్లి యుద్ధక్షేత్రం లోనే జరిగి పోయింది. ఇక మీ పాద పద్మాల చెంత నా ప్రాణం పోతే నా జీవితం ధన్యమయినట్లు భావిస్తాను"[2] అంటూ మూర్ఛ పోతాడు.

తర్వాత మంత్రి జనార్ధన శర్మ, లోచన సింహుడు తదితరు లందరు వచ్చి రాజును, దేవీ సింహుణ్ని దలీప నగరానికి తీసుకు పోతారు. అక్కడ కొద్ది రోజులు చికిత్స పొందిన తర్వాత దేవీసింహుడు స్వస్థత పొంది అక్కడే స్థిర పడతాడు. తన పెండ్లి విషయమే మరచి పోతాడు.

నాయక సింహుని తర్వాత అతని దాసీ పుత్రుడు కుంజర-సింహుడే దలీప నగరానికి వారసుడు కావాలి. కాని కుంజర సింహుని కంటే దేవీ సింహుడే అర్హుడని తలచి మంత్రి జనార్ధన శర్మ, దేవీసింహుని రాజుగా ప్రకటిస్తాడు. కుంజర సింహుడు తొలుత ప్రతిఘటించినా, రాజ్యకాంక్ష అంతగా లేని వాడు కాబట్టి, రాజ్యం వదులు కొని తన ప్రియురాలైన 'కుముద్'ను వెతుకుతూ వెళ్ళి పోతాడు.

నాయక సింహుని తర్వాత దేవీసింహుడు దలీప్ నగర రాజై సమర్థ వంతంగా రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉంటాడు. దేవీసింహుడు రాజు కావడం ఇష్టం లేని చిన్నరాణి అతనిపైన, మంత్రి జనార్దన శర్మ పైన ప్రతీకారం తీర్చుకోవాలను కొని విప్లవం లేవదీస్తుంది. కాని ఆమె రహస్యం బయట పడి ఆమెను సైనికులు బంధిస్తారు. దేవీ సింహుడు

---

1. విరాటాకీ పద్మినీ - బృం. లాల్ వర్మ, పు: 30.
2. పైదే, పు: 30.

ఆదర్శ పురుషుడు. నాయక సింహుని రాజ్య సింహాసనం పొందడానికి అతడు ఏలాంటి కుట్ర చేయడు. తన వల్ల దళిప నగరం పరుల పాలు కాకుండా ఉంటుందని జనార్ధన శర్మ చెప్పినందువల్ల, నాయక సింహుని అనుమతి పొందే దేవీ సింహుడు అధికారాన్ని చేపట్టాడు. అందువల్ల బంధితురాలైన చిన్నరాణిని చెరసాలలో ఉంచడు. ఇది అతని దయార్ధ్ర హృదయానికి మచ్చుతునక. జనార్ధన శర్మ అతనితో "చిన్న రాణికి నాపై చాల కోపం ఉంది. నన్ను చంపుతానని శపథం చేసింది" అని చెప్పగా దేవీ సింహుడు, చిన్నరాణి మాటలు పెద్దగా పట్టించుకో వద్దని మంత్రికి చెప్తూ "ఇలాంటి పిచ్చివారి మాటలు నేను లెక్క చెయ్యను. కాని ఆమె రాజమాత. గౌరవింపదగ్గ స్త్రీ. ఆమెకు ఏటువంటి కష్టం కలుగకుండా చూచుకొనే బాధ్యత మన మీద ఉంది"[2] అని చెప్తాడు. ఈ సంఘటన వల్ల దేవీ సింహుడు ఎంతో దూరదృష్టి గల రాజకీయ వేత్త అని అర్థమవుతుంది. శత్రువైన చిన్నరాణిని దయార్ద్ర హృదయంతో చూచేందు వల్ల రాజకీయంగా ఎంతో లబ్ధి పొందుతాడు. అందుకే చిన్నరాణిపై దయ చూపించాడు. ఇదే వ్యక్తి తనకు నిశ్చయమై తప్పిపోయిన గోమతి విషయంలో మాత్రం నిర్దయుడుగ వ్యవహరిస్తాడు. అతనికి గోమతి అనే స్త్రీతో జరగవలసిన వివాహం నాయక సింహుని రక్షించనందు వల్ల విరిచి పోయింది. ఈ విషయాన్ని పూర్తిగా మర్చిపోయినట్లు

---

1. విరాటా కీ పద్మినీ — బృం. లాల్ వర్మ, పు: 123.

2. పైదే, పు: 123.

నటిస్తాడు. నరపతి గుర్తు చేయగా "ఇలాంటి చిన్న చిన్న సంఘటనలన్నీ నాకు గుర్తుండవు. చాల రోజులయింది"[1] అని చెప్తాడు. దీనికి నరపతి ఆ అమ్మాయి ప్రస్తుతం నా దగ్గర ఉంది. మీరు ఒప్పుకుంటే వివాహం జరిపిస్తానని చెప్తాడు. దానికి దేవీ సింహుడు "ఇప్పుడా! ప్రస్తుతం నేను యుద్ధం చేయడంలోనూ, ప్రజలను రక్షించడంలోనూ మునిగి ఉన్నాను"[2] అంటూ, ఇంకా "నేను భోగలాలసుడను కాను. ప్రస్తుతం దలీప్ నగరం క్లిష్ట పరిస్థితుల్లో ఉంది. నా మనస్సు ఎప్పుడూ యుద్ధాన్ని గురించే యోచిస్తున్నది. అదే ఇప్పుడు మాకు రక్ష. ఎప్పుడైనా అవకాశం వస్తే నీవు చెప్పిన విషయాలను గురించి యోచిస్తాను"[3] అని చెప్తాడు. నరపతి ఇంకా చాలా విషయాలు జ్ఞప్తికి తేగా, చివరకు దేవీసింహుడు "ఆ అమ్మాయి ఇష్టపడితే పంపించు. ఆ అమ్మాయి ఇక్కడికి వస్తుంది. కాని ప్రస్తుతం నేను వివాహం చేసుకొనే సమయం కాదు"[4] అని చెప్తాడు. ఆ అమ్మాయి ఇక్కడకు రావడానికి ఇష్టపడక పోతే, "అవకాశం వచ్చినప్పుడు, అంటే యుద్ధం పరిసమాప్తి అయినప్పుడు, వేరే ఎటువంటి ఆటంకాలు రాని పక్షంలో నేనే స్వయంగా వచ్చి చూస్తాను. ఏది ముచిదయితే అది తప్పక చేస్తాను"[5] అని చెప్తాడు. ఈ విధంగా రాజ్య రక్షణలో నిమగ్నమై తన భార్య కావలసిన వ్యక్తిని నిర్లక్ష్యం చేస్తాడు.

---

1. విరాటాకీ పద్మిని - బ్రిం. లాల్ వర్మ, పు: 214.
2. పైదే., పు: 214.
3. పైదే., పు: 216.
4. పైదే., పు: 217.
5. పైదే., పు: 217.

చివరకు గోమతి మరణించిందని తెలిసి ఒక గాఢమైన నిట్టూర్పు వదలుతాడు.

దేవీ సింహుడు, ఆనాటి ప్రజల్లో ప్రబలంగా ఉన్న ధార్మిక పద్ధతుల్ని అవలంబిస్తాడు. కావున కుముద్ ను దుర్గాదేవి అవతారంగా భావించి ఆమెను రక్షించేందుకు విరాటా దుర్గానికి అలీమర్దాన్ సేనపై యుద్ధానికి వెళతాడు. కాని కుముద్ మరణించిన తర్వాత అలీమర్దాన్ సంధి కోరితే మంచితనంతో సమ్మతించి, యుద్ధం మాని సంధి చేసుకొని వెళ్ళిపోతాడు.

ఒక్క గోమతి విషయం తప్పిస్తే తక్కిన విషయాల్లో వర్మగారు దేవీ సింహుని గొప్ప వ్యక్తిగా చిత్రీకరించారు. బుందేల్‌ఖండ్ వీరుడు, బీదవాడైన దేవీ సింహుని దలీపనగర రాజును చేసి శౌర్యం, పరాక్రమం, ధర్మపరాయణత్వం, పురుషత్వం, బ్రహ్మచర్యం, పట్టుదల, రాజ్యసంరక్షణాకాంక్ష, వీరత్వం మొదలైన సద్గుణాలన్నీ నింపి ఒక విశిష్ట వ్యక్తిగా మలిచారు.

**4.2.4.4 అలీమర్దాన్ :** అలీమర్దాన్ 'కాలపీ' సుబేదారు. అతడు కాముకుడు. కాని సమర్థుడైన రాజకీయ వేత్త. దేవీ అవతారంగా భావించే 'కుముద్'ను ఎలాగైనా అపహరించి, వివాహం చేసుకొంటే గానీ హిందూ ప్రజలకు బుద్ధి రాదని అతని నమ్మకం. కానీ బలవంతంగా ఆమెను అపహరించడానికి, వివాహమాడడానికి ఇష్టపడడు. కాలక్రమంగా 'కుముద్' దేవీ అవతారం కాదని ప్రజల్లో విశ్వాసాన్ని కలిగించిన

తర్వాత ఆమెను తనదానిగా చేసుకోవాలనుకుంటాడు. అప్పటి పరిస్థితులను బట్టి హిందూ రాజులతో శత్రుత్వం వహిస్తే అంత మంచిది కాదని అనుకునే వాడు. వీలైనంత వరకు స్వలాభాపేక్షతో నొప్పింపక, తానొవ్వక తప్పించుకొని తిరగాలనే ప్రవృత్తికి చెందుతాడు అలీ మర్దాన్.

కుముద్‌ను దేవీ అవతారంగా భావించి పాలర్ గ్రామ ప్రజలు ఆమెను ఆరాధిస్తున్న తరుణంలో అలీ మర్దాన్ సైనికులిద్దరు ఆమెను చూడాలని 'పాలర్' గ్రామం చేరుకొంటారు. అదే సమయంలో 'కుముద్'ను దర్శించి వస్తున్న కుంజర సింహుడు, లోచన సింహుడు ఆ మహమ్మదీయ సైనికులతో గొడవ పెట్టుకొంటారు. ఈ గొడవ విని గ్రామ ప్రజలు దలీప్ రాజ్య సైనికులు అక్కడికి వస్తారు. కొంత మంది ముస్లిం సైనికులు కూడా వస్తారు. వారికి, వీరికి మధ్య ఘర్షణ జరుగుతుంది. ఆ ఘర్షణలో అనేక మందికి దెబ్బలు తగులుతాయి. లోచన సింహుడు ఒక ముస్లిం సైనికుణ్ణి చంపేస్తాడు. ఈ విషయం అలీ మర్దాన్‌కు తెలిసి, ఎక్కడ పాలర్ పై విరుచుకు పడతాడో అని భయపడి, కుముద్ ఇక్కడే ఉంటే ఆమెకు రక్షణ ఉండదని తలచి కుముద్ తండ్రి ఆమెను రహస్యంగా 'విరాటా దుర్గం' లో దాస్తాడు.

దలీప్ నగర రాజైన నాయక సింహుడు 'పాలర్' దగ్గర ఉండే 'గఢమవ్రా' తీర్థంలో స్నానం చేసి తిరిగి వెళ్ళేటప్పుడు 'కాలపీ' వద్ద అలీ మర్దాన్ సేనలు అతనిపై దాడి చేస్తాయి. కానీ బుందేల్‌ఖండ్ వీరుడైన దేవీ సింహుడు నాయక సింహుని రక్షిస్తాడు. క్రమంగా దేవీసింహుడు నాయక సింహునికీ, మంత్రి జనార్దన శర్మకు అభిమాన

పాత్రుడౌతాడు. దళిప్ నగర వారసత్వానికి ... నాయకసింహుని తర్వాత చిన్నరాణి, పెద్దరాణి పోటీలు పడ్డారు. మంత్రి జనార్ధన శర్మ దేవీసింహుని సింహాసనాధీశుని చేస్తాడు. చిన్నరాణికి ఇది ఇష్టం లేదు. అలీమర్దాన్‌తో చేతులు కలుపుతుంది. కుంజర సింహుణ్ణి కూడా అలీమర్దాన్‌తో కలవమనీ, రాజ్యం సంపాదించమనీ ప్రోత్సహిస్తుంది. కాని కుముద్ పై ప్రేమతో రాజ్యకాంక్ష అంతగాలేని కుంజర సింహుడు చిన్నరాణి సూచనను తిరస్కరించి వెళ్ళిపోతాడు. ఈలోగా అలీమర్దాన్ 'కుముద్' ఆచూకీ తెలుసుకోవాలని ప్రయత్నిస్తాడు. ఆమె విరాటా దుర్గంలో ఏదో ఒక చోట దాగి ఉందని తెలుస్తుంది. ఆమెను అన్వేషించేందుకు చిన్నరాణి సలహాదారు రామ్‌దయాళ్ అలీమర్దాన్‌కి సాయపడుతాడు. రామ్ దయాళ్‌తో అలీమర్దాన్, కుముద్ ఆచూకీ ఎలాగైనా కనుక్కోమని చెప్పే సందర్భంలో అతనితో ఇలానవ్వుతూ చెప్తాడు. "రామదయాళూ! దేవీ అవతారంగా భావించే ఆ 'కుముద్' ను పట్టితెచ్చి నా మహల్లో ఉంచుతాను. బహుశ పాలర్ కంటె ఇక్కడ ఆమెకు గుర్తింపు తక్కువ ఉంటుంది. చాలు! ఇదే ఆమెకు తగిన శిక్ష. కాని క్రమక్రమంగా పాలర్ కంటే ఇక్కడే హాయిగా ఉందని ఆమె తెలుసుకొంటుంది"[1] అంటే విరాట దుర్గంలో దేవీ అవతారంగా పూజలందుకొనే ఆమె, ఇక్కడ సాధారణ స్త్రీగా ఉన్నా ఈ జీవితమే ఆమెకు నచ్చుతుందని అలీమర్దాన్ ఉద్దేశం.

విరాట దుర్గంలో లోచన సింహుడు ఒక ముస్లిం సైనికుని

1. విరాటాకీ పద్మిని – బృం. లాల్ వర్మ., పు: 96.

చంపిన తర్వాత, కొంత మంది అలీమర్దాన్ సైనికులు ఉద్రేక పూరితులై పాలర్ గ్రామంలోని హిందూ మందిరాలను ధ్వంసం చేస్తారు. ఈ విషయం అలీమర్దాన్‌కు నచ్చదు. ఎంతసేపూ కుముద్‌ని అపహరించాలనుకుంటాడే గాని హిందూ మందిరాలను నాశనం చెయ్యాలనుకోడు. ఒకసారి అలీమర్దాన్ తన సేనాధిపతి కాలేఖాన్‌తో "మీరు దండయాత్ర ఉధృతం చేసినా, విరాటా దుర్గం లోని దేవీ మందిరాన్ని పహారా కాస్తూ రక్షించాలి. ఏ పరిస్థితుల్లోనూ మందిరం లోని ఒక్క ఇటుక కూడా క్రిందకు రాల కూడదు. అట్లా రాలితే, ఎవడైతే దానికి కారకుడో అతని తల మొండెం నుంచి వేరు చేస్తాను"[1] అంటాడు. దీనిని బట్టి అప్పటి నాయకులకు, వారు హిందువులైనా, ముస్లిములైనా మందిరాలను పడగొట్టడం ఇష్టం ఉండేది కాదని, వశం తప్పి రెచ్చిపోయిన ప్రజలే అలా పడగొట్టే వారని తెలుస్తుంది. అలీమర్దాన్ గొప్ప రాజకీయ చతురుడు. తన ప్రాంతం లోని హిందూ మందిరాలను పడగొడ్తే, భారత దేశం లోని హిందువులంతా ఒక్కటైతే తన మనుగడకే ప్రమాదం అని అతనికి తెలుసు. హిందూ రాజులతో విరోధం పెట్టుకోవడం అతనికి ఇష్టం లేదు. అవసరమైనంత వరకు తన పబ్బం గడుపుకొని పోయే రకం అలీమర్దాన్ అని తెలుస్తుంది.

అలీమర్దాన్ కుముద్‌ను అపహరించేందుకు ఎ(ప్ర)ంగా ప్రయత్నిస్తున్నాడని దాంగీ సేనలకు తెలుస్తుంది. ఆమెకు కాపలా ఎక్కువ చేసి కంటికి రెప్పలా కాపాడుతుంటారు. కుముద్ స్నేహితురాలు గోమతి

---

విరాటాకీ పద్మినీ – బృం.లాల్ వర్మ., పు: 93.

అలీ మర్దాన్ గురించి ఇలా చెబుతుంది. "ఖాలపీ ముసల్మాన్ సుబేదారు విరాటా దగ్గరలోనే ఉండి తన యాత్రను ప్రారంభించాడు. మందిరాలను విధ్వంసం చెయ్యడమే అతని ఉద్దేశం. అతనికి మాపై గల కామ వాంఛ గురించి చెపితే నా నాలుక ముక్కలు ముక్కలుగా అవుతుంది."[1] ఇదంతా 'కుముద్' మౌనంగా వింటుంది. ఆమెను దేవీ అవతారంగా భావించిన గోమతి, కుముద్ నోట నుంచి ఏమి పలికినా అది జరుగుతుందనే గుడ్డి నమ్మకంతో "దేవీ! ఈరోజు నీకిష్టం లేకపోయినా నాకు వరం ఇచ్చి తీరాలి.

మర్దాన్ ఇలాంటి అనిశ్చిత స్థితిలో రాజ్యం పొందినట్లయితే నీ మందిరం గతి ఏమి? ధర్మం ఏమవుతుంది? ఇతరులెవ్వరూ నీ మందిరాన్ని రక్షించేదానికి కనీసం వేలైనా చూపరు. విరాట నగరంలో అలీ మర్దాన్‌ను అణచే శక్తిలేదు. అందువల్ల తల్లీ! నీవు పూనుకొని విరాట నగరాన్ని రక్షించు"[2] అంటూ భోరున ఏడుస్తుంది. అప్పుడు కుముద్ "నీవు చెప్పినట్లుగా తప్పకుండా దుర్గామాతను ప్రార్థిస్తాను. దుర్గామాత గుడి నాశనం కాకుండా దుర్గామాతే రక్షించుకొంటుంది"[3] అంటుంది.

ఈ రకంగా మందిరాలను నాశనం చేస్తాడని అలీమర్దాన్ గురించి విరాట, పాలర్ ప్రజలు అనుకొంటారు. కానీ అలీమర్దాన్‌కు హిందూ మందిరాలు ధ్వంసం చెయ్యడం ఇష్టంలేదు. పాలర్‌లో అలీమర్దాన్ సేన హిందూ మందిరాలను ధ్వంసం చేసినప్పుడు వారిపై అలీమర్దాన్‌కు

1. విరాటాకీ పద్మినీ — బృం.లాల్ వర్మ., పు: 89.
2. పైదే., పు: 89, 90.
3. పైదే., పు: 90.

క్రోపం కూడ వచ్చింది. జరిగింది పొరబాటని, 'బక్' నగర రాజుకు విన్నపం కూడా పంప్తాడు. "మీ ప్రజలపైన ఎటువంటి అవినీతి కార్యాలు చేయను. మందిరాలను విధ్వంసం చేయను. దలిప రాజును శిక్షించడం, అతన్ని పదవీచ్యుతున్ని చేసి నాశనం చేయడమే నా ఉద్దేశం"[1] అంటాడు. కాని కుముద్‌ను అపహరించాలనే విషయం దాస్తాడు. ఇక్కడ అలీమర్దాన్ రాజకీయ చతురత వ్యక్తమవుతుంది. కేవలం తన కాముక తృప్తికోసం సీతను అపహరించిన రావణాసురుని వలె, కుముద్‌ను అపహరించడానికి వచ్చిన కాముకుడు అలీమర్దాన్. అందుకే తనకు చిక్కకుండా కుముద్ మరణిస్తే, ఆమె మరణానంతరం విరాట నగరాన్ని జయించాలనే కోరిక అతనికి నశిస్తుంది. అతని సైనికులు సింహుని సైనికులతో యుద్ధం చేసేందుకు సన్నద్ధమయినప్పుడు "యుద్ధం వద్దు, నిలపండి. దేవీ సింహ మహారాజుతో మేము సంధి చేసుకొన్నాము"[2] అనిచెపి దేవీ సింహునితో "మీరు మీ సైనికులను శాంతింప చేయండి. అనవసరంగా రక్తపాతం చేయడం మంచిదికాదు"[3] అని చెప్తాడు. ఇలా దేవీ సింహునితో సంధి చేసుకొని, తన సైన్యంతో తిరిగి 'కాలపీ' వెళ్ళి పోతాడు.

ఈ రకంగా వర్మగారు తన 'విరాటాకీ పద్మినీ' లో అలీమర్దాన్ పాత్రను సమర్థవంతంగా పోషించారు. ఈ పాత్ర ద్వారా తరతరాలుగా

1. విరాటాకీ పద్మిని – బృం. లాల్ వర్మ., పు: 91.
2. పైదే., పు: 366.
3. పైదే., పు: 366.

వస్తున్న హిందూ, మహమ్మదీయుల వైరం కళ్ళకు కట్టినట్లు కనబడుతుంది. అలీమర్దాన్ పాత్రద్వారా హిందూ, ముస్లింలు సామరస్యంతో జీవిస్తేనే దేశం సుభిక్షంగా ఉంటుందనే అభిప్రాయాన్ని పరోక్షంగా రచయిత వ్యక్తం చేస్తారు. కుముద్‌ను చెరపట్టాలనే ఒకే ఒక కాముక ప్రవృత్తి తప్ప, మరే దురుద్దేశం అలీమర్దాన్‌కి లేదని తెలుస్తుంది. చివరకు ఆమెను పొందలేక నిరాశా నిస్పృహలతో వెళ్ళిపోతాడు.

**4.2.5. టూటే కాంటే :**

**4.2.5.1. నూర్‌బాయి :** వర్మగారు రచించిన 'టూటే కాంటే' నవలలోని కథానాయిక నూర్‌బాయి. ఈమె ముసల్మాను జాతికి చెందిన స్త్రీ. ఆమె గొప్ప గాయని, నర్తకి. అందగత్తె. ఆమె ఢిల్లీని పరిపాలించే మహమ్మద్‌షా ప్రధాన అధికారి అయిన 'సాదత్‌ఖాన్' అనే సామంత పాదుషా ఆస్థానంలో ఉండేది. సాదత్ ఖాన్ ఆమెను అధికంగా ప్రేమించేవాడు. ఆమె అడక్కుండానే అధికంగా ధనాన్ని, బహుమానంగా నగల్ని పంపుతూ తన ప్రేమను చాటుకునేవాడు. కాని నూర్‌బాయికి అతని ప్రేమ అన్నా, ధనం అన్నా ఇష్టం ఉండేది కాదు. ఢిల్లీ పాదుషా అయిన మహమ్మద్‌షా దర్బారులో తన సంగీతం వినిపించాలనీ, నాట్యం ప్రదర్శించాలనీ ఉవ్విళ్ళూరుతుండేది. ఆమె ఫారసీ గజల్‌లు, సూరదాస్, నందదాస్, రసఖాన్ మొదలైన వారి కృష్ణ భక్తి గీతాలను చాల మధురంగా పాడేది.

కాని నవాబు కాముక ప్రవృత్తి ఎరిగి ఉన్న సాదత్ ఖాన్ ఆమెను అతనివద్దకు పంపేందుకు ఇష్టపడేవాడు కాదు. కానీ ఢిల్లీ దర్బారులో

నాట్యం చేయాలని నూర్‌బాయి పట్టుపట్టే సరికి ; ఆమె కోరిక కాదనలేక ఒకసారి పాదూషా ఎదుట నాట్యప్రదర్శన ఏర్పాటు చేస్తాడు. ఆమె కళా నైపుణ్యాన్ని చూచి పాదూషా ఆకర్షితుడయ్యాడు. తన దర్బారులో నాట్యం చేయడానికి ఆస్థాన నర్తకిగా ఎన్నుకొంటాడు. ఆమె సాదత్‌ఖాన్‌ను వదలి పెట్టి పాదూషా దగ్గరికి వెళ్ళిపోతుంది. తన్ను వదలిపెట్టి వెళ్ళి పోయినందు వల్ల సాదత్ ఖాన్‌కి మహమ్మద్ షాపై కోపం వస్తుంది. ఇద్దరూ విరోధులౌతారు. మహమ్మద్‌షాను దెబ్బతియ్యాలని కుట్రపన్ని అతడు నాదిర్‌షాను ఢిల్లీకి ఆహ్వానిస్తాడు. నాదిర్‌షా 'ఈరాన్' దేశీయుడు. అప్పటి ఢిల్లీ పాదుషా మహమ్మద్‌షా కంటే చాల బలవంతుడు. సాదత్ ఖాన్ ఆహ్వానం అందుకొని నాదిర్‌షా ఢిల్లీ చేరుతాడు.

విధిలేక ఢిల్లీ పాదుషా అతనికి స్వాగతం పలికి, నాట్యం ఏర్పాటు చేస్తాడు. నూర్‌బాయి అతని ఎదుట నాట్యం చేస్తుంది. నాదిర్‌షా ఆమె నాట్యం, అందం చూసి ముగ్ధుడౌతాడు. అతడు ఆమెను తనవెంట 'ఈరాన్' తీసుకు వెళ్ళాలనే కోరికతో, నూర్‌బాయితో పాటు 8 కోట్ల రూపాయలు కప్పం చెల్లించవలసిందని కూడా నాదిర్‌షా, మహమ్మద్‌షాను బలవంతం చేస్తాడు. మహమ్మద్ షా నూర్‌బాయిని పంపేందుకు ఇష్ట పడినా, ధనాన్ని ఇచ్చేందుకు అంగీకరించడు. దీనిపై కోపించిన నాదిర్‌షా ఢిల్లీని లూటీ చేయమని తన సైనికులకు ఆజ్ఞాపించాడు. ఢిల్లీలో భయంకర రక్తపాతం జరుగుతుంది. నూర్‌బాయికి నాదిర్‌షాతో కూడా ఈరాన్' వెళ్ళడం ఇష్టంలేదు. ఆమె నాదిర్‌షాతో వెళ్తే ఒక వేశ్యలాగ

బ్రతకాల్సిందే. సామంతుల, చక్రవర్తుల అత్యాచారాన్ని ఆమె కళ్ళారా చూచింది. ఆమెకు మహమ్మదీయ చక్రవర్తులంటే అసహ్యం. కాబట్టి ఒక రోజు రాత్రి ఆమె మోహన్ అనే జాట్ జాతికి చెందిన సైనికుని సహాయం కోటనుండి తప్పించుకొని పారిపోతుంది. చివరకు నాదిర్‌షా ఢిల్లీ నగరాన్ని విచ్చలవిడిగా కొల్లగొట్టి, వీధులన్నింటిని శవాలతోనింపి, నాలుగు వేల నాట్య కత్తెలను, నూరుకోట్ల విలువగల సంపదను దోచుకొని 'ఈరాన్' కు వెళ్ళిపోతాడు. నూర్‌బాయి జాడతెలియక, ఆమె వియోగాన్ని భరించలేక సాదత్‌ఖాన్ ఆత్మహత్య చేసుకుంటాడు.

నూర్‌బాయి, మోహన్‌లాల్‌లు అనేక కష్టాలు ఎదుర్కొంటూ మధురదగ్గర ఒక గ్రామానికి చేరుకుంటారు. నూర్‌బాయికి తనగత చరిత్ర అంటే అసహ్యం వేసింది. ఆమెకు జ్ఞానోదయం అవుతుంది. ఆమె బృందావన్ చేరి కృష్ణ భక్తిగేయాలు పాడుకొంటూ కృష్ణ భక్తురాలిగ జీవితం గడిపేయాలని నిశ్చయించుకొంటుంది. మోహన్‌లాల్ భార్య రోసీ పరమ గయ్యాళి. ఆమె ఆగడాలు భరించలేక మోహన్ ఆమెను వదిలేయాలను కుంటాడు. అందుకే నూర్‌బాయికి సహాయం చేశాడు. ఇలా మోహన్, నూర్‌బాయిలు బృందావన్‌కి వెళ్తూ దారిలో మధుర దగ్గర ఉన్న ఒక గ్రామంలో ఒక ఇంటిలో భార్యాభర్తలమని చెప్పుకొని నివసించ సాగారు. ఆ ఇంటి యజమాని పేరు చింతామన్. అతడు కూడా జాట్‌జాతికి చెందిన మనిషి. నూర్‌బాయి ఢిల్లీ నుండి పారిపోయేటప్పుడు తనతో పాటుగ అమూల్యమైన రత్నాలు, వజ్రాలను కొన్నింటిని తెచ్చుకుంది. చింతామన్ ఆమె వద్ద ఉన్న

సంపత్తిని పసికట్టాడు. ఆమె రత్నాలను అపహరించేందుకు కాచుకుని ఉన్నాడు. ఇంతలో శుభరాతి అనే సైనికుడు కూడా వారికి తోడయ్యాడు.

ఒకనాడు ముగ్గురూ ఎద్దుల బండిలో మధురకు బయలు దేరారు. రత్నాలు, వజ్రాలు ఉన్న సంచి ఆమె చేతిలో ఉంది. బండి ఒక అడవి మధ్యకు చేరుకొంది. సాయంకాలం అయింది. చింతామన్, అతని సహచరులు ఉన్నట్లుండి వాళ్ళపై దాడి జరిపారు. నూర్ బాయి వెంటనే ఆ సంచిని వారికిచ్చి వేసింది. అంతలోనే వారు మోహనుని గాయపర్చారు. అప్పటి సంఘటనను వర్మగారు ఇలా రాశారు. "నూరుబాయి తన ముసుగును తొలగించి బండిలో నిలుచుకొంది. దుమ్ము, చెమట ఆమె శరీరాన్ని కమ్ముకొని ఉంటినాయి. ఆమె పెదవులు ఎండిపోయి నాయి. ఆమె తన వద్ద నున్న సంచిని, నగలను దొంగలకు ఇచ్చివేసింది. అయినా చిన్న ఘర్షణ జరిగింది. బండినుండి దిగేటప్పుడు ఆమె పావడ చినిగి పోయింది. అయినా ఆమె మోహనునిపై గల ప్రేమచే తనకు జరిగిన అన్యాయాన్ని లెక్క పెట్టలేదు"[1]

దొంగలు వెళ్ళిపోయాక మోహనుని గాయాలు చూచి ఎంతో బాధ పడింది. మోహన్ నూర్‌బాయి పరిస్థితి చూచి ఏడువ సాగాడు. అప్పుడామె "నీవు దుఃఖపడితే నేను ఓర్చుకోలేను. నీ దుఃఖాన్ని చూస్తూ జీవించలేను"[2] అంటుంది. మోహన్‌కు ప్రాణాపాయం తప్పినందుకు

1. టూటే కాంటే — బృం. లాల్ వర్మ., పు: 274,75.

2. పైదే., పు: 281.

నూర్‌బాయి సంతోషించింది. తరువాత వారు మధురకు చేరుకుంటారు.

పై సంఘటన చాల హృదయ స్పందనం కలిగించేది గాను, ప్రభావాత్మకం గాను ఉంది.

"నూర్‌బాయి త్యాగం, సంఘర్షణ, సాహసం చూపిన విధానం పాఠకులకు సానుభూతి కలిగిస్తుంది. నూర్‌బాయికి తన గత జీవితం తలచుకొంటే అసహ్యం, బాధ కలుగుతుంది. నూర్‌బాయి తన పేరును కూడా అసహ్యించుకొంది. అందుకే ఆమె మధురకు వచ్చిన తరువాత పేరు కూడ మార్చుకుంది. సరూప అనే పేరుతో ప్రసిద్ధి చెందింది వ్రజ భూమిలో జనుల మధ్య సంచారం చేసేటప్పుడు ఆమెకు సుఖం, ఆనందం కలుగుతుంది. ఆమె గొప్పదనం, నిష్కపట ప్రేమ, త్యాగం మొదలైన సద్గుణాలు ఆమె శీలానికి మెరుగులు దిద్దాయి"[1]

"ఐశ్వర్యంలో పెరిగి, మహమ్మద్ షా, నాదిర్షాల వంటి చక్రవర్తులను ఆకర్షించే సౌందర్యం కల్గి ఉండిన నూర్‌బాయి, చినిగిన వస్త్రాలతో, దారిద్ర్యంతో బాధపడుతూ సామాన్య జనుల మధ్య కలసి మెలసి జీవించడం సామాన్య విషయం కాదు. వైభవంతో కూడిన తన పాత జీవితం తో తనకెలాంటి సంబంధం లేనట్లు వ్యవహరిస్తుంది. ఆమె మహమ్మదీయ స్త్రీ అయివుండి కూడ కృష్ణ భక్తురాలై రసఖాన్, సూరదాస్, నందదాస్ మొదలైన కృష్ణ భక్తకవుల పాటలు పాడుతూ ప్రశాంత జీవితాన్ని గడుపుతుంది."[2]

1. బృందావన్‌లాల్ వర్మ ఉపన్యాసోం మే సాహిత్యకార్ కళ – శివకుమార్ మిశ్ర, పు: 91.
2. టూటే కాంటే – బృం. లాల్ వర్మ, పు: 295 – 303.

బృందావన్ లో మోహనునికి తన భార్య అయిన రోనీ కనబడుతుంది. అతడు చాల కాలం ముందే ఆమెతో జగడ మాడి ఇంటి నుండి పారిపోతాడు. నూర్ బాయికి ఈ విషయం తెలిసి ఆమెను ఏలుకొనమని మోహనునికి నచ్చ చెప్పింది. మోహనుడు నూర్‌బాయి మాట కాదన లేక పోయాడు.

నవల కడపటి భాగంలో నూర్‌బాయి సౌశీల్యాన్ని చక్కగా పోషించారు రచయిత వర్మగారు. నూర్‌బాయి, మోహనుల సంభాషణ ప్రవర్తనల ద్వారా ఈ విషయం స్పష్టమౌతుంది. కొంత కాలం పోయాక మోహనుడు ప్రతీకారంతో చింతామన్ ఇంటికి వెళ్ళి, అతడు అపహరించిన నూర్‌బాయి నగలను తీసుకు వచ్చి నూర్ బాయికిస్తాడు. కాని ప్రస్తుతం నూర్‌బాయి వీటికి అతీతురాలు. ఆమె మోహనుని పిల్చుకొని యమునానది గట్టుకు పోతుంది. ఆమె తలలో రెండు వజ్రాలు ఎర్రటి నిప్పు కణికల వలె ప్రకాశిస్తున్నాయి. యమునానది ప్రశాంతంగా ప్రవహిస్తున్నది. నూర్‌బాయి తలలోని ఆ వజ్రాలను, మోహన్ తెచ్చిన నగలను తీసుకొని యమునలో పారవేసేందుకు ముందుకు పోతుంది. మోహనుడు నిశ్చేష్టుడై ఆమె వైపు చూస్తూ ఉన్నాడు. ఆమె "బంగారు, వజ్రాలు ఎంత నీచమైనవో నీకు తెలియదు. నీవు అపవిత్రమైన నూర్‌బాయిని కోరుకుంటావో లేక స్వచ్ఛమైన చరిత్ర గల సరూపను ఎన్నుకుంటావో చెప్పు"[1] అని అడిగింది. అందుకు మోహన్ నాకు సరూపయే కావాలి అంటాడు.

---

1. టూటేకాంటే – బృం. లాల్ వర్మ., పు: 357.

అప్పుడామె ఆభరణాలను యమునా నదిలో పారవేస్తుంది"[1]

ఆభరణాలను నదిలో పారవేసిన తరువాత నూర్ బాయి మనస్సు కుదుట పడుతుంది. మోహనుడు ఆమెలో కలిగిన మార్పుకు ఆశ్చర్య పడ్తారు.

బృందావన్ లాల్ వర్మగారు నూర్ బాయి చరిత్రను ఎంతో హృద్యంగా రచించారు. నూర్ బాయి మొదట విలాసంగా జీవిస్తూ అపవిత్ర మైన వాతావరణంలో ఉండేది. కానీ ఆమెలో క్రమంగా మార్పును కలిగించి, పవిత్ర భావాలవైపు మనస్సు మారేటట్లు రచించారు. వర్మగారు నవల అంతానికి నూర్ బాయి మానసిక పరివర్తనతో ఆదర్శ మూర్తిగా కృష్ణ భక్తురాలిగా మనకు దర్శన మిస్తుంది.

### 4.2.6. అహిల్యాబాయి :

**4.2.6.1. అహిల్యాబాయి:** "అహిల్యాబాయి సామాన్య కుటుంబంలో జన్మించింది. తన కుశాగ్ర బుద్ధి, చాతుర్యం మొదలైన గొప్ప గుణాల మూలంగా చరిత్ర ప్రసిద్ధి గాంచింది. మల్హారరావు హోల్కర్ పుత్రుడైన ఖండేరావుతో పది, పన్నెండు సంవత్సరాల వయస్సులో ఆమె వివాహం జరిగింది. సుమారు పదునెనిమిది సంవత్సరాల వరకు తన భర్త పెట్టే కష్టాలను సహిస్తుంది. 29 సంవత్సరాల వయస్సులో వితంతు వౌతుంది. తరువాత 42, 43 సంవత్సరాల వయస్సులో తన పుత్రుడైన మల్హారావు-హోల్కర్‌ను కోల్పోతుంది. అటుపై సుమారు 62 సం॥ వయస్సులో ఆమె

1. టూటే కాంటే – బృం. లాల్ వర్మ., పు; 357.

మనుమడైన 'నత్తూ' కూడ మరణిస్తాడు. 66 సంవత్సరాల వయస్సులో అల్లుడైన యశ్వంతరావు స్వర్గస్థుడవుతాడు. ఆమె కూతురు ముక్తాబాయి పతితో కూడ సహగమనం చేస్తుంది. ఇలా అనేక కష్టాలకు లోనై దుఃఖాన్ని అనుభవిస్తున్నప్పటికి ఆమె ప్రజలకు సేవ చేస్తూ, రాచ కార్యాలను సక్రమంగా నిర్వహిస్తూ ఉంటుంది."[1]

ఆమె పుత్రుడు చనిపోయినందు వల్ల తన దూరపు బంధువైన తుకోజీరావు పుత్రుడైన మల్హారావును తన వారసునిగా చేయాలని అనుకొంటూ ఉంటుంది. అందుకుగాను అతన్ని కర్తవ్య పరాయణునిగాను, సదాచార సంపన్నునిగాను చేయాలని అనుకొంటుంది. కాని మల్హారావు ఎల్లప్పుడు చెడ్డ అలవాట్లకు లోనై ఆమెకు బాధనే కలిగిస్తాడు. ఆమె మల్హారావు చేసే భ్రష్టాచారాలు, లూటీలు, అన్యాయాలు మొదలైన వాటి వల్ల బాధపడుతూ ఉంటుంది. తీరని ఆవేదనను అనుభవిస్తుంది. కాని లోక కల్యాణం కొరకు విషపానం చేసిన శివుని వలె అన్నింటిని సహిస్తుంది. తుదకు ఆమె సత్యనిష్ఠ, ఆదర్శం ఫలిస్తాయి. కర్తవ్యం, పరమార్థం సాధించడానికి సర్వస్వాన్ని త్యజించికూడ దుఃఖపడని వ్యక్తి అహిల్యాబాయి.

అహిల్యాబాయి తన శాసనకాలంలో న్యాయాన్ని, ధర్మాన్ని, కర్తవ్యాన్ని ఆచరించాలని కోరిక కలిగి ప్రయత్నం చేసినప్పటికి సంతోష జనకమైన ఫలితాన్ని పొందలేక పోతుంది. తన రాజ్యంలో ఆదర్శాన్ని,

---

1. బృందావన్ లాల్ వర్మ సాహిత్య ఔర్ సమీక్ష., — డా॥ సియారామ్ శరణ్ ప్రసాద్., పు:17.

శాంతిని, ఆనందాన్ని కలిగింపలేక పోతుంది. కర్తవ్య పరాయణురాలై జీవితాన్ని గడిపినప్పటికి, కర్తవ్య నిర్వహణలో తన సర్వస్వాన్ని త్యాగం చేసినప్పటికి, ఆదర్శాలకు, ఆధ్యాత్మిక విషయాలకు తన జీవితంలో ప్రముఖస్థానం ఇచ్చినప్పటికి ఆమెను దేవుడు అనుగ్రహించ లేదు. పతిని, పుత్రులను దగ్గర బంధువులను పోగొట్టుకొని, చెప్పరాని దుఃఖాన్ని అనుభవించింది. అయినప్పటికి తన పరిపాలనా కాలంలో చాల గొప్ప కార్యాలు చేసింది. ఆమె చేసిన పనులు ప్రజలకు ఎంతో ఆనందాన్ని కల్గించాయి.

ఆమె గొప్ప రాజ్యానికి రాణి కాదు. ఆమె కార్యక్షేత్రం కొద్ది పాటిది. అయినప్పటికి తన రాజ్యపు సరిహద్దులకు బయట కూడ ప్రసిద్ధ మైన తీర్థ క్షేత్రాలలో గుడులను కట్టించింది. బావులు త్రవ్వించింది. బాటసారుల సౌకర్యార్థం మార్గాలు నిర్మించింది. ఆకలిగొన్న వారికి అన్న సత్రాలను నిర్మించింది. దప్పిగొన్న వారికి చలివేంద్రాలు కల్పించింది. గొప్ప గొప్ప దేవాలయాల్లో పండితులను నియమించి, శాస్త్రాలను విద్యార్థులకు చెప్పించింది. ఆమె స్వార్థాన్ని వదలిపెట్టి, ఎల్లప్పుడు న్యాయమార్గాన్నే ఆచ రిస్తూ అంతిమ శ్వాస వదిలే వరకూ న్యాయాన్ని రక్షిస్తూ గడిపింది.

అహిల్యాబాయి శీలానికి సంబంధించిన మహత్తర విష యాలను వెలుగులోనికి తెచ్చే ఉద్దేశ్యంతోనే వర్మగారు ఈ నవలను రచించినట్లు తెలుస్తుంది. అహిల్యాబాయి చరిత్ర అనేక స్థలాల్లో నాటకీయం గానూ, విశ్లేషణాత్మకంగానూ చిత్రించారు రచయిత. ఆమె చేసే ప్రతికార్యాం

సహజంగా ఉంటుంది.

ఆమె బాల్యంలో ఎంత చదివిందో, వయస్సు వచ్చిన పిమ్మట ఎంత చూసిందో, వినిందో, వంశ పారంపర్యంగా ఏ సంప్రదాయాలను స్వీకరించిందో వాటిని పూర్తిగా జీవితంలో అమలు చేసింది. ఆమెలో ఉండే ఆదర్శ భావాలు ఆమె పేరుతో నవలను రాసేందుకు వర్మగారికి గొప్ప ప్రోత్సాహాన్నిచ్చాయి.

అహిల్యాబాయిలో ఉండే ఉదార భావాలు కొనియాడదగినవి. సింధూరి వంటి దుష్టస్త్రీ కూడ అహిల్యాబాయి సాహచర్యంతో సదాచారాన్ని అలవరచు కొంటుంది.

ఆమె ఆత్మస్తుతిని ఏ మాత్రం సహించేది కాదు. అది చాలా హీనమైందిగా భావించేది. ఒక కవి ఆమెను పొగడుతూ పుస్తకం రాసి, దానిని ఆమెకు వినిపించాలని తీసుకువస్తారు. ఆమె ఆ పుస్తకాన్ని నర్మదా నదిలో పారవేయిస్తుంది. కళ, మానవుని కర్తవ్యోన్ముఖునిగా చేయడానికే ఉపయోగపడాలి కాని అతని పతనానికి కారణం కాకూడదు, అని ఆమె అభిప్రాయం

వర్మగారు తన నవలలో స్త్రీ పాత్రలకు తగినంత గౌరవాన్నిచ్చారు. ముఖ్యంగా అహిల్యాబాయి పాత్రను ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నప్పటికి బాధపడకుండా అన్నింటిని సహించిన సహనశీలిగా చిత్రించారు. ముఖ్యంగా పతి వియోగం, పుత్ర పుత్రికా వియోగం, అల్లుని మరణం, మనుమని మరణాల వల్ల కలిగిన దుఃఖం, ఒకదాన్ని మించి మరొకటి బలవత్తరమైనా ఓర్పుతో అన్నింటిని సహించిన పాత్రగా తీర్చిదిద్దారు

4.2.7. కచనార్ :

4.2.7.1. కచనార్: 'కచనార్' నవలలో 'కచనార్' కథానాయిక. ఈమె ధామానీ రాజైన దలీప సింహుని భార్య, కళావతితో అరణంగా వచ్చిన 'దాసి'. దాసీ అయినా చాలా అందకత్తె. ఈ అందమే ఆమెను చాల కష్ట నష్టాలకు గురి చేసింది.

రాజైన దలీప సింహుడు కచనార్‌ను దాసీ అని చులకనగా భావించి తన కాముకత్వానికి బలిచేయడానికి పూనుకొంటాడు. కాని కచనార్ దృష్టిలో స్త్రీత్వం చాల మహత్తరమైంది. అదే దృష్టితో దలీపసింహునితో ఇలా అంటుంది. "నాతో పాటు అగ్నికి ప్రదక్షిణం చేయండి. నన్ను మీ పత్నిగా స్వీకరించి గౌరవించండి. మీ జీవిత సహధర్మచారిణిగా గ్రహించండి. దీనికి మీరు అంగీకరిస్తే నేను మీ పాదదాసినిగా ఉంటాను. కానీ అవసరం వస్తే వేసుకొని, అవసరం తీరిన తరువాత పారవేసే అంగీవలె ఉండజాలను"[1] అని అంటుంది.

"ఇంకా మీరు బలవంతం చేస్తే నేను ప్రాణాలతో జీవించనని ... సాక్షిగా వివాహం చేసుకోకుండానే చాలా మంది స్త్రీలు పెద్ద పెద్ద రాజుల అంతఃపురంలో పడి ఉండే వారిని, అటువంటి వారిని నేను గొప్పవారినిగ తలంచన"[2]ని అంటుంది.

ఈ మాటలవల్ల కచనార్ రాజును మనసారా ప్రేమిస్తున్నా తన పాతివ్రత్యాన్ని రక్షించుకోవడం అనివార్యం అని తెలుస్తుంది.

1. కచనార్ – బృం. లాల్ వర్మ., పు: 25
2. పైదే., పు: 27.

దలీప సింహుని దూరబంధువైన మానసింహుడు రాజ్యా కాంక్షతో, యుద్ధంలో గాయపడిన దలీప సింహునికి విష ప్రయోగం చేసి అతడు చనిపోయినట్లు ప్రజలను నమ్మించి థామానీ సింహాసనాన్ని అధిరోహిస్తాడు. దలీప సింహుని భార్య కళావతిని లోబరుచుకున్నా అతని కామ పిపాస చల్లారదు. కచనార్‌ను కూడా చెర పట్టాలని ప్రయత్నాలు చేసే వాడు. ఆమె మానసింహుని అమానవీయ కామ వాంఛకు బలికాకుండా థామానీ నుండి పారిపోయి గోసాయిల ఆశ్రమం చేరుతుంది. ఆ ఆశ్రమంలో నియమ నిష్ఠలతో సన్యాసినిలా జీవితం గడుపుతుంది. ఆమె ఆశ్రమంలో నివసిస్తూ – "నా తల్లిదండ్రులు సిపాయిలు. మంచి వంశంలో పుట్టినవారు. నాకు వస్త్రాలంకారాలు అవసరం లేదు. నేను గొండు జాతి చెందిన కన్యను. నార చీరలను కట్టుకొని జీవించగలను"[1] అని అనుకోవడంలో ఆమె వ్యక్తిత్వం స్పష్టమౌతుంది.

ఆమెలో దృఢ నిశ్చయం, స్ఫూర్తి, శౌర్యం, ధైర్యం మొదలైన గుణాలు మెండుగా ఉండేవి. ఆమెకు శస్త్రవిద్యలో కూడ నైపుణ్యం ఉండేది. కేవలం శస్త్ర విద్యే కాక, చాల బాగ పాడేది. ఆమె ఏకతార వాద్యం వాయిస్తూ పాడితే ఏకతార ఆమె కంఠస్వరానికి శోభ చేకూర్చక పోగా ఆమె కంఠమే ఏకతారకు అందాన్ని చేకూర్చుతుందనడంలో అతిశయోక్తి లేదు.

మానసింహుడు కళావతి, కచనార్ ఇద్దర్ని చూచి తన మనస్సులో ఇలా అనుకొంటాడు. "కళావతిని చూడగానే మనస్సులో

1. కచనార్ – బృం. లాల్ వర్మ, పు: 25.

గసుర్పాటు కలుగుతుంది. కచనార్‌ను చూడాలని మనస్సులో ఉబలాటం ఉంటుంది కాని ఆమెను చూడగానే ఆ ఉబలాటం అణగారి పోతుంది. కళావతి పద్మం వంటిది. కచనార్ ముళ్ళతో కూడిన గులాబి వంటిది. కళావతి నడకలో వయ్యారముంది ; ఆకర్షణ ఉంది. కాని కచనార్ నడుస్తోంటే మఠంలో నివసించే యోగిని వలె కన్పిస్తుంది."[1] ఈ తులన వలన కచనార్ వ్యక్తిత్వం అందరికీ సులభంగా అందని స్వభావమని వ్యక్తమవుతున్నది.

కచనార్ సౌందర్యం ఎంత గాఢమైనది అంటే సంయమ శీలుడు, గోసాయిల ఆశ్రమ గురువులైన అచలపురి కూడ చలిస్తాడు. తనకు ఇంద్రియ నిగ్రహం ప్రసాదించమని దేవుణ్ణి- " ఓ భగవంతుడా! భగవతీ ; భవానీ, నాకు శక్తిని ప్రసాదించండి. తామరాకుపై నీటి వలె నిర్లిప్తంగా ఉండే శక్తి నాకు ప్రసాదించండి "[2] ప్రార్థిస్తాడు.

ఆమె సౌందర్యానికి ముగ్ధుడై సన్యాసుల మధ్య నివసించే సమంతపురి ( దలీప సింహుడు) ఇలా అనుకొంటాడు: "ఈమె సాధారణ స్త్రీ కాదు. ఆమె తనను సాధారణ స్త్రీగా అనుకొంటున్నది. ఆమె అద్దంలో తన అందాన్ని చూస్తే తను సాధారణ స్త్రీ కాదు అని గుర్తిస్తుంది" అని అనుకొంటాడు.

సన్యాసి అయిన అచలపురి కూడ ఆమె సౌందర్యానికి వశుడై "నేను నిన్ను ప్రేమిస్తున్నానని"[4] అంటాడు

1. కచనార్ - బృం. లాల్ వర్మ, పు : 14.
2. పైదే, పు : 226.
పైదే, పు : 230
4. పైదే, పు : 260.

ఈ సౌందర్యమే ఆమె పాలిట శాపంగా పరిణమించి , అనేక కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది.

గోసాయిల ఆశ్రమంలో దలీప సింహుడు ' సమంతపురి ' అనే పేరుతో ఉండేవాడు. కచనార్ అతన్ని చూస్తూనే దలీపసింహుని పోలి కలు కనబడటం చేత సందిగ్ధంలో కొట్టుమిట్టాడుతుంది. కాని దలీప-సింహుడు మాత్రం ఆమెను గుర్తించలేక పోతాడు. ఆమెను ఆ ఆశ్రమంలో కంచన్ పురీ అనే పేరుతో పిలిచేవారు.

చివరకు దలీప సింహునికి యుద్ధంలో దెబ్బతగిలి పోగొట్టు పూర్వస్మృతిని పొందుతాడు. కచనార్ కు సమంతపురే దలీప-సింహుడని తెలిసినంతనే ఆమె సంతోషానికి మేరలేకపోతుంది. దలీప-సింహుడును కచనార్ ను గుర్తుపట్టి ఆమె శౌశీల్యాన్ని, పవిత్రతను, ధార్మికతను , వినయ విధేయతలను గుర్తించి, ఆమెను మనస్ఫూర్తిగా ఇష్టపడి వివాహం చేసుకొంటాడు.

వర్మగారు కచనార్ పాత్ర ద్వారా - ఆ నాటి రాజ్యంలో పరంపరగా దాసీలపట్ల రాజుల, ఇతరుల ప్రవర్తన వ్యక్తమవుతున్నది. ఆ రోజుల్లో వారిని చిన్నచూపు చూస్తూ తరచు కాముక ప్రవృత్తికి గురిచేసే వారని , అనేకమంది దాసీలు ఇష్టంలేకున్నా మగవారి కామతృష్ణకు బలై పోతూ ఉండే వారని తెలుస్తున్నది. ఆనాడే కాదు రచయిత సమ కాలీన వ్యవస్థలో కూడ అధికారులు, ధనవంతులు తమ ధన మదం అధికారదర్పాలతో దాసీలను , సేవికలను తమ కాముక ప్రవృత్తికి బలి

బలి కావించే వారు. ఈ దురాగతాన్ని సహించలేక తన నవలలో ఈ సాంఘిక దురాచారాన్ని ఎత్తి చూపారు.

కచనార్ లాంటి అందకత్తెలకు అడుగడుగునా గండాలే. ఆమె దాసీ కన్య కాబట్టి సులభంగా లొంగి పోతుందనీ, లొంగక పోతే బెదిరించో, భయపెట్టో, ధనాశ చూపో వాళ్ళను లొంగదీసుకోవచ్చునని అనుకొంటారు. ఇది ఆ నాటి పురుషుల దౌర్బల్యం. పాశవిక ప్రవృత్తి.

ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లోనూ కచనార్ ధైర్యంతో కాల ప్రవాహానికి ఎదురొడ్డి పోరాడి, తన శీలాన్ని రక్షించుకొని, చివరకు తాను ప్రేమించిన రాజునే వివాహమాడుతుంది. కథ చివరకు సుఖాంతమయినా కచనార్ జీవితంలోని ఒడిదుడుకులు, ఆమె పడే అవస్థలు, సంఘంలో ఉత్తమురాలుగా గౌరవంగా, పత్నిగా జీవితం గడపాలనే ఆమె తహతహ చదువరులకు కన్నీళ్ళు తెప్పించక మానవు. సంఘమే కొంత మందిని హీన జాతులుగా చేసిందనీ, దాసీలలో కూడ ఉత్తమ సంస్కార వంతులైన స్త్రీలు ఉంటారని కచనార్ పాత్రద్వారా రచయిత మనకు తెలియజేసారు.

**4.2.7.2. దలీప సింహుడు:** 'కచనార్' నవలలో దలీప సింహుడు ధామోనీ రాజు. ఇతని పాత్ర ఈ నవలలో సమస్యాత్మకమైంది. వర్మగారు ఈ పాత్ర నిర్మాణంలో తన నైపుణ్యాన్ని చూపించారు. అతడే విషయంలో అపూర్వ అనుభవం కల మానవ విజ్ఞాన శాస్త్ర (Anthropology) నిపుణులు వైద్యులు అయిన తన మిత్రులతో చర్చించి[1], దలీపసింహుడు స్మృతిని

---

కచనార్ - 'పరిచయ' — బృం.లాల్ వర్మ, పు.3-5.

కోల్పోవడం మరల స్మృతిని పొందడం అనే విషయాన్ని రచించారు.

ప్రారంభ దశలో కోపిష్టి గాను, ఉద్దండుడు గాను ఉండే దలీప సింహుడు, పూర్వ స్మృతిని కోల్పోయి మరల స్మృతిని పొందిన పి పవిత్ర హృదయం కలవాడు, ఉదారుడు, కామ వాంఛ లేని వాడుగా, పవిత్ర ప్రేమ మూర్తిగా మారుతాడు. ఈ విధమైన రెండు విభిన్న వ్యక్తిత్వాలు మనకు కనబడేలా ఈ పాత్రను వర్మగారు స్వాభావికంగా చిత్రించారు.

"దలీప సింహుని ఉద్దండ స్వభావాన్ని చూచి అతని భార్య కళావతి భయపడుతుంది. అతడు బలాత్కారంగా ముసుగ తొలగించా లని ప్రయత్నిస్తే కళావతి భయంతో ముడుచుకొని పోతుంది. అతని ప్రవర్తన..... కళావతి మనస్సుకు కష్టం కలిగిస్తుంది."[1]

"దలీప సింహుడు తన భార్య కళావతితో దాసిగా వచ్చిన కచనార్ సౌందర్యానికి ఆకర్షితుడై ఆమెను వశపరచుకొని తన కామ వాంఛను తీర్చుకోవాలనుకొంటాడు. కాని కచనార్ ... దృఢ వ్యక్తిత్వాన్ని ఎదుర్కోలేక పోతాడు"[2]

దలీప సింహునికి యుద్ధంలో దెబ్బ తగిలి స్పృహ కోల్పోతాడు. దూరపు బంధువు, సోదర తుల్యుడైన మాన సింహుని కుట్ర వల్ల స్మృతిని కోల్పోయి అచలపురి ఆశ్రమానికి చేరుతాడు. అచలపురికి శిష్యు డైన పిమ్మట అతనిలో సహనశక్తి, దయ, అహింసా భావం

1. కచనార్ – బృం. లాల్ వర్మ, పు: 25-27.
2. ప పు: 268

పొందుతాయి. ఒకసారి అచలపురి ఆశ్రమంలో అపరాధం చేసిన ఒక వ్యక్తికి అచలపురి దండన విధిస్తూ అతని శరీరంపై త్రిశూలంతో పొడవమని చెప్పినప్పుడు సమంతపురి (దలీప సింహుడు) కొరడాతో కొట్టినాగాని, త్రిశూలంతో పొడిచినాగాని అతనికి బాధ కలుగుతుంది. న్ని ఆశ్రమాన్నుండి బహిష్కరిస్తే బాగుంటుంది. ఇతరులకు సేవ చేయడం కంటె పుణ్యాం లేదని, ఇతరులను పీడించడం కంటె మించిన పాపం లేదని తమరే చెప్పి ఉన్నారు"[1] అని అంటాడు.

ఇంకొకసారి డరూ అనే అపరాధికి అచలపురి మరణ శిక్ష విధించినప్పుడు అతనితో ఏకీభవించడు. తుదకు అతన్ని కాపాడటానికి స్వయంగా తానే ఉరిశిక్ష అనుభవించడానికి సన్నద్ధులౌతాడు. అప్పుడు ఆ అపరాధికి దేశ బహిష్కరణ శిక్ష విధిస్తాడు.[2] అతడు డరూ ను మరణ శిక్షనుండి తప్పించడమే కాకుండా మానసింహుడు, కళావతి మొదలైన వారిని కూడ క్షమిస్తాడు. దీని ద్వారా అతడెంతటి ఉదార హృదయుడో అర్థం చేసుకోవచ్చు.

కచనార్ విషయంలో మొదట అతనికి ఉండిన కాముక ప్రవృత్తి ఉదాత్తమైన ప్రణయంగా మారుతుంది. అతడామెను హృదయ పూర్వకంగా ప్రేమిస్తాడు. అతని వ్యక్తిత్వంలో క్రమంగా పరివర్తనం కన్పిస్తుంది.

సియారామ్ శరణ్ ప్రసాద్ గారు "వర్మగారు దలీప్ సింహుని శీలచిత్రణంలో అభినయాత్మక, విశ్లేషణాత్మకాది విభిన్న రీతులను ఉపయోగించారు.

---

1. కచనార్ - బృం.లాల్ వర్మ., పు: 268.
2. పైదే. పు: 362

మానవుని మనస్సు క్షణం క్షణం మారుతూ ఉంటుంది. అలాంటప్పుడు సజ్జనుడైన అచలపురి సాంగత్యంలో దలీప సింహునిలో పరివర్తన రావడం సహజం"[1] అని అన్నారు.

మొదట ఉద్దండుడుగా ఉన్న దలీప సింహుడు స్మృతిని కోల్పోయిన తర్వాత అతని చేష్టలు సామాన్య బాలుని చేష్టలతో సమానంగా ఉండి, చివరకు గోసాయిల సంపర్కంతో యోగాభ్యాసం, శ్రమపడి పనిచేయడం, సత్సాంగత్యం మొదలైన వాటిచే మానసిక వికాసాన్ని, మానసిక పవిత్రతను పొంది, క్రమంగా జ్ఞానాన్ని, బుద్ధిని స్మరణ శక్తిని పొందాడు. అందుకే ఎంతో ఉత్తముడుగాను, మంచివాడు గాను, నీతిమంతుడు గాను మారిపోతాడు. నిజానికి అతడు అంత ఎత్తుకు ఎదిగాడుంటే, తను మరణించాడనుకొని మానసింహుని రెండో వివాహం చేసుకున్న తన భార్య కళావతిని, మాన సింహుని కూడ క్షమిస్తాడు. తనకు బందీగా చిక్కిన మాన సింహుడు, తనను క్షమించి వదిలివేస్తే తమ పరివారమంతా అడవికి వెళ్ళి వేటాడో, కాయ కసరులు తినో బతుకుతాము అంటాడు. అప్పుడు దలీప సింహుడు గంభీర స్వరంతో "నీకు అభయం ఇస్తున్నాను. అయిదు గ్రామాలు, ఒక దుర్గం ఇస్తాను. నీకు సరిపడా మంది మార్బలం, వారి పోషణ ఖర్చు అన్నీ ఏర్పాటు చేస్తాను. నీవు నీ భార్యలతో సుఖంగా బ్రతుకు"[2] అని అంటాడు. దీనిని బట్టి దలీప సింహుడు ఎంత ఉదాత్తమైన చరిత్ర కలవాడుగ తెలుస్తుంది.

1. బృందావన్ లాల్ వర్మ – సాహిత్య ఔర్ సమీక్ష – డా॥ సియారామ్ శరణ్ ప్రసాద్., పు: 256.

2. కచనార్ – బృం. లాల్ వర్మ., పు: 371.

4.2.7.3 **మహాంతు అచలపురి:** అచలపురి గోసాయిల మహాంతు. ధార్మిక బుద్ధి కలవాడు. ఎక్కువ ఆధ్యాత్మిక చింతనలో లీనమై ఉండేవాడు. మహాజ్ఞాని. మంచి వ్యావహారిక బుద్ధి కలవాడు. అవసరమైతే యుద్ధం చేసేందుకైనా వెనుకాడే వాడు కాదు. శిష్యులకు బోధన విషయంలో అతని ధర్మ పరాయణత, అపార జ్ఞానం స్పష్టమయ్యేవి. అతడు గంభీరమైన తాత్త్విక విషయాలను మాట్లాడుతూ ఇలా అనేవాడు. "శాస్త్రం కామధేనువు. కాని శాస్త్రాలను గూర్చి చిత్రించేటప్పుడు, చర్చనీయాంశానికి సంబంధించి ముందు వెనుకలను తెలుసుకొనేందుకు ప్రయత్నించవలెను"[1]

"మనువు కొన్ని వ్యసనాలను దోషంగా పరిగణించలేదు. అవి మానవునికి ప్రకృతి సిద్ధమైన గుణాలని చెప్పి ఉన్నాడు. మద్య మాంసాదులను సేవించడం, కామ వాసనకు లోను గావడం పాపం కాదని, పాప పుణ్యాలనే విషయం మానవుని మనస్సుపై ఆధారపడి ఉందని చెప్తాడు."[2]

అతడు రాబోయే పరిస్థితులను ముందు తెలిసికొనే సామర్థ్యం కలవాడు. దలీప సింహుని సేవా శుశ్రూషలతో కాపాడి ధామానీ నగరాన్ని గోసాయిల ఆశ్రమ స్థలంగా చేయాలని కోరడం, యుద్ధం సంభవించినప్పుడు విజయాన్ని పొందడానికి ఒక పద్ధతిలో యుద్ధం చేయాలని సహచరులకు బోధించడం అతని బుద్ధి కుశలతకు తార్కాణం. అతడు ఏ పనినైనా

---

1. కచనార్ - బృం. లాల్ వర్మ., పు: 238
2. పైదే., పు: 272.

తాను స్వయంగా చేసి, ఇతరులను అలా చేయమని చెప్పేవాడు. అందువలననే కచనార్, దళీపుడు, గోసాయిలందరు ఆయన మాటను జవదాటక ఆదరంతోనూ, సమ్మానంతోనూ ఆదరించేవారు. అతని ఆలోచనలు ఉదారంగానూ, ప్రగతి శీలకంగానూ ఉండేవి.

అచలపురి స్వార్థం లేని వాడు. అతడు కావాలనుకొంటే ధామోనీ రాజ్యాన్ని తన వశం చేసుకొని ఉండేవాడు కాని, శ్మశాన వాటికలో మృతప్రాయుడై పడిఉన్న దళీపసింహుని గుర్తించి, అతడే ఆ రాజ్యానికి రాజయ్యేందుకు అర్హుడని గ్రహించి అతన్ని కాపాడుతాడు. దళీప సింహుని విజయానికి, కచనార్‌తో అతని వివాహం జరగడానికి అచలపురియే కారణమని చెప్పవచ్చు.

### 4.2.8. ముసాహిబజూ :

**4.2.8.1. ముసాహిబజూ దళీపసింహా :** ధతియా రాజ్యంలో 'కేరువా' నగరం ఒక జాగీరు. ఆ జాగీర్దారు పేరు దళీపసింహుడు. అందరూ అతన్ని ముసాహిబజూ దళీపసింహ అనీ, ముద్దుగా ముసాహిబజూ అనీ పిలిచేవారు. ముసాహిబజూ అనేది ఒక పదవి. ముసాహిబ అంటే రాజుదర్బారు సంబంధి ఉద్యోగి, అంగరక్షకుడు, పరిచారకుడు అని అర్థం. వర్మగారు తన నవలకు ఈ పేరే పెట్టారు. కలెక్టరుగారు వస్తున్నారు అన్నట్లు, ముసాహిబజూ గారు వస్తున్నారు అని అందరూ అతన్ని హోదాతోనే పిలిచేవారు.

ఆ ముసాహిబ్‌జూ వద్ద "దేశభక్తి, ప్రభుభక్తి, ఉదార ప్రవృత్తిగల సైనికులు 1200 మంది ఉన్నారు. కేరువా జాగీరులోని వివిధ

గ్రామాలు అతని అధీనంలో ఉంటాయి. అతని క్రింద ఉన్న 1200 మంది సైనికుల్లో 600 మంది ఎప్పుడూ పనిచేస్తుంటారు. మిగిలిన 600 మంది యుద్ధసమయాల్లో అత్యావసర సమయాల్లో మాత్రం ముసాహిబ జూ కి సహాయం చేస్తూ మిగిలిన రోజుల్లో స్వతంత్రంగా బతుకుతుంటారు"[1]

కాని ముసాహిబ జూ తన సైనికులందరిని గాఢంగా ప్రేమించేవాడు. రాజు ఇచ్చే బత్తెం అందరికీ సరిపోదు. కాబట్టి వాళ్ళకు సమస్తమైన సౌకర్యాలు కలిగించేందుకు తనవద్దనున్న ధనాన్నంతా ఖర్చు చేసే వాడు. ఆయన భార్యయైన 'చర్‌ఖారీ' కూడా తన ఆభరణాలన్నింటినీ కుదవబెట్టి తన భర్తకు సహాయం చేస్తూ ఉండేది. అందుకే అతని సైనికులకు ఆ దంపతులంటే అభిమానం, ప్రేమ, గౌరవాదులుండేవి. వారి పట్ల ఎల్లప్పుడు కృతజ్ఞులై ఉండేవారు. అతని సైనికుల్లో ఎక్కువ మంది నిమ్న జాతికి చెందిన వారుగా, బీద వారుగా ఉండేవారు. అప్పుడప్పుడు బ్రతుకుతెరువు కోసం కొందరు సైనికులు ధనవంతుల్ని లూటీ చేసి ధనం సంపాదించేవారు. ఈ విషయం ముసాహిబ జూకి తెలియకుండా జాగ్రత్త పడేవారు. బ్రతుకు తెరువు కోసం దొంగతనాలు చేసినా వారు ఎంతో మంచివారు. తమ యజమాని అంటే ప్రాణాలు వదిలే వారు.

"ఒకసారి ధతియా రాజు అంతఃపురంలో ఉత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవానికి చర్‌ఖారీకి ఆహ్వానం అందుతుంది. ఆమె వద్ద ఆభరణాలు కాని, మంచి వస్త్రాలు కాని లేవు. సామాన్య స్త్రీవలె ఉత్సవంలో పాల్గొంటే అవమానకరమని ఉత్సవానికి పోనని చెప్తుంది"[2] ఈ విషయం సైనికులకు

1. ముసాహిబ్ జూ – బృం. లాల్ వర్మ, పు; 5.
2. పైదే, పు; 14.

తెలుస్తుంది. వారు చాల బాధ పడతారు. ఆ సైనికుల్లో రాము, అతని మను మడు ఫ్రూరన్, మరికొంత మంది సైనికులు కలసి చర్చించుకొని, కొందరు ధన వంతుల ఇండ్లలో లూటీ చేసి ఆ ఆభరణాలను తీసుకొని వచ్చి చర్‌ఖారీకి ఇస్తారు. కాని దొంగతనం చేసినట్లు చెప్పరు. భూమిని త్రవ్వుతుంటే లభించిన ఆభరణాలని చెప్తారు. ఆ ఆభరణాలు ధరించి చరఖారీ ఉత్సవాలకు వెళ్తుంది. అలా లూటీ చేసిన నగల్లో ఆ ఊరి షావుకారు భార్య నగలు కూడా ఉన్నాయి. షావుకారు తన భార్య నగలను ముసాహిబ జూ భార్యవద్ద చూచారు. ముసాహిబ జూ అనుచరులు నగల్ని లూటీ చేశారనే విషయం షావుకారు తెలిసికొన్నాడు.

అంతే కాక 'లల్లీ' అనే వాడు కూడా లూటీలో పాల్గొన్నాడు. అతడు రహస్యంగా కొన్ని వెండి నగలను తీసికొని వచ్చి 'కుంజీ' అనే వడ్డీ వ్యాపారికి ఇస్తాడు. ఆ ఆభరణాలలో కుంజీ కూతురు సుభద్ర నగలు కూడా ఉన్నాయి. షావుకారు, కుంజీ, ఇంకా కొంత మంది ధనవంతులు కలసి రాజుకు ఈ విషయం ఫిర్యాదు చేస్తారు. రాజు కోపించి లూటీ చేసిన సైనికుల్ని తన స్వాధీనం చెయ్యమని ముసాహిబ జూ కు ఆదేశమిస్తాడు.

ముసాహిబ జూకు తన అనుచరులు లూటీ చేసిన విషయం తెలియదు. నమ్మడు కూడ. "నా మనుష్యులు లూటీ చేయలేరు. వారు నిర్దోషులు. లూటీ చేసిన వారిని వెదకి పట్టుకొని దండించండి. అనవసరంగా నన్ను, నా సైనికులను అప్రతిష్టపాలు చేయకండి"[1] అంటాడు. రాజు వాళ్ళని 'బద్మాష్‌లు' అని

1. ముసాహిబ జూ – బృం. లాల్ వర్మ, పు: 71

రిడితే వెంటనే ముసాహిబ జూ "మహారాజా! వారు బద్మాష్‌లు కారు. సిపాయీలు"[1] అంటాడు.

పై సంఘటన వల్ల ముసాహిబ జూ తన్ను ఆశ్రయించిన వారిపై చాల ప్రేమ చూపే వాడని, వారికి సంబంధించిన ఆపదను తనదిగా భావించే వాడని తెలుస్తుంది. వారిని కాపాడేందుకు యుద్ధానికి కూడా అతడు సన్నద్ధుడవుతాడు. తన అనుచరులతో ఇలా అంటాడు. "మనమందరూ రాజ భటులకు పట్టుబడ కూడదు. మన దగ్గర చాలినంత మందు గుండు సామగ్రి ఉంది, సిద్ధంగా ఉండండి."[2]

ఇలా తన సైనికులకు హెచ్చరించి, ఇక ఆ రాజ్యంలో ఉంటే తన అనుచరులను రాజు శిక్షిస్తాడని తలచి తన సైనికులతో అతడు రాజ్యం వదలి వెళ్ళిపోతాడు. ఈ విషయం తెలిసిన రాజు తన మనస్సు మార్చుకొని ముసాహిబ జూను తీసుకొని రమ్మని ఉన్నత సైనిక అధికార్లను, రామసింహ అనే ఆప్త మిత్రుణ్ని, నగరంలోని షావుకార్లను, వైశ్యులను పంపిస్తాడు. కాని ముసాహిబ జూ తిరిగి తన రాజ్యానికి వచ్చేదానికి అంగీకరించడు. చివరకు రామసింహుడు "సింథియా సేనలు ధతియాపై దండెత్తి వస్తున్నాయి. ఈ సమయంలో నీవు రాజ్యాన్ని వదలి పోతే ప్రజలు, ముసాహిబ జూ సిపాయిలు లూటీ చేయడంలో ప్రముఖులు కానీ దేశ రక్షణలో వెనుకంజ వేసే వారు అని నిన్ను అపకీర్తి పాలు చేస్తారు"[3] అంటాడు. ఈ మాటలు విన్న

1. ముసాహిబ జూ — బృం.లాల్ వర్మ., పు: 81
2. పైదే., పు: 81.
3. పైదే., పు: 97.

ముసాహిబ జూ దేశరక్షణే తన ప్రథమ కర్తవ్యమని భావించి, తన సైనికులతో తిరిగి ధతియా వస్తారు. రాజు కూడ అతన్ని సగౌరవంగా ఆహ్వానిస్తాడు దీనిని బట్టి ముసాహిబ జూ దేశభక్తి పరాయణత్వం అర్థమౌతుంది.

"ముసాహిబ జూ ఉదారుడు, దయగల స్వభావం గలవాడు, విశ్వాసపాత్రుడు మరియు ధైర్యశాలి; కాని మొండివాడు. అతడు జాతి మత భేదాలను పాటించేవాడు కాదు. అందుకే అతని అనుచరులలో ఉచ్ఛ నిమ్న జాతి భేద భావాలు ఉండేవి కావు."[1]

తన సేనలోని నిమ్న జాతికి చెందిన వారినైనా అతడు గౌరవంగా చూచేవాడు. కాబట్టే అతడు 'ఫూరన్' మొదలైన నిమ్నజాతి వారిని కూడా కౌగలించుకొనేందుకు సందేహించే వాడు కాదు.

కాబట్టి ఎవరైనా సరే సత్యం, ప్రేమ, నిర్మలమైన మనస్సు, పవిత్ర భావన కలిగివుంటే వారి జీవితం చరితార్థమవుతుందనడానికి ముసాహిబ జూ కథ దృష్టాంతం. అతని పవిత్ర ఆచరణ, దృఢ విశ్వాసం, అనుచరులపై నమ్మకం మొదలైన సద్గుణాలు రాజును కూడ ప్రభావితం చేస్తాయి.

ధర్మాన్ని రక్షించడానికి ముసాహిబ జూ ఎప్పుడూ సంసిద్ధంగా ఉంటాడు. "ధర్మం నాకు ప్రాణాలకంటె ఎక్కువైనట్లు ప్రియమైంది. ధర్మమే ఇహపరలోకాల్లో సహాయపడుతుంది. ధర్మమే మోక్షమార్గాన్ని చూపించే ప్రకాశించే దీపం. రాజాధిరాజుల ఆదేశం కూడ ధర్మానికంటె గొప్పది కాదు.

---

1. ముసాహిబ జూ – బృం. లాల్ వర్మ., పు: 6.

జీవించినంత వరకు ధర్మాన్ని వదలి పెట్టను. ఎవరికో భయపడి అధర్మం చేయను"

పైన పేర్కొన్న ధర్మవీరుల దృఢ నిశ్చయం ముసాహిబ జూలో పరిపూర్ణంగా ఉందని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఉదారత, సహిష్ణత అతనిలో బంగారుకు తావి అబ్బినట్లు ఉండేవి.

తన ఇంటికి ఎంతమంది సైనికులు, ఎప్పుడు వచ్చినా వారికి తృప్తిగా భోజనం పెట్టేవాడు. అతడు తన సైనికుల కంటె అధిక సుఖాన్ని కోరడు. "ఏ వస్తువైనా అందరూ సమానంగా అనుభవించాలి. నా జీవితం నా సైనికుల ద్వారానే సార్థకం అవుతుంది. నేను కడుపార భుజించి, నా సైనికులను పస్తు పెట్టను"[2] అని అతడు స్పష్టంగా చెబుతాడు.

ముసాహిబ జు అంటే సైనికులకు ఎంతో గౌరవం ఉండేది. వారు వేటకు వెళ్ళేటప్పుడు అతని ఎదుట త్రాగడం గాని, ఏదైనా చెడు కార్యాలు చేయడం గాని చేయాలంటే భయపడేవారు. రమూ, పూరన్ అనే వాళ్ళు లూటీ చేయడంలో దిట్టలు. కాని ఆయన ఎదుట ఎప్పుడూ బయట పడలేదు. "ముసాహిబ జు వయస్సును గౌరవించే స్వభావం కలవాడు. 'రమూ' అనే వాడు నిమ్న జాతికి చెందిన వాడైనా వయస్సులో తనకంటె పెద్దవాడు కాబట్టి అతని ఎదుట హుక్కా తాగేవాడు కాదు"[3]

ఈ విధంగా ఎన్ని కోణాల నుంచి పరిశీలించినా అతని గొప్ప

---

1. బృందావన్ లాల్ వర్మ సాహిత్య ఔర్ సమీక్ష - డా॥ సియారామ్ శరణ్ ప్రసాద్, పు; 131.
2. ముసాహిబ జు - బృం. లాల్ వర్మ, పు; 16.
3. పైదే., పు; 10.

వ్యక్తిత్వం స్పష్టమవుతుంది. అతను సచ్చరిత్ర కలవాడు కాబట్టే అందరూ అతనిని గౌరవిస్తారు. అతని ఆజ్ఞను అందరూ పాటిస్తారు. కాబట్టి అతను విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడని చెప్పవచ్చు. రచయిత అతని శీలాన్ని సహజంగానూ, స్వాభావికంగానూ చక్కగా చిత్రించారు. రమూ, పూరన్ అనేవారు ముసాహిబ జు కొరకు తమ ప్రాణాలనైనా అర్పించేందుకు సిద్ధంగా ఉంటారు. వారు లూటీ చేసిన అపరాధానికి దండనకు గురి అవుతారని తెలిసినప్పుడు "మన ప్రభువే మన సంపత్తి. ఆయన ఉండేటప్పుడు మనం ఎందుకు భయపడాలి. దేశాన్నుంచి బహిష్కరిస్తే మనం చాలా బాధలకు లోనవుతాము. ధతియాకు దూరంగా పోతే సహాయం చేసేవాళ్ళు ఎవ్వరూ ఉండరు. దండన అనుభవించడానికే మనం సిద్ధంగా ఉండాలి"[1] అని అనుకొంటారు.

కాని ముసాహిబ జు, రాజు వీరిని పట్టివ్వమని చెప్తే ససేమిరా ఒప్పుకోడు. ఆశ్రితులను కాపాడడం గొప్పవారి లక్షణం. అట్టి లక్షణాలన్నీ ముసాహిబజ్ లో మెండుగా ఉన్నాయి. తన ఆశ్రితులను కాపాడడమే దేశభక్తి కన్నా ప్రభుభక్తి కన్నా మిన్నగా తలచేవాడు. బంగారుకు తావి అబ్బినట్లు అతనికి చరఖారీ వంటి ఉత్తమ ఇల్లాలు తోడై మంచి కార్యాల్లో అతనికి సహాయపడుతుండేది.

ఇలాంటి ఆదర్శవంతమైన చారిత్రక వ్యక్తిని వర్మగారు తమ నవల 'ముసాహిబ జు' ద్వారా మనకు పరిచయం చేయడం ద్వారా మన మనస్సుల్లో చిరస్థాయిగా నిలిచిపోతారు.

1. ముసాహిబ జు – బృం. లాల్ వర్మ., పు: 75.

**4.2.8.2. చరఖారీ :** చరఖారీ ముసాహిబజు ధర్మపత్ని. "ఆమెకు భర్త అంటే భక్తి, గౌరవం ఉండేవి. ఆమె అన్ని విధాల అతనికి సహకరించేది. ఆమె రాజపుత్రిక. ఆమె కూడ తన భర్తవలె ఉదార స్వభావం కలది. ఆపద వచ్చినప్పుడు ఆమె తన అమూల్యమైన ఆభరణాలను కుదువబెట్టి డబ్బు తీసుకు వచ్చేది"[1]

ముసాహిబజు ఎంతో మంచివాడు. తన ఇంటికి ఎంతమంది సైనికులు, ఎప్పుడు వచ్చినా వారికి తృప్తికరంగా భోజనం పెట్టేవాడు. కానీ చరఖారీ అతనికి సహకారం ఇవ్వకపోతే అతను మాత్రం ఏం చెయ్యగలడు? బంగారుకు తావి అబ్బినట్లు చరఖారీ వంటి ఉత్తమ మహిళ జీవిత భాగస్వామిగా మంచికార్యాల్లో అతనికి సహాయపడుతూ ఉండేది.

"ఒకనాడు ముసాహిబజు తన అనుచరులతో వేటకు పోయినప్పుడు ఒక పులి అతన్ని చంపడానికి వస్తుంది. 'ఫూరన్' అనే వాడు తన యజమాని ప్రాణాలను రక్షిస్తాడు. ఆ విషయం తెలిసిన వెంటనే చరఖారీ తన అమూల్య ఆభరణాలను ఇచ్చి 'కుంజీ' అనే వడ్డీ వ్యాపారి దగ్గర కుదువ బెట్ట డబ్బుతెమ్మంటుంది. "డబ్బు రాగానే అందరికి తృప్తిగా భోజనం పెడతాను. అందరు అలసిపోయి ఉన్నారు. ఫూరన్‌కు హల్వా, పాయసం ప్రత్యేకంగా ఇస్తాను. అందరు తృప్తిగా ఇష్టం వచ్చినంత తినండి. ఫూరన్‌కు బహుమానం కూడా ఇవ్వాలి"[2] అని చెబుతుంది. పై వాక్యాల వల్ల ఆమెకు భర్త అంటే ఎంత ఇష్టమో, తన అనుచరులంటే ఎంత అభిమానమో మనకు అర్థమవుతుంది.

ఆమె ఎంతో సహనశీల. "యశోధర బుద్ధుని కార్యదీక్షకు

---

1. ముసాహిబజు – బృం. లాల్ వర్మ, పు: 8
2. పైదే. పు. 15.

భంగం కలిగించలేదు. ఊర్మిళ తన భర్తయైన లక్ష్మణుని, శ్రీరామునితో అడవికి పంపుటకు వ్యతిరేకించలేదు. అదే విధంగా చరఖారీ తన భర్త తలపెట్టిన కార్యాలను విఘ్నం చేయాలని కోరదు."[1]

ఆమె ఎంత ఉత్తమురాలో అంత ఆత్మాభిమానం కూడా కలది. రాజభవనంలో ఉత్సవం జరిగేటప్పుడు ఆమెకు ఆహ్వానం అందుతుంది. కాని ఆమె తన ఆభరణాలన్నీ తన భర్త అనుచరులకు ధన సహాయం చేయడానికి తాకట్టు పెడుతుంది. కాబట్టి ఆభరణాలు లేకుండా రాజభవనానికి పోతే అందరూ తనను అగౌరవంగా చూస్తారు, హేళన చేస్తారు. అది తనకు, తన భర్తకు అవమానం. అందుకే ఆమె ఆ ఉత్సవాల్లో పాల్గొనను అంటుంది.

'చరఖారీ' అంటే ముసాహిబజు సైనికులకు కూడా ఎంతో అభిమానం. తల్లి లాంటి చరఖారీ ఎప్పుడూ ఆనందంగా, నవ్వుతూ ఉండాలని వారు కోరుకుంటారు. ఆమె ఉత్సవాలకు పోకుండా ఉండడం చూచి కారణం కనుక్కొంటారు. ఆమె నగలన్నీ తమ కోసరమే తాకట్టు పెట్టింది అన్న విషయం వారికి తెలుసు. అందుకే వారు ఆమె దుఃఖం పోగొట్టాలను కొంటారు కొందరు కలసి చర్చించుకొని, ధనవంతుల ఇండ్లల్లో లూటీ చేసి ఆభరణాలను తీసుకొని వచ్చి చరఖారీకి ఇస్తారు. కాని దొంగతనం చేసినట్లు ఆమెకు చెప్పరు. భూమిని త్రవ్వుతుంటే లభించిన ఆభరణాలని చెప్తారు. ఆ ఆభరణాలు ధరించి చరఖారీ ఉత్సవాలకు వెళ్తుంది. వారు చేసింది తప్పే అయినా తమ యజమానురాలు బాధపడకూడదని, సంతోషంగా ఉండాలని వారు

---

1. బృందావన్‌లాల్ వర్మ సాహిత్య ఔర్ సమీక్ష, డా. సియారామ్ శరణ్ ప్రసాద్; పు. 132

అలా చేశారు. దీనిని బట్టి చరఖారీ అంటే ఆ సైనికులకు ఎంత అభిమానమో మనకు అర్థమౌతుంది.

రచయిత చరఖారీ పాత్రను పతి భక్తి, ఆశ్రిత వాత్సల్యం, కర్తవ్య పరాయణత, ఆత్మాభిమానం గల ఆదర్శ నారీ మణిగా చిత్రించారు. చరఖారీని చూస్తుంటే మనుచరిత్రలోని ప్రవరాఖ్యుని భార్య సోమిదేవమ్మ గుర్తుకు వస్తుంది. నడిరాత్రి అయినా అతిథులు వస్తే లేచి, విసుగు చెందకుండా పంచభక్ష్య పరమాన్నాలు వండి, వడ్డించి అతిథులను తృప్తి పరుస్తూ, భర్తకు అనుగుణంగా నడుచుకొనే ఇల్లాలు సోమిదేవమ్మ. చరఖారీ కూడా అలాంటి ఉత్తమ ఇల్లాండ్ర కోవకు చెందిందే.

ఒక వ్యక్తి ఏదైనా మంచి కార్యం చెయ్యాలంటే అతనికి అనుగుణంగా ప్రవర్తించే భార్య అవసరం. ఆ విధంగా ప్రవర్తించే స్త్రీలు తక్కువగా ఉంటారు. చరఖారీ అందుకు అపవాదం. ఆమె తన భర్తనే సర్వస్వంగా భావించి అతని లక్ష్య సాధనకు తన నగలనన్నింటిని కుదువబెడుతుంది. ఆమె రాజ పుత్రిక అయినప్పటికీ ఒక పేద స్త్రీవలె జీవితం గడుపుతుంది. ఏ మాటకు ఎదురు చెప్పని పతివ్రత. చరఖారీ వంటి స్త్రీలు భారత స్త్రీ జాతికే ఆదర్శమూర్తులు.

### 4.2.9. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి:

**4.2.9.1. ఝాన్సీ లక్ష్మీబాయి:** ఝాన్సీ రాణి లక్ష్మీబాయిని బాల్యంలో 'మనూ' అని పిలిచేవారు. ఆమె బాల్యం నుండే అమిత శౌర్య సాహసాలను కనబరచేది. ఉదారత్వం, సానుభూతి, దేశభక్తి, స్వాతంత్ర్య ప్రీతి ఆమె జీవితంలో మెండుగా ఉండేవి. బాల్యంలోని స్ఫూర్తి, ఉత్సాహం పెండ్లి అయిన తర్వాత

గాంభీర్యంగా పరిణామించాయి. బృందావన్ లాల్ వర్మగారు ఆమె వ్యక్తిత్వాన్ని అద్వితీయంగా చిత్రించారు. ఆమెకు సంబంధించిన ప్రేరణ, ప్రక్రియ, ప్రకృతి, పరిణతి మొదలైన వాటిని కళాత్మకంగా చిత్రించారు. ఆమె జీవితాన్ని మూడు దశలుగా విభజించి, ఆమె శీల స్వభావాలను పరిశీలించవచ్చు.

1. **మొదటి దశ:** మొట్టమొదట పదమూడు సంవత్సరాలకంటె తక్కువ వయస్సు గల మనూబాయి గంగానది ఒడ్డున నానాసాహెబ్, రావుసాహెబ్ లతో కలసి గుర్రపు స్వారీ చేస్తూ మనకు పరిచయమౌతుంది. ముగ్గురూ గుర్రాలపై స్వారీ చేస్తుండగా నానాసాహెబ్ గుర్రంనుండి క్రిందపడి గాయపడతాడు. అతడు క్రింద పడగానే "మనూ నేను చచ్చాను" అని అరుస్తాడు. మనూ క్రిందకు దిగి అతన్ని పరీక్షించి "గాయం ఏమంత పెద్దది కాదు" అని చెప్పి తన గుర్రంపై ఎక్కించుకొని వస్తుంది.[1] అప్పుడు ఆమె చూపిన సాహసాన్ని గూర్చి అక్కడున్న అందరూ ఆశ్చర్యపడ్డారు. అంత చిన్న వయస్సులోనే ఆమె చూపిన ధైర్య సాహసాలు అనన్య సామాన్యం.

మోరోపంతు, పేష్వా బాజీరావులు చిన్నప్పటినుంచి మనూబాయిని ఎంతో ప్రేమతో పెంచేవారు. ఒకసారి చింతాక్రాంతుడైన మోరోపంతు "ఇప్పుడు సమయం మారింది. పరిస్థితులు మనకు అనుకూలంగా లేవు" అని అన్నప్పుడు, మనూ "సమయం ఎందుకు మారింది? అదే ఆకాశం, అదే భూమి, సూర్యచంద్రులు వారే, అవే నక్షత్రాలు అన్నీ ముందటి వలెనే ఉన్నాయి. నేనేదైనా మాట్లాడాలి అనుకొంటే మీరే నా నోరు

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ, పు: 15.

మూయిస్తారు"[1] అని అంటుంది. ఇలా ఆమె తన అభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పేది. ఇంకొకసారి నానాసాహెబ్ పరిహాసంగా "నీకు ఏనుగుపై సవారి చేసే అదృష్టం లేదు" అంటే, "నా అదృష్టంలో ఒక ఏనుగు కాదు పది ఏనుగులపై స్వారి చేసే యోగం ఉంది"[2] అని అంటుంది.

ప్రజలు మనూబాయిని అందగత్తె అంటె ఆమెకు చాలకోపం వచ్చేది. "నాకు అందగత్తె అనిపించుకోవడం చాల అసహ్యం. ఒక వీర బాలిక అందగత్తె అనే పేరు స్వీకరించదు"[3] అంటుంది. ఆమె రాజకీయ విషయాలు మాట్లాడినప్పుడు అందరూ వదరుబోతు అనేవారు. అప్పుడు ఆమె "మీరే కదా తారాబాయి ఇలా ఉంటుంది, జిజియాబాయి అలా ఉంటుంది, అహిల్యాబాయి ఇలా అంటుంది, మీరాబాయి అలా అంటుంది అని చెప్తూ ఉంటారు. వీరందరూ మాట్లాడకుండా నోరు మూసుకొని ఉండేవారా?"[4] అని అడుగుతుంది. ఈ మాటల వల్ల మనూబాయికి దేశభక్తి కలిగేటందుకు తారాబాయి మొదలైనవారు ప్రేరణ కలిగించారని చెప్పవచ్చు.

ఆమె పెండ్లి విషయమై బాజీరావు, తాంత్యా దీక్షితునితో ప్రస్తావిస్తూ 'మనూ చాల అందమైనది. కుశాగ్రబుద్ధి గలది. మంచి భవిష్యత్తు కలది. ఆమెకు మంచి వరుణ్ణి వెతకాలి' అన్నప్పుడు ఆమె తండ్రి మోరో పంతు కూడ ఆమెను పొగడ్తూ "మనూ ఆయుధాలను ప్రయోగించడంలో నైపుణ్యం కలది. గుర్రపు స్వారీలో పురుషుల కంటె మిన్నగా ఉంటుంది.

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి — బృం. లాల్ వర్మ., పు: 17.
2. పైదే., పు: 22.
3. పైదే., పు: 23.
4. పైదే. పు: 25.

నాలుగు సంవత్సరాల వయస్సులో ఆమె తల్లిని పోగొట్టుకొంటే నేను స్వయంగా రాత్రింబవళ్ళు తల్లివలె పెంచి పెద్ద చేశాను. మరాఠీ, సంస్కృతం, హిందీ భాషల్ని నేర్పించాను. ఆమెకు శాస్త్రాల్లో కూడ అభిరుచి ఉంది."[1] అంతేకాదు "గుణాలకు తగ్గ అందం కూడ ఆమెలో ఉంది. విశాలనేత్రాలు, తుమ్మెదలకంటె నల్లగా ఉండే కేశపాశం, బంగారు వంటి రంగు, అందంగా ఉండే ముఖం ఆమె సౌందర్యానికి ప్రతీకలు."[2] మోరో పంతు అభిప్రాయంలో మనూబాయి వయస్సుకు మించిన బుద్ధి కలిగిన యువతి.

**రెండవ దశ :** ఆ కాల సంప్రదాయాన్ననుసరించి బాల్యంలోనే ఆమె వివాహం జరిగింది. బుందేల్ ఖండ్ లోని ఝాన్సీ రాజ్యాన్ని పాలించే గంగాధర రావుతో ఆమె పెండ్లి జరుగుతుంది. అప్పుడు గంగాధరరావు వయస్సు నలభై సంవత్సరాలు. అత్తగారింటికి వచ్చాక ఆమె పేరు మనూబాయి బదులుగా లక్ష్మీబాయి గా స్థిరపడింది. పెండ్లి అయిన తర్వాతనే ఆమె రాజకీయ విషయాలను తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంది. ఆమె సహచరులను, అనుచరులను అందర్నీ గౌరవంగా చూసేది. రాచరికంలో దాసీలుండడం ఆచారం. కాని లక్ష్మీబాయి రాజకీయ పరిజ్ఞానం కలది కాబట్టి, ఇక్కడ "నాకు దాసీలెవ్వరూ లేరు. నాకు ఎవ్వరూ దాసీలు కాకూడదు. అందరూ నా చెలికత్తెలే"[3] అంటుంది. ఆమె ఉద్దేశ్యంలో దాసీలకంటే చెలికత్తెలే పవిత్ర కార్యంలో భుజంతో భుజం కలిపి ముందుకు నడుస్తారు. దేశరక్షణలో వారే సహాయం చేస్తారు.

---

1. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ, పు; 26.
2. పైదే., పు; 27.
3. పైదే, పు; 61.

ఆమె జాతి, మత, వర్గ భేదాలను వదలిపెట్టి స్త్రీలందరితోనూ మనస్సు విప్పి మాట్లాడుతుంది. వారికి అనేక విధాలైన విషయాలు నేర్పుతుంది. శస్త్రాలు ప్రయోగించడం, శారీరకాభివృద్ధిని కలిగించే కార్యాలను నేర్పుతుంది. "పురుషులకు పురుషార్థాన్ని తెలియజేయాలంటే స్త్రీలు శస్త్ర ప్రయోగం, కుస్తీ మొదలైన విద్యలను నేర్చుకోవాలి. ఆటపాటలద్వారా కూడ స్త్రీల ఆరోగ్యం బాగుపడుతుంది. కాని అలంకరణపై ఎక్కువ మోజు ఉండకూడదు."[1] అని అంటుంది. ఆమె తన చెలికత్తెలను సాహసం కలవారినిగా చెయ్యాలని వారితో ఇలా చెప్తుంది. "నాతో కూడా ఉండగోరేవారు గుర్రపుస్వారీని బాగా నేర్చుకోవాలి. కత్తి, తుపాకీ, బల్లెం, బాణాలు మొదలైన వాటిని ప్రయోగించడం బాగా నేర్చుకొని ఉండాలి"[2] ఇలా రాణి లక్ష్మీబాయి స్త్రీలను దేశరక్షణకై ప్రోత్సహిస్తుంది.

"లక్ష్మీబాయికి ఆధ్యాత్మిక విషయంలో కూడ అభిరుచి ఉండేది దేశరక్షణ విషయంలో నిమగ్నమై ఉన్నా, తీరుబాటు చేసుకొని ఆధ్యాత్మిక గ్రంథాలు చదువుతూ ఉండేది"[3] ~~ఈ~~ధార్మిక ప్రవృత్తిని ఆమె జీవితాంతం ఆచరించింది. ఆమె ధర్మానికి సంబంధించిన మర్మాన్ని గ్రహించిన స్త్రీ కాబట్టి నిష్కామకర్మ, న్యాయంపై ప్రీతి, ఆ మార్గానే అనుసరించడం, పట్టుదల మొదలైన సుగుణాలు అబ్బాయి. ఆత్మతో పాటు శరీరంపై కూడ ఆమె దృష్టి ఉంచేది. "ధర్మ సాధనానికి శరీరం ముఖ్యం. ఆ శరీరం లోనే కదా ఆత్మ

1. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి - బృం. లాల్ వర్మ., పు: 60.
2. పైదే, పు: 62.
3. పైదే, పు: 62.

ఉండేది. . . . , శరీరాన్ని ఆరోగ్యవంతంగా ఉంచాలి అని ఆమె నమ్మకం"[1]

రాణిలక్ష్మీబాయి తన లక్ష్యాన్ని చేరుకోవడానికి కొన్ని మార్గాలను ఆచరించింది. అవి -

1. రాజు ప్రవర్తనలో మార్పు తీసుకొచ్చి అతన్ని శక్తివంతునిగా చేయాలని ప్రయత్నించడం.
2. స్త్రీలకు సైనిక శిక్షణ ఇప్పించడం.
3. ప్రతిపని పవిత్రంగా, దీక్షతో, ఔదార్యంతో చేయడం.
4. దాంపత్య జీవితాన్ని సంయమనంతో నిర్వహించడం.
5. దేశ రక్షణకై యుద్ధ నైపుణ్యాన్ని సంపాదించడం.

ఇలా ప్రతిపని సాధించేందుకు ఆమె తాను నమ్మిన సిద్ధాంతాలను తుచ తప్పకుండా జీవితాంతం పాటించేది. ఆనాటి రాజకీయ పరిస్థితులు, సాంఘిక పరిస్థితులు చక్కగా అవగాహన చేసుకొని ప్రజాక్షేమంకై ప్రయత్నించేది. రాజైన గంగాధర రావు ఆంగ్లేయులను సమర్థిస్తూ ఒక సందర్భంలో మాట్లాడిన మాటలను భర్త అయినా లెక్కచేయక అతని అభిప్రాయం తప్పని చెప్పి కర్తవ్యాన్ని బోధించేందుకు వెనుకాడదు.

దేశంలో కల్లోల వాతావరణం నెలకొన్నప్పుడు సంయమనం, కర్తవ్య పరాయణత మొదలైన వాటితో దేశాన్ని శాంతియుతం చేయడానికి ప్రయత్నిస్తుంది. రాజైన గంగాధర రావు నృత్యనాటకాలపై అభిరుచి కలవాడు. కానీ రాణి ఆ విషయాలను ఇష్టపడదు. రాజు ఆంగ్లేయులకు సహాయం చేస్తూ

---

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి — బృం.లాల్ వర్మ., పు., 62.

మెప్పు పొందాలని ప్రయత్నం చేస్తాడు. ఇట్టి విపరీత పరిస్థితుల్లో, సంయమనంతో నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించడం సాధ్యం కాని పని. కాని రాణి అధైర్య పడక, పరిస్థితుల్ని అవగాహన చేసుకొని క్రాంతిని విడనాడి, మెల్లమెల్లగా దేశ ఔన్నత్య సంపాదనకై కార్యక్రమాన్ని ఏర్పరచు కొంటుంది. రాజు లక్ష్మీబాయిపై కోపించి ఆమెను కోటనుండి బయట పోవడానికి అంగీకరించడు. అప్పుడామె కోటలోనే శస్త్రాభ్యాసం చేస్తుంది. శారీరక ధారుఢ్యాన్ని పెంచుకొంటుంది. అంతేగాక ఇతర స్త్రీలకు కూడ శిక్షణ ఇస్తుంది. రాజు తన ఉద్దేశాలకు భిన్నంగా ప్రవర్తించినా, ఆమె శక్తిని, క్రియా నైపుణ్యాన్ని గ్రహిస్తాడు. ఆమె బుద్ధిని, చాతుర్యాన్ని మెచ్చుకొంటాడు. అతడు మేజర్ ఎలియస్‌తో ఇలా అంటాడు. "మేజర్ గారూ! మా రాణి స్త్రీ అయినా ప్రపంచంలో పెద్దపెద్ద పురుషులు కూడా సాధించలేని, అందరూ మెచ్చుకోదగ్గ పనులు చేస్తుంది. అంతేగాక ఆమె గుణాలు ఎంతో ఉత్తమమైనవి. ఆదర్శ ప్రాయాలు"[1]

ఈ సమయంలో ఆమె ఒక పుత్రుని కంటుంది. కాని అతడు కొద్ది కాలానికే మరణిస్తాడు. రాజు కూడ పుత్ర వియోగంతో బాధపడుతూ మరణిస్తాడు. మరణించే ముందు దామోదర రావును దత్తు తీసుకొని మరణిస్తాడు.

**మూడవ దశ:** ఈ అంధకార బంధురమైన వాతావరణంలో పులిమీద పుట్రలా ఆంగ్లేయులు ఝాన్సీని ఆక్రమించి ఆంగ్ల ప్రభుత్వాన్ని స్థాపించారు. ఆ సమయంలో ఝాన్సీరాణి సంపూర్ణ దేశంలో స్వరాజ్య ప్రాప్తికి క్రాంతి

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి - బృం.లాల్ వర్మ, పు: 114

నెలకొల్పుతుంది. సుందర్, ముందర్, కాశీబాయి, మోతీబాయి, ఝల్ కారీ, కోరిన్, తాంత్యాతోపే అందరూ దేశం నలుమూలలా క్రాంతిని అధికం చేస్తారు. రాణి దామోదర రావును దత్తు తీసుకోవడం చెల్లదని ఆంగ్లేయులు ప్రకటించారు. రాణికి నెలకు కేవలం ఐదు వందల రూపాయల భృతిని నిర్ణయించారు. రాణి దూరదృష్టి కలది. కాబట్టి తన ఆవేశాన్ని అణచుకొని క్రాంతి ద్వారా కలిగే వినాశాన్ని కొంతకాలం ఆపుతుంది. దేశంలోని రాజకీయ పరిస్థితులు అనుకూలంగా లేవని తెలుసుకొంటుంది. ఢిల్లీ పాదుషా వృద్ధుడు. రాజపుత్రులు పరస్పరం పోట్లాడుతుండేవారు. గ్వాలియర్‌ను ఆంగ్లేయులు లోబరచుకున్నారు. ఇండోర్ నాశనమయ్యింది. హైదరాబాద్ శాసకులు ఆంగ్లేయులకు లొంగిపోయారు. సిక్కులు పరస్పరం పోట్లాడుకొంటూ శక్తిహీనులయినారు. ఇట్టి పరిస్థితుల్లో చాల జాగ్రత్తగా విప్లవాన్ని నడుపవలసి వచ్చింది. ప్రజలను చైతన్యవంతుల్ని గావించి రాజ్యాన్ని స్థాపించాలని రాణి నిశ్చయించుకొంది. "ప్రజలే స్వరాజ్యాన్ని సంపాదించేందుకు శక్తివంతులు. ప్రజాశక్తి అక్షయమని నా నమ్మకం. ఛత్రపతి శివాజీ ప్రజల సహకారంతోనే ఢిల్లీ పాదుషాను ఎదుర్కొన్నాడు. రాజుల సహాయం కంటే ప్రజల సహాయమే గొప్పదని నా దృఢ నిశ్చయం."[1]

"కర్మ చేయడం మన కర్తవ్యం. దానికి ఫలం దైవాధీనం. ప్రజలు మనవైపు ఉన్నారు. ప్రజల్లో స్వరాజ్య పిపాసను కల్పించాలి. ఆంగ్లేయులు రాజ్యాలను, రాజులను వశింపచేయవచ్చునే కాని, ప్రజలందర్నీ ఏమీ చేయలేరు.

1. బాయి – బృం. లాల్ వర్మ., పు: 140

ఈ ప్రజల ముందరే నేను స్వరాజ్య పతాకాన్ని ఎగురవేస్తాను. ఆ దినం త్వరలోనే వస్తుందని ఆమె చాటి చెప్పింది."[1]

"భారత దేశానికి స్వరాజ్యం వచ్చిన తర్వాత నేను కేశ ముండనం చేసుకొంటాను. లేకుంటే శ్మశానంలో అగ్నిదేవుడే నా శిరోముండనం చేస్తాడు."[2] అని చెప్తుంది. ఆంగ్లేయులు రాజ్యాన్ని అపహరించారని ఆమె చెలికత్తెలందరూ ఆభూషణాల్ని వదిలి ఆమె వద్దకు వచ్చినపుడు, ఈ చిహ్నాలు నాశక్తిని, అసమర్థతను వెల్లడిస్తాయి. మీరందరూ మీ ఆభూషణాల్ని ధరించండి. ధరించి ఏమీ కానట్లు నిశ్చింతగా ఉండండి. కన్నీళ్ళు బలాన్ని క్షీణింపచేస్తాయి. ఇప్పటి వరకు మన కార్యక్రమం ప్రారంభం కాలేదు. కొంచం ఆలోచించండి. ఛత్రపతి తర్వాత శంభాజీ చంపబడ్డారు. షాహూ రాజారామ్ గతించాడు. అప్పుడు తారాబాయి ఒక్కతే విశాలమైన మొగలు సామ్రాజ్యాన్ని ఓడించ గలిగింది. ఆమె భర్త మరణించాడని ఆమె దుఃఖపడలేదు. కాబట్టి మనం కూడా ఆంగ్లేయుల అత్యాచారాన్ని ఎదుర్కోవాలి.

ఇలా ఝాన్సీరాణి దేశరక్షణకై భయంకర యుద్ధం కావించి తన ప్రాణాలను అర్పించింది.

లక్ష్మీబాయిలో కొన్ని అసాధారణ గుణాలున్నాయి. పరాక్రమం, శౌర్యం, త్యాగం, కర్తవ్య పరాయణత, దృఢత, న్యాయప్రియత, ఉదారత, సూక్ష్మ పరిశీలనా శక్తి, ఆధ్యాత్మిక చింతన, మాననీయత, శారీరక బలం, సంయమనం, ఆత్మస్థైర్యం, సరసత, రాజకీయ చాతుర్యం

---

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి - బృం.లాల్‌వర్మ, పు; 140.
2. పైదే పు; 152

మానవతావాదం, విశాల మనస్తత్వం, దృష్టికోణం, స్త్రీ జాతిని చైతన్య వంతం కావించడం, దేశప్రేమ, స్వతంత్ర భావన, పాతివ్రత్యం, ధైర్యం మొదలైన పవిత్రమైన గుణాల సమ్మేళనమే లక్ష్మీబాయి.

ఇన్ని సుగుణాలను ప్రకృతికి పుచ్చుకొన్న లక్ష్మీబాయి అమిత సౌందర్యవతి కూడ. కాని ఆమె శారీరక అందానికి ఏనాడూ ప్రాముఖ్య మివ్వ లేదు. అతిగా అలంకరించు కోవడమంటే ఏహ్యాభావం కనబరచేది. దీనినిబట్టి ఆమె మనస్సుకు ప్రాధాన్యత ఇచ్చిందే కాని శారీరక అందానికి కాదు. ఆమె గొప్పతనాన్ని చూచే ఆమె కంటే పెద్ద వారైన తాంత్యా, నానాసాహెబ్ మొదలైనవారు ఆమె పాదాలకు నమస్కరించే వారు. హిందువులే కాక మహమ్మదీయులు కూడా ఆమె ఆదేశిస్తే ప్రాణాలను అర్పించేందుకు సిద్ధంగా ఉండే వారు. నిజం చెప్పాలంటే లక్ష్మీబాయి వ్యక్తిత్వం అసాధారణమైనది; అపూర్వమైనది. ఆమె వ్యక్తిత్వం భారత దేశంలోని స్త్రీ జాతికి ఆదర్శప్రాయం.

**4.2.9.2. గంగాధర రావు:** బుందేల్ ఖండ్ లోని ఝాన్సీ రాజ్యానికి రాజు గంగాధర రావు. ఇతడు సాహిత్యంలోనూ, లలిత కళల లోనూ అభినివేశం కల రసికుడు. చాలమంది కళాకారులకు ఆయన ఆశ్రయం ఇచ్చే వాడు. నాట్య కళలో అతడు మిక్కిలి నేర్పరి. ఒక్కొక్కప్పుడు తాను స్వయంగా నాటకాల్లో అభినయం చేసేవాడు. సాహిత్య క్షేత్రంలో అతనికి అభిరుచి మెండు. "అనేక రకాలైన హస్త లిఖిత గ్రంథాలను, తాటియాకు గ్రంథాలను ఎన్నింటినో సేకరించి ఒక ఉత్తమ పుస్తక భాండాగారాన్ని అభివృద్ధి చేశాడు. ఆయన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, అర్థశాస్త్రాలు,

ఆయుర్వేదం , జ్యోతిషం , వ్యాకరణం మొదలైన వాటికి సంబంధించిన అనేక గ్రంథాలను సేకరించి తన పుస్తకాలయంలో నింపాడు. ఆ పుస్తక భాండాగారాన్ని చూడడానికి దూర దూర దేశాల్నించి , విదేశాల్నించి కూడా అనేకమంది వచ్చి చూచి మెచ్చుకునేవారు "[1]

"ఆయనకు నాటకాలంటే చాల అభిరుచి . అనేక సంస్కృత నాటకాలను హిందీలోకి , మరాఠీలోకి అనువాదం చేయించాడు. తన నాట్య శాలలో ఎంతో మంది నర్తకులను నియమించాడు. వారిలో మోతీబాయి చాల ప్రసిద్ధి కలది " —

గంగాధరరావు కోపిష్టి . మొండి పట్టుదల కలవాడు. చిన్న చిన్న విషయాలకు కూడ ఆయన కోపపడేవాడు . తప్పు చేసిన వారిని శ్ళతో కరిపించేవాడు. వాతలు వేయించేవాడు. అతడు ఝాన్సీరాణి గొప్పదనాన్ని తెలిసినవాడు ; కాబట్టే రాణిపట్ల ఆయన కఠినంగా ప్రవర్తించేవాడు కాదు. వారి దాంపత్య జీవితం సుఖంగానే సాగింది . ప్రాచీన సంప్రదాయాలంటే అతనికి చాల ఇష్టం. కాబట్టే రాణికి పూర్తిగా స్వేచ్ఛ లభించలేదు. అతడు స్త్రీ స్వాతంత్ర్యాన్ని అంగీకరించేవాడుకాదు. స్త్రీలు గుర్రపు స్వారీ చేయడం , కుస్తీలాంటి విద్యలు నేర్చుకోవడం , ఆయుధాలు ప్రయోగించడం గంగాధరరావుకి ఏ మాత్రం ఇష్టం ఉండేదికాదు. ఇంటిలో చాలినంత పని ఉంటే, దానిని చేయకుండా స్త్రీలు గుర్రపుస్వారీ, కుస్తీ మొదలైన వాటిని

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి — బృం. లాల్ వర్మ., పు: 8.

2. పైదే., పు: 8 .

నేర్చుకొంటే ఎందుకూ పనికి రాకుండా పోతారని అతడు అనే వాడు.

భారతీయులు పరస్పరం కలహిస్తూ ఉంటారు. ప్రతి గ్రామంలో కూడ దోపిడీలు, దొంగతనాలు జరుగుతుంటాయి. కాబట్టి భారత దేశానికి స్వాతంత్ర్యం రావడం అంత సులభం కాదు. ఆంగ్లేయుల వద్ద మంచి ఆయుధాలున్నాయి. కాబట్టే వాళ్ళు మనదేశంలో ప్రభుత్వాన్ని స్థాపించగలిగారన్నది గంగాధర రావు అభిప్రాయం.

తమకు సంతానం లేదని అతడు చాల బాధపడే వాడు. అందువల్ల అతని మనస్సు ఎల్లప్పుడూ వ్యాకుల పడుతూ ఉండేది. అతడు సాధారణంగా అనారోగ్యంగా ఉండే వాడు. అతనికి పుత్రుడు పుట్టి చనిపోగా మానసికంగా బాధపడ్డాడు. ఆ కారణంగా ఎల్లప్పుడూ అస్వస్థుడుగా ఉండేవాడు. చివరకు విధిలేక దామోదర రావును దత్తు తీసుకొంటాడు. అయినప్పటికి అతని మనస్సుకు శాంతి లభించలేదు. అతడు మనో వ్యాధితో బాధ పడి అసువులు కోల్పోతాడు.

**4.2.9.3. మోతీబాయి :** మోతీ బాయి ఝాన్సీరాజైన గంగాధరరావు నాటక శాలలో ప్రధానమైన నాట్యకత్తె. "ఆమె సౌందర్యం వర్ణనాతీతం. ఆమె కుసుమ కోమలాంగి. ఆమె కంఠం చాల మధురమైంది. వేశ్యపుత్రిక అయినా ఆమె తన శీలాన్ని పోగొట్టు కోలేదు. ఆమె చిన్న వయస్సులోనే గంగాధరరావు నాటక శాలలో నాట్యకత్తెగా చేరింది. ఆమె నాట్యం చూచినవాళ్ళు ఆమె నాట్యాన్ని, సౌందర్యాన్ని, హావభావాలను వేనోళ్ళ కొనియాడే వాళ్ళు."[1] మోతీబాయి

[1] ఝాన్సీ కీ రాణి లక్ష్మీ బాయి – బృం.లాల్ వర్మ, పు: 8

పవిత్రమైన స్వభావం కలది. రాణి లక్ష్మీబాయికి ఆమె ఎంతో విశ్వాసపాత్ర మైన సేవకురాలు. నవాబ్ అలీ బహాదూరు మోతీబాయిని పిలిపించి రాజ మహలులోని రహస్యాలను తెలుపమని అడుగుతాడు. ఆమె చాలా నైపుణ్యంగా అబద్ధమాడి బయట పడుతుంది. ఆమె రాణి వద్దకు వెళ్ళి అలీ బహాదూర్ చెడ్డ వాడు. అతడు ఆంగ్లేయుల గూఢచారి కావచ్చు. జాగ్రత్తగా ఉండడం మంచిదని సలహా ఇస్తుంది.

లక్ష్మీబాయి, మోతీబాయిని గూఢచారి విభాగానికి ప్రధానాధి కారిణిగా నియమిస్తుంది. ఆమె చాల ముఖ్యమైన సమాచారాల్ని తగిన సమ యంలో రాణికి అందజేస్తూ ఉంటుంది. ఆమె దూరదృష్టి కలది. గంగాధర రావు వద్దకు సందేశాన్ని పంపడానికి మోతీబాయి జుహీ పేరును ప్రస్తావిస్తుంది. 'ఆమె' సుకుమారి, అమాయకురాలు. ఆమెను పంపుట మంచిది కాదు' అని రాణి అంటే మోతీబాయి 'మహారాణీ ప్రపంచంలో ఎంత కోమలత్వం ఉందో అది మీలో ఉంది. మీ కంటె సుకుమారి ఇంకెవరు ఉన్నారు' అని చమత్కారంగా మాట్లాడుతుంది.

మోతీబాయి తుపాకీని ప్రయోగించడంలో నేర్పరి. రాణి 'ఓరఛ' దుర్గం వద్ద 'దుల్హాజు'కి సహాయం చేయడానికి మోతీబాయిని పంపుతుంది. ఆమె అక్కడ ఖుదాబక్ష్ అనే వానిని ప్రేమిస్తుంది. రాణికి సాయంగా ఉండ మని అతన్ని కోరుతుంది. ఆమె అపూర్వమైన ధైర్యసాహసాలతో ఆంగ్లేయు లను ఎదుర్కొంటుంది.

ఆమె ధైర్యసాహసాలను చూచి లక్ష్మీబాయి "మీరు చూపించే

సాహసకార్యాలను నేను కండ్లారా చూచాను. నాకు చాల ఆనందంగా ఉంది" అంటుంది. కోట దక్షిణం వైపు మందు గుండు కురిపించమని రాణి మోతీబాయిని ఆదేశిస్తుంది. ఆమె వెంటనే అక్కడికి పోయి తన కార్యాన్ని ప్రారంభిస్తుంది. అక్కడ మందు గుండు సామగ్రిని పేలుస్తుండగా ఆమె భుజానికి పెద్ద గాయం అవుతుంది. గాయపడిన మోతీబాయి తలను లక్ష్మీబాయి తన ఒడిలో ఉంచుకున్నప్పుడు, 'మీ ఒడిలో తల ఉంచుకొని చనిపోయే భాగ్యం అందరికీ రాదు' అని మోతీబాయి అంటుంది. అప్పుడు రాణి ఆమె తల నిమురుతూ " నీవు నేడు వజ్రం అయినావు. నీవు పవిత్రురాలవు. ఏదో ఒకదినం అందరికీ చావు వస్తుంది. మంచి కార్యంలో ప్రాణాలు వదలడం, భగవంతుని స్మరిస్తూ చనిపోవడం పూర్వజన్మ సుకృతం వల్లనే లభిస్తుంది. ఆత్మ శాశ్వతమైనది. శరీరం అశాశ్వతం. దాన్ని గురించి దుఃఖ పడవలసిన అవసరం లేద"ని రాణి శాంత గంభీర వచనాలతో మోతీబాయిని సముదాయిస్తుంది.

మోతీబాయి వేశ్యాకులంలో పుట్టి నాట్యాన్ని, లలిత కళలను చక్కగా నేర్చుకొని గంగాధర రావు నాట్యశాలలో నర్తకిగా పేరు ప్రఖ్యాతులు గడించడమే కాకుండా, దేశ రక్షణలో, గూఢచర్యంలో కూడా ఆమె అద్భుతమైన ధైర్య సాహసాలు చాకచక్యం చూపించింది. కాబట్టే "వజ్రాదపి కఠోరాని మృదూని కుసుమాదపి" అనే ఆర్యోక్తి ఆమెపట్ల సార్థకం అయింది.

ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ., పు: 393.

**4.2.9.4. బాబా గంగాదాసు :** బాబా గంగాదాసు సర్వసంగ పరిత్యాగి. సోనరేఖ నదికి ఉత్తరాన అతని కుటీరం ఉండేది. ఆ కుటీరం చాల నిరాడం బరమైంది. ఝాన్సీరాణి రాజకీయ విషయంలో ఆయన సలహాను తీసుకోవడానికి, ఆశీర్వాదాన్ని పొందడానికి అప్పుడప్పుడూ ఆ కుటీరం వద్దకు వస్తూ ఉండేది. గంగాదాసు ఆమెను గౌరవంగా, ఆప్యాయంగా చూచేవాడు. రాజకీయ విషయాల్లో ఆయన సలహా అడిగేదానికి వస్తే ఆయన "రాజకీయాలతో నాకెలాంటి సంబంధం లేదు. భగవంతుని ధ్యానించడమే నాధ్యేయం" అంటాడు. అప్పుడు రాణి బాబా! మీలాంటి ఉత్తముల సలహాలు నాలాంటి వాళ్ళకు చాలా అవసరం. నడి సముద్రంలో చిక్కుకున్న చుక్కాని లేని నావవలె ఉంది నా పరిస్థితి. మరి ఆంగ్లేయుల కబంధ హస్తాల్లో నలిగిపోతోంది మనదేశం. ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో మీలాంటి మహానుభావుల సలహాలు మాకెంతో అవసరం అంటుంది. అప్పుడు గంగాదాసు "అమ్మా! అడుగు. నా మనస్సుకు తోచిన సలహా ఇస్తాను" అంటాడు. అప్పుడు రాణి "ఈ దేశానికి స్వరాజ్యం ఎలా వస్తుంది ?" అని అడుగుతుంది. అప్పుడు ఆయన "సేవ, తపస్సు, ఆత్మార్పణ ద్వారా స్వరాజ్యం లభిస్తుంది" అని సమాధానం చెబుతాడు. అప్పుడు రాణి "మనం స్వరాజ్యాన్ని ఎలాస్థాపించగలం ?" అని ప్రశ్నిస్తుంది. అందుకాతడు "ఒక భవనాన్ని నిర్మించాలంటే ఒకరాతిపై మరొకరాయి ఉంచుతాము. ఇలా చాలా రాళ్ళు ఉంచితే పునాది ఏర్పడుతుంది. ఆ పునాదిపై భవనాన్ని నిర్మిస్తాము. కాని ఆ భవనానికి ఆధారం పునాదియే. ఆ పునాదిని ఒకటిరెండు రాళ్ళతో ఒకేదినంలో కట్టలేము. నిరంతరం ప్రయత్నం చేయడం,

శ్రమ పడడం పునాది నిర్మాణానికి దోహదం చేస్తాయి" అని అంటాడు. అప్పుడు రాణి "మన జీవితకాలంలో స్వరాజ్యాన్ని స్థాపించ గలమా?" అని అడుగుతుంది. అందుకాయన "ఇతరులు ప్రారంభించిన కార్యాన్ని నీవు కొంచం ముందుకు నడిపావు. కొంత కాలానికి ఇతరులు కూడ ఇదే మార్గాన్ని అనుసరిస్తారు. వారి కార్యాన్ని ముందుకు సాగిస్తారు. స్వరాజ్యాన్ని స్థాపించ డానికి కొంతమంది రాజులు చిన్న చిన్న రాజ్యాలను స్థాపిస్తారు. జనులు పూర్తిగా స్వరాజ్యం కోసం పోరాడే వారికి సహాయం చేస్తే తప్పకుండా స్వరాజ్యం ప్రాప్తిస్తుంది. అప్పుడే స్వరాజ్యం అనే భవనం స్థిరంగా నిలబడు తుంది. ఈ నాడు ధర్మం అడుగంటి పోతూ ఉంది. దీన్ని చక్కబెడితే స్వరాజ్య భవనం స్థిరంగా ఉంటుంది" అని అంటాడు.¹

బాబా గంగాదాసు ఆధ్యా చింతన కలవాడు. ప్రపంచం అంతా భగవంతుని స్వరూపం అనీ, అన్ని ప్రాణుల్లో ఉండే ఆత్మ పరమాత్మ స్వరూపమే ననీ భావించే వాడు. కాబట్టే రాణి చనిపోయిన తర్వాత – "ఆత్మ అనంతమైంది. అది సృష్టిలోని ప్రతి అణువులో ప్రకాశిస్తూ ఉంది. ఈ ప్రకాశం మరలా ఉదయిస్తుంది. అది ప్రతి అణువులో ప్రతిభాసిస్తుంది" అని అంటాడు.

**4.2.9.5. సాగర సింహ :** 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' నవలలో సాగర సింహుని ప్రాసంగిక కథకు చాల ప్రాముఖ్యం ఉంది. సాగర సింహ పేరెన్నిక గన్న బంది పోటు. అతడు బలిష్ఠుడు, చురుకైన వ్యక్తి. అతడి కళ్ళు తీక్షణంగా ఉంటాయి. గడ్డం చాల పొడవుగా ఉంటుంది. ఆంగ్లేయులు చాల

ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ, పు: 444 – 446
పైదే; పు: 446

శ్రమపడి అతణ్ణి బంధించి చెరసాలలో ఉంచుతారు. తమ సైనికులను ముప్పు తిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు త్రాగించిన అతణ్ణి చూడాలని స్కీన్, గార్డన్ అనే ఇద్దరు ఆంగ్లేయ అధికారులు చెరసాలకు వెళ్తారు. సంకెళ్ళు బంధింప బడిన సాగర సింహుడు బోనులో బంధింప బడిన మృగంలా ఉంటాడు అతణ్ణి చూచి స్కీన్, గార్డన్‌లు ఎంతో ఆశ్చర్య పడతారు. కాని ఆ అధికారులను చూచి సాగరసింహుడు ఎంతో దీనంగా తన సంకెళ్ళను తొలగించమని ప్రార్థిస్తాడు. దేశంలో అరాచకం ఏర్పడితే, దోపిడీ దొంగలు ప్రజల్ని పీడిస్తూ ఉంటే, ఝాన్సీ రాజ్యాన్ని కబళించవచ్చు అన్న ఉద్దేశ్యం ఉందో ఏమో ఆ ఆంగ్లేయ అధికారులకు; వారిలో వారు తర్జన భర్జనలు చేసుకొని వారు సాగర సింహుని సంకెళ్ళను తొలగిస్తారు. అతనికి రుచికరమైన భోజనం కూడా పెడతారు. కాని రాత్రి సమయంలో ఆంగ్లేయ సైనికుల కళ్ళుగప్పి సాగర సింహుడు అడవిలోకి పారిపోతాడు[1] స్కీన్, గార్డన్‌లు ఎంత ప్రయత్నించినా అతని జాడ తెలుసుకోలేక పోతారు.

తర్వాత సాగర సింహుడు తన ముఠాతో ప్రజలను విచ్చలవిడిగా పీడిస్తుంటాడు. ఈ విషయం రాణి లక్ష్మీబాయికి తెలుస్తుంది. ఆమె అతణ్ణి బంధించడానికి ఖుదాబక్ష్‌ను నియమిస్తుంది. ఖుదాబక్ష్ కొంత సైన్యంతో అడవిలోకి చొచ్చుకొని పోయి గాలించి, సాగర సింహుని నివాసస్థానం కనుక్కొని చుట్టుముట్టుతాడు. సాగర సింహుడు గొప్ప సాహసవంతుడు. తన నివాసస్థానంలో పోరాడడం మంచిది కాదని అతడు వెలుపలికి వచ్చి

[1] ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి – బృం. లాల్‌వర్మ., పు: 183

పోరాడుతారు. ఆ పోరాటంలో ఖుదాబక్ష్‌ను, అతని సైనికులను గాయపరచి సాగర సింహుడు పారిపోతాడు. అటు తర్వాత లక్ష్మీబాయి సాగర సింహుని బంధించే పనిని తన భుజస్కంధాల పైనే వేసుకొని సుందర్, ముందర్, మోతీబాయిలతో బాటు కొద్ది మంది అనుచరులతో అడవిలోకి వెళ్ళి అసాధారణ ధైర్య సాహసాలతో, పట్టుదలతో అడవిని గాలించి, చివరకు సాగర సింహుని బంధిస్తుంది.

రాణికి బందీ అయిన సాగర సింహుడు రాణితో ఇలా అంటాడు. తాను దేశభక్తి కలవాడనీ, ఆంగ్లేయ ప్రభుత్వానికి వ్యతిరేకంగా బందిపోటుగా మారాననీ, తమ వంశం ఎల్లప్పుడూ యుద్ధాలలో పాల్గొంటూ ఉండేదనీ, తాము 'ఓరభా' రాజుకు సహాయంగా పోరాడే వారమనీ, తాను శివాజీ సైన్యంలో చేరి మహమ్మదీయులకు వ్యతిరేకంగా యుద్ధం చేశాననీ, ఆంగ్లేయులు భారత దేశానికి వచ్చి కొద్ది కొద్దిగా భారతదేశాన్ని ఆక్రమిస్తూ ఉంటే కొంత మంది రాజులు వారి ప్రభుత్వాన్ని అంగీకరించకుండా తిరగబడ్డారనీ, కొంతమంది అనుచరులతో ఈ రాజులకు సహాయపడే వాడనీ, తమను అణచి వేయడానికి ఆంగ్ల ప్రభుత్వం ప్రయత్నిస్తే పారిపోయి దొంగలుగా మారామనీ చెప్పారు. నిజానికి తనుగాని, తన అనుచరులుగాని దీనులను, స్త్రీలను బాధించలేదనీ, కావాలంటే గంగాజలాన్ని సాక్షిగా ఉంచుకొని శపథం కూడా చేస్తాననీ అంటాడు.[1]

కాని రాణి లక్ష్మీబాయి కళ్ళు నిప్పులు కక్కుతూ "సాగర సింహా

---

1. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ., పు 131

ఇంతవరకు నీవు పీడించిన ప్రజలు నా దేశ ప్రజలు గానీ , ఆంగ్లేయులు కారు' అంటుంది. అప్పుడు ఆమె అపరకాళి వలే సాగర సింహునకు కనబడుతుంది. సాగరసింహుడు ఆమె కాళ్ళపై పడి తమ తప్పులు క్షమించమని ప్రార్థిస్తాడు. రాణి సాగర సింహుని క్షమించడమే కాక తమ సైన్యంలో చేరడానికి అతనికి, అతని అనుచరులకూ అనుమతి ఇస్తుంది.

ఇలా రాణి , మంచితనంతో, తెలివితేటలతో , ధైర్య సాహసాలతో దోపిడీ దొంగల మనస్సులను మార్చివేస్తుంది. ఆంగ్లేయుల కళ్ళల్లో దుమ్ము కొట్టి పారిపోయిన దొంగలను , వారు బంధించలేక పోతారు. కాని రాణి వాళ్ళను బంధించి వారిలో మానసిక పరివర్తన కలిగిస్తుంది. ఇది రాణి తెలివి తేటలకు , ధైర్యసాహసాలకు , తెగింపునకు , పట్టుదలకు , మంచి తనానికి మచ్చుతునక.

· ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ., పు: 131.

4.3.0. ప్రవేశిక : పాత్ర చిత్రణ నవలకు చెందిన ముఖ్యాంశాల్లో (components) ఒకటి. అడివి బాపిరాజు, బృందావన్‌లాల్ వర్మగార్లు తమ చారిత్రక నవల్లో పాత్ర పోషణ అద్భుతంగా గావించి ఉన్నారు. వీరి నవలలు చదువుతూంటే అన్ని పాత్రలు సజీవాలై మన కళ్ళకు కట్టినట్లు కన్పిస్తాయి. రాజులు, రాణులు, కథానాయికా నాయకులు మొదలుకొని సామాన్య జనుల వరకు విస్తరించిన వీరి పాత్రపోషణా పరిధిని పరిశీలిస్తే వీరిద్దరి తమ నవలలకు స్వీకరించిన భూభాగంతోనూ, సామాజిక నేపథ్యంతోను అధిక పరిచయమున్నట్లు గోచరిస్తుంది. వీరిరువురూ పాత్ర పోషణాలో చూపిన నైపుణ్యాం కొనియాడదగింది. కథా వస్తువు శరీరం లోని ఎముకలైతే, పాత్ర పోషణ ఆ ఎముకలను అంటి పెట్టుకొన్న రక్త మాంసాదులచే ఏర్పడ్డ శరీరాంగాలు. శరీరాంగాలు స్పష్టంగా, దృఢంగా తగినట్లు ఉంటేనే శరీరాకృతి అందంగా కనబడుతుంది. ఏ అంగం విహీనమైనా, దుర్బలమైనా శరీరాకృతిలో కురూపత్వం కనబడుతుంది. సమతౌల్యం (balance) లోపిస్తుంది. అలాగే పాత్ర పోషణాలో తగినంత శ్రద్ధాసక్తులు కనబరచక పోతే ఆ నవల కూడ పాఠకులను ఆకర్షించలేక పోతుంది. అడివి బాపిరాజు, బృందావన్‌లాల్ వర్మ గార్లు తమ నవల్లో పాత్ర పోషణ చక్కగా గావించారనడంలో సందేహం ఏ మాత్రం లేదు. వీరిద్దరూ ఒకే కాలానికి చెందినవారైనా, స్వీకరించిన కథా వస్తువులు విభిన్న కాలాలకు చెందినవి. కాబట్టే వీరిద్దరి పాత్రల విషయంలో సామ్య వైషమ్యాలుండడం సహజం. వీరిద్దరూ చిత్రించిన పాత్రలలోని సామ్య వైషమ్యాలను తులనాత్మకంగా ఈ క్రింది

విధంగా పరిశీలించవచ్చు.

4.3.1. **స్త్రీ పాత్రలు:** అడివి బాపిరాజు గారి రచనల్లో 1. హిమబిందు, 2. చంద్రబాల, 3. నాగబంధునిక, 4. అడవి శాంతిశ్రీ, 5. తారానిక, 6. రుద్రమదేవి, 7. అన్నాంబిక, 8. అంశుమతి మొదలైనవి ముఖ్యమైన స్త్రీ పాత్రలు. వీరిలో హిమబిందు, అడవి శాంతిశ్రీ, రుద్రమదేవి, అంశుమతి ఆయా నవలల్లో నాయికలు. కాని హిమబిందులో చంద్రబాల, గోనగన్నారెడ్డి నవలలో అన్నాంబిక పాత్రలు నాయికలు కాకున్నా, నాయికలతో సమానమైన ప్రతిపత్తిగల పాత్రలు. పైన చెప్పిన బాపిరాజుగారి స్త్రీ పాత్రలందరూ జగదేక సుందరీ మణులే. బాపిరాజు గారు స్త్రీల అంగాంగాలను వర్ణించడంలో కొంచం మితిమీరినట్లు కన్పిస్తుంది. మచ్చుకు ఒక ఉదాహరణ. "ఒక బాలిక ఆప్పరుషా భరణాలన్నీ ఒలిచినది. స్తనవల్కలముతో ఆ దివ్య సౌందర్య గాత్రి అపరాజితా దేవి వలె ఒప్పినది. ముచ్చెలు తొడుగు కొని, యా కాకతీయ కుల రాకా చంద్రిక స్నాన మందిరానకు నడచినది. .... ఆమె పాదాలు కమలాల మొగ్గలే, ఆమె పాదాలు పావురాల జంట, ఆమె పాదాలు పాల సముద్రంలో కెరటాల తాకుడు వల్ల ఏర్పడిన అమృతపు వెన్న ముద్దలు. .... స్త్రీ దిగంబరియై స్నానమాచరించాలట ... ఇరువది రెండేళ్ళ ఈడుగల ఆయోషకు బంగారు రంగులో కాశ్మీర కుసుమ వర్ణమూ, జపా కుసుమ వర్ణమూ రంగరించి, దిరిసెన పూవు మెత్తదనము కలిపినట్లున్న దేహ సౌభాగ్యము చూచి ఆ మార్జనికులు ఉప్పొంగి పోతూ ఉంటారు...... ఆయమ మేలిమి పసిడి వక్షోజాల శిఖరితములైన చూచుకాలు కాళిదాస

శాకుంతల నాటకంలోని నాల్గవ అంకంలోని "శుశ్రూష స్వగురూన్", "యాస్యత్యద్య శకుంతల లేతి" అనే శ్లోకాలులా ఉన్నాయి..... రుద్రదేవి అతిలోక సుందరమగు తన వనితారూపమావేళ గమనించుకొన్నది.... ఆమె రూపంలోని దిగంబర వనితా దేహాన్ని చూచి సిగ్గుపడి కన్నులు మూసికొన్నది.[1]

బాపిరాజు గారు స్త్రీలను వర్ణించేటప్పుడు ఇంతకన్నా శృంగారంగా వర్ణించిన సన్నివేశాలు అనేకం ఉన్నాయి. ఆయన నవలల్లో స్త్రీలు దిగంబరులుగా, నగ్నంగా, వివస్త్రలుగా అక్కడక్కడ కనిపిస్తారు. (అంటే దిగంబరియై, నగ్నంగా, వివస్త్రయై అని రాశారు) వర్మగారిలో ఈలాంటి మితిమీరిన శృంగార ధోరణి మచ్చుకైనా కన్పించదు.

రుద్రమదేవి, అన్నాంబిక, నాగబంధునికలు అందగత్తెలే కాకుండా శౌర్య పరాక్రమాలు కలిగిన వీరవనితలుగా కూడా బాపిరాజు గారు వర్ణించారు.

వర్మగారు మృగనయనీ, లాఖీ, కుముద్, కచనార్, నూర్‌బాయి, ఝాన్సీ లక్ష్మీబాయి, హిమానీ, హేమవతి, మానవతి, తార మొదలైన వారిని అందగత్తెలుగా వర్ణించినా, బాపిరాజు గారు వర్ణించినంత వివరంగా వర్ణించలేదు. 'ఝాన్సీ లక్ష్మీబాయి'కి అందరూ తనను అందగత్తె అని పొగిడితే కోపం వస్తుంది. "నాకు అందగత్తె అని అన్పించుకోవడం అసహ్యం. ఒక వీరబాలిక అందగత్తె అనే పేరు స్వీకరించదు."[2] అని అంటుంది. దీనిని బట్టి

---

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 47.
2. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ, పు: 23.

వర్మగారి ఉద్దేశం తేటతెల్లమవుతుంది. ముఖ్యంగా మృగనయనీ, కచనార్, మూర్‌బాయి, కుముద్ లు కూడా చాలా అందగత్తెలయినా కథానుక్రమంగా వర్మగారు వారి సౌందర్యాన్ని సూచించారే గాని, బాపిరాజు గారి వలె వారి అందాన్ని అభివర్ణించలేదు. రాణి అహిల్యాబాయి, ఝాన్సీకీరాణి లక్ష్మీబాయిల శౌర్య, ధైర్య సాహసాలనే అధికంగా వర్ణించారు. చరఖారీని ఉత్తమ ఇల్లాలుగ, ధర్మపత్నిగా చిత్రించారు.

మొత్తం మీద బాపిరాజు గారు తన నవలల్లో స్త్రీల బాహ్య సౌందర్యానికి ఇచ్చిన ప్రాముఖ్యం వర్మగారు ఇచ్చినట్లుగా కనిపించదు.

అడివి బాపిరాజు గారు, వర్మగారి నవలల్లో ఒకే స్వభావమున్న స్త్రీ పాత్రల్లోని సామ్య వైషమ్యాలను పరిశీలిద్దాం.

**రాణి రుద్రమదేవి ; రాణి లక్ష్మీబాయి :** అడివి బాపిరాజు గారు 'గోనగన్నారెడ్డి' నవలలో రాణి రుద్రమదేవిని వర్ణిస్తే, బృందావన్‌లాల్ – వర్మగారు 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' నవలలో లక్ష్మీబాయిని చిత్రించారు. ఈ ఇద్దరు రాణులలో ఎంతో సామ్యం కన్పిస్తుంది. ఇరువురు అందగత్తెలే. అతి పిన్న వయస్సులోనే సామ్రాజ్య భారాన్ని మోశారు. రుద్రమదేవి తండ్రి గణపతి దేవుల వారికి పురుష సంతానం లేక పోవడం చేత రుద్రమదేవినే చిన్నప్పటి నుంచి పురుషునిగా పెంచుతారు. గణపతి దేవుల వారి కాలంలో ఆయన విశాల సామ్రాజ్యం స్థాపిస్తారు. ఆయన దివంగతులైతే ఆయనకు కొడుకులు లేని కారణంగా సామంతులు, ఎవరికి వారు స్వాతంత్ర్యం ప్రకటించుకొని తమలో తాము కలహించుకొంటూ ఉంటే, అఖండ ఆంధ్ర

సామ్రాజ్యం భిన్నా భిన్నమౌతుందని గణపతి దేవులు, శివదేవయ్య మంత్రి, మరికొందరు పెద్దలు కలసి యోచించి ఆంధ్ర సామ్రాజ్యాన్ని సుస్థిరం చేయడానికి నిశ్చయించుకొని, రుద్రమ దేవికి పురుషవేషం వేయడమే గాక వీర విద్యలన్నీ నేర్పి చివరకు ఆమెను స్త్రీగా పరిచయం చేసి కాకతీయ సామ్రాజ్యానికి యువరాణిని చేస్తారు. గణపతి దేవుల వారు శివైక్యం చెందగానే రుద్రమదేవి రాణి ఔతుంది. కొందరు సామంతులు తిరగబడితే రుద్రమదేవి వారందరిని అణచివేసి ఆంధ్రసామ్రాజ్యాన్ని సుస్థిరం చేస్తుంది.

బృందావన్‌లాల్ వర్మగారి 'రాణి లక్ష్మీబాయి' ఝాన్సీని పరిపాలిస్తున్న గంగాధర రావును వివాహం చేసుకొంటుంది. ఆమెకు ఒక పుత్రుడు పుట్టి ఆరు నెలల్లోనే మరణిస్తాడు. గంగాధర రావుకు ఆరోగ్యం దెబ్బతినడంతో, దామోదర రావును దత్తత తీసుకొని, దామోదర రావుకు యుక్తవయస్సు వచ్చే వరకు లక్ష్మీబాయిని ఝాన్సీకి రాణిగా పరిపాలించమని చెప్పి గంగాధర రావు మరణిస్తాడు. బాల్యం నుంచి పురుషులతో సమానంగా వీర విద్యలు నేర్చుకొన్న లక్ష్మీబాయి, ఝాన్సీ రాజ్యాన్ని బ్రిటీష్ వారి బారి నుండి కాపాడాలనుకొంటుంది. తర్వాత నానా సాహెబ్, తాంతియా తోపేలతో కలసి భారత దేశ స్వాతంత్ర్యానికి పాటుపడుతుంది. అంటే 1857 లోనే బ్రిటీష్ వారిపై భారతీయ వీరులు సమర శంఖారావం పూరించారంటే లక్ష్మీబాయి అందులకు ప్రధాన కారణం. సిపాయిల కలహానికి అది నాంది అయింది

వీర విద్యలు నేర్పడంలో ఇద్దరు రాణులకు ఎంతో సామ్యం ఉంది. బాపిరాజు గారు గుర్రపు స్వారీ చేయడంలో రుద్రమదేవిని, ఆనాడు గోన గన్నారెడ్డి సాహిణి మాత్రం ఓడించగలడేమో! [1] అని రాశారు.

ఇక బాల్యం నుండే రాణి లక్ష్మీబాయి పురుషులతో సమానంగా గుర్రపు స్వారీ చేసిందని వర్మగారు రాశారు. అసలు నవలలో "పదమూడు సంవత్సరాల 'మనూ' (లక్ష్మీబాయి) నానాసాహెబ్, రావుసాహెబ్ లతో కలసి గుర్రపు స్వారీ చేస్తూ మనకు పరిచయమౌతుంది. ముగ్గురూ గుర్రపు స్వారీ చేస్తుండగా నానాసాహెబ్ గుర్రం నుండి క్రింద పడి గాయపడతాడు. అతడు క్రింద పడగానే "మనూ నేను చచ్చాను" అని అరుస్తాడు. మనూ క్రిందకి దిగి పరీక్షించి 'గాయం ఏమంత పెద్దది కాదు' అని చెప్పి తన గుర్రంపై ఎక్కించుకొని వస్తుంది." [2]

శివదేవయ్య మంత్రి రుద్రమదేవితో "ప్రభూ! ఈ భూమిలో ధర్మం కావసాగడానికే ఈ విధానం అవలంభించాము. మీరు అఖండ ఆంధ్ర సామ్రాజ్య సింహాసనం అధిష్ఠించాలని మిమ్ము బాలకునిగా పెంచాము తల్లీ! వీర పురుషోచితమైన విద్యలన్నీ మీకు నేర్పినాము" [3] అని చెపితే, వినయంతో రుద్రమదేవి "మీరు నాకర్పించిన ఈ దివ్య ధర్మాన్ని నా ప్రాణాలతో కాపాడుకొంటాను" [4] అని అంటుంది.

ఇదే విధంగా లక్ష్మీబాయితో రాజకీయ విషయాలను మాట్లాడే

---

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 40.
2. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి – బృం. లాల్ వర్మ, పు: 15
3. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 15.
4. పైదే. పు: 15

టప్పుడు "మీరే కదా తారాబాయి ఇలా ఉంటుంది, జిజియాబాయి అలా ఉంటుంది, అహిల్యాబాయి ఇలా ఉంటుంది అని చెప్తూ ఉంటారు. వీరందరూ మాట్లాడకుండా నోరు మూసుకుని ఉండే వారా?"[1] అని అడుగుతుంది.

రుద్రమదేవిలో దేశభక్తి కలిగేందుకు మంత్రి శివదేవయ్య, తండ్రి గణపతి దేవులు ప్రేరణ కలిగిస్తే, లక్ష్మీబాయికి పూర్వీకులైన జిజియా బాయి, తారా బాయి మొదలైన వారి కథలు ప్రేరణ కలిగించాయని చెప్పవచ్చు.

రుద్రమదేవి గొప్ప రాజనీతిజ్ఞురాలు. పరిపాలనా దక్షురాలు. గణపతిదేవ చక్రవర్తి మరణించగానే రాజ్యభారాన్ని తన భుజస్కంధాలపై వేసుకొని సమర్థవంతంగా రాజ్యపాలన చేసింది. "ఆడది రాజ్యం చేయడమా" అని హేళన చేసిన వారందరికి బుద్ధి చెప్పినట్లు చక్కని పరిపాలన చేస్తూ శత్రువులను తరిమి తరిమి కొట్టింది. ఇలా రుద్రమదేవి స్వయంగా యుద్ధ నాయకత్వం వహించి లోకానికి స్త్రీ శక్తి అకుంఠిత మని చాటింది.

అలాగే లక్ష్మీబాయి కూడా పరాక్రమంతో, కర్తవ్య పరాయణతతో, అధైర్య పడకుండా పరిస్థితుల్ని అవగాహన చేసుకొని, భర్త మరణించాక రాజ్యభారం వహిస్తుంది. "భారత దేశానికి స్వరాజ్యం వచ్చిన తరువాత నేను కేశ ముండనం చేసుకొంటాను. లేకుంటే భగవంతుడే నా శిరోముండనం చేస్తాడు."[2] అని ధైర్యంగా చెప్పిన సాహసి లక్ష్మీబాయి.

ఆనాడు రుద్రమదేవికి శివదేవయ్య మంత్రి, గోనగన్నారెడ్డి

1. ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి — బృం. లాల్ వర్మ, పు. 25.

2. పై పు 140

విరల ధరణీశుడు, చాళుక్య వీరభద్రుడు మొదలైన వీరులు బాసటగా నిలచారు. ఇందరి వీరుల నిరంతర సహకారంతో రుద్రమదేవి సుస్థిర

ప్ర సామ్రాజ్యాం నెలకొల్పింది.

రాణీ లక్ష్మీబాయికి కూడా నానాసాహెబ్, రావుసాహెబ్, తాంతియా తోపే, మోరో పంతు, పేష్వా బాజీరావు మొదలైన దేశభక్తుల అండదండలున్నా, అఖండ బ్రిటిష్ సైన్యాన్ని వారి మర ఫిరంగులను ఎదుర్కొని వీరోచితంగా పోరాడినా ఆమె ప్రాణాలు దక్కలేదు. కాని భీరువు వలె

వీడకుండ చివరి రక్త బిందువు వరకు పోరాడి, దేశం కోసం అసు వులు బాసింది.

రుద్రమదేవి అంతః శత్రువులతో పోరాడి గెలిచి రాజ్యం చేసింది. లక్ష్మీబాయి విదేశీయులతో పోరాడి, ప్రాణాలను దేశం కోసం త్యాగం చేసింది. ఇదే వారిద్దరిలోని వైషమ్యం. ఆంధ్రుల గర్వకారణం రుద్రమ అయితే, ఉత్తర భారత వీరవనిత లక్ష్మీబాయి. ఈ ఇరువురూ భారత స్త్రీ జాతికే ఆణి ముత్యాలు. వీరి చరిత్రను నవలా రూపంలో అందించిన రచయితలిరువ్వురు ధన్యజీవులు.

**అడవి శాంతిశ్రీ - మృగనయనీ :** 'అడవి బాపిరాజు' గారు రచించిన 'అడవి శాంతి శ్రీ' లోని శాంతిశ్రీ కథా నాయిక. ఈమె అతిలోక సౌందర్యవతి. ఈమె సౌందర్యానికి ముగ్ధులై విష్ణు స్కంధ శాతకర్ణి, పులమావి, మగధ లోని గుప్త మహారాజులు, కౌశికీ పుత్ర ఈశ్వర సేన మహారాజు మొదలైన వారెందరో ఆమెను వివాహమాడడానికి నిశ్చయించుకుంటారు. బ్రహ్మదత్తుడు

కూడ ఆమె అద్భుత సౌందర్యాన్ని చూచి, ఆమెనే వివాహ మాడాలని తలపోస్తాడు. ముఖ్యంగా అమిత దుష్టుడైన ఘులమాని ఆమెను నిర్బంధించైనా వివాహం చేసుకోవాలనుకొంటాడు.

ఆ విధంగానే బృందావన్‌లాల్ వర్మగారి 'మృగనయని'లో కూడా 'మృగనయనీ' చాల అందకత్తె. ఆమె అందకత్తె అనే విషయం దేశం నలుమూలల పాకుతుంది. ఢిల్లీ పాదూషాయైన సికిందర్ లోడీ, మాండూ సుల్తాన్ గయాసుద్దీన్, గుజరాత్ సుల్తాన్ మహమ్మద్ బఘర్రా మొదలైన వారు ఆమెను పొందాలనుకొంటారు. గ్వాలియర్ రాజైన మానసింహుడు కూడ ఆమె అందాన్ని విని ఆమెను వివాహ మాడాలనుకొంటాడు. దుష్టుడైన గయాసుద్దీన్ ఆమెను బలవంతంగా ఎత్తుకొని పోవాలని కూడ ప్రణాళిక వేసి శృంగభంగం పొందుతాడు.

ఇలా ఇరువురు రచయితలు ఆ నాటి రాచరికపు వ్యవస్థలోని ఈ దుష్ట సంప్రదాయాన్ని వివరించారు. ఆనాటి రాజులు ఎక్కడైనా అందగత్తె కనబడితే ఆమెను స్వంతం చేసుకోవాలనే మనస్తత్వం కలిగిన వారని దీనిని బట్టి మనకు అర్థమౌతుంది.

ఒక మృగనయనీ, అడవి శాంత్రిశ్రీలనే కాదు, అద్భుత సౌందర్యవతియైన అన్నాంబికను మహారాష్ట్ర యాదవ్రుడు, చోళ, పాండ్య దేశ దక్షిణాత్య ప్రభువులు, కదంబ గాంగులు వాంఛించారు. అంశుమతిని కోరి ఆ నాటి రాజకుమారులందరూ ఆమె తండ్రికి రాయబారాలు పంపారట, అంతేగాక కళింగ యువరాజైన దానార్ణవుడు ఆమె అందానికి ముగ్ధుడై

ఆమెను వాంఛించి , ఆమెను ఆమె చెలికత్తెలతో సహా బంధించాడని బాపిరాజు గారు రాశారు. అలాగే 'మృగనయని' నవలలో 'మృగనయని'యే కాకుండా 'లాఖీ' కూడ అందగత్తె అని విని , చాల మంది ఆమెను కూడ అపహరించాలనుకొంటారు. 'టూటే కాంటే' నవలలో నూర్‌బాయి ఎంతో అందగత్తె. ఆమెను సాదత్‌ఖాన్ అమితంగా ప్రేమించేవాడు. ఢిల్లీ పాదూషా మహమ్మద్‌షా, ఈరాన్ రాజు నాదిర్‌షాలు కూడా ఆమెను వాంఛించారని వర్మ గారు రాశారు. ఇలా రాజుగారి నవలల్లోను, వర్మగారి నవలల్లోను స్త్రీలోలురు , బలహీనులైన పురుష పాత్రలు కొన్ని కనబడుతాయి. కాని స్త్రీలను అవమాన పరచిన రావణాసురుడు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కీచకుడు మొదలైన పాత్రల్లాగా ఈ నవలల్లోని దుర్మార్గులు కూడ నాశనమౌతారు.

మృగనయనీకి , శాంతిశ్రీకి కొంచెం వైషమ్యం ఉంది. మృగనయనీ స్వభావంతోనే వీరవనిత. తనను అవమానించే శత్రువుల్ని తన బాహుబలంతో మట్టి కరిపిస్తుంది. గయాసుద్దీన్ మనుష్యులు నిన్నీ, లాఖీలను బలవంతంగా ఎత్తుకుపోవాలని ప్రయత్నిస్తే సాహసంతో బాణాలు వేసి శత్రువుల్ని చంపేస్తారు. ఈ విధమైన ప్రచండ ధైర్యసాహసాలు కలిగి ఉండే మృగనయనీలో మార్దవం, రసికత్వం , మాధుర్యం, సౌకుమార్యం మొదలైన సౌమ్యగుణాలూ ఉన్నాయి.

కానీ శాంతిశ్రీలో మార్దవం, కరుణ , ప్రేమ , సౌకుమార్యం మొదలైన సౌమ్య గుణాలే ఎక్కువగా ఉన్నాయి. రాజగృహంలో అమిత భోగ లాలసతో ముద్దుగా పెరిగిన బాలిక శాంతిశ్రీ. అయినా తన ప్రియుణ్ని పులమావి బంధించాడని తెలిసి , ధైర్య సాహసాలతో పులమావిపై యుద్ధానికి వెళుతుంది.

అమిత సుకుమారి యైన శాంతిశ్రీలో అంతర్గతంగా దాగి ఉన్న ధైర్య సాహసాలు సమయానుకూలంగా బహిర్గత మౌతాయి. సాహసాలు నిరంతరం ప్రదర్శించే యువతులు అవసరం వస్తే సుకుమారులుగా మారగలరనీ, అలాగే అమిత సుకుమారులు అవసరం వస్తే ధైర్య సాహసాలను ప్రదర్శించ గలరని ఇద్దరి రచయితల రచనల వల్ల అర్థ మౌతుంది.

శాంతి శ్రీని పులమావి బంధిస్తాడు. ఆమె శీల రక్షణకై తథాగతులనే నమ్ముకొంటుంది. భగవత్ సంకల్పం వల్ల పులమావి విరుచుకొని పడిపోతాడు. ఆమె శీలాన్ని బుద్ధ భగవానుడే కాపాడుతాడు. అంటే శాంతిశ్రీకి చిన్నప్పటి నుండి శ్రమణకు డంటే ఎంతో నమ్మకం. "నన్ను నీ భర్త ఏమీ చేయలేడని సంపూర్ణ నమ్మకం. నన్ను పరమ శ్రమణకుడు ఎప్పుడూ రక్షిస్తూనే ఉంటాడు"[1] అని పులమావి భార్యతో అంటుంది. ఆమెకు ఎవరి పట్ల కోపతాపాలు లేవు. రాగద్వేషాలు లేవు. అటువంటి సచ్చరిత్ర గలవారిని భగవంతుడే కాపాడుతాడని రచయిత నమ్మకం.

'మృగ నయని' స్వభావం ఇందుకు విరుద్ధం. పూర్వ కాలం కొందరు స్త్రీలు జౌహారు వ్రతం పాటించేవారు. అలా జౌహారు వ్రతం పాటించడం పిరికి పందల లక్షణమని ఆమె తలచేది. జౌహర్ వ్రతంపై ఆమె అభిప్రాయాన్ని రచయిత ఇలా రాశారు.

"రాజులు తమ బంధువుల్ని ఏదో ఒక దుర్గంలో వదలిపెట్టి యుద్ధం చేస్తూ చేస్తూ చనిపోతారు. వారి స్త్రీలు అగ్నిలో దూకి ఆత్మాహుతి

---

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు., పు; 305.

చేసుకొంటారు. వారికి బాణాలను ప్రయోగించడం తెలియదా! వారు రాణులు కాబట్టి పరదాలలో మొహం దాచుకొని ఉంటారా? వారిని కన్నెత్తి చూసే పురుషుల్ని వారెందుకు ఎదుర్కోలేరు? వారిని అవమానించే వాళ్ళను చంపేందుకు బదులు వారే అగ్నిలో దూకి చావడం తగనిపని. నేను ఎటువంటి పరిస్థితుల్లోనూ ఈ విధంగా చావను"[1] అంటుంది. మృగనయనిలో ఇరవైయవ శతాబ్ది స్త్రీ ఆలోచన గోచరించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

అడవి శాంతిశ్రీకి బౌద్ధమతం అంటే అమితాభిమానం. ఆమె ఇష్టప బౌద్ధమతం. బౌద్ధుల గ్రంథాలు త్రిపిటకాలు, జాతక కథలు క్షుణ్ణంగా చదివింది. బ్రహ్మదత్తుడు గురువైన తర్వాత హిందూమత గ్రంథాలు, వేద వేదాంగాలు, ఉపనిషత్తుల సారం గ్రహించింది. బ్రహ్మదత్తునితో అనేకసార్లు శాస్త్ర చర్చ జరిపిన మహా మేధావినిగా శాంతిశ్రీని వర్ణించారు రచయిత. కాని మృగనయనికి ఎక్కడో పల్లెలో పుట్టి చదువు సంధ్యలు లేనందువల్ల శాస్త్ర జ్ఞానం అసలే లేదు. కాని స్వతహాగా తెలివైనది కనుక రాజుని వివాహం చేసుకొన్న తర్వాత సంగీత, చిత్రలేఖనాల్లో ప్రావీణ్యం సంపాదించి గొప్ప సంగీత కళాకారిణిగ, చిత్రలేఖకురాలిగ పేరు తెచ్చుకొంది. ఈ విధంగా మృగనయనీ శాంతిశ్రీల స్వభావాల్లో కొన్ని సామ్యాలు, కొన్ని వైషమ్యాలు ఉన్నాయి.

3. **చంద్రబాల - కుముద్ :** అడివి బాపిరాజు గారి హిమబిందు లోని 'చంద్రబాల', బృందావన్ లాల్ వర్మగారి 'విరాటాకి పద్మిని' నవలలో 'కుముద్' మానవాతీత శక్తిగల పాత్రలు.

1. మృగనయనీ – బృం. లాల్ వర్మ, పు : 16.

బాల్యం నుండి భిన్న వాతావరణంలో పెరిగిన 'కుముద్' తన సమ వయస్కుల నుండి దూరంగా ఉంచబడింది. ఆమె తండ్రి నరపతి ఆమె దేవత అని చెప్పి ఆమెను ఒక పావుగా వాడుకొన్నాడు. అట్లే హిమబిందులో చంద్రబాలను కూడా ఆమె తాత స్థాలతిష్యుడు భిన్న వాతావరణంలో పెంచి ఆమెను తన కార్యసాధనకు ఒక పరికరం లాగా వాడుకొన్నాడు.

మహమ్మదీయుల కరాళ దంష్ట్రల నుంచి హిందూ మతాన్ని కాపాడాలనుకొని, హిందూ మతంలోని ప్రజలనంతా ఏకత్రాటని నిలపాలని నరపతి, ఇతర పెద్దలు చేసిన ప్రయత్నమే కుముద్ దేవతగా మారడం, అట్లే బౌద్ధమత ప్రభావం వల్ల క్షీణించి పోతున్న వైదిక మతాన్ని నిలబెట్టడానికే చంద్రబాలను స్థాలతిష్యుడు విషకన్యగా మార్చడం జరిగింది. ఇరువురూ సామాజిక ప్రయోజనం కోసం బలైన పాత్రలే.

కుముద్ ను ఆమె తండ్రి, ప్రజలు ఎంతగా దేవతగా స్థాపించి దైవాంశ సంభూతురాలుగా చేసినా, ఆమెలోని మానవ సహజమైన ప్రేమ, అనురాగం నశించలేదు. మానవస్త్రీగా ఆమె కుంజర సింహుని ప్రేమిస్తుంది. ఆమెలో మానవుల కుండవలసిన బలహీనతలు ఉన్నాయి. ఒకసారి క్షణికావేశంలో తన ప్రియుడు కుంజరసింహుడు కౌగిలించుకుంటే కూడ ఆమె తిరస్కరించదు.. అలాగే చంద్రబాల తాత ఆమెలో గల మానవ లక్షణాలన్నీ మార్చి ఆమెను భయంకర విషోరగం చేయాలనుకొన్నాడు. కానీ ఆమె శారీరకంగా విషోరగం అయిందే కాని మానసికంగా మాత్రం కాలేదు. ఆమెకూ మానవుల కుండవలసిన బలహీనతలన్నీ ఉన్నాయి. కుముద్ స్నేహితురాలు

గోమతి "ఒకసారి కుముద్‌ను దేవీ అవతారంగా భావించి రెండు కాళ్ళు పట్టు కొని, శత్రువులను నాశనం చెయ్యి దేవీ! అని ఏడుస్తూ ప్రార్థిస్తుంది."[1] అప్పుడు కుముద్ నిధిలేక చాల ప్రయత్నంతో "తప్పకుండ దుర్గామాతను ప్రార్థిస్తాను" అనిచెప్పి గోమతిని తన కాళ్ళ దగ్గర నుండి లేపి కూర్చోబెట్టుకొంటుంది. కుంజర-సింహుడు కూడా ఒకసారి ఆమెను దేవీ అవతారంగా భావించి ఆమె కాళ్ళు పట్టుకొంటే కుముద్ "ఇలాంటి పని మారెన్నడూ చేయవద్దు. నేను దేవీ అవతారం కాను. సాధారణ స్త్రీని. దుర్గామాతకు నిజమైన పూజారిణిని. నన్ను నీవు దేవీ అవతారంగా తలంచ వద్దు"[2] అని చెప్తుంది. నిజంగా ఆమె దేవీ అవతారం అవునో కాదో పాఠకులే తేల్చుకోవాలని ఈ సంఘటనలను రచయిత కల్పించారు.

చంద్రబాలకు శరీరం విషపూరితమైనా మనస్సు మాత్రం అమృతం. ఒకనాడు మలయనాగుడు ఆమె అందానికి వివశుడై ఆమె పొందు కోరి దగ్గరకు వచ్చి ఆమెను బలవంతంగా కౌగిలించుకొంటాడు. కాని విష పూరితమైన ఆమె నిశ్వాసం వల్ల తన ప్రాణాలు పోగొట్టుకొంటాడు. ఈ సంఘటనతో చంద్రబాల క్రుంగిపోతుంది. తనను ఏ పురుషుడు తాకినా, లేక తాను ఏ పురుషుని తాకినా వారు ఇలా నాశనమై పోవలసిందేనా! అని దిగులు పడుతుంది. ఒకసారి స్థాలతిష్యులు చంద్రబాలను శ్రీకృష్ణ శాత-వాహనునిపై ప్రయోగించాలని మంత్రం జపిస్తుంటే, ఆమె "తాతగారూ!

1. విరాటాకీ పద్మినీ — బృం. లాల్ వర్మ., పు: 89, 90.

2. పైదే., పు: 228.

నన్ను ప్రయోగింపకుడు. నేను మృత్యువును కాను"[1] అని అరుస్తుంది. అయినా ఆమె మాటలు లెక్కచేయకుండా స్థాలతిష్యుడు ఆమెను ప్రయోగిస్తాడు. కాని దైవవశాత్తు అతని పన్నాగం ఫలించదు. అడవిలో ఒంటరిగా పడి ఉన్న చంద్రబాలను శ్రీకృష్ణ శాతవాహనుడు రక్షిస్తాడు.

ఇక్కడ చంద్రబాలకు దైవం మానవరూపేణా సాయపడి చక్రవర్తి ఆమెను మామూలు మనిషిని చేసి వివాహమాడాడు. అక్కడ కుముద్ దేవీ రూపంగా మలచబడ్డా ఆమెకు దైవ సహాయం లభించక, విధి వైపరీత్యం వల్ల ఆమె నదిలో దూకి మరణించింది.

చంద్రబాల బ్రతకడానికి రెండు కారణాలు కనబడుతున్నాయి. ఈ రెండు కారణాల వల్లే రచయిత చంద్రబాలను అమృత బాలగా మార్చాడని పిస్తోంది.

1. అప్పటికే చంద్రబాల లాంటి విషకన్య (ముద్రా రాక్షసంలో) రాక్షస మంత్రి స్వార్థానికి బలై మరణించింది. చంద్రబాల కూడా మరణిస్తే చరిత్ర చర్విత చర్వణ మౌతుంది.

2. చారిత్ర కాంశాల పరిశీలన ద్వారా శ్రీకృష్ణ శాతవాహనునికి ఒకే భార్య అనీ, ఆమె మరణించలేదనీ అనుస్యూతంగా ప్రజల్లో కథలు అప్పటికే ప్రాకిపోయి నందున రచయిత చంద్రబాలను చంపలేదు. దానివల్ల కథ సుఖాంతమైంది.

వర్మగారికి లభించిన చారిత్రకాంశాల దృష్ట్యా పద్మిని చేతవా నదిలో పడి మరణించిందని తెలుస్తుంటే ఆమెను బ్రతికించడంలో అర్థం లేదు

[1] హిమబిందు — అడివి బాపిరాజు, పు: 181.

(పద్మిని చరిత్ర రచయిత కాలానికే అందరికీ తెలుసు. పొలర్ సమీపంలో పద్మిని మరణించిన తర్వాత ఆమె పాదాల గుర్తులు కనిపిస్తున్నవి. ఇప్పటికీ అక్కడ ప్రతి సంవత్సరం ఉత్సవం చేస్తారని రచయితే రాశారు)

కుముద్ మరణించింది. చంద్రబాల బ్రతికింది. ఈ ఒక్క వైషమ్యం తప్పిస్తే రచయిత లిద్దరూ ఈ మానవాతీత శక్తుల పట్ల ప్రజలో ఒక జాగృతి ( awareness ) కలిగించాలనే ఈ పాత్రలను సృష్టించారని పిస్తుంది.

ఈ పాత్రల విషయంలో రచయితల దృక్పథం ఒకటే. స్వార్థ పరులు వారి స్వార్థం కోసం అమాయకుల్ని పావులుగా ఉపయోగించుకోవాలని చూచినా, చివరికి వీరి కోర్కె ఫలించదు. వారిలో నున్న మానవత్వం ఏదో ఒక రోజు బయల్పడక మానదు. ఇలా మానవత్వానికి ఇరువురు రచయితలు ఎంతో విలువ ఇచ్చారు. ఎవ్వరు ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఒక వ్యక్తిని మానవా తీత శక్తిగా మార్చాలని ప్రయత్నించినా, ఆ ప్రయత్నం ఫలించదు. అంతిమ దశలోనైనా వారు మానవులుగానే నిరూపింప బడతారన్నది రచయితల ప్రగాఢ విశ్వాసం.

అన్నాంబిక - లక్ష్మీబాయి : లక్ష్మీబాయిని రాణి రుద్రమదేవితో పోల్చినా ఎన్ని లక్షణాల్లో అన్నాంబికతో కూడా సరి పోల్చవచ్చును. గోన గన్నారెడ్డి నవలలో అన్నాంబిక రెండవ నాయిక. ఈమె కూడా అమిత పరాక్రమ శాలి. చిన్నప్పుడు ఈమె కూడ పురుషవేషం ధరించి వీర విద్యలైన కత్తియుద్ధం, గుర్రపు స్వారీ మొదలైనవి నేర్చుకొంది. పురుష వేషంలోనే గోన గన్నారెడ్డికి

యుద్ధంలో సాయంగా వెళ్తుంది. రుద్రమదేవి గుంటూరుపై యుద్ధానికి పోయి నప్పుడు ఆమెను ఒప్పించి, ఆమెకు అంగరక్షకురాలిగా ఉంటుంది. ఆమె రుద్రమ-దేవితో ఇలా అంటుంది. "అక్కా! మీరు ఒప్పుకుంటే మన రాజ్యంలో వీరస్త్రీదళం ఒకటి సిద్ధంచేసి, ఆంధ్ర వీరమణులు శ్రీశ్రీ రుద్రమహాదేవ పరిపాలనలో ఉన్నారని లోకానికి చాటిస్తాను"[1] అంటుంది. ఇదే అభిప్రాయాన్ని లక్ష్మీబాయి కూడా వెల్లడిస్తుంది. ఆమె తన చెలికత్తెలను సాహసం కలవారిగా చెయ్యాలని ఇలా చెప్తుంది. "నాతో కూడ ఉండగోరే వారు గుర్రపు స్వారిని బాగా నేర్చుకోవాలి. కత్తి, తుపాకి, బల్లెం, బాణాలు మొదలైన వాటిని ప్రయోగించడం నేర్చుకొని ఉండాలి."[2] ఈ విషయంలో అన్నాంబికకు లక్ష్మీబాయికి పోలికలున్నాయి.

**మృగనయనీ - నాగబంధునిక :** మృగనయనీ, అడవి శాంతిశ్రీలు రాణులు కాబట్టి ఒకే స్థాయి ( Status) కలవారు అనవచ్చు. ధైర్యసాహసాలు, వీరవిద్యా నైపుణ్యం దృష్ట్యా మృగనయనీని నాగబంధునికతో కూడా పోల్చవచ్చు.

'హిమబిందు' నవల్లో నాగబంధునిక అంత ప్రధానమైన పాత్ర కాకున్నా, విడిగా నాగబంధునిక కథమాత్రం చెప్పుకొంటే ఆమె కథానాయిక అనిపిస్తుంది.

మృగనయనీకి వేట అంటే ఇష్టం. నాగబంధునికకూ వేట అంటే ఇష్టం. ఇద్దరికీ సంగీతంలో ప్రవేశముంది. ఇద్దరూ చక్కగా పాడగలరు. ఇద్దరికీ చిత్రలేఖనం అంటే ఎంతో ఇష్టం. చిత్రలేఖనంలో ప్రవేశముంది.

---

1. గోన గన్నారెడ్డి - అడివి బాపిరాజు, పు: 248.

2. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి - బృం. లాల్ వర్మ, పు: 62

మృగనయనీ వివాహం అయిన తరువాత తన భర్త అయిన మానసింహునికి చక్కని సలహాలనిచ్చి ప్రజానురంజకంగా రాజ్యపాలన చేయడంలో తోడ్పడింది. అలాగే నాగబంధునిక సమదర్శితో వివాహం అయిన తరువాత బరుకచ్ఛానికి ప్రతినిధిగా పరిపాలన సాగించడంలో

" నాగబంధునిక కడ హొయలు గురిపించు శృంగార లక్షణాల కన్న నిశిత, కృపాణ సదృశమగు వీరవనితా లక్షణాలే ఎక్కువగా ఉన్నవి"[1]

"మృగనయనీ స్వభావం తోనే వీరవనిత. స్త్రీ అబల అనే విషయాన్ని అంగీకరించేది కాదు"

ఈ విధంగా మృగనయని, నాగబంధునిక లలో ఎన్నో సామ్యాలు ఉన్నా కొన్ని వైషమ్యాలు కూడా లేకపోలేదు.

మృగనయనీ తల్లిదండ్రులు లేక పొట్టకూటి కోసం కొంచెం పొలాన్ని అన్న అటల్‌తో కలసి దున్నుకుంటూ, అడవికి వెళ్ళి అడవిజంతువుల్ని వేటాడడం నేర్చుకొంది. ఆమె బ్రతుకు తెరువు కోసం ఈ విద్యలన్నీ నేర్చుకొంది.

కానీ నాగబంధునిక తల్లిదండ్రుల చాటున ఉంటూ ఆసక్తి కొద్దీ వీరవిద్యలు నేర్చుకుందే కానీ అవసరం కొద్దీ కాదు.

మృగనయని అందచందాలను ధైర్యసాహసాలను చూచి మానసింహుడు ఆమెను ప్రేమించి పెండ్లి చేసుకుంటాడు. కానీ నాగబంధునిక సమదర్శిని ప్రేమించి

1. హిమబిందు – అడివి బాపిరాజు, పు: 32.

2. చూ. పాత్రచిత్రణ (ఇదే సిద్ధాంత వ్యాసంలో) పు:

పురుష వేషం వేసుకొని, అతనికి సహాయం చేసి, అతణ్ణి మెప్పించి వివాహం చేసుకొంటుంది. మృగనయనికి మానసింహునితో వివాహం జరిగే సమయానికే అతనికి ఎనిమిది మంది భార్యలున్నారు. కాని హిమబిందును ప్రేమించి భగ్న హృదయుడైన సమదర్శి ఇక వివాహమే చేసుకో కూడదనే నిశ్చయంతో ఉన్నప్పుడు నాగబంధునిక అతణ్ణి మెప్పించి, అతని ప్రేమను పొంది వివాహం చేసు కొంటుంది. ఈ రెండు పాత్రలలోని వైషమ్యాలివి.

**నాగబంధునిక – లాఖీ:** అడవి బాపిరాజు గారు రచించిన హిమబిందు నవలలో 'నాగబంధునిక' హిమబిందు స్నేహితురాలు. వర్మగారి 'మృగనయని' నవలలో 'లాఖీ' కూడ మృగనయనీ స్నేహితురాలు.

నాగబంధునికలో ఉన్న కొన్ని గుణాలు లాఖీలోనూ ఉన్నవి. ఈ రెండు పాత్రల మధ్య కొన్ని సామ్య వైషమ్యాలుండడం చేత ఈ రెండు పాత్రలనూ పోల్చవచ్చు.

నాగబంధునిక సంపూర్ణ ఆరోగ్యవంతురాలు. నదిలో వరదలు పొంగి పరవళ్ళెత్తి పోవుచున్నా భయపడకుండా ఈదగలదు. గుర్రపుస్వారీ చేయగలదు. అడవిలో వేటాడగలదు. అడవుల్లో సంచరించు మృగాల జాడ తీయుటలో, పక్షుల కూతల పై చిత్రాలు చెప్పుటలో మేటి.

లాఖీ కూడా సంపూర్ణ ఆరోగ్యవంతురాలు. సాహస కృత్యాలు ధైర్యంగా చేస్తుంది. గుర్రపుస్వారీ, ఈత మొదలైన విద్యలు నేర్చుకొంది. అడవిలోకి వెళ్ళి అడవి పందుల్ని, సింహాలను వేటాడి చంపేది. ఈమెను అపహరించడానికి వచ్చిన గుర్రపు రౌతుల్లో ఒకణ్ణి బాణంతో చంపేసింది.

నాగబంధునిక హిందుబిందు మేనబావ సమదర్శిని ప్రేమిస్తుంది. గంభీర హృదయ, ఆత్మాభిమానం కలది కనుక తనభావాలు ఎవరికీ తెల్పదు. పురుష వేషం ధరించి సమదర్శికి అంగరక్షకుడిగా వెళ్ళి, అతణ్ణి ఎన్నో మార్లు ఆపదనుండి కాపాడుతుంది. తన అంగరక్షకుడు స్త్రీ అని తెలిసిన తర్వాత ఆమె ధైర్య సాహసాలను, నిర్మల ప్రేమను మెచ్చి సమదర్శి ఆమెను వివాహం చేసుకొంటాడు.

నాగబంధునిక ఎంత గంభీర హృదయో, ఎంత ఆత్మాభిమానం కలదో లాఖీ కూడా అంతే గంభీర హృదయ; ఆత్మాభిమానం కలది. నిన్ని సోదరుడైన అటల్‌ను ప్రేమిస్తుంది. వీరిరువురూ వేరు వేరు జాతులకు చెందిన వారైనందున రాయి గ్రామ ప్రజలు వీరి వివాహానికి అడ్డు చెప్పగా, గంగా జలాన్ని సాక్షిగా తీసుకొని వివాహం చేసుకొంటారు. ఆ సందర్భంలో ఆ గ్రామాన్ని వదిలి పెట్టి వెళ్ళిపోయేటప్పుడు, గ్వాలియర్ వెళదామని అటల్ చెప్పగా అందుకు లాఖీ అంగీకరించదు. ఏదో గొప్ప కార్యాన్ని సాధించి సగౌరవంగా గ్వాలియర్ వెళ్దామంటుంది. నరవర్ కోటను లాఖీ, అటల్ రక్షించిన తర్వాతే మానసింహుని ఆహ్వానంపై గ్వాలియర్ వెళుతుంది. మానసింహుడు రాయి గ్రామం దగ్గర ఒక దుర్గాన్ని నిర్మించి, దానికి అధిపతిగా అటల్‌ను నియమిస్తాడు. అటల్‌కి సహాయకారిగా ఉంటూ అతనితో సమానంగా శ్రమ పడుతుంది. చివరకు శత్రువులతో భయంకర యుద్ధం చేసి అటల్, లాఖీలు మరణిస్తారు.

ఇలాగే నాగబంధునిక సమదర్శి సమానంగా యుద్ధం చేసి

ఉజ్జయిని కోటను శత్రువుల బారినుండి రక్షించేందుకు ఎంతో సహాయ పడు తుంది. నాగబంధునిక సమవర్తితో సమానంగా యుద్ధం చేస్తూ, ఆంధ్ర వీరులను హుషారు కావిస్తూ పాటలు పాడేది. చక్రవర్తి వీరి ధైర్య సాహసాలకు మెచ్చి సమదర్శిని 'బరు కచ్ఛపానికి' రాజప్రతినిధిని చేస్తే, సమదర్శి నాగబంధునిక ఎంతో సంతోషంతో జీవితాన్ని గడుపుతారు.

యుద్ధంలో అటల్ లాఖీలు మరణిస్తే, సమవర్తి నాగబంధునికలు జయిస్తారు. పాత్రల అంతం ( end) విషయంలో ఈ వైషమ్యం బాపిరాజు, వర్మగార్ల నవలల్లో సర్వసాధారణం.

4.3.2. **పురుష పాత్రలు:** అడివి బాపిరాజు గారి పురుష పాత్రల్లో సువర్ణశ్రీ, బ్రహ్మదత్తుడు, వీరపురుష దత్తుడు, గోనగన్నారెడ్డి, సమదర్శి, కుబ్జ విష్ణు వర్ధనుడు, చాళుక్య వీరభద్రుడు, నాగార్జునాచార్యులు, శాంతి-మూలుడు, శివదేవయ్య మంత్రి, స్థాలతిష్యులు మొదలైన వారు ముఖ్యులు.

బృందావన్ లాల్ వర్మగారి పురుష పాత్రల్లో మానసింహుడు, దేవీ సింహుడు, అటల్, బోధన్ పండితుడు, దివాకరుడు, అగ్నిదత్తుడు, నాగదేవుడు, కుంజర సింహుడు, అలీమర్దాన్, మునాహిబజూ, దలీప సింహుడు, మహంతు అచలపురి, భువనుడు మొదలైన వారు ముఖ్యులు.

పురుష పాత్రల్లో శౌర్య, ధైర్యాలు, లక్ష్యసిద్ధిని సాధించేందుకు ప్రాణాలను సైతం లెక్కచేయక యుద్ధం చేసే తెగింపు, నిర్భయం, మొదలైన గుణాలు కలిగిన పాత్రలు ఇరువురి రచనల్లోనూ ఉన్నాయి. ఆ పాత్రల్లోని సామ్య వైషమ్యాలను పరిశీలిద్దాం.

మానసింహుడు - వీర పురుష దత్తుడు : 'మృగనయని' నవలలోని పురుష పాత్రలలో ప్రధాన పాత్ర మానసింహుడు. అతడు నవలలోని నాయకుడు. గ్వాలియర్ రాజ్యానికి రాజు. 'అడవి శాంతిశ్రీ' నవలలో వీర పురుషదత్తుడు అంత ప్రధానంగా కనబడక పోయినా రాజుగా చరిత్ర కెక్కిన వ్యక్తి. శాంతి మూలుని కుమారుడు. శాంతిశ్రీకి అన్నగారు. బృందావన్-లాల్ వర్మగారు మానసింహుని ఎలా వర్ణించారో బాపిరాజుగారు వీరపురుష-దత్తుని కూడ అలాగే వర్ణించారు.

వీరపురుషదత్తుడు చాల అందగాడు. మహావీరుడు. అతని ఇద్దరు మేనత్త కూతుర్లు శాంతశ్రీ, బాపిశ్రీలు అతన్ని మనసారా ప్రేమిస్తారు. వీరపురుష దత్తుడు కూడా వారిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తాడు. ఒకసారి వారిద్దరితో "శాంతా! బాపిశ్రీనికా! నేను మహారాజుల ఆజ్ఞ చొప్పున ఉజ్జయిని వెళ్ళవలసి వచ్చింది. వెంటనే తిరిగి వస్తాను. ఒక్కటే నామాట వినండి. మీఇద్దరికీ నా హృదయం మన బాల్యం నుంచీ అర్పించుకొన్నాను. రాజ్యావసరాల కొలది రాకుమారికలు నా జీవితంలో ప్రవేశింతురుగాక. వారి పట్ల ధర్మం నిర్వహిస్తాను. అంతే"[1] అంటాడు. "ఇంకా రాజ్యబలంకోసం అనేక రాజకుటుంబాలతో వియ్యమందబోతున్నారు నాయనగారు"[2] అంటూ తన చెల్లి శాంతిశ్రీతో చెబుతాడు. ఈ విధంగా వీరపురుష దత్తుడు ఎందరో స్త్రీలను పెండ్లాడినట్లు బాపిరాజుగారు రాశారు.

అలాగే మానసింహుడు వ్యాయామం చేసి శరీరాన్ని దృఢంగా

1. అడవి శాంతిశ్రీ- అడివి బాపిరాజు, పు: 36
2. పైదే, పు: 36.

ఉంచుకునే వాడు. అందగాడు. స్వభావతః రసికుడు. మృగనయనిని వివాహం చేసుకునేందుకు పూర్వమే అతనికి ఎనిమిది భార్యలుండే వారు.

ఈ విధంగా ఆనాటి రాజవంశాలలో బహుభార్యాత్వం సర్వ సాధారణం అని ఇద్దరు రచయితలు తెలిపారు. దీనికి వారి రసికత్వం ఒక్కటే కారణం కాదు. ఆనాటి రాజులకు శత్రువులు అధికంగా ఉండే వారు. అంతఃకలహాలు నిరంతరం ఉండేవి. కాబట్టి బలం పెంచుకోవాలి. ఇలా వివాహాలు చేసుకొంటే భార్య తరఫున బంధువులు తమ పక్షాన ఉంటారు. రాజుకు యుద్ధ సమయాల్లో తప్పక సహాయం చేస్తారనే ఉద్దేశంతో బహుభార్యాత్వం సమాజంలో ఉండేది. కాని అలాఅని అందరు రాజులు ఎంతో మంది భార్యలను కల్గి ఉండలేదు. శ్రీకృష్ణ శాతవాహనుడు చంద్రబాలను మాత్రమే వివాహం చేసుకొన్నాడు. 'విరాటాకీ పద్మినీ' నవలలో దేవీసింహుడు అసలు వివాహామే చేసుకోలేదు. 'కచనార్' నవలలో దలీపసింహుడు దాసిగా వచ్చిన కచనార్‌ను మాత్రమే ప్రేమించి చివరకు ఆమెనే వివాహం చేసుకొంటాడు. కట్ట వివాహమాడిన భార్య దుర్మార్గుడైన మానసింహుని ప్రేమిస్తే ఆమెను వదలివేస్తాడు. 'విరాటాకీ పద్మినీ' నవలలో నాయక సింహునికి ఇద్దరు భార్యలు

కచనార్ నవలలో దుర్మార్గుడు, రాజుకు తమ్ముడు వరుసైన మానసింహుడు తనకు వదినైనటువంటి దలీపసింహుని భార్యను వివాహం చేసుకొంటాడు. అలాగే అడవి శాంతిశ్రీలో ప్రతినాయకుడు పులమావి స్త్రీలోలుడనీ, అనేకమంది భార్యలున్నా శాంతిశ్రీపై మోజుపడి చివరకు అకాల మరణం పొందుతాడని రచయిత రాశారు.

కాని అడివి బాపిరాజుగారి నాయకులు కుబ్జ విష్ణువర్ధనుడు, గోనగన్నారెడ్డి, చాళుక్య వీరభద్రుడు, సువర్ణశ్రీ, బ్రహ్మదత్తుడు, సమదర్శి మొదలైన వారంతా ఏకపత్నీ వ్రతులే. అలాగే బృందావన్ లాల్ వర్మగారి అటల్ సింహుడు, దివాకరుడు, ముసాహిబజూ, భువనుడు మొదలైన వారు ఏకపత్నీ వ్రతులే. ఇంకా కుముద్ ను మనసారా ప్రేమించిన కుంజర సింహుడు, మానవతిని వలచిన అగ్నిదత్తుడు, హేమవతిని వలచిన నాగదేవుడు వివాహం జరగకుండానే మరణిస్తారు. ఇలాంటి పాత్రలు బాపిరాజు గారి నవలల్లో మనకు కనబడవు.

**అమృత పాదార్వాతులు - దలీప సింహుడు:** అమృత పాదార్వాతులు అడివి బాపిరాజు గారు హిమబిందులో సృష్టించిన ఒక విలక్షణ పాత్ర. పడవ ప్రమాదంలో తప్పిపోయిన స్థాలతిష్యుని కుమారుడే అమృత పాదార్వాతులు. ఈయన పూర్వాశ్రమ నామం నందిదత్తుడు. పడవ ప్రమాదంలో అతని తలపై పెద్దగాయం అవుతుంది. ఈ గాయంవల్ల నంది దత్తుడు పూర్వస్మృతిని కోల్పోతాడు. తనపేరు చెప్పలేని స్థితిలో ఉన్న ఇతనిని బౌద్ధ భిక్షువులు రక్షించి 'అమృత పాదార్వాతులు' అని పేరు పెట్టారు. ప్రమాద వశాత్తు గతస్మృతిని కోల్పోయినా చిత్త సంస్కారంవల్ల ఎన్నో భాషల్లో పాండిత్యం సంపాదించడంతో పాటు, బౌద్ధమత గ్రంథాలన్నీ ఆరుమాసాల్లో అధ్యయనం చేసి అతడు అపారజ్ఞానాన్ని ఆర్జిస్తాడు. అయినా అతడెవరో అతనికే తెలియదు. "చివరకు స్థాలతిష్యులు అమృత పాదార్వాతులే తన కుమారుడని గుర్తించి తల పగుల కొట్టి, కరుడు కట్టిన రక్త కణ భాగాన్ని తొలగించి, చర్మాన్ని కుట్టి కట్టు కడతాడు. దీనితో

అమృత పాదార్వాతులు తన గతస్మృతిని పొందుతాడు"[1]

ఈ రకంగా ఒక సంఘటన కారణంగా స్మృతి పోయి, మరలా గతస్మృతి వచ్చే పాత్రను వర్మగారు కూడా సృష్టించారు. 'కచనార్' నవలలోని దలీప సింహుడు అటువంటి పాత్ర.

దలీప సింహుడు మొదట స్మృతిని కోల్పోయి, మరలా స్మృతిని పొందడం అసంభవమని పాఠకులకు తోస్తుందేమోనని దానిని సమర్థించడానికి రచయిత "భువాల్ సన్యాసి కేసుకు సంబంధించిన సంఘటనలను ఆధారాలుగా పేర్కొన్నారు."[2] ఇంకా "బంగ్లా రాష్ట్రానికి చెందిన ప్రసిద్ధ చారిత్రక నవలాకారుడైన 'రాఖాల్ దాస్ బెనర్జీ' తన ప్రసిద్ధ చారిత్రక నవలయైన 'శశాంక'లో కూడ ఇటువంటి ఘటననే వర్ణించారు."[3] ఇంతే కాకుండా "వైద్యులైన తన మిత్రుల సలహాలు కూడ తీసుకొన్నారు."[4] ఈ విషయం ఆయనే కచనార్ నవల పరిచయంలో రాసుకొన్నారు.

ధామోనీ రాజైన దలీప సింహుడు శత్రువులను ఓడించి తిరిగి వస్తుండగా గుర్రంపై నుండి క్రింద పడతాడు. తలకు బలమైన గాయం తగులుతుంది. సరియైన చికిత్స జరగనందున అతడు క్రమంగా పూర్వ స్మృతిని కోల్పోతాడు. మహంత్ అచలపురి అతడ్ని తన ఆశ్రమంలో ఉంచుకొని పరిచర్యలు చేయిస్తాడు. పరిచర్యల వల్ల అతనికి స్వస్థత చేకూరుతుంది. కానీ,

---

1. హిమబిందు – అడివి బాపిరాజు, పు: 432-434.
2. కచనార్ 'పరిచయ్' – బృం. లాల్ వర్మ, పు: 3.
3. హిందీ కే ఐతిహాసిక్ ఉపన్యాసోం మే ఇతిహాస్ ప్రయోగ్ – డా॥ గోవింద జీ, పు: 204.
4. కచనార్ 'పరిచయ్' – బృం. లాల్ వర్మ, పు: 4.

గతం గుర్తుకు రాదు. కొంత కాలానికి మరొక యుద్ధంలో ఒక గోడపై నుండి క్రింద పడినప్పుడు మరల అదే చోట దెబ్బ తగలడంతో అతనికి పూర్వ స్మృతి కలుగుతుంది.

బాపిరాజు గారు, స్థాలతిష్యులు శస్త్ర చికిత్స చేసి తన కుమారునికి గతస్మృతి తెప్పించినట్లు రాశారు. కానీ ఆధారాలేమీ చూపలేదు. ఇటువంటి చికిత్సా విధానం వర్మగారు చూపించలేదు. తలపై గాయం తగిలి స్మృతి పోవడం, కొన్నాళ్ళకు అదే చోట దెబ్బ తగిలి మరల గతస్మృతి రావడం అనే విషయానికి రెండు ఆధారాలిచ్చి వర్మగారు తన కల్పనను సమర్థించుకొన్నారు.

**గోనగన్నారెడ్డి – సాగరసింహా :** అడివి బాపిరాజు గారు రచించిన 'గోనగన్నారెడ్డి' నవలలో 'గోనగన్నారెడ్డి'కి, బృందావన్ లాల్ వర్మగారు రచించిన 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' నవలలో 'సాగర సింహా'కు కొంత సామ్యం కన్పిస్తుంది. గోనగన్నారెడ్డినే బాపిరాజు గారు కథానాయకుడుగా ఎన్నుకొన్నందు వల్ల అతనికి నాయక లక్షణాలన్నీ ఉండేటట్లు ఆ పాత్రను సృష్టించారు. లకుమయారెడ్డి తన అన్న కొడుకులైన గోనగన్నారెడ్డిని, విఠలధరణీశుణ్ణి నిర్లక్ష్యం చేసి వారి రాజ్యాన్ని పూర్తిగా కబళించి, వారి ఖర్చులకు పంపవలసిన ధనాన్ని పంపడం మానివేస్తాడు. అప్పుడు గన్నారెడ్డి తన అనుచరులతో అడవులకు పారిపోయి గజదొంగగా మారిపోతాడు. అనివార్య కారణాల వల్ల గన్నారెడ్డి గజదొంగగా మారినా అతడు ప్రజలను వేధించలేదు. సామంతుడెవడైనా ప్రజలను పీడిస్తుంటే అతణ్ణి శిక్షించేవాడు. గన్నారెడ్డి తన అనుచరులతో రుద్రమదేవి సైన్యంలో చేరి శత్రువులను చీల్చి చెండాడి ఆమెకు

కృతి భుజంగా నిలుస్తాడు.

వర్మగారి 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' నవలలో బందిపోటు దొంగ అయిన సాగర సింహుని రాణి బంధిస్తుంది. బందీ అయిన సాగర సింహుడు రాణితో ఈ విధంగా చెప్తాడు. తాను దేశభక్తి కల వాడనని, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా బందిపోటుగా మారాననీ, తాము 'ఓరఛా' రాజుకు సహాయంగా పోరాడే వారమనీ, ఆంగ్లేయులు భారత దేశానికి వచ్చి మన దేశాన్ని కొద్ది కొద్దిగా ఆక్రమిస్తూ ఉంటే కొంత మంది రాజులు తిరగబడ్డారనీ, తాను కొంత మంది అనుచరులతో ఈ రాజులకు సాయం చేసే వాడననీ, ఇది తెలిసి తమను అణచి వేయడానికి ఆంగ్లేయ ప్రభుత్వం ప్రయత్నిస్తే పారిపోయి దొంగలుగా మారామనీ, నిజానికి తనుగానీ, తన అనుచరులు గానీ దీనులను, స్త్రీలను బాధించలేదనీ, గంగాజలం సాక్షిగా శపథం కూడా చేస్తానంటాడు. అతని మాటలు విని రాణి అతన్ని క్షమించి తన సైన్యంలో చేర్చుకొంటుంది.

గోనగన్నా రెడ్డి తొలుత గజదొంగగా మారినా, చివరకు రుద్రమదేవి సైన్యంలో చేరుతాడు. అలాగే సాగర సింహ కూడ తొలుత బందీగా చిక్కి చివరకు లక్ష్మీబాయి సైన్యంలో చేరుతాడు. గోనగన్నారెడ్డి కాకతీయ చక్రవర్తి గణపతి దేవుడు, శివదేవయ్య మంత్రుల అనుమతి తీసుకొనే గజదొంగగా మారాడని రచయిత రాశారు. ఏది ఏమైనా పరిస్థితుల ప్రాబల్యం వల్ల మంచి వారు కూడా గజదొంగలుగా మారే అవకాశముందనీ వారిని ఆదరిస్తే వారిలో పశ్చాత్తాపం కలిగి మరలా మామూలు మనుషులుగా

మారి పోతారని ఈ పాత్రలవల్ల అర్థమౌతుంది.

**సమదర్శి – అటల్ :** బాపిరాజు గారు రచించిన 'హిమబిందు'లోని 'సమదర్శి' పాత్రకు, వర్మగారు రచించిన 'మృగనయని' లోని 'అటల్' పాత్రకు ఎన్నో సామ్యాలున్నాయి.

'సమదర్శి', 'అటల్'లు ఇద్దరూ ఎంతో ధైర్యసాహసాలు గల యువకులు. దేశభక్తి, ప్రభుభక్తి గల గొప్ప వీరులు. సమదర్శి, చక్రవర్తి శ్రీముఖ శాతవాహనునకు ప్రీతి పాత్రుడైతే, అటల్ గ్వాలియర్ రాజు మానసింహునకు ప్రీతి పాత్రుడౌతాడు.

అటల్, లాఖీలు 'మగరౌని' గ్రామంలో ఉన్నప్పుడు, గయాసుద్దీన్ సేనలు ఆ గ్రామంపైకి దండెత్తి వచ్చినప్పుడు ప్రజలందరితో పాటు వీరిద్దరూ కూడ, నర్‌వర్ కోటలో దాక్కుంటారు. కోటలో మారు వేషాల్లో ప్రవేశించిన శత్రువులు కోట తలుపులు తెరవాలని ప్రయత్నిస్తే, అటల్, లాఖీలు కని పెట్టి ఆ ప్రయత్నాన్ని వమ్ము చేస్తారు. ఈ విధంగా ధైర్య సాహసాలను చూపి నర్‌వర్ కోటను రక్షించిన అటల్, లాఖీలను రాజు మానసింహుడు గ్వాలియర్ ఆహ్వానించి, సన్మానిస్తాడు. తరువాత అటల్ ప్రేమిస్తున్న లాఖీతో వివాహం జరిపిస్తాడు. రాయి దగ్గర ఒక దుర్గాన్ని కట్టించి, ఆ దుర్గ రక్షణా భారాన్ని వహించమని రాజ ప్రతినిధిగా నియమిస్తాడు.

అలాగే 'సమదర్శి' శ్రీముఖ శాతవాహనుని సామ్రాజ్యంపై వచ్చిన అభీరులను ఓడించి, తరిమివేసి వారి పతాకాలన్నింటిని తెచ్చి,

సార్వభౌముని పాదాల చెంత అర్పిస్తాడు. అందుకు ఆనందించిన చక్రవర్తి నిండు సభలో సమదర్శిని అభినందించి, సత్కరించి 'శాతవాహన శత్రు సమవర్తి' అనే బిరుదును ప్రసాదిస్తాడు. తర్వాత ఆంధ్రులు ఉజ్జయినిపై దండెత్తి వెళ్ళినప్పుడు సమదర్శి ఎంతో వీరోచితంగా పోరాడుతాడు. సమదర్శి సహకారమే లేకపోతే ఉజ్జయిని కోట ఆంధ్రుల వశము కాదు. అందుకే సమదర్శి ధైర్య సాహసాలకు, ప్రభుభక్తికి మెచ్చి చక్రవర్తి అతణ్ణి భరకచ్ఛ పురాలకు రాజ ప్రతినిధిగా చేస్తాడు.

రాయి దుర్గాన్ని రక్షిస్తున్న అటల్‌పైకి సికిందర్ లోడీ సైన్యాలు హఠాత్తుగా దాడి చేస్తే, అటల్ శత్రువులపై విరుచుకపడి భయంకరంగా పోరాడుతాడు. యుద్ధంలో లాఖీ చనిపోయిన విషయం తెలుసుకొని, ఆమె వియోగాన్ని భరించలేక శత్రువులతో ఇంకా భయంకరంగా యుద్ధం చేస్తాడు. ఆ యుద్ధంలో అటల్ కూడ మరణిస్తాడు.

అడవి బాపిరాజు స్వీకరించిన కథలన్నీ మంగళాంతాలే. కాబట్టి సమదర్శి కథ కూడా సుఖాంతమౌతుంది. సమదర్శి, చక్రవర్తికి విశ్వాస పాత్రుడై తనను ప్రేమించిన నాగబంధునికను వివాహమాడి, ఆమె సహాయ, సహకారం కూడా స్వీకరించి భరుకచ్ఛపాన్ని రాజప్రతినిధిగా పరిపాలిస్తూ సంతోషంగా జీవిస్తాడు. ఆశాజీవి ఎలా తన జీవితాన్ని సుఖమయం చేసుకోగలడో బాపిరాజు గారు సమదర్శి పాత్ర ద్వారా నిరూపిస్తే,

ప్రజీవి ఎన్నో అవాంతరాలు ఎదురొచ్చిన పైకి వచ్చినా తర్వాత జీవితాన్ని అనుభవించలేడని, జీవితమంతా సుఖమయంగా గడుపాలనుకొనే టప్పుడు

విధి వైపరీత్యం వల్ల హఠాత్తుగా చనిపోవడం సంభవిస్తుందని అటల్ పాత్ర ద్వారా వర్మగారు వివరించారు.

సమదర్శి, అటల్ పాత్రల్లో కొన్ని వైషమ్యాలున్నాయి. మొదట సమదర్శి హిమబిందును ప్రేమించి ఆమెను పొందలేక తన జీవితమంతా చక్రవర్తికే అంకితం చెయ్యాలనుకొంటాడు. కాని నాగబంధునిక నిశ్చల ప్రేమను, సాహసాలను చూచి ఆమెను వివాహం చేసుకుంటాడు. అటల్ చిన్నప్పుడు చాల బీదవాడుగా ఉండి, కష్టపడి పైకి వచ్చి, లాఖిని ప్రేమించి గంగాజలం గా ఆమెను వివాహమాడి సంఘంచే బహిష్కరింపబడుతాడు. అటల్ ఎంతటి వీరుడో అంతటి అమాయకుడు. ఇలాంటి వైషమ్యాలు కొన్ని ఉన్నా అటల్ సమదర్శిల గుణగణాల్లో సామ్యాలే అధికంగా కన్పిస్తాయి.

4.3.3. **విలక్షణ పాత్రలు :**

**స్థూల్య తిష్యుడు :** బాపిరాజు గారి 'హిమబిందు' నవలలో 'స్థూలతిష్యుడు' ఒక విలక్షణమైన పాత్ర. ఇటువంటి పాత్ర వర్మగారి నవలల్లో కనబడదు. ముద్రారాక్షసంలో రాక్షసమంత్రి పాత్రను ఆధారం చేసుకొని ఈ పాత్రను బాపిరాజు గారు సృష్టించారేమో అన్పిస్తుంది. రాక్షసమంత్రి సృష్టించిన విష కన్య నాశనం కాగా, స్థూలతిష్యుని విషబాల అమృతబాలగా మారి భావి సామ్రాజ్ఞి అవుతుంది. ఇదే బాపిరాజు గారి ప్రత్యేకత. స్థూలతిష్యుని దుర్మార్గుడు అందామా అంటే నవల పొడుగునా 'స్థూలతిష్య మహర్షి' అనే రచయిత సంబోధించారు స్థూలతిష్యుని దుష్కృత్యాలు రెండూ చక్రవర్తి శ్రీముఖ శాతవాహను నికి మనస్తాపం కలిగించేవే. 1. మంజుశ్రీని అపహరించడం, 2. విషకన్య

ప్రయోగం ద్వారా శ్రీకృష్ణ శాతవాహనుని అంతమొందించడం. ఈ దుష్కృత్యాలు చక్రవర్తికి తెలిసినా స్థూలతిష్యుని పట్ల భక్తి భావాన్ని ప్రకటిస్తాడే తప్ప ప్రతీకార చర్యకు పూనుకోడు. స్థూలతిష్యుణ్ణి, అతని పరివారాన్ని శిక్షింపగల సమర్థుడై ఉండికూడ చక్రవర్తి ఉదాసీన వైఖరిని అవలంభించడం మనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. రచయిత ఉద్దేశం ఇలా ఉండవచ్చు. స్థూలతిష్యుడు ఏ కృత్యం చేసినా తన స్వార్థానికి చేయలేదు. అతడు ఆర్షమతాభిమాని కాబట్టి ఆంధ్ర దేశంలో ఆర్షమతాన్ని పునః ప్రతిష్ఠించాలనే కోరికతోనే ఈ కార్యాలు చేశాడు. అందుకే అన్నీ తెలిసి కూడా శ్రీముఖ శాతవాహనుడు స్థూలతిష్యుని పై ఏ చర్యా తీసుకోలేదు.

**సువర్ణశ్రీ :** అడివి బాపిరాజు గారు రచించిన 'హిమబిందు'లో సువర్ణశ్రీ నాయకుడు. ఇలాంటి విలక్షణ నాయకుడు వర్మగారి నవలల్లో కనబడడు. అమిత సుందరుడైన సువర్ణశ్రీ మహాశిల్పి. అతని తండ్రి ధర్మనంది శిల్పవిద్యలు నేర్పిస్తే, తండ్రికి తెలియకుండా సోమదత్తుని వద్ద వీరవిద్యలు నేర్చుకొంటాడు. ఎడ్ల బండ్ల పందెంలో అంతవరకు అనేక పర్యాయాలు లాటి దేశాలల్లో గెలుపొందిన సమదర్శిని ఓడిస్తాడు. తన మేనబావైన సమదర్శిని ఓడించిన సువర్ణశ్రీ అంటే మొదట కోపగించుకొన్నా, కొన్నాళ్ళకు అతని వ్యక్తిత్వాన్ని మెచ్చుకొని హిమబిందు అతన్ని ప్రేమిస్తుంది. సువర్ణశ్రీ కూడ హిమబిందును ప్రేమిస్తాడు. కాని వణిక్సార్వభౌముడైన హిమబిందు తండ్రి చారుగుప్తుడు తనపుత్రికను సామ్రాజ్ఞి చెయ్యదలచాడు. ఈ విషయం తెలిసాక కేవలం శిల్పి అయిన

తన కంటె చక్రవర్తి హిమబిందుకు భర్తగా రావడం ఆమె అదృష్టమని తలచి సువర్ణశ్రీ తనలోనే కుంగి పోతాడు. హిమబిందు శ్రీకృష్ణ శాతవాహనుల వివాహాన్ని మనస్ఫూర్తిగా అంగీకరిస్తాడు. చోరులు హిమబిందును అపహరిస్తే ఆమెను, ఆమెతో పాటు మంజుశ్రీని కూడ రక్షిస్తాడు. హిమబిందు తన సొత్తు కాదని తెలిసినా తన ప్రాణాలొడ్డి ఆమెను రక్షిస్తాడు. సువర్ణశ్రీ ధైర్యసాహసాలు శ్రీముఖ శాతవాహనునికి తెలిసి అభిమానంతో తన సైన్యంలో చేర్చుకొంటాడు. అలా చేరిన సువర్ణశ్రీ అంచెలంచెలుగా ఎదిగి ఉపసైన్యాధ్యక్ష పదవిని చేపట్టి పాటలీ పుత్రాన్ని అవలీలగా జయిస్తాడు.

మహా శిల్పిగా, గొప్ప వీరునిగా, ప్రభుభక్తి పరాయణునిగా, నిస్వార్థ ప్రేమికునిగా బాపిరాజు గారు సువర్ణశ్రీని తన నవలలో వర్ణిస్తారు. బాపిరాజు గారి చిత్రలేఖనంలోని సామర్థ్యమే సువర్ణశ్రీ శిల్పవిద్యలో కన్పిస్తుంది. హిమబిందు, సువర్ణశ్రీల ప్రేమగాథ చక్రవర్తికి తెలిసి వారిని ఆశీర్వదిస్తాడు.

**బ్రహ్మదత్తుడు :** అడివి బాపిరాజు గారు రచించిన 'అడవిశాంతిశ్రీ' నవలలో కథానాయకుడు బ్రహ్మదత్తుడు. ఇతడు రాజనీతి విశారదుడు. సేనాపతి. సంస్కృతాంధ్ర ప్రాకృత భాషల్లో మహా పండితుడు. కవి. అంతేగాక తన కావ్యాలను స్వరబద్ధం చేసి శ్రావ్యంగా గానం చేయగల మేటి గాయకుడు. గొప్ప జ్ఞాని. ఇతడిని మహాతలవర, మహాదండనాయక, మహాసేనాధిపతి అని రాజు గారు పొగిడారు. ఇతడు శాంతిమూలుని ఆంతరంగిక సచివుడు

వివాహమంటే విముఖత, విచిత్రమైన మనస్తత్త్వం, మానసిక అపరిపక్వం గల విలక్షణ స్వభావురాలైన తనకుమార్తెకు విద్యాబోధించి ఆమెలో మార్పు తేగల సమర్థుడైన గురువు ఒక్క బ్రహ్మదత్తుడే అని భావించి శాంతిమూలుడు అడవి శాంతిశ్రీకి గురువుగా బ్రహ్మదత్తుని నియోగిస్తాడు. శాంతిశ్రీకి తగిన భర్త, ఆమెను వివాహమాడగల సమర్థుడు బ్రహ్మదత్తుడొక్కడే అని శాంతిమూలుని దృఢ విశ్వాసం. ఆ విశ్వాసాన్ని బ్రహ్మదత్తుడు వమ్ము చేయలేదు. బ్రహ్మదత్తుని గురుత్వంలో క్రమంగా శాంతిశ్రీ వ్యక్తిత్వం పరిణామం చెంది అతని గుణగణాలను, శౌర్య పరాక్రమాలను, గంభీర మనస్తత్త్వాన్ని మెచ్చి అతణ్ణే వివాహం చేసుకొంటుంది. మహా పండితుడైన బ్రహ్మదత్తుడు లోకప్రసిద్ధి చెందిన భగవద్గీతకు గొప్ప వ్యాఖ్యానాన్ని రాయగా అది మహత్తర భాష్యంగా ప్రఖ్యాతి చెందింది. ఇటువంటి విలక్షణ పాత్ర మనకు వర్మగారి నవలలో కనబడదు.

**ముసాహిబజూ, చరఖారీ:** ముసాహిబజు - చరఖారీ దంపతుల లాంటి విలక్షణ పాత్రలు అడివి బాపిరాజు గారి చారిత్రక నవలల్లో కనిపించవు. ముసాహిబజు ఎంతటి స్వామిభక్తి పరాయణుడో అంతటి మొండివాడు. తన అనుచరులపై ఈగను కూడ వాలనిచ్చేవాడు కాదు. తన సైనికులందరినీ ఎంతగానో ప్రేమించేవాడు. ముసాహిబజు అధీనంలో ఉన్న సైనికులు చాల బీదవారు. నిమ్న జాతికి చెందిన వారు. రాజుగారిచ్చే జీతం వారికి సరిపోదని తెలుసుకొని, తన వద్దనున్న ధనాన్నంతా వారి ఆకలి తీర్చేదానికి ఖర్చుచేసేవాడు. అతని భార్య చరఖారీ కూడ కి చేదోడుగా ఉండేది.

నూర్ బాయి : ఐశ్వర్యంలో పెరిగి అందంలో, ఆకర్షణలో, నాట్యంలో, గానంలో ప్రవీణురాలైన నూర్‌బాయి చిరిగిన వస్త్రాలతో, దారిద్ర్యంతో బాధ పడుతూ, సామాన్య జనుల మధ్య జీవించడం సామాన్య విషయం కాదు. ఒకప్పుడు డబ్బు, నగలు, హోదా కోసమే పాటుపడిన నూర్‌బాయి చివరకు ధనం కంటే, విలాసం కంటే భక్తితత్వమే గొప్పదని భావించడం ఆశ్చర్యం. ఆమె మహమ్మదీయురాలై ఉండి కూడా చివరి దశలో కృష్ణ భక్తురాలై రసఖాన్, సూరదాస్ మొదలైన భక్త కవుల తత్వాలు పాడుకొంటూ ప్రశాంత జీవితం గడిపింది. విలాస జీవితం కంటె భక్తి తత్వమే గొప్పదని వర్మగారు ఈ పాత్ర ద్వారా సూచించారు. ఈమెలో పరోక్షంగా సూఫీ తత్వాన్ని వర్మగారు ప్రతిపాదించారనిపిస్తుంది. నూర్‌బాయి లాంటి కరుణారస పూరితమైన విలక్షణ పాత్ర బాపిరాజుగారి రచనల్లో కనిపించదు.

కచనార్ : వర్మగారు రచించిన చారిత్రక నవలల్లో పూర్తి సుఖాంతమైన నవల కచనార్. వర్మగారు ఈ పాత్ర చిత్రణలో ఎన్నో మెలకువలు చూపారు. రాజు ఆమెను అందరు దాసీలవలె భావించి, వాంఛిస్తే ఒప్పుకోక, ఇష్టపడితే గా వివాహం చేసుకోమంటుంది. కచనార్‌ను చెరబట్టాలని మానసింహుడు ప్రయత్నిస్తే తప్పించుకొని పారిపోయి గోసాయిల ఆశ్రమం చేరుకొంటుంది. కచనార్ దాసియైనా, తన శీలాన్ని రక్షించుకొంటూ చివరకు దలిపసింహుని భార్యయై, రాణిగా మన్ననలనందుకొంటుంది. ఇలాంటి ఉదాత్త పాత్ర బాపిరాజుగారి రచనల్లో కనపడదు.

4.3.4. మరికొన్ని అంశాలు :

బాపిరాజుగారి నవలల్లో పాత్రల అపహరణ సర్వసామాన్యం

హిమబిందు నవలలో హిమబిందుని చోరులు అపహరించి దాచేస్తే, సువర్ణశ్రీ వెళ్ళి శత్రువులను చీల్చిచెండాడి హిమబిందును బంధ విముక్తురాల్ని చేస్తాడు. అలాగే అంశుమతి నవలలో దానార్ణవుడు 'అంశుమతి'ని అపహరించి బంధిస్తే కుబ్జ విష్ణువర్ధనుడు రక్షిస్తాడు. 'గోనగన్నా రెడ్డి' నవలలో అన్నాంబికను ఆమె సమ్మతితోనే గన్నారెడ్డి అపహరిస్తాడు. ఇలా నాయికలను అపహరించి చొరరాని చోట బంధిస్తే నాయకులు వెళ్ళి రక్షించడం అనేది వర్మగారి నవలల్లో కనబడదు. కాని మృగనయనిలో మృగనయనీని, లాఖీని అపహరించాలని గయాసుద్దీన్ మనుష్యులు ప్రయత్నిస్తారు. ధైర్య సాహసాలతో బాణాలు వేసి నిన్నీ, లాఖీలు వారిని చంపేస్తారు. 'గఢ్ కుండార్'లో అగ్నిదత్తుడు తన ప్రేయసి తనను తిరస్కరిస్తే ఆమెను అపహరించి బలాత్కారంగా వివాహం చేసుకోవాలనుకొంటాడు. ఒకే విధమైన రూపు రేఖలుండడంచే తన చెల్లెలు తార వేషం వేసుకొని వచ్చి మానవతిని అపహరించాలనుకొంటాడు. కాని అతనికి శృంగభంగమవుతుంది. నాగదత్తుడు కూడ హేమవతిని అపహరించాలనుకొంటాడు కాని అతని ప్రయత్నం విఫలమవుతుంది. 'విరాటాకీ పద్మిని' నవలలో 'అలీ మర్దాన్' కుముద్‌ను అపహరించాలని వస్తాడు కాని ఆమె అలీమర్దాన్‌కు చిక్కకుండా బేతవా నదిలో పడి మరణిస్తుంది. 'టూటే కాంటే' నవలలో 'నూర్‌బాయి'ని తనతో ఈరాన్ తీసుకు పోవాలని 'నాదిర్షా' అనుకొంటూ ఉంటే నూర్‌బాయి తప్పించుకొని వెళ్ళి పోతుంది.

ఇలా వర్మగారి నాయికలు ఎవరూ శత్రువులచే బంధింపబడి కారాగారంలో మగ్గినవారు లేరు. బాపిరాజుగారి కథాకాలం నాటి పవిత్రత వర్మగారి కాలం నాటికి లేదు. ఆనాడు హిమబిందు, అంశుమతి బంధింపబడినా వారి శీలానికి ప్రమాదం లేదు. కానీ వర్మగారి నవలా కాలానికి స్త్రీల మాన ప్రాకారాలకు రక్షణ లేదు. మృగనయని గయాసుద్దీన్‌కు చిక్కితే ఆమె మానం, ప్రాణం పోయేవి. అందుకే ధైర్య సాహసాలతో శత్రు వుల్ని ఎదిరించింది. కానీ కుముద్‌కు ఆ ధైర్యం లేక బేతవా నదిలో పడి మరణించింది. నూర్‌బాయి తెలివిగా తప్పించుకొంది; కాబట్టి రచయిత ఉద్దేశ్యం తేటతెల్లమవుతూ ఉంది. కామ పిశాచాలు తిరిగే సమాజంలో ధైర్య సాహసాలైనా ఉండాలి లేక యుక్తి అయినా ఉండాలి. ఈ రెండూ లేనివారు 'కుముద్' మాదిరి ఆత్మహత్య చేసుకొంటారు. శత్రువుల చేతుల్లో బందీలుగా చిక్కేకంటే వీరోచితంగా పోరి వీరస్వర్గం అలంకరించడం మేలు. అందుకే లక్ష్మీబాయి లాంటి వీరనారీమణులు మహిళా లోకానికి ఆదర్శ మూర్తులు.

రాజుగారి నవలల్లోనూ, వర్మగారి నవలల్లోనూ రాజుగాని, రాణిగాని విపత్కర పరిస్థితుల్లో ఉంటే, మనశ్శాంతి కోసమో దేశంలో శాంతి నెలకొల్పడం కోసమో మునులు, ఆచార్యులు, మంత్రులు అయిన మహానుభావుల సలహాలు తీసుకొనే దానికి వెళుతూ ఉంటారు. నాగార్జునా-చార్యులు, శివదేవయ్య మంత్రి, స్థాలతిష్యులు, అమృత పాదార్యాతులు వీరందరూ రాజులకు ఉపదేశాలిచ్చిన వారే.

అలాగే వర్మగారి నవలల్లోనూ బోధన్ పండితుడు, విజయ జంగం, మహంతు అచలపురి, బాబా గంగాదాసు, ధౌమ్యమహర్షి మొదలైన వారు రాజులకు సూచనలిచ్చారు. రుద్రమదేవి రాజ్యం సక్రమంగా పరిపాలించడానికి శివదేవయ్య మంత్రి సలహా తీసుకొన్నట్లే లక్ష్మీబాయి బాబా గంగాదాసు సూచనలు తీసుకునేది. ధౌమ్యమహర్షి సోమకునికి నీతులు బోధించినట్లే, నాగార్జునాచార్యులు శాంతిమూలునికి ఉపదేశాలు గావిస్తారు.

బాపిరాజు గారి అంశుమతి నవలలో 'అంశుమతి' నాయిక. కుబ్జ విష్ణు వర్ధనుడు నాయకుడు. అంశుమతికి మాధవీలతా కుమారి అనే మిత్రురాలు ఉంది. అలాగే కుబ్జ విష్ణు వర్ధనునికి 'జయనంది' అనే ప్రియ మిత్రుడున్నాడు. అంశుమతిని విష్ణువర్ధనుడు ప్రేమించి, పెద్దల అనుమతితో వివాహం చేసుకుంటాడు. అలాగే అంశుమతి స్నేహితురాలైన మాధవీ లతా కుమారి, కుబ్జ విష్ణు వర్ధనుని చెలికాడైన జయనంది ప్రేమించి వివాహం చేసుకుంటారు.

బాపిరాజు గారి 'అడవి శాంతిశ్రీ' లో కూడా ఇలాంటి నాయికా నాయకుల, చెలికత్తె చెలికాడుల వివాహం జరగడం రచయిత ప్రస్తావించి ఉన్నారు. అడవి శాంతిశ్రీ అంగరక్షకురాలు తారానిక. అలాగే బ్రహ్మదత్త ప్రభువు అంగరక్షక దళాధిపతి నాగదత్తుడు. తారానికను నాగదత్తుడు ప్రేమించి గాంధర్వ వివాహం చేసుకొంటాడు. ఇలాంటి అప్రధాన పాత్రల వివాహ విషయాలు వర్మగారు ప్రస్తావించలేదు.

ఒకే పోలికలున్న, లేక కవలలైన అన్నా చెల్లెళ్ళ పాత్రలు బాపిరాజు గారు, వర్మగారు చిత్రించారు. సువర్ణశ్రీ, నాగబంధునిక అచ్చు గుద్దినట్లు ఒకే విధంగా ఉంటారనీ, అలాగే అడివి శాంతిశ్రీ, వీరపురుష దత్తులు కవలలా అన్నట్లు కనబడుతారనీ రాజుగారు రాస్తే, తారా, అగ్నిదత్తులు రూపురేఖలు ఒకే విధంగా ఉండడమే గాక వారు కవలలు కూడా. వీరు కవలలుగా ఉండడం నవలలో కథ ముందుకు నడపడానికి కొంత దోహదం చేస్తుంది. అగ్నిదత్తుడు అచ్చు గుద్దినట్లు తారగా ఉండడం మూలాన తన సోదరి వేషం వేసుకొని ప్రియురాలు మానవతిని ఎత్తుకు వెళ్ళాలని అనుకొంటాడు. అటువంటి ప్రణాళిక లేవీ రాజుగారి నవలల్లో కనబడవు.

ఈ విధంగా విభిన్న దేశ కాలాలకు సంబంధించిన కథావస్తువును స్వీకరించి నవలలను రాస్తే, వాటిలో పరంపరగా సంక్రమించే కొన్ని సామ్యాలున్నా, దేశకాల ప్రభావాల వల్ల కొన్ని వైషమ్యాలుండడం సహజమని ఈ పరిశీలన వల్ల తేలింది.

## 5.1.1. అడివి బాపిరాజు గారి చారిత్రక నవలల్లో రాజకీయ పరిస్థితులు :

**5.1.1.0. ప్రవేశిక :** ప్రతి చారిత్రక నవలలోను సాంఘిక, సాంస్కృతిక, మత, ఆర్థిక పరిస్థితులతో పాటు ఆనాటి రాజకీయ పరిస్థితులు కూడ తప్పక చోటు చేసు కుంటాయి. బాపిరాజు గారు తను రచించిన నాలుగు చారిత్రక నవలలో ఆనాటి రాజులు తమ రాజ్యాలను ఎలా విస్తరించు కుంటారు? బాహ్య, అంతర శత్రువులను ఎలా అణచివేస్తారు మొదలైన విషయాలను వివరించారు. చక్రవర్తి సింహాసనం కోసం వచ్చే కుట్రలు, చక్రవర్తులు ప్రదర్శించే యుద్ధనీతి, గూఢచారి విధానం మొదలైన విషయాలను బాపిరాజు గారు తన చారిత్రక నవలల్లో పెక్కు కోణాల్లో పరిశీలించి, వివరించి ఉన్నారు. ఆంధ్రరాజులు సర్వస్వతంత్రులని, అందుచేత పరిపాలనా పద్ధతి కూడా స్వతంత్రంగా ఉండేదనీ, మంత్రి సేనాపతుల దండనాయకుల, ప్రాడ్వివాకుల సభల, సలహాల ననుసరిస్తూ రాజులు పరిపాలన చేసేవారనీ, రాజధర్మాలు సామాన్య ప్రజల కనుగుణంగా ఉండేవనీ, యుద్ధ సమయాల్లో ప్రజలు రాజుకు సహాయం చేసేవారనీ, రాజులు దిగ్విజయ యాత్రలు, యజ్ఞయాగాది క్రతువులు పట్టాభిషేక మహోత్సవాలు జరుపుకొనే వారనీ బాపిరాజుగారు తమ నవలలన్నింటిలో ను సూక్ష్మాతి సూక్ష్మంగా వివరించి ఉన్నారు. ఇంకా కొలువుకూటం, దండయాత్రలు, యుద్ధ విధానం, యుద్ధ సామగ్రి, వేట, శిక్షణ, న్యాయ విచారణ మొదలైన రాజకీయ పరిస్థితులన్నింటిని క్షుణ్ణంగా వివరించారు. వారి చారిత్రక నవలల్లోని రాజకీయ పరిస్థితుల్ని గురించి తెలుసు కొందాం.

### 5.1.1.1. రాజకీయ పరిస్థితులు :

1. **హిమబిందు :** హిమబిందు కథాకాలం క్రీ.పూ. 3వ శతాబ్దికి చెందింది. అప్పుడు శ్రీముఖ శాతవాహనుడు ఆంధ్రరాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండేవాడు. శ్రీముఖ శాతవాహనుని రాజధాని ధాన్యకటకం. నేటి కృష్ణానదీ తీరాన ఉన్న అమరావతీ పట్టణమే ఆనాటి ధాన్యకటకం. "శ్రీముఖ శాతవాహనుని కాలమునకే కృష్ణానది యొడ్డున నున్న అమరావతి ఈ వంశము వారికి ముఖ్య పట్టణముగా నుండెను. దీనినే ధాన్యకటకం, ధాన్యవాటి, ధనకటకము మొదలైన పేర్లతో ఆకాలమున వ్యవహరించిరి."[1] ఇది ఆంధ్రదేశానికి నడిబొడ్డున ఉన్నది. కావున శత్రువులు ముఖ్యపట్టణంపై దాడి చేయుట అంత సులభం కాదు. ఆంధ్రమహా సామ్రాజ్యం ఉత్తరాన ఉజ్జయిని, తూర్పున శ్రీకాకుళం, దక్షిణాన కృష్ణగిరి, పశ్చిమాన ప్రతిష్ఠానము, నాసిక, భరుకచ్ఛముల వరకు వ్యాపించింది. ఉజ్జయిని శాతవాహనుల వశం కావడానికి చిత్తశుద్ధితో కృషి చేసిన మహావీరుడు సమదర్శి. శాతవాహనులకు పుళిందులు, మాళవులు, వైదేహులు, మగధులు చిరకాల శత్రువులు. శ్రీముఖ శాతవాహనునికి సమదర్శి, సువర్ణశ్రీ లాంటి మహావీరులు ఎల్లప్పుడూ సాయపడేవారు. శ్రీముఖ శాతవాహనుని వద్ద అసంఖ్యాకమైన సైన్యం ఉండేది. రాజుగారు ఈ నవలలో ముట్టడి, చైత్రయాత్ర, సైన్యవేశం, స్కంధావారం మొదలైన ప్రకరణాల్లో ఆనాటి రాజకీయ, యుద్ధ పరిస్థితుల్ని విపులంగా చర్చించారు. శాతవాహనుల కాలంలో మతం, రాజకీయాలను ప్రభావితం చేసిన తీరు రాజుగారు

---

[1] స్థల చరిత్ర – సంస్కృతి — ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 133

అద్భుతంగా విశదీకరించారు.

స్థౌలతిష్యులు, మాళవులు, శివస్వాతి, సుశర్మ, సురసేనాపతి మొదలైన వారితో రహస్యంగా కుట్రలు పన్ని చక్రవర్తి రెండవ కుమారు డైన మంజుశ్రీని, తర్వాత హిమబిందును అపహరిస్తాడు. స్థౌలతిష్యుడు తన మనుమరాలిని విషకన్యను చేసి శ్రీకృష్ణ శాతవాహనునిపై ప్రయో గించి అతనిని నాశనం చెయ్యాలనుకొంటాడు. కాని ఇలా చెయ్యడానికి స్థౌలతిష్యునిలో రాజ్యకాంక్ష ఏ మాత్రం లేదు. వేదవేదాంగ పారంగతు డైన వృద్ధ బ్రాహ్మణుడు ఇంతనైచ్యానికి ఒడిగట్టి, చక్రవర్తి కుటుంబాన్ని అధోగతి పాలు చేయాలని సంకల్పించినా ఈ విషయం తెలిసిన శ్రీముఖ-శాతవాహనుడు, స్థౌలతిష్యునికి ఏ శిక్షా వేయలేదు. ఇది కూడ రాజనీతికి ఒక ఉదాహరణ. రాజు స్థౌలతిష్యుని చంపిఉంటే ఒకవర్గం వారికి విరోధి అవు తాడు. కాని స్థౌలతిష్యుని క్షమించి వదలివేసినందున అన్ని వర్గాల వారికి చక్రవర్తి ప్రీతి పాత్రుడైనాడు. వణిక్సార్వభౌముడైన చారుగుప్తుడు చైత్రయాత్ర సమయంలో చక్రవర్తికి ఆర్థికంగా సహాయం చేస్తాడు. దానికి కారణం తన కుమార్తె హిమబిందును శ్రీకృష్ణ శాతవాహనునకిచ్చి భావి సామ్రాజ్ఞి చెయ్యాలను కోవడమే. ఏది ఏమైనా ఆనాటి రాజకీయ పరిస్థితులను బట్టి రాజు తన రాజ్యంలోని ప్రముఖుల వద్ద ఆర్థిక సహాయం పొందేవాడని తెలుస్తుంది

2. **అడవి శాంతిశ్రీ :** "ఇక్ష్వాకులు, సాతవాహన రాజ్యము భగ్నమైన వెంటనే ధాన్యకటక ప్రాంత దేశమును ఆక్రమించుకొని క్రీ.శ. రెండవ శతాబ్ద ద్వితీయ పాద ప్రాంతమునుండి పరిపాలించిరి"[1]

1. విజ్ఞాన సర్వస్వము (మూ.సం) - తెలుగు సంస్కృతి., పు: 106

"శాతవాహన సామ్రాజ్యపు భాగములు సామంత ప్రభు కుటుంబముల హస్తగతములయ్యెను. వారిలో ఇక్ష్వాకుల వారును, తీర దేశముల్లో కొంత భాగము నాక్రమించు కొని అర్థ శతాబ్దము వరకు ప్రకాశమానముగా పరిపాలించిరి."[1]

పై చారిత్రక సత్యాల్ని జనశ్రుతులను మేళవించి రాజుగారు 'అడవి శాంతిశ్రీ' నవలను రచించారు. యజ్ఞశ్రీ శాతకర్ణి తన అవసాన దశలో అల్లుడైన శాంత మూలునికి తనకుమారుడు విజయశ్రీ శాతకర్ణిని, మనుమడు చంద్రశ్రీ శాతకర్ణిని అప్పగించి మరణిస్తాడు. కొంత కాలం తర్వాత విజయశ్రీ-శాతకర్ణి కూడ మరణిస్తాడు. అప్పుడు శాంతమూలుడు చంద్రశ్రీ శాతకర్ణిని చక్రవర్తి చేసి అతని తరఫున రాజ్యభారం వహించి నడుపిస్తూ ఉంటాడు. చంద్రశ్రీ దుర్బలుడు; స్త్రీలోలుడు. ఈ విషయం తెలిసి ముసిక నగర ప్రభువు పులమావి తన కుటిల నీతి ప్రయోగించి మోసంతో చంద్రశ్రీ ప్రాణాలు తీస్తాడు. దీనితో సామ్రాజ్య భారం పూర్తిగా శాంతి మూలునిపై పడుతుంది. ఈ విధంగా ఇక్ష్వాకు వంశం ఆంధ్రరాజ్యాన్ని పరిపాలించే అవకాశం దొరికింది. విజయపురి ఇక్ష్వాకుల రాజధాని. చుట్టూ ఎత్తైన కొండల నుండి లోయల్లో కొంచెం ఎత్తైన ప్రదేశంలో వీరు నగరాన్ని నిర్మించుకొన్నారు.

సైన్య విభాగం, అధికారులు, రాజకీయ వ్యవస్థ అంతా శాత-వాహనుల పద్ధతే. వీరి కాలంలో స్త్రీలు కూడా యుద్ధాల్లో పాల్గొనేవారు. స్త్రీలు యుద్ధాలు చేసి జయించిన సంఘటనలున్నాయి. ప్రజా సంక్షేమం రాజుకు

---

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం
శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 160.

కర్తవ్యంగా ఉండేది. సంక్షేమ విషయాలు తెలుపడానికి, అందరికీ ముఖ్య వార్తలు తెలుపడానికి ప్రతిగ్రామంలో ఒక భేరీ ఉండేది. వార్తలు త్వరితంగా అందించడానికి ఆ భేరీ ఉపయోగ పడేది.

యజ్ఞశ్రీ శాతకర్ణి మరణానంతరం విజయశ్రీ శాతకర్ణి ఆంధ్ర సింహాసనంపై పట్టాభిషిక్తుడైనా, జైత్రయాత్రలు అతని తరఫున శాంతిమూలుడే జరిపాడని, జైత్రయాత్రలో భరుకచ్ఛం, కుంతలదేశం, చూత, శాత, కర్ణాటదేశాలు, ముసికనగరం, కాంచీపురం, తొండమండలం మొదలైన ప్రాంతాలకు వెళ్ళి, వారివద్ద కప్పాలు తీసుకొని, యుద్ధం అవసరం లేకుండా ఒక సంవత్సరం పాటు జైత్రయాత్ర సల్పివచ్చాడని రాజుగారు రాశారు. "యుద్ధం అవసరం లేకుండా కప్పము కట్టిన సంగతివిని విజయశ్రీ శాతకర్ణి చక్రవర్తి ఎంతో సంతోషించినాడు. శాంతిమూల మహారాజు కప్పమంతా చక్రవర్తికి అప్పగించి, తాను విజయపురం వెళ్ళినాడు."[1] శాంతిమూలుని కుమారుడైన వీరపురుషదత్తుడు రాజకీయంగా బలం సంపాదించుకోవడం కోసరమే, అనేక వివాహాలు చేసుకోవడం జరిగిందని రచయిత సమర్థించారు. "భరుకచ్ఛం కోటలో యవనులకు, రోమకులకు, పారశీకులకు, యూదులకు వర్తకం చేసుకొనే మహాభవనాలున్నాయి;"[2] అన్న విషయం ద్వారా ఇక్ష్వాకుల కాలంలో విదేశీయ వర్తకులు భారతదేశంలో వ్యాపారం చేసుకునే వారని తెలుస్తున్నది.

శాంతిమూలుడు మొదట శాతవాహనుల ప్రతినిధిగా రాజ్యం ఏలినా, చివరకు శాతవాహనుల చక్రవర్తు లిద్దరూ మరణించడం చేత

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు, పు; 83
2. పైదే., పు; 80.

ప్రజాభీష్ట ప్రకారం తానే చక్రవర్తియై ప్రజానురంజకంగా పరిపాలించాడని బాపిరాజు గారు రాశారు. ఇది చారిత్రక సత్యం. "వాసిష్ఠీ పుత్ర చాంత-మూలుడు పరమధార్మికుడు. ప్రజాహిత తత్పరుడుగా కాన్పించును"[1] శాంతి మూలుడు అగ్నిష్టోమం, వాజపేయం, అశ్వమేధం మొదలైన యాగాలు చేశాడనీ, అనేక వేల గోవులను, నాగళ్లను దానం చేశాడనీ రాజు గారు రాశారు. మొత్తం మీద ఇక్ష్వాకురాజుల పరిపాలన ప్రజా రంజకంగా ఉండేదని అర్థమౌతుంది.

3. **అంశుమతి :** అంశుమతి కథావస్తువు చాళుక్య యుగానికి సంబంధించినది. కుబ్జ విష్ణువర్ధనుడు చాళుక్య రాజైన సత్యాశ్రయ పృథ్వీవల్లభుని (రెండవ పులకేశి) చిన్న తమ్ముడు. విష్ణువర్ధనుడు తన అన్నగారి ఆజ్ఞ ప్రకారం సౌరాష్ట్ర, ఆవర్త, అనుప, అపరాంత కుంతల మొదలైన దేశాలు జయించి అతనికి రాజ్యాన్ని విస్తరింప జేసినాడు. కళింగరాజు ఎదురు తిరిగితే కుబ్జ విష్ణువర్ధనుడు పిష్టపురంపై దండెత్తి, శత్రు దుర్భేద్యమైన కోటను తన యుక్తితో, పన్నుగడలతో ఆక్రమించుకొంటాడు. కళింగ యువరాజు దానార్ణవుడు పిష్టపురం నుండి పారిపోతాడు. అంతకు ముందే దానార్ణవుడు వేంగీనగరాన్ని పాలించే మంచన భట్టారకదేవుని కుమార్తె అంశుమతిని వివాహమాడాలని కోరుకొంటాడు. ఆమెను వివాహం చేసుకొంటే అతిలోక సౌందర్యవతి తనకు భార్యగా లభించడమే గాక, కొడుకులు లేనందు వల్ల మంచన భట్టారకుని అనంతరం తానే వేంగీ రాజ్యాన్ని

---

[1] ఆంధ్రుల చరిత్ర- సంస్కృతి - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం
శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం., పు: 162.

కూడ పాలించ వచ్చు. అంతేగాక వేంగీ, కళింగ రాజ్యాలు ఏకమైతే తమకు చిరకాల శత్రువులైన చాళుక్యులను సులభంగా ఓడించడం అనేది జరుగుతుంది. కానీ అంశుమతి అతన్ని నిరాకరించినందు వల్ల కోపించి పిష్టపురంలో బంధిస్తాడు. కుబ్జ విష్ణువర్ధనుడు అంశుమతిని నిర్బంధం నుండి రక్షిస్తాడు. చివరకు అంశుమతిని వివాహమాడి వేంగీ రాజ్యానికి కూడా కుబ్జ విష్ణువర్ధనుడు అధికారి అవుతాడు.

4. **గోన గన్నారెడ్డి :** 'గోన గన్నారెడ్డి' నవలలో రాజకీయ పరిస్థితుల చిత్రణ అధికం. రాజకీయ కుట్రలు, సామంతరాజుల తిరుగుబాటు చర్య, చక్రవర్తులు అణచివేసే విధానం, బాహ్య అంతః శత్రువులు, గూఢచారి చర్య మొదలైన ఎన్నో రాజకీయ విషయాల్ని రాజుగారు చక్కగా వివరించారు. గోన లకుమయారెడ్డి తన సోదరుని కొడుకులకు అన్యాయం చేసి వారి రాజ్యాన్ని అపహరించడమే గాక, రుద్రమదేవిని పదవీ భ్రష్టురాలిని చేసి అఖండ కాకతీయ సామ్రాజ్యానికి చక్రవర్తి కావాలని కలలు గంటాడు. ఈ పని సాధించేందుకు చాలమంది సామంతరాజులతో కుట్రలు పన్నుతాడు. ఆదవోని రాజైన కోటారెడ్డి కుమార్తె అన్నాంబికను తన కుమారుడైన వరదారెడ్డికిచ్చి వివాహం చెయ్యాలని సంకల్పిస్తాడు. గోన గన్నారెడ్డి తన చిన్నాయన చేసిన అన్యాయాలకు, తన తమ్ముడైన విఠలధరణీశునితో కలసి, రుద్రమదేవికి కుడిభుజమై లకుమయారెడ్డికి బుద్ధి చెప్పడమే గాక అంతః శత్రువులందర్నీ ఓడిస్తాడు. అతడు గజదొంగగా మారడం కూడా రాజకీయ ప్రఎత్తు. శివదేవయ్య మంత్రి, గణపతి దేవ చక్రవర్తి

ఆశీస్సులు పొందే తమ్ముడు విరల ధరణీశుడు ఇంకా అనేక మంది యువ
కులతో కలసి, గన్నారెడ్డి ఆదర్శాలకు సాగిపోయి [illegible] సాగిపోతారు

గణపతి దేవచక్రవర్తి తన కుమార్తె రాణి రుద్రమదేవికి పురుష వేషం వేయించడం, వివాహం జరిపించడం మొదలైన సంఘటనలకు ఆనాటి రాజకీయ పరిస్థితులే కారణం. రుద్రమదేవి ఆంధ్ర మహా సామ్రాజ్యానికి చక్రవర్తిగా ఉండాలని ఆమె తండ్రి కోరికను చాళుక్య-వీరభద్రునికి చెప్పడానికి ముందే, వారిద్దరూ ఏకాంతంగా కలుసుకొనే అవకాశం కలిగించి వీరభద్రునికి రుద్రమదేవిపై ప్రేమ అంకురించేటట్లు చేసిన, శివదేవయ్య ప్రయత్నం కూడ రాజకీయమే. చాళుక్య వీరభద్రునికి రుద్రమదేవిపై ప్రేమ మొలకెత్తిన తరువాతనే గణపతి దేవ చక్రవర్తి కోరికను తెలుపుతాడు. చాళుక్య వీరభద్రుడు విశాల హృదయంతో రుద్రమ-దేవిని సామ్రాజ్ఞిగా అంగీకరించి, ఆమెను వివాహమాడి తాను సామంత రాజుగానే ఉండిపోతాడు.

యాదవరాజు మహాదేవుడు పెద్ద సైన్యంతో యుద్ధానికి వస్తే రుద్రమదేవి, గోనగన్నారెడ్డి, చాళుక్య వీరభద్రుడు మొదలైన సహచరుల సహాయంతో యాదవసైన్యాన్ని గోదావరీ తీరం వరకు తరిమి తరిమి కొట్టింది. ఎట్టకేలకు బాహ్య అంతర శత్రువులను నిర్జించి, రుద్రమదేవి సువిశాల ఆంధ్ర సామ్రాజ్యానికి పట్టమహిషి అవుతుంది.

ఈ విధంగా బాపిరాజుగారు హిమబిందు, అడవి శాంతిశ్రీ, అంశుమతి, గోనగన్నారెడ్డి నవలల్లో శాతవాహనుల, ఇక్ష్వాకుల,

చాళుక్యుల, కాకతీయుల కాలం నాటి రాజకీయ పరిస్థితులను తమ చారిత్రక నవలల్లో చిత్రించారు.

5.1.2. **అడివి బాపిరాజుగారి చారిత్రక నవలల్లో సాంఘిక పరిస్థితులు:**

5.1.2.0. **ప్రవేశిక:** "అనాగరికత నుండి నాగరికతకు, అజ్ఞానం నుండి జ్ఞానానికి, పశు ప్రవృత్తి నుండి మానవతకు సాగే పరిణామం చరిత్ర."[1]

చారిత్రక నవలా కారుడు తన నవల ద్వారా కథాకాలం నాటి నాగరికతను పరిణామాన్ని, ప్రజా జీవితాన్ని పాఠకులకు హత్తుకొనేటట్లు చిత్రించ గలగాలి. చారిత్రక నవల అంటే కేవలం పూర్వ చరిత్రను చెప్పేటట్లు ఏ చరిత్ర పుస్తకం మాదిరో ఉండకూడదు. చారిత్రకతతో పాటు ఆనాటి సాంఘిక జీవితం కూడ రచనలో ప్రతిబింబించాలి. వాటని చదువుతూ ఉంటే పాఠకునిలో ఆనాడు తాను జీవించినట్లు, ఆ నాటి ప్రజలు వారి అలవాట్లు, వారి జీవిత విధానం ఎదురుగా నిలబడి చూచినట్లు అనుభూతి కలిగించాలి. అప్పుడే చారిత్రక నవల అనే పేరు సార్థక మవుతుంది. ఈ లక్షణాలన్నీ ఒకచోట రాశిపోసినట్లుగా బాపిరాజు గారు క్రమంగా శాతవాహన, ఇక్ష్వాకు, చాళుక్య, కాకతీయ యుగాలకు చెందిన హిమబిందు, అడవి శాంతిశ్రీ, అంశుమతి, గోనగన్నారెడ్డి నవలలను రచించారు. ఆ నవలల ద్వారా వ్యక్తమవుతున్న ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని పరిశీలించడమే ఈ అధ్యాయ ఉద్దేశ్యం.

5.1.2.1. **సాంఘిక పరిస్థితులు:**

1. **సంఘస్వరూపం:** బాపిరాజుగారి చారిత్రక నవలల ద్వారా ఆనాటి

---

1. భారతీయ సంస్కృతి – పీఠిక – పుటూరి బలరామమూర్తి, పు. 1.

సంఘస్వరూపం మన కళ్ళకు కట్టినట్టు కన్పిస్తుంది. గ్రామీణ జీవితం గురించి రాజుగారు ఎంతో వివరంగా రాశారు. అక్కడక్కడ యుద్ధాలు, సంఘర్షణలూ ఉన్నా ప్రజా జీవనం స్తంభించిపోలేదని బాపిరాజు గారి నవలల ద్వారా తెలుస్తుంది. రాజులు, చక్రవర్తులు ప్రజలను కన్న బిడ్డలవలె పరిపాలించే వారని, ప్రజలు సంతోషంగా కాలం గడిపే వారని అర్థమౌతుంది. గోనగన్నారెడ్డి గజదొంగ అని పేరు పొందినా ఎక్కడా ప్రజలను పీడించలేదనీ, ప్రజల డబ్బు దోచుకోలేదనీ తెలుస్తుంది. పాడి పంటలతో, నేత పనితో, వాణిజ్య వ్యాపారాలతో ప్రజలు సుఖ సంతోషాలతో జీవించారని అర్థమౌతుంది. యుద్ధం వచ్చిన కొద్దిరోజులు కొంచెం కష్టపడినా యుద్ధ పరిసమాప్తి కాగానే ప్రజలు తమ తమ వృత్తులు చేసుకొనే వారని తెలుస్తుంది. మొత్తం మీద ఆనాటి యుద్ధాల వల్ల సంఘ స్వరూపం దెబ్బతిన్నట్టు చెప్పలేము. బాపిరాజు గారు తమ నవలల్లో సంఘ స్వరూపాన్ని కేవలం చారిత్రక ఆధారాలతో మాత్రమే రచించలేదు. దాదాపు క్రీ.పూ. 3వ శతాబ్దం నుండీ క్రీ.శ.14 వ శతాబ్దం వరకు బాపిరాజు గారి కథాకాలం కావున, చారిత్రకాధారాల్ని నామ మాత్రంగా గ్రహించిన బాపిరాజు గారు ఆనాటి సంఘ స్వరూపాన్ని ఊహించి ఉత్తమ శ్రేణికి చెందిన చారిత్రక నవలల్ని ఆంధ్ర పాఠక లోకానికి అంద చేశారు.

**2. ప్రజా జీవితం :** రాజ గారు తమ రచనలన్నింటిలో రాజుల, ధనికుల జీవనాన్నే కాకుండా సామాన్య ప్రజా జీవనాన్ని గురించి కూడా వివరించారు. ఆనాటి రాజులు, ధనికులు భోగభాగ్యాలతో విలాస జీవితాన్ని గడుపుతూ

ఉండటమే గాక, బీద ప్రజలకు దానధర్మాలు చేస్తూ వారి జీవితాలు సుఖమయం కావించేటందుకు కృషిచేశారు.

శాతవాహనులు ధర్మపరులు. పటిష్ఠమైన పరిపాలనాదక్షులు. కాబట్టి ప్రజా జీవితం సుఖసంతోషాలతో ఉన్నట్లు రాజుగారు అభిప్రాయ పడ్డారు. సకాలంలో వర్షాలు పడి సమృద్ధిగా పంటలు పండేవని పేర్కొన్నారు. పండుగలు, ఉత్సవాలలాంటి ముఖ్యదినాలలో ప్రజలు వినోద విలాసాలతో గడిపేవారు. నృత్య గానాలు, వీధి నాటకాలు, తోలుబొమ్మలాటలు, దొమ్మరి విన్యాసాలు, సాము గరిడీలు మొదలైన ఆటపాటలతో ప్రజలు వినోదించేవారు. ఉత్సవ సమయాలల్లో బందీలను కూడా విడుదల చేసేవారు. ఆనాడు స్త్రీలు కూడా పురుషులతో సమానంగా యుద్ధాలలో పాల్గొనేవారు. నాగబంధునిక సమవర్తికి అంగరక్షకురాలై యుద్ధం చేసింది.

ఇక్ష్వాకుల కాలం నాటి పరిస్థితులు కూడా దాదాపు శాతవాహనుల కాలం నాటివే. అయితే హిమబిందు నవలలో రాజుగారు ఎక్కువగా నగర జీవితాన్ని వర్ణిస్తే, అడవి శాంతిశ్రీ నవలలో నగర జీవితమే కాక గ్రామ జీవితాన్ని కూడా వివరించారు. పల్లె దంపతుల ఆధారంగా పల్లీయుల ఆచార వ్యవహారాలను చిత్రించారు. వారి పంట పొలాలు, పశువుల పట్ల వారి ప్రేమ, వారి ఆహార పానీయాలు, జీవన విధానాలను ఆయన వివరించారు. ఇక్ష్వాకుల కాలంలో బిచ్చగాండ్రు లేరని రాజుగారు ప్రత్యేకంగా పేర్కొన్నారు. 'శాతవాహనుల కాలంలో ముష్టి ఉండేవారు... కానీ బద్ధకం చేత

అడవి శాంతిశ్రీ — అడివిబాపిరాజు, పు: 72–82.

ంఛ వృత్తి నవలంబించిన వారు శిక్షింపబడేవారు."[1] కరువు కాటకాలేర్పడితే పేదవారికి పంచేందుకు రాజులు, ధనవంతులు ధాన్యపు గాదులను నింపి ఉంచేవారు. ఆ నిలువలు మూడేండ్ల వరకు ఉండేవి. అవసరమున్నపుడు దేశమంతా ధాన్యం పంచేవారట.[2] శాంతిమూలుడు అనేక కోట్ల బంగారు నాణేలను, లక్షల కొలది గోవులను, నాగళ్ళను దానం చేసిన మహా దానపతి. ఇతడు విస్తారంగా భూమిని సేద్యంలోకి తీసుకొచ్చి వ్యవసాయానికి గొప్ప ప్రోత్సాహం కలిగించాడు.

గోనగన్నారెడ్డి కాలంలో ప్రజల సాంఘిక జీవనం విశిష్టమైనదిగా ఉండేది. ఆనాటి ముఖ్య వృత్తి వ్యవసాయం. ప్రజలు రాజభక్తి పరాయణులై న్యాయధర్మాల పట్ల భక్తి శ్రద్ధలు కనబరచేవారు. కులభేదాలు లేక సహజీవనం చేసేవారు. ఆంధ్ర క్షత్రియ కులాలవారికి భోజనాలలో కానీ, వివాహాలలో కానీ నిషేధాలు లేవు. స్త్రీలు పల్లకీలలో, మేనాలలో, రథాలపై ప్రయాణం చేసేవారు. అశ్వారోహణ చేసి వీరవిద్యలు నేర్చిన రుద్రమదేవి, అన్నాంబిక వంటి స్త్రీలు కూడా ఉన్నారు. అంశుమతి నవలికలో వస్తువైశాల్యం తక్కువ. అందులో కొన్ని రాజకీయ పరిస్థితులు, యుద్ధ వర్ణనలకు అధిక ప్రాముఖ్యం ఇవ్వడం వల్ల ప్రజల సాంస్కృతిక జీవన విధానాన్ని, సంఘ స్వరూపాన్ని తెలిపే అవకాశం లేకపోయింది.

3. **వర్ణవ్యవస్థ:** ఆంధ్రులు మొట్ట మొదట నుండి వర్ణ వ్యవస్థను పాటించేవారు. మొదట నుండి సంఘంలో బ్రాహ్మణులకు, క్షత్రియులకు అధిక గౌరవం ఉండేది.

---

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు., పు:102.
2. పైదే. పు.102

వాహనుల కాలంలో కులాంతర, మతాంతర వివాహాలు జరిగేవి. వైశ్యుని కుమార్తె ఏ క్షత్రియుడ్నో, శిల్పాచార్యుడ్నో వివాహం చేసుకోవడం, బ్రాహ్మణ కన్య క్షత్రియుడ్ని వివాహం చేసుకోవడం ఆనాటి సంఘం ఆమోదించింది. హిమబిందును మొదట చారుగుప్తుడు శ్రీకృష్ణశాతవాహనునకిచ్చి చేయాలని అనుకొంటాడు; కానీ తర్వాత హిమబిందు వివాహం శిల్పాచార్యుడు సువర్ణశ్రీతో జరుగుతుంది. అలాగే బ్రాహ్మణ కన్య చంద్రబాలను శ్రీకృష్ణ-శాతవాహనుడు ప్రేమించి పెళ్లిచేసుకొంటాడు. శిల్పాచార్యుడు ధర్మనంది కుమార్తె నాగబంధునిక వైశ్యుడైన సమదర్శిని ప్రేమించి పెండ్లి చేసుకొంటుంది. హిందువులు యవనులను కూడా వివాహమాడిరని బాపిరాజు గారు పేర్కొన్నారు. హిమబిందు మాతామహుడైన కీర్తిగుప్తుడు తన మిత్రుడైన 'డెమిత్రియస్' సోదరిని వివాహం చేసుకొంటాడు.

ఇక్ష్వాకుల కాలంలో శాంతిమూలుడు అన్నిమతాలు జాతుల వారిని సమదృష్టితో చూచినా, అతని కుమారుడు వీరపురుషదత్తుని కాలంలో బౌద్ధులకు ప్రాముఖ్యం ఇచ్చినందున హిందూమతంలోని అగ్రవర్ణాలవారు కొన్ని కష్టాలను అనుభవించారని తెలుస్తోంది. కాకతీయుల కాలంలో వర్ణాశ్రమధర్మాలు వ్యాప్తిలో ఉండేవి. "మత విషయం కంటె కుల సంబంధంలో కాకతీయులు మొదటనుండి ఉదార వైఖరినే అవలంభించారు. అందులో ముఖ్యంగా గణపతిదేవుడు, రుద్రమదేవి వర్ణ సమైక్యతకు పూనుకొన్నారు. కాకతీయులను చతుర్థ కులజులుగా పేర్కొన్నా ఆ కులమేమిటో తెలియదు. వారి పూర్వులు మూడు నాలుగు తరాలు జైనులైనందున ఆ మత ప్రభావం

వల్ల కులం పేరు తొలగిపోయినట్లైంది."[1] ఓరుగల్లు నగరంలో బ్రాహ్మణ వాడ, అక్కలవాడ, భోగం వీధి, స్వర్ణకార వీధి, శిల్పకారుల వీధి ఇలా వేరు వేరుగా ఉండేవి.[2]

ఆంధ్రులలో కన్పించే కులాలు - బ్రాహ్మణ, రాచ, కోమటి, వెలమ, కమ్మ, రెడ్డి, బలిజ, కాపు, గొల్ల, కమ్మర, వడ్రంగి, అగసాల, వడసాల, కుమ్మర, జంగమ, బెస్త, చాకలి, మంగలి, సాని, సాతాని, దాసరి, బోయ, ఎరుక .... గుంట, యానాది, మాల, మాదిగ మొదలైనవి. వీటిలో అనేక కులాలను గోనగన్నారెడ్డి నవలలో బాపిరాజు గారు అక్కడక్కడా పేర్కొన్నారు. గురు, మహాప్రధాన, సామంత, సేనాపతి .... నటక, లేఖక, సూత, సూద, వర్తక, గాయక, క్షౌరక, చర్మకారక, వైశ్య జనాదిగా డెబ్బదిరెండు నియోగాల వారు ఉన్నట్లు[3] బాపిరాజు గారు రాశారు.

కాకతి కులస్థులు రాజ్యమేలినా రెడ్లు, నాయుళ్ళు, కాపులు, కమ్మలు, యాదవులు, బ్రాహ్మణులు మొదలైనవారు సైన్యాధ్యక్షులుగానో, సామంతులుగానో, మంత్రులుగానో ఉండే వారని, వారి పెత్తనం అధికమని తెలుస్తుంది. ఉదా॥ గోనగన్నారెడ్డి, లకుమయారెడ్డి, వేడ చెలుకి నాయుడు, కమ్మనాటి జాయప సేనాని, జన్నిగదేవుడు, ఇందులూరి అన్నయ్య (బ్రాహ్మణ), శివదేవయ్య (బ్రాహ్మణ),

---

1. కాకతీయుల నాటి సామాజిక జీవితం – మలయశ్రీ ., పు: 141.
2. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు ., పు: 19-120.
3. పైదే ., 60

మహా దేవరాజు (యాదవుడు) మొదలైనవారు. ఈ విధంగా కాకతీయ కాలం నాటి ఆంధ్రులలో అనేక మతాలు, కులాలు, జాతులున్నా ప్రజలు సహనంతో సహజీవనం సాగించారని తెలుస్తుంది. అంశుమతి నవలికలో వర్ణ వ్యవస్థను గురించి ఎక్కడా వివరించలేదు. "వైదికమతం మనదేశంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని చాతుర్వర్ణ వ్యవస్థకు దారితీసింది. గుణకర్మలను బట్టి వాటిని తానే నిర్మించినట్లు భగవద్గీతలో కృష్ణుడన్నాడు. మనుధర్మ స్మృతి లోను ఈ వర్ణ వ్యవస్థను అంగీకరించి వృత్తిధర్మాలను నిర్వచించడం జరిగింది. ఈ నాలుగింటిని కాదని హరిజన, గిరిజన జాతులనేకం ఉండేవి. పైగా ఒక్కొక్క వర్ణంలోను ఎన్నో కులాలు వారినాశ్రయించి బ్రతికే ఉపకులాలు పుట్టుకు వచ్చాయి. వర్ణాలు నాలుగైనా భారతదేశంలో కులాలు వందలు. వాటిలో ఆర్థికంగానే కాకుండా సాంఘికంగాను, ఉచ్చ నీచ తరతమ భేదాలుండేవి; ఇంకనూ ఉన్నాయి"[1] 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః।' అని భగవద్గీతలో నాడు చెప్పబడితే నేటి మానవగీత ఇలా పేర్కొంది.

"జాతయస్స్యాటవీ కానాం। నాగరికే కులం స్థితం।

నతే ప్రామాణికో యుక్తః। నదోషో వర్ణసంకరః॥" (ఆటవికులలో జాతిభేదము లేర్పడినవి. నాగరికులలో కులవ్యవస్థ వచ్చినది. అవి ప్రామాణికములు కావు. వర్ణసంకరము తప్పు కాదు) నిజానికి కృష్ణుని అష్టభార్యలు ఒకే కులంవారు కారనేది పురాణసత్యం[2] అనే మలయశ్రీగారి మాట స

1. కాకతీయుల నాటి సామాజిక జీవనం – మలయశ్రీ, పు: 139–140.

2 - పైదే., పు: 142.

**4.సాంఘిక దురాచారం :** బాపిరాజు గారు తన చారిత్రక నవల్లో ఆనాటి సాంఘిక దురాచారాలను చేర్చినారు. అవి- 1. సతీసహగమనం, 2. దాసీ పద్ధతి, 3. వేశ్యా పద్ధతి.

**సతీసహగమనం;** ఈ దురాచారం బాపిరాజుగారి కథాకాలంలో కూడా ఉండేదని తెలుస్తుంది. స్థాలతిష్యుని కుమారుడైన నందిదత్తుడు పడవ ప్రయాణంలో చనిపోయాడనుకొని, అతని భార్య పతి చిహ్నంతో సహగమనం చేస్తుంది. "మహా పతివ్రత నా కోడలు పతి చిహ్నంతో సహగమనం చేసింది."[1] అంటాడు స్థాలతిష్యుడు. నిజానికి నందిదత్తుడు మరణించలేదు. బౌద్ధ భిక్షువులు అతన్ని రక్షిస్తారు.

అడవి శాంతిశ్రీ నవలలో ఫులమావి భార్యకూడా తన భర్త మరణించాడని తెలిసి అతనితో సహగమనం చేయడానికి సిద్ధపడుతుంది. ఇక్కడ ఈ కాందర పాటు చర్యని శాంతిశ్రీ, బ్రహ్మదత్తుడు అడ్డుకొని ఆమెను రక్షిస్తారు.[2]

**దాసీపద్ధతి;** అడవి బాపిరాజుగారి చారిత్రక నవలా కాలంలో దాసీలున్నారని ఆయన రాశారు. ఈ దాసీలు నిరంతరం రాజులకు, అంతఃపురంలోని ప్రముఖులకు సేవలు చేస్తూ వారు 'తానా అంటే తందానా' అని పలుకుతూ, దినదిన గండంగా బ్రతుకుతూ ఉండేవారని తెలుస్తుంది. ఫులమావి దాసితో సంభాషణ రాజుగారు అడవి శాంతిశ్రీ నవలలో ఈ విధంగా రాశారు

"ఓసే దాసీ! మేము అందంగా లేమటే!" అన్నాడు.

"మీరు లోకాద్భుత సుందరులండీ: చక్రవర్తీ!"

"అయితే మమ్మూ ఎందుకు? ఆ రాక్షసి పెండ్లి చేసుకోనంటుంది?"

"అది వట్టి పిచ్చిదండీ సార్వభౌమా

1. హిమబిందు - అడవి బాపిరాజు - పు: 112
2. అడవి శాంతిశ్రీ — " — పు: 306.

ఛీ!, దుర్మార్గురాలా! ఇప్పుడు మేము గాంధర్వంగా వరించబోయే పడుచును పిచ్చిదంటావా?"[1]

"శాంతిశ్రీ రాకుమారిక కాదండీ పిచ్చిది. నేనండీ" అంటూ వణికిపోయింది"

**వేశ్యాపద్ధతి:** నవలా కథాకాలంలో వేశ్యావాటిక లుండేవనీ బాపిరాజు గారి రచనల ద్వారా తెలుస్తుంది. గోనగన్నారెడ్డి నవలలో ఓరుగల్లు నగరాన్ని వర్ణించేటప్పుడు "అక్కల వాడ, భోగం వీధి, స్వర్ణకార వీధి ..."[2] అంటూ నగరంలో ఒక వీధికి భోగం వీధి అని పేరు పెట్టారు. ఆ పేరు పెట్టడం వల్ల ఆ వీధిలోని వాటికలన్నీ వేశ్యావాటికలనీ అర్థమౌతుంది.

**5. న్యాయ విచారణ – దండన పద్ధతి:** బాపిరాజు గారు హిమబిందు నవలా కాలంలోని న్యాయస్థానాలను గురించి ఇలా రాశారు. "దేశమున కంతకు మహారాజ సభ ప్రధాన న్యాయస్థానము. దాని వెనుక ప్రాడ్వివాకులు, స్థానీయ, ద్రోణముఖ, ఖార్వతిక, సంగ్రహణ అనునవి పోను పోను చిన్నవి. ఎనిమిది వందల గ్రామములకు ద్రోణముఖమును, రెండు వందల గ్రామములకు ఖార్వతికము, సంగ్రహణము, పది గ్రామములకు న్యాయస్థానములు. ఈ సభలు రెండు విధములు. ధర్మస్థీయము, కంటక శోధము అనునవి. ధర్మస్థీయము వ్యావహార ధర్మమునే విచారించును. కంటకశోధ సభ వర్తకము, వృత్తి, రాజకీయము మొదలగు విషయాలను ధర్మనిర్ణయమొనర్చును. ప్రా ల సభ ధర్మస్థీయ, కంటకశోధ విషయముల రెంటినీ విచారించును. ఆపైన

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు, పు: 304.
2. గోనగన్నారెడ్డి – " పు: 120.

రాజే సభా పూర్ణుడై స్వయముగా న్యాయ విచారణ చేయును."[1] ప్రాడ్వివాకుల సభ సభ్యులు చంద్రస్వామిని నిర్దోషి అని నమ్మక పోవుటచే ప్రాడ్వివాకుడు, "ఓ బ్రాహ్మణోత్తమా! నీవు దోషివి కావని చెప్పలేము. కావన నీకు ఒక సంవత్సరము పాతాళ గృహవాసము విధించితిని. నేను తప్పభిప్రాయము పడిన ధర్మము నన్ను శిక్షించు గావుత"[2] అని శిక్ష వేసెను. కానీ సార్వభౌముని ఆజ్ఞాపత్రము తీసికొని వచ్చుటచే చంద్రస్వామిని శిక్షించక వదలివేశారు. ఆ ఆజ్ఞాపత్రంలో "ఏ దోషమూ లేదని శోణనగ గ్రామ కాపురస్థుడగు చంద్రస్వామిని మేము విడిచి పుచ్చుచున్నాము. ఇయ్యది ప్రాడ్వివాకునకు మా ముదల. స్వహస్త నామాంకిత శ్రీ కౌశికీ పుత్ర శ్రీముఖ శాతవాహన మహాశ్రమణ శక 483 పరాభవ సంవత్సర చైత్ర శుద్ధ సప్తమి"[3] అని వ్రాసి ఉంది. నేడు కూడా భారత దేశాధ్యక్షునకు క్షమాభిక్ష (Mercy Petition) అర్థిస్తూ ఫైలులు అర్జీ పంపుకుంటారు. ఆనాడు కూడ ఈ పద్ధతి ఉందని హిమబిందు నవల ద్వారా అర్థమౌతుంది. స్థాలతిష్యుని దుష్కృత్యాలన్నీ చక్రవర్తికి తెలిసినా శ్రీముఖ శాతవాహనుడు అతనిని, అతని పరివారాన్ని క్షమించి వదిలేస్తాడు. దీనిని బట్టి ఆనాడు చక్రవర్తులు ఎంతో ఉదార స్వభావంతో ఉండేవారని రాజుగారి నవల ద్వారా అర్థమవుతుంది.

కాకతీయుల కాలంనాటి న్యాయ నిర్ణయ పద్ధతిలోని వైవిధ్యాన్ని రచయిత ప్రదర్శించారు. ఓరుగల్లు నగర పరిపాలన మొక ఎత్తు, తక్కిన మహా

---

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 67, 68.
2. పైదే., పు: 73.
3. పైదే., పు: 74.

రాజ్య పరిపాలన మొక ఎత్తు. గ్రామ పరిపాలనలో రెడ్డి, కరణం, తలారి మొదలైన వారుండే వారు. న్యాయ విచారణా విధానం ఇలా ఉండేది. "నగరం లోని అభియోగాలన్నీ మహాతలవరే పండిత సహాయంతో విచారిస్తాడు. పెద్దపెద్ద అభియోగాలు నగర రక్షణ సభకే వస్తాయి. ఈ అభియోగ విచారణా కాలంలో ఉత్తమ పండితులు, ధర్మశాస్త్రవేత్తలు, వణిక్ సంఘాధిపతి నగర రక్షణకు సహాయం చేస్తూ ఉంటారు."[1]

యాదవరాజును బందీగా తెచ్చి రాణి ముందుంచి నప్పుడు "క్షత్రియులకు, బ్రాహ్మణులకు కోపం నాశన హేతువు" అంటూ పాటి కప్పం చెల్లించమని చెప్పి అతణ్ణి క్షమించి వదలి వేస్తుంది. లకుమయా రెడ్డి తాను చేసిన తప్పులన్నీ ఒప్పుకొని క్షమాపణ కోరితే గోన గన్నారెడ్డి అతణ్ణి క్షమించి వదలివేస్తాడు. ఈ విధంగా ఆనాటి రాజుల్లో క్షమాగుణం అధికంగా ఉందని అర్థమవుతుంది.

ఇక అంశుమతి నవలలో న్యాయ విచారణ మరింత పరిణతి చెందినట్లు రాజుగారు వర్ణించారు. విష్ణుకుండిన సార్వభౌముడైన మాధవవర్మ గోవుకు జరిగిన అన్యాయాన్ని గురించి విచారణ జరిపించి, దోషి తన కుమారుడే అని తెలిసి అతనికి మరణదండన విధిస్తాడు. కానీ ఆ గోవే చక్రవర్తి కుమారుని మరణ శిక్ష నుండి రక్షిస్తుంది.

ఈ విధంగా రాజుగారి కథా కాలంలో న్యాయ విచారణ, దండన పద్ధతి ధర్మబద్ధంగా ఉండేవని అర్థమౌతుంది.

1. గోన గన్నారెడ్డి - అడివి బాపిరాజు, పు.153.

6. గూఢచర్య వ్యవస్థ: అడివి బాపిరాజు గారి చారిత్రక నవలల్లో గూఢచారులు, గూఢచారుల సాంకేతిక పరిభాష, సంకేతాలు ఉన్నట్లు రాశారు ఆనాడు గూఢచారులు మారు వేషాలు ధరించి ప్రజల్లో తిరిగే వారని తెలుస్తుంది. "సువర్ణశ్రీ మారువేషమున హిమబిందు నివసించు గ్రామమునే ఉండెను"[1] "ఒకనాటి రాత్రి గోండు ఠాకరు ఎటుల కోటలోనికి వచ్చెనో సమవర్తి ఎదుట నిలుచుండినాడు."[2] ఈ విధంగా గూఢచారుల ప్రస్తావన హిమబిందు నవలలో ఉంది.

గోన గన్నారెడ్డి నవలలో కూడ చారులను, గూఢచారులను, వారి సంకేతాలను బాపిరాజుగారు వివరించారు. "గోన గన్నారెడ్డి రెండుసార్లు కూ...కూ..కో..కో అని కూసినాడు. మళ్ళీ రెండుసార్లు కోకిలకూత వినబడింది. ఆ వెంటనే నలుగురు భటులక్కడికి వచ్చిరి."[3] గోనగన్నారెడ్డి దగ్గర వేగులవాళ్ళు, గూఢచారులున్నట్లు బాపిరాజు గారు రాశారు.

" గన్నారెడ్డి చిన అక్కెన మంత్రిని తనకు ముఖ్యమంత్రిగా, అపసర్ప విద్యాపరిశోధకుడిగా ఏర్పరచాడు. అపసర్ప నాయకుడు సబ్బప్ప ఆ విద్యలో ఆరితేరిన వాడు. ఓరుగల్లు అపసర్ప గణనాయకుడైన శ్రీ విరియాల గొంకప్రభువు తనయుడు. అతడు వెయ్యని వేషంలేదు. ఆ రహస్యదుర్గం లోని సేనాపతులు ఒకరికొకరు చూచుకొని 'నువ్వు సబ్బప్పవు కావు కదా' అని ప్రశ్నించుకొంటారట. ఒకనాడు ఒక బాలనాయకుడు ఒక తేలును చంపుతూ ఉంటే ప్రక్కవారు

1. హిమబిందు - అడివి బాపిరాజు., పు: 339.
2. పైదే., పు: 384
3. గోనగన్నారెడ్డి - " ., పు: 291-99

ఆ తేలు సబ్బప్పేమో చంపవద్దన్నారట."[1] ఈ విధంగా రాజుగారు తమ చారిత్రక నవలల్లో గూఢచారి వ్యవస్థను వర్ణించి ఉన్నారు.

**7. నాటి సమాజంలో స్త్రీ :** 'యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః' అన్న ఆర్యోక్తి ఎక్కడ స్త్రీలు పూజింపబడుతారో, అక్కడ దేవతలు సంతోషిస్తారని తెల్పుతుంది. "కలకంఠి కంట కన్నీరొలికిన సిరి యింటనుండ నొల్లదు" అని సుమతి శతకకారుడన్నాడు. ఏ దేశంలో స్త్రీలు సుఖంగా ఉంటారో ఆ దేశం సుభిక్షంగా ఉంటుంది. అటువంటి స్త్రీలను గురించి బాపిరాజు గారికి ఎంతో గౌరవ మర్యాదలున్నాయి. తన చారిత్రక నవలలన్నింటిలో స్త్రీలను ఎంతో ఉన్నతంగా ఉదార హృదయులుగా సృష్టించారు. రాజు గారి కథాకాలంలో స్త్రీలుకూడా పురుషులతో సమానంగా రాజ్యాలు ఏలారని, యుద్ధాలు చేశారని, గుర్రపు స్వారీ, వీర విద్యలు నేర్చారని తెలుస్తుంది. మొత్తం మీద బాపిరాజు గారి స్త్రీలందరూ అమిత సౌందర్యరాశులే. సౌందర్యంతో పాటు సచ్ఛీలత, సౌకుమార్యం, మృదు భాషణ మొదలైన ఎన్నో సుగుణాలు నింపుకొన్న నారీమణులు. వీరిలో కొందరు విలక్షణమైన స్త్రీలుకూడా ఉన్నారు. నాటి సమాజంలో ఎంతో ఆధునిక భావాలున్న స్త్రీలున్నారనడంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు. బాపిరాజుగారి స్త్రీలలో హిమబిందు, చంద్రబాల, నాగబంధునిక, అడవి శాంతిశ్రీ, అంశుమతి, రుద్రమదేవి, అన్నాంబిక మొదలైన వారు ముఖ్యులు. వీరికి బాపిరాజు గారి నవల్లో ఎంతటి మహత్తరమైన స్థానముందో పరిశీలిద్దాం.

1. గోనగన్నారెడ్డి – అడివిబాపిరాజు – 179, 180.

'హిమబిందు' నవలలో హిమబిందు అందాలరాశి; సకల విద్యా
పారంగతురాలు. ఆమె శిల్పి సువర్ణశ్రీని ప్రేమించింది. తండ్రి తనను భావి
సామ్రాజ్ఞి చేయాలనుకొన్నా ఆమె అంగీకరించక సువర్ణశ్రీతోనే జీవితం పంచుకో
వాలనుకొంటుంది. ఉన్నతమైన ప్రేమకు బీదధనిక భేదాలు అడ్డుకావని నిరూ
పించి తన ప్రేమతో జీవితం సఫలం చేసుకొన్న పాత్రగా బాపిరాజు మలచారు.

'హిమబిందు' నవలలోని చంద్రబాల ఎంతటి సౌందర్యరాశో
అంతటి అమాయకురాలు. వైదిక మతాభిమానియైన స్థౌలతిష్యుని మనుమరా
లీమె. స్థౌలతిష్యుడు ఈమెను విషకన్యగా మార్చి శ్రీకృష్ణశాతవాహనునిపై
ప్రయోగించడానికి తయారు చేయబడ్డ మానవ అణ్వాస్త్రం. ఆనాడే ఇటువంటి
రాజకీయ కుట్రలు, దురాలోచనలు కొందరిలో ఉండేవని అర్థమౌతుంది. కానీ
చంద్రబాల శారీరకంగా ఎంత విషపూరితమైనా మానసికంగా ఎంతో స్వచ్ఛ
మైనది. ఈ విషబాల అమృతబాలగా మారి శ్రీకృష్ణశాతవాహనుని వివాహం
చేసుకొంటుంది. ఈమె ఒక విశిష్టమైన పాత్ర.

'హిమబిందు' నవలలో నాగబంధునిక సువర్ణశ్రీ చెల్లెలు. ఈమె
అందగత్తె అయినా ఈమెలో శృంగార లక్షణాలకన్నా వీరవనితా లక్షణా
లున్నట్లు రచయిత చెప్పినారు. స్వతంత్ర భావాలుగలదీమె. 20వ శతాబ్దం
నాటి స్త్రీ స్వేచ్ఛాపూరితమైన ఆలోచనలన్నీ ఆనాడే ఈమెలో ఉండేవి.
ఆనాటి సంఘంలో స్త్రీ పురుషుణ్ణి పలకరించడమే తప్పు. అటువంటి
సంఘంలోనే వివాహమంటే ఇష్టంలేని సమదర్శిని ప్రేమించి. పురుష
వేషంలో అతనికి అంగరక్షకత్వం వహించి, అతన్ని ఆకట్టుకొని

పెంపొందుతుంది. అతనికి భార్యగానే కాక మంత్రిగానూ, అంగరక్షకురాలిగా తోడ్పడుతుంది. అతి పరాక్రమవంతురాలైన వీరనారిగా బాపిరాజుగారీమెను పరిచయం చేశారు.

అడవి శాంతిశ్రీ రాజుగారి ఇంకొక అపూర్వ సృష్టి. వయస్సుతో పాటు సౌందర్యం వికసించిందే తప్ప మనస్సు వికసించలేదీమెకు. ఆమెలో మానసిక పరివర్తన తేవటానికి తండ్రి బ్రహ్మదత్తుని గురువుగా నియమిస్తాడు. బ్రహ్మదత్తుని శిష్యరికంలో బాగా పరిణతి చెందుతుంది. ముగ్ధ అయిన ఆమె ధైర్యంతో ఒంటరిగా ప్రులమావిని ఎదుర్కొంటుంది. అవసరం వస్తే శాంతిశ్రీ లాంటి అబలలు సబలలుగా కూడా మారుతారని ఈ పాత్ర ద్వారా రాజుగారు నిరూపించారు.

అంశుమతి నవలికలో అంశుమతి ఎంతో అందగత్తె. శైవ భక్తి పరురాలు. ఈమె ఏ ఆకర్షణాలేని కుబ్జ విష్ణువర్ధనుని సామాన్య సైనికుడనుకొని మొదటి చూపులోనే ప్రేమిస్తుంది. తన స్నేహితురాలు మాధవీలతతో విష్ణువర్ధనుని గురించి "పొట్టి పొడుగులకూ ప్రేమకునూ సంబంధమేమి చెలి"[1] అంటుంది. శాశ్వత ప్రేమకు బాహ్య సౌందర్యం కంటే అంతఃకరణం ప్రధానమని భావించిన అంశుమతి ఒక అపురూపమైన పాత్ర.

'గోనగన్నారెడ్డి' నవలలో రుద్రమదేవి మిక్కిలి ప్రతిభావంతురాలు. స్త్రీ అయినా గొప్ప ధైర్యసాహసాలతో అనేక కష్టాలనెదుర్కొని, తండ్రి ఆదేశానుసారం విశాల సామ్రాజ్యాన్ని సమర్థతతో పాలించింది. రాజ్యాధి -

1. అంశుమతి – అడవిబాపిరాజు., పు: 84.

నేతలుగా స్త్రీలు ఎన్నో సమస్యలను ఈనాడే కాక ఆనాడూ ఎదుర్కొన్నారు మన పొరుగు రాజ్యమైన పాకిస్థాన్ ప్రధాని శ్రీమతి బేనజీర్ భుట్టో " నేను స్త్రీ అయినందున మా దేశంలో కొందరు నన్ను గద్దె ఎక్కించేందుకు ఇష్టపడటం లేదు. లేకుంటే నేను ఇంకా మంచి ఆధిక్యతతో పదవి అలంకరించి ఉండేదాన్ని" అన్నారు. ఈనాటి పరిస్థితి రుద్రమదేవికి ఆనాడే ఎదురై 'ఆడుది రాజ్యమేలుటయా' అని లకుమయారెడ్డి విమర్శకు గురైంది. ఇట్టి పరిస్థితి ఊహించిన గణపతి దేవ చక్రవర్తి రుద్రమాంబను పురుషునిగా పెంచుతాడు. పరిస్థితులు అనుకూలించిన తరువాత రుద్రమ స్త్రీ అని తెలిపి సామ్రాజ్ఞిని చేస్తాడు. అతని మరణానంతరం ఎదురైన అంతః కలహాలను, తిరుగుబాట్లను అణచి రుద్రమదేవి అఖండ కాకతీయ సామ్రాజ్యాన్ని పాలిస్తుంది.

'గోనగన్నారెడ్డి' నవలలో అన్నాంబిక మిక్కిలి సౌందర్యవతి. ఈమెను కూడా తండ్రి చిన్నప్పట్నుండీ పురుషునిగానే పెంచి వీరవిద్యలన్నీ నేర్పుతాడు. రాజకీయ లబ్ధి కోసం లకుమయారెడ్డి కొడుకైన వరదారెడ్డితో వివాహం నిశ్చయిస్తాడు. ఈ వివాహం ఇష్టం లేకున్నా తండ్రినెదిరించదు. కానీ గన్నారెడ్డి మొదట పెండ్లి కుమారుణ్ణి, తర్వాత అన్నాంబికను అపహరించి, రెండుసార్లు వీరి వివాహానికి ఆటంకం కల్గిస్తాడు. అన్నాంబిక గన్నారెడ్డి విశిష్టగుణాలకు ముగ్ధురాలై, అతన్ని ప్రేమించి విశాల ప్రభువు అనే మారుపేరుతో అతనికి అంగరక్షకుడై సహాయపడుతుంది. చివరకు గన్నారెడ్డి కూడా ఆమెనే ప్రేమించి వివాహం చేసుకుంటాడు.

ఈ విధంగా బాపిరాజుగారు తమ నవలల్లో ఒక్కొక్క స్త్రీ పాత్రకు

ఒక్కొకరు విశిష్ట గుణాన్నిచ్చి సజీవ మూర్తులుగా మలచారు. భిన్నత్వంలో ఏకత్వం అన్నట్లు ఈ పాత్రలు వివిధ మనస్తత్త్వాలకు ప్రతీకలైనా అందరిలోనూ నిజమైన దేశభక్తి, దేశాభిమానం గోచరిస్తాయి. బాపిరాజు గారి స్త్రీపాత్రలు భారతీయ సంస్కృతికి ప్రతిబింబాలు.

## 5.1.3. అడివి బాపిరాజుగారి చారిత్రకనవలల్లో సాంస్కృతిక పరిస్థితులు:

**5.1.3.0. ప్రవేశిక:** "ఒక జాతి అభివృద్ధి మార్గమున నడచిన రీతిని సంస్కృతి అనుచున్నారు... సంస్కృతి, సంస్కృతము, సంస్కరణము, సంస్కారము మొదలగు పదములన్నియు ఒకే కుదుట పుట్టినవి. వీటన్నిటికి ఒకే అర్థము. హీనదశ లేక ప్రాథమిక దశనుండి ఉత్తమదశను చేరుటకై.... జాతులు కాని, సంఘములు కానీ భౌతికముగనూ, మానసికముగనూ ఉచ్ఛదశ నందుటకై చేయు నిరంతర యత్నమే వారి సంస్కృతి"[1]

కొందరు నాగరికత (civilization) సంస్కృతులను (culture) ఒకే అర్థంలో వాడుతున్నారు. సాధారణంగా పల్లెటూళ్ళలో ఉండేవారి కట్టు బొట్టులు, మాటతీరు కొంచెం మోటుగా ఉంటాయి. పట్టణాల్లో ఉండేవారి వేషభాషలు అందంగా, మృదువుగా ఉంటాయి. అంతమాత్రాన పల్లెప్రాంతం వారికి సంస్కారం లేదనే దానికి వీలులేదు. "సంస్కృతి మానవుని ఆత్మ దర్శనమని, నాగరికత దేహధర్మమని చెప్పుదురు."[2] కాబట్టి సంస్కృతి నాగరికతకు పర్యాయ పదంగా కొందరు వాడుతున్నా, ఈ రెండింటి మధ్య సూక్ష్మమైన

---

1. శేఖరం., పు: 2.

2. పైదే., పు: 3.

భేదం ఉంది. సంస్కారుల వలె వేషం ధరించిన కొందరు పైకి పెద్ద మనుష్యుల్లా కనబడినా, కొంత పరిచయం ఏర్పడిన తరువాత వారిలోని కుసంస్కారం బయట పడుతుంది. అదే కొందరు అమాయకులు వారి చేష్టలవల్ల అనాగరికులుగా కనబడ్డా వారిలో సంస్కారం ఎక్కువగా ఉంటుంది. పూవుకు తావి అబ్బినట్లు సంస్కారులైన వారికి నాగరికతకూడా అబ్బితే వారు ఉత్తమ మానవులుగా పరిగణన లోకి వస్తారని చెప్పవచ్చు. అనాగరికులైన సంస్కారులను 'విద్య' నాగరికులైన సంస్కారులుగా మారుస్తుంది.

"తెలివి యొకింత లేని యెడ ..... గతమయ్యె నితాంత గర్వమున్"[1] అన్నాడు భర్తృహరి. చదువు సంస్కారాన్ని ఉద్దీపన చేసి నాగరిక వ్యక్తిగా మారుస్తుంది. పాతరాతి యుగంలో అనాగరికుడుగా ఉండే మానవుడు క్రమక్రమంగా తెలివితేటలతో నాగరికతనూ, విజ్ఞానాన్నీ ఒక ప్రక్క పెంచుకొంటూ కూడ మరోప్రక్క అరిషడ్వర్గాలనూ చంపుకోలేక పోతున్నారు. నిజానికి ఈ కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలనే ఈ అరిషడ్వర్గాలనూ జయించిన మానవుడే ఉత్తమ సంస్కారి.

నానాటికి పెరుగుతున్న చారిత్రక సత్యాలను చరిత్రకారులెందరో గ్రంథస్థం చేసి ఉన్నారు. ఆంధ్రుల చారిత్రక నవలలు రాసిన వారిలో బాపిరాజు గారు అగ్రగణ్యులు. రాజుగారి చారిత్రక నవలల ఆధారంగా ఆనాటి సాంస్కృతిక

---

1. "యదా కించిజ్ఞో అహం గజ యువ మదాంధః సమభవం
తదా సర్వజ్ఞో స్మీత్యభవ దవలిప్తం మమ మనః
యదా కించిత్ బుధ జన సకాశా దవగతః
తదా మూర్ఖో స్మీతి జ్వర యువ మదో మే వ్యపగతః"
చూ॥ సుభాషిత త్రిశతి — భర్తృహరి 8వ శ్లోకం., పు:7

విశేషాలనీ విధంగా సమీక్షించడం జరిగింది.

5.1.3.1. సాంస్కృతిక పరిస్థితులు :

1. **ఉత్సవాలు – పండుగలు :** జీవితంలో మానవుడు అప్పుడప్పుడూ వినోదాన్ని కోరుతూంటాడు. ఆమోద ప్రమోదాలు, హర్షోల్లాసాలు పొందాలనే కోరికతోనే మానవుడు ఈ పండుగలు, ఉత్సవాలు కల్పించాడు. వీటిలో స్థానీయ సంస్కృతికి ప్రాధాన్యం ఉంటుంది. సాధారణంగా ఉత్సవాల్లో నృత్యం, గానం, సామూహికానందం, ఆహార పానీయాల్లో మార్పు చోటుచేసుకుంటాయి. పండుగల్లో పరంపరగా వస్తున్న ఆచారాలు, పూజావిధానం, ప్రచారంలో ఉన్న పాటలు, నృత్యాలు మొదలైనవి ఉంటాయి. మనదేశంలో అనాదికాలం నుంచి పండుగలకు ప్రాధాన్యముంది. దసరా, దీపావళి, సంక్రాంతి, హోలీ, రక్షాబంధన్, ఓణం మొదలైనవి హిందువులకు ముఖ్యమైన పండుగలు. మనది లౌకిక (secular) దేశం కాబట్టి క్రిస్మస్, మొహరం, రంజాన్, బక్రీద్, బుద్ధపూర్ణిమ మొదలైన భిన్నమతాల పండుగలు జరుపుకొంటాం. డా॥ కుసుమ కుమారి గారు భారత దేశపు సాంస్కృతిక సహజీవనాన్ని గూర్చి "విభిన్న సంస్కృతులకు చెందిన వ్యక్తుల సహజీవనం, ఎదుటి వారి ఆచారాలను, అలవాట్లను అనుసరించే విశాల దృక్పథాన్ని తెచ్చింది. హిందువుల దసరా, దీపావళి మొదలైన పండుగలలో మహమ్మదీయులు పాల్గొనడం నాటినుండి జరుగుతున్న విషయమే"[1] అన్నారు.

---

1. బ్రిటీష్ కాలపు తెలుగు ముద్రిత పత్రాల్లోని హిందూస్థానీ ప్రతికాయాలు 1800-1947 (పరిశోధన గ్రంథం - అముద్రితం) పు: 78
– డా. కుసుమ కుమారి. పి.,

హిందువులు కూడ మొహరం పండుగ జరుపుకొంటారు దీనిని ఆంధ్ర లో పీర్లపండుగ అంటారు. నెల్లూరులో ప్రఖ్యాతి పొందిన రొట్టెల పండుగ, హిందువులు మహమ్మదీయ దేవునకు నైవేద్యం పెట్టే రొట్టెలకు సంబంధించింది. ప్రపంచం మొత్తం మీద భారతదేశంలోనే పండుగలు ఎక్కువ అనిపిస్తుంది. ఆంధ్రులకు అట్లతదియ, ఉండ్రాళ్ళ తదియ, సుబ్బరాయుని షష్ఠి ... ఇంకా నోములు, వ్రతాలు కోకొల్లలు. గుళ్ళో ఉత్సవాలూ, బ్రహ్మోత్సవాలూ, గ్రామంలో బతుకమ్మ పండుగ, గంగమ్మ, పోలేరమ్మ ల్లాంటి గ్రామదేవతల జాతరలు ... ఇలాంటివి ఆంధ్రలో అధికమే.

శాతవాహనుల కాలంలో ఎడ్ల బండ్ల పందాల ఉత్సవం ప్రసిద్ధి చెందినట్లు బాపిరాజు గారు రాశారు. ఆ నాటి ఆంధ్రులకు ఎడ్లబండ్ల పందాలు అత్యంత ప్రీతి పాత్రాలు. 'హిమబిందు' నవలలో ఈ ఎడ్లబండ్ల పందెంలో రాజులు, ప్రజలు, సామంతులు అన్ని వర్గాల వారు పాల్గొంటారని రాజు గారు రాశారు. రాజుల సామ్రాజ్యాభిషేకాన్ని కూడా ప్రజలు ఆనందంగా పండుగలా జరుపుకొంటారు. "ఆంధ్ర దేశమంతయు పండుగలే! సకల భూవలయము మహాదాంధ్ర దేశమయినది వారికి"[1] ఇక్ష్వాకుల కాలంలో వసంతోత్సవాలు మహావైభవంగా జరిగేవి. ఈ ఉత్సవాన్ని రాజులు, ప్రజలు ఘనంగా జరుపుకొనే వారు. ఇది ఆనాటి సాంస్కృతిక వైభవానికి, శృంగార ప్రవృత్తికి నిదర్శనం. ఆ ఉత్సవాల సమయంలో ముఖ్యమైన వాళ్ళను రతీ, మన్మథులలాగా వనలక్ష్మి, వసంతుల లాగా ఎన్నుకొని బాలబాలికలందరూ వారి చుట్టూ మూగి

---

1. హిమబిందు – అడివి బాపిరాజు, పు: 473.

పాటలు పాడుతూ, నాట్యాలాడుతూ ఆనందంగా గడిపేవారని తెలుస్తుంది ఆనాటి రాజుల అంతఃపురంలో పని చేసే వారికి, రాజభటులకు ఒక్కొక్క పండుగకు ఒక్కొక్క జట్టుకు తమ గ్రామాలకు వెళ్ళి వచ్చేందుకు సెలవు ఇచ్చే ఆచారం ఉంది. "ఒక్కొక్క పండుగకు ఒక్కొక్క జట్టు పరిచారికలు తమతమ గ్రామాలకు ఒక నెల దినాల పాటు వెళ్ళి వస్తూ ఉంటారు."[1]

అంశుమతి నవలలో ప్రత్యేకంగా ఒక పండుగను గురించి, ఉత్సవాన్ని గురించి పేర్కొనక పోయినా ఆ నాటి రాజులు వైభవోపేతంగా ఉత్సవాలు, పండుగలు జరిపేవారని రాజుగారు రాశారు. "వేంగీ రాష్ట్రమున మహోత్సవములు యుగయుగముల కవులు కావ్యములు రచింపదగునంత వైభవముగ జరుగుచున్నవి."[2] ఓరుగల్లులో దసరా ఉత్సవాలు ఘనంగా జరుపుకొనే వారని గోనగన్నారెడ్డి నవల ద్వారా తెలుస్తుంది. ఆ ఉత్సవాల్లో కాకతి మహాదేవి విగ్రహానికి బంగారు తొడుగులు తొడుగుతారు. వజ్రవైఢూర్యాలు పొదిగిన భూషణాలు పెడతారు. రోజుకొక వాహనం పై ఆమెను రాత్రంతా మేళతాళాలతో, నర్తకీమణుల నాట్యాలతో ఊరేగిస్తారు.[3] ఈ నవరాత్రి ఉత్సవ సమయాల్లో బొమ్మలను చిత్ర విచిత్ర గతుల అలంకరించి, ఇరుగు పొరుగు బాలికలను పేరంటానికి పిలిచేవారు. "రుద్రమదేవి బొమ్మల పండుగ తల పెట్టింది. ఈ పండుగకు నెల దినాల నుండి రాజోద్యోగులు దేశదేశాల సాలభంజికలు, విగ్రహాలు .... దంతమంజూషలు,

1. అడవి శాంతిశ్రీ అడివి బాపిరాజు, పు: 88.
2. అంశుమతి " పు: 118.
3. గోనగన్నా " , పు: 214.

క్రీలు బొమ్మలు రాచనగరిలో తెచ్చినారు. రుద్రాంబ, ముమ్మడమ్మ, అన్నాంబికలు వచ్చిన పేరంటాండ్రకు వాయినాలిచ్చేరు. వేలకు వేలు ఇతర స్త్రీలా నగరిలో నిండిపోయినారు. వారందరికీ చెలులు రాచకన్నెలకు ఇచ్చిన వాయినాల వంటివే ఇచ్చినారు."[1] దీనిని బట్టి ఆనాడు పండుగలను రాజు, పేద అనే తేడా లేకుండా అందరూ కలసి జరుపుకొంటారని తెలుస్తుంది. ఓరుగల్లులో జరిగే 'కాకతమ్మ ఏకవీరాదేవి' ఉత్సవానికి ఆంధ్రదేశంలోని అన్ని మూలల నుండి లక్షలకొలది జనం వచ్చేవారు. కాకతీయుల కాలంలో కూడా వసంతోత్సవాలు జరుగుతాయని రాజుగారి మాటల ద్వారా తెలుస్తుంది. 'ఒకసారి వసంతోత్సవ సమయంలో ముమ్మడాంబిక వనదేవత వేషం ధరించి, వసంత వేషములో రుద్రదేవ యువరాజు ఒంటిగా వసంతోద్యాన వనాన సంచరించే సమయాన ...."[2] ఈ విధంగా బాపిరాజు గారు తమ చారిత్రక నవలల్లో ఉత్సవాలు, పండుగల గురించి విశేషంగా ప్రస్తావించినారు.

**2. లలిత కళలు :** అడివి బాపిరాజు గారు సర్వకళల్లో నిష్ణాతులు కాబట్టి ఆయన రచించిన చారిత్రక గ్రంథాల్లో కూడా చిత్రలేఖనం, శిల్పం, సంగీతం, నాట్యం మొదలైన కళలన్నీ చోటు చేసుకున్నాయి. పూర్వాంధ్ర రాజులు లలిత కళలకు ఎంతో ప్రాముఖ్యాన్నిచ్చారు. రాజుగారు తమ రచనల్లో పూర్వాంధ్రుల కళా పోషణను చక్కగా వివరించారు.

**శిల్పకళ మరియు స్థాపత్య కళ :** హిమబిందు నవలలో రాజుగారు శిల్పకళ

1. గోన గన్నారెడ్డి– అడివి బాపిరాజు., పు:
2. పైదే., 56.

గురించి అనేక చోట్ల వర్ణించినారు. కథానాయకుడు సువర్ణశ్రీ మహాశిల్పి వారి కుటుంబమే శిల్పాలు చెక్కే కుటుంబం. తండ్రి ధర్మనంది గొప్ప శిల్పాచార్యుడు. ఆనాడు శిల్పులకు సంఘంలో ఎంతో గౌరవస్థానం ఉండేది. శాతవాహనుల కాలంలోనే కాకుండా ఇక్ష్వాకుల కాలంలోనూ, కాకతీయుల కాలంలోనూ శిల్పకళ ఎంతో అత్యున్నతంగా వర్ధిల్లిందని తెలుస్తుంది. కాకతీయులు దేవాలయాల్లో వివిధ శిల్పాలు, దేవీదేవతామూర్తులు, నాట్య భంగిమలో స్త్రీలు, వివిధ పుష్పాలు, లతలు, జంతువులు, యుద్ధ సన్నివేశాలు చెక్కించుటలో ఎంతో ప్రావీణ్యతను చూపారు. వారి శిల్పాలు నేటికీ సజీవాలై గోచరిస్తాయి.

రాణి రుద్రమదేవిని గణపతిదేవుడు పురుషునిగా పెంచుతారు. రుద్రమదేవికి స్త్రీ పురుష భేదం తెలీదు. ఆమెకు యౌవన ఛాయలు పొడచూపే ఒప్పుడు ఒకరోజు దేవాలయంలోని ఒక స్త్రీమూర్తిని చూచినప్పుడు తాను స్త్రీ అని గ్రహించింది. "ఒకనాడు రుద్రమదేవి ఒక శిల్పము చూచినది. ఆ శిల్పము ఒక దేవీ విగ్రహము. ఆ దేవీ విగ్రహమున కున్న ఉత్తుంగ వక్షోజాలు, సన్నని నడుము చూచాయగా ప్రదర్శింప బడిన నగ్నత చూచి ఆమెకాశ్చర్యం వేసింది."[1] ఈ విధంగా కాకతీయుల కాలంలో అందమైన శిల్పాలు చెక్కే వారని తెలుస్తుంది. బాపిరాజుగారి రచనల వల్ల మాత్రమే కాకుండా ఓరుగల్లు (వరంగల్లు) ప్రాంతంలోని దేవాలయాల్లోని నాటి శిల్పకళా వైభవం నేటికినీ సందర్శించి సంతోష పడవచ్చు. శత్రురాజుల వల్ల నాశనమై పోయి మిగిలిన

1. గోన గన్నారెడ్డి — అడివి బాపిరాజు, పు: 51.

అవశేషాలే ఇంత అద్భుతంగా ఉంటే పూర్ణ విగ్రహాలు ఆనాడు ఇంకెంత అద్భుతంగా ఉండేవో !

**చిత్రలేఖనం :** ఆ నాటి ఆంధ్రరాజులు శిల్పకళకే కాకుండా చిత్రలేఖనానికి కూడా అమిత ప్రాధాన్యం ఇచ్చేవారు. రాజుగారు చిత్రకారులైనందున వారి నవలల్లో శిల్పకళతో పాటు చిత్రకళకు కూడా ఎంతో ప్రాధాన్యం ఇచ్చారు. ఒకసారి హిమబిందు, ఆమె ముత్తవ్వ ముక్తావళి తదితరులతో కలసి సువర్ణశ్రీ ఇంటికి వెళ్ళింది. అక్కడ వారు అనేక మంచి శిల్పాలు, చిత్రాలు చూశారు. "వారందరా మందిరముల లోని అనేక స్థితుల లోనున్న శిల్పము, చిత్రలేఖనములన్నియు తోటలో పరిశీలించినారు. ఆ మందిరముల నుండి వినర్గమించి వేరొక చోటనున్న సువర్ణశ్రీ శిల్పమందిరములు చూడబోయిరి - అచట హిమబిందునకు పరవశత్వమే కలిగింది. ఏమి ఈతని పనితనము! అవి అతని శిల్పములా ? అవి చిత్రలేఖనములా ? !"[1] ఒకచోట హిమబిందు చిత్రం గోడపై చిత్రించి ఉంది. అది చూచి "ఆదేమిటి ! ఆ గోడపై త్రిభంగిగా నిలుచుండిన బాలికా మూర్తి ఎవరు ? తానే ! తానేల ? ఓహో !"[2] అనుకుంది హిమబిందు. మిగిలిన వారు "ఎంత అందముగానున్నదామ్మా ! అచ్చముగ హిమబిందు. ఆమెను అచ్చట నాక దేవీమూర్తి వలె రచించాడీ బాలకుడు"[3] అనుకొన్నారు. దీనిని బట్టి సువర్ణశ్రీ గొప్ప శిల్పకారుడే గాక చిత్రకారుడు అని కూడా తెలుస్తుంది. సువర్ణశ్రీ చెల్లెలు నాగబంధునిక,

1. హిమబిందు – అడివి బాపిరాజు., పు: 138, 139
2. పైది., పు: 138, 139.
3. పైదే., పు: 139.

'అడవి శాంతిశ్రీ' లో అడవి శాంతిశ్రీ, 'గోన గన్నారెడ్డి' లో అన్నాంబికలను గొప్ప చిత్రకారిణులుగ వర్ణించారు రచయిత. ఒకసారి అన్నాంబిక మల్యాలవారి నగరంలో ఉన్న చిత్రశాలకు వెళ్ళింది. "ఆ చిత్రశాలలో ఉన్న శివలీలా విలాసాలు గమనిస్తూ, హంసతూలికా పరుపులు పరచిన దంతపీఠంపై అధివశించి ఆ చిత్రలేఖనాన్ని అనేక రీతులుగా తన్ను గమనిస్తూ ఉండగా ఆలోచనకు లోనయింది."[1] కాకతీయుల కాలంలో మల్యాలవారి నగరిలో ఉన్న చిత్రశాల దేశప్రసిద్ధమైనదని రాజుగారు రాశారు. ఈ విధంగా బాపిరాజుగారు తమ నవలల్లో చిత్రకళను వర్ణించినారు.

**సంగీతం - నృత్యం:** లలితకళల్లో సంగీత, నృత్యాలకున్న ప్రాముఖ్యాన్నెరిగి బాపిరాజుగారు తమ నవలల్లో సంగీత నాట్యాలను అనేక చోట్ల వర్ణించినారు. 'అడవి శాంతిశ్రీ'లో బ్రహ్మదత్తుడు గొప్ప విద్వాంసుడు, కవి, జ్ఞానియే కాకుండా గొప్ప సంగీత కళానిధిగా వర్ణించారు. "అతని కంఠము కంచుకంఠము ... పైశాచీ, ప్రాకృతి, పాలీ సమ్మిశ్రితమైన ఆంధ్ర భాషలో అనర్గళ ధారగా కావ్య సృష్టి చేసాడు. ఆ కావ్యాలు వీణపై అతడు పాడుతుంటే రాళ్ళు కరిగి పోతాయని ప్రజలు చెప్పుకుంటారు."[2] ఇంకా హిమబిందు, చంద్రబాల, అన్నాంబిక తదితరులు సంగీతాన్ని శాస్త్రంగా అభ్యసించారని తెలుస్తోంది.

నాట్యం గురించి బాపిరాజుగారు ఇలా భావించారు. "సంగీతానికి ధ్వని, కవిత్వానికి భాష, చిత్రలేఖనానికి రంగులు, శిల్పానికి శిలలు

---

1. గోనగన్నారెడ్డి- అడివి బాపిరాజు., పు: 121
2. అడవి శాంతిశ్రీ ,, ,, పు: 18.

సాధనా వస్తువులైనట్లు నాట్యానికి మానవ శరీరమే ప్రధాన సాధన వస్తువని బాపిరాజు గారి భావన."[1] రాజుగారు తనకు గల నాట్యశాస్త్ర పరిజ్ఞానాన్ని చారిత్రక నవలల కథా కాలం నాటి శిల్పాల నాట్య భంగిమలు, ఇతర చారిత్రక అంశాలు గ్రహించి తమ లేఖినితో నాట్య విన్యాసం చేయించారు. ఎడ్ల బండ్ల పందెంలో గెలిచిన సువర్ణశ్రీ గౌరవార్థం ఏర్పాటు చేసిన సభలో ఇరవై మంది బాలికలు నాట్యం చేశారని రాజు గారు రాశారు. "ఆ బాలికలలో సార్వభౌముని ఇరువురు తనయలు, రాజకుటుంబములోని బాలికలు, సచివుల, సేనా నాయకుల కుమార్తెలు, కోటీశ్వరుడగు చారుగుప్తుని పుత్రి హిమబిందు కలదు."[2] దీనిని బట్టి సభల్లో సుక్షత్రియ కన్యలు, ఉత్తమ కుల యువతీ మణులు నాట్యం చేయడం ఆనాడు గౌరవంగా భావించేవారని తెలుస్తుంది. రాజకుటుంబంలో వివాహాలు, పట్టాభిషేకాలు మొదలైనవి జరిగేటప్పుడు కవి, పండిత, గాయక గోష్ఠులతో బాటు నాట్యం కూడా తప్పనిసరిగా ఉండేది. నాట్యోపశాఖలైన యక్షగానాలు, తోలు బొమ్మలాటలు కాకతీయుల కాలంలో ఎక్కువగా ఉండేవి.[3] ఈ విధంగా బాపిరాజు గారు లలిత కళలను తమ నవలల్లో ప్రస్తావించి ఆనాటి సంస్కృతిని మన కళ్ళ ముందుంచారు.

**వైవాహిక సంబంధాలు:** బాపిరాజు గారి నవలల్లో చాలవరకు ప్రేమ వివాహాలే. మొదట ప్రేమించుకొన్నా, తర్వాత పెద్దల అనుమతి తీసుకునే వివాహం చేసుకొనేవారు అని తెలుస్తుంది. తల్లిదండ్రులను, పెద్దలను ఎవరూ ఎదిరించినట్లు

1. శ్రీ అడివి బాపిరాజు సాహిత్యానుశీలనము - డా॥ మన్నవ సత్యనారాయణ., పు: 238.
2. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 54.
3. గోనగన్నారెడ్డి - " , పు: 60.

కనబడదు. పెద్దలు కూడా ప్రేమించుకున్న యువతీయువకులకు అడ్డుచెప్పకుండా వారి వివాహాలు చేసేవారు. 'హిమబిందు' నవలలో సువర్ణశ్రీ - హిమబిందు, చంద్రబాల - శ్రీకృష్ణ శాతవాహనుడు, సమదర్శి - నాగబంధునికల జంటల వివాహాలు ప్రేమ వివాహాలే. వీరందరివీ కులాంతర వివాహమని కూడా చెప్పవచ్చు. హిమబిందు మాతామహుడైన కీర్తిగుప్తుడు యవనస్త్రీ అయిన ప్రజాపతి మిత్రను పెండ్లి చేసుకొంటాడు. కాబట్టి ఆ నాటి సమాజంలో కులాంతర, మతాంతర వివాహాలకు నిషేధం లేదని తెలుస్తుంది. అడవి శాంతిశ్రీ నవలలో శాంతిశ్రీ తొలుత వివాహానికి సుముఖురాలు కాదు. బ్రహ్మదత్తుడు ఆమెలో చైతన్యం కలిగించి, ఆమెనే వివాహం చేసుకుంటాడు. శాంతిశ్రీ అంగరక్షకురాలు తారానిక బ్రహ్మదత్తుని అంగరక్షకుల్లో ఒకడైన నాగదత్తుని ప్రేమిస్తుంది. నాగదత్తుడు ఆమె స్తనవల్కలాన్ని దాస్తే, తారానిక అతని ఖడ్గాన్ని దాస్తుంది. ఈ విధంగా చేయడమే గాంధర్వ వివాహమని బాపిరాజుగారు చమత్కరించారు. "వివాహం కాని బాలిక స్తనవల్కలం తీసుకున్నవాడు ఆమెను వివాహానికై అడిగినట్లు, ఆమె ఖడ్గం తీసుకుంటే ఒప్పుకున్నట్లు. ఇదే గాంధర్వం."[1] తర్వాత వారి వివాహం పెద్దల సమక్షంలో జరిగింది. అంటే ఇక్ష్వాకుల కాలంలోనూ ప్రేమ వివాహాలను పెద్దలు అంగీకరించేవారని తెలుస్తోంది.

ఆనాటి సమాజంలో బహుభార్యాత్వం కూడా అంగీకారమే నని తెలుస్తోంది. వీరపురుషదత్తునికి, పులమావికి అనేక మంది భార్యలున్నట్లు రాజుగారు రాశారు. అంశుమతి నవలికలో అంశుమతి ప్రత్యేకతలూ

1. అడవి శాంతిశ్రీ — అడవిబాపిరాజు., పు: 101.

లేని ప్రియదర్శి (కుబ్జ విష్ణువర్ధనుడు)ని ప్రేమిస్తుంది. ఆమె ప్రేమించింది. ఆమె ప్రేమించింది యువరాజునే అని ఆమెకు తెలియదు. ఇదే నవలలోని మాధవీలత - జయనందుల వివాహం కూడా ప్రేమ వివాహమే. వీరి వివాహాలు పెద్దల ఆశీర్వచనాలతో జరుగుతాయి. ఇక గోనగన్నారెడ్డి నవలలో అన్నాంబిక గోనగన్నారెడ్డిని, రుద్రమదేవి చాళుక్య వీరభద్రుని ప్రేమిస్తారు. తండ్రి రాజకీయ లబ్ధికోసం కుదిర్చిన సంబంధానికి బాధపడి అన్నాంబిక తల్లితో, "అమ్మా! ఈ కర్కశ యుద్ధ రాజకీయాల కోసం స్త్రీలను ఫణము పెట్ట జూదము ఆడడం ధర్మమా చెప్పండి"[1] అంటుంది. చివరకు అన్నాంబిక గోనగన్నారెడ్డిని వివాహం చేసుకొంటుంది. రుద్రమదేవికి సాటి స్త్రీ అయిన ముమ్మడమ్మతో జరిగిన వివాహం రాజకీయ ప్రయోజనార్థం జరిగింది. చివరకు రుద్రమదేవి తాను ప్రేమించిన చాళుక్య వీరభద్రుని పెళ్ళాడడమే గాక ముమ్మడమ్మను చాళుక్య మహాదేవ రాజునకిచ్చి వివాహం జరిపిస్తుంది. ఈ విధంగా బాపిరాజుగారు తన నవలన్నింటిలో అనేక రకాలైన వివాహ సంబంధాలను ప్రస్తావించారు.

**శిష్టాచారాలు:** అడివి బాపిరాజు గారి నవలలన్నింటిలో వ్యక్తులందరూ శిష్టాచార పరాయణులు. ఫలమాలి, దానార్ణవుడు లాంటి ప్రతినాయకులు కొందరు తప్పిస్తే అందరూ ఇతరులను గౌరవ మర్యాదలతో చూచేవారే. మహారాజు శాంతిమూలుడు బ్రహ్మదత్తుని 'బ్రహ్మదత్త ప్రభూ!' అని సంబోధిస్తాడు. రుద్రమదేవి తన సైన్యాధిపతిని 'గోనగన్న ప్రభూ!' అని సంబోధిస్తుంది. అలాగే కుబ్జ విష్ణువర్ధనుడు తన సేనాపతిని, అతనికుమారుని

1. గోనగన్నారెడ్డి - అడివిబాపిరాజు, పు:18.

కాల కంపన ప్రభూ, జయనంది ప్రభూ అని సంబోధిస్తాడు దీనిని బట్టి ఆనాటి చక్రవర్తులు, మహారాజులు తమ సామంతులను, ఇతర ఉద్యోగులను కూడా గౌరవ వాచకంగా పిలిచేవారని అర్థమౌతుంది. తల్లిదండ్రులను అమ్మగారూ!, నాయనగారూ! అని పిలిచేవారు. రుద్రమదేవి శివదేవయ్య మంత్రిని 'గురుదేవా!' అనే కాక ఆప్యాయంతో 'నాయనగారూ!' అనికూడా పిలుస్తుంది. ఒక వ్యక్తిని దోషిగా నిర్ణయించిన తర్వాత కూడా ఆ దొంగను ఆనాటి సమాజం గౌరవవాచకంతోనే పలకరిస్తుంది. ఆ దొంగకు శిక్ష చెప్పేటప్పుడు 'ఓ బ్రాహ్మణోత్తమా! నీవు దోషివి కావని చెప్పలేము. కాన నీకు ఒక సంవత్సరము పాతాళ గృహవాసము విధించితిని'[1] అని మర్యాదగా శిక్షవేస్తారు. పై విధంగా రాజుగారి నవలలన్నింటిలోను గౌరవ సూచకములైన పిలుపులే కనబడుతూ ఉంటాయి.

**నమ్మకాలు :** బాపిరాజు గారి నవలల్లో వ్యక్తమయ్యే ప్రజల నమ్మకాలు, విశ్వాసాలు ( believes) గూర్చి ఈ క్రింది శీర్షికల ద్వారా తెలుసుకొందాం.

**ముహూర్తం లేక శుభలగ్నం :** బాపిరాజు గారి నవలలవల్ల వివాహం, పట్టాభిషేకం, విద్యారంభం, యుద్ధారంభం వంటి శుభకార్యాలకు ముందు శుభ ముహూర్తం నిర్ణయించే ఆచారం ఉండేటట్లు తెలుస్తుంది. ఉదా॥ "జయము! జయము! రాజకుమారికలకు! పూజ్యశ్రీ రాజ వశిష్టుల వారు మహారాజ కుమారి నూతన విద్యారంభం, మాఘశుద్ధ పంచమి నాడు, వసంతోత్సవ ప్రారంభంలో ఉదయం ఘటకా తొమ్మిది విఘడియలకు

1. హిమబిందు – అడవి బాపిరాజు, పు: 73.

మేషలగ్న పుష్కరకాలంలో అని సెలవిచ్చినారట "[1] అని ఉంది మంచి పనులకే కాక చెడ్డ పనులకు కూడా ముహూర్తాలు పెట్టినట్లు రాజుగారు రాశారు. స్థూలతిష్యుడు శ్రీకృష్ణ శాతవాహనుని సంహరించడానికై తన మనుమరాలిని విషకన్యగా మార్చి, అతనిపై ప్రయోగించడానికి ఒక ముహూర్తం నిశ్చయించి అభిచార హోమం కూడా చేస్తాడు. కాని మధ్యలో మలయ నాగుడు చంద్రబాల అందానికి వివశుడై ఆమెను కౌగలించుకోగా ఆమె విషపూరిత నిశ్వాసం వల్ల చనిపోతాడు. ఈ అశుభానికి బాధపడి స్థూలతిష్యుడు ఇలా అంటాడు. "ఈ ముహూర్తమున దోషమున్నది. కాన వేరొక్క ముహూర్తము నిర్ణయింప బడును "[2]

**జాతకాలు :** హిందువుల ఆచార ప్రకారం పుట్టిన బిడ్డలకు జాతకాలు రాయడం, వివాహాలప్పుడు వధూవరుల జాతకాలు చూడడం, జాతకంలో దోషాలున్నట్లయితే పరిహారం కోసం పూజలు పునస్కారాలు చేయడం అనేది మన సంప్రదాయం. అడివి బాపిరాజు గారు అంశుమతి అనే నవలికలో వేంగీ నగర మహారాజైన మంచన భట్టారక దేవుని పుత్రిక అంశుమతీకుమారి జాతకంలో ఏదో గ్రహదోషం ఉందని రాజజ్యోతిష్కుడు చెప్తాడు. ఆ దోష పరిహారంగా గోవూరు గోపాద క్షేత్రంలో గోదావరి నదిలో స్నానం, ఉత్తమ బ్రాహ్మణులచే జపాలు చేయిస్తూ, దానాదులు అర్పించి, ఈ విధంగా నలభై రోజులు చేస్తే అమ్మాయి జాతకంలోని దోషం తీరిపోయి ఆమెకు

1. అడవి శాంతిశ్రీ – అడివి బాపిరాజు, పు: 31
2. హిమబిందు – అడివి బాపిరాజు, పు: 116.

మహారాజు భర్తగా లభిస్తాడు. ఆమె గర్భంలో కులదీపకుడైన సుపుత్రుడు దయించి సామ్రాజ్యాధిపతి ఔతాడు;[1] అని రాశారు.

**శకునాలు:** శకునాల గురించి బాపిరాజుగారి నవలల్లో కనబడుతాయి. శ్రీకృష్ణ శాతవాహనునకు గుమ్మములో కాలు పెట్టిన వెంటనే 'శ్వేత ఉరగం' బుస్సుమంటూ ఆడుతూ ప్రత్యక్షమైంది. అందరూ నిశ్చేష్టులై చూస్తూండగానే మాయమై పోయింది. తర్వాత అతను తల్లితో "అమ్మా! తమ పాదసేవ చేయుటకు వచ్చుచుండ, నాకీ దినము ఒక తెల్లని పాము శకునమైనది. దాని ఫలమేమో యని ఆలోచించు చున్నాను"[2] అన్నాడు. ఇది మంచి శకునమే అని సర్ప జ్యోతిష్కులు చెబుతారు.

**స్వప్నాలు:** రాజుగారు స్వప్నాలను గురించి వారి నవలల్లో చాల చోట్ల ప్రస్తావించినారు. 'హిమబిందు' నవలలో స్వప్నము, స్వప్న భంగము అనే శీర్షికలతో రెండు అధ్యాయాలు రాశారు.[3] అమృత పాదార్హాతులకు ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో చారుగుప్తుని హస్తంలో పూలు నిండిన పూర్ణ కలశం ఉన్నట్లు, అతనికెదురుగా వస్తున్న అమృత పాదార్హాతుల చేతిలో నాగం ఒకటి ఉన్నట్లు, ఒక మహా గరుడుడు వేగంగా వచ్చి పూర్ణకలన్ని తన్నుకు పోయినట్లు చూచాడు.[4] ఆ విధంగా స్వప్నం వస్తే ఒక మహా సంకల్పం ఎవరైనా పూనితే అది వేరేదారి పోతుంది అని చంద్రస్వామి అంటాడు. చారుగుప్తుడు తన కూతుర్ని, చక్రవర్తి తమ్మునికివ్వాలనుకొనే

---

1. అనుమతి — అడవి బాపిరాజు, పు: 5,6
2. హిమబిందు — ,, పు: 26.
3. పైదే, పు: 359, 193.
4. పైదే, పు: 362.

మహా సంకల్పం ఈ స్వప్నం వల్ల నెరవేరదని భవిష్యత్తు సూచించారు. అక్కడే స్వప్నాలు నిజమౌతాయా? కావా? అనే తర్కం కూడా చేశారు. "స్వప్నములు రానే రావు. వచ్చిన వానికేదియో పరమార్థముండును.... కొందరు ఆయుర్వేద పండితులు ఆ స్వప్నముల ననుసరించి రోగమేదియో స్పష్టముగ తెలియ వచ్చునందురు."[1] ఈ విధంగా స్వప్నాల గురించి బాపిరాజు గారు తమ నవలల్లో ప్రస్తావించారు.

**వ్రతాలు - పూజలు :** ఆంధ్రస్త్రీలు వరలక్ష్మీవ్రతం, తులసిపూజ, గౌరీపూజ అంటూ ఎన్నో రకాలైన వ్రతాలు, పూజలు సంవత్సరం పొడవునా ఆచరిస్తూ ఉంటారు. ఆంధ్రుల్లో పండుగలు - వ్రతాలు ఒకదానితో ఒకటి కలిసిపోయి ఉంటాయి. రుద్రమదేవి కులదేవతయైన 'కాకతి' పూజ చేసేది.[2] అంశుమతి నవలలో "రాజకుమారికచే గోదావరీ స్నానవ్రతము చేయించ నేర్పాటయ్యెను. వ్రతము నలుబది దినములాచరింప వలసియున్నది."[3] శుక్రవార వ్రతం గురించి 'హిమబిందు' నవలలో ఉంది. "ప్రతి శుక్రవారపు ఉదయమునను హిమబిందు చతుర్విధ పురుషార్థదాయిని అయిన మహాలక్ష్మి పూజ చేయును"[4]

**మంత్ర తంత్రాలు :** స్థాలతిష్యుల ఆశ్రమమే ఒక పూజా మందిరం. హిమబిందు నవలలో ఆశ్రమము, అభిచారము అనే శీర్షికలతో రాజుగారు స్థాలతిష్యుల మంత్రోక్త పూజా విధానాన్ని విశదంగా వివరించారు.[5] మంత్ర తంత్రాలతో కూడు

శత్రు మారక రూపమైన అభిచార హోమ వర్ణన —

1. హిమబిందు — అడవి బాపిరాజు., పు: 362
2. గో. గన్నారెడ్డి — ,, పు: 161.
3. అంశుమతి — ,, పు: 6
4. హిమబిందు — ,, పు: 207.
5. పైదే., పు: 362.

" ఓ అగ్ని వాయు సూర్య చంద్రము లారా!

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

మా విరోధుల నీ బాలిక కరుకు ఆకర్షింపుము ... ఆ బాలికపై స్థౌలతిష్యుడు మంత్రజలము జల్లినాడు "[1] అని ఉంది. కానీ అతని మంత్ర తంత్రాలేవీ ఫలించలేదు. మంత్రించబడిన విషబాలను మంత్ర వైద్యులు, విష వైద్యులు కలసి అమృతబాలగా మారిస్తే, ఆమె సౌందర్యం, అమాయకత్వా నికి శ్రీకృష్ణ శాతవాహనుడు ముగ్ధుడై ఆమెనే ప్రేమించి పెండ్లాడుతాడు.

**స్నానాలు :** హిందువులకు, ముఖ్యంగా ఆంధ్రులకు పుణ్యనదుల్లో స్నానం చేస్తే సమస్త దోషాలు నశిస్తాయని నమ్మకం. 'అంశుమతి' నవలలో అంశుమతి గ్రహదోష పరిహారానికై నలభై రోజులు గోదావరి నదిలో స్నానమాచరిస్తుంది. "రాజ పురోహితులు 'అఖండ గౌతమీ స్నాన మహం కరిష్యే' అని ప్రారంభించి, 'దశా పరేషాం, దశ పూర్వేషాం' అను మంత్రములతో రాజకుమారికకు గోదావరీ స్నానము పూర్తి చేయించెను "[2]

**ప్రమాణాలు :** గోనగన్నారెడ్డి నవలలో గణపతిదేవుని కోరిక ప్రకారం శివదేవయ్య మంత్రి రుద్రమదేవిని కొన్ని వాగ్దానాలివ్వమని కోరుతాడు అవి– "తాము సార్వభౌమత్వ భారం వహించి నవమ చక్రవర్తులు కావాలనీ, రెండు – తాము వివాహం చేసుకొన్న పురుషుడెంత మహోత్తముడైనా ఆయన చక్రవర్తి కాకూడదనీ, మూడు– రాజ్యార్హుడైన తన కుమారుడు రాజ్యం వహించే ముందు కాకతీయ వంశానికి దత్తుడు కావాలనీ "[3] కోరుతాడు.

---

1. హిమబిందు – అడివిబాపిరాజు, పు: 109–111.
2. అంశుమతి " పు: 5.
3. గోనగన్నారెడ్డి " పు: 244.

అందుకు రుద్రమదేవి ఇలా ప్రతిజ్ఞ చేసింది. "నాన్నగారూ! నేను పితృపాదులకూ, నా చక్రవర్తికీ, సర్వదేవతల సాక్షిగా నేను తండ్రిగారికి వారసులుగా చక్రవర్తిని అవుతాననీ, నేను వివాహం చేసుకున్న పురుషుడు చక్రవర్తి కాడనీ, నా కుమారుడు కానీ, నేను దత్తు చేసుకొన్న బాలుడు కానీ కాకతీయ వంశజుడౌతాడనీ, నేను కాకతీయ వంశంగానే ఉంటాననీ మాట ఇస్తున్నాను. ఇది నేను ఆడితప్పితే ఏడేడు కాలాలు నరకంలో ఉండగల దాన్ని, కాశిలో గోవును చంపినదాన్ని, గురుహత్య చేసిన దాన్ని, బ్రాహ్మణ ధనం దోచిన దాన్ని"[1] అని గంభీరంగా పలికింది.

ఈ విధంగా బాపిరాజు గారు తమ నవలల్లో అనేక రకాలైన సాంస్కృతిక పరిస్థితులను వివరించి, ఆ నాటి సంఘ సంస్కృతిని మనముందు ఆవిష్కరించారు.

**5.1.4. అడివి బాపిరాజుగారి చారిత్రక నవలల్లో మత పరిస్థితులు:**

**5.1.4.0. ప్రవేశిక:** 'మతం' అంటే అభిమతం. అంటే ఇష్టం. అన్నిమతాల సారం ఒకటే. అదే మానవసేవ. మతం ఏదైనా అందరూ మానవులే. పరమత సహనం ఉండాలన్న భావన ప్రతి మనిషిలోనూ ఉండాలి. ఎవ్వరు ఏ మతాన్ని అవలంబించినా ప్రతి ఒక్కరూ ఇతరుల అభిమతాన్ని సమర్థించి 'వసుధైక కుటుంబకమ్' అన్న అవగాహనతో జీవిస్తే సమాజం సుఖసంతోషాలతో వర్ధిల్లుతుంది. "సర్వత్ర సుఖిన స్సంతు లోకా సమస్తా సుఖినోభవంతు" అనే ఉన్నత కామనలు నిజమౌతాయి.

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 244.

నేటి సమాజం ఆరకంగా లేదు. మతం ప్రజల పాలిట నల్ల మందు అని మార్క్స్ అన్నట్లు మతమౌఢ్యంలో చిక్కుకొని శ్లేషంలో పడ్డ ఈగలా అటు చావలేక, ఇటు బ్రతుక లేక కొట్టుమిట్టాడుతూ ఉన్నాడు ఆధునిక మానవుడు. మతాన్ని గురించి ప్రాచీనుల అభిప్రాయాన్ని గమనిస్తే "ప్రపంచంలో ప్రాచీన మత గ్రంథాలలో కూడ ఆశ్చర్యకరమైన ఏకరూపత గోచరించుచున్నది.

"క్రియతాం ధర్మ సర్వస్వ కృత్వా చైతావ ధారయేత్
ఆత్మనః ప్రతికూలేన పరేషం న సమాచరేత్" (వేదవ్యాసుడు)

"నీకు ఏది బాధను కలిగించునో దానితో నీవు
ఇతరులను బాధించ వద్దు" (బౌద్ధ మతం)

"నిన్ను నీవు అభిమానించు కొన్నట్లే నీవు
ఇతరులను కూడా అభిమానించుము" (ఇస్లాం)

"ఇతరులు నీకు ఏమి చేయవలెనని కోరుకొంటావో
దానినే నీవు పరులకు చేయుము" (క్రైస్తవ మతం)"[1]

సర్వమతాల సారం ఈ రకంగా ఒక్కటే అని ప్రబోధించినా ఆశ్చర్యకరంగా అనేకులు మూర్ఖంగా ఇతర మతాల కంటె తమ మతమే గొప్పదని వ్యర్థంగా వాదిస్తుంటారు. మతాన్ని మారణహోమంగా మారుస్తారు. రాజా రామమోహన రాయ్ గారు "మతం వ్యక్తి అభీష్టాన్ని బట్టి ఉండడం

1. జాతీయ స్థాయిలో ఉపాధ్యాయ శిక్షణా కార్యక్రమం
రా.ప్ర. విద్యా పరిశోధన శిక్షణా సంస్థ - ఆంధ్రప్రదేశ్ వారి మాడ్యూల్., పు: 128, 129.

అవసరం. కానీ ఇప్పుడైనా అప్పుడైనా సమాజ శాసనానికి అప్పుడప్పుడు రాజ శాసనానికి లోబడే ఉంటుంది... రాజకీయం వీనిలో మహత్తర పాత్ర వహిస్తుంది. వ్యక్తుల క్షేమంకంటె సంఘ ప్రయోజనం ప్రధానంగా చూడ బడుతున్నది"[1] అంటారు.

భారతదేశంలో ప్రాచీనకాలంనుండి ప్రసిద్ధి పొంది నిలదొక్కు కున్నది వైదికమతం. అది కూడా అప్పుడప్పుడూ వెర్రి తలలు వేసి, వైదిక మత శాఖలైన శైవ వైష్ణవ మతాలు ఒకదానితో ఒకటి పోటీపడి తమ ఉని కిని చాటి చెప్పేందుకు, దేనికైనా తెగించే నీచస్థితి కూడా సమాజంలో ఒకనాడు ఏర్పడింది. ఆ సమయంలోనే తిక్కనలాంటి మహాకవులుద్భవించి శివకేశవులకభేదం కల్పించి మతసామరస్యానికి ఎంతో కృషి చేశారు. ఈ శతాబ్దంలో రాజా రామమోహనరాయ్, వీరేశలింగం పంతులు, రవీంద్రనాథ ఠాగూర్, స్వామి వివేకానంద మొదలైన వారందరూ మత సామరస్యానికి ఎంతో కృషి చేశారు. ఆ త్రోవనే అడివి బాపిరాజు, బృందావన్‌లాల్ వర్మ గార్లు తమ చారిత్రక నవలల్లో అనేకచోట్ల మతం మంచిచెడులను చర్చించి మత సామరస్యాన్ని ప్రబోధించారు.

మహాకవి గురజాడ –

"యెల్లలోకము ఒక్క యిల్లై వర్ణభేదములెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము వేడుకలు కురియ
మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును"[2] అని ప్రబోధం చేశారు.

1. కాకతీయులనాటి సామాజిక జీవితం — మలయశ్రీ, పు:142.
2. ముత్యాలసరములు– గురజాడ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ –1972, పు:4.

స్థాలీ పులాక న్యాయంగా బాపిరాజు గారి చారిత్రక నవలల్లోని మత పరిస్థి
తులను గురించి పరిశీలిద్దాం.

**5.1.4.1. మత పరిస్థితులు :** హిమబిందు కథాకాలం శాతవాహన యుగం
ఆనాడు బౌద్ధ, వైదిక మతాలు రెండూ వ్యాప్తిలో ఉన్నాయి. చక్రవర్తులు
బౌద్ధ మతాన్ని అనుసరించినా రెండు మతాలను సమాన గౌరవ ప్రతిపత్తుల
తోనే చూచేవారు. నవలలో శ్రీముఖ శాతవాహనుడు, శ్రీకృష్ణ శాతవాహ
నుడు బౌద్ధులు. చక్రవర్తులు బౌద్ధమతం పాటిస్తూ వైదిక మతాన్ని ఆదరించినా
వైదిక మతం క్రమక్రమంగా క్షీణిస్తుందేమో అన్న అభిప్రాయంతో మహామేధావి,
ఆర్షమతాభిమాని అయిన స్థాలతిష్యుడు బౌద్ధ మతాన్ని సర్వనాశనం చేసి,
క్షీణిస్తున్న వైదిక మతాన్ని పునరుద్ధరించడానికి పూనుకొంటాడు. సుశర్మ
మొదలైన రాజులతో కలసి కుట్ర పన్ని మంజుశ్రీని అపహరించి ఆర్షమతాను
సారం శిక్షణ ఇప్పించి, ఎలాగైనా సింహాసనం ఎక్కించి మరలా వైదిక
మతాన్ని పునరుద్ధరించాలనుకొంటాడు. శ్రీకృష్ణ శాతవాహనుణ్ణి సింహాసనం
ఎక్కనీయకుండా చంపివేయడానికి, తన మనుమరాలైన చంద్రబాలనే
విషకన్యగా మార్చి శ్రీకృష్ణ శాతవాహనునిపై ప్రయోగించాలనుకొంటాడు.
కానీ అతడీ రెండు ప్రయత్నాలలో విఫలుడౌతాడు.

బాపిరాజు గారు ఆర్షమతానికి ప్రతినిధిగా స్థాలతిష్యుని,
అతని కుమారుడు అమృతపాదార్హాతులను బౌద్ధమత ప్రతినిధిగా చూపి,
తండ్రీ కొడుకుల మధ్య మత చర్చకు అవకాశం కల్పించారు. అమృతపాదార్హా
తుడే తన కుమారుడని స్థాలతిష్యునికి మొదట తెలియదు. స్థాలతిష్యుడే

తన తండ్రి అని అమృత పాదార్హతులకు తెలియదు. ఇద్దరి మధ్య జ్ఞానయుద్ధం జరుగుతుంది. ఆ సమయంలో స్థాలతిష్యుడు అమృత పాదార్హతులే తన కుమారుడని గుర్తించి తల పగులగొట్టి, శస్త్ర చికిత్స చేసి పూర్వస్మృతిని రప్పిస్తాడు. తర్వాత ఇద్దరూ ఒకటవుతారు. రాజు కూడా వైదిక బౌద్ధ ధర్మాలు పరస్పర పూరకాలని అంగీకరిస్తాడు.

ఈ నవలలో బౌద్ధ మతం, హిందూ మతంలోంచి కారకాంతరాల వల్ల పుట్టిందేనని, ఆ రెండింటి తత్వాలు ఒకటేనని రాజుగారు ప్రతిపాదించారు. పాత్రపరంగా ఇందులోని చమత్కారాన్ని తుమ్మలపల్లి - రామలింగేశ్వరరావు గారు ఈ రకంగా అభివర్ణించారు. "వైదిక మతమునకు స్థాలతిష్యుని, బౌద్ధ మతమునకు అమృత పాదుని సంకేతములుగా గ్రహించుట యందొక చమత్కారమున్నది. వారు తండ్రీకొడుకులు. ఈ రెండు మతములకు సంబంధమట్టిదే. తన పూర్వస్మృతి, సంస్కృతి నేపథ్యం లేనివాడు అమృత పాదుడు. ఇదియూ బౌద్ధమత విషయమున సమంజసమే."[1]
శ్రీకృష్ణ శాతవాహనునికి స్థాలతిష్య మహర్షి వైదిక పద్ధతి ప్రకారం, అమృత పాదార్హతులు బౌద్ధమత సూక్తుల ప్రకారం మంత్రాలు పఠించి, చక్రవర్తిగా పట్టాభిషిక్తుని చేస్తారు. "ఐతరేయ బ్రాహ్మణమనుసరించి స్థాలతిష్య మహర్షి సార్వభౌమ పట్టాభిషేకమొనర్చి, సార్వభౌమ కిరీటములు వారి తలలపై నుంచెను. మహదాశీర్వచనము, సుమంగళుల హారతియు జరిగినవి. ధమ్మ సూత్రముల ననుసరించి బౌద్ధార్హత శిరోమణి అయిన

1. 'నాదబిందు' - హిమబిందు నవలలో బాపిరాజు గారు చేసిన బౌద్ధ హిందూమత విశ్లేషణ - తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు., పు: 35.

అమృతపాదులు చక్రవర్తికి అభిషేకము చేసెను." [1] దీనిని బట్టి చక్రవర్తి రెండు మతాలను సమదృష్టితో ఆదరించాడని అర్థమౌతుంది.

మహాశిల్పియైన ధర్మనంది కుటుంబంలోని వారందరూ బౌద్ధ మతావలంబులై బుద్ధుని ఆరాధిస్తుండగా, సువర్ణశ్రీ చెల్లెలైన నాగబంధునిక మాత్రం వైదిక మతం అవలంబిస్తుంది. ఆమె బౌద్ధ మత గ్రంథాలైన త్రిపిటకాల పట్ల అనాదరం చూపుతుంది. వైదిక మత గ్రంథాలైన రామాయణ, మహాభారతాలను ఆసక్తితో పఠిస్తుంది. దీనిని బట్టి ఒక కుటుంబంలోనే ఇరుమతాల వారు ఉన్నారనీ, ఆనాటి ప్రజలకు మతస్వేచ్ఛ ఉన్నదనీ తెలుస్తుంది. రాజుగారు ఈ నవలలో ఆనాడు ప్రచారంలో ఉన్న వైదిక, బౌద్ధ మతాలను చక్కగా విశ్లేషించి, రెండింటికి అభేదం కల్పించి రెండు మతాల మధ్య సముచిత సమన్వయాన్ని సాధించార

2. **అడవి శాంతిశ్రీ :** శాతవాహనుల పరిపాలన అంతరించిన తర్వాత భిన్నాభిన్నమైన ఆంధ్ర సామ్రాజ్యాన్ని పరిపాలించిన వారిలో ముఖ్యులు ఇక్ష్వాకులు. వీరిలో శాంతిమూలుడు ప్రథముడు. ఇతని కుమారుడే వీరపురుషదత్తుడు. నాయిక అడవి శాంతిశ్రీకి శాంతిమూలుడు తండ్రి, వీరపురుషదత్తుడు సోదరుడు. తండ్రి వైదిక మతావలంబి. కుమారుడు బౌద్ధమతాన్ని ప్రోత్సహించాడు. "ఈ వంశీయులలో మొదటి వాడైన వాసిష్ఠీ పుత్ర శాంతమూలుడు వైదిక మతోద్ధారకుడు మాఠరీ పుత్ర శ్రీవీర-పురుషదత్తుడు వైదిక మతాన్ని వదలి బౌద్ధాన్ని స్వీకరించి దాని వ్యాప్తికి

1. హిమబిందు - అడవి బాపిరాజు., పు: 475.

పాటు పడ్డారు."[1] చక్రవర్తియైన శాంతిమూలుడు వైదిక మతాన్ని అవలంబించినా బౌద్ధ మతం పట్ల ద్వేషభావమేమీ లేదు. రెండు మతాలను సమదృష్టితో చూచినట్లు బాపిరాజు గారు పేర్కొన్నారు. ఆయన కాలంలో రాణులకు, రాణి వాసపు స్త్రీలకు, రాజ వంశానికి చెందినవారికి, పుర ప్రజలకు అందరికీ మత విషయంలో సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండేది. చారిత్రకంగా కూడా శాంతి మూలుడు వైదిక మతావలంబియైనా "ఆతని చెల్లెండ్రు, కుమార్తెలు బౌద్ధమతంపై ఆసక్తి చూపేవారు. వీరు బౌద్ధమతాన్ని ఆదరించి, పోషించి, విహారాలను నిర్మించారు. నాగార్జున కొండ యందు లభించిన శాసనాలు ఇందుకు తార్కాణం."[2] బాపిరాజు గారు తమ నవలలో ఇలా రాశారు. "తండ్రి బౌద్ధుడు, కుమారుడు శైవుడు, తల్లి జైనధర్మ పరురాలు. కోడలు ఒకవైపు బౌద్ధ చైత్యానికి ఆయక స్తంభం వేయిస్తుంది. వేరొక ప్రక్క స్కంధ పూజలు చేయిస్తుంది."[3]

అడవి శాంతిశ్రీ నవలలో నాయకుడైన బ్రహ్మదత్తుడు వైదిక మతావలంబి. నాయిక శాంతిశ్రీ బౌద్ధ మతాభిమాని. వీరిద్దరికీ వివాహం చేసి బాపిరాజు గారు ఆర్ష బౌద్ధ మతాల సమన్వయాన్ని సాధించారని చెప్పవచ్చు. 'హిమబిందు'లో ఈ రెండు మతాలకు జన్య జనక సంబంధాన్ని ప్రతిపాదిస్తే, 'అడవి శాంతిశ్రీ'లో దాంపత్య సంబంధాన్ని సృష్టించి ఆర్ష బౌద్ధ మతాల సామరస్యాన్ని సాధించడంలో బాపిరాజు గారు కృతకృత్యులయ్యారు.

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - K.N. శాస్త్రి, పు: 99
2. పైదే., పు: 127.
3. అడవి శాంతిశ్రీ - అడివి బాపిరాజు, పు: 103

వీరపురుష దత్తుడు మొదట వైదిక మతాభిమాని అయినా రాజ్యాధికారానికి వచ్చిన తరువాత బౌద్ధమతాన్ని ఎక్కువగా ఆదరించినట్లు అనేక చారిత్రకాధారాలున్నాయి.

"నాగార్జున కొండలో దొరికిన ఒక శిలాఫలకముపై ఒకరాజు శివలింగమును తన పాదముల క్రింద త్రొక్కుచున్నట్లు శిల్పింప బడినది. ఈ సన్నివేశము వీరపురుష దత్తునికి సంబంధించినదిగా శిల్ప శాస్త్రజ్ఞు లెన్నుచున్నారు."[1]

"రాజు బుద్ధుని వద్ద సాష్టాంగ ప్రణామం చేస్తాడు. రాజు తన కాలితో శివలింగాన్ని త్రోసివేస్తూ ఉంటాడు"[2]

పై రెండు శిల్పాలు నాగార్జున కొండలో వీరపురుష దత్తుడు చెక్కించిన శిల్పాల్లోనివని తెలుస్తున్నది.

'అడివి శాంతిశ్రీ' నవలలో వీరపురుషదత్తుడు ఉపనాయకుడు. బ్రహ్మదత్తుడు నాయకుడు. కాబట్టి బాపిరాజు గారు ఉపనాయకునికి సంబంధించిన ఈ చారిత్రక సత్యాల చిత్రణపై నవలలో అంత శ్రద్ధ చూపలేదు.

'అడవి శాంతిశ్రీ' నవలలో బాపిరాజుగారు ఆచార్య నాగార్జునుల వారిని అద్వితీయ ప్రతిభాశాలిగా, మహామేధావిగా వర్ణించారు. బౌద్ధ ఆర్ష మతాలకు సమన్వయాన్ని సాధిస్తూ నాగార్జునాచార్యులు మాధ్యమిక వాదాన్ని ప్రతిపాదించారని రాజుగారు పేర్కొన్నారు. కొందరి అభిప్రాయానుసారం శంకర భగవత్పాదుల మాయావాదానికి మాధ్యమిక వాదమే మూలం. మాధ్యమిక

---

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర – ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం
,, ,, బాలేందుశేఖరం., పు: 126, 127.

2. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర – పటుకూరి బలరామమూర్తి., పు: 42.

వాదం వివిధ మతానుయాయుల్ని బాగా ఆకర్షించింది. రాజుగారు నాగార్జునాచార్యులను గురించి, వారి బోధనలను గురించి ఇలా రాశారు. "ఆంధ్ర దేశం అంతటా సర్వమత వ్యాప్తమై కలకలలాడి పోతున్నది. బోధిసత్వ నాగార్జున దేవుని బోధనలు ఆర్ష ధర్మ పరులైన బ్రాహ్మణ పండితులకూ నచ్చినవి. వారు కూడ తమ దర్శన వ్యాఖ్యానాల యందు నాగార్జున దేవుని వాదనలనేకం నేర్చుకున్నారు."[1] "నాగార్జునుని బౌద్ధమతం వారు బుద్ధుని అవతారంగాను, ఆర్ష మత వాదులు శివుని అవతారంగానూ భావించే వారట. ఆ మహా భాగుని నామం తెలియని భూభాగం ఈ జంబూ ద్వీపంలో ఎక్కడా లేదు."[2]

ఈ విధంగా బాపిరాజు గారు అడవి శాంతిశ్రీ నవలలో చాలా చోట్ల మత ప్రస్తావనలు తెచ్చి బౌద్ధ ఆర్ష మతాల సమన్వయానికి, తద్వారా మత సామరస్యానికి కృషి చేశారు.

'అంశుమతి' నవలికలో మతం గురించి రాజుగారు ఎక్కువగా ప్రస్తావించ లేదు. బహుశ ఈ నవలిక ఉన్నత పాఠశాల విద్యార్థులకు పఠనీయ గ్రంథ మవడానికి అనువుగా రచించడం కొంతవరకు కారణం కావచ్చు.

"కుబ్జ విష్ణువర్ధనుని కాలంలో యువాన్ చ్యాంగ్ అను చీనా యాత్రికుడు ఆంధ్ర దేశమున పర్యటించి అప్పటి స్థితి గతులను తన యాత్రా చరిత్రయందు చక్కగ వివరించి యున్నాడు. అప్పుడు బౌద్ధమతము క్షీణదశ యందుండెననియు, జైన, హిందూ ధర్మము లభ్యుదయ మందుండెననియు

---

1. అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు., పు: 164.

2. పైదే., పు 164.

తెలియ వచ్చు చున్నది."

"చాళుక్యులు వైదిక మతానుయాయులు. వీరి కాలం నాటికి జైన బౌద్ధ మతాలు నశించాయి. వైదిక మతోద్ధరణకు చాళుక్యరాజులు అనేక దేవాలయాలను నిర్మించి, ఘటికాస్థానముల నెలకొల్పి కవి పండితులను ఆదరించారు."[2]

ప్రథమ విష్ణుకుండిన చక్రవర్తి "మాధవవర్మ వైదిక మతాన్ని ఆదరించే వాడని, అతను గోదావరీ తీరాన 'గోదేవి' ఆలయాన్ని ప్రతిష్ఠింప చేశాడనీ. అతడు గ్రామ సంచారం చేసేటప్పుడు దేవాలయాల్లో, జైనాలయాల్లో, బౌద్ధ సంఘారామాల్లో పూజలు జరగడం చూశాడనీ"[3] బాపిరాజు గారు రాశారు.

అంశుమతి నవలికలో ఎక్కువ మత ప్రస్తావన లేకున్నా చారిత్రకాధారాలను బట్టి వైదిక మతమే ప్రాచుర్యంలో ఉన్నట్లు స్పష్టమౌతుంది.

గోనగన్నారెడ్డి నవలలోనే కాక కాకతీయ కథాకాలం నాటికి ఆంధ్ర దేశాన ప్రాచీన మతాలైన జైన, బౌద్ధ మతాలు పూర్తిగా నశించడం, శైవ, వైష్ణవ మతాలు ప్రబలమవడం సంభవించింది. బౌద్ధమత స్థాపకుడైన గౌతమ బుద్ధుని. శ్రీ మహావిష్ణువు దశావతారాల్లో ఒక అవతారంగా అంగీకరించి పూజించడం జరగడం వల్ల క్రమంగా బౌద్ధమతం హిందూమతంలో లీనమయింది. కాని జైనమతం దీనికి విరుద్ధంగా కాకతీయ రాజ్యారంభం నాటికి

---

1. 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సంస్కృతి' - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం, పు: 210.
2. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - B.N. శాస్త్రి., పు: 330.
3. అంశుమతి - అడివి బాపిరాజు., పు: 15, 16.

బలమైన శక్తిగా ఉన్నదనడానికి నిదర్శనాలున్నాయి. " కాకతీయ ప్రభువులు మొదట జైన మతమునే యాదరించిరి. వారి కులదైవమగు కాకతి కూడా జైన దేవతే అయి యుండవచ్చును. కాని శైవమత మాంధ్ర దేశమున వ్యాపించి నప్పుడు కాకతీయులు తన్మతావలంబకులైరి."[1] గణపతి దేవ చక్రవర్తి కాలానికి వీరశైవం విశృంఖలంగా వర్ధిల్లింది. చక్రవర్తులు కూడ శైవ మతాన్నే అభిమానించారు.

" గణపతి దేవునకు విశ్వేశ్వర శివాచార్యుడను గొప్ప శైవుడు గురువుగ నుండి ఉపదేశము చేసి దీక్ష నొసంగినట్లు తెలియుచున్నది. గణపతి-దేవుని కాలమున ప్రథమ పర్యాయ మాంధ్ర దేశమున మందర గ్రామమందు గోళకీ మఠమను నొక సంస్థ స్థాపింప బడెను. ఇయ్యది శైవమత ప్రచారము కొరకును, శైవగ్రంథ శోధనము నకును ఏర్పడిన యొక మత కేంద్రము. గణపతి దేవుడును, అతనికుమార్తె రుద్రాంబయును కూడ ఈ మఠమునకై గ్రామముల దానము చేసిరి. కాకతీయులీ విధముగ శైవమతము నందభిమానము చూపినను, పరమతముల ద్వేషించినట్లు గానీ, తన్మతానుయాయుల బాధించినట్లు కాని కానరాదు."[2]

ఈ కాలంలోనే శైవమతాన్ని అమితంగా ఆరాధిస్తూ, జైన బౌద్ధ మతాలను, వైష్ణవ మతాన్ని నిరసిస్తూ మల్లికార్జున పండితుడు వెలిశాడు. జైన, బౌద్ధ పండితులను అనేకులను ఓడించాడు. " ఒక బౌద్ధ పండితునికి, మల్లికార్జున పండితారాధ్యునకు తీవ్ర వాగ్వివాదం జరిగింది. దూషణ ప్రతి దూషణలతో సభ అంతమైంది."[3] దీనికి కోపించిన మల్లికార్జుని శిష్యులు బౌద్ధమత గురువును

ఆంధ్రుల చరిత్ర - సం: - ఆచార్య ఖండవల్లి
2. పైదే., పు: 301, 302.
3. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - ఏటుకూరి బలరామమూర్తి., పు: 119.

దారుణంగా హత్యచేశారు. ఈ సంగతి తెలిసి "రాజు పండితారాధ్యుని కళ్ళు ఊడబెరికించాడు."[1] ఈ ఉదంతం ద్వారా ఆనాటి మత ప్రచారకులు ఎట్టి హింసాత్మక పద్ధతుల నవలంబించెడి వారో తెలుసుకోవచ్చు. "అదే కాలంలో కన్నడ దేశంలో బసవయ్య కూడ బిజ్జలుని సంహరించి వీరశైవ మత ప్రచారానికి పూనుకొన్నాడు."[2] "ఈ పండితారాధ్యుడు శివతత్వ సారము అను గ్రంథాన్ని వ్రాశాడు. గ్రంథం అంతా శివభక్తిని వర్ణిస్తుంది."[3] ఈ విధంగా గణపతి దేవ చక్రవర్తుల కాలంలో, రుద్రమదేవి కాలంలో అన్ని మతాల కంటె శైవ మతమే ప్రాబల్యంలో ఉందని తెలుస్తుంది. బాపిరాజు గారు కూడ తన నవలలో శైవ మతానికే ప్రాధాన్యం ఇచ్చి పెద్ద పీట వేసినారని అక్కడక్కడ అతని వర్ణనల ద్వారా తెలుస్తున్నది. ఒక ప్రక్క సర్వ మతాలను ఈ చక్రవర్తులు (గణపతి దేవుడు, రుద్రమదేవి) ఇద్దరూ సమానంగా ఆదరించారని చెప్తూ, బాపిరాజుగారు వీరశైవమతమే ప్రబలంగా ఉందని అర్థమయ్యేటట్లు కొన్ని కల్పనలతో బాటు చారిత్రక సత్యాలను వ్యక్తీకరిస్తూ, "శైవమత రహస్యాలన్నీ సమన్వయించి గురు మల్లికార్జున పండితారాధ్యులు శివతత్వ సారమనే గ్రంథంగా రచించాడు. దేశమంతటా వీరశైవ మత ప్రచారమొనర్చెను."[4] ఆనాటికి బౌద్ధమత ప్రాబల్యాం నశించి పోలేదు. వైష్ణవ మతమూ పూర్తిగా ఉన్నది. జైన మతము నశించి పోలేదు.

సోమనాథ కవి ఆ పండితుని
మల్లికార్జునారాధ్యుని శిష్యుడైన

1. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర — ఏటుకూరి బలరామమూర్తి, పు: 119
2. పైదే., పు: 119.
3. పైదే., పు: 120.
4. గోనగన్నారెడ్డి — [illegible], పు: 135.

చరిత్రమూ ..... మొదలైన గ్రంథాలెన్నో కూడ ఈ సోమనాథుడు రచించినాడు.[1]

"వీరశైవులకు ఏమి పరమత సహనము లేదు. బ్రాహ్మణులను, వైష్ణవులను, బౌద్ధులను, జైనులను, చార్వాకులను వీళ్ళు కంఠోక్తిగా దూషిస్తూ, బాధిస్తూ, ఒక్కొక్కప్పుడు హతమారుస్తూ ఉండిరి."[2] కాని "శ్రీ గణపతి రుద్రదేవ మహా ప్రభువులు గాని, శ్రీ రుద్రదేవ ప్రభువు గాని ఏ మాత్రమూ ద్వేషం లేకుండా పరమత సహనం చూపుతూ ఉండిరి."[3]

శైవులకు పవిత్ర దినమైన శివరాత్రి నాడు గణపతిదేవ చక్రవర్తి లింగైక్య మందినట్లు బాపిరాజు గారు రాశారు. శాలివాహన శకం 1185 రుధిరోద్గారి సంవత్సర మాఘ బహుళ చతుర్దశి రాత్రి శివరాత్రి పుణ్యకాలంలో ...... మోము వెలిగి పోతున్నది.[4]

రుద్రమదేవి రక్షణకై వెళ్ళిన చాళుక్య వీరభద్రుని సైన్యం హరిహార దేవుల సైన్యం పై విరుచుకు పడింది. "వీర భద్రునితో గ్రామ వీరభద్రుడు, వీర ముష్టులు అశ్శరభ శరభా అనుచూ ఒళ్ళు తెలియని ఆవేశంతో హరిహర దేవుని సైన్యముపై బడినారు."[5] ఆవేశంలో ఉన్న శివభక్తులు 'అశ్శరభ శరభా! అల్లల్ల వీరా!' అంటూ ఉత్సాహాన్ని ప్రకటించడం నేటికీ మనం చూస్తుంటాము.

శివదేవయ్య మంత్రిని కూడా శైవమతస్థుడుగా, గోళకీ మఠాచార్యుడుగా

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు, పు: 135.
2. పైదే, పు: 135.
3. పైదే, పు: 135.
పైదే, పు: 266.
. పైదే, పు: 328.

అనేక శైవ గ్రంథాలు రచించినట్లుగా రాజుగారు పేర్కొన్నారు. ఈ విధంగా గోన గన్నారెడ్డి నవలలో ఎన్నో సందర్భాల్లో రాజుగారు మత ప్రస్తావన తెచ్చి చివరకు సర్వమతాలు ఒకటేనని చాటి చెప్పారు. రాజుగారు తమ ఉద్దేశ్యాన్ని శివదేవయ్య మంత్రిద్వారా ఇలా చెప్పిస్తారు. "మహారాజా! అనేక కోట్ల కృత యుగాలలో ఒక మహా పవిత్ర కృత యుగం ఉద్భవిస్తుంది. ఆ కాలంలో శైవ, బౌద్ధ, జైన, వైష్ణవ మతాలుండవు. మ్లేచ్ఛులు, ఆర్యులు, దస్యులు, అసురులు అనే తేడాలుండవు. పేదలూ, ధనవంతులూ ఉండరు. పాలించిన వారూ, ప్రజలూ అనే వర్గాలుండవు. అభిమానం, గర్వం, అహంకారము, ఆశ, క్రోధము, కామం, లోభం, మదం, మోహం, మాత్సర్యం ఏమి ఉండవు. మానవులప్పుడు దేవతలై పరతత్వం చేరుతారు ప్రభూ!"[1] ఈ విధంగా దేశం సుభిక్షంగా ఉండాలని రాజుగారు కలలుగన్నారు. ఒక్క అంశుమతి నవలికలో తప్ప తక్కిన మూడు చారిత్రక నవలల్లో బాపిరాజుగారు మతాన్ని గురించి, మత వాదాలను గురించి విశ్లేషించడమే కాకుండా మానవత్వం మతంకన్నా గొప్పదని ప్రబోధించారు.

**5.1.5. అడివి బాపిరాజు గారి చారిత్రక నవలల్లో ఆర్థిక పరిస్థితులు:**

**5.1.5.0. ప్రవేశిక:** రాజ్య స్థిరత్వానికి ప్రజల సుఖ జీవనానికి ఆర్థిక పరిస్థితులే మూలాధారం. దేశ ఆర్థిక వ్యవస్థ పటిష్ఠంగా ఉండాలంటే వాణిజ్యం, వ్యవసాయం, చేతి పనులు మొదలైనవి పటిష్టంగా ఉండాలి. ఆర్థిక ఆదాయానికి పంటలు, వాణిజ్యం ముఖ్యాధారాలు. వివిధ వృత్తుల వారు ఉత్పత్తి చేసే వస్తువుల

1. గోనగన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు: 330.

ద్వారా రాజ్యానికి ఆదాయం లభిస్తుంది. అడివి బాపిరాజు గారు తన చారిత్రక నవలల్లో ప్రస్తావించిన ఆర్థిక పరిస్థితుల్ని గురించి తెలుసుకొందాం

**5.1.5.1. ఆర్థిక పరిస్థితులు :** 'హిమబిందు' నవల శాతవాహనుల కాలం నాటిది. ఆ కాలంలో ఒక వృత్తికి చెందిన ప్రజలంతా ఒక సంఘంగా ఏర్పడేవారు. ఆ సంఘాధ్యక్షుడు ఆ సంఘ సభ్యుల అవసరాలను చూచుకొనేవాడు. శాతవాహనుల కాలంలో విదేశాలతో భారత దేశానికి వాణిజ్య సంబంధం బాగా ఉండేది. "ఆంధ్ర వర్తకులలో కాశ్మీరముతో వర్తకము చేయువారు కాశ్మీర వణిజులు. గాంధారముతో వర్తకము చేయువారు గాంధార వణిజులు. కీర్తిగుప్తుడు నానాదేశ వణిజుడని పేరు పొందినాడు. అతనికడ కాశికులు, మాద్రులు, కాశ్మీరులు, గాంధారులు, మాళవికులు మొదలైన వర్తకులు ఎందరో ఉండిరి."[1] "అతడు గాంధారమునుండి ఔత్తర పథమున పారశీక, బాహ్లిక, తరుష్క, కాంభోజ, కశ్యప, సముద్ర, యవన దేశాలతో వర్తకం చేయుచుండెను."[2]

ఆంధ్రదేశం ప్రాచీన కాలాన్నుండి పాడి పంటలకు ప్రసిద్ధి గాంచింది. రైతులు తమ పొలాల్లో దైనిక జీవితానికి అవసరమైన ప్రతి ధాన్యాన్నీ పండించేవారు. కృష్ణ, గౌతమి నదుల మధ్య ఉండే సారవంతమైన భూములు వరి, జొన్న మొదలైన పంటలతో కన్నుల పండుగగా ఉండేవి. సెనగలు, పెసలు, కందులు, మినుములు, నువ్వులు మొదలైన పప్పుధాన్యాలు, ములగ, బీర

1. హిమబిందు — అడివి బాపిరాజు, పు: 125.

2. పైదే., పు: 126.

పొట్ల, బెండ, దొండ, బుడమ, కాకర, గుమ్మడి, దోస మొదలైన కూర గాయలను ఆంధ్రులు పండించేవారు. ఈ కూరలంటే వీరికి ప్రాణం.

ఈ కాలంలో ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవించేవారు. "ఆంధ్రదేశమునందున్న ధాన్యపు బంట జంబూద్వీపంలో మరెచ్చటనూ లేవు. అందుకే ఆంధ్ర రాజధానికి 'ధాన్యకటకము' అను పేరు వచ్చినది."[1]

శాతవాహనుల కాలంలో నేత పనివారు కూడా నిశిత నైపుణ్యంతో సాలెగూళ్ళ వంటి సన్నని వస్త్రాలు నేసి, విదేశీయులను సహితం ఆకర్షించి నందువల్ల అవి విదేశాల్లో విస్తారంగా అమ్ముడుపోయి విదేశీయుల ఆదాయం భారతదేశానికి లభిస్తుండేది. "ప్లినీ, రోమక శాసనసభల్లో రోమక యువతులు సహజమైన సిగ్గు విడచి భారతదేశం నుండి దిగుమతియైన గాలిలో నేయబడిన సాలెగూళ్ళ వంటి సన్నని వస్త్రములను ధరించి తిరుగాడు తున్నారనియు, అపారమైన సువర్ణ ప్రవాహము తత్ఫలితముగా భారతదేశము చేరుచున్నదనియు వాపోయెను."[2] ఈ విషయాన్ని రాజుగారు హిమబిందు నవలలో ప్రస్తావించినారు. "ఉత్తరాంధ్ర దేశపు సన్నని దుకూలములు చిరు మబ్బుల వలె గాలికి తేలిపోవు చున్నవి."[3]

ఈ విధంగా శాతవాహనుల కాలంలో ఆంధ్రులలో వాణిజ్యం, వ్యవసాయం, నేత పని వంటి వృత్తులు పుష్కలంగా అభివృద్ధి చెందినందువల్ల ఆనాటి ఆర్థిక పరిస్థితి ఎంతో ఉచ్ఛదశలో ఉండేదని తెలుస్తున్నది.

---

1. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 225.
2. ప్రాచీన దక్షిణ భారత చరిత్ర — డా॥ నందూరి రామకృష్ణమాచార్య., పు: 93.
3. హిమబిందు — అడివి బాపిరాజు., పు: 39.

ఇక్ష్వాకుల కాలంలో కూడా ప్రజలు ఆర్థికంగా శాతవాహనుల కాలంలో వలెనే ఉండేవారు. శాంతిమూలుడు ప్రజలకు అనేకవేల హలాలు పంటపొలాల్ని, గోవుల్ని, నాగళ్ళను దానం చేసి వ్యవసాయానికి ప్రోత్సాహమిచ్చాడు. ఇక్ష్వాకుల కాలంలో కూడా నేతపని ఒక పరిశ్రమగా అభివృద్ధి చెందిందని, వర్తక వ్యాపారాలు స్వదేశంలోనూ, విదేశంలోనూ విరివిగా సాగేవని తెలుస్తోంది. "భరుకచ్ఛం కోటలో యవనులకు, రోమకులకు, పారశీకులకు, యూదులకు వర్తకం చేసుకొనే మహా భవనాలున్నాయి."[1]

"ఆంధ్ర నేతపని లోకప్రఖ్యాతము. అన్ని కుటుంబాల వారు వడికే వారు సర్వసాధారణంగా ఆంధ్రులు వడికిన నూలు సాలిపురుగు దారాలకన్నా సన్నంగా, ఉక్కు తీగలకన్నా బలంగా ఉండేది. కొన్ని మడతలపెట్టి కట్టుకొన్నా ఒళ్ళు కనబడేది. ఆంధ్ర స్త్రీలు వడికిన వలువలలో.... వస్త్రాలు లాటి విలాతుల వారు ఎగనెత్తుకు పోయేవారు.... ధాన్యకటకము, విజయపురి మొదలైన మహాపురాలలో ఈ వస్త్రశిల్పం విరివిగా చిరకాలము నుండి జరుగుతున్నది... రోమక, యవన, వీలరది ద్వీపాలలో భారతీయ వస్త్రాలకు, శిల్పపు పనికి చాలా గౌరవం ఉండేది."[2] ఈ విధంగా ఇక్ష్వాకుల కాలంలోనూ ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉండేదని తెలుస్తుంది.

కాకతీయుల కాలంలో కూడా ప్రభుత్వానికి పరిశ్రమలు, వర్తక వ్యాపారాలు, వ్యవసాయం రూపేణా అధిక రాబడి వచ్చేది. "కాకతీయుల కాలమందు వ్యాపారము చాలా అభివృద్ధి నొందెను. తూర్పు దీవుల నుండి

1. అడవి శాంతిశ్రీ — అడివి బాపిరాజు, పు: 81.
2. పైదే., పు: 47, 48.

పశ్చిమ ప్రాంతాల నుండి సరుకులు రాజ్యములోనికి వస్తుండెను రేవుల వద్ద సుంకములు తీసుకొనుచుండిరి."[1]

నేత పని గురించి గోనగన్నారెడ్డిలో ఇలా ఉంది "దేశానికి కావలసిన వస్త్రాలు సిద్ధం చేయడమే కాకుండా, ఇతర దేశాలకు సరిపోయే వస్త్రాదికాలను నేసి ఆంధ్రులు ఎగుమతి చేసేవారు."[2]

యుద్ధాలు చేసినప్పుడు దేశ ఆర్థిక పరిస్థితి చిన్నాభిన్నమైనా కాకతీయులు అనేక యుద్ధాలలో గెల్చారు. కాబట్టి ఓడిన శత్రురాజుల దగ్గర కప్పాలు, సుంకాలు అధికంగా వసూలు చేసి తమ రాజ్యపు ఆర్థిక అస్తవ్యస్త పరిస్థితిని అదుపు చేయగలిగారు. 'గోనగన్నారెడ్డి'లో యాదవ మంత్రి భవానీ భట్టుతో రుద్రమదేవి ఇలా అంటుంది "మీ రాజు మాకు కోటి సువర్ణాలు, మా సేవకులకు కోటి సువర్ణాలు, మా సేనలలో హతమారిన వారి కుటుంబాల పోషణకై కోటి హోన్ను పణాల అపరాధం చెల్లించాలి."[3]

కాకతీయుల కాలంలో వ్యవసాయాన్ని గురించి రచయిత ఇలా చెప్పి ఉన్నారు - "గ్రామ భూమి గ్రామ ప్రజలది. ప్రజలందరూ భూమైనా పంచుకునేవారు; లేకపోతే పంటైనా సమంగా పంచుకునేవారు. రాజుకీయవలసిన అరవవంతు గ్రామ పంటలోనే కేటాయించి, తక్కిన పంట సమంగా పంచుకునే వారు. తిండికి కావలసిన పంట ఉంచుకొని తక్కిన పంట ఎగుమతికి పంపించే వారు. ప్రతి గ్రామానికి గ్రామ కంఠం- రాజభూమి ఉండేది. రాజభూమి గ్రామ

---

1. ...వరం ప్రతాపరెడ్డి., పు: 42.
2. గోనగన్నారెడ్డి - అడివి బాపిరాజు, పు: 119.
3. పైదే., పు: 381.

ప్రజలుపయోగించుకొని తమ పాలు పోగా తక్కినది ప్రభువునకు పంపే వారు. కొన్ని గ్రామాలకు సామంత ప్రభువు ఒకరు ఉండేవాడు ఆ ప్రభువు తన మహా మండలేశ్వరులకు, ఆయన చక్రవర్తికి కప్పం పంపించే వారు. ఈ విధంగా కాకతీయుల కాలంలో ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా ఉండేదని తెలుస్తోంది.

అంశుమతి నవలికలో బాపిరాజుగారు కథానుసారంగా "అక్కడక్కడా జలసీమలో నిత్యమును బంగారు పంటలు పండుచుండును."[2] అనే వాక్యాలు రాశారే గాని ఆనాటి ఆర్థిక పరిస్థితిని వివరంగా కథలో వ్రాయలేదు. కాని చారిత్రకాధారాలను బట్టి ఆనాటి ఆర్థిక పరిస్థితిని వివరంగా కథలో వ్రాయలేదు. కానీ చారిత్రకాధారాలను బట్టి ఆనాటి ఆర్థిక పరిస్థితి చాల చక్కగా ఉండేదని తెలుస్తుంది. "తూర్పు చాళుక్యులు పాలించిన కాలంలో ఆంధ్ర దేశం భారత దేశంలోనే గాక విదేశాలలో కూడా విశేషంగా వ్యాపారం సాగేది.... ఆనాటి ప్రజలు భోగభాగ్యాలను అనుభవించి నట్లు తెలుస్తున్నది." ఆనాటి ప్రజల సుఖ జీవనానికి కారణం ఆర్థిక వ్యవస్థ అని చెప్పవచ్చు.

ఈ విధంగా బాపిరాజుగారు తమ నవల్లో ఆనాటి ఆర్థిక పరిస్థితుల్ని కూడ అక్కడక్కడ వివరించినారు.

1. అంశుమతి — అడివి బాపిరాజు., పు: 94.

2. ఆంధ్రుల చరిత్ర — B.N. శాస్త్రి, పు: 351-353

## 5.2.1. బృందావన్‌లాల్ వర్మగారి చారిత్రకనవలల్లో రాజకీయ పరిస్థితులు:

5.2.1.0. **ప్రవేశిక** : వర్మగారి చారిత్రక రచనల కథాకాలం 14 వ శతాబ్దం నుండి 19 వ శతాబ్దం వరకు. ఆనాడు ఉత్తర భారతదేశాన్ని పరిపాలించిన చక్రవర్తులు గాని, రాజులు గాని, సామంతరాజులు గాని రాజకీయంగా ఎంతో బలహీనులుగా ఉండేవారు. ఆక్రమణదారుల దాడులవల్ల, సామ్రాజ్యాలు చిన్నాభిన్న మైనందు వల్ల సామాన్య ప్రజుల బాధలు చెప్పనలవి కానివిగా ఉండేవి. రాజులకు చక్రవర్తులకు కూడ రాజ్యపాలన దినదినగండం గా ఉండేది. ఆనాడు ఢిల్లీ సింహాసనంపైన ఏ శాసకుడున్నా అతడు సర్దారుల చేత కీలుబొమ్మ గా ఉండేవాడు. అట్లాలేకపోతే తనమార్గాన్ని సులభతరం చేసుకోవడానికి కుట్రలు, కుతంత్రాలు పన్ని, యుద్ధాలు హత్యలు చేసి తన ఉనికిని నిలుపుకొనే వాడు. ఇందువల్ల పరిపాలన వ్యక్తిగత ఆంక్షలతోనూ కోరికల తోనూ, నిండిఉండేది కాని ప్రజానురంజకంగా పాలించాలనే ధ్యేయం ఎవరికీ ఉండేది కాదు.

రాజులు, సామంతరాజులు, సర్దారులు, అధికారులు ఎవరి స్వార్థం వారు చూచుకొనేవారే కాని సామాన్య ప్రజల కష్టసుఖాలు యోచించేసమయం వారికి దొరికేది కాదు. ఇలాంటి అనిశ్చిత, అసమర్థ పాలనవల్ల సాధారణ జనులు పరిపాలనా వ్యవస్థ పైన సమాజ నమ్మకాన్ని కోల్పోయారు.

పాలకులు, పాలితుల మధ్య అసమానత్వం అనే లోతైన అగాధం ఏర్పడింది. ప్రజల్లోని నిరాశా నిస్పృహా, అసంతృప్తి విపరీతంగా పెరిగిపోయింది. ఎవరో వస్తారని, ఏదో చేస్తారని అనుకొన్న సామాన్యులు చివరకు ఎవరు రాజైతే మాత్రం మాకేమి లాభం? అని ప్రశ్నించుకొని రాజులను విశ్వసించడం మానివేశారు. పరిపాలన బలహీనంగా ఉండడం వల్ల ఎన్నో అత్యాచారాలు, అక్రమాలు అగ్నిపర్వతం లా ప్రజ్వరిల్లుతున్నా; దేశభక్తి అంతగా లేకపోయినా, ప్రజల్లో మాత్రం ఏదో ఒకమూల ధర్మం, కర్తవ్యం అనేవి లేశమాత్రంగా కనబడుతూ ఉండేది. ఇలాంటి అనిశ్చిత రాజకీయ పరిస్థితుల కాలాన్ని వర్మగారు తమ చారిత్రక నవలల్లో కథాంశాలుగా గ్రహించారు.

## 5.2.1.1. రాజకీయ పరిస్థితులు:

**భువన విక్రమ్:** భువన విక్రమ్ నవలను ఉత్తరవైదిక కాలానికి చెందిన చారిత్రక నేపథ్యం ఆధారంగా వర్మగారు రచించారు. ఆనాడు రాజు సర్వస్వతంత్రుడు కాడనీ, కావాలనుకొంటే రాజును పదవీచ్యుతుని చేసే అధికారం ప్రజలకుండేదని తెలుస్తుంది. నగరసభల్లో అన్ని వర్గాల ప్రజలకు తమ ప్రతినిధులను పంపు అధికారం ఉండేది. సభల (సమితి) నియమానుసారంగా రాజు పోషణవడం అనేది జరుగుతూ ఉండేది. ఆ సమితులకు రాజును విమర్శించే అధికారం, రాజును పదవీచ్యుతుని చేసే అధికారం

కూడా ఉండేది. అందుకే అయోధ్య రాజు రోమకుని పాలనలో
కరవు కాటకాలు సంభవిస్తే మేఘుడు, నీలుడు మొదలైనవారు
రోమకుణ్ణి పదవీ భ్రష్టుణ్ని చేస్తారు. ఈ కరవు కాటకాలకు
శూద్రుడైన కపింజలుని తపస్సే కారణమని రోమకుడి విశ్వాసం.
అందుకే రోమకుడు కపింజలుని చంపాలనుకొంటాడు. అది తప్పు
అని రోమకుడి కుమారుడు, సకల విద్యా సంపన్నుడైన భువనుడు
తండ్రిని వారిస్తాడు. మేఘుని పాలన కూడా లోక కంటక
మైనందున ప్రజాభీష్టం మేరకు రోమకుడు తిరిగి రాజు అవుతాడు.
పాలనా అసమర్థుడు, పరిపాలనా జ్ఞానం లేనివాడుగా ఉన్న
రోమకుడు రెండవసారి రాజు అయ్యాక నిస్వార్థ బుద్ధితో తన
కోశాగారంలో ఉన్న ధనాన్నంతా పేదలకు పంచి ఇచ్చేస్తాడు.
ఖజానా ఖాళీ అయినా ఇంకా ధనం పేదలకు పంచి ఇవ్వాలనే
కోరికతో ఆ రాజ్యంలోని కోటీశ్వరుడైన నీలఘటేష్ అనే
వణిక్సార్వభౌముని ఋణంగా ధనం అడుగుతాడు. కాని నీలఘటేష్
పన్నాగం వేరు. తన కూతురు హేమాంగిని, రోమకుని కుమారుడు
భువనుని కిచ్చి పెండ్లిచేసి కట్నకానుకలతో అపార ధనం ఇస్తాను
అంటాడు. రోమకుడు అంగీకరిస్తాడు. కాని పెండ్లి కుమారుణ్ణి
గుళ్ళో చంపివేయడమే వారి ధ్యేయం. కాని గౌరి ప్రమత్తత
వల్ల వారి పన్నాగం ఫలించదు. కుట్రలు, కుతంత్రాలతో
కూడిన రాజకీయ వాతావరణం ఆనాడు ఉండేది. కాని

ఒక రాజ్యం ఇంకొక రాజ్యంతో యుద్ధం చేసినట్లు కనబడదు.

**గఢ్ కుండార్:** వర్మగారు రచించిన గఢ్ కుండార్ 13వ, శతాబ్దానికి చెందింది. ఆనాడు అంటే సుమారు 1287 ప్రాంతంలో ఢిల్లీని పరిపాలించిన బానిస వంశపు రాజు బాల్బన్ ఎంతో శక్తివంతుడైనప్పటికి చివరి దశలో శక్తిహీనుడయ్యాడు. ఆ సమయంలో రాజ్యవ్యవస్థ అస్తవ్యస్తంగానూ, అశాంతియుతంగానూ ఉండేది. హిందూ మహమ్మదీయ రాజులు పరస్పరం కొట్లాడుకోవడమే గాక హిందూ రాజులూ తమలో తామే కలహించుకొనేవారు. ఆ పరిస్థితుల్లో బుందేల్ ఖండం లోని 'కుండార్' రాజులు చాల శక్తివంతులై సుమారు 80 సంవత్సరాలు నిరాటంకంగా, శాంతియుతంగా పరిపాలించారు. కాని చివరి రోజుల్లో 'కుండార్' రాజ్యపు అధికారాన్ని కరేరా, మూంవరోన్, మసనేహా మొదలైన జాగీర్దారులు నామమాత్రంగా అంగీకరించారు. రాజు, జాగీర్దారులు తన ఆధీనంలో ఉన్నారని భ్రమపడటం అదనుగా జాగీరుదారులు తమ పరిధిలో ఉన్న కేవలం రెండు మూడు గ్రామాలను స్వంతం చేసుకొని తామే స్వతంత్ర రాజులుగా ప్రకటించుకొన్నారు. ఆ సమయంలో 'కాల్పి' సుబేదార్ అలీమర్దాన్ కుండారుల మీద చిన్న చిన్న ఆక్రమణలు చేస్తూ ఉండేవాడు.

ఈ కాలంలో ప్రజలు దుర్భర జీవితం గడుపుతూ

ఉండేవారు. పరస్పర జాతిమత భేదాలు హెచ్చుతగ్గులు అధికంగా ఉండేవి. ఒక వర్గం లోని వాళ్ళు మరొకవర్గం లోని వాళ్ళతో కలిసిమెలిసి ఉండడం చాలతక్కువ. తమలోతాము గొప్పవారమనీ లేక హీనజాతి వారమనే భావన ఉండేది. ఒకవేళ ఎవరైనా ఓరిమి, ఉదారతను చూపిస్తే వాళ్ళను పిరికివాళ్ళు గా జమకట్టేవాళ్ళు. ఖంగారులు తాము హీనజాతి వారుగా భావించడమే గాక, దూరదృష్టి లేకపోవడం వల్ల; పరివార్, పంవార్, చౌహాన్, బుందేలు జాతులతో కలవలేక పోయారు. మాజాతి గొప్పది అనే గర్వం కొందరిలో తలెత్తితే మరికొందరిలో మాజాతి తక్కువ అనే న్యూనతాభావం ఉండేది. ఖంగారులు హీనజాతి వారైనా, వారికి జాతి అభిమానం ఎక్కువ. ఎవరైనా తమను తక్కువజాతి అని ఎత్తిచూపిస్తే సహించే వారు కారు. అందువల్ల ఖంగారులు పూర్తిగా నాశనమయ్యారు. గఢ్ కుండార్ నవలలోని బుందేల్ కన్య హేమవతి తాను గొప్పజాతికి చెందిందనే గర్వంతో తన తండ్రికి సహాయ పడిన ఖంగారుజాతి వాడైన నాగదేవుని ప్రేమను తిరస్కరిస్తుంది. తండ్రి, సోహన్‌పాల్ కూడా కుండార్ యువరాజు నాగదేవుడు హీనజాతి వాడని భావించి తన కూతురి వివాహం నాగదేవునితో జరిపించడు. ఆనాటి రాజుల జాత్యాభిమానం పరస్పర కలహాలకు దారి తీసింది. ఈ జాత్యాభిమానం ద్వేషంతో, మోసంతో, కుట్రలతో ఒకరినొకరు

చంపుకొనేంత వరకు వెళ్ళింది. ఈ నవలలో వర్మగారు హిందూరాజుల అంతర్యుద్ధాన్ని వివరించారు.

**మృగనయనీ :** 'మృగనయనీ' నవల తోమర్ వంశీయుడు, మిక్కిలి బలవంతుడు, కళాప్రియుడు అయిన 'రాజామానసింహ తోమర్' కాలానికి చెందింది. ఈ నవలలో వర్మగారు ఆనాటి రాజకీయ పరిస్థితుల్ని యథాతథంగా చిత్రించారు. 15వ శతాబ్దపు చివరి కాలాన్ని 16వ శతాబ్దపు ఆరంభ కాలాన్ని కఠోర అంధకారయుగం అని చెప్పవచ్చు. ఈ కాలంలో చాలయుద్ధాలు జరిగాయి. స్త్రీలను అపహరించాలనే అపేక్ష, రాజ్యాన్ని స్థాపించాలనే ఉబలాటం, ఏదైనా ఒకరూపంలో తమమతాన్ని విస్తారం చేయాలనే తపనతో తురుష్కులు భారతదేశంలో అడుగు పెట్టారు. ఢిల్లీ, మాళవా, గుజరాత్ మొదలైన సింహాసనాలు ఆక్రమించారు. తండ్రి కొడుకును, కొడుకు తండ్రిని, సోదరులను తమమార్గానికి అడ్డుగోడలని తలచి చంపివేశేవారు. నసీరుద్దీన్, తండ్రి గయాసుద్దీన్ కు విషమిచ్చి చంపేశాడని ఈ నవలలో రాశారు. సుల్తానులు, వారి సర్దారులు, సిపాయిలు, విలాసప్రియులు గానూ, పనీపాటలు లేనివారు గానూ తయారయ్యారు. మొండూ సుల్తాన్ గయాసుద్దీన్ మధుపాన మత్తుడై అందమైన స్త్రీల కోసం; అర్రులు చాచేవాడని, మృగనయనీ, లాఖీలను అపహరించే ప్రయత్నం చేశాడనీ వర్మగారు ఈ నవలలో చెప్పారు. అంతేగాక

అతని కొడుకు నసిరుద్దీన్ 15,000 అందగత్తెలైన అమ్మాయిలను వెంటపెట్టుకొని విలాసాలు, వినోదాలు, జలకాలాటలు మొదలైన భోగాలతోనే గడిపాడనీ, చివరకు అందగత్తెలతో జలకాలాడుతూ నీళ్ళల్లో మునిగి చచ్చారనీ రాశారు.

గుజరాత్ సుల్తాన్ మహమ్మద్ బఘర్రా భోజనప్రియుడని, యుద్ధసమయాల్లోకూడా వంటవాళ్ళను తీసుకొని, ఏనుగుల పైననే పొయ్యి పెట్టించి, మాంసాహారాన్ని రకరకాలుగా వండించి వేడి వేడిగా ఎప్పుడూ మెక్కుతుండేవాడని వర్మగారు రాశారు. ఇతడు భోజనప్రియుడేగాక, రక్తపిపాసి అనీ, శవాలు క్రింద పడ్డప్పుడు, రక్తం ప్రవహిస్తున్నప్పుడు అతనికి అంతులేని ఆనందం కలిగేది. "వెయ్యి రెండువేల తలలు దరదర బహిరంగ యుద్ధంలో తెగ వేసేవరకు మనసుకు కుదురు లేదు"[1]. "కత్తికి బాణానికి తెగి క్రిందపడి దొరలిపోయే తలలు, దుమ్ములో ప్రవహించే రక్తం మాత్రం తప్పక దొరుకుతాయి – అనుకొంటూ ఆలోచిస్తున్నాడు బఘర్రా"![2]

మహమ్మదీయుల రాజనీతిలో మతగురువుల (ముల్లాలు, మౌల్వీలు) ప్రమేయం అధికంగా ఉండేది. రాజులు మతగురువులకు భయపడుతూ ఉండేవారు. "ఇస్లామ్ మత సేవకై రాజులను ఒప్పించి లేదా బలవంతంగానైనా మతాన్ని

1. మృగనయని, బృందావన్‌లాల్ వర్మ., పు: 75
2. పేదే. పు: 76

అంగీకరించేటట్లు చేయడం వారి కర్తవ్యమని భావించారు."[1] "ఇస్లాం మతేతరులను ధర్మాన్ని అనుసరించడానికి ఇస్లాంమతాన్ని స్వీకరించమని కోరేవారు. లేదా మృత్యువును కోరుకోమనేవారు."[2] అందువల్లే బోధన్ పండితుడు సికందర్ సభలో వితండంగా వాదించినప్పుడు మరణశిక్షకు గురి అవుతాడు. మానసింహుని సైనికాధికారి నిహాల్ సింగ్ ని సికందర్ లోడీ అన్యాయంగా చంపివేస్తాడు. రాజ్యసింహాసనానికై మహమ్మదీయులే గాక హిందువులు కూడ కుట్రలుపన్నేవారు. గ్వాలియర్ పట్టపురాణి సుమనమోహిని, మృగనయనిని విషప్రయోగం ద్వారా చంపించాలనీ, ఆమె గర్భంతో ఉన్నప్పుడు గర్భం పోగొట్టాలనీ రెండుప్రయత్నాలు చేసింది. ఇందుకు కారణం ఆమెకుమారుని బదులు మృగనయనీ కుమారుడు ఎక్కడ సింహాసనాన్ని అధిష్టిస్తాడో అనే భయం. రాజసింహుడు గ్వాలియర్ ను నాశనంచెయ్యాలనుకొని గయాసుద్దీన్ తో చేతులు కలపడమే గాక, బైజూ, కళ అనేవాళ్ళను గూఢచారులుగ గ్వాలియర్ కు పంపుతాడు. ఈ విధంగా మృగనయనీ నవలలో ఆనాటి అస్తవ్యస్తమైన రాజకీయ పరిస్థితుల్ని వర్మగారు కళ్ళకుకట్టినట్లు వివరించారు.

**విరాటా కీ పద్మిని** : 18వ శతాబ్ది ప్రారంభంలో మొగలాయి శాసకుల తర్వాత సయ్యద్ సోదరుల సహాయంతో 'ఫరుఖసియర్' ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతడు బలహీనుడు కాబట్టి పెత్తనమంతా సయ్యద్ సోదరులదే. నలువైపులా ఎక్కడ చూచినా అరాచక

1. మధ్యకాలీన భారత్, పరమాత్మశరణ్, పు. 145
2. పైదే

స్థితి. సమస్త ఉత్తరభారతదేశం చిన్నచిన్న రాజ్యాలుగ విడిపోయి ఉండేది. హిందూ, మహమ్మదీయ రాజులు ఎవరికివారు తమస్వతంత్ర రాజ్యాలను స్థాపించుకొని, పరిపాలించుకొంటూ ఉండేవారు. వారు తమప్రజల్ని కుతంత్రాలతోను, కుట్రలతోను, చెడుస్వభావంతోనూ బాధపెడ్తూ ఉండేవారు. ఎవరికీ ఐక్యత లేకుండేది.

బుందేల్‌ఖండ్ ప్రాంతం దతియ్‌నగర్, బడ్‌నగర్, రామ్‌నగర్, విరాటా మొదలైన చిన్నచిన్న రాజ్యాలుగా విడిపోయి ఉండేది. హిందూ రాజులు, దుర్గాధిపతులు, చిన్నచిన్న కలహాలతోను, సంఘర్షణల తోను, మనస్పర్థలతోను ఉండేవారు. మొత్తంమీద వారికి మహమ్మ దీయులను ఎదిరించాలనే ఊహ లేదనే చెప్పవచ్చు. చాలమంది రాజులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. ప్రకటించుకొనివారు ఎప్పుడు, ఏవిధంగా ప్రకటించుకొందామా, అనే యోచనతో ఉ వారు. ఢిల్లీ పాదుషా అంటే ఎవరికీ భయంలేదు. ఎక్కడైనా భయం ఉంటే చుట్టుపట్ల రాజులవల్ల, నవాబుల వల్ల ఉండేది. వారుకూడా ఎందుకూ పనికిరాని ప్రతిష్ఠ కోసం తమలో తాము కలహించుకొని తమశక్తిని వృథాచేసుకొనేవారు. వారు యుద్ధానికి ఏదో ఒకసాకు వెతుకుతూ ఉండేవారు. సయ్యద్ సోదరులతో స్నేహంగా ఉండే అలీమర్దాన్ కూడా అధికారం కోసం ప్రయత్నాలు చేయసాగాడు. హిందూరాజులుకూడా ఐక్యతలేకుండా, అలీ మర్దాన్‌పై అందరూ కలసి దాడి చేసేందుకు బదులు, అతని

సహాయాన్ని అర్థించి ఎదుటివారిపై కక్ష తీర్చుకోవాల అనుకొంటూ ఉండేవారు.

ఈ పరిస్థితిని ఆసరాగా తీసుకొని అల్లామర్దాన్ ఢల్లీప్ నగరం, విరాటూ దుర్గాలను తనవశం చేసుకోవాలనుకొంటాడు. కాముకత్వంతో దేవి అవతారంగా భావించే హిందూ కన్య 'సుమంగ'ను తనవశం చేసుకోవాలనుకొంటాడు. ఈ విషయం బయట పెట్టక ఢల్లీప్ నగర రాజైన నాయకసింహుని భార్య చిన్నరాణి పంపిన రాఖీని స్వీకరించి, సోదరుడుగా నటించి, మోసంతో తనపని చేసుకుపోవాలనుకుంటాడు. నాయకసింహునికి ఒకసారి యుద్ధంలో సహాయంచేశాడనే భావనతో ఎటువంటి అధికారం లేని దేవీసింహుడు రాజ్యాధికారం పొందడం, ఆ అధికారం పొందే అర్హత ఉన్నా, దాసీ పుత్రుడనే భావంతో కుంజరసింహునికి రాజ్యాధికారం రాకపోవడంచేత, అతడు దేవీసింహునితో విరోధించడం అనే రాజకీయ విషయాలను వర్మగారు 'విరాటాకీ పద్మిని' నవలలో వివరించారు.

'విరాటాకీ పద్మిని' నవలలో విశేషం ఏమిటంటే కేవలం రాజ్యం కొరకే హిందూమహమ్మదీయుల మధ్యయుద్ధం జరుగలేదు. ఒక స్త్రీ కోసం అల్లామర్దాన్ ప్రయత్నిస్తే, ఆమెను రక్షించాలని హిందూ రాజులు ప్రయత్నిస్తారు. ఆమెను పొందలేని మరుక్షణం అతడు యుద్ధం విరమించుకొని సంధిచేసుకొని వెళ్ళిపోతాడు

**టూటే కాంటే** : 18 వ శతాబ్ది మధ్యభాగంలో రాజకీయ పాతావరణం మరింత దిగజారి పోయింది. భరత్‌పుర్, ఆగ్రా, మథుర లాంటి దూరప్రాంతాలలో జాట్ జాతివారి ఆధిక్యం పెరిగింది. వారిలో ఐక్యత లేదు. అంతఃకలహాలు ఎక్కువయ్యాయి. మహమ్మదీయుల ఆక్రమణవల్ల ప్రజలు పీడితులై దోపిడీలు చేయడానికి అలవాటు పడ్డారు. సర్దారులు మహత్వాకాంక్ష గలవారు అయ్యారు. నిజాముకు దక్షిణ భారత దేశంలో స్వతంత్ర రాజ్యం స్థాపించాలనే కోరిక ఉండేది.

ఢిల్లీ పాదుషా అయిన మహమ్మద్‌షా దర్బారులోని ప్రధానాధికారి సాదత్‌ఖాన్, కొంతమంది సర్దారులతో కలసి కుట్రపన్ని ఈరాన్ రాజైన నాదిర్‌షాను భారతదేశానికి రమ్మని ఆహ్వానిస్తాడు. ఈ అస్తవ్యస్థ స్థితిలో, 1721 లో చరిత్ర ప్రసిద్ధమైన నాదిర్‌షా దండయాత్ర జరిగింది.

ఈ నవల ద్వారా ఢిల్లీ పాదుషాల విలాసప్రియత్వం, మోసం, కపటం, క్రూరత్వం, విశ్వాసఘాతుకం, స్వార్థపరత్వం మొదలైన దుర్గుణాలు ఆనాటి రాజకీయ వ్యవస్థకు మూలాధారాలుగా ఉండేవని తెలుస్తుంది.

**అహల్యాబాయి** : ఈ నవల 18 వ శతాబ్ది చివరి భాగానికి చెందింది. శాసనవ్యవస్థ అనే పేరుతో పాలకులు ఘోరమైన అత్యాచారాలు చేస్తుండేవారు. మల్హారావు హోల్కర్, అతని

అనుచరులు ధనవంతులను దోచుకోవడం, ప్రజలను పీడించడం మొదలైన చెడ్డపనులు చేసేవారు. ఈ నవలలో అహల్యాబాయి కుటుంబానికి చెందిన కథ మాత్రమే వస్తువుగా స్వీకరించిన కారణంగా, ఇందులో విదేశీయుల ఆక్రమణలు కానీ, అత్యాచారాలు కానీ, జరిగినట్లు పేర్కొనలేదు.

**కచనార్** : ఈ నవల 18వ శతాబ్దానికి సంబంధించింది. ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించిన యుగం. క్షత్రియులైన గోండులు, రాజగోండుల జీవితాలను గూర్చిన పరిచయం ఇందులో ఉంది. బుందేల్ ఖండ్ లోని సింధియా, హోల్కర్, భోంస్లేలు పరస్పర కలహాలతోనూ, పందాలతోనూ, మునిగి పోయినందువల్ల సాగర్, ధామోనీ మొదలైన చిన్నచిన్న రాజ్యాలు నిరంతరం యుద్ధం, దోపిడీలలో మునిగి ఉండేవి. హోల్కర్, సింధియా పట్ల తనకున్న కక్షను తీర్చుకోవడానికి సింధియాను ఆశ్రయించిన సాగర్‌కు విరుద్ధంగా పిండారులను లూటీ చేయమని పంపించాడు. ధనం, రక్తపిపాస కలిగిన పిండారులు సాగర్‌ను నెలల కొద్దీ చుట్టుముట్టి అగ్నిగుండంలా ఉంచారు.[1] ఇటువంటి సమయంలో ధామోనిని దలీపసింహుడు పరిపాలిస్తుండేవాడు. ఈ రాజ్యంపై ఒకవైపు సాగర్ సేనలు, మరోవైపు మహమ్మదీయులు, ఇంకోవైపు పిండారీలు దండయాత్రలు

1. కచనార్, బృందావన్ లాల్ వర్మ, పు. 14, 214.

జరుపుతూ ఉండేవారు. మహమ్మదీయులతో దలపసింహుడు యుద్ధంచేస్తూ క్రిందపడి స్మృతి కోల్పోయినందువల్ల మానసింహుడు కుట్రపన్ని చనిపోయాడని ప్రకటించి, రాజ్యం వశం చేసుకొంటాడు. ఆనాటి గోసాయిలు సైన్యాన్ని ఏర్పాటుచేసుకొని యుద్ధసమయాల్లో డబ్బు తీసుకొని రాజులకు సహాయంచేసేవారు. రాజ్యాలను కోల్పోయిన కొంతమంది సైనికుల్ని చేర్చుకొని లూటీ చేయడం, చిన్నరాజ్యాలపై దండెత్తిపోవడం మొదలైన కార్యాలు చేసేవారు. గ్రామంలో ప్రతియువకుడు యుద్ధంచేయడంలో శిక్షణ పొందేవాడు. ప్రజలు యుద్ధసమయాల్లో తమప్రాణ రక్షణకై రాజదుర్గాలలో, శరణు పొందేవారు. గోసాయిల సహాయంతో దలపసింహుడు, మానసింహునితో యుద్ధంచేసి కోల్పోయిన రాజ్యాన్ని తిరిగి పొందుతాడు. ఈ నవలలో సామంతరాజుల భవనాలలో జరిగే విలాస క్రీడలు, మానసింహ, దలపసింహుల జీవితచిత్రాలలో ప్రతిబింబిస్తుంది.

**ముసాహిబజూ** : ముసాహిబజూ నవల 18వ శతాబ్ది అంతం - 19వ శతాబ్ది ప్రారంభానికి సంబంధించినది. బుందేల్ ఖండ్ ప్రాంతాన్ని కూడా ఆంగ్లేయులు స్వాధీనపరచుకొన్నారు. బుందేల్ ఖండ్ లోని మరాఠీ సేనలు ఆంగ్లేయులచేతిలో ఓడిపోయారు. గ్వాలియర్, ఇండోర్ మొదలైన రాజ్యాలలోని రాజులు ఆంగ్లేయులతో సంధికి ఒప్పుకొన్నారు. కాని వారి కఠిన శాసనాలకు వీరు అంగీకరించలేదు. మరాఠుల ప్రతినిధి హోల్కర్, సింధియా, గాయక్ వాడ్, భోంస్లే మొదలైన కూటనీతికి ఆంగ్లేయులు కూడా కొంతవరకు భయపడుతూ ఉండేవారు. ప్రజల్లో

రాజుల పట్ల నమ్మకం పోయింది. ఇటువంటి అస్తవ్యస్థ స్థితిలోనూ, కొంతమంది దేశభక్తుల మంచి ఆశయాలు ఇందులో చోటుచేసుకొన్నాయి. ముసాహెబు స్వామిభక్తి, దేశభక్తి, ఆశ్రితవాత్సల్యం కొనియాడదగింది. అతనే గాక అతని అనుచరులు కూడా పేదవారైనా వారు చూపించిన ప్రభుభక్తి, సేవాతత్పరత చెప్పుకోదగ్గది.

**ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి** : ఈ నవల 19వ శతాబ్దానికి చెందినది. 1817 లో పీష్వా బాజీరావు ఆంగ్లేయులతో సంధిచేసుకొంటాడు. పీష్వా ఆధీనంలో ఉండే ఝాన్సీ ఆంగ్లేయుల అధీనంలోకి వెళ్ళిపోయింది. ఆంగ్లేయులు తమకు నచ్చిన చట్టాలను అమలులోకి తెచ్చుకొన్నారు. ఆ చట్టాలను చిన్నచిన్న రాజ్యాలపైన రుద్దేదానికి ప్ర[illegible]ంచారు. అప్పుడు 'ఝాన్సీ' రాజ్యాన్ని లక్ష్మీబాయి పరిపాలిస్తూ ఉండేది. గంగాధరరావు దత్తత తీసుకొన్నా, ఆ దత్తత చెల్లదని, ఆంగ్లేయులు దత్తత స్వీకారం చెల్లదనే ఒక చట్టాన్ని తెచ్చి 1854 లో 'ఝాన్సీ' రాజ్యాన్ని ఆంగ్ల రాజ్యంలో కలుపుకొన్నారు. ఈ అన్యాయం లక్ష్మీబాయికి మింగుడు పడక ధైర్యంగా ఆంగ్లేయుల్ని ఎదిరించింది. ఆ సమయంలో కొన్ని కారణాల వల్ల ఆంగ్లేయులపై తిరుగబడ్డ సిపాయిలలో జాగృతి, చైతన్యం, దేశాభిమానం అధికమై లక్ష్మీబాయికి, వారు అండగా నిలిచారు. ఆంగ్లేయుల నెదిరించి దోపిడి దొంగగా మారి లక్ష్మీబాయితో క్షమింపబడ్డ సాగర సింహా, అతని అనుచరులు ఆమెకు తోడ్పడ్డారు.

తాంతియాతోపే, రఘునాథ సింహ, ఖుదాబక్ష్, గౌస్‌ఖాన్, పీర్ అలీ, నానాసాహెబ్, సుందర్, ముందర్, కాశీ, ఝల్కారీ మొదలైన స్వాతంత్ర్య ప్రియులు రాణికి బాసట గా నిలిచారు. వీరందరి సహాయంతో, ఎంతో సాహసంతో రాణి ఆంగ్లేయులను ఎదుర్కొంది. కాని ఆంగ్లేయుల తుపాకుల ముందు లక్ష్మీబాయి సేన నిలువలేక పోయింది. ఆమెకు సహాయం చేసిన గొప్ప గొప్ప వీరులు మరణించారు. ఆమెకూడా ఎంతో సాహసంతో యుద్ధం చేసింది. ఆమె ధైర్యసాహసాలను, యుద్ధ నైపుణ్యాన్ని ఆంగ్లేయులు కూడా వేనోళ్ళ పొగిడారు.

ఈ విధంగా వర్మగారు మధ్యయుగానికి చెందిన ఆనాటి అస్తవ్యస్థమైన రాజకీయ పరిస్థితులను తన చారిత్రక నవలల్లో వర్ణించారు.

5.2.2. బృందావన్‌లాల్ వర్మగారి చారిత్రక నవలల్లో సాంఘిక పరిస్థితులు:

5.2.2.0. ప్రవేశిక: చారిత్రక నవలాకారుడు కథావస్తువుకు ఆనాటి సాంఘిక పరిస్థితులను శోధించి చక్కగా అవగాహన చేసుకుని రచిస్తే ఆ నవల పాఠకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచి పోతుంది. "మానవుని సాంఘిక, వైజ్ఞానిక, ఆర్థిక, మత, సారస్వత విషయములను ప్రాంతీయముగా, జాతీయముగా కాక యావత్ ప్రపంచ మానవ సమాజమునకు సంబంధించిన వానిగ తెలుసుకొనుటకు ఉపయోగపడునది సాంఘిక చరిత్ర"[1]

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, బి. యస్. శాస్త్రి, పు. 1.

రచయిత రచించేది చారిత్రక నవల కాబట్టి ఆనాటి సాంఘిక, చారిత్రక, రాజకీయ, మత, ఆర్థిక పరిస్థితులతో కథావస్తువు తప్పక ముడి పడి ఉంటుంది. చరిత్రలో కేవలం సంఘటనలు పేర్కొంటారు. కాని చరిత్రలో పేర్కొనని సంఘ స్వరూపాన్ని చారిత్రక నవలల్లో చిత్రించడానికి పూర్తిగా ఆస్కారం ఉంటుంది. వర్మగారి చారిత్రక నవలల ఆధారంగా నాటి సాంఘిక పరిస్థితుల్ని అవగతం చేసుకోవచ్చు.

5.2.2.1. సాంఘిక పరిస్థితులు:

1. సంఘ స్వరూపం : బృందావన్ లాల్ వర్మగారి నవలల్లో ఒక్క భువన విక్రమ్ తప్ప తక్కిన వన్నీ మధ్యయుగానికి చెందిన కథా వస్తువులు. ఆనాడు ఉత్తర భారతదేశాన్ని పూర్తిగా శాసించే శాసకుడే కరువైనాడు. ఢిల్లీని పరిపాలించిన సికందర్ లోడీ, ఫరుఖసియర్, సయ్యద్ సోదరులు, మహమ్మద్ ఖాన్ మొదలైనవారు బలహీనులై సామంత రాజులపై పట్టు కోల్పోయినందువల్ల చిన్నచిన్న రాజులు స్వాతంత్ర్యం ప్రకటించుకొని ఢిల్లీ పాలకులను లెక్కచేయక స్వేచ్ఛగా ప్రవర్తిల్లేవారు. అంతః కలహాలతో సంఘ స్వరూపమే అతలాకుతలం అయింది. మృగనయని నవలలో రాజా మాన సింహుడు తన ఆధీనంలో ఉన్న గ్వాలియర్, నరవర్ లను, సికందర్ లోడీ, గయాసుద్దీన్ నిరంతర దాడుల నుండి రక్షించుకోవడం, ఆక్రమణదారులు వెళ్ళిపోయాక చెరువులు, బావులు, మందిరాలు పునర్నిర్మించడం లో ఎంతో శ్రమ పడవలసి వచ్చింది.

అధికభాగం ప్రజలు గ్రామీణులే కాబట్టి ఆస్తులను, పశువులను, పొలాన్ని, బంధువులను పోగొట్టుకొని యుద్ధానంతరం బ్రతుకు తెరువుకై దేశాలు పట్టిపోయారు. ప్రజల జీవితం ఈరకంగా ఉంటే, కొందరు మహాత్మ్య బీయ రాజులు యుద్ధాలు చేస్తూనే భోగవిలాస జీవితాలు గడిపేవారు. టూటే కాంటే, విరాటాకీ పద్మిని, కచనార్, ఝాన్సీకి రాణీ లక్ష్మీబాయి నవలల్లో సంఘ స్వరూపం ఇంచుమించు ఒకే విధంగా ఉంది. కలహాలతో అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగేవి కావు. అందుకే ఆనాటి బుందేల్ ఖండ్ ప్రాంతం అతి పేదప్రాంతంగా తయారయింది. సంఘంలోని సామాన్యప్రజలు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించారు.

2. ప్రజాజీవితం : సంఘ ప్రభావం ప్రజాజీవితం మీద ఉంటుంది. 'మృగనయనీ' నవలలో ఆనాటి గ్రామప్రజల జీవితాన్ని వర్మగారు చక్కగా చూపించారు. సికిందర్ లోడీ దురాక్రమణ వల్ల గ్రామంలోని ప్రజలందరు తమ ఆస్తులను, ధాన్యాన్ని, సంపదను పోగొట్టుకొని పేదవారైనారు. రాయి గ్రామంలో అందరికంటే అటల్, నిన్నీ, లాఖీ లే కొద్దిగా సంపద కలిగిన వారని వర్మగారు రాశారు. ముగ్గురూ కష్టజీవులు. అడవి జంతువులను వేటాడేవారు. మంచె పై కూర్చొని చలిబాధను, దోమల బాధను లెక్కచేయకుండ పొలాన్ని కాపుకాచేవారు. ఆనాటి దుర్భర జీవితానికి వర్మగారు నిన్నీ, లాఖీలను ప్రతీకలుగా చూపారు. ఒకనాటి రాత్రి వారిద్దరూ పొలాన్ని కాపు కాస్తుంటే విపరీతమైన చలి. కప్పుకోవడానికి ఎక్కువ గుడ్డలు లేవు.

అందుకే నిన్నీ, లాఖీలు ఒకరినొకరు గట్టిగా కౌగలించుకొని పడుకొంటారు. కొంతసేపటికి చెమటూ, మురికీ పట్టి అలా ఉండడం కూడా దుర్భరం అవుతుంది. చలిగాలులు విపరీతంగా వీస్తే ఇదీ పరిస్థితి. గాలులు లేకుంటె దోమలు స్వైరవిహారం చేస్తాయి. వాటిని టప్ టప్ అంటూ కొట్టుకుంటూ కూచోవాలి. నోరు తెరిస్తే నాలుగయిదు దోమలు నోట్లో వెళతాయి.[1] — ఈ వర్ణన వల్ల ఆనాటి గ్రామ ప్రజలు చలికి, ఆకలికి, మానం కాపాడుకోవడానికి వస్త్రాల్లేక దుర్భర దారిద్ర్యంతో ఎంతో బాధ పడ్డారని తెలుస్తుంది. రాజా మానసింహుడు మారువేషం వేసుకొని ప్రజల మధ్యకు వస్తాడు. తినడానికి తిండిలేక పేదరికాన్ని అనుభవిస్తున్న ప్రజల్ని చూచి "ఏమీ చేయలేక పోయాను. ఛీ, సిగ్గుపడాలి. మీరు ఆకలితో, రోగాలతో చచ్చిపోతున్నారు. నేను కడుపు నిండా తిని నిద్రపోతున్నాను. నేను భవనాల్లో ఉండటం, మీరు ఈ గుడిసెల్లో ఆకలితో చచ్చిపోవడమా?"[2] అని బాధ పడ్డాడు. తర్వాత మానసింహుడు గ్వాలియర్ లోని పేదరైతులకు, కూలీలకు ఉండడానికి తగిన ఇళ్ళు ప్రభుత్వ ధనంతో కట్టించడానికి ఏర్పాట్లు చేస్తాడు. పలుచోట్ల వైద్యశాలలు తెరిచే ఏర్పాటు కూడా చేస్తాడు.[3] ముసాహిబ్జు నవలలో, ముసాహిబ్జు అనుచరులు మంచివారైనా దొంగతనం చేశారంటే వారి పేద పరిస్థితే కారణం. ఇలా వర్మగారి నవలలన్నింటినీ పరిశీలిస్తే ఆనాటి రాజులు యుద్ధాలు చేస్తూకూడ, విలాసాల్లో మునిగి ఉంటే, ప్రజలు పేదరికాన్ని

1. మృగనయనీ, బృందావన్ లాల్ వర్మ, పు.
2. పైదే, పు. 347
3. పైదే, పు. 348

అనుభవించారని తెలుస్తుంది. ఒకవేళ కష్టపడి పంటను పండించినా, ఆ పంట చేతికొస్తే నమ్మకం రైతుల్లో లేదు. ఏ రాజో పన్నురూపంగా కొంత పట్టుకెళ్తే, ఇంకో ఆక్రమణదారుడు మిగిలింది తీసుకెళ్తాడు. మరో దోపిడీగాడు ఇంకా మిగిలింది దోచుకెళ్తాడు. ఈ విధంగా మధ్య యుగం నాటి సామాన్య ప్రజలు అనేక కష్టాలను అనుభవించారని వర్మగారి నవలల వల్ల తెలుస్తుంది. యుద్ధానంతర సమాజ స్వరూపం వర్మగారి నవలల్లో ప్రతిబింబించింది.

3. వర్ణ వ్యవస్థ : వర్ణాశ్రమ ధర్మస్థాపన మనుష్యులను సక్రమ మార్గంలో నడిపించేందుకు ఏర్పడినా అది వికృతరూపం దాల్చిందన్న అభిప్రాయాన్ని వర్మగారు తన నవలల ద్వారా వెలిబుచ్చారు. ఉత్తర వైదిక కాలానికి చెందిన భువన విక్రమ్ నవలలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అనే చతుర్వర్ణ వివరణ ఉంది. ధౌమ్య మహర్షి మతానుసారం, వర్ణవిభజన వారు చేయు పనిపై ఆధార పడి ఉంది. సంఘాన్ని క్రమపద్ధతిలో నడిపేవారు బ్రాహ్మణులు. దేశాన్ని కాపాడడం, దాన్ని వృద్ధిచేయడం క్షత్రియుల పని. వ్యవ సాయం, వాణిజ్యం, శిల్పకళ మొదలైన వాటిని నిర్వహించే వారు వైశ్యులు అనిచెప్తూ, ధౌమ్యుడు శూద్రుని ఏ వర్ణానికి చెందని వానిగా పేర్కొని అతడు కర్తవ్యహీనుడు, నీతిబాహుడు అని మాత్రమే చెప్పాడు.[1] బ్రాహ్మణులలో మేఘుని వంటి మూఢాచారులు శూద్రులను

1. భువనవిక్రమ్, డా॥ బృందావన్‌లాల్ వర్మ, పు.

చాల నీచంగా చూచేవారు. రాముని రాజ్యంలో సంభవించిన కరవు కాటకాలకు కపింజలుడనే శూద్రుని తపస్సే కారణమని, అతన్ని చంపాలని బయలుదేరితే, భువనుడు తండ్రికి నీతిని బోధించి సన్మార్గంలో పెడతాడు. భవభూతి ఉత్తరరామచరిత లోని శంబూక వధ అన్యాయమని తలచి వర్మగారు ఈ కపింజలుని కథ ద్వారా 'భువన విక్రమ్' లో వివరించారనిపిస్తుంది.

'గఢ్ కుండార్', లో కూడ ఈ వర్ణవ్యవస్థ వల్ల నాగదేవుడు, హేమవతి; అగ్నిదత్తుడు, మానవతి; దివాకరుడు, తారల వివాహాలు జరుగవు. కేవలం కులవ్యవస్థ వల్ల ఖంగారులు నాశనమయ్యారు. 'మృగనయని' నవలలో గూజరులకు, అహీరులకు వివాహం జరుగరాదని, బ్రాహ్మణుడైన బోధన్ పండితుడు, గ్రామపెద్దలు నిషేధించారు. ఆనాటి వర్ణవ్యవస్థ ఎంత విచిత్రంగా ఉంద, "అహీరు కన్నను గూజర జాతివాడు ఉంపుడుగత్తెగా ఉంచుకోవడాన్ని సంఘం భరిస్తుంది; కాని, వివాహమాడటానికి ఒప్పుకోదు."[1] కాని అదే గూజర జాతి కన్నను, రాజు ఇష్టపడి చేసుకొంటే సంఘం ఏమాత్రం అడ్డుచెప్పదు. అటల్, లాఖీల వివాహానికి ఆనాటి సంఘం అనుమతించకపోతే, అటల్ గంగాజలం సాక్షిగా లాఖీని వివాహం చేసుకొంటే సంఘం వారిని బహిష్కరిస్తుంది. చివరకు రాజే పూనుకొని విజయజంగం ద్వారా ఇద్దరి వివాహం చేయించినా

కులు

మృగనయనీ; డా. బృందావన్ లాల్ వర్మ, పు; 79

ఆ వివాహానికి హాజరు కాలేదు. వింత ఏమంటే సమాజమందలి బ్రాహ్మణవర్గమే కాకుండ గూజరులు, అహీరులు కూడా వారి వివాహానికి అంగీకారం తెలుపలేదు. వారు భోజన పానీయాలు సేవించడం, ఒక చోట కూర్చొనడం, మాట్లాడటం మానివేయడమే గాక వారివైపు కన్నెత్తి కూడ చూడలేదు. సుమన మోహిని కూడ జాతి వైషమ్యం వల్లనే లాఖో చేతివంట తినడానికి నిరాకరించింది. నిహాల్‌సింహుడు కళను ఎంతగా ప్రేమించినా భిన్నజాతి స్త్రీ కాబట్టి వివాహం చేసుకోవడానికి నిరాకరిస్తాడు. ఈ విధంగా బ్రాహ్మణులను రాజులు ప్రజలు గౌరవించేవారని, కులవ్యవస్థకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారని తెలుస్తుంది. ముసాహిబులు నవలలో సైనికుల్లో అనేకులు పాకి అనే హీన జాతికి చెందిన శూద్రులు. రాజు వారిని పట్టించుకొనేవాడు కాడు. ముసాహిబులు లాంటి వాళ్ళు వాళ్ళ ఆలనా పాలనా చూసేవారు. ఇలా వర్మగారు తన నవలల్లో నాటి వర్ణ వ్యవస్థను, సంఘ కట్టుబాట్లను, నియమాలను మనకళ్ళకు కట్టినట్లు వర్ణించారు.

4. **సాంఘిక దురాచారాలు** : వర్మగారు తమ నవలల్లో ఆనాటి సంఘంలోని అనేక సాంఘిక దురాచారాలను వివరించి వాటిని రూపుమాపాలని పరోక్షంగా ప్రబోధించారు.

**సతీ సహగమనం** : మధ్యయుగం నాటి అనేక సాంఘిక దురాచారాల్లో అనాదిగా వస్తున్న సతీ సహగమనం అనే దురాచారం ఒకటి. ఈ

దురాచారాన్ని గురించి తన నవలల్లో ఒకటి రెండు చోట్ల ప్రస్తావించి ఉన్నారు.[1]

జౌహారు వ్రతం : ఈ జౌహారు వ్రతాన్ని సాంఘిక దురాచారం అనడం కంటె విధివంచితులైన స్త్రీ పురుషులు శత్రుసైనికుల దగ్గర అవమానాలు పడలేక తమ ఆత్మాభిమాన రక్షణ కొరకు తమ తనువును చాలించే ఆచారం అనడం సమంజసం. అందుకే దీనికి వ్రతం అన్నారు. గత్యంతరం లేని పరిస్థితుల్ని బట్టి ఏర్పడిన దురాచారమే జౌహార్ వ్రతమని చెప్పవచ్చు.[2]

పరదా పద్ధతి : సాంఘిక దురాచారాల్లో పరదా పద్ధతి కూడ ఒకటి. మధ్యయుగంనాడు మహమ్మదీయ స్త్రీలే కాకుండా హిందూ స్త్రీలు కూడ పరదాను పాటించేవారు. ఈ పద్ధతిని మృగనయని వ్యతిరేకించింది. మొట్టమొదట మానసింహుడు ఆమెను పెండ్లి చేసుకొంటానని కోరగానే ఆమె కోరిన రెండు కోరికల్లో "నేను గ్వాలియర్ వచ్చినా పరదా పాటించను"[3] అనేది ఒకటి. ఈ షరతుకు మానసింహుడు ఒప్పుకుంటాడు.

దాసీ పద్ధతి : రాజు వివాహం చేసుకొంటే రాణీలతో వచ్చే దాసీలపై కూడ రాజుకు అధికారం ఉంటుంది. వాళ్ళని రాజులు ఉంపుడుగత్తెలుగా ఉంచుకొంటారు. బృందావన్‌లాల్ వర్మగారి 'కచనార్' నవలలో దలీప సింహుని భార్య కళావతితో అరణంగా

వచ్చిన దాసి కచనార్. కాని కచనార్ ఈ దురాచారాన్ని ఎదిరిస్తుంది. ఆమె రాజుతో "నాపై మీకు ఇంత ప్రేమ ఉంటే నన్ను వివాహం చేసుకోండి, కాని నేను మీ ఉంపుడు గత్తెగా ఉండను"[1] అంటుంది. విరాటాకీ పద్మిని నవలలో దాసీ పుత్రుడైన కుంజర సింహునికి, ఎప్పుడూ ఆత్మన్యూనతా భావం ఉండేదని తెలుస్తుంది. మధ్య యుగం నాటి సాంఘిక వ్యవస్థలో దాసీల స్థితి హీనంగా ఉండేది.

**5. న్యాయవిచారణ - దండన పద్ధతి :** 'మృగనయనీ' నవలలో న్యాయ వ్యవస్థకు, దండన పద్ధతికి సంబంధించిన విషయాలున్నాయి. ఆనాడు మాన సింహుని రాజ్యంలో ప్రతిగ్రామంలోను పంచాయతీ ఉండేదనీ, గ్రామాలకు చెందిన తగాదాలు అవి పరిష్కరించేవని తెలుస్తుంది. పంచాయతీ ఆదేశాల వల్ల గ్వాలియర్ కట్టడాలు నిలిపివేశారు. రాతి గోడలకు బదులు మట్టి గోడలపై కసువు కప్పి గృహాలు నిర్మించేవారు. లాఖీ, అటల్‌ల వర్ణాంతర వివాహానికి పంచాయతి అంగీకరించక వారిని గ్రామం నుంచి బహిష్కరించినందువల్ల వారు గ్రామం వదలి వెళ్ళిపోతారు. ముసల్మాను శాసకులు ముల్లా, మౌల్వీల సాయంతోనే రాజ్యాన్ని పాలించేవారు. బోధన్ పండితుని మరణ దండన, రాయబారిగా వచ్చిన నిహాల్ సింహుని వధించడం, ఆనాటి మహమ్మదీయ శాసకుల తీవ్రమైన దండన విధానానికి మచ్చుతునకలు. హిందువులలో శైవ, వైష్ణవులకు మత విషయంగా స్పర్థకలిగినప్పుడు అన్ని మతాలు, మత శాఖలు ఒక్కటేనని, సంయమనం పాటించాలని

1. కచనార్, డా. బృందావన్‌లాల్ వర్మ, పు; 27

మానసింహుడు సభలో తీర్పు చెబుతాడు. 'కచనార్' నవల చివరలో మహంతు అచలపురి, 'దరూ'కు మరణదండన విధిస్తే మంచి వ్యక్తిగా మారిపోయిన దలీపసింహుడు అతణ్ణి క్షమించి వదలివేస్తాడు. తనకు సోదరుని వరుస అయిన మానసింహుడు తన భార్య కళావతిని వివాహం చేసుకొని తనకు తీవ్ర అన్యాయం కల్గించినా దలీపసింహుడు అతణ్ణి, కళావతిని క్షమించి వదలివేయడమే కాకుండా అతనిని కొంత భూభాగానికి అధిపతిగా నియమిస్తాడు. ఈ నిర్ణయాలు రాజు స్వయంగా చేసినవే. ఇక్కడ పంచాయతీల ప్రసక్తి లేదు. 'ముసాహిబజూ నవలలో , నగలు దొంగిలించిన నేరానికి ముసాహిబజూ అనుచరులను, రాజు శిక్షిస్తే, వారిని కాపాడడానికి ముసాహిబజు దతియా రాజ్యాన్నే వదలిపెట్టి వెళ్ళిపోతాడు. చివరకు రాజు ముసాహిబజూ ప్రభుభక్తికి మెచ్చి క్షమించి వదలివేస్తాడు. లక్ష్మీబాయి కూడా బందిపోటు దొంగలను పట్టుకొని శిక్షించకుండా వారిలో పరివర్తన కలిగించి తన సైన్యంలో చేర్చుకొంటుంది. ఈ విధంగా వర్మగారు ఆనాటి న్యాయ వ్యవస్థను, దండనా పద్ధతిని తమ నవలల్లో వివరించారు.

6. గూఢచర్య వ్యవస్థ : వర్మగారు తమ చారిత్రక నవలల్లో గూఢచారులు, వార్తాహరులను గురించి, వార్త పంపే విధానం గురించి వివరించారు. 'భువనవిక్రమ్'లో గౌరి, కపింజులు హిమాన్, నీలఘోష్ లవద్ద సేవకులుగా చేరి భువనుని చంపడానికి

పన్నిన కుట్రను భగ్నం చేస్తాడు. 'మృగనయని' నవలలో రాజు సింహుడు తన అనుచరులైన కళ-బైజునాథ్ లను గూఢచారులుగా గ్వాలియర్ పంపిస్తాడు. బైజూనాథ్ రాజు మానసింహుని మంచితనానికి ముగ్ధుడై తమ రహస్యం చెప్పేస్తాడు. కళ, గ్వాలియర్ విషయాలను సేకరించి పారిపోయేటప్పుడు కూడా ఆమెను శిక్షించకుండా వదిలేస్తాడు. సికందర్ లోడీ అనుచరుడు సాధువేషం వేసుకొని వచ్చి ప్రజలను, రాజును నమ్మించి, వారి సైనిక బలాన్ని, సొరంగ రహస్యాన్ని కనుక్కొని వెళ్ళిపోతాడు. కొన్ని సమయాల్లో రాజు మానసింహుడు స్వయంగా మారువేషం వేసుకొని స్వయంగా రాత్రిపూట రాజ్యం అంతా సంచరిస్తూ ప్రజల కష్టసుఖాలు కనుక్కొంటాడు. విరాటాకీ పద్మిని నవల్లో చిన్నరాణి అనుచరుడు రామదయాళు అలీమర్దాన్ తో చేతులు కలిపి 'కుముద్'ను అన్వేషించడానికి తోడ్పడుతాడు. ఈ విధంగా వర్మగారి నవలల్లో గూఢచారి వ్యవస్థను పేర్కొన్నారు.

7. నాటి సమాజంలో స్త్రీ : 'మాతృదేవోభవ,' 'పితృదేవోభవ,' ఆచార్య దేవోభవ' - అంటూ స్త్రీకి ప్రథమ స్థానం ఇచ్చారు మన పెద్దలు. అటువంటి స్త్రీని గురించి ప్రఖ్యాత హిందీ కవి మైథిలీ శరణ గుప్తగారు "స్త్రీ జీవితగాథ చాల విచారకరమైంది. ఆమె స్తనంలో పాలు, కళ్ళల్లో నీళ్ళు ఉంటాయి. చిన్నప్పట్నుంచి బిడ్డలకు స్తన్యానిస్తూ ఆపద సమయాలలో కలిగే కన్నీటిని కళ్ళలోనే దాచుకొని వారి అభివృద్ధికి నిరంతరం కృషి

సత్పదే మాతృమూర్తి"[1] అన్నారు. అటువంటి స్త్రీ ఇంటిలో గాని, గ్రామం లో గాని, సమాజంలో గాని నవ్వుతూ, సంతోషంగా, చైతన్యవంతంగా ఉంటే ఆ ఇల్లు, ఆగ్రామం, ఆసమాజం తప్పకుండా బాగుపడుతుంది. మధ్యయుగం నాటి ఉత్తర భారత దేశంలో ప్రజలు ముఖ్యంగా స్త్రీలు యమబాధలు పడ్డారని చరిత్ర ద్వారా తెలుస్తుంది. తినడానికి తిండి లేక, కట్టుబట్టలేక, పడుకోవడానికి పంచ లేక సామాన్య ప్రజలు అష్టకష్టాలు పడుతుంటే, స్త్రీ భర్తను, బిడ్డలను, సోదరులను పోగొట్టుకొని నరకయాతలు అనుభవించడమే కాకుండా ఆనాటి రాజుల కాముక ప్రవృత్తికి బలై మానప్రాణాలు పోగొట్టుకోవడం కూడ జరిగింది. కేవలం బీదప్రజలే కాకుండా రాణులు, ధనవంతులుగా ఉండే స్త్రీలు కూడ ఆనాటి యుగంలో శాంతి, సౌఖ్యాలు లేక బాధల్ని అనుభవించారు. ఆనాటి స్త్రీల హీన పరిస్థితిని వర్మగారు కళ్ళకు కట్టినట్లు వివరించారు. స్త్రీలకు ఆనాటి సమాజం ఎన్నో నియమాలను, కట్టుబాట్లను విధించింది. స్త్రీని కేవలం విలాస వస్తువుగా చూడడం జరిగింది. స్త్రీ పైగల చులకన భావానికి, స్త్రీల అభద్రతకు మధ్యయుగం నాటి సమాజం ఒక ప్రతీక అని చెప్పవచ్చు. ఇలాంటి సమాజాన్ని ఆనాడే అంతో ఇంతో ఎదిరించగల స్త్రీలకు ప్రతీకలుగా వర్మగారు కొంతమందిని తమ నవలల్లో చిత్రించారు. వారిలో కొందరు

1. "అబలా జీవన్ హాయ్, తుమ్హారీ యహీ కహానీ,
ఆంచల్ మే హై దూధ్, ఔర్ ఆంఖోం మే పానీ"
బృందావన్‌లాల్ వర్మ-సాహిత్య ఔర్ సమీక్ష; సియారామ్ శరణ ప్రసాద్, పు:176.

చారిత్రక పాత్రలు కాగా మరికొందరిని ప్రత్యేకంగా వర్మగారు కల్పించి ఆనాటి స్త్రీ పరిస్థితి ఎలా ఉండేదో వివరించారు. వర్మగారి స్త్రీలలో మృగనయని, లాఖో, మానవతి, హేమవతి, తార, కుముద్, నూర్‌బాయి చరఖారీ, కచనార్, లక్ష్మీబాయి, అహల్యాబాయి, గౌరి మొదలైన వారు ముఖ్యులు. వారిలో ఒక్క చరఖారీ తప్పిస్తే మిగిలిన వారందరూ ఏదో ఒక రకంగా ఆనాటి సమాజ బాధితులే.

మృగనయని ఒక చిన్న పల్లెటూరులో పుట్టి, తల్లిదండ్రులను దురాక్రమణదారుల వల్ల పోగొట్టుకొని, చిన్నప్పట్నుంచి ఆనాటి పరిస్థితులను అర్థంచేసికొని, తనకంటూ ఒక ప్రత్యేకతను నిలుపుకొని బ్రతకాలని కోరుకొంటుంది. తన ఆత్మాభిమానాన్ని ఎవరైనా కించపరిస్తే ఒప్పుకోదు. వేట, బాణంవేయడం, బల్లెంవిసరడం లాంటి విద్యలు నేర్చుకొన్న ధైర్యసాహసాలు కల స్త్రీ. ఆనాటి సాంఘిక దురాచారాలను ఎదిరించిన స్త్రీ. ఆనాటి రాజుల్లో పరదా పద్ధతిని నిర్ద్వంద్వంగా ఖండించిన స్త్రీ. జౌహారు వ్రతమంటే ఆమెకు ఏకోశానా ఇష్టంలేదు. స్త్రీలు అగ్నిగుండంలో దూకి చావడం మూర్ఖత్వం అనుకునేది. శత్రువును ధైర్యంగా ఎదిరించి చంపడమో లేక చావడమో తేల్చుకోవాలిగాని జౌహారువ్రతం అవలంబించి చావడం పిరికి పందల లక్షణం అనుకొనేది. పురుషాధిక్యతను ఏమాత్రం ఒప్పుకొనేది కాదు.

మృగనయని, తన భర్త మానసింహుడు తన వ్యక్తిత్వాన్ని

గౌరవించాలని, తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఇవ్వాలని కోరుకొనే ఇతర రాణులవలె దుస్తులు, నగలు ధరించి ఊరుసుపోక కబుర్లతో రాజు ఏ రోజు తన దగ్గరికి వస్తాడో అని కాచుకొనే వ్యక్తిత్వం కాదు. అలాఅని కేవలం తన అందంతోనే భర్తను వశపరచుకోవాలనే మనస్తత్వం కూడ లేదు. మంచితనం, పట్టుదల, కృషి మొదలైన సుగుణాలతోనే భర్తను, పరివారాన్ని ఆకట్టుకోవాలనే ప్రయత్నించింది. తనను చంపడానికి కుట్ర జరిపిన పెద్దరాణి సుమనమోహిని పై కూడ ద్వేషభావం కనబరచలేదు. తనను ప్రేమించి పెళ్ళాడుతానని అడిగిన మొదటి రోజునే భర్తను రెండు కోరికలు కోరుతుంది. ఒందు మొదటిది; రాయిగ్రామం నుండి గ్వాలియర్ కోటవరకు కాలువ త్రవ్వమనడం, రెండు పరదా పద్ధతికి అంగీకరించక పోవడం. కాలువ త్రవ్వితే, ఆ కాలువ పొడవునా నీరు ప్రవహించి ప్రజలు సుఖపడతారని, ప్రజలకు మేలు కలుగుతుందని ఆమె కోరి ఉండవచ్చు. రాణివాసపు ఘోషా పద్ధతిని ఎదిరించి ఆనాడే సాంఘిక విప్లవాన్ని లేవదీసింది. ఇరవయ్యవ శతాబ్దంనాటి ఆధునిక స్త్రీ ఆలోచనలన్నీ ఆనాడే మృగనయనిలో ఉండడం మనకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

లాఖీ కూడ పల్లెటూర్లో పుట్టి అందరినీ పోగొట్టుకొన్న స్త్రీ. అమిత ధైర్యసాహసాలు, పట్టుదల, కృషి కలిగిన ఈమె హీన జాతికి చెందిన స్త్రీ అయినా సంఘాన్ని ఎదిరించి చివరివరకు

పోరాడింది. కాని, సంఘంలో మృగనయనీ వలె రాణించలేక ఆనాటి సాంఘిక పరిస్థితులకు బలిఅయిన త్యాగమూర్తికి ప్రతీక లాంఖో. తాను నిమ్నజాతి స్త్రీ అని ఎవ్వరైనా ఒక్కమాట అన్నా పడదు. చివరకు తనను అమితంగా ఇష్టపడే మృగనయనీ అంటే కూడ ఒప్పుకోదు. అటల్ గ్వాలియర్ వెళ్దామంటే కూడా ఒప్పుకోలేదు. త్యాగం, సాహసం ఆత్మాభిమానం లాంఖో ప్రధాన గుణాలు.

'గఢ్ కుండార్' నవలలో మానవతి, తార ఆనాటి సాంఘిక కట్టుబాట్లకు బలయైన విధివంచితులు. మానవతి సంఘానికి భయపడి, పిరికితనం వల్ల తన జీవితాన్ని, అగ్ని దత్తుని జీవితాన్ని అంధకార బంధురం చేసుకొంటుంది. తార, దివాకర్లు కూడ విధిలేక, ఆ సంఘాన్ని వదలి దూర ప్రదేశాలకు కష్టాలను నిస్తూ వెళ్ళిపోతారు.

హేమవతికి బుందేల్‌ఖండ్ కన్యనని గర్వం ఎక్కువ. ఖంగారు యువరాజు హేమవతిని, ఆమె తండ్రిని రక్షించడానికి యుద్ధంచేసి గాయపడ్డాడనే కృతజ్ఞతతో శుశ్రూషలు చేస్తుంది. కాని ఆమెను వివాహమాడాలని, నాగదేవుడు కోరిక వెళ్ళబుచ్చితే, హేమవతి తిరస్కరిస్తుంది. ఈ కారణంగా బుందేలులకు ఖంగారులకు తీవ్ర నష్టం వాటిల్లుతుంది.

'కుముద్' కూడా ఆనాటి సాంఘిక దురాచారానికి బలైపోయిన స్త్రీ. ఆమె దేవీ అవతారం కొందరు భావిస్తే మరికొందరు

అదంతా పట్టి బూటకం అని భావించడం వల్ల, ఆమె నాశన మవడమే గాక, ఆమె పరివారమంతా మరణిస్తారు. "నేను దేవీ అవతారం కాను, సాధారణస్త్రీని, దుర్గామాతకు నిజమైన పూజారిణిని;" అని ఆక్రోశించిన అబల కుముద్. ఇటువంటి మూఢ విశ్వాసాలకు స్వస్తిచెప్పి నిజమైన దేశసేవకు అంకితం కండి అని వర్మగారు కుముద్ పాత్రద్వారా హెచ్చరించారు.

మధ్యయుగం నాటి సమాజం లోని రాజుల కాముకత్వ మనస్తత్వానికి బలిపశువులుగా మారిన అబలలకు ప్రతీకగా వర్మగారు సృష్టించిన పాత్ర నూర్ బాయి. సాంఘిక దురాచారాలను ఎదుర్కొని జీవితాన్ని ఆనందమయం చేసుకోగలిగిన వ్యక్తులకు ప్రతినిధి నూర్‌బాయి. తుచ్ఛ సుఖాలకంటె, స్వచ్ఛమైన భక్తి తత్త్వమే గొప్పదని, శాశ్వతమైన మనశ్శాంతిని కలిగిస్తుందని చాటిచెప్పే పాత్ర నూర్‌బాయి. ఈ పాత్ర ద్వారా హిందూ, మహమ్మదీయ మతసామరస్యాన్ని వర్మగారు ప్రబోధించారు.

మధ్యయుగం నాటి అవమానకరమైన దాసీ పద్ధతి లో భాగమైన ఉంపుడుకత్తె విధానాన్ని అంగీకరించక, ధైర్యంగా ఎదిరించి గౌరవప్రదంగా రాజును, అగ్నిసాక్షిగా వివాహమాడి భార్యగా తన స్థానాన్ని పదిలపరచుకొని, దాసీ, వేశ్యా పద్ధతికి స్వస్తి చెప్పిందని, ఆ సాంఘిక దురాచారాన్ని రూపుమాపిందని ఎలుగెత్తి చాటిన పాత్రకు ప్రతినిధి

కచనార్. కాని అటువంటి గౌరవప్రదమైన జీవితాన్ని సాధించడానికి ఆమె పడిన శ్రమ అంతా ఇంతా కాదు. కచనార్ దాసి ఐనా ఇతర దాసీలవలె గాక తన శీలాన్ని రక్షించుకొంటూ చివరకు రాణి యై అందరి మన్ననలను పొందుతుంది.

'ఝాన్సీకి రాణీ లక్ష్మీబాయి' నవలలో సుశిక్షితురాలైన సైనికురాలిగ, రాజ్యాన్ని నడిపించే నాయకురాలుగా స్త్రీశక్తికి ధీరత్వానికి, పరాక్రమణ స్ఫూర్తికి ప్రబల తార్కాణంగా లక్ష్మీబాయి అవతరించింది. స్త్రీ జాతి చైతన్యానికి, దేశభక్తికి, అకుంఠిత దీక్షకు ప్రతీక లక్ష్మీబాయి. ఈమె చరిత్రను పాఠకులకు అందించిన వర్మగారు ధన్యజీవులు.

### 5.2.3. బృందావన్‌లాల్ వర్మగారి చారిత్రక నవలల్లో సాంస్కృతిక పరిస్థితులు:

5.2.3.0. **ప్రవేశిక:** సమాజ - సాహిత్యాల లాగ సంస్కృతీ సాహిత్యాల సంబంధం కూడ చాల దృఢమైనది. ప్రాచీనమైనది. ఇవి రెండూ ఒకదాన్నొకటి ఆశ్రయించుకొని ఉంటాయి. ఒక జాతి సంస్కృతి ఆ జాతి సాహిత్యంలో ప్రతిబింబిస్తుంది. సాహిత్యం ద్వారా ఆనాటి సమాజంలోని సంస్కృతిని మనం అవగతం చేసుకోవచ్చు. ఏ దేశం, ఏ జాతి సంస్కృతి ఉజ్వలమై, ఉన్నతిని పొందుతుందో, ఆ దేశం, ఆజాతి సాహిత్యం కూడ అంత ఔన్నత్యాన్ని, గౌరవాన్ని పొందుతుంది. కాబట్టి సమాజం, సంస్కృతి, సాహిత్యాల సంబంధం ఒకదానికొకటి పూరకాలు

గానూ, అభివృద్ధి సూచకాలు గాను ఉంటాయి

సమాజంలో మంచీ, చెడూ రెండూ ఉంటాయి. ఏది మంచి, ఏదిచెడు అని విశ్లేషించి చూపే సమాజ జీవన విధానమే సంస్కృతి. సంస్కృతిలో సృజనాత్మకమైన ఆలోచనలకు గౌరవం ఉంటుంది. ఏఏ పనులవల్ల మానవుడు అభివృద్ధిని, మానసిక వికాసాన్ని పొందగలడో దానికి ఆధారం సంస్కృతి. సభ్యత, సంస్కృతుల ఆధారం లేనిదే సమాజం ప్రగతి పథం వైపుకు నడవడం అసంభవం. ఒకనాటి సమాజం లోని సాంస్కృతిక విలువలను రాబోయే తరానికి ఎత్తిచూపే వాడు సాహిత్యకారుడు. "ఏ గుణం చేత మానవుడు అంతరంగిక ఔన్నత్యాన్ని పొందుతాడో, పరోపకారం అలవరచుకొంటాడో అదే సంస్కృతి... సంస్కృతి ధనం కాదు. సంస్కృతి ఆడంబరం కాదు. వినయం - వినమ్రత".[1] ఏమనిషి సమాజం ద్వారా "జ్ఞానం,

సం, కళ, నీతి, న్యాయం, ఆచారాలు, సంప్రదాయాలు, అలవాట్లు అలవరచుకొంటారో అదే సంస్కృతి".[2] మధ్యయుగ నాటి ఉత్తర భారతం లోని సాంస్కృతిక పరిస్థితులను వర్మగారి నవలల ద్వారా పరిశీలిద్దాం.

5.2.3.1. **సాంస్కృతిక పరిస్థితులు :**

**ఉత్సవాలు, పండుగలు** : జీవితంలోని ఒంటరితనం నుండి, నీరసత్వం

---

1. బృందావన్‌లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య, డా. మోహినీ సహాయ్, పు; 617
2. పైదే., పు; 617

నుండి తనను రక్షించుకొనేందుకు (తప్పించుకొనేందుకు) మానవుడు కొన్ని సాధనాలు వెదకుతాడు. కొంత కొత్తదనాన్ని, సంతోషాన్ని, ఆహ్లాదాన్ని పెంపొందేందుకు అతడు ఉత్సవాలను, పండుగలను జరుపుకొంటాడు. వర్మగారు రచించిన చారిత్రక నవలల కథా కాలమైన 14వ శతాబ్దం నుండి 18వ శతాబ్దం వరకు. కాబట్టి ఆనాటి ప్రజాజీవితం దుర్భర దారిద్ర్యానికి లోనై అష్టకష్టాలుపడుతున్నా అప్పుడప్పుడు ప్రజలు మండువేసవిలో చిరుజల్లు కురిసి ఆహ్లాద పరిచినట్లు తమకష్టాల్ని దుర్భర జీవితాన్ని మరచి కొన్ని పండుగలు, ఉత్సవాలు జరుపుకొనేవారు.

ఉత్తర భారతదేశంలో హోలీ పండుగను అధిక భాగం ప్రజలు జరుపుకుంటారు. బుందేల్ ఖండ్ లో జరుపుకొనే ఈ పండుగను గురించి వర్మగారు తమ నవల్లో రాశారు. ఫాల్గుణ శుక్ల పౌర్ణమి నాడు వచ్చే ఈ పండుగను కామోత్సవం అనీ, హోలిక అనీ, హోళికోత్సవం అని కూడ అంటారు. జాతి మత భేదాలను మరచి జరుపుకొనే ఈ పండుగ సమతాభావానికి ప్రతీక. మృగనయనీ నవలలో వర్మగారు ఈ పండుగను గురించి విపులంగా రాశారు. సికందర్ లోడీ దురాక్రమణ వల్ల సర్వం కోల్పోయిన స్థితిలో కూడ గ్వాలియర్ రాజ్యంలోని ప్రజలు హోలీ పండుగ జరుపుకొన్నారనీ, రంగులు కొనే స్తోమత లేక పేడ, బురద నీళ్లే చల్లుకొని హోలీ

పండుగను జరుపుకొనే సంప్రదాయాన్ని వదలలేదనీ, అలా పేద పరిస్థితిలో జరుపుకొన్నా ఆ పండుగ రోజుల్లో ప్రజలందరూ సంతోషంగా ఉన్నారనీ వర్మగారు రాశారు. "హోలీ రానూ వచ్చింది. సంధ్యవేళ మంట (జ్వాల) లేచింది".[1] "ఏ యుగంలోనో ఈ పండుగను ఒక నెలరోజుల వరకు జరుపుకొనేవారు. జీవితంలోని కష్టాలు, నెలరోజులను తగ్గించి ఐదు రోజులకు పరిమితం చేశాయి. ఇప్పుడు ఒక్క రోజుకే దుర్లభంగా ఉంది."[2] అని వర్మగారు రాశారు. హోలీ పండుగ సందర్భంగా ఒకరిపై ఒకరు రంగునీళ్ళను చల్లుకొని, రంగులు ముఖానికి, శరీరాంగాలకు పూసి ఆనందించేవారు. కాని మృగనయని నవలలో గ్రామ ప్రజలందరూ పేదవాళ్ళు కాబట్టి కొద్దిమంది పసుపు, కుంకుమ చల్లుకుంటున్నా, అవి లేనివాళ్ళు చాలమంది, దుమ్ము, ధూళి, పేడ, పోగుచేసి నీళ్ళల్లో కలపేశారనీ, గడచిన బాధల్ని మరచి కనీసం కొద్దిగంటల కాలమైనా ఉల్లాసంగా మునిగి తేలాలని భావించారు. వీరిలో స్త్రీలే అధికం.[3] నగరాల్లో హోలీ పండుగనాడు పురుషులు, స్త్రీలు ఒకరిపై ఒకరు రంగులు చల్లుకొన్నా గ్రామాల్లో మాత్రం స్త్రీలపై పురుషులు రంగులు చల్లేవారు కాదని వర్మగారు రాశారు. "స్త్రీలు ఒకరిపై ఒకరు పరుగు తెత్తించి, బురదలో ముంచెత్తి ఓడించి మరీ విడిచి.

1. మృగనయని, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 3
2. పైదే., పు; 3
3. పైదే., పు; 3-6

పెట్టినారు. గ్రామ పడుచులపై పురుషులెవ్వరూ రంగుగాని, బురద గాని వేయడం లేదు".[1] ఈ విధంగా రంగులు చల్లుకొని నృత్యాలు, ఆటపాటలతో కొంతసేపు ఆనందించిన తర్వాత స్నానసంధ్యలు ముగించుకొని గుడికి వెళ్ళి పూజలు చేశారని, గుళ్ళో పూజారి హోలీగీతం ఆలపిస్తే అందరూ వేరువేరుగా పాడేవారని వర్మగారు రాశారు. "ఉరఝూలనా శ్యామ ... కహీమానా"[2] అనే హోలీ పాటను మృగనయని అతిమధురంగా పాడింది. గ్వాలియర్ కోటలోనూ, హోలీ పండుగ ఘనంగా జరుపుకొన్నారు. కాని ఈ పండుగ సందర్భాన్ని పురస్కరించుకొని మానసింహుని సైనికులు భంగుత్రాగి, విచిత్ర వేషాలు వేసి, భీభత్సరూపాలు ధరించి గందరగోళం చేశారని, మొదట పరిహాసంగా ఉన్నా, తర్వాత నిజంగా కొట్లాడుకున్నారని రచయిత రాశారు. మృగనయనికి ఈ సైనికుల చర్య అసహ్యం వేసి బాధపడింది.[3] ఇలా పల్లెటూళ్లో రైతులు జరుపుకొనే హోలీకి, నగరాల్లో ప్రజలు జరుపుకొనే హోలీకి తేడా వివరించారు వర్మగారు.

గఢ్ కుండార్ నవలలో కూడా హోలీ ప్రస్తావన ఉంది. హోలికను దహించే పద్ధతి అతిప్రాచీనమైనదని, హోలికోత్సవం నాడు పిల్లలు, యువకులు, వృద్ధులు కూడ

1. మృగనయని, బృందావన్‌లాల్ వర్మ, పు; 4.
2. పైదే., పు; 21
3. పైదే., పు; 386

అరచుకొంటూ, ఎగురుకొంటూ, దొంగతనంగా కూడ కట్టెలను తెచ్చి అగ్నిగుండం (హోలిక) లో వేస్తారని, ఈ సమయంలో వారు చేసే అసభ్యమైన పనులు చూచి పెద్దలు మనస్సులోనే బాధపడేవారు. కాని బాహాటంగా విమర్శించి నివారించే వాళ్ళు కాదని వర్మగారు రాశారు.[1] ఈ ఉత్సవంలో నాగదేవుడు, అగ్నిదత్తుడు ఉత్సాహంగా పాల్గొన్నారని రాశారు.

లక్ష్మీబాయి నవరాత్రి ఉత్సవాలను వైభవంగా జరిపేది. అమావాస్య నాటి నుండే దుర్గా పూజ ప్రారంభించి తొమ్మిది రోజులు ఉదయాన్నే బాలికలు కలశాలు తీసుకొని పాటలు పాడుకొంటూ మందిరానికి పోయేవారు. మందిరాలలో దుర్గా సప్తశతి జరిపేవారు. చైత్రమాసం నవరాత్రుల్లో జరిగే ఈ ఉత్సవాన్ని పసుపు కుంకుమ ఉత్సవం అనేవారు. నగరంలోని అన్నివర్ణాల, వర్గాల స్త్రీలు పూలమాలలు మెడలో వేసుకొని పూజకోసం ఒకటిగా కలుస్తారు. గౌరీదేవి ప్రతిమను భూషణాలు, పూలతో అందంగా అలంకరిస్తారు. నాలుగువైపులా ధూపదీపాలు, నైవేద్యాలతో నిండి ఉంటుంది. స్త్రీలు పరస్పరం పసుపు కుంకుమలు పెట్టుకొంటారు. ఒకరినొకరు పరస్పరం భర్తల పేర్లు అడుగుతారు. దేవుని పూజించడం, మంచి భావనలు కల్గించడమే ఈ పండుగ ముఖ్యోద్దేశం. లక్ష్మీబాయి " తన

1. గఢ్ కుండార్, బృందావన్ లాల్ వర్మ., పు: 242.

మహాల్లో గౌరీదేవి ప్రతిమను స్థాపించింది. ప్రతిమను పూలమాల తోను, ఆభూషణాల తోనూ అలంకరించింది... నగరం లోని స్త్రీలందరూ అక్కడికి వచ్చి ఒక్కొక్కరు ఒక్కొక పనిలో నిమగ్నమై మాటావ్రుడిగా ఉన్నారు."[1] ఈ విధంగా రాజమహాల్ లోని 'పసుపు కుంకుమ' ఉత్సవం లో నగరం లోని స్త్రీలందరు పాల్గొన్నారని వర్మగారు రాశారు.

గఢ్ కుండార్ నవలలో ఆశ్వయుజ శుక్ల దశమిని విజయదశమి పండుగగా చేస్తారు. ఆరోజు రాజదర్బారుల్లో సామంత రాజులు తమ తమ సేనాపతులతో, రాజును అభినందనం చేసేందుకు వస్తారు.[2]

'అక్షయ తృతీయ' అనే పండుగ ప్రతి వైశాఖ శుక్ల తదియ నాడు వస్తుంది. గఢ్ కుండార్, కచనార్ నవలల్లో ఈ అక్షయ తృతీయ పండుగ ప్రస్తావన ఉంది. ఈ పండుగ నాడు దానమిచ్చే వారికి సకల సంపదలు చేకూరుతాయని ప్రజలు నమ్ముతారు. హురమత సింహుడు తన కూతురైన మానవతి వివాహం 'అక్షయ తృతీయ' నాడు చేయడానికి నిశ్చయిస్తాడు.[3] కచనార్ నవలలో "గ్రామం లోని స్త్రీలందరు వారి వారి కోరికలను తెల్పేందుకు ప్రార్థనలు చేసేందుకు

1. ఝాన్సీకి రాణీ లక్ష్మీబాయి, డా. బృందావన్ లాల్ వర్మ., పు: 88-89.
2. గఢ్ కుండార్, డా. బృందావన్ లాల్ వర్మ., పు: 25.
3. పై దే., పు: 260.

అక్షయ తృతీయ నాడు అచలపురి ఆశ్రమానికి వస్తారు"[1]

మాఘ మాసంలో మకర సంక్రాంతి రోజు నదిలో స్నానం చేయడం, దేవీమూర్తను పూజించడం ఒక పండుగలా జరుపుకుంటారని 'విరాటాకీ పద్మిని' నవలలో ఉంది.[2]

ఈ విధంగా వర్మగారు తన నవలలన్నింటిలోను, ఎన్నో కష్టాల మధ్య కూడ ప్రజలు అనేక విధాలైన పండుగలు, ఉత్సవాలు జరుపుకొన్నారని రాశారు.

**2. లలిత కళలు** : కళ మానవ సంస్కృతికి ప్రతీక. 'కం లాం తీతి కళా' అనే ఉత్పత్తిని బట్టి ఆనందాన్నిచ్చేది కళ. అరువది నాలుగు కళల్లో స్థాపత్యం, శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, కావ్యం అనే వాటిని లలిత కళలు అంటారు. లలిత కళల్లో అనిర్వాచ్యమైనట్టి ఆనందాన్నిచ్చే శక్తి ఉంది. మానవుని ఇంద్రియ బంధనాల నుండి దేశకాల పరిస్థితుల హద్దులను విస్మరించి కాల్పనిక జగత్తులో విహరింపజేసేది కళ. వర్మగారి నవలల్లో లలిత కళల్ని పరిశీలిద్దాం.

**స్థాపత్యం - శిల్పకళ** : మధ్యయుగంలో ప్రజాజీవితం అస్తవ్యస్థంగా ఉన్నా రాజులు, చక్రవర్తులు పరిస్థితులు బాగుపడ్డప్పుడు లలిత కళల్ని పోషించి తమ రాజ్యంలో కళాపోషణకు విలువ ఇచ్చారని తెలుస్తుంది. రాజా మానసింహ తోమర్ నిర్మించిన

---

1. కచనార్, డా. బృందావన్ లాల్ వర్మ., పు; 88
2. 〃 〃 ద్మిని, డా. బృందావన్ లాల్ వర్మ., పు; 2

కట్టడాలను చూచి ముగ్ధుడై బాబర్ కూడ అదేమాదిరి కట్టడాలను కట్టించాడనీ ఈ పద్ధతినే మొగలాయి చక్రవర్తులందరు అనుసరించి అద్భుతమైన తాజ్‌మహాల్, ఫతేపూర్ సిక్రీ, కుతుబ్ మినార్ లాంటి కట్టడాలు నిర్మించారని తెలుస్తుంది. రాజా మానసింహా తోమర్ కు 600 సంవత్సరాల ముందు తోమర్ వంశీయులు తైల మందిరాన్ని నిర్మించారని, అదే విధంగా మానమందిరం నిర్మించాలని రాజు మానసింహుడు అనుకుంటాడు. కాని విజయ జంగం ఆనాటి రాజు తెలంగాణా రాజకుమారిని వివాహం చేసుకొన్నందువల్ల దక్షిణదేశం శిల్పులు ఆమెతో వచ్చారని, ఆ శిల్పులూ, ఇక్కడి శిల్పులూ కలసి ఆ తైల మందిరం నిర్మించారని, ప్రస్తుతం అటువంటి శిల్పులు లేరని విజయ జంగం అంటాడు.[1] అయినా ఆ పద్ధతిలోనే కట్టిస్తానని మానసింహుడు చెప్తాడు. ఇలా దక్షిణా సంప్రదాయ శిల్పకళ ఆనాడే ఉత్తర భారతం చేరిందని మృగనయనీ నవలవల్ల తెలుస్తుంది. ప్రాచీన హిందూ రాజులు తమ పేరు చిరస్థాయిగా నిలవాలని అందమైన భవనాలను నిర్మించేవారు. మానసింహా తోమర్ తన ప్రియాతిప్రియమైన ప్రేయసి జ్ఞాపకార్థం మానమందిరం, గూజరీ మహాల్ నిర్మించాడు. గోపురాలు, గవాక్షాలు చాలసుందరంగా నిర్మింప చేశాడు. గయాసుద్దీన్ కూడ తనరాజ్యంలో కొన్ని మసీదులు కట్టించాడని

1. మృగనయనీ, డా. బృందావన్‌లాల్ వర్మ, పు: 313

మృగనయని లో ఉంది.

'అహల్యాబాయి' నవలలో రాణి అహల్యాబాయి తన సొంత ఖర్చులను తగ్గించుకొని ఉత్తర భారతం లోని బదరీనాథ్, కేదారనాథ్, కురుక్షేత్రం మొదలుకొని దక్షిణ భారతంలో రామేశ్వరం వరకు అనేక వందల కొలది మందిరాలను, ధర్మశాలలను, బావులను, స్నానఘట్టాలను నిర్మించింది.

"భాషా సాహిత్య రంగాల్లోనే కాకుండా శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, మొదలైన రంగాలలో కూడ హిందువుల పై మహమ్మదీయ ప్రభావం ఉన్నదనడానికెన్నో నిదర్శనలున్నాయి. క్రీ.శ. 1206-1761 మధ్యకాలంలో మహమ్మదీయ చక్రవర్తుల చేత ఎన్నో భవనాలు, సమాధులు, మసీదులు నిర్మింపబడ్డాయి. పర్షియన్లు పుట్టుకతో సౌందర్యారాధకులు కావడం, సంస్కృతికి పీఠమైన దేశం వీరి జన్మభూమి కావడం దీనికి కారణం. షర్షా చేత నిర్మింపబడిన ఒక సమాధి బౌద్ధ స్థూపంగానూ, హిందూదేవాలయ గోపురంగానూ, ముస్లింసమాధిగానూ, గోచరించడం ఆ భవన నిర్మాణం భారతీయ, మహమ్మదీయ శిల్ప కళారీతుల సమ్మేళనానికి నిదర్శనం అనవచ్చు. ఫతేపూర్ సిక్రీ లోని భవన నిర్మాణంలో భారతీయ శిల్పవిధానం గోచరించేందుకు ఆ భవననిర్మాణం లో హిందూశిల్పుల నియామకమే కారణం"[1]

---

1. బ్రిటిష్ కాలపు తెలుగు ముద్రిత పత్రాల్లోని హిందూస్థానీ ప్రతిదేయాలు (క్రీ.శ. 1800-1947) - పరిశోధనా గ్రంథం; డా. పి. కుసుమకుమారి., పు: 70 (అముద్రితం)

ఈ విధంగా శిల్ప, స్థాపత్య కళల్లో హిందువుల ప్రభావం మహమ్మదీయులపై, మహమ్మదీయుల ప్రభావం హిందువులపై ఉందని భావించవచ్చు.

ఇతరమైన లలిత కళలవలె మూర్తికళ కూడా సహాత్వపూర్వమయినదని భారతీయుల విశ్వాసం. శిల్పి దృశ్య జగత్తు నుండే తనకు కావలసిన సామగ్రిని గ్రహిస్తాడు. అతడు తన ఇష్టదేవతను ధ్యానిస్తాడు. ఆ ఆరాధన వల్ల అతని హృదయంలో ఒక జ్యోతి ఒక ఆకార రూపంగా గోచరిస్తుంది. దానినే అతను సుందరంగానూ, పవిత్రంగా ఉండే మూర్తిగా చిత్రిస్తాడు.

వర్మగారు తన నవలల్లో మూర్తికళను గురించి పేర్కొని ఉన్నారు. మృగనయని నవలలో క్రూరాత్ముడైన బఘర్రా కాంచీలోని దివ్య మందిరాలను ధ్వంసం చేయమని తన అనుచరులకు చెప్పే సందర్భంలో "ఆ మందిరాలను నేను కూడ చూచాను. ఆ విగ్రహాలు, మందిరాలు ఎంతో అందంగా ఉన్నాయి. రాతికి ప్రాణంపోసే హిందువుల మూర్తికళ చూచి చాల ఆశ్చర్యం కలుగుతుంది. ముసల్మానులైన మేము ఇలాంటి మూర్తులను నిర్మించలేము. ఆ మూర్తికళా సౌందర్యాన్ని వర్ణించడానికే అలవి కా"

'టూటే కాంటే' నవలలో కూడ "వ్రజ భూమి

· మృగనయని, డా. బృందావన్ లాల్ వర్మ, పు: 79

లోని మందిరాల్లో ఉన్న కృష్ణుని మూర్తి లోని మనోహరమైన
చిఱునవ్వు, నూర్‌బాయికే గాక చూచిన వారికి కూడా కోరిన
కోర్కెలు తీర్చే విగ్రహంగా కన్పించింది. ఆ మూర్తిని చూస్తూనే
నూర్‌బాయికి కేవలం ఆనందం కలగడమే గాక, సాక్షాత్తు
కృష్ణుని నేరుగా చూచినట్లు భావించి పులకరించి పోయింది."[1]
ఇలా మధ్యయుగంలో అనేక హిందూ, ముస్లిమ్ రాజులు అనేక
మందిరాలను, మసీదులను, భవనాలను, విగ్రహాలను,
దేవతా మూర్తులను నిర్మించారు.

చిత్రకళ : మధ్య యుగంలో శిల్పకళతో పాటు చిత్రకళకు
కూడా రాజులు మంచి ప్రోత్సాహం ఇచ్చారు. గ్వాలియర్ రాజైన
మానసింహుడు చిత్రకళను అధికంగా ప్రేమించేవాడు.
గ్వాలియర్ మహల్ లోని గోడలపై అందమైన, జీవకళ
ఉట్టిపడేటట్లుండే చిత్రాలను చూచి మృగనయనీ ఆ కళను
నేర్చుకోవాలని ఉత్సాహ పడుతుంది.[2] సంగీతంతో పాటు
చిత్రకళనూ నేర్చుకొంటుంది. కళావతి అనే కళాకారిణిని
మానసింహుడు, సంగీత నాట్యాలతో పాటు చిత్రకళను కూడా
ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో నియమిస్తాడు. 'కళ' మంచి
చిత్రకారిణి. 'టూటే కాంటే' నవలలో నూర్‌బాయి, బృందా
వన్ లోని కళాత్మక చిత్రాలనుచూచి ముగ్ధురాలౌతుంది.

---

1. బృందావన్ లాల్ వర్మాకే ఉపన్యాసోంమే సాంస్కృతిక అధ్యయన్, డా. కృష్ణ అవస్థీ, పు: 221.
2. మృగనయని, డా! బృందావన్ లాల్ వర్మ, పు: 195.

గారు తన నవలల్లో చిత్రకళను అక్కడక్కడా ప్రస్తావించారు

**సంగీతం- నృత్యం** : సింధు ప్రాంతాన్ని జయించిన తర్వాత ముస్లింలు స్థాపత్య కళతో పాటు సంగీత నృత్య కళలను పోషించారు. మొగలాయి వంశంలో ప్రసిద్ధి గాంచిన అక్బర్ సంగీతానికి ఎంతో విలువ ఇచ్చారు. చరిత్ర ప్రసిద్ధి గాంచిన 'తాన్‌సేన్' అక్బరు ఆస్థానంలోని వాడే. "మహమ్మదీయులు సంగీతప్రియులు. ఈ చక్రవర్తులు హిందూ, పర్షియన్ జాతులకు సంబంధించిన స్త్రీ పురుషులను తమ ఆస్థానంలో నియమించేవారు. షాజహాను ఆస్థానంలో రామదాసు, మహాపత్ర అనే హిందూ వయొలిన్ విద్వాంసులున్నట్లు తెలుస్తున్నది. తంబూర, డోలు, తబల, డోలక్, సారంగి, సరోద్, సితార్, బాంసురీ వంటి వాద్య విశేషాలు మహమ్మదీయుల నుండి హిందువులకు సంక్రమించినవి."[1]

గ్వాలియర్ రాజైన మానసింహుని ఆస్థాన విద్వాంసుడు బైజునాథ్ దగ్గర మృగనయనీ సంగీతం నేర్చుకొంది. మృగనయనీ ప్రేరణ ప్రోత్సాహంవల్ల బైజూనాథ్ బహుటోడీ, మంగళటోడీ, మంగళగుంజరీ మొదలైన రాగాలు సృష్టించాడు.[2] బైజూనాథ్ కాకుండా ఇంకొక విద్వాంసుడు విజయజంగం వీణావాయిద్యంలో అఖండుడు. "గ్వాలియర్‌లో మానసింహుడు సంగీత విద్యాపీఠాన్ని స్థాపించాడు. ఇది అతనికి సంగీతంలో గల అభిరుచిని చాటుతుంది."[3]

---

1. బ్రిటీషు కాలపు తెలుగు ముద్రిత పత్రాల్లోని హిందుస్థానీ ప్రతిదేయాలు, పరిశోధన గ్రంథం (అముద్రితం), క్రీ. శ. 1800-1947; డా. పి. కుసుమకుమారి, పు: 72.
2. మృగనయనీ, బృందావన్‌లాల్ వర్మ, పు: 364
3. పైదే., పు: 477

గోండు జాతి వారు సంగీత నృత్యాలకు ప్రాధాన్యం ఇచ్చారని రావు దలీపసింహ వివాహ సందర్భంగా 'కచనార్' లో వర్మగారు సూచించారు. "రావు దలీపసింహ తన పెండ్లికి గుర్తుగా సంగీత నాట్యాలను ఉత్సాహంగా తన కొత్త భార్యయైన కళావతి తో చూస్తారు. కళావతిని నాట్యంచేయుమని కోరుతాడు. ఆమె తన అసమర్థతను తెలిపినప్పుడు చాల బాధ పడ్తారు."[1]

ఢిల్లీ పాదుషా మహమ్మద్‌షా ఆస్థాన నర్తకి నూర్‌బాయి సంగీత, నృత్యాలు రెండింటిలోను అద్భుత ప్రతిభ గలది. నాదిర్‌షా ఆమె నృత్యప్రదర్శనను తిలకించి నాలుగువేల మొహరీలు బహుమతి ప్రకటిస్తాడు. చివరకు నూర్‌బాయి కృష్ణభక్తురాలై బృందావన్ చేరి, సూరదాస్, నందదాస్, రసఖాన్ మొదలైన భక్తకవుల గీతాలను తనమధుర కంఠంతో పాడుకొంటూ కాలం వెళ్ళబుచ్చుతుంది.

లక్ష్మీబాయి భర్త గంగాధరరావుకు నాట్యం, సంగీతం, నాటకాలు అంటే ఎంతో ప్రీతి. తన మహల్లో ఒక నాట్యశాలనే ఏర్పాటు చేయిస్తాడు. అతనికి గుర్రపుస్వారీ, కుస్తీలు, యుద్ధాలు లాంటి వీరవిద్యలకంటె, లలితకళలు, సాహిత్యం అంటేనే ప్రీతి అధికం. అతని దర్బారులో ఒక బ్రహ్మాండమైన పుస్తక భాండాగారాన్నే అభివృద్ధి పరిచాడు. కాని లక్ష్మీబాయికి

---

1. కచనార్, బృందావన్‌లాల్ వర్మ., పు.19.

కళలంటే అంతగా ఇష్టముండేది కాదు. ఆమెలో దేశం క్లిష్ట పరిస్థితి లో ఉన్నప్పుడు దేశాన్ని రక్షించుకోవాలనే తపన తప్పిస్తే వేరే వ్యాపకం లేదు.

'మృగనయనీ' నవలలో 'కళ' మంచి నాట్యకారిణి. ఆమె సహాకారంతో మృగనయనీ నాట్యం చేయడంలో కూడ గొప్ప ప్రావీణ్యం సంపాదించింది. ఒకసారి మృగనయనీ మానసింహుని ఎదుట తాండవ నృత్యం చేస్తుంది. ఆ నృత్యాన్ని చూసి మానసింహ తోమర్ ఎంతగా పరవసించి పోయాడంటే, ఆ అనుభవం ఆయన మృగనయనీ తో ప్రథమ సమాగంలో కూడ పొందలేదు.[1] అని రాశారు వర్మగారు. లాంఖీ కూడ గ్వాలియర్ వచ్చాక నృత్యం నేర్చుకుంది.

**వివాహాలు, ఆచారాలు:** వైదిక కాలం నుండి వివాహం అనే సాంఘిక కట్టుబాటు ఉండేది. రాను రాను ఈ వివాహ సంబంధాల్లో నియమాలు, నిబంధనలు పెరిగి సంఘంలో మానవత్వపు విలువలు పెంచేవిగా మారాయి. ఒకొక్కసారి ఈ నియమాలు మరీ కఠినంగా తయారై మానవశ్రేయస్సుకే ప్రతిబంధకంగా మారిన సందర్భాలు కూడ లేక పోలేదు. వర్మగారు తన చారిత్రక నవలల్లో బుందేల్‌ఖండ్ ప్రాంతంలో ప్రజలు ఆచరించే వివాహాల కొన్ని నియమాలు చక్కగా వివరించారు.

1. మృగనయనీ, డా. బృందావన్ లాల్ వర్మ, పు; 384

వివాహ సంబంధాల్లో ఆనాడు సజాతీయతను, కులీనతను పాటించేవారు. భిన్న జాతుల మధ్య వివాహం ఆనాటి సంఘం ఆమోదించలేదు. ఒకవేళ భిన్న జాతుల మధ్య వివాహం జరిగితే దానివల్ల అవమానం, నింద, దేశబహిష్కారం లేదా సర్వనాశనం చేసేవారు. దీనికి అటల్-లాఖాల వృత్తాంతమే మంచి ఉదాహరణ. ఆనాటి సమాజం ఒక పురుషుడు వేరొక స్త్రీని ఉంచుకొన్నా ఒప్పుకొంటుంది కాని వివాహం చేసుకొంటే మాత్రం ఒప్పుకోదు.

గఢ్ కుండార్ నవలలో, ఖంగారు జాతివాడైన నాగదేవుడు, బుందేల్ కన్య హేమవతిని వివాహం చేసుకోవాలి అనే సాహసం, నాగదేవుని తీవ్ర అవమానాల పాలు చేయడమే కాకుండా సమస్త ఖంగారు జాతి నాశనానికి కారణమైంది. బ్రాహ్మణుడైన అగ్నిదత్తుడు, క్షత్రియకుమారి మానవతి వివాహ ప్రస్తావన ఫలించదు. దివాకర్, తారలు ప్రేమించుకొన్నా, వారి వివాహానికి సంఘం ఆమోదించదని, సంఘం నుండి దూరంగా వెళ్ళిపోతారు. కానీ, 'మృగనయనీ' నవలలోని 'మృగనయనీ-మానసింహు'ల వివాహం ఒక అపవాదం. దీనికి కారణం రాజుని అడిగే ధైర్యం ఆనాటి సమాజానికి లేకపోవడమే.

1. బుందేల్ ఖండంలో సామాన్యంగా తల్లిదండ్రులు, అన్నదమ్ములు, గురువుల ద్వారా కుదిర్చిన వివాహాలే ఉత్తమమైనవని భావిస్తారు.
2. అమ్మాయి-అబ్బాయి జాతకాలు చూచేవారు. జాతకాలు కుదిరిన తర్వాత కుటుంబ స్థితిగతులు, సంఘంలో పలుకుబడి, వయస్సుకు సంబంధించిన విషయాలను గురించి అంతగా పట్టించుకొనేవారు కారు. ఉదాహరణకు లక్ష్మీబాయి వయస్సు దాదాపు పద్నాలుగు ఏండ్లు. గంగాధరరావుకు నలభై మించి ఉంది. అయినా వారి జాతకాలు సరిపోయాయి కాబట్టి వారి వివాహం జరిగింది.
3. జాతకాలు కుదిరిన తర్వాత నిశ్చితార్థం చేసుకోవడమనే ఆచారం ఉండేది. నిశ్చితార్థం రోజు కనీసం టెంకాయ, తాంబూలం పెండ్లి కుమారుని ఇంటికి పంపే ఆచారం ఉంది.[1]
4. వివాహానికి ముందు ఒకరోజు వధువు, వరుడు ఇద్దరిండ్లలోను మండపోత్సవం జరుగుతుంది. ఆసమయంలో కూడ బంధువులను, స్నేహితులను పిలిచి పిండివంటలతో భోజనాలు పెడ్తారు. సామూహికంగా పాటలు పాడుతారు.[2]
5. వివాహ సమయంలో పెళ్లికుమారుడు పల్లకిలో ఊరేగి పెళ్లి మండపానికి తప్పనిసరిగా రావాలి. ఆ రోజు రాజుకు కూడ అతణ్ణి పల్లకిలోంచి దింపే అధికారం లేదు. అంటే రాజు

1. గఢ్ కుండార్, డా. బృందావనలాల్ వర్మ., పు; 217.
2. పైదే; పు. 319.

ఎదుటు కూడా పెళ్లి కుమారుడు పల్లకీలో ఊరేగ వస్తు
విరాటాంకే పద్మిని నవలలో రాజు నాయక సింహుని ఎదుట
దేవీ సింహుడున్న పెండ్లి పల్లకి వెళుతుంది.

6. నేరేడు మరియు మామిడి చిగుళ్ళను తోరణాలుగా వివాహానికి గుర్తుగా కడతారు. [ఈ ఆచారం ఆంధ్ర దేశంలో పల్లెటూళ్ళలో నేటికీ ఉంది.]

7. నిశ్చితార్థం తరువాత వరుడి పక్షాన కన్యకోసం కంకణాన్ని పంపిస్తారు.

8. బుందేల్ ఖండ్ ప్రాంతంలో అధికంగా ఉన్న రాజగోండులు, ఖటోల అయాం గోండులలో వరుడు పెళ్లిరాజు రోగగ్రస్తుడుగా గాని, అశక్తుడుగా గానీ ఉండి పెళ్లి మండపానికి రాలేకపోతే అతని ఖడ్గంతో అగ్నిహోత్రం సాక్షిగా వివాహం జరిపిస్తారు. వరుడి పక్షాన వరుడి తమ్ముడు వధువుతో హాస్యోక్తులాడి కాలక్షేపం చేయాలి. కచనార్ నవలలో ఈ నియమం వల్ల దలీప సింహునకు అన్యాయం జరిగింది. మొదట అతని కత్తితో వధువు కళావతి కి పెళ్ళి చేస్తారు. దలీప్ సింహునకు వరుసకు తమ్ముడైన మాన సింహుడు కళావతి తో కాలక్షేపానికి కబుర్లాడగంబోయి, ఆమెను తన బుట్టలో వేసుకొంటాడు.

9. శుభలగ్నంలో పురోహితుడు మండపం క్రింద వరుని

ఉత్తరీయపు అంచుకు వధువు చీరకొంగు అంచుకు ముడి వేస్తాడు. దీని తర్వాతే పాణిగ్రహణం. తర్వాత వైదిక మంత్రాలతో అగ్నికి ప్రదక్షిణ చేస్తారు.[1]

10. పెండ్లి అయిన తర్వాత అత్తవారింటికి పంపేటప్పుడు యథాశక్తి కట్నం ఇవ్వాలి. కనీసం ఎంత బీదవాడైనా కట్నంరూపేణా ఒక ఆవునైనా ఇచ్చితీరాలి. తండ్రికాని, పెద్దన్నయ్యకాని వరుడికి కట్నకానుకలు ఇవ్వాలి.[2]

11. బుందేల్‌ఖండ్ ప్రాంతంలో అత్తవారింటికి వచ్చిన తర్వాత వధువుకు మారుపేరు పెట్టడం కూడ ఒక ఆచారమే. ఉదాహరణకు లక్ష్మీబాయి మొదటిపేరు మనూబాయి. వివాహమై అత్తవారింటికి వచ్చిన తర్వాతే లక్ష్మీబాయి గా మార్చారు. 'కచనార్' నవలలో దలీపసింహుని భార్యకు వివాహమైనతరువాత కళావతి అని పేరు పెట్టారు.

12. బుందేల్‌ఖండ్ ప్రాంతంలో గోండు జాతుల్లో పెండ్లి అయి వధువు అత్తవారింటికి వచ్చిన రోజున దేవతలకు పూజ చేసిన తర్వాత మత్స్యభేదం అనే కార్యక్రమం ఉంటుంది. ఇనుప పాత్రలో నీళ్ళు నింపి, పిండితో ఒక చేపను తయారు చేసి ఆ చేపను ఒకదారానికి కట్టి నీళ్ళలో వదులుతారు. ఒక స్త్రీ ఆదారమును పట్టుకొని కదలిస్తూ

1. ఝాన్సీకీ రాణీ లక్ష్మీబాయి, డా. బృందావన్ లాల్ వర్మ., పు; 163
2. మృగనయనీ, డా. బృందావన్ లాల్ వర్మ., పు: 207.

ఉంటుంది. వధువు, వరుడు చేతుల్లో చిన్న చిన్న బాణాలు ఇస్తారు. దానితో వారు ఆ చేపను కొట్టేదానికి ప్రయత్నిస్తారు. నేడు మన పెళ్ళిళ్ల లో ఒక ఉంగరాన్ని నీటి చెంబులో వేసి తీయమని చెప్పే ఆచారాన్ని ఈ మత్స్యభేదం పోలి ఉంది. మత్స్యభేదం తర్వాత గోండుల్లో నృత్యం, గానం చేసే అలవాటు ఉంది.

13. రాజ గోండులలో వధువు తో బాటు రాజుకు సేవ చేసేందుకు దాసీలను పంపే ఆచారం ఉంది. దళపసింహుని నవ వధువు తో బాటు కచనార్, లలిత అనే ఇద్దరు దాసీలు వస్తారు.

14. కొత్త కోడలు చేత ఒక నెలరోజులు ఏ పనీ చేయించరు. కాని పెండ్లి అయిన తర్వాత విందు భోజనాలు మాత్రం పెండ్లి కుమార్తె చేతి మీదుగా వడ్డించడం ఒక ఆచారం. మృగ నయనీ నవలలో లాఖీ పెండ్లి అయిన తరువాత అంతఃపురం లో స్త్రీలకు వడ్డన చేస్తుంది.

15. గోండులలో విధవా వివాహ ప్రసక్తి ఉంది గాని, రాజ గోండుల్లో పునర్వివాహ ప్రసక్తి లేదు.[1] కళావతి తన భర్త మరణించాడని తలచి మానసింహుని మరలా వివాహం చేసుకొంటుంది. ఆమె రాజ గోండుల కన్య కాదు. ఖటోలియా గోండుల కన్య. కాబట్టి ఆమె పునర్వివాహం ఆనాటి సమాజ ప్రకారం తప్పు

---

1. కచనార్, డా. బృందావన్ లాల్ వర్మ, పు: 134

కాదని భావించవచ్చు.

ఈ విధంగా వర్మగారు ఆనాటి బుందేల్‌ఖండ్ ప్రాంతం లోని ప్రజల వివాహ సంబంధాలను గురించి విపులంగా తమ నవలల్లో చర్చించారు.

**శిష్టాచారాలు** : ఆ నాడు బుందేల్‌ఖండ్ ప్రజల్లో పెద్దలను గౌరవించడం, కష్టపడి పనిచెయ్యడం, పేదవారిని ఆదరించడం మొదలైన మంచి అలవాట్లుండేవి. ముసాహెబజూ నవలలో 'ఫూరన్' ముసాహిబజూను 'కాకజూ' అని పిలిచేవాడు. ముసాహెబజూ ఫూరన్ తండ్రిని 'రమ్ము కాకా' అని పిలిచేవాడు. అతని ముందు ఎప్పుడూ హుక్కా తాగేవాడు కాదు. మానసింహుడు బ్రాహ్మణుడైన బోధన్ పండితునికి నమస్కరించడం, స్వయంగా యోగిదగ్గరకు వెళ్ళడం, లక్ష్మీబాయి బాబాగంగాదాసు దగ్గరికి వెళ్ళి సలహాలు పొందడం లాంటి మంచి అలవాట్లు వర్మగారి నవలల్లో ఎక్కువగా ఉన్నాయి. 'కష్టేఫలి' అన్నట్లు మృగనయనీ, లాఖీ, అటల్‌లు చిన్నప్పటినుంచి కష్టజీవులు. కాబట్టి గ్రామంలో కూడ వారు కొంత సంపద కలిగి ఉన్నారు. పేదవారికి సహాయం చేయడం కూడ ఒక మంచి అలవాటు. ముసాహెబజూ, చరఖారీ తమ పరివారానికి కడుపునిండా భోజనాలు పెట్టేవారు. వారిస్వంత నగలు కుదువపెట్టి అయినా పేదవారి క్షుద్బాధను తీర్చేవారు.

**నమ్మకాలు** : ప్రతి దేశం లోను ప్రజల్లో కొన్ని నమ్మకాలు, విశ్వాసాలు తప్పక ఉంటాయి. ఎంతో బాగా అభివృద్ధి చెంది ఉన్న విదేశాల్లో, బాగా విద్యావంతులైన వారిలో కూడ ఈ నమ్మకాలు, విశ్వాసాలు ఉంటాయనడంలో ఆశ్చర్యం లేదు. ఈ నమ్మకాలకు, విశ్వాసాలకు సైద్ధాంతిక వ్యాఖ్యానం చెయ్యడం చాల కష్టమైన పని. ఎవరి నమ్మకం, విశ్వాసం వారిది. ఆ లాభ నష్టాలకు వారే బాధ్యులు.

వర్మగారి నవలలన్నీ బుందేల్ ఖండ్ ప్రాంతానికి సంబంధించినవి కాబట్టి, ఆ ప్రాంతం నమ్మకాలు, విశ్వాసాలు వారి నవలల్లో చోటుచేసుకున్నాయి. పట్నం ప్రాంతాలకంటె, పల్లె ప్రాంతాలలో నివశించే అమాయకులగు పల్లెవారే, కొన్ని నమ్మకాలను, విశ్వాసాలను గుడ్డిగా నమ్మి కష్టాల ఊబిలో ఇరుక్కొని, భగవంతుని పై నమ్మకముంచి బ్రతుకులు సాగించేవారు.

1. **ముహూర్తం,లేక శుభలగ్నం** : ఆ నాడు పురోహితులు పెట్టే ముహూర్తాలు, శుభలగ్నాలంటే ప్రజలకు విపరీతమైన నమ్మకాలుండేవి. రాజులు, పాదుషాలు కూడా పురోహితులు పెట్టే ముహూర్తాల ప్రకారం నడుచుకొనేవారు. మృగనయని- మాన సింహుల వివాహ ముహూర్తం బోధన్ పండితుడు నిర్ణయిస్తాడు. లాఖి, అటల్ ల వివాహ ముహూర్తం విజయజంగం పెడ్తాడు.

పండుగ రోజుల్లో స్నానాలు అవీ చేయడానికి ముహూర్తం నిశ్చయిస్తారు విరాటాకీపద్మినీ నవలలో నాయక సింహునికి 'గఢ మఢ' తీర్థంలో స్నానం చెయ్యడానికి ముహూర్తం నిశ్చయిస్తారు.

**జాతకాలు** : మధ్యయుగంనాటి ప్రజలకు జాతకాలపై నమ్మకం ఎక్కువ. వధూవరులకు పెండ్లికి ముందు తప్పక జాతకం చూస్తారు. జాతకం కుదిరితే మిగిలనవాటికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వరు.

**2.శకునాలు** : వర్మగారి కాలంలో మధ్యయుగంనాటి ప్రజలకు శుభాశుభ శకునాలపై నమ్మకం ఉండేది. ఆ శకునాల ప్రస్తావన వర్మగారి నవలల్లో కూడ అక్కడక్కడ కనబడుతుంది. "బయలుదేరేటప్పుడు తుమ్మడం, ముగ్గురూ కలసి ఏ పనికైనా పోవడం మొదలైనవి అశుభాలుగాను, ఆవు ఎదురుగా రావడం, స్త్రీకి ఎడమ కన్ను, ఎడమ భుజం అదరడం, పురుషులకు కుడికన్ను, కుడిభుజం అదరడం మొదలైనవి శుభశకునాలుగ పరిగణించేవారు."[1] ఈ నాటికీ ఆంధ్రదేశంలో కూడ ఈ శుభ, అశుభ శకునాలపై ప్రజలకు నమ్మకం ఉంది.

**3.సాముద్రిక శాస్త్రం** : తన భవిష్యత్తును గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస మనుష్యులకు అధికంగా ఉంటుంది. భవితవ్యాన్ని తెలుసుకోవడానికి హస్తరేఖలను చూపించే పద్ధతి నేడు కూడ

---

1. బృందావన్‌లాల్ వర్మ కా ఉపన్యాసోంకే సాంస్కృతిక అధ్యయన్, డా. కృష్ణ అవస్థి., పు; 290.

ఉంది. సాముద్రిక శాస్త్రంపై భారతీయులకు గొప్ప నమ్మకం ఉంది. ఈ నమ్మకాన్ని వర్మగారు తమ నవలల్లో రాశారు. మృగనయని నవలలో 'నటవర్గం' లోని ఒక మధ్యవయస్కురాలు నిన్నీ, లాఖీల చేతులు చూచి వారిద్దరికీ భవిష్యత్తు చెప్తుంది. నిన్నీతో "అమ్మాయీ! నీవు గొప్పగా సామ్రాజ్యాన్నే నుదుట వ్రాయించుకొచ్చావమ్మా! రాజుకి కాదు, గొప్ప మహారాజుకే రాణివి అవుతావు. అబద్ధం ఐతే నానాలుక కోసి పారవేయి."[1] అట్లాగే లాఖీతో "నీవు గొప్ప దుర్గాధిపతిని పెండ్లాడుతావు. గొప్పింటి వారే తే"[2] అంటుంది.

4. స్వప్నాలు : స్వప్నాలను గురించి ప్రజల జీవితంలో చాలా నమ్మకాలు చాలకాలం నుండి స్థిరంగా చోటు చేసుకొని ఉన్నాయి. రాత్రులు స్వప్నాలు వచ్చే సమయాన్ని బట్టి వాటి ఫలితం భిన్నంగా ఉంటుందనే నమ్మకం ప్రజల్లో ఉంది. వర్మగారు కూడా తన నవలల్లో స్వప్నవృత్తాంతాలు ప్రవేశపెట్టి స్వప్నాల ద్వారా భవిష్యవాణిని పలికించారు. లక్ష్మీబాయి బ్రిటీష్ వాళ్ళతో చివరి పోరాటంలో మరణిస్తుంది. బ్రిటీష్ వాళ్ళు గెలుస్తారు. ఈ విషయాన్ని సూచన ప్రాయంగా 'కల' ద్వారా చెప్పారు. వర్మగారు. "లక్ష్మీబాయి కలలో ఒక తెల్లటి అందమైన యువతి కనబడుతుంది. ఆమె పెద్ద పెద్ద నల్లటి కండ్లతో, ఎర్రటి చీర కట్టుకొని, శరీరం నిండా ఆభరణాలు

1. మృగనయని, డా. బృందావన్ లాల్ వర్మ., పు: 121
2. పైదే., పు; 121

ధరించి ఉంది. ఆమె కోట బురుజుపై నిలబడి ఆంగ్లేయులు వర్షించే తుపాకీ గుండ్లను తన కోమలమైన చేతులతో అడ్డుపెట్టి ఎదుర్కొంటూ ఆమె లక్ష్మీబాయితో ఇలా చెబుతుంది. 'లక్ష్మీబాయి! చూడు - ఈ గుండ్లని ఎదుర్కొని నా చేతులు నల్లగా అయినాయి. విచారించవద్దు. స్వారాజ్యదేవత అమరురాలు'"[1] అని చెప్తుంది.

'కచనార్' నవలలో 'దరూ' ఉరి నుండి తప్పించిన దలీప సింహునిపై కోపించిన గోసాయి అచలపురి ఆ రాత్రి ఒక కలకంటాడు. ఆ కలలో పార్వతీ పరమేశ్వరులు కూడ 'దరూ' వధను నివారిస్తూ కనబడతారు. దరూ పట్ల తన ప్రవర్తన న్యాయంగా లేదని ఈ కలవల్ల అచలపురి తెలుసుకొంటాడు. అంతే కాకుండా హత్యవల్ల కలిగే మహాపాపం నుండి తాను తప్పించుకొన్నానని సంతోష పడుతాడు.[2] విరాటాకీ పద్మిని నవలలో కుముద్ గర్భంలో ఉన్నప్పుడు ఆమె తల్లి విచిత్రమైన స్వప్నాలు కనేది.[3]

**5. వ్రతాలు, పూజలు** : కోరిన కోరికలు నెరవేరడానికి దేవుళ్ళకు పూజలు చేయడమే కాకుండా కొన్ని వ్రతాలు ఆచరించడం పై కూడ బుందేల్‌ఖండ్ ప్రజలకు పూర్తి విశ్వాసం ఉంది. వ్రతాలు మండలం రోజులు, మూడు మాసాలు, ఇలా వ్రత నియమాన్ని బట్టి చేయవలసి ఉంటుంది. కొన్ని వ్రతాలకు

1. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 364.
2. కచనార్, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 363, 364.
3. విరాటాకీ పద్మినీ, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 144.

ఆ రోజుల్లో ప్రతిదినం తులసి మొక్కలపై నీళ్లు పోయడం, రావి చెట్టు వద్ద దీపం వెలిగించడం, నిత్యపూజలు చేయడం మొదలైన పద్ధతులను ఆచరించేవారు. 'గఢ్ కుండార్' నవలలో తారకు వివాహ విషయంలో మంచి వరుడు దొరకాలని ఆమె తండ్రి కోరితే ఒక తాంత్రికుడు ఆమెను మూడు మాసాలు ఒక వ్రతం చేయమంటాడు. ఆమె అతని ఆదేశానుసారం శక్తి భైరవ మందిరానికి పోయి ఎర్రగన్నేరు పూలతో నిత్య పూజలు క్రమం తప్పకుండ చేస్తుంది.[1]

6. మంత్రతంత్రాలు : మానవుని సుఖమయ జీవితంలో రోగం పరం పరగా వచ్చే భయంకర బాధ. ప్రాచీన కాలం నుండి మానవుడు మందు మాకులతో బాటు రోగ నివారణకై మంత్ర తంత్రాలను కూడ ప్రయోగించేవారు. ఈ అంధవిశ్వాసాన్ని వర్మగారు తన నవలల్లో చూపెట్టారు. గుర్రాన్నుండి పడిపోయిన దలీప సింహుని ఆరోగ్యవంతుణ్ణి చేయడానికి మందులతో బాటు మంత్ర తంత్రాలను ప్రయోగిస్తారు. మేకలను బలి ఇస్తారు. అలా చేస్తే నయమౌతుందని రాణి కళావతి, తదితరులు భావిస్తారు.[2]

7. అమానుష శక్తులు : వర్మగారి నవలల వల్ల అమానుష శక్తుల ప్రభావాన్ని ప్రజలు నమ్ముతున్నారనే విషయం ద్యోతకమౌతుంది. సామంతులైన మాలీ చందేల్, చమూన్, పదేవార్

1. గఢ్ కుండార్, డా. బృందావన్ లాల్ వర్మ; పు. 144.
2. కచనార్, డా. బృందావన్ లాల్ వర్మ, పు. 109.

వంటి శూరవీరులు, లాల్‌సింహా, బుద్ధ, పైలాం మొదలైన విద్యా-
వంతులు కూడా భూత, ప్రేత, పిశాచాలున్నాయని నమ్ముతుంటే
సామాన్య ప్రజలు నమ్మడంలో ఆశ్చర్యం లేదు. కచనార్ నవలలో
దలీప సింహుని ముఖ్యరాజోద్యోగి 'కాలేసాహ్' బైజునాథ్ ని
అన్యాయంగా చంపేస్తాడు. బైజునాథ్ సోదరుడు దరూ, కోపంతో
కాలేసాహ్ ని చంపేస్తాడు. పూర్తి విచారణ జరపకుండా రాజు
దలీప సింహుడు దరూకి మరణశిక్ష విధిస్తే దరూ తప్పించుకొని
పారి పోతాడు. అకాల మృత్యువు పాలైన బైజూనాథ్ ప్రేతాత్మ
రాజు చర్యకు కోపించి అతన్ని పట్టి పీడిస్తుంది. అందుకే రాజుకు
స్మృతి పోయిందని పుకారు పుడుతుంది. ఈ పుకారు ప్రజలంతా
నమ్ముతారు[1]. గఢ్ కుండార్ నవలలో దివాకరుడు ఎర్ర గన్నేరు
పూలు కోసినందువల్లే, దేవతలు ఆగ్రహించారనీ, అందుకే
అతనికి కారాగారవాసం ప్రాప్తించిందని, కాపలావాళ్ళు
భావిస్తారు.[2]

8. **ప్రమాణాలు** : నేడు కోర్టుల్లో సాక్ష్యం భగవద్గీతపై ప్రమాణం
చేసి చెప్పినట్లు ఆనాడు తమ మాటను ఋజువు పరచు
కోవడానికి ప్రమాణాలు చేసేవారు. గౌరవింపదగిన వ్యక్తి
పైగాని, భగవంతునిపైగాని, గంగాజలంపైగాని, వస్తువుల
పైగాని సాధారణంగా బుందేల్‌ఖండ్ వాసులు ప్రమాణం

1. కచనార్, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 146.
2. గఢ్ కుండార్, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 409.

చేస్తారు. నాగదేవుడు అగ్నిదత్తునికి సాయపడుతానని భైరవి సాక్షిగా ప్రమాణం చెయ్యడం,[1] అటల్ లాంఛని వివాహం చేసుకోవడానికి గంగాజలాన్ని సాక్షిగా తీసుకొని ప్రమాణం చెయ్యడం,[2] హేమవతి తక్కువజాతి వాడిని వివాహం చేసుకోనని అగ్నిపై ప్రమాణం చెయ్యడం,[3] మొదలైనవి కొన్ని ఉదాహరణలు.

9. మృత్యువుపై నమ్మకాలు : చనిపోయిన తర్వాత మరణించిన వ్యక్తి ఆత్మ అతడు ఆచరించిన పాపపుణ్యాల ఫలితంగా స్వర్గ, నరకాలు ప్రాప్తిస్తాయని భారతీయుల నమ్మకం. వర్మగారి నవలల్లో ఈ ప్రసక్తి విశదంగా కనిపించనప్పటికీ, యుద్ధంలో దేహత్యాగం చేసినప్పుడు స్వర్గానికి వెళతారనే విశ్వాసం ప్రజల్లో ఉండేదని రాశారు. పుణ్యపాలుడు 'పరివార్' యుద్ధంలో చనిపోతే అతడు స్వర్గానికి వెళ్తాడని అందరూ నమ్ముతారు.[4] కాషాయ వస్త్రాలు ధరించి, కాషాయ తిలకం పెట్టుకొని చావును కోరుకొనే సబదల సింహుడు అతని అనుచరులతో కూర్చొని స్వర్గానికి విమానంలా వెళ్ళినట్లు అనుకొంటాడు[5]

---

1. గఢ్ కుండార్, డా. బృందావన్ లాల్ వర్మ., పు; 19
2. మృగనయని, " , పు; 199
3. గఢ్ కుండార్, " , పు; 127
4. పైదే., పు; 288
5. విరాటాకీపద్మిని " , పు; 350

రావు దలీపసింహ సాగరసేనలతో యుద్ధంలో చనిపోతే స్వర్గప్రాప్తి గెలిస్తే రాజ్య ప్రాప్తి వస్తుందని అనుకొంటాడు.[1] అటల్ తన ప్రాణ సమానమైన లాఖీ చనిపోతే తనుకూడ ఆమె ఎక్కడికి వెళ్లిందో అక్కడికి వెళ్ళి వివాహం చేసుకొంటానని చనిపోతూ అనుకొంటాడు.[2]

ఈ విధంగా బుందేల్ ఖండ్ వీరులకు మృత్యువు భయంకరంగా కాక, సౌభాగ్యకరంగా కనబడేదని వర్మగారి నవలల వల్ల అర్థమౌతుంది.

10. పుణ్యతీర్థ స్నానాలు: పవిత్ర నదుల్లో స్నానాలు చేస్తే పుణ్యమనీ, శుభప్రదమనీ ఆనాటి ప్రజలు అనుకొనేవారు. నాందుక సింహుడు రోగి అయినప్పటికి పాలర్ సరస్సులో ప్రతి సంవత్సరమూ స్నానానికి వెళ్ళేవాడు. నర్మదానదిలో స్నానం చేస్తే పుణ్యమనీ, తీర్థయాత్రలు చేయడం స్వర్గప్రాప్తి నిస్తుందని ఆనాటి ప్రజలు నమ్మేవారు.

ఈ విధంగా వర్మగారి నవల్లో ఆనాటి సంస్కృతీ సంప్రదాయాలు అడుగడుగునా మనకు తారసపడతాయి.

1. కచనార్, డా. బృందావనలాల్ వర్మ., పు: 92
2. మృగనయనీ " ., పు: 432
3. విరాటాకీ పద్మిని " ., పు: 1-2

5.2.4. బృందావన్‌లాల్ వర్మగారి చారిత్రక నవలల్లో మతపరిస్థితులు:

5.2.4.0. ప్రవేశిక: వర్మగారి నవలల్లో బాపిరాజుగారి నవలల్లో మాదిరి మతప్రస్తావన విరివిగా జరుగక పోయినా, నవలా కాలం నాటికి మహమ్మదీయులు, క్రైస్తవులు కూడ హిందూదేశాన్ని ఆక్రమించుకొని పరిపాలిస్తున్నారు కాబట్టి వారి నవలల్లో ఒక్కొకక్కడ మతచర్చ జరిగింది. ఆనాడు మహమ్మదీయ రాజులు హిందూ రాజ్యాలపై దండెత్తి గ్రామాలకు గ్రామాలు నాశనం చెయ్యడం, దోచుకోవడం, స్త్రీలను బలాత్కరించడం, అడ్డు వచ్చేవారిని నిర్దాక్షిణ్యంగా చంపేయడం, బావుల్లోను, చెరువుల్లోను శవాలను పడవెయ్యడం, నీటిని విషపూరితం చెయ్యడం, హిందూ మందిరాలను ధ్వంసం చెయ్యడం ప్రబలంగా ఉండేవి. ఆనాటి ముల్లాలు, మౌల్వీలకు తమ మతంపై దురభిమానం ఎక్కువ. ఈ మతగురువులు రాజులను చక్రవర్తులను తమ చెప్పుచేతల్లో పెట్టుకొని మతమౌఢ్యంతో తమ మతమే గొప్పదని భావించి ఇతర మతస్థులను హింసించేవారు. ఇస్లాం మతంలో చేరమని నిర్బంధించేవారు. చేరక పోతే క్రూరాతిక్రూరంగా చంపించేవారు. ఈ విషయాలన్నింటిని వర్మగారు తన నవలల్లో చర్చించారు.

5.2.4.1. మతపరిస్థితులు : 'భువనవిక్రమ్' నవలలో అయోధ్యను పాలించిన రాజు రోమకుడు, తనరాజ్యంలో సంభవించిన

కరవు కాటకాలకు కపింజలుని తపస్సే కారణమని తలచి ఆతణ్ణి చంపడానికి ప్రయత్నిస్తాడు. వర్మగారు ఈ సంఘటనను భవభూతి రచించిన ఉత్తరరామ చరిత్ర లోని 'శంబూక వధ' ఆధారం చేసుకొని రచించాడనిపిస్తుంది. దీనికి సంబంధించిన ఆధారాలు ముఖ్య గ్రంథాల్లో లభిస్తున్నాయి.[1] "శంబుక వధ మత రక్షణాసక్తి ప్రేరితము కాదనియు, రాజనీతి ప్రేరితమనియు, నుత్తర రామాయణముఁ జదివిన వారికెల్ల బోధపడక మానదు,"[2] అని కొందరి వాదం. మరి కొందరు వైదిక మతంలో శూద్రునికి తపస్సు చేసే అధికారం లేదు, అని మతపరంగా చెప్పి ఉన్నారు. వర్మగారు వైదిక కాలం నాటి ఈ దురాచారాన్ని అప్పటి కాలం వారే ఖండించారని తెల్పడానికే 'భువన విక్రమ్' రచించి ఆనాడే రోమకుని కుమారుడు భువనుని చేతనే కపింజలుని చంపకుండా వారిస్తాడు. మానవత్వం పెంచుకొన్న భువనుడు ఏ జాతి వారైనా, ఏ మతం వారైనా అందరూ సమానులే. జాతి మతాల ప్రమేయం లేకుండా కేవలం తపస్సే కాదు, ఏ మంచి కార్యం చేసే దానికైనా అధికారం ఉంది, అని నిరూపించాడు.

---

1. శంబుకుడు ఒక శూద్రయోగి. శ్రీరాముడు రాజ్యము చేయునపుడు ఈ యోగి తపస్సు చేసి తన తపోమహిమచే నింద్ర లోకమునకు పోవ సిద్ధముగ నుండెను. ఈ శూద్రుడు తపస్సు చేయుట వలన బ్రాహ్మణ బాలుడు చనిపోయెను. ఇట్లు వికృతము జరిగెను కావున రాముడు శంబుకుని సంహరించెను.
— పూర్వ గాథాలహరి, శ్రీ వేమూరి శ్రీనివాసరావు., పు. 442.
2. శంబుక వధ, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి; తొలి పలుకు; పు; 39.

గఢ్ కుండార్ నవలలో మతప్రస్తావన కంటె భిన్న జాతుల మధ్య సంఘర్షణల చిత్రణ ఎక్కువ. ఆనాటి బుందేలులు, ఖంగారుల కంటె ఎక్కువజాతి వారని హేమవతి, నాగదేవుని ప్రేమను తిరస్కరిస్తుంది. అలాగే మానవతి, అగ్నిదత్తులు; తార, దివాకరుల ప్రేమలు ఫలించవు. మొదట హిందూమతంలో వర్ణాశ్రమ ధర్మాలు పుట్టి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాల్గు శాఖలు తర్వాత రాను, రాను అనేక ఉపశాఖలై హిందూమతంలో జాతి భేదాలు, కుల భేదాలు ఏర్పడి, ఒకజాతి హీన జాతి, మరొక జాతి ఉత్తమ జాతి అనే భావన ఏర్పడింది. జాతికి, మతానికి అవినాభావ సంబంధం ఉంది కాబట్టి వర్మ గారు గఢ్ కుండార్ నవలలో జాతి భేదాలను చర్చించారంటే పరోక్షంగా మత ప్రస్తావన తెచ్చారనే అర్థం. ఈ నవలలో మతప్రస్తావన కూడ అంటీ అంటునట్లు ఉందని చెప్పవచ్చు. వీరు వీరశైవులు అని తెలుస్తుంది. ఖంగారు రాజు నాగదేవుడు, అగ్నిదత్తుని చెల్లెలు తార ఎర్రగన్నేరు పూలతో శక్తి భైరవిని పూజించే వారని వర్మగారు రాశారు. ఇంకా బుందేలులు దుర్గాదేవిని పూజిస్తారనీ, దేవీ హోమం చేస్తారనీ, 'వింధ్య వాసిని' అనే దుర్గాదేవి మందిరం కట్టించారని వర్మగారు రాశారు.

మృగనయని నవలలో మతమౌఢ్యం కొట్టొచ్చినట్లు కనబడు తుంది. ఇందులోని బోధన్ పండితుడు రూఢివాది.

ప్రాచీన సంప్రదాయాలను పాటిస్తూ, హిందూమతాన్ని గుడ్డిగా నమ్మేవాడు. వర్ణాశ్రమాచారాలను పాటించేవారు అందుకే భిన్న జాతులకు సంబంధించిన అటల్ లాఖేల వివాహానికి రాజైన మానసింహుడు చెప్తున్నా అంగీకరించకుండా గ్వాలియర్ రాజ్యాన్ని వదలి వెళ్ళిపోతాడు. సుమారు మూడు సంవత్సరాలు తీర్థయాత్రలు చేసిన అనంతరం సికందర్ లోడీ లక్నోలో బస చేసి ఉన్నప్పుడు అక్కడికి చేరుకొంటాడు. అప్పుడు మౌల్వీలు "ఏ హిందువుడికైనా సాహసం ఉంటే వచ్చి మాతో మత విషయాలు చర్చించవచ్చు"[1] అని తమ గొప్పతనాన్ని ప్రదర్శించుకోవడానికి ప్రకటన చేయిస్తారు. ఇతరులెవ్వరూ ఈ సవాలును అంగీకరించడంలో లాభం లేదని తలచి మౌనం వహిస్తే, బోధన్ పండితుడు మాత్రం హిందూమతమే గొప్పదని వాదంలోనికి దిగుతాడు. తమ మతం ప్రకారం ఆత్మ నిత్యమని, శరీరం అశాశ్వతమని, దైవం అందరిలోనూ ఉన్నాడని పరమాత్మ తత్త్వాన్ని వివరిస్తాడు. కాని ముల్లాలు అతని సిద్ధాంతాన్ని ఖండిస్తారు. ఒక ముల్లా ఇలా అంటాడు. "మాలో సూఫీ (మహమ్మదీయుల్లో ఒక తెగ) కూడ ఇదే చెబుతుంటారు. కావున వారు కూడ తప్పుత్రోవన ఉన్నారు"[2] అంటాడు. ఒక రకంగా బోధన్ పండితుని సిద్ధాంతాన్ని, సూఫీ సిద్ధాంతంతో

---

1. మృగనయనీ, డా. బృందావన్‌లాల్ వర్మ, పు; 371.
2. పైదే., పు; 371.

పోల్చారు వర్మగారు. ఇంకా బోధన్ పండితుని సిద్ధాంతాన్ని ఖండిస్తూ ముల్లాలు అల్లా ఒక్కడే దేవుడనీ, భగవంతుడు అందరికంటె భిన్నమని వాదిస్తారు. వారి వాదనతో ఏకీభవించక బోధన్ పండితుడు, "నేను సత్యాన్వేషణ చెయ్యడానికి, సత్యవాక్కును చెప్పడానికి వచ్చాను. నామాటలు నచ్చకపోతే చెప్పండి వెళ్లి పోతాను"[1] అంటాడు. అప్పుడొక మౌల్వీ "ఎట్లా వెళ్ళిపోతావు బ్రాహ్మణుడా? ఓటమిని అంగీకరించు. ఇస్లాం మతాన్ని స్వీకరించు. అప్పుడే ఇక్కడ్నుంచి వెళ్ళగలవు."[2] అంటాడు. కాని బోధన్ పండితుడు "నామతం ఏ మతం కంటె తక్కువ కనుక నేను దానిని విడచి అన్యమతాన్ని ఆశ్రయించనూ?"[3] అని నిశ్చయంగా అంటాడు. అప్పుడు మౌల్వీలు బోధన్ పండితుణ్ణి 'కాఫిర్' అని నిర్ణయించి తలనరికివేయమని ఆజ్ఞాపిస్తారు.[4] ఇలాంటి భయం వల్ల "14వ శతాబ్ది అంతానికి అసంఖ్యాకులైన హిందువులు, మహమ్మదీయులుగ మారడం, సమాజంలో వివిధ వర్గాలకు చెందిన ప్రజల జీవిత విధానంలో ఎన్నో మార్పులకు కారణమయ్యింది."[5]

మౌల్వీల శిక్షను బోధన్ పండితుడు శాంత గంభీరంగా

---

1. మృగనయని, డా.బృందావనలాల్ వర్మ., పు: 372
2. పైదే., పు: 372
3. పైదే., పు: 372
4. పైదే., పు: 372
5. బ్రిటిష్ కాలపు తెలుగు ముద్రితపత్రాల్లోన్ని హిందూస్థానీ ప్రతిదేయాలు (క్రీ.శ. 1800-1947) డా. పి. కుసుమ కుమారి., పు; 77 (అముద్రిత సిద్ధాంత వ్యాసం)

అంగీకరిస్తాడు. ఈ సంఘటనలో వర్మగారు హిందూ మహమ్మదీయుల మత తత్త్వాన్ని కళ్లకుకట్టినట్లు చూపించారు. చనిపోయేముందు భూషన్ పండితునికి జ్ఞానోదయం అవుతుంది. "భగవంతుడు అందరిలోనూ ఉంటాడు. నాలోనూ, ఘాతుకునిలోనూ అతడే ఉన్నాడు. ఘాతుకుని ఖడ్గంలోను, నా శిరస్సులోనూ ఉన్నది అతడే. అన్నింటిలోను అతడే. అన్నీ సమానమే. ఆటల్, లాఖ్ లోనూ అతడే ఉన్నాడు. ఇద్దరిలోనూ అతడే ఉన్నాడా? అయితే వారిద్దరిమధ్య భేదం ఎందుకు చూశాను,"[1] అని అనుకొంటాడు. ఈ జ్ఞానోపదేశం వర్మగారు భూషన్ ద్వారా పాఠకులకు చేశారు. అంటే కులం, మతం, జాతి భేదాలతో కుళ్లిపోయే సమాజానికి. వర్మగారు ఇంతటి ఉదాత్తమైన తత్త్వాన్ని ఆనాడే విపులీకరించి సర్వమతాల, జాతుల, కులాల సారాంశం ఒక్కటేనని, సర్వమతాలను సమదృష్టితో చూడాలని, సమైక్యతాభావంతో దేశ పురోభివృద్ధికి పాటుపడాలని ప్రబోధించారు. హిందూమతంలో వేర్రి తలలు వేసిన శైవ, వైష్ణవ మతాల దురభిమానాన్ని పరోక్షంగా విమర్శించారు.

సికిందర్‌లోడీ సైనికులవల్ల కుళ్లిపోయిన శవాలతో విషపూరితమైన బావులను శుభ్రపరచే సందర్భంలో, బావి

---

1. మృగనయనీ, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 374

శుభ్రపడిన తర్వాత ఒక వైష్ణవ బ్రాహ్మణుడు గంగాజలం తెచ్చి పూజ చేయడానికి సిద్ధపడుతుంటే విజయజంగం అనే శైవుడు వాదించి గంగాజలం నాలుగు బొట్లు రాలిస్తే బావి శుభ్రపడదు. "మట్టితో శివలింగాన్ని చేసి 'ఓం నమశ్శివాయ' అనే మంత్రంతో అభిమంత్రించి బావిలో వేస్తేనే బావి శుభ్ర పడుతుంది", అంటాడు. ఇద్దరూ వాదించుకొంటారు. చివరకు ఈ సమస్య రాజు వరకు వెళుతుంది. కాని రాజు ఈ వాదనలు శుష్కమైనవి అని కొట్టిపారేసి ఇలా అంటాడు. "ఈ విషయంలో వాగ్వాదాలు జరపడం వ్యర్థం. మనిషికి కర్మచేయడమే ముఖ్యం. కర్మ నుండి తప్పించుకోవాలనుకునేవారు ఈ ప్రక్కదారులు వెతుకుతుంటారు". ఇంకా "నేను శాస్త్రవేత్తనూ కాను, పండితుణ్ణీ కాను. కాని మీరు కొట్లాడుకోవద్దని మాత్రం చెప్తాను. మాటిమాటికి శత్రువులు మన దేశాన్ని కాలితో రాచివేయాలని వస్తున్నారు. భవిష్యత్ కార్యక్రమాలలో నిమగ్నులు కండి. ఏదో ఒక పని చేయండి",[3] అంటాడు. దీనినిబట్టి రాజామానసింహుడు మతవిషయాలకు అంతప్రాధాన్యం ఇవ్వని కార్యశీలి అని తెలుస్తుంది. అతడు హిందువులతో సమానంగా ముస్లింలనుకూడా ఆదరించాడు. ఒక సందర్భంలో మానసింహుడు "నాకు శత్రుత్వం సుల్తానులతో,

1. మృగనయని, డా. బృందావన్‌లాల్ వర్మ, 32
2. పైదే., పు. 42.
3. పైదే., పు. 43.

సుల్తానుల పరిపాలనతో కాని మహమ్మదీయులతో కాదు. పని చేసుకోండి. రాజుభక్తి కలిగి ఉండండి. హిందువులతో సమానంగా నేను మిమ్మల్ని చూస్తాను. గౌరవంగా జీవితాలను గడపండి," అని చెబుతాడు.

వైదిక మతాన్ని పోషించే పురోహితులకు, ప్రజలకు, మందిరాలపై ప్రగాఢ విశ్వాసం ఉండడం వల్లే మహమ్మదీయులు హిందూ మందిరాలను పలుమార్లు ధ్వంసం చేసినా మరలా వాటిని నిర్మించేందుకు ప్రయత్నించేవారు. బ్రాహ్మణులు మతాన్ని ప్రచారంచేసి రక్షించేవారన్న నమ్మకం ఉండబట్టే వారిపై ప్రజలకు, రాజుకు మిక్కిలి గౌరవం ఉండేది. అట్లే మౌల్వీలు, ముల్లాలు అంటే మహమ్మదీయ రాజులకు, చక్రవర్తులకు గౌరవభావం ఉండేది.

ఈ విధంగా వర్మగారు మృగనయని నవలలో హిందూ, మహమ్మదీయ మతాలలోని విశ్వాసాలను, మౌఢ్యాన్ని నిరూపించి, ఆనాటి మతపరిస్థితులను వివరించారు.

విరాటాకి పద్మిని నవలలో కూడ వర్మగారు మత ప్రస్తావన తెచ్చారు. దేవి అవతారంగా భావించే 'కుముదను' పరమిస్తే చాలు తమ కష్టాలు తొలగిపోతాయన్న విశ్వాసం

1. మృగనయని, బృందావన్‌లాల్ వర్మ, పు: 445.

ప్రజల్లో కన్పించేది. ఆమె దుర్గామాత అనే నమ్మకంతో అందరూ ఆమె పాదాలపై పడి సాష్టాంగ నమస్కారాలు చేసేవారు. ఆమె స్నేహితురాలు గోమతి, ఆమె ప్రియుడు కుంజర సింహుడు కూడా ఆమె కాళ్ళకు మొక్కుతారు.

తన సైనికులు పాలర్ గ్రామంలో హిందూ మందిరాలను ధ్వంసం చేసిన విషయాన్ని తెలుసుకొన్న అలీ మర్దాన్, హిందూ మందిరాలను ధ్వంసం చేయకూడదని, ఒక్క ఇటుక క్రింద పడినా, అలా చేసిన వాడి తల నరకుతానని, ప్రంగా హెచ్చరిస్తారు.

ఈ విషయాలన్నీ పరిశీలిస్తే హిందువుల మత సాలను ముస్లింలు, ముస్లింల మతవిశ్వాసాలను హిందువులు దెబ్బతీయాలని పోట్లాడుకుంటూ ఉండేవారని అర్థమవుతుంది. యుగాలు గడచినా, కులాలు మారినా ఈ మత మౌఢ్యం నేటికి కూడా సమాజంలో ఆరని చిచ్చులా రగులుతుండడం బాధాకరం. నిజానికి అలీ మర్దాన్ లాంటి కొంతమంది రాజులకు మందిరాలను పడగొట్టడం ఇష్టంలేక పోయినా ప్రజలు మతమౌఢ్యంతో రెచ్చిపోయి మందిరాలను పడగొట్టడం అన్న అనాగరిక చర్య నేటికి సమాజంలో మన కళ్ళకు కనబడుతూ ఉంది.

టూంటే కాంటే నవలా కథా కాలం నాటికి భారతదేశం లో మహమ్మదీయులు మతమార్పిడి చెంది అనేక తెగలుగా విడిపోయి స్థిరపడ్డారు. ఈ విధమైన మతమార్పిడికి అనేక కారణాలు ఉండవచ్చు. కానీ "సమాజంలో ఉన్నత వర్గాల వారు తమ తమ మతాలను నియమానుసారంగా ఆదరించి పరస్పరం ద్వేషించుకొన్నా, తక్కువ వర్గాల వారు తమ బాధల్లో ఒకరికొకరు తోడైనందువల్ల వారు మతం ప్రధానంగా భావించలేదు."[1] ఆ సమయంలో హిందువులు అనేక బాధలు పడ్డారు. "ఈ బాధల నుండి తప్పించుకోవడానికి మతం మార్చుకోవడమే మార్గంగా ఉండేది. కరవు కాటకాలు, జిజియా పన్ను నుండి విముక్తి పొందడం, బానిసత్వం నుండి దూరం కావడం, అనే మూడు కారణాలు ప్రధానంగా మతం మార్పిడికి మూలకారణాలైనాయి."[2]

హిందువులే కాకుండా మహమ్మదీయులు కూడ ఆనాటి అరాచక పరిస్థితులకు విసిగి మతం మార్చుకొన్నారని వర్మగారి టూంటే కాంటే నవలవల్ల తెలుస్తుంది/ ఈ విధంగా ఆనాటి సమాజంనుండి కొంతమంది దూరంగా పారిపోయి ప్రశాంతంగా, నెమ్మదిగా జీవితాలను గడపాలని భక్తులుగా మారి ఏ బృందావనానికో, హరిద్వార్ కో వెళ్ళి తమ జీవితాలను

1. బ్రిటీషు కాలపు తెలుగు ముద్రిత పత్రాలలోని హిందూస్థాన్ ప్రతిబింబాలు (క్రీ. శ. 1800-1947), డా. పి. కుసుమకుమారి., (అముద్రిత సిద్ధాంత వ్యాసం)., పు:76.
2. పైదే., పు; 77

భగవంతునికే అర్పించేవారు. కేవలం హిందువులేకాక, కొంతమంది ముస్లింలు కూడ ఇస్లాంమత ప్రభావాన్ని ఎదుర్కొనేందుకు ప్రయత్నిస్తూ పరమత సిద్ధాంతాలను కొన్నింటిని తమవిగా చేసుకొనే ప్రయత్నం చేశారు. ఆ విధమైన మతసామరస్య ధోరణి వల్ల పుట్టిందే భక్తి సంస్కృతి. భక్తి సంస్కృతినే భక్తి ఆందోళన, భక్తి ఉద్యమం అనేవారు. ఈ ఉద్యమం మత వైషమ్యాలతో రగిలే సమాజాలకు కొంత ఓదార్పు కలిగించింది.

టూంటేకాంటే నవల కథానాయిక నూర్‌బాయి ని వర్మగారు కృష్ణభక్తురాలుగా కల్పన చేసి ఆమెకు తరించే మార్గం చూపారు. ఈమె చరిత్రలోని పాత్రే అయినా ఆనాటి రక్షణ లేని స్త్రీలకు ప్రతీకగా మలచారు. ఆనాటి రాజుల వద్ద వేశ్యగా పడిఉండలేక, మరణించనూ లేక సతమతమయ్యే అభాగినులకు ఈ భక్తిమార్గమే సుగమ మార్గమని వర్మగారు సూచించారు. నూర్‌బాయి మహమ్మ దీయ మతస్థురాలైనా కృష్ణభక్తురాలై 'సరూప' అనే పేరుతో జీవితాంతం గడిపింది. ఇలా వర్మగారు టూంటేకాంటే నవలలో వైష్ణవ భక్తిని కొంతవరకు ప్రతిపాదించారు. నూర్‌బాయి కృష్ణభక్తురాలని వర్మగారు రాసినా ఆమెలో 'సూఫీ' తత్వం కన్పిస్తుంది. సూఫీ తత్వం గురించి

ఆచార్య పి. కుసుమ కుమారి గారు "భగవంతుని ఏకత్వం సర్వ మత సమానత్వం గూర్చి బోధిస్తూ మానవుని ఔన్నత్యం అతని జన్మమీద కాక అతని ప్రవర్తనమీద ఆధారపడి ఉంటుందని భగవంతుని మీద విశ్వాసమే మోక్షానికి మార్గమని భక్తి ఉద్యమ కారులు బోధించారు. చైతన్యుడు, రామానందుడు, నానక్, వల్లభాచార్యులు, వామదేవుడు వీరిలో ముఖ్యులు. హిందూ, తుర్క, అనేవి రెండూ ఒకే మట్టినుండి పుట్టిన రెండు పాత్రలని, అల్లా రామా! అనేవి కేవలం పేర్లలో తేడాలని కబీరు అభిప్రాయపడినారు. ఆనాటి ఈ భక్తి సంస్కృతి సూఫీ సిద్ధాంతాలు విభిన్న మత సాంప్రదాయాలు గల వ్యక్తుల మధ్య సంసర్గానికి ప్రసాదుతైనాయని రాధాకృష్ణ ముఖర్జీ ఈ విధంగా అభిప్రాయపడినారు. "Sufism and Bhakti on the other hand which constitute the mythical core or essence of Islam and Hinduism have been firm and essential binders of the two culture".,"[1] అంటూ వివరణ ఇచ్చారు. అంటే సూఫీ ఉద్యమానికి, భక్తి ఉద్యమానికి అవినాభావ సంబంధం ఉంది అనిపిస్తుంది. "సూఫీ ఉద్యమం - పర్షియా తదితర దేశాల నుంచి 11 వ శతాబ్దం నుంచి భారతదేశంలోకి ప్రవేశించిన ముస్లిమ్‌లతో

1. బ్రిటిష్ కాలపు తెలుగు ముద్రిత పత్రాల్లోని హిందూ స్థానీ ప్రతిధ్వనులు (క్రీ.శ. 1800-1947), డా. పి. కుసుమకుమారి, పు; 77-78 (అముద్రిత సిద్ధాంత వ్యాసం)

'సూఫీ' లనే భక్తిపరులున్నారు. భగవంతుడిని చేరుకోవడానికి ప్రేమ, భక్తికి మించిన మార్గాలు లేవని, చిత్తశుద్ధితో దేవుని ఆరాధించేవారు మానవులకు సన్నిహితులవుతారని, వీరు బోధించారు. ఇతర మతాల పట్ల సహనభావాన్ని వీరు ప్రదర్శించారు. సంప్రదాయాలకు కట్టుబడి ఉండే ముస్లిమ్ 'ఉలేమా' లంటే వీరికి గిట్టదు. హిందువులు అసంఖ్యాకంగా ఈ సూఫీ యోగులను ఆరాధించారు. మొహియుద్దీన్ చిష్తి, బాబా ఫరీద్, నిజాముద్దీన్ ఔలియా, ఈ సూఫీ యోగుల్లో ముఖ్యులు. ఈ యోగులు హిందువులను ఇస్లాంలోకి మార్చేందుకు ప్రయత్నించలేదు. ఒకే నిజమైన దేవుని ప్రేమించాల్సిందిగా వీరు హిందువులకు ప్రబోధించారు."[1]

"భక్తి ఉద్యమం - ఇస్లాం మతంతో పరిచయం ఏర్పడడంతో ఈ మతంలోని ఏకేశ్వరోపాసన, నిరాడంబర పూజావిధానం, సాంఘిక సమతాభావం, నిర్గుణోపాసన హిందువులను ప్రభావితం చేశాయి. తమ మతాన్ని సంస్కరించుకోవలసిన అవసరాన్ని వీరు గుర్తించారు. ఈ సంస్కరణ లక్ష్యంగానే భక్తి ఉద్యమం ప్రచారమయింది. ఈ ఉద్యమ ప్రచారకులు కర్మకాండను నిరసించారు. కొందరు వర్గ

1. ఇంటర్మీడియట్ ప్రథమ సంవత్సర పాఠ్యగ్రంథం (1971) బి.ఎస్.ఎల్. హనుమంతరావు., పు: 137.

వర్గ వ్యత్యాసాలను, సనాతన మూఢాచారాలను, విగ్రహారాధనను తిరస్కరించి సర్వమానవ సమానత్వాన్ని, సహన భావాన్ని ప్రచారం చేశారు. భక్తి ప్రబోధం చేసిన వారిలో రామానుజాచార్యులు, నామదేవుడు, రామానందుడు, కబీరు, గురునానక్, వల్లభాచార్యులు, చైతన్యుడు ముఖ్యులు. భక్తి ఉద్యమం కేవలం ఒక మత ఉద్యమమే కాదు. సాంఘిక భావాలను ఈ ఉద్యమం ప్రచారం చేసింది. భక్తి ఉద్యమ ప్రచారకులు సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యేలా ప్రాంతీయ భాషల్లోనే తమ బోధలు చేశారు." అని ఉంది.

టూంటే కాంటే నవలలో నూర్‌బాయి కూడ విరక్తి చెంది సూఫీ సిద్ధాంతాన్ని పాటించి భక్తి ఉద్యమంలో చేరి కృష్ణభక్తురాలైందని వర్మగారి నవలవల్ల అర్థమౌతుంది. రచయిత 'నూర్‌బాయి'ని సూఫీ మతస్థురాలు అని ప్రత్యక్షంగా పేర్కొన పోయినా పరోక్షంగా ఆమె 'సూఫీ' సన్యాసిని అనే భావం కలుగ జేశారు.

కచనార్ నవలలో వర్మగారు ఎక్కువ మత ప్రస్తావన తేలేదు. ఆనాటి ప్రజలు గోసాయిలను భక్తితో పూజించేవారని, గోసాయిల ఆశ్రమంలో అందరూ శివ

---

1. ఇంటర్‌మీడియట్ ప్రథమ సంవత్సర పాఠ్యగ్రంథం (1971) ఎస్.యల్. హనుమంతరావు., పు: 15

భక్తులని తెలుస్తుంది. గోసాయిల గురువు మహంతు అచలపురి శివభక్తుడు. శైవమత ప్రకారం శివపూజ చేసే విధానాన్ని అచలపురి, సమంతపురి (దళీపసింహ) కి వివరిస్తాడు. ధూప, దీప, నైవేద్యాలతో శివపూజ చేయడం, గంట వాయించడం, శంఖం పూరించడం, భస్మాన్ని శరీరంపై వివిధ రకాలుగ (త్రిపుండాలు మొదలైన విధాలుగ) పూసుకోవడం మొదలైన తంత్రాలను సమంతపురికి నేర్పించి శివపూజ చేయడంలో శిక్షణ ఇస్తాడు. రాజగోండులు మహాదేవ బాబాను గొప్ప దేవతగా భావించేవారు. ఇంకా గోండులు గ్రామ దేవతలను కూడ పూజించేవారు. ఈ విధంగా వర్మగారు కచనార్ నవలలో అక్కడక్కడ హిందూమత ప్రస్తావన తెచ్చి ఉన్నారు.

అహిల్యాబాయి నవలలో రాణి అహిల్యాబాయి వైదిక మతాభిమాని. ఆమె తన స్వంత ఖర్చులను తగ్గించు కొని ఆ డబ్బుతో అనేకమైన దైవకార్యాలు చేస్తూ ఉండేది. ఆమె ఉత్తర భారతంలోని బదరీనాథ్, కేదారనాథ్, కురు క్షేత్రం మొదలుకొని దక్షిణంలో రామేశ్వరం వరకు, పడమటి దిక్కులో సోమనాథ్ మొదలుకొని తూర్పు దిక్కులో గయ, జగన్నాథపురి వరకు అనేక వందలకొద్ది దేవతా మందిరాలను, ధర్మశాలలను, బావులు, చెరువులను, స్నానఘట్టాలను నిర్మిం

చింది. "ఆమెకు హిందూ మతంపై గాఢ నమ్మకం ఉండి నప్పటికి, ఇతర మతాలంటే ఆమెకు ద్వేష భావం లేదు. ఆమె రాజ్యంలో ఒకప్రక్క శివుని దేవాలయాల్లో శంఖ నాదం, గంటారావం వినిపిస్తుంటే, మరొకప్రక్క మసీదుల్లో నమాజు ధ్వని వినిపిస్తుండేది."[1] కాబట్టి అహల్యాబాయి రాజ్యంలో హిందూ, ముస్లింలు ద్వేషభావం లేక సోదరులుగా మెలగే వారని వర్మగారి నవలద్వారా తెలుస్తున్నది.

ముసాహిబజూ చిన్న నవల అంటే నవలిక. కాబట్టి మతప్రస్తావన వర్మగారు తేలేదనిపిస్తుంది. కాని హీనజాతి (పాకీజాతి) వారైన ముసాహిబజూ అనుచరులను, ముసాహిబజు, అతని ధర్మపత్ని చరఖారీ ఎంతో ప్రేమగా ఆదరించే వారని తెలుస్తుంది. ఈ కథ కేవలం రాజుకు, ముసాహిబజూకు సంబంధించినది కాబట్టి వర్మగారికి కథాపరంగా మతప్రస్తావన తెచ్చే అవకాశం లేదు.

ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి నవలలో ఎక్కువగా రాజకీయ పరిస్థితులను గురించి రాజుగారు చర్చించినా అక్కడక్కడ మతపరిస్థితులను కూడ క్లుప్తంగా వివరించారు. హిందువులకు పవిత్రమైంది ఆవు. ముస్లింలకు అసహ్యమైంది వరాహం. ఈ రెండు జంతువుల కొవ్వుతో

1. రాణి అహల్యాబాయి, డా.బృందావన్‌లాల్ వర్మ., పు; 77.

తయారైన తూటాలను నోటితో కొరికేందుకు బ్రిటిష్ సైన్యంలోని హిందూ, ముస్లిం సైనికులు తిరస్కరించారు. ఈ కారణం కూడా సిపాయిల తిరుగుబాటుకు నాంది అయిందని చెప్పవచ్చు. ఈ విషయాన్ని వర్మగారు తన నవలలో చక్కగా వివరించారు. ఇంగ్లీషు వాళ్ళు రాజకీయలబ్ధి పొందేందుకు హిందూమతస్థుల దత్తత స్వీకారానికి వ్యతిరేకంగా చట్టంచేసి ఝాన్సీ రాజ్యాన్ని లాగేసుకుంటారు. అందుకే లక్ష్మీబాయి బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిరించింది. ఈ విధంగా బృందావన్‌లాల్ వర్మగారు తమ చారిత్రక నవలల్లో అనేకచోట్ల ఆనాటి మధ్యయుగంలోని మత పరిస్థితులను విశ్లేషించి ఉన్నారు.

**5.2.5. బృందావన్‌లాల్ వర్మగారి చారిత్రకనవలల్లో ఆర్థిక పరిస్థితులు :**

**5.2.5.0. ప్రవేశిక :** బృందావన్ లాల్ వర్మగారి కథా కాలం 14వ, శతాబ్దం నుంచి, 19వ శతాబ్దం వరకు, ఉత్తర భారతం అంతా చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోవడం, సామంతరాజులు ఎవరికి వారు స్వాతంత్ర్యం ప్రకటించుకోవడం, ఇరుగు పొరుగు రాజ్యాలతో నిరంతరం కలహించుకోవడం, హిందూ రాజులు ముస్లింరాజులతోను, హిందూరాజులు హిందూ రాజులతోను, ముస్లిం రాజులు ముస్లిం రాజులతోను

---

1. ఝాన్సీకి రాణి లక్ష్మీబాయి, డా. బృందావన్‌లాల్ వర్మ., పు; 229

కలహించుకోవడం అనేవి వ్యాపార నిమిత్తం భారతదేశంలోకి కాలుపెట్టిన ఆంగ్లేయులు బలపడి కొద్దికొద్దిగా భారతదేశపు రాజ్యాలను తమ అధీనంలోకి తెచ్చుకోవడానికి కారణా లయ్యాయి. సస్యశ్యామల దేశం అయిన భారతదేశం లోని సంపదలను విదేశీయులు దోచుకుపోవడం జరిగింది ఇటువంటి పరిస్థితుల్లో మధ్యయుగంనాటి ఉత్తర భారతం అంతా ఆర్థికంగా ఎంతో చితికి పోయింది. ఆనాటి ప స్థితుల్ని వర్మగారు కళ్ళకు కట్టినట్లు వివరించారు. భువనవిక్రమ్ ఒక్కటి తప్ప తక్కిన నవలలన్నీ మధ్య యుగానికి సంబంధించినవే. వర్మగారి నవలల్లో ప్రతి బింబించిన ఆనాటి ఆర్థిక పరిస్థితుల్ని పరిశీలద్దాం.

5.2.5.1. ఆర్థిక పరిస్థితులు: "ఉత్తర వైదిక కాలంలో, ఉత్తర భారతంలో అయోధ్య వ్యాపారానికి ప్రసిద్ధి చెందిన కేంద్రం. సరయూ నది లో పడవల ద్వారా కాబూల్, ఫణీష్ మిత్ర మొదలైన దేశాలతో వ్యాపారాలు చేసేవారు. గుర్రాలు, ఇనుప ఆయుధాలు, సుగంధ ద్రవ్యాలు, మసాలాదినుసులు మొదలైనవి ఎగుమతి చేస్తూ ఉండేవారు. దానికి బదులుగా కంబళ్ళు, బంగారు, వెండి, ముత్యాలు, పగడాలు మొదలైనవి దిగుమతి చేసుకొనేవారు. వీరిదగ్గర తగరం, ఇనుము సంబంధించిన కార్ఖానాలు అనేకం ఉండేది. ఈ వ్యాపారస్థులపై విధించేపన్ను రాజ్యానికి

ముఖ్యమైన ఆదాయంగా ఉండేది."[1] ఋణగ్రస్థుడు అప్పు చెల్లించని పక్షంలో అతనికి పశువులు గాని, సంపదగాని ఉంటే వాటిని లాక్కొనేవారు. అవిలేని పక్షంలో అతను ఊడిగం చేసేవాడు. ఇలా వెట్టిచాకిరి చేసేవాళ్ళు జీవితాంతం చాకిరీ చేస్తున్నా ఋణవిముక్తులు కాలేరు. అందుకే మేఘుని దగ్గర కపింజలుడు అనే ఋణగ్రస్థుడు, ఋణ విముక్తుడు కాలేక పారిపోయి ధౌమ్యమహర్షి ఆశీర్వాదంతో తపస్సు చేసుకొనేందుకు వెళ్ళిపోయాడని వర్మగారు భువనవిక్రమ్ లో రాశారు. ఇది ఆనాటి నగర పరిస్థితి. కాని గ్రామాల్లో శ్రామిక వర్గానికి ఉండే నియమాలు చాల సరళంగా ఉండేవి. సంవత్సరం పొడుగునా నూరు ఆవులను మేపితే రెండు ఆవులను కూలిగా ఇచ్చేవారు. రెండు పూటల పాలు తాగడానికి లభించేవి. అప్పుడు ప్రజలు కొంత ధనవంతులుగా ఉండేవారు. కాని శ్రమపడకుండా ఎవరి దగ్గరనుండి ఏ వస్తువు తీసుకొనేవారు కారు.[2] దీనిని బట్టి ఆనాటి ఆర్థిక పరిస్థితి మెరుగ్గా ఉండేదని అర్థమౌతుంది. కాని భువనవిక్రమ్ నవలలో భువనుడి తండ్రి రోమకుడు పరిపాలించే కాలంలో, సకాలంలో వర్షాలు పడక క్షామం ఏర్పడిందనీ, అప్పుడు ప్రజలు ఆర్థికంగా బాధలు పడ్డా

1. బృందావన్ లాల్ వర్మాకే ఉపన్యాసోం కా సాంస్కృతిక అధ్యయన్, డా. కృష్ణ అవస్థీ, పు; 74
2. పైదే., పు; 75.

రని, స్వార్థపరుడైన రోమకుడు చివరకు నిస్వార్థపరుడై తన సంపదనంతా పేదలకు పంచిపెట్టాడని వర్మగారు రాశారు. ఆర్థికంగా ప్రజలు బాధలు పడుతుంటే రాజులు సహాయం చేసేవారని దీనినిబట్టి అర్థమవౌతుంది.

మృగనయనీ నవలలో ఆనాటి ప్రజల ఆర్థిక పరిస్థితులన్ని గురించి అక్కడక్కడ వివరించారు వర్మగారు. పంటలో ఆరవభాగం రాజుకు చెందుతుంది. ఇరవయ్యో వంతు దైవానికి, ముప్పయ్యోవంతు బ్రాహ్మణునికి చెందుతుంది. అంటే పంటలో నాల్గవవంతు రైతుల వద్దనుంచి వెళ్ళిపోతుంది. ఇక నాల్గింట మూడువంతులు మిగల ఉంటుంది. అయినా రైతులు బాధపడలేదు. బయట దోపిడీగాళ్ళు వస్తే పండించింతా దోచుకొని వెళ్తారు. మిగిలిందే చాలనుకొని రైతులంతా సంతోషించారని వర్మగారు రాశారు![1] కొద్ది పొలంలో పండించిన పంట, అడవుల్లో దుప్పులు, పందులు, అడవి దున్నలు మొదలైన వాటిని వేటాడి పొట్టపోసుకోవడం వారి వృత్తిగా ఉండేది. చాల పేదగా ఉండేవారు. కూలి నాలి చేసుకొని బ్రతికేవారు. ఎక్కువమందికి కట్టు కొనేందుకు సరియైన బట్ట, తినటానికి తిండి కూడ లేకుండ ఉంటోవారు. ఆనాటి గ్రామ ఆర్థికపరిస్థితిని గురించి వర్మగారు

1. మృగనయనీ, డా. బృందావన్‌లాల్ వర్మ, పు; 27,28.

ఇలా పరోక్షంగా ప్రస్తావించారు.

దేశంలో అరాచకత్వం ఉన్నప్పటికీ ఏదో ఒక విధంగా వ్యాపారం జరుగుతూ ఉండేది. మగరాన్ లో తయారైన ఇనుము, రాగి పాత్రలు భారతదేశంలోని దూర తాలకు తీసుకొని వెళ్ళి అమ్ముతూ ఉండేవారని తెలుస్తుంది. "ఇక్కడ ఇనుము, ఇత్తడి, రాగి పని బాగా సాగుతూ ఉంటుంది. అయినా ఎప్పుడూ కూలీలకు ఇబ్బందిగా ఉంటుంది."[1] దేశంలోని వ్యాపారుల మనః ప్రవృత్తి ఎప్పుడైనా, ఎక్కడైనా, ఏ పరిస్థితులలోనైనా ఒకటేగా ఉంటుంది. ప్రజలను పీడించి, సమయాన్ననుసరించి సొమ్ము చేసుకోవడమనేది పరిపాటి. యుద్ధ సమయాల్లో ధాన్యాన్ని సేకరించి, ప్రజల ఈతిబాధలు లెక్కచేయకుండ ఎక్కువ ధరలకు అమ్మేవారు.

మృగనయనీ నవలలో రాజామానసింహుడు విజయజంగంతో చర్చించేటప్పుడు, మహమ్మదీయులను ఓడించాలంటే రెండు లోటుల్లు భర్తీ చేయించాలంటాడు. (1) విలు విద్యలో మహామ్మదీయుల్ని మించిపోవాలి. (2) మహమ్మదీయుల దగ్గర ఉన్నంత మంచి గుర్రాలను సంపాదించాలి. ఈ రెండవ గడ్డు సమస్యను పరిష్కరించేదానికి మేవాడు రాణా తప్పక

---

1. మృగనయనీ, బృందావన్ లాల్ వర్మ, పు; 215

తోడ్పడ వచ్చునంటాడు. కాని మేవాడు రాణా గుర్రాలు ఏనుగులు అమూల్యమైన వెండి బంగారాలను కోరుతాడని విజయజంగం చెప్తే రాజు "వెండి, బంగారుల కేమీ కొరత ఉండదు. పరిపాలన మాత్రం సరిగా ఉంటే చాలు. అంతా దానంతటదే చక్కబడుతుంది. రైతులు పంటలు పండిస్తారు. ధనికులు, షావుకారులు, వ్యాపారస్థులు, పరిశ్రమలు వృద్ధి చేస్తారు. అప్పుడింకే కొరత ఉండబోదు" అంటాడు. ఆర్థిక పరిస్థితి మెరుగైన తరువాత రాజా మానసింహుడు మందిరాలను, వైద్యశాలలను, భవనాలను కట్టిస్తాడు. మానసింహుడు మారువేషాలలో పర్యటించి ప్రజల స్థితిగతులను కనుక్కొని వారికి సదుపాయాలు కల్గించాడని వర్మగారు రాశారు.

విరాటుంకీ పద్మినీ నవలలో కూడ ప్రజల ఆర్థిక దుస్థితిని గురించి వర్మగారు పేర్కొన్నారు. శత్రురాజుల దురాక్రమణ వల్ల ఎంతోమంది ప్రజలు అనేక దూరప్రాంతాలకు వెళ్ళిపోయేవారు. కొండగుహాల్లో తలదాచుకొనేవారు. దీనులు, హీనులైన రైతులకు ఈ విధంగా చేసే అవకాశం కూడ ఉండేది కాదు. వాళ్ళు పొట్టకూటి కొరకు రాజులకు పన్ను కట్టేందుకు దోపిడీగాండ్ర దాహాన్ని తీర్చేందుకు పొలాన్ని దున్నాలి. పంట పండించాలి. ఇదీ ఆనాటి రైతుల పరిస్థితి. ప్రసిద్ధ విద్వాంసుడు W.H. More-

1. మృగనయనీ, బృందావన్‌లాల్ వర్మ., పు; 101

land, తన Agrarian system of Muslims in India లో "13వ, శతాబ్దం నుండి 18వ శతాబ్దం వరకు భారత దేశంలో రైతు వర్గమే చాల పీడిత వర్గంగా నిరూపించబడం జరిగింది. మొగల్ సామ్రాట్టులు రైతులు ఆర్థికంగా దెబ్బ తిని ఉంటే వారికి చేయూతనివ్వాలని ఒక శాసనం చేశారు. కాని అధికారులు అలా చేయూతనివ్వక రైతుల ప్రాణాలను తప్పించి మిగిలినవన్నీ పీడించి పట్టుకుపోయే వారు. రాజశాసనాలు కేవలం కాగితంమీద ఉండేవి కాని నిజంగా అమలు జరిపేవారు కారు."[1] అని రాశారు. దీనిని బట్టి ప్రజల కష్టాలను నవాబులు, రాజులు అంతగా పట్టించు కొనేవారు కారని తెలుస్తుంది. ఎప్పుడైతే రాజులు స్వార్థ పరులై పోయారో, ప్రజలు తమకున్న కొద్దిపాటి పొలాన్ని, ఉన్నకొద్ది సంపదను రక్షించుకొనేదానికి తాపత్రయపడేవారు, రక్షించేవారు లేకపోతే దేవునిపై భారంవేసేవారు, దేవాలయా లకు వెళ్ళేవారు, హరికథలు వినేవారు, ఉన్నదాంట్లో దాన ధర్మాలు చేసే వారు, పరస్పరం సహాయం చేసుకొనే వాళ్ళు, అని వర్మగారి నవలల ద్వారా తెలుస్తుంది.

నాదిర్షా దండయాత్ర, దోపిడే ఫలితంగా ఢిల్లీ ఆ పరిసర ప్రాంతాలు ఆర్థికంగా దెబ్బతిన్నాయి. ఢిల్లీ పాదుషా

---

1. బృందావన్ లాల్ వర్మ కా సాంస్కృతిక అధ్యయన్ డా. కృష్ణ కుమారి పు: 88

మహమ్మద్ షా బలహీనుడు కావడంతో, ఆదాయం ఎక్కువ లేకపోవడంచేత ప్రజలపై ఎక్కువ పన్నులు వేసేవారు. ఈ పన్నులు కట్టలేక ప్రజలు పారిపోయేవారు. టూటే కాంటే నవలలో మోహన్ అనే జాట్ యువకుడు పన్నులు కట్టలేక, ఈతిబాధలు భరించలేక, ఇల్లు, వాకిలి వదలి పారిపోతాడు. ఈ కాలంలో ఉన్నత వర్గీయుల విలాస ప్రభావం, నిమ్న జాతుల వారిపై అధికంగా పడేది. కూలీలు, రాతిపని చేసేవారు వెట్టిచాకిరీకి బలి అయ్యేవారు.

అహల్యాబాయి నవలలో కూడ ఆర్థిక స్థితి గతులు ఏమీ బాగలేదని వర్మగారు తన అభిప్రాయం వెలిబుచ్చారు. ప్రజలు, సాధారణ గృహస్థులు, రైతు కూలీలు అత్యంత హీనస్థితిలో ఉండేవారనీ; ప్రజలు మూఢనమ్మకాలు, భయం, మూఢవిశ్వాసాల ఊబిలో కూరుకుపోయి ఉండేవారనీ వర్మగారు రాశారు.

కచనార్ నవలలో కూడ ప్రజల ఆర్థిక వ్యవస్థ బాగా దెబ్బతినిందని రాశారు. ఆ సమయంలో ప్రజలకు వారి వారి పొలాలను దున్నించడానికి, వృత్తి వ్యాపారాలు సక్రమంగా చేయించడానికి సరైన శాసకుడు లేకపోయాడు. అందువల్ల హత్యలు, దోపిడీలు జరిగి, ప్రజాజీవితం

ఆర్థికంగా ఎంతో చితికి పోయింది. ప్రజల ఆర్థిక పరిస్థితి "పానీ భరీ ఖాల్ మే తినకోం జైసీ థీ"[1] — అంటే నీళ్ళతో నిండిన బానలా గడ్డిపోచవలె, నిరర్థకంగా, అస్తవ్యస్తంగా ఉండేది.

ముసాహిబజూ కథాకాలం నాటికి, మిగిలిన అన్ని ప్రాంతాలవలె బుందేల్‌ఖండ్ ప్రాంతం కూడ ఆంగ్లేయుల అధికారం క్రిందికి వచ్చింది. చిన్న చిన్న సామంతరాజులు ప్రజల్ని పీడించి, ధనం సంపాదించి ఆంగ్లేయులకు కప్పం కట్టేవాళ్లు. ప్రజల బాగోగులు ఎక్కువగా చూడలేక పోయారు. ఆఖరికి రాజు భృత్యులకు కూడ తక్కువ జీతం చెల్లించేవారు. ముసాహిబజూ నవలలో ధతియా రాజు విజయబహాదూర్, దలీప సింహాను కేరువా జాగీర్దారుగ చేస్తాడు. ఈ ముసాహిబజూవద్ద 1200 మంది సైనికులున్నారు. వీరందరూ హీన కులస్థులు. బీదవారు. వీరికి రాజుద్వారా సంక్రమించే జీతం చాల తక్కువ. దీని ఆధారంగానే కథ నడుస్తుంది. కాబట్టి ఆ కథకు కేవలం ఆర్థికపరిస్థితులే కారకాం. ఆర్థిక లోపం వల్లే ముసాహిబజూ అనుచరులు దొంగతనం చెయ్యవలసివచ్చింది.

లక్ష్మీబాయి కథాకాలంనాటికి నిరంతరం యుద్ధాలతో ప్రజల ఆర్థిక పరిస్థితి క్షీణదశలోనే ఉండేది.

---

1. కచనార్, బృం. వర్మ., పు; 34.

1817 లో పేష్వా బాజీరావు ఆంగ్లేయులతో సంధి చేసుకొని తన అధికారాన్ని ఆంగ్లేయులకు అప్పగించాడు. 18వ, శతాబ్దం లో ఉత్తర, దక్షిణ భారతదేశాల్లో గొప్ప శక్తివంతుడుగా ప్రసిద్ధికెక్కిన పేష్వా తన ఇంటిని పూనా నుండి బిఠూర్ కు మార్చి 23 నెలలకు 8 లక్షల రూపాయల పెన్షన్ మాత్రుడుగా మిగిలి పోయాడు. పేష్వా ఆధీనంలో ఉండే ఝాన్సీ మొదలైన రాజ్యాలు ఏ మాత్రం శ్రమ లేకుండా ఆంగ్లేయుల అధీనం లోకి వెళ్ళింది. ఆంగ్లేయ కంపెనీ వాళ్ళు తమకు నచ్చిన, తాము లాభపడే చట్టాలను, చిన్న చిన్న రాజ్యాల పై రుద్ది, వీలుంటే ఆ రాజ్యాలను కబళించేవారు. ఈ సమయంలో సామంతులు, సరదారులు, బాదుషాలు, జాగీర్ దారులు, మునసబ్ దారులు తమ, తమ రాజ్యాలను, పదవులను నిలబెట్టుకోవడానికి ప్రయత్నించారు. ప్రజల్ని పీడించి పన్నురూపంగాను, తదితర రూపంగా ధన ధాన్యాలు సంపాదించి ఆంగ్లేయులకు కప్పం అధికంగా చెల్లించేవారు. వీటి మధ్య సామాన్య ప్రజలు ఆర్థిక దుస్థితిలో నిరంతరం నలిగి పోయారు.

ఈ విధంగా వర్మగారు తన నవలలన్నింటి లోనూ మధ్యయుగం నాటి ఉత్తర భారతంలోని చీదరికం, ఆర్థిక అస్తవ్యస్థ పరిస్థితులను వివరించి, ఆ నాటి ప్రజల దుర్భర దారిద్ర్యాన్ని మన కళ్లకు కట్టినట్లు చూపారు.

5.3.1. రాజకీయ పరిస్థితులు – తులన: అడివి బాపిరాజు, బృందావన్ లాల్ వర్మగార్ల కథాకాలం నాటి రాజకీయ పరిస్థితుల్ని గమనిస్తే ఈ యుద్ధాలు, రాజకీయ కుట్రల వల్ల ప్రజలు ఎలా నలిగి పోయారనేది అర్థమౌతుంది. ముఖ్యంగా వర్మగారి నవలల్లో సామాన్యప్రజలు ఈ రాజకీయ అస్తవ్యస్త పరిస్థితివల్ల ఎక్కువగా నలిగిపోయారు. రాజులు శత్రువులపై దాడి జరిపినప్పుడు కేవలం కోటలను, దుర్గాలను వశపరచుకోవడమే గాక, ప్రజా జీవితాన్ని కూడా ఛిన్నాభిన్నం చేశారు. గ్రామాలకు గ్రామాలు దోచారు. పంట పొలాలను, పశు సంపదను నాశనం చేశారు. అనేక సామాన్య ప్రజలను హతమార్చారు. బావుల్లోను, చెరువుల్లోను కుళ్ళిన శవాలను వేశారు. ఉదా॥ వర్మగారి మృగనయనీ నవలలో సికిందర్ లోడీ దండయాత్ర, టూటే కాంటే నవలలో నాదిర్షా దండయాత్రల ద్వారా దేశ అస్తవ్యస్త స్థితిని, ప్రజల ఈతి బాధలు, కష్టాలు గురించి తెలుసుకోవచ్చు.

ఇటువంటి దండయాత్రలు బాపిరాజుగారి నవలల్లో కనిపించవు. ఎంతసేపు రాజులు, సామంతరాజులు రాజ్యాధికారం కోసం తపించారే గాని ప్రజా జీవితాన్ని ఛిన్నాభిన్నం చేయలేదు. వీరిద్దరి యుద్ధ విధానాల్లో కూడా తేడా ఉంది. రాజు గారి కథాకాలం శాతవాహనులు, ఇక్ష్వాకులు, చాళుక్యులు, కాకతీయులు. కావున ఆనాటి రాజులు రథ, గజ, తురగ, పదాదులతో యుద్ధం చేస్తే వర్మగారి కాలంలో మారకాయుధాలైన తుపాకులు, ఫిరంగులు కూడా యుద్ధాల్లో చోటు చేసుకున్నాయి. రాజు గారి, వర్మగారి నవలల్లో స్త్రీలుకూడా రాజ్యాలు పరిపాలించారనీ, అనేకమంది స్త్రీలు యుద్ధాల్లో పాల్గొనే

వారని తెలుస్తుంది. రాజుగారి కథాకాలంలో విదేశీయులు గుంపుగా భారత దేశంలో ప్రవేశించి వర్తక వ్యాపారాలు చేసుకొనే వారని తెలుస్తుంది. యవనులు, రోమనులు, ఫార్సీవారు, యూదులు భరుకచ్ఛంలో ఉన్నారని 'అడవి శాంతిశ్రీ'లో రాజుగారు రాశారు రాజుగారి కథాకాలం నాటికి విదేశీయులు కేవలం వర్తకంతో తృప్తి పడితే, వర్మగారి కాలం నాటికి విదేశీయులు మనదేశాన్ని ఆక్రమించి హిందూ రాజులతో యుద్ధాలు చేసి వారిని ఓడించి సామ్రాజ్యాలు స్థాపించారని తెలుస్తోంది.

గజదొంగలను గురించి రాజుగారు, వర్మగారు రచించారు. బాపిరాజు గారి గోనగన్నారెడ్డి వర్ణం, వర్మగారి సాగరసింహ వర్ణం ఇందుకు

ఉదాహరణ. గోన గన్నారెడ్డి వర్ణం సామంతులను అణచివేసి దేశ సుస్థిరతకు చక్రం పడుతారు. అలాగే సాగరసింహ తాలుత బ్రిటీష్ వారి చర్యలకు గజదొంగగా మారి తర్వాత లక్ష్మీబాయి వల్ల మంచివాడుగా మారిపోయి ఆమె సైన్యంలో చేరుతాడు. ఈ విధంగా బాపిరాజు గారి, వర్మ గారి నవలల్లోని రాజకీయ పరిస్థితుల సామ్య, వైషమ్యాలను గుర్తించవచ్చు.

**5.3.2. సాంఘిక పరిస్థితులు – తులన :** బాపిరాజు గారి కథాకాలం నాటి సంఘ స్వరూపానికి, వర్మగారి కథాకాలం నాటి సంఘ స్వరూపానికి ఎంతో తేడా కన్పిస్తుంది. బాపిరాజు గారి కాలంలో చక్రవర్తులు ప్రజల్ని తమబిడ్డల వలె చూచేవారు. యుద్ధాలు జరిగే కొద్దికాలం పాటు సాంఘిక జీవనం తారుమారైనా, యుద్ధ పరిసమాప్తి తర్వాత ప్రజలు సంతోషంగా గడిపేవారు. మొత్తం మీద ఆనాటి యుద్ధాల వల్ల సంఘ స్వరూపం దెబ్బతిన్నట్లు

నిరూపించడానికి నవలలో ఆధారా

బృందావన్‌లాల్ వర్మగారి కథాకాలం నాటికి పాలించే చక్రవర్తి బలహీనుడవడం వల్ల, చిన్న చిన్న సామంతులందరు ఢిల్లీ పాలకులను లెక్క చేయక, నిరంతరము ఒకరితో ఒకరు కలహించుకొంటూ ఉండడం వల్ల ఆనాటి సంఘ స్వరూపం వికృతంగా మారిందని చెప్పవచ్చు అంతేగాక వర్మగారికి దొరికినన్ని చారిత్రక ఆధారాలు బాపిరాజుగారికి దొరకనందున ఆనాటి సంఘ స్వరూప చిత్రణకు బాపిరాజుగారు కొంత కల్పనను జోడించారేమో అని అన్పిస్తుంది. బాపిరాజుగారికంటె వర్మగారికి చారిత్రకాధారాలు ఎక్కువగా లభించినందు వల్ల వర్మగారు నాటి సంఘ స్వరూపాన్ని యథాతథంగా తమ నవలల్లో ప్రదర్శించారనవచ్చు. అంటే బాపిరాజుగారిలో చారిత్రక సత్యం, కల్పన సమపాళ్ళలో ఉంటే, వర్మగారిలో చారిత్రక సత్యానికే కల్పనకంటే ప్రాధాన్యం లభించిందనవచ్చు.

ఆంధ్ర రాజులు తాము భోగభాగ్యాలతో విలాస జీవితాన్ని గడుపుతూ ఉండడమే గాక, బీద ప్రజలకు కూడా దానధర్మాలు చేస్తూ వారి జీవితాలను సుఖమయం చేసేవారని తెలుస్తూంది. శాంతిమూలుడు అనేక వేల గోవులను, నాగళ్ళను, పంట పొలాల్ని ప్రజలకు దానం చేశాడని రాజుగారు రాశారు. రాజుగారి కథాకాలంలో సకాలంలో వర్షాలు పడి సమృద్ధిగా పంటలు పండేవనీ, వాణిజ్యం, వర్తక వ్యాపారాలు విదేశీయులతో కూడ జరిపేవారు. ప్రజలందరూ పండుగలూ, ఉత్సవాలు విరివిగా చేసుకునేవారని తెలుస్తూంది. మొత్తం మీద రాజుగారి కథాకాలం నాటి ప్రజలందరూ సుఖసంతోషాలతో

సంపదలతో తులతూగే వారని తెలుస్తోంది

వర్మగారి కథాకాలం నాట ప్రజా జీవితం ఇందుకు విరుద్ధం నిరంతర యుద్ధాలవల్ల ప్రజా జీవితం నరకప్రాయంగా ఉండేదని వర్మగారి నవలల ద్వారా తెలుస్తుంది. మృగనయనీ నవలలో రాజా మానసింహుడు కొన్ని ప్రజాహిత కార్యాలు చేశాడని వర్మగారు రాశారు. సాధారణంగా రాజులు ప్రజలను పట్టించుకోకుండా నిరంతం విందులు, వినోదాలతో కాముకులై సంచరించే వారని తెలుస్తోంది. మృగనయనీ నవలలో బఘుర్రా తిండిపోతు, యుద్ధపిపాసి. గయాసుద్దీన్ మధుపాన మత్తుడు, స్త్రీలోలుడు. నసీరుద్దీన్ నిరంతరం 1500 మంది స్త్రీలతో కులికే వాడు. సికిందర్ లోడీ ఎప్పుడూ యుద్ధాలతో మునిగి ఉండే వాడు. రాజులిరకంగా భోగలాలసులై ప్రజా క్షేమం పట్టించుకునే వారు కాదు. ఆ కారణంగా వర్మగారి కథాకాలం నాటి ప్రజా జీవితం చాలా నికృష్టంగాను, బీదరికం తోను ఉండేదని తెలుస్తోంది. దీనికి తోడు భయంకర కరువు కాటకాలు, వరదలు, భూకంపాల లాంటి ప్రకృతి బీభత్సాల వల్ల కూడ ప్రజలు ఎన్నో బాధలు అనుభవించారని తెలుస్తుంది.

ఇక వర్ణవ్యవస్థ గురించి పరిశీలిస్తే, బాపిరాజు గారి శాతవాహనుల కాలంలో కులాంతర, మతాంతర వివాహాలు జరిగేవనీ, శాంతిమూలుని కాలంలో అన్ని జాతుల వారిని సమదృష్టితో చూచే వారని తెలుస్తుంది. కాకతీయుల కాలంలో ఎన్నో కులాలు వెలిశాయి. కాకతీయ చక్రవర్తి గణపతిదేవుడు, రుద్రమదేవి వర్ణ సమైక్యతకు పూనుకొన్నారు. వర్మగారి నవలల్లో వర్మగారు వర్ణవ్యవస్థను గురించి విపులంగా చర్చించారు. కులాంతర వివాహాలను ఆ నాటి

రాజులు వ్యతిరేకించకున్నా సమాజం వ్యతిరేకించలేదని తెలుస్తోంది. సాంఘిక దురాచారాలైన సతీసహగమనం, జౌహరు పద్ధతి, దాసీ పద్ధతి, పరదా పద్ధతి మొదలైనవి వర్మగారి నవలల్లో విరివిగా చోటుచేసుకొన్నాయి. రాజుగారి నవలల్లో సతీసహగమనం, దాసీ పద్ధతి ప్రస్తావన ఉన్నా జౌహర్ పద్ధతి, పరదా పద్ధతి ఉన్నట్లు నిదర్శనాలు కన్పించవు. రాజుగారు వేశ్యావాటికలున్నట్లు పేర్కొన్నారు. బహుశా ఆనాటి సమాజానికి అది దురాచారం కాకపోవచ్చునేమో!

బాపిరాజు, బృందావన్‌లాల్ వర్మలు న్యాయవిచారణ, దండన పద్ధతిని గురించి (ఇరువురూ) ప్రస్తావించినారు. రాజుగారి కథాకాలంలో న్యాయ విచారణ, దండన పద్ధతి ధర్మబద్ధంగా జరిగేదని తెలుస్తోంది. కాని, వర్మగారి కథాకాలం నాటికి కొందరు మహమ్మదీయ పాదుషాలు ధర్మ విరుద్ధంగా దండించారని తెలుస్తోంది. రాయబారి నిహాల్ సింహాను వధించడం, అమాయకుడైన జోధన్ పండితుడ్ని సంహరించడం ఇందుకు నిదర్శనం. ముల్లాలు, మౌల్వీల ప్రభావం పాదుషాపై ఎక్కువగా ఉండేది. ఇరువురు రచయితలూ గూఢచారి వ్యవస్థను గురించి ప్రస్తావించారు.

ఇక నాటి సమాజంలో స్త్రీ పరిస్థితిని సమీక్షిస్తే, రాజుగారి కథా కాలం సమాజంలో స్త్రీకున్నంతటి గౌరవస్థానం, వర్మగారి కథా కాలం నాటికి లేదనిపిస్తుంది. కాని రాజుగారి స్త్రీలలోను, వర్మగారి స్త్రీలలోను చాలా ఆధునికమైన ఆలోచనలు, ఆదర్శాలు ఉన్నాయనడంలో అతిశయోక్తి లేదు. దీనికి కారణం వర్మగారు, రాజుగారు సమకాలీనులు కావడమే.

సమకాలీన భావాలు వారి నవలల్లో చోటుచేసుకొన్నాయి.

5.3.3. సాంస్కృతిక పరిస్థితులు - తులన : బహుముఖ ప్రజ్ఞాశాలురైన బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మగారు వారి చారిత్రక నవలల్లో ఆ నాటి సమాజంలోని సంస్కృతీ నాగరికతలను వివరించారు ఇరువురూ వారి నవలల్లో సందర్భానుసారంగా ప్రజలు జరుపుకున్న పండుగలు, ఉత్సవాలూ వివరించారు. బాపిరాజు గారి కథా కాలంలో ఆంధ్ర ప్రజలు సుఖ శాంతుల మధ్య పండుగలు జరుపుకొంటే, మధ్యయుగం నాటి బుందేల్ ఖండ్ ప్రజలు పేదరికం, అరాచకత్వం, కరువు కాటకాల మధ్య పండుగలు జరుపుకొన్నట్లు తెలుస్తుంది. 'మృగనయని' నవలలో రాయి గ్రామ ప్రజలు శత్రు దాడుల వల్ల చితికి పోయినా, ధనధాన్యాదులు లేక పోయినా, తినడానికి పంచ భక్ష్య పరమాన్నాలు లేక పోయినా, కట్టుకోవడానికి కొత్త గుడ్డలు లేక పోయినా, ఆఖరుకు హోలీ రంగులు కొనే స్తోమత లేకపోయినా హోలీ పండుగను జరుపుకొన్నారు. చితికిన జీవితాల్ని, గడచిన బాధల్ని మరచి కనీసం కొన్ని గంటలైనా ఉల్లాసంగా మునిగి తేలాలనుకున్నారు. రంగు నీళ్ళ బదులు పేడ నీళ్ళు చల్లుకొన్నారు. పేడనే ముఖానికి పూసుకొన్నారు.

బాపిరాజు గారు ఆంధ్ర ప్రజలు వసంతోత్సవాలు జరుపుకొన్నట్లు రాశారు. హోళీ పండుగకు, వసంతోత్సవాలకూ కొద్దిగ పోలిక ఉంది. వసంతోత్సవాల్లో కూడా రంగునీళ్ళు చల్లుకొంటారు. కాబట్టి బాపిరాజు గారి కథా కాలం నాటి వసంతోత్సవాలే క్రమంగా కొద్ది మార్పులతో హోలీ ఉత్సవంగా మారిందనుకో వచ్చు. హోలీ పండుగ జరుపుకునే విధానంలో వర్మగారి కథా కాలం

నాటికీ, ఆధునిక కాలానికి కొద్ది తేడా ఉంది. ఇవి కాలానుగుణంగా వచ్చిన చిన్న చిన్న మార్పులు. రాజుగారు, వర్మగారూ కూడా నాటి పండుగల ఉత్సవాల గురించి తమ నవలల్లో రాశారు. 'దేవగిరి దుర్గ' నవలలో రాణీ రుద్రమదేవి 'బొమ్మల కొలువు' పెట్టిందనీ, వేనకు వేలమంది స్త్రీ జనమంతా నగరంలో నిండి పోయారనీ, అందరికీ భేద భావం లేకుండా వాయినాలు ఇచ్చారనీ రాజుగారు రాశారు. అలాగే 'ఝాన్సీ రాణి లక్ష్మీబాయి' నవలలో లక్ష్మీబాయి తన మహల్లో గౌరీదేవి ప్రతిమను స్థాపించిందనీ, నగరంలోని స్త్రీలందరూ అక్కడికి వచ్చి ఒక్కొక్కరు ఒక్కొక్క పనిలో నిమగ్నులైనారనీ రాశారు. దీనిని బట్టి ఆ నాటి రాణులు సామాన్య ప్రజలతో కలిసి మెలిసి ఐక్యంగా పండుగలు చేసుకొనేవారని తెలుస్తుంది. ఇంకా ఎడ్ల బండ్ల పందాలు, అట్లతదియ, కాకతమ్మ ఉత్సవాలు మొదలైన పండుగలు గురించి రాజుగారు రాస్తే, అక్షయ తృతీయ, మకర సంక్రాంతి, పసుపు, కుంకుమ పండుగ మొదలైన వాటిని గురించి వర్మగారు రాశారు. రాజుగారి కథాకాలంలోనూ, వర్మగారి కథాకాలంలోనూ పండుగలను జరుపుకొనే విధానాన్ని గమనిస్తే పండుగపేర్లు వేరైనా, ఆ జరుపుకొనే తీరూ, ఉద్దేశాలు ఒకటే అనిపిస్తుంది. మొత్తం మీద దేవుని పూజించడం, మంచి భావాలు కల్గించడం, అందరూ ఐకమత్యంగా ఉండడం అనేవే ఈ పండుగల ముఖ్య ఉద్దేశం అని తెలుస్తుంది.

రాజుగారి, వర్మగారి కథాకాలంలో రాజులు లలిత కళలను చక్కగా పోషించారని ఇద్దరు రచయితలు పేర్కొన్నారు. లలిత కళల్లో ముఖ్యమైన శిల్పం, చిత్రలేఖనం, సంగీత నాట్య కళలను గురించి తమ నవలల్లో అనేక చోట్ల

ప్రస్తావించారు. రాజుగారి నవలల బట్టి శాతవాహనులు, ఇక్ష్వాకులు, చాళుక్యులు, కాకతీయుల కాలంలో శిల్పకళ ఎంతో అత్యున్నతంగా వర్ధిల్లిందని తెలుస్తోంది రాజా మానసింహ తోమర్, అహిల్యాబాయి లు అనేక మందిరాలు కట్టించారన్, రాణీ లక్ష్మీబాయి భర్త గంగాధరరావు ఒక నాట్యశాలను నిర్మించాడనీ వర్మగారి నవలల వల్ల తెలుస్తుంది. రాజా మానసింహ తోమర్ మాన మందిరం, గూజరీ మహల్, కర్ణ మందిరం, సంగీత విద్యాపీఠం మొదలైన వాటిని నిర్మించాడనీ, తోమర్ వంశీయులలో మానసింహుని పూర్వీయులు గ్వాలియర్‌లో శైలమందిరం నిర్మించారనీ, ఆ శైలమందిర నిర్మాణానికి దక్షిణ దేశపు (తెలంగాణా) శిల్పుల్ని రప్పించారనీ, దక్షిణ, ఉత్తర దేశపు శిల్పులు కలసి ఆ మందిరాన్ని నిర్మించారనీ 'మృగనయనీ' నవల వల్ల తెలుస్తుంది. ఈ శైల మందిర నిర్మాణం జరిగిన కాలం ఇంచుమించు కాకతీయుల కాలానికి సరిపోయినందు వల్ల కాకతీయుల కట్టడాలకు పోలిక ఉందని చెప్పవచ్చు. ఆ నాటి గ్వాలియర్ కట్టడాలన్నింటిలోనూ దక్షిణ దేశ (తెలంగాణా) శిల్పుల పనితనం కనబడుతుందని తెలుస్తుంది![1] ఇది ఆంధ్రులకు గర్వకారణం.

ఈ విధంగా రాజుగారి, వర్మగారి నవలల్లో శిల్పకళలో కొంత సామ్యం కనబడుతుంది. అదేవిధంగా చిత్రకళ, సంగీత నాట్యకళను గురించి ఇద్దరు రచయితలు తమ రచనల్లో వివరించారు. కానీ వర్మగారు బైజూనాథ్ గూజరి టోడీ, మంగళ్ గూజరీ లాంటి కొత్త రాగాలను సృష్టించినట్లు వివరిస్తే, రాజుగారు ప్రత్యేకంగా చరిత్రప్రసిద్ధి చెందిన వ్యక్తిని గురించి పేర్కొనలేదు.

---

1. మృగ నయనీ – బృం. లా. వర్మ., పు: 375.

వివాహ సంబంధాలు, ఆచార వ్యవహారాలు గురించి రెండు నవలల్లో ఇద్దరూ అనేక చోట్ల ప్రస్తావించారు. ముఖ్యంగా ఆంధ్రుల వివాహాలు, ఆచార వ్యవహారాలు గురించి బాపిరాజు గారే కాక ఇంకా అనేక మంది చారిత్రక నవలా కారులు రాసినందు వల్ల, 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి', 'ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర' మొదలైన చారిత్రక పుస్తకాల వల్ల మన కందరికీ చాలవరకు తెలుసు. వాటిని మరలా మరలా రాయడం చర్విత చర్వణం అవుతుంది. కేవలం ఆంధ్రుల వివాహ సంబంధాలు క్లుప్తంగా రాసి, వర్మగారి బుందేల్‌ఖండ్ ప్రాంతంలోని వివాహ సంస్కృతిని గురించి ఈ పరిశోధనలో వివరంగా విశదీకరించడం జరిగింది. అమ్మాయిల, అబ్బాయిల జాతకాలు చూడడం, తర్వాత నిశ్చితార్థం, మండపోత్సవం, పెళ్ళి పల్లకీ, తోరణాలు, మంత్ర తంత్రాలతో పాణిగ్రహణం - ఇవన్నీ బుందేల్‌ఖండ్ ప్రాంతం వాళ్ళు ఎలా జరుపు కొనే వారో విశదీకరించడం జరిగింది.

ఆంధ్రుల వివాహాచారాలు కూడా ఇంచు మించు ఇదే విధంగా ఉంటాయి. కాని కొన్ని కొన్ని ఆచారాల్లో వ్యత్యాసం కన్పిస్తుంది. ఉదా॥ పెండ్లి కుమారుడు ఏవో పరిస్థితుల్లో పెండ్లికి రాలేక పోతే ఆ వివాహాలు ఆగిపోవు. అతని ఖడ్గానికి అగ్నిహోత్రం సాక్షిగా వివాహం జరిపిస్తారు. అలా ఖడ్గానికి జరిపించినా, అతనితో జరిపించినట్లే లెక్క. దీనికి ఒక కారణం కన్పిస్తుంది. ఆ నాడు యుద్ధాలు ఎక్కువ. ఎప్పుడు ఏ క్షణాన యుద్ధం వస్తుందో చెప్పలేము. యుద్ధ ఛాయలు లేని రోజు పెళ్ళి ముహూర్తం పెట్టుకొంటే, పెళ్ళి రోజే పెళ్ళి కుమారుడు తప్పకుండా యుద్ధానికి వెళ్ళవలసి రావచ్చు. అప్పుడు పెళ్ళి కుమారుడు

లేని కారణంగా వివాహం నిలపరు. పెళ్ళి కుమారుని చిహ్నం ( ముఖ్యంగా ఖడ్గం) తో వివాహం జరిపించేస్తారు. అందుకే 'కత్తి' తో వివాహం అనే సంప్రదాయం వచ్చి ఉంటుంది. ఇదికేవలం పరిశోధకురాలి ఊహ మాత్రమే. ఇంకేదైనా కారణం కావచ్చు. లేక సంప్రదాయంగా వచ్చి ఉండవచ్చు. వర్మగారు కత్తితో వివాహం జరిపించినట్లు 'కచనార్' నవలలో రాశారు గాని, పై కారణం రాయలేదు. 'విరాటాకే పత్నిని' నవలలో దేవీసింహుడు పెళ్ళి పీటలపై ఉరేసుతూ ఇంకో పది నిముషాల్లో పెళ్ళి జరుగుతుండగా శత్రువులతో యుద్ధం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. తర్వాత అతడు వివాహమే చేసుకోడు. దీనివల్ల అతని కాబోయే భార్య 'గోమతి' జీవితం నాశనమైంది. ఇక భిన్న జాతుల మధ్య వివాహం ఆనాడూ, ఈనాడూ అన్ని ప్రాంతాల్లోనూ సమాజం వ్యతిరేకిస్తూనే ఉంటుంది. భిన్న జాతుల మధ్య వివాహం నేడు చట్టసమ్మతం చేసినా, ఆచారాలను భ్రష్టం చేస్తున్నారని సనాతన ఛాందసులు నేటికీ సణుక్కొంటూనే ఉన్నారు.

మంచి అలవాట్లు పాటించడమనే సంప్రదాయం నాటికీ, నేటికీ ఉంది. ఆ సంప్రదాయాన్ని ఇద్దరు రచయితలూ తమ నవలల్లో పాటించారు. పిన్నలు పెద్దవారిని గౌరవించడం, పెద్దలు చిన్నవారిని ఆశీర్వదించడం మొదలైనవి. కాకజూ, బాబా, మాతాజీ, అన్నదాతా ... అనే గౌరవ వాచకాలు వర్మ గారి నవలల్లో కనబడితే, నాయనగారూ, అమ్మగారూ, ప్రభూ, గురుదేవా .... మొదలైన గౌరవ సూచకాలు బాపిరాజు గారి నవలల్లో కనబడతాయి. నమ్మకాలు, విశ్వాసాల శీర్షికకు సంబంధించిన సంస్కృతిని రాజుగారు, వర్మగారు తమ నవలల్లో రాసి, ఆనాటి సంస్కృతిని తమ నవలల ద్వారా వెలికి తీశారు.

ముహూర్తాలు, శుభలగ్నాలు, జాతకాలు, శకునాలు, స్వప్నాలు, వ్రతాలు, పూజలు, మంత్ర తంత్రాలు, పవిత్ర నదుల్లో స్నానాలు మొదలైన వాటిని తమ నవలల్లో వివరించి, ఆనాటి సంస్కృతీ సంప్రదాయాలను మన కళ్లకు కట్టినట్లు చూపారు.

ఈ విధంగా విశేష ప్రజ్ఞా పాటవాలు గల బాపిరాజు, వర్మ గార్లు తమ కథా కాలం నాటి సాంస్కృతిక పరిస్థితులను శౌపోసన పట్టి తమ నవలల ద్వారా ఆనాటి సమాజ సాంస్కృతిక విలువల్ని, ఆ విలువల్లో గల మానవీయ తను వెలికి తీశారని చెప్పక తప్పదు. ఎక్కడో ఒకటి రెండు చోట్ల వైషమ్యాలు త ఈ రెండు ప్రాంతాల సంస్కృతి ఒక్కటే అని తోస్తుంది. ఈ రెండు ప్రాంతాల సంస్కృతీ సంప్రదాయాలను బట్టి మన పవిత్ర భారతదేశ సంస్కృతిని అంచనా వేయవచ్చు. యుగాలు మారినా, కాలాలు మారినా, ప్రాంతాలు మారినా సమాజంలోని సంస్కృతీ సంప్రదాయాలు ప్రధాన నిర్దేశికాలు మారవనీ, అఖండ భారత సంస్కృతి భిన్నత్వంలో ఏకత్వంలా కలసి ఉంటుందనీ, ఈ ఇద్దరు రచయితల రచనల వల్ల స్పష్టమైంది.

**5.3.4. మత పరిస్థితులు – తులన:** బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మ గారు తాము రచించిన చారిత్రక నవలల్లో ఆనాటి చారిత్రకాంశాల్లోని కథా గమనంతో ముడిపడి ఉంటే మతాన్ని గురించి ప్రస్తావించి, మత సామరస్యానికి పరమత సహనానికి తగిన సూచనలిస్తూ మత మాధ్యాన్ని విడనాడమని తమ నవలల ద్వారా ప్రబోధించారు. బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మ గారు వారి వారి కథా కాలాన్ననుసరించి అప్పుడు ప్రాచుర్యంలో ఉన్న మతాలను గురించి

తమ నవలల్లో చర్చించారు.

రాజుగారి కథాకాలం నాటికి శైవ, వైష్ణవ, బౌద్ధ, జైన మతాలే ఎక్కువ ప్రాచుర్యంలో ఉన్నాయి. కాబట్టి రాజుగారు తమ నవలల్లో పై మతాలను వివరించారు. మహమ్మదీయ క్రైస్తవ మతాలు ఆనాటికి భారత దేశం దక్షిణా పథంలో ఇంకా కాలూనలేదని రాజుగారి నవలల ద్వారా అర్థమౌతుంది. వర్మగారి కథాకాలం నాటికి మహమ్మదీయ, క్రైస్తవమతాలు భారత దేశంలో ప్రవేశించాయి. కాబట్టి వర్మగారు తమ నవల్లో ఆ మతాల ప్రస్తావనే అధికంగా తెచ్చారు. కాని జైనమతాల ప్రస్తావన ఎక్కడో ఒకటి రెండు చోట్ల తప్ప ఎక్కడా తేలేదు. వర్మగారు కూడ భువనవిక్రమ్ నవలలో అప్పటి కథాను సారం వైదిక మత ప్రస్తావనమాత్రమే తెచ్చారు. మొత్తం మీద ఇద్దరి రచయితల నవలల వల్ల అర్థమయిందేమంటే, భారతదేశంలో ఎప్పుడూ వైదిక మతంతో ఇతర మతాలు ఘర్షణ పడుతూ ఉండేవనీ, ఇతర మతాలతో ఘర్షణ పడ్డా వైదిక మతం పూర్తిగా నశించకుండా నిలదొక్కుకొని ఉండేదనీ వర్ణించారు. కొందరికి మత సహనం ఎక్కువైతే, మరి కొందరికి మత మౌఢ్యం ఎక్కువ.

బాపిరాజుగారి శ్యాలతిష్యులు, వీరపురుష దత్తుడు మొదలైన వారు మత మౌఢ్యాన్ని ఎక్కువగా చూపితే, అమృత పాదార్యాతులు, నాగార్జునా-చార్యులు, శివదేవయ్య మంత్రి మొదలైనవారు మతసహనాన్ని చూపారు. అలాగే వర్మగారి జోర్ధన్ పండితుడు, మహమ్మదీయ ముల్లాలు మొదలైనవారు మతమౌఢ్యంతో ప్రవర్తిస్తే రాజా మానసింహుడు, రాణి అహిల్యాబాయి, అలీ మర్దాన్ మొదలైన వారు మతసహనాన్ని చూపించారు. అలీమర్దాన్ సైనికులు హిందూ మందిరాలను

పడగొడ్తే అలీ మర్దాన్‌కు కోపం వస్తుంది. "ఇకపై ఎవరైనా హిందూ మందిరం లోని ఒక ఇటుక క్రిందకు రాల్చినా అతన్ని శిరస్సు మొండెం నుండి వేరు చేస్తాను"[1] అంటాడు. దీనిని బట్టి హిందూ రాజులకైనా, మహమ్మదీయ పాలకులైనా కొందరికి ఇతర మతస్థుల మందిరాలు పడగొట్టడం ఇష్టం ఉండదనీ, ప్రజలే రెచ్చిపోయి మందిరాలను పడగొట్టేవారనీ అర్థమవుతుంది.

అడివి బాపిరాజు గారి నవలలు ఒక్కొక్కటి ఒక్కొక్క యుగానికి సంబంధించినవి కాబట్టి పరిస్థితుల పరిణామం స్పష్టంగా తెలుస్తుంది. శాతవాహనులు, ఇక్ష్వాకుల కాలంలో ఆంధ్రలో వైదిక మతంతో పోటీపడిన మతాలు బౌద్ధ, జైన మతాలు. శాతవాహనుల కాలంలో బాపిరాజు గారు వైదిక బౌద్ధ మతాలకు జనకజన్య సంబంధం కల్పించారు. (స్థాలతిష్యుడు తండ్రి వైదిక మతాభిమాని - అపృత పాదార్పితులు కుమారుడు బౌద్ధ మతావలంబి) తర్వాత వైదిక బౌద్ధ మతాలు రెండూ మత సామరస్యాన్ని ప్రబోధించడం వల్ల, అడవి శాంతిశ్రీ నవలలో భార్యాభర్తల సంబంధం (నాయిక అడవి శాంతిశ్రీ బౌద్ధ మతాభిమాని - నాయకుడు బ్రహ్మదత్తుడు వైదిక మతావలంబి) గా రాజు గారు చమత్కరించారు. కాని చాళుక్యుల కాలంలో తిరిగి వైదిక మతం విజృంభించింది. బౌద్ధ జైన మతాలు క్రమేణా అంతరించాయి. దీనికి కారణాలు అనేకాలైనా, ముఖ్యంగా గుర్తుంచుకోదగింది బౌద్ధ జైనాలు హిందూ మతంలో శాఖలనీ, అవి వేరు కాదనీ ప్రచారం చేయడం. అంతేగాక బౌద్ధ, జైన మతాల్లో క్రమంగా కట్టుబాట్లు నియమాలు అధికం కావడం వల్ల తిరిగి వైదిక మతం పుంజుకొంది. కాకతీయుల కాలంలో వైదిక మతంలోనే శైవ, వైష్ణవ భేదాలు ఉద్భవించి, శైవ, వైష్ణవ మతస్థులు

---

1. నారాటాకీ పట్నిని - బృం. లాల్ వర్మ., పు: 93

తమ గొప్పదనం ప్రదర్శించుకోవడానికి ఇంకో మతాన్ని ద్వేషించ సాగారు; తూలనాడ సాగారు. ఈ మత మౌఢ్యం ఎంతవరకు వెళ్ళిందంటే వీరశైవులు, వైష్ణవులను, బౌద్ధ, జైనులను కేవలం మతపరంగా హతమార్చడం వరకు.

కాకతీయ కాలం నాటికి మత పరంగా శైవ, వైష్ణవ భేదాలే కాకుండా చాతుర్వర్ణాలు, ఆ వర్ణాల్లో శాఖోపశాఖలు బయలుదేరి జాతి భేదం ఆ నాటికే ఉద్భవించిందని బాపిరాజుగారి గోనగన్నారెడ్డి నవల వల్ల తెలుస్తుంది. "కాకతీయుల కాలం నాటికే బాపన, రెడ్డి, కమ్మ, నాయుడు, బలిజ, వెలమ, రజక, క్షురక ...... లాంటి జాతుల వాళ్ళలో 72 యోగాలు ఉన్నాయని గోన గన్నారెడ్డి వల్ల తెలుస్తుంది."[1]

ఇన్ని మతాలు, కులాలు ఉన్నా ఆ నాటి ప్రజా జీవితం మతం వల్ల భిన్నా భిన్నం కాలేదని, రాజులు, రాణులు, చక్రవర్తులు ఏ మతాన్ని అవలంబించినా ఏ కులం వారైనా ఇతర మతాలను గానీ, కులాలను గానీ ద్వేషించలేదనీ పెపెచ్చు ఆదరించారని తెలుస్తుంది. ఉదా॥ కాకతీయరాజులు శైవులైనా వైష్ణవ మతాన్ని సమాదరించారు.

"Vaishnavism made steady progress during the Kakatiya period inspite of their preference to Saivism; the Kakatiyas were in no way opposed to vaishnavism and continued to have the sacred Boar (varaha) and the sacred vulture (Garuda) as the crest and banner of their family"[2]

1. గోన గన్నారెడ్డి – అడివి బాపిరాజు., పు:
2. Religion in Andhra – Dr. B.S.L. Hanumantha Rao., P:259.

ఈ విధంగా బాపిరాజుగారు తమ నవలల్లో వైదిక, బౌద్ధ, జైన మతాలు, వైదిక మతంలోని శైవ, వైష్ణ శాఖలను గురించి విరివిగా చర్చించారు. కాని ఆ నాటి కథావస్తువుల ననుసరించి రాజుగారి నవలల్లో ఎక్కడా మహమ్మదీయ క్రైస్తవ మతాల ప్రసక్తే లేదు. ఒక్క హిమబిందులో హిమబిందు తండ్రి కీర్తిగుప్తుడు యవన మతస్థురాలిని వివాహమాడినట్లు కథాగమనంలో చెప్పారే కాని, మత పరంగా చెప్పలేదు.

ఇక బృందావన్ లాల్ వర్మగారి ఒక్క భువన్ విక్రమ్ తప్ప, తక్కిన నవలల కథాకాలం 14 వ శతాబ్ది నుండి 19 వ శతాబ్దం వరకు. కాబట్టి వైదిక మతాలతో బాటు మహమ్మదీయ క్రైస్తవ మతాలు కూడా భారతదేశంలో ప్రవేశించి రకరకాల మతాలు, జాతులు కలగా పులగంగా మారిపోయి ఇంకా కొత్త మతాలు, కొత్త జాతులు, కొత్త కులాలు పుట్టుకొచ్చాయి. మహమ్మదీయులలో ఒక తెగవారైన సూఫీ మత ప్రసక్తి - సూఫీ తత్త్వం కూడ బృందావన్ లాల్ వర్మగారి నవలల్లో కనబడుతుంది. ఆ నాటి మొగలాయి చక్రవర్తుల్లో ప్రఖ్యాతిగాంచిన అక్బర్ 'దీన్ ఇలాహి' అనే కొత్తమతాన్ని ప్రవేశపెట్టినట్లు మనకందరికీ తెలిసిందే. "మతానికుండే ఆదర్శాలే ప్రాతిపదికగా పరిపూర్ణమైన మతం ఒకదానిని స్థాపించాలనే అక్బరు చక్రవర్తి మహదాశయం. దురదృష్టవశాత్తు వేళ్ళు తన్నుకోలేదు"[1]

వర్మగారి భువన విక్రమ్ నవలలోని మతం వైదిక మతమే. ఎందు కంటే ఆ నవల ఉత్తర వైదిక కాలానికి సంబంధించింది కాబట్టి, బౌద్ధ, జైన

1. తెలుగుసంస్కృతి తరంగాలు (తెలుగుకథా కసూమీషు) మతం - కె.సి.వరదాచారి., పు:51.

మహమ్మదీయ, క్రైస్తవ మతప్రసక్తి తెచ్చేందుకే వీలులేదు. వర్మగారి 'మృగనయని' నవలలో మత ప్రస్తావన ఎక్కువగా ఉంది. అయితే హిందూ మహమ్మదీయులు మాత్రం కేవలం మతందృష్ట్యా విరోధిస్తున్నారని చెప్పేందుకు వీలులేదు. ఈ రాజులందరూ మతంకంటే ధనం, రాజ్యాధికారం కోసమే పోట్లాడుకున్నారని పిస్తుంది. అందుకే హిందూ మతస్థుడైన రాజసింహుడు మహమ్మదీయ మతస్థుడైన గయాసుద్దీన్ తో చేతులు కలిపి, మరో హిందూ రాజు మానసింహునితో యుద్ధం చేస్తాడు. గుజరాత్ పాదుషా మహమ్మద్ బఘుర్రా హిందూ రాజులతోనే గాక మాండూ సుల్తాన్ గయాసుద్దీన్ తోనూ, ఢిల్లీ సుల్తాన్ సికిందర్ లోడీ తోనూ విరోధం పెంచుకొంటాడు. 'విరాటాకి పద్మిని' నవలలో చిన్నరాణి అలీమర్దాన్‌తో చేతులు కలిపి దేవీసింహుని పదవీ భ్రష్టుని చేయాలనుకొంటుంది. 'టూటే కాంటే'లో మహమ్మదీయుడైన సాదత్‌ఖాన్ మరో మహమ్మదీయుడైన మహమ్మద్‌షాను అధికారం నుండి దింపాలని, ఇంకో మహమ్మదీయుడు నాదిర్షాను ఈరాన్ నుండి పిలిపిస్తాడు. ఈ విధంగా ఆనాటి రాజులలో మతంకన్నా ధనం కావాలనే ఆకాంక్ష మెండుగా ఉండేది. 1026 లో గజనీ మహమ్మద్ కథియవాడ్ లోగల సోమనాథ్ దేవాలయం పై 17 సార్లు దండెత్తి ఎంతో ఐశ్వర్యవంతం, పవిత్రమైన ఈ సుప్రసిద్ధమైన దేవాలయాన్ని దోచుకొని వెళ్ళాడు. ఇంకా అనేక విగ్రహాన్ని బద్దలు కొట్టి, అశేషమైన సంపదను దోచుకొని వెళ్ళాడు. కాని ఈ నగరాలు, దుర్గాలు, దేవాలయాలు, శిథిలాలుగా మార్చి వెళ్ళాడు. కాని ఈ దండయాత్రలు మత పరంగా చేశాడనే వీలులేదు. "మహమూద్ దండయాత్రలను మత దండయాత్రలుగా పరిగణించవీల్లేదని కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

ఎందువల్ల నంటే ఇక్కడి హిందూరాజులతోనే కాక అతడు ముస్లింలతో కూడా పోరాడాడు ..... మహమ్మద్ దాడుల ప్రధాన లక్ష్యం ఆర్థికమైనదేనని చెప్పాలి."

ఈ విధంగా మధ్యయుగం నాటి మహమ్మదీయులు, హిందువులు, ఆర్థికంగా, రాజకీయంగా నిలదొక్కుకోవాలనే ప్రయత్నంలో మతపరంగా కొన్ని నియమాలు, కట్టుబాట్లు కల్పించేటప్పటికి సామాన్య ప్రజలు తట్టుకోలేక అష్టకష్టాలు పడ్డారని బృందావన్‌లాల్ వర్మగారి నవలల ద్వారా తెలుస్తున్నది.

ఈ ఇద్దరు రచయితల ఉద్దేశాలు ఒకటే. వీరిద్దరూ తమ నవలల్లో అనేక చోట్ల మతప్రస్తావన తెచ్చి, నదులన్నీ సముద్రంలో కలిసినట్లు అన్ని మతాల సారం మానవసేవే అని చాటిచెప్పారు.

**5.3.5. ఆర్థిక పరిస్థితులు - తులన:**

బాపిరాజు గారి, వర్మగారి చారిత్రక నవలల్లోని ఆనాటి ఆర్థిక పరిస్థితుల్ని విశ్లేషించి చూస్తే రాజుగారి కథాకాలంలో రాజులు గాని, ప్రజలు గాని ఆర్థికంగా ఏమీ బాధలు పడలేదనీ, ఒకవేళ యుద్ధం లాంటి పరిస్థితుల్లో ప్రజలు చితికి పోయినా యుద్ధ పరిసమాప్తి కాగానే మరలా పుంజుకొనే వారని, రాజులు ప్రజలకు ధనరూపేణా, ధాన్యరూపేణా, వస్తురూపేణా ఎన్నో రకాల సహాయాలు చేసేవారని తెలుస్తుంది. అదీగాక ఆంధ్రరాజులు అంతః శత్రువులు, బాహ్య శత్రువులను అణచివేసి విశాల సామ్రాజ్యాలు స్థాపించి ఏలారు. చక్కని ప్రణాళికను వేయడం, స్వదేశంలోనే కాక విదేశాలతో కూడా వర్తక వ్యాపారాలు చేయడం, కర్మాగారాలకు కావలసిన ముడిసరుకులు తమ రాజ్యంలోనే లభిస్తాయి కాబట్టి తక్కువ శ్రమతో, తక్కువ ఖర్చుతో ముడి

సరుకులను పంపిణీ చేయడం, పరమత సహనం, సంఘ జీవనం వల్ల ఆర్థిక పరిస్థితి మెరుగై ప్రజలు ఆనందోత్సవాలతో ఉండేవారని తెలుస్తుంది.

కానీ వర్మగారి నవలల ద్వారా ఆనాటి ప్రజల ఆర్థిక పరిస్థితి చాల దీనం గానూ, హీనం గానూ ఉండేది. ఆ నాడు ఉత్తర భారతం అంతా చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోవడం, నిరంతర కలహాలతో ఉంటే చిన్న చిన్న రాజ్యాలు అభివృద్ధి చెందడం అసాధ్యం. బహుశ ఏ రాజో కొంచెం స్థిరపడి దేశ ఆర్థిక పరిస్థితి మెరుగు పర్చాలని ఏ కర్మాగారమో నిర్మిస్తే శత్రురాజులు దానిని నాశనం చెయ్యరని నమ్మకమేమిటి? గ్వాలియర్ కోటను పట్టుకోలేక పోయిన సికిందర్ లోడీ తన పగ తీర్చుకోవడానికి నర్వర్ కోటపై దండెత్తి, నర్వర్ కోటలో అందరూ మరణించాక ఆ కోటను ఆక్రమించుకొని, ఆరు నెలల పాటు మందిరాలను, విగ్రహాలను ధ్వంసం చేసినాడట. బహుశ మానసింహుడు తన రాజ్యంలో ఏదో ఒక చోట ఏదైనా పరిశ్రమ నెలకొల్పి ఉంటే శత్రురాజులు మాత్రం నాశనం చెయ్యరని నమ్మకం ఏమిటి? అందుకే ఆనాటి రాజులు ప్రజాహిత కార్యక్రమాలు ఏవీ చేపట్టక ప్రజలను వారి మానాన వారిని వదిలేసే వారు. మహమ్మదీయ రాజులు మగువ, మదిర మత్తులో పడి, తుచ్ఛ భోగాలు అనుభవిస్తూ మరణించే వారనీ, ప్రజలకు ఏమీ చేయలేదని అర్థమౌతుంది. ఒక్క మృగనయనీ నవలలోనే కాదు దాదాపు వర్మగారి నవలలన్నింటిలోను ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఝాన్సీ కీ రాణి లక్ష్మీబాయి, అహిల్యాబాయి, మానసింహ తోమర్ లాంటి వాళ్ళు ప్రజాహిత కార్యాలు చేసి ప్రజల్ని సుఖంగా జీవించేటట్లు చేయాలని

మనస్ఫూర్తిగా భావించినా ఆ నాటి పరిస్థితులు అడ్డుగోడలైనాయి. అందుకే వారు ఏమీ చేయలేక పోయారు.

దీనిని బట్టి దేశం ముక్కలు ముక్కలుగా ఉంటే ఈసురోమని ప్రజలు ఉంటారనీ, ప్రగతి పథం వైపుకు దేశాన్ని నడిపించడం అసాధ్యమనీ, సుస్థిర సామ్రాజ్యం ఉంటే దేశం ఆర్థికంగా బాగుపడి సుభిక్షంగా ఉంటుందనీ బాపిరాజు, బృందావన్ లాల్ వర్మగార్ల నవలల వల్ల అర్థమౌతుంది. నేడు కూడ మన అఖండ భారతం ఆర్థికంగా సుస్థిరంగా ఉండాలంటే, ప్రజలంతా ఐకమత్యంగా ఉండాలనీ, జాతీయ సమైక్యతా భావంతో మెలగాలనీ, లేకుంటే దేశప్రజలు తమ స్వాతంత్ర్యం కోల్పోయి నానా బాధలు పడుతూ హీనమైన బ్రతుకులు బ్రతుకుతారనీ వీరి నవలల ద్వారా మనకు అర్థమౌతుంది. ఈ విధంగా చారిత్రక నవలద్వారా భావిభారతం ఎలా ఉండాలో ప్రజలకు సూచించిన ఈ చారిత్రక నవలారచయిత లిద్దరూ ధన్యజీవులు.

6.1.1. భాష : సాహిత్య క్షేత్రంలో ప్రక్రియను అనుసరించి గాని, విషయాన్ని అనుసరించి గాని రచయితలు భాషను ప్రయోగిస్తారు. శాస్త్రాలను ప్రతిపాదించే భాష వేరు, కావ్యాలలో ప్రయోగించే భాష వేరు.

తెలుగు భాషలో నాలుగు విధాలైన శబ్దాలు చోటుచేసుకొన్నాయి. 1. తత్సమాలు, 2. తద్భవాలు, 3. దేశ్యాలు, 4. అన్యదేశ్యాలు.

భావకవి, నవలాకారుడు, కథానికా రచయిత, నాటకకర్త అయిన బాపిరాజు గారికి భాషల పట్ల కొన్ని ప్రత్యేక అభిప్రాయాలున్నాయి. సంస్కృత భాష దేవభాష అని, ప్రపంచ భాషల్లో సంస్కృత భాషాస్థానం ఎంతో ఉన్నతమైందనీ, సంస్కృత భాష నుండి భారతీయ భాషలెన్నో పుట్టాయని ఆయన ఉద్దేశం. "తెలుగు భాష – సంస్కృత భాషకు బిడ్డ అనిన్నీ, ఆర్యులయిన ఆంధ్రులు దక్షిణాదికి రాగానే ఇక్కడ ఉన్న అనాది జాతుల భాష నుండి కూడ కొన్ని పదాలు తెలుగులోకి వచ్చాయని చెప్పారు."[1]

బాపిరాజుగారి నవలా రచనా కాలం నాటికి తక్కిన రచయితలందరూ గ్రాంథిక భాషలో రచనలు సాగించే వారు. సరళ గ్రాంథిక భాషను వాడే వారు. ముఖ్యంగా చారిత్రక నవలల్లో సమాస భూయిష్టమైన గ్రాంథిక భాషనే వాడారు. గ్రాంథిక భాష చారిత్రక నవలా స్థాయిని మరింత పెంచుతుందని అప్పట్లో రచయితలందరూ భావించే వారు. బాపిరాజు గారు కూడా ప్రారంభంలో గ్రాంథిక భాష వైపే మొగ్గు చూపారు కానీ గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషా ప్రభావం వల్ల

1. కోనంగి – అడివి బాపిరాజు.

ప్రేరేపితులై ఆ తర్వాత వ్యావహారిక భాషపై మొగ్గు చూపారు. బాపిరాజు గారు ఆనాడు వాడిన వ్యావహారిక భాషకు నేటి ఆధునిక వ్యావహారిక భాషకు ఎంతో తేడా ఉంది. కాబట్టి ఆనాటి వ్యావహారిక భాషను, వ్యావహారిక భాష అనడం కంటే 'సరళ గ్రాంథికం' అంటే బాగుంటుంది.

బాపిరాజు గారి చారిత్రక నవలల కథాకాలం క్రీ.పూ. 3వ శతాబ్ది నుండి క్రీ.శ. 14వ శతాబ్ది వరకు. శాతవాహనులు, ఇక్ష్వాకులు ఆంధ్రులైనా వారి అధికార భాష సంస్కృతం. ఆ నాటి సామాన్య ప్రజలు ప్రాకృత, పైశాచీ సమ్మిశ్రిత భాషను మాట్లాడే వారని శాసనాల ద్వారా తెలుస్తున్నది. తర్వాత చాళుక్యులు, కాకతీయుల కాలం నాటికి ఆంధ్ర భాష ప్రాచుర్యం లోకి వచ్చింది. కానీ ఆనాటి భాషకు నేటి భాషకు ఎంతో తేడా ఉంది. కాబట్టి బాపిరాజు గారు తన నవలల్లో ఏ భాష వాడాలి? ఎలా వాడాలి? అని మొదట నిశ్చయించుకొని, తనదైన విధానంలో భాషా ప్రయోగం జరిపారనడంలో సందేహం లేదు. బాపిరాజు గారి భాషా ప్రయోగాన్ని పరిశీలిస్తే కొన్ని ప్రతిపాదనలు చెయ్యవచ్చు.

1. చారిత్రక నవలల్లో ముఖ్యంగా యుద్ధ సన్నివేశాలు వర్ణించేటప్పుడు దీర్ఘ సంస్కృత సమాసాలు, క్లిష్టమైన పదాలు, బిగువైన వాక్య నిర్మాణం కన్పిస్తుంది. ఉదా॥

"ధనుర్విద్యా మహాంధ్రుల ప్రతిమానులు ..

... అగ్ని గోళములు, శతఘ్నులు, శిలాఘ్నులు
శిలావర్షము కురియుచున్నది." [1]

---

హిమబిందు — అడివి బాపిరాజు., పు: 320, 321.

2. సుదీర్ఘమైన సంస్కృత పదాలు, వెనువెంటనే తేట తేనియ లాంటి తెలుగు పదాల సమ్మిశ్రణంతో బాపిరాజుగారి భాష ఒకప్పుడు పొంగెత్తిన సముద్ర ఘోష లాగ, మరోమారు గలగలపారే సెలయేరులా ఉంటుంది. భావాన్ని మరింత ప్రస్ఫుటం చేయడానికి ఆయన పదాలను తూచి తూచి వాడుతారు. హిమబిందులో "దావానలం తరాళము నుండి జనించి          పగ్గము హస్తము నుండి సడలపోవు నట్లానచ్చెను,"[1] అని ఎడ్లబండ్ల పందెంలో శకట వేగాన్ని దీర్ఘ సమాసాలతో వాడారు. హిమబిందు, నాగబంధునికల సంభాషణలో సరళ భాషను వాడారు.

"అది నిజమే కాని మాబావను ఎందుకు ఉజ్జయిని పంపుతున్నారో తెలియునా?"

"నాకేమి తెలియును బిందూ!"

"మానాన్నగారే అతడు ఉజ్జయిని వెళ్ళుటకు కారణభూతులు."

"మేనల్లునికి సర్వవిధముల సహాయము చేయవలసినదే కాదా?"

నిజమేకాని నేను మాబావను, మాబావ నన్నును ప్రేమింతుమన్నభయముచే నాన్న సమదర్శిబావను ఉజ్జయినికి పంపించినారు."[2]

1. హిమబిందు, అడివి బాపిరాజు., పు; 50.
2. పైదే.; పు; 263.

బాపిరాజుగారు అన్యార్థ ద్యోతకమైన నిగూఢ భాషను కూడ ప్రయోగించారు. "ప్రభూ, ప్రొద్దు గుంకుతూ ... ఉనుష్ఠానంబులు సరిగ్గా అవుతున్నవి,"[1] అన్న ఉత్తరం లకుమయారెడ్డికి రహస్యాచారుడైన ఈశ్వరభట్టు ద్వారా అందుతుంది. ఆ ఉత్తరం నిగూఢంగా ఉంది. ఇతరులకు అర్థంకాదు. రుద్రమదేవి సింహాసనం ఎక్కడంలో రాజ్యంలోని సామంతరాజులంతా తిరుగుబాటు చేస్తున్నట్లుగాను, దానిని అణచివేయడానికి గణపతి దేవులు, శివదేవయ్యమంత్రి మొదలైనవారు తమ ప్రయత్నాలు చేస్తున్నట్లు ఆ ఉత్తరానికి అర్థం. భాషాపదజాల ప్రయోగంలో బాపిరాజుకు గల ప్రత్యేకత పై విషయం వల్ల తెలుస్తుంది.

హిమబిందు నవల క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందింది. ఆనాటి పల్లెప్రజలు ప్రాకృతభాష మాట్లాడేవారని ఊహించి బాపిరాజుగారు గాథాసప్తశతిలోని ప్రాకృతభాషను కొద్దిగా వాడారు. పల్లెదంపతులైన దుర్గసామి, బాపిస్త్రీతో సరససల్లాపాలాడుతూ

"అణ్ణాస ఆ ఈం రేంతీ తహాసుర పహారిస
... ఆ వద్ధధిమో"[2] అని పాడుతాడు.

---

1. గోనగన్నారెడ్డి, అడివిబాపిరాజు., పు; 34.
2. హిమబిందు, అడివిబాపిరాజు., పు; 226.

"ఆశ అపసుత్త అవిశో మీశ అచ్చు
... కొఫు కోరిచిరా ఇస్సం"[1] అని బాపిశ్రీ కోకిలకంఠంతో తీయగా పాడింది.

'బాపిరాజుగారి భాషాపాటవాన్ని గురించి గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు - "బాపిరాజుగారు తన వస్తువులకు తగిన భాషనే స్వీకరించారు. ఆయన కల్పనము, మనలను మరొక జగత్తులోనికి తీసుకొనిపోయి ఆనంద పరచునట్లే ఆయన భాష కూడ హృదయంగమమైనది. ఆయన శబ్దలాలిత్యమే మనల పరవశం పొందింప చేసే ఆయన ప్రథమంగా కవి. అటుతర్వాత చిత్రకారుడు. ఆయన కథలన్నిటా కన్పించేది అదే. ఆయన వస్తువు కంటె మనలను అధికంగా ఆకర్షించేది ఆయన భాషే."[2]

ఆయన తన నవలల్లో సన్నివేశాల కనుగుణంగా భాషను వాడారు. ఈవిధంగా బాపిరాజుగారు సంస్కృత పదాలతో కూడిన సరళమైన భాషలో తమ చారిత్రక నవలలను రాశారు.

6.1.2. శైలి : నవలల్లో భాష, సంభాషణలు, వర్ణనలు ఎన్ని ఉన్నా తనదంటూ రచయితకు ఒక శైలి (style) ఉంటుంది. బాపిరాజుగారు తన నవలలన్ని కాల్పనికోద్యమ

1. హిమబిందు, అడివి బాపిరాజు., పు; 228
2. అక్షరాభిషేకము, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య., పు; 161.

ప్రభావంతో భావకవిత్వ ధోరణిలో రచించారు. అతడు సమాజంగా కవి, పైగా చిత్రకారుడు. చిత్రకారుడు కుంచె తో చిత్రపటం మీద రంగులు అద్దుతాడు. అదేవిధంగా బాపిరాజుగారు నవల అనే పటం మీద, శైలి అనే కుంచె తో రంగులు అల్లినాడు. గోనగన్నారెడ్డి నవలలో అన్నాంబిక తన మందిరానికి "మందాక్రాంత వృత్తంలా నడిచి వెళ్ళిపోయింది అని రాజుగారు రాశారు. మన్నవ సత్యనారాయణ గారు "కాళిదాసు తన మేఘసందేశ కావ్యాన్ని మందాక్రాంత వృత్తంలో రచించా డన్నది సాహిత్యప్రియులందరికి తెలిసినదే. అన్నాంబిక నడిచి వెళ్ళటాన్ని బాపిరాజుగారు మందాక్రాంత వృత్తంతో పోల్చటం రమ్యాతి రమ్యం. ఇలాంటివే రచయిత శైలికి అందాన్ని సమకూర్చుతాయి," [2] అన్నారు. బాపిరాజుగారి రీతులలో శైలి వైవిధ్యం తో కూడుకొని ఉంది.

1. **సంభాషణాత్మక శైలి** : బాపిరాజుగారి శైలి చాలవరకు సంభాషణాత్మకం. గోనగన్నారెడ్డి, హిమబిందు నవల్లో ఈశైలిని బాపిరాజుగారు అద్భుతంగా నిర్వహించారు. అన్నాంబిక పురుష వేషంలో వచ్చి గన్నారెడ్డితో మాట్లాడినప్పటి సంభాషణ:

గోన: ఎవరు కావాలి మీకు?

బాలుడు: నాకు గోనగన్నారెడ్డి ప్రభువర్యుల దర్శనం కావాలి...

1. గోనగన్నారెడ్డి, అడివి బాపిరాజు-, పు; 112.
2. శ్రీ అడివి బాపిరాజు నవలాసాహిత్యాను శీలనం, డా. మన్నవ సత్యనారాయణ-, పు; 252

గోన : ఏమిపని వారితో?

బా : నేను వారికొలువులో చేరడానికి వచ్చాను.

గోన : వారికి రాజ్యం లేదే?

బా : స్వామీ! మీరు కూడ వారిసైన్యంలో ఉన్నవారిలా కన బడుతున్నారు. వారి రహస్య నగరానికి దారి చెప్పండి.

గోన : మరి మా సేనలో చేరే వారి పేరు మాకక్కరలేదా?

బా : అలాగే, నాపేరు విశాలరెడ్డి

గోన : మీ ఇంటిపేరు?

బా : మా యింటిపేరు అనుముకొండవారు."[1]

**2. ఆఖ్యానాత్మక శైలి** : బాపిరాజుగారు తన చారిత్రక నవలల్లో అక్కడక్కడ ఆఖ్యానాత్మక శైలిని వాడారు. అడవి శాంతిశ్రీ నవలలో "శాతవాహన సామ్రాజ్యము స్థాపించిన ప్రథమాంధ్ర ఋషి కౌశిక గోత్రోద్భవుడైన దీపకర్ణి కుమారుడు శాత వాహనుడు. ఆ శాతవాహనులు విజృంభించి తమ ప్రథమాంధ్ర పట్టణమైన శ్రీకాకుళము వదలి ... కాబట్టి ఆ నగరం ధాన్యకటక నగరం అన్న పేరు పొందింది."[2]

**3. వర్ణనాత్మక శైలి** : హిమబిందు నవలలో శకటు చోదక పరీక్షకు నిర్ణీతమైన శకటాలకు పూన్చిన ఎద్దులను వర్ణనాత్మక శైలిలో వర్ణించడం జరిగింది.

---

1. గోనగన్నారెడ్డి, అడవి బాపిరాజు., పు; 288, 289
2. అడవిశాంతిశ్రీ, అడవి బాపిరాజు., పు; 8.

"ప్రారంభప్రదేశ మందవి శ్రేణిగా నిలువబడి యున్నవి. కంఠరవములు కట్టి లేడి కాళ్ళవలె పలుచని కాళ్ళు గలిగి, పొట్టివియు, నెత్తయు నవియు, శ్వేత, కపిల, శబల, ధూమ్ర, లోహిత, వర్ణవిగ్రహముత్తై కొమ్ములకు వెండి, బంగారు తొడుగులు, కాళ్ళకు వెండి బంగారు గజ్జెలు, నడుములకు పట్టుదట్టీలు, మూపుల వర్ణ కంబళములు, కంఠముల బంగారు వెండి మువ్వలు, ఘంటికలు, ... భయమున కొన్ని, రౌద్రమున కొన్ని, తొందరపాటుల్తో కొన్ని నిలిచి తోకలు ఇటు నటు నాడించుచున్నవి. అంకెలు వేయుచున్నవి...చెవుల నాడించుచున్నవి. కన్నుల త్రిప్పుచున్నవి."[1] ఈ వర్ణనలో సహజత్వం ఉట్టి పడుతున్నది.

బాపిరాజుగారు సరళ గ్రాంథిక శైలిలో తమ రచనలు గావించారు. "భావుకులైన సహృదయులను బాపిరాజుగారి శైలి ఆకర్షించినట్లే దియు ఆకర్షింపలేదు",[2] అన్నమాట సత్యం.

6.1.3. **సంభాషణలు :** నవలల్లోని ముఖ్యాంశాలలో సంభాషణ ఒకటి. రచయిత నవలలోని పాత్రల గుణగణాలను, శీలాన్ని, ఇతర విశేషాంశాల్ని ముఖ్యంగా ఈ సంభాషణల ద్వారానే వ్యక్తంచేస్తారు. వాస్తవ జీవితంలోని సంభాషణలకు, నవలల్లోని సంభాషణలకు చాలవ్యత్యాసం ఉంటుంది. శ్రీ విశ్వామిత్రగారు "వాస్తవ

1. హిమబిందు, అడివి బాపిరాజు., పు; 43
2. ఆంధ్ర నవలా పరిణామము, డా. బొడ్డపాటి వెంకట కుటుంబరావు., పు. 400.

జీవితమున సంవాదములు చాలవరకు అర్థరహితములయి, యసంబద్ధములయి బహుప్రయోజితములయి,స్వచ్ఛందములయి యుండును. కాని నవలయందలి సంవాదములు సుసంబంధములయి, బహుప్రయోజితములయి యుండును,"[1] అని అన్నారు. ఈ సంభాషణాల ద్వారా వాస్తవిక జీవితంలోని విషయాలను తీర్చిదిద్దడానికి రచయిత ప్రయత్నిస్తాడు. ఇదే విషయాన్ని Marjonie Boulton గారు "the novelist is not restricted by the time limit imposed on the dramatist, but he faces one huge problem, he uses conversation to throw light on character and to carry a story forward and at the same time if he aims at verisimilitude he must make it seems like real life talk",[2] అన్నారు. బాపిరాజు గారు చారిత్రక నవలల్లో అప్పటి చారిత్రక వాతావరణాన్ని సంభాషణాల్లోనూ, వర్ణనల్లోనూ, సన్నివేశాల్లోనూ ప్రతిబింబింప చేశారు. తను ఏ కాలానికి చెందిన కథావస్తువును నవలలో చిత్రీకరిస్తున్నారో ఆ కాలంనాటి ప్రజల సంభాషణలు ఊహించుకొని వాస్తవానికి దగ్గరగా, కళాత్మకంగానూ, చారిత్రకంగానూ ఉండేటట్లు రూపకల్పన చేశారు. బాపిరాజు గారు రాసిన సంభాషణల్లో మచ్చుకు కొన్ని.

---

1. నవలయందలి సంవాదములు - స్రవంతి, జూలై-1963., పు; 43.
2. బాపిరాజు నవలలు-ఒక పరిశీలన, డా. డి. విజయలక్ష్మి, (ముద్రిత సిద్ధాంత వ్యాసం) " పు; 326

1. సంక్షిప్తంగానూ, సారగర్భితంగానూ ఉండే సంభాషణ.

2. సరస సంభాషణ.

3. నిగూఢ సంభాషణ.

4. పరిహాసాత్మక సంభాషణ.

1. సంక్షిప్తంగానూ, సారగర్భితంగానూ ఉండే సంభాషణ:

గోనగన్నారెడ్డి నవలలో గోనగన్నారెడ్డి, అన్నాంబికను ఆమె అనుమతితోనే అపహరించేందుకు వచ్చిన సందర్భంలో వారిద్దరి సంభాషణ.

"రాజకుమారీ! ఈ పెళ్ళివల్ల దేశంలో రాజద్రోహం రుద్ర తాండవము చేస్తుంది. నీవు వరదారెడ్డి రాకుమారుని వివాహం చేసుకోవచ్చును. కాని కొంతకాలం ఈ వివాహం కాకూడదు"

"ఈ వివాహం ఎప్పుడూ కాకూడదు" అన్నది అన్నాంబిక...

"ఎందుచేత?"

"నాకీ వివాహం ఇష్టంలేదు. నేను శ్రీ లకుమయారెడ్డిగారి కుమారులను నా భర్తగా ఊహించుకోలేదు, ఊహించుకోలేను."

"అయితే మొదట ఆ వివాహానికి ఎలా ఒప్పుకున్నారు మీరు?"

"కన్యకు తండ్రి ఆజ్ఞ అనుల్లంఘనీయము."

"ఇప్పుడు ఆ ఆజ్ఞలేదా?"

"ఇప్పుడు మీ మాటలలో వ్యక్తమయిన చక్రవర్తి ఆజ్ఞ నకాజ్ఞకన్న బలవత్తరమైనది ప్రభూ!"

"నేను గజదొంగను, నన్ను "ప్రభూ" అనకండి."

"నాకు మీరు గజదొంగలు కారు!"[1]

2. సరస సంభాషణ : హేమబిందు నవలలో సువర్ణశ్రీ, హేమబిందుల మధ్య సంభాషణ ఎంతో రమ్యంగా, సుమధురంగా ఉంది.

"సువర్ణ: బిందూ! మాటాడవేమి?

హేమ : నాకు మాటలు రావు.

సువర్ణ: నీ పేరంత మధురమేమి?

హేమ : మీ పేరులో అంత బంగారమేమి?

సువర్ణ: ఇన్ని రాత్రులు సృష్ట్యాదినుండి వెళ్ళిపోయినవి. ఈ రాత్రి యెంత అందముగ నుండినదో? ...

హేమ : శిల్పుల హృదయములలో రాళ్ళు, రప్పలు ఉండును. అదిగో అంతదగ్గరకు మీరు రాకూడదు.

సువర్ణ: పోనీలే! నేను దూరముగనే కూర్చుండెదను.

హేమ : మీకు దగ్గరయు, దూరము నొక్కటే కదా!"[2]

3. నిగూఢ సంభాషణ : గోనగన్నారెడ్డి నవలలో శివదేవయ్య మంత్రి, సేనాధిపతి ప్రసాదిత్య ప్రభువుల మధ్య జరిగిన సంభాషణలో శివదేవయ్య మాటల్లో నిగూఢార్థం దాగి ఉన్నది.

శివ: సేనాధిపతీ! ఇప్పుడు రుద్రదేవి ప్రభువుపై కుట్రచేసిన వారందరికీ ఒక మహానాయకత్వం ఏదో తెరవెనుక వుంది. ఆ -

---

1. గోనగన్నారెడ్డి, అడివి బాపిరాజు., పు; 92,93.
2. హేమబిందు, అడివి బాపిరాజు., పు; 184,185.

నాయకత్వం ఎవరిదా అని వేయి విధాల ప్రయత్నం చేసి కనుక్కొం టున్నాను, కాని ఏ విధమైన ఉదంతం నాకు దొరకటంలేదు.''...

ప్రసా : చివరకు మన ప్రయత్నాలన్నీ నిష్ప్రయోజనం ఐపోతాయేమో గురుదేవా?

శివ : ఆ భయం నాకు లేక పోలేదు. ఇందుకు ఒకటే పాశు పతం వుంది. దాన్ని ప్రయోగించాను. మొదట అది సాధారణ బాణం అనుకున్నాను, కాని అఖండాస్త్రమని నానాటికి వ్యక్తమవుతున్నది. ఆ సూత్రధారి ఎవరో తెలుసుకొని, వానిని నాశనం చేయగలిగింది ఒక్క అస్త్రమే[1] అంటాడు. ఆ అస్త్రమే గోనగన్నారెడ్డి అని చివరకు పాఠకులకు తెలుస్తుంది.

## 4. పరిహాసాత్మక సంభాషణ :

అడవి శాంతిశ్రీ నవలలో తారానిక, యశోద నాగనిక, నాగదత్తుల సంభాషణల్లో పరిహాసం ద్యోతకమవుతుంది.

తారానిక : పెద్దపులి వచ్చిందేమో అని అదిరి పోయాను.

నాగదత్తు : కోకిల గుంపు వచ్చిందేమోనని ఉప్పొంగి పోయాను.

యశోద : మీ ఇద్దరికీ మతిపోయిందేమోనని బెదారయ్యాను.

నాగ : ఇంతకీ నాచిన్న కత్తి తీసిన అందాల దొంగ దొరికింది. అదే సంతోషం.

---

1. గోనగన్నారెడ్డి, అడివి బాపిరాజు., పు; 127.

తార : నా వల్లకాలం తస్కరించుకు పోయిన ముచ్చు దొరికాడు. అదే నాకు విచారం . . .

నాగ : మీ స్నేహితురాలు కన్నీళ్ళు తుడు ముందు. లేకపోతే ఆ నీళ్ళతో ఈ వాగు పొంగి మన ఊళ్ళన్నీ మునిగి పోతాయి.

యశోద: ఉండండి ఇక్కడే. తట్టడానికీ, తుడవడానికీ కావలసిన వస్తువులు పట్టుకు వస్తాను"[1]

6.1.4. నుడికారం : బాపిరాజు గారు తన చారిత్రక నవలల్లో సందర్భానుసారంగా జాతీయాలు, లోకోక్తులు, సూక్తులు వాడి ఉన్నారు. మచ్చుకు కొన్ని

జాతీయాలు : ఉగ్గుపాలవిద్య[2], కడుపుమట్టు[3], వెలవెల పోవుట[4], దారికాయుట[5], అందెవేసిన బంటు[6], పీక్కు తినుట[7], అడుగంటి పోవు[8], అల్లారు ముద్దుగ[9], వెల్లివిరియుట[10] మొదలైనవి.

---

1. అడవి శాంతిశ్రీ, అడివి బాపిరాజు., పు; 99
2. హిమబిందు., పు; 32.
3. హిమబిందు., పు; 65.
4. అడవి శాంతిశ్రీ., పు; 73.
5. గోనగన్నారెడ్డి; పు; 8
6. గోనగన్నారెడ్డి., పు; 12
7. గోనగన్నారెడ్డి., పు; 64
8. అంశుమతి., పు; 13
9. అంశుమతి., పు; 21
10. అంశుమతి., పు; 66

లోకోక్తులు : 1. స్త్రీల హృదయం స్త్రీలకే తెలియును కదా[1]

2. కొండ ద్రవ్వి నెత్తి నెత్తుకొన జూచుట[2]

3. లోన లొటారం, పైన పటారం[3]

4. ప్రాణం పోవడం తప్పి కన్నులొట్ట బోవుచున్నది.[4]

సూక్తులు : 1. వీరుడు కోపమును, కర్ర నిప్పును దాచుకొనినట్లు తనలో దాచుకొనును.[5]

2. యుద్ధ సమయంలో ఉత్తమ మనుష్యుడు రుద్రమూర్తి అవుతాడు. నీచుడు పిశాచి అవుతాడు[6]

3. పండితులైన కుపుత్రుని కంటె మూర్ఖుడైనా, కొడుకు గుణవంతుడగుట మేలు.[7]

6.1.5. **వర్ణనలు** : బాపిరాజు గారి నవలలో వర్ణనల కత్యంత ప్రాధాన్యముంది. ప్రతి పుటలోను ఏదో ఒక వ్యక్తిని గాని, వస్తువును గాని, స్థలాన్ని గాని, రూపాన్ని గాని వర్ణించి ఉన్నారంటే అతిశయోక్తి కాదు. బాపిరాజు గారి నవలల్లో వర్ణనలు హృద్యమైనవీ, సున్నితమైనవీ అయినా అవసరమైనప్పుడు సమాస భూయిష్టమైన గంభీర వర్ణనలు కూడ చేస్తారు.

1. **ఆకార వర్ణన** : బాపిరాజు గారు చేసే వ్యక్తి ఆకార వర్ణన ఎంతో ఉదాత్తంగా ఉంటుంది. ఆయన స్త్రీని సుకుమారం

1. గోనగన్నారె పు. 66
2. అంశుమతి., పు; 47.
3. అంశుమతి., పు; 93
4. ఒడవిశాంతిశ్రీ., పు; 79
5. హిమబిందు., పు; 282.
6. గోనగన్నారెడ్డి.; 145
7. గోనగన్నారెడ్డి., 155

గానూ, పురుషుని గాంభీరంగానూ, బాలుని మార్దవంతోనూ వర్ణిస్తారు.

బాపిరాజుగారి స్త్రీలందరూ సుందరీమణులే. ఆంధ్రస్త్రీలపట్ల రాజుగారికి విపరీత అభిమానం. వారిస్త్రీలు సుందరులు. వారు సన్నని కౌను (నడుము) గలవారు. దీర్ఘనీల కుంతలులు. అన్నాంబిక, రుద్రమదేవి, అడవి శాంతిశ్రీ, తారానిక, యశోద నాగనిక, హిమబిందు, చంద్రబాల, నాగబంధునిక, మాధవీలత అందరూ అతిలోక సుందరీమణులే. వీరినందరిని అంగాంగ వర్ణన గావించినా ఇంకా వర్ణించవలసింది ఏదో మిగిలిపోయిందిగా భావిస్తారు రాజుగారు. స్త్రీ అంగాంగ వర్ణన చేయడం లాక్షప్రబంధ కవులకే మాత్రం తీసిపోరు. కాని స్త్రీ పట్ల పవిత్ర భావం కలిగిన భావుకులు బాపిరాజుగారు.

గోనగన్నారెడ్డి నవలలో రుద్రమదేవిని రాజుగారు ఇలా వర్ణించారు. "ఇరువది రెండేళ్ళ ఈడుగల ఆ యోషకు బంగారు రంగులో కాశ్మీర కుసుమ వర్ణమూ, జపాకుసుమ వర్ణమూ రంగరించి దిరిసెన పూవు మెత్తదనము కలిపి నట్లున్న దేహ సౌభాగ్యం చూచి ..."[1]

అలాగే పురుషుల్లో గోనగన్నారెడ్డి, బ్రహ్మదత్తుడు, చాళుక్య వీరభద్రుడు, సువర్ణశ్రీ, సముదర్శి మొదలైన వారిని గంభీరంగా వర్ణించారు. కుబ్జవిష్ణువర్ధనుణ్ణి పొట్టివాడుగా

1. గోనగన్నారెడ్డి, అడివి బాపిరాజు., పు; 47.

అభివర్ణించినా, మిగిలిన హంగులన్నీ చక్కగా అమరినట్లే వర్ణించారు. చారిత్రకంగా కుబ్జవిష్ణువర్ధనుడు పొట్టివ్యక్తి కాబట్టి అతన్ని మాత్రం రాజుగారు ఆజానుబాహువుగ వర్ణించలేక పోయారు. అడివి శాంతిశ్రీ నవలలో బ్రహ్మదత్తుని, వీరపురుషదత్తుని, హిమబిందు లో సువర్ణశ్రీని, సమదర్శిని, గోనగన్నారెడ్డి నవలలో గోనగన్నారెడ్డిని, చాళుక్య వీరభద్రుని ఆజాను బాహువులుగ వర్ణించారు.

2. **ప్రకృతి వర్ణన :** ప్రకృతికి సంబంధించిన వర్ణనలు చేసేటప్పుడు రాజుగారు ఏ సన్నివేశాన్ని చిత్రిస్తున్నారో ఆ సన్నివేశానికి అనువుగ ప్రకృతి వర్ణన చేస్తారు. హిమబిందు నవలలో విషకన్య ప్రవేశించిన ఉద్యానవన వాటికను "అందు నాభి తీగెలు ... మునిగితేలినది, ఓలలాడినది."[1] అంటూ వర్ణించారు. ఆకాశం, నక్షత్రాలు, నదులు, చెట్లు చేమలు, ఋతువులు, పంటపొలాలు, పూదోటలు, మొదలైన వర్ణనలు ఈయన చారిత్రక నవలల్లో కోకొల్లలు.

3. **వేట వర్ణన :** గోనగన్నారెడ్డి నవలలో యువరాజు రుద్రదేవులు (రుద్రమదేవి), చాళుక్య వీరభద్రుడు, మండలేశ్వరులు, వీరులు, బోయీలూ, చెంచులూ, కోయలూ అందరూ వేటాడినట్లు రాజుగారు వర్ణించి ఉన్నారు. "వేట నిర్విఘ్నంగా జరుగుతున్నది.

---

1. హిమబిందు, అడివి బాపిరాజు; పు; 20.

క్రూర మృగాలను వేటకాండ్లు రెచ్చగొట్టడం, రుద్రదేవి, చాళుక్య వీరభద్రుడు ... బాణాలు, ధనుస్సులు సంధించి చెవులకంటు అల్లెత్రాళ్ళు లాగి సువ్వన ఆ క్రూరమృగాల గుండెల్లోంచి దూసిపోవేయడం ... కుప్పకూలడం జరుగుతున్నది"[1]

**యుద్ధవర్ణన :** రుద్రమదేవి, యాదవమహారాజుల మధ్య జరిగిన భయంకరమైన యుద్ధవర్ణనను ఒళ్ళుగగుర్పొడిచేటట్లు "పదమూడవ దినాన మహాదేవరాజు సర్వదుర్గాచ్ఛేదక యంత్రాలను ఉపయోగించి తూర్పు ద్వారముపై గవిసినాడు ... ఎడతెగని యుద్ధం జరుగుచునే ఉన్నది"[2] అనిరాశారు.

బాపిరాజుగారి వర్ణనా కౌశలాన్ని గురించి డా. ముప్పవరపు సత్యనారాయణగారు "ఈ విధంగా బాపిరాజుగారు అనితరమైన సామర్థ్యంతో పెక్కు కోణాలనుండి తమ వర్ణనా కౌశలాన్ని ప్రదర్శించి నవలకు మంచి పుష్టిని చేకూర్చారు. బాపిరాజుగారి నవలలు చదువుతుంటే సినిమా చూస్తున్న అనుభూతి కలుగుతుంది అని పలువురు భావించడానికి ఈ విధమైన వర్ణనలే ప్రధాన కారణం,"[3] అని అభిప్రాయపడ్డారు.

---

1. గోనగన్నారెడ్డి, అడివిబాపిరాజు., పు; 39.
2. పైదే; పు. 372, 373.
3. శ్రీ అడివిబాపిరాజు నవలాసాహిత్యానుశీలనం, డా. ముప్పవరపు సత్యనారాయణ, పు; 249.

6.1.6. పాటలు, గేయాలు : బాపిరాజుగారు స్వయంగా కవి. ఆయన నవలల్లో, ముఖ్యంగా చారిత్రక నవలల్లో పాఠకుల మనస్సులను ఎక్కువగా ప్రభావితం చేసేందుకు, ఆహ్లాదాన్ని కల్గించేందుకు సందర్భానుసారంగా ఎన్నో పాటలను చొప్పించారు. కేవలం వారి నవలల్లోని పాటలన్నీ తీసి వేరుగా రాసిన ఒక పెద్ద గేయ సంపుటి అవుతుంది. ఆయన నవలల్లో బ్రహ్మదత్తుడు, అడవి శాంతిశ్రీ, అన్నాంబిక, రుద్రమదేవి, హిమబిందు, చంద్రబాల, నాగబంధునిక, తారానిక, అంశుమతి, మాధవీలత మొదలైన వారు చక్కని గాయకులు. వీరుకాక వసంతోత్సవ సమయాల్లో రాజుకు, రాణికి స్వాగత వచనాలు పలికేటప్పుడు, సభా వేదికల మీద, సందర్భానుసారంగా అనేకమంది గాయకులు పాటలు పాడారు. బాపిరాజుగారే స్వయంగా గొప్ప గాయకులు. అందుకే వారి నవలల్లో అనేక రకాలైన పాటలు చోటు చేసుకొన్నాయి.

ప్రభువులు పట్టణాన్ని సందర్శించడానికి వస్తే బాలబాలికలు బారులుతీరి వారిని ఆహ్వానిస్తూ పాటలు పాడే సంప్రదాయం నేటికీ ఉంది. రుద్రమదేవి ఓరుగల్లు వస్తే ఆమెకు స్వాగతం చెప్తూ నూరుమంది బాలబాలికలు కలసిపాడిన పాట "మా ప్రభువులు మా రాజు మహావీరుడయ్యా! ... జయజయ కాకతీయ వంశజ రాజచంద్ర"[1]

1. గోనగన్నారెడ్డి, అడివిబాపిరాజు., పు; 45.

అడవి శాంతిశ్రీ నవలలో వసంతోత్సవ సందర్భంలో బాలబాలికలు యువరాజును వసంతదేవునిగా అలంకరించి అతని చుట్టూ చేరి నాట్యంచేస్తూ "జయ జయ జయ జయ వసంత ... జయమధుదేవా!"[1] అంటూ పాడారు.

హిమబిందు నవలలో ఎడ్ల బండ్ల పందెంలో గెలిచిన సువర్ణశ్రీకి రాజుగారు సన్మానంచేసే సభలో రాచకన్నెలు, నాట్యగురువు కలసి నృత్యంచేస్తూ పాడిన పాట "ఈ విజయ గీతింప ... అదియె నిర్వాణము".[2]

అంశుమతి నవలలో అంశుమతి చెలికత్తెలు, పడవలో ప్రయాణించేస్తూ గోదావరి నదిని గురించి "గోదావరీ మాత ... పాడవే గౌతమికి ప్రణుతులొసగే పాట"[3] అంటూ పాడారు.

ఈ విధంగా మంగళాత్మకమైన పాటలు, భావానుగుణమైన పాటలు, సరసోక్తులతో కూడిన పాటలు, ప్రేమగీతాలు, దేశభక్తిగేయాలు, సందర్భానుసారంగా రచించి బాపిరాజుగారు నవలలకు పుష్టి కలిగించారు. వీరి చారిత్రక నవలల్లో కన్పించే పాటలు ఆయా సందర్భాలకు పరిపోషకంగా ఉండడమే కాకుండా, విడివిడిగా పరిశీలించినా భావయుక్తమై, ఆహ్లాద భరితమై స్వయంసంపూర్ణకంగా ఉంటాయి.

---

1. అడవి శాంతిశ్రీ, అడివి బాపిరాజు., పు; 63, 64.
2. హిమబిందు, అడివి బాపిరాజు., పు; 54-57.
3. అంశుమతి, అడివి బాపిరాజు., పు; 32-33.

6.1.7. రసపోషణ : "విభావానుభావ సాత్త్వికవ్యభిచారీ భావ సముల్లాసిత మైన స్థాయీభావమే రసము".[1] శృంగార, హాస్య, కరుణ, వీర, రౌద్ర, భయానక, భీభత్స, శాంత, అద్భుత రసాలు పోషింపబడాలి. అందులో శృంగార, వీర రసాలకు ప్రాధాన్యముంటుంది. తక్కినవి అంగరసాలుగా ఉండాలి. అడివి బాపిరాజుగారి చారిత్రక నవలలన్నీ కేవలం చారిత్రక నవలలుగామాత్రమే కాక చారిత్రక కావ్యాలుగా పేరు ప్రఖ్యాతులు పొందాయనడంలో సందేహం ఏమాత్రం లేదు. ఆయన భాష కావ్యభాష అంటారు లాక్షణికులు. కాబట్టి ఆయన నవలల్లో రసపోషణ చక్కగా జరిగింది. ఆయన నవలలన్నీ సుఖాంతాలే అయినా మధ్యమధ్య కరుణ, భీభత్సం మొదలైన రసాలు కూడ పోషించారు.

అడవి శాంతిశ్రీ నవలలో "అయస్కాంతాకర్షణచేవలె ఒకరికొకరు దగ్గరకు మరియు దగ్గరకు వచ్చినారు. మరు నిమేషాన శాంతిశ్రీ, బ్రహ్మదత్తుని కౌగిలింతలో గాఢంగా ఇమిడిపోయింది. ఆ పరమ సుందరి అతని పెదవులకు పరిమళామృత పూర్ణాధరోష్ఠము అందిచ్చినది. అతడు సర్వసృష్టిని మరచి ఆ పెదవి నాఘ్రాణించినాడు. ఆ బాలికను సువ్వున ఎత్తుకొని పోయి, బ్రహ్మదత్తుడు అక్కడనే ఉన్న ఒకపీఠం అధివసించి

1. సాహిత్య సోపానములు, డా. దివాకర్ల వెంకటావధాని., పు.174

ఆమెను ఒడిలో కూర్చుండబెట్టుకొని ఆమె చిబుకము, కపోలాలు, ఫాలము స్పృశించినాడు"[1] ... అనే వర్ణనలో శృంగార రసం ద్యోతకమవుతుంది.

బాపిరాజు గారు వీరరసాన్ని కూడ ఎన్నో చోట్ల పోషించారు. గోనగన్నారెడ్డి లో రుద్రమదేవిని రక్షించేటప్పుడు చాళుక్యవీరభద్రుని సైనికులు హరిహర మురారి దేవుల సైన్యంపై పడినప్పుడు వీరరసం ద్యోతకమవుతుంది.

అడవి శాంతిశ్రీ నవలలో పులమావి మరణానంతరం శోకతప్తురాలైన పెద్దరాణి, చిన్నరాణి తో మాట్లాడే సందర్భంలో కరుణ రసం ఉంది.

హిమబిందు నవలలో 'శిల్ప సందర్శనము' అన్న ఘట్టంలో అద్భుత రసం ఆవిష్కరించడం జరిగింది. ముఖ్యంగా "అచ్చట హిమబిందునకు పరవశత్వమే కలిగినది. ఏమి ఈతని పనితనము! అవి ఆతని శిల్పములా! అవి చిత్రలేఖనములా! అదేమిటి! ఆగోడపై త్రిభంగిగా నిలుచుండిన బాలికా మూర్తి ఎవరు? తానే! తానేల? ఓహో! ... ఇంత అందముగా నున్నదా బొమ్మ! అచ్చముగ హిమబిందు. ఆమెను అచ్చట నాక దేవీ మూర్తివలె రచించినాడీ బాలుడు"[2] అని వర్ణించుటలో అద్భుత రసస్థాయి పెరిగింది

1. అడవి శాంతిశ్రీ, అడవి బాపిరాజు., పు; 314.
2. హిమబిందు, అడవి బాపిరాజు., పు; 139.

భయానక, భీభత్స రసాలు హిమబిందు నవలలో విషకన్య ఘట్టంలో ప్రయోగించారు. "విషబాల కన్నులు తెరచి చూచినది. కర్కశస్థలములపై నామె పడి యున్నది. ఒక పెను బామామెపై ప్రాకుచు చోద్యము చూచుచున్నది. ఆమె ఉలికి పడి లేచి నిలుచున్నది. ఉన్నతములగు చెట్లు, మహోరగముల బోలు తీగలు, కంటకావృత్తములగు పొదలు, కఠిన శిలలతో నిండిన భూమి. ఆమె కన్నులు నులమికొన్నది. వివ్వాల చిత్తయై యామె కెవ్వున వార్చినది. ఆమె కేక ఓ బ! బ! ఓ ఓ బ! అని మారుమ్రోగినది. ఆమె పూర్తిగా వివస్త్రయై యున్నది. ఏమి శిక్ష!"[1]

ఈ విధంగా బాపిరాజుగారు తమ చారిత్రక నవలల్లో అద్భుతంగా రసావిష్కరణ గావించారు.

---

1. హిమబిందు, అడివి బాపిరాజు., పు; 285.

6.2.1. భాష: భావాలను, ఉద్దేశాలను తగిన రీతిలో వ్యక్తం చేయడానికి ఉపయోగపడే సాధనం భాష. సాహిత్యంలో భాష చాల ప్రాముఖ్యం వహిస్తుంది. ఏ రచయితకైనా భాషలో లోతైన ప్రావీణ్యం లేకపోతే అతని రచన ఆశించినంత ప్రభావాన్ని పాఠకునిలో కలిగించదు. ప్రవాహపూర్ణమైన శక్తివంతమైన భాషలో భావాలను రచయిత వ్యక్తీకరిస్తే బంగారుకు తావి అబ్బినట్లు ఉంటుంది

హిందీ సాహిత్యంలో, స్వాతం రాక మునుపు చారిత్రక నవలల్లోని భాష సాధారణంగా ఉర్దూ కలసిన హిందీ భాషగా ఉండేది. ముఖ్యంగా మహమ్మదీయ పాత్రలకు ఈ మిశ్రిత భాషను రచయితలు వాడేవారు. కొన్ని హిందూ పాత్రల్లో కూడ మిశ్రిత భాష చోటు చేసుకొనింది. అక్కడక్కడ సంస్కృత పదాలతో కూడిన భాషా వ్యవహార ధోరణి కూడ ఉండేది. కొన్ని నవలల్లో సాధారణ పాత్రల కోసం సరళ, ఉర్దూ మిశ్రిత హిందీ భాషను రచయితలు వాడారు, అందులో అరబ్బీ ఫారసీ పదాలు చాల తక్కువగా ఉండేవి. అంటే ఆనాటి చారిత్రక నవలల్లో భాష ఉర్దూ ప్రధానమైన హిందీగా ఉండేదనవచ్చును. అరబ్బీ, ఫారసీ, సంస్కృత పదాలు కూడ కొంతవరకు కలసి ఉండేవి.

ప్రముఖ చారిత్రక నవలా కారుడు బృందావన్‌లాల్ వర్మగారు స్వాతంత్ర్యం రాక ముందు నుండి చారిత్రక నవలలు రాస్తుండే వారు. ఆయన నవలల్లో కొన్ని స్వాతంత్ర్యం వచ్చాక వెలుగులోకి వచ్చాయి. స్వాతంత్ర్యం రాక ముందు గఢ్ కుండార్, విరాటాకీ పద్మినీ, ముసాహిబజు, ఝాన్సీకీ రాణీ-

లక్ష్మీబాయి, కచనార్ రాస్తే స్వాతంత్ర్యం వచ్చాక టూటే కాంటే, మృగ నయని, అహిల్యాబాయి, భువన విక్రమ్ రాశారు. స్వాతంత్ర్యం రాక ముందు రచించిన నవలల్లో వీరిభాష స్వభావ సిద్ధంగా ఉండేది. అంటే బుందేల్ ఖండ్ మాండలిక పదాలు ఎక్కువగా దొర్లేవి. స్వాతంత్ర్యం వచ్చాక ఉర్దూ మిశ్రిత హిందీ భాష ఎక్కువగా కన్పిస్తుంది.

బృందావన్ లాల్ వర్మగారికి తమ భావాలను సరళమైన, సాధారణ శైలిలో వ్యక్తం చేసి పాఠకులను ఆనంద పరచడం ఉద్దేశం. భాష, భావం, శీల చిత్రణం మొదలైన వాటి కంటె కథకు ప్రాధాన్య మివ్వడమే తమ ప్రథమ కర్తవ్యంగా ఆయన భావించేవారు. వర్మగారి శబ్ద భండారం చాల విశాలమైంది. ఆయన భాషలో ఐదు విధాలైన శబ్దాలుంటాయి. 1. తత్సమాలు (సంస్కృత సమాలు), 2. తద్భవాలు (సంస్కృత భవాలు), 3. స్థానీయ బుందేల్ ఖండ్ శబ్దాలు, 4. ఉర్దూ ఫారసీ, అరబ్బీ శబ్దాలు, 5. ఆంగ్లేయ పదాలు. ఈ ఐదు రకాల శబ్దాల సమ్మేళనంతో ఆయన భాష సహజ సుందరంగా ఉంటుంది. ఆయన వాడిన పై రకాల శబ్దాలు మచ్చుకు కొన్ని:

**1. తత్సమ శబ్దాలు:** పాపీ, రాక్షస్, సర్వ ద్రోహీ, ఆత్మఘాత్, కర్మఠ్, గరిమ, లఘిమ, స్వచ్ఛ ఉత్ఫుల్ల మొదలైనవి.

**2. తద్భవ శబ్దాలు:** కన్హయ్యా, ఆగ్, అచరజ్, కాంటా, హాత్.

**3. స్థానీయ బుందేల్ ఖండ్ గ్రామీణ పదాలు:**

ఝరప్, టొరియా, గదేలీ, కరమారే, అటక్, ఠరోలీ, అన్ఖాయే మొ॥నవి.

4. **ఉర్దూ, ఫారసీ, అరబ్బీ శబ్దాలు:** సాహెబ్, మసహాలత్, ఫర్జ్, మజార్, జాన్ ఆలం, జహారి పనా, హుజూర్ మొదలైనవి.

5. **ఆంగ్లేయ పదాలు:** డిస్ట్రిక్స్, బోర్డు, డామిట్, ఆర్మీ, కారతూస్ (cartridge) కేప్టెన్ మొదలైనవి.

వర్మగారు తమ నవలల్లో పాత్రోచితమైన భాషను వాడారు. పాత్రల మనస్థితిని, సన్నివేశాన్ని, అవసరాన్ని బట్టి భాషను ఉపయోగించారు.

**పాత్రోచితమైన భాష:** పాత్రకు అనుకూలమైన భాషను ప్రయోగించడం వర్మగారి రచనా వైశిష్ట్యం. ఇందువల్ల రచన స్వాభావికంగా ఉంటుంది. శైలిలోని ధారాశుద్ధి వల్ల రచన సహజంగా ముందుకు సాగిపోతుంది. వర్మగారు హిందూ పాత్రలు సంభాషించేటప్పుడు తత్సమ, తద్భవ, మిశ్రితమైన సంస్కృత పదాలను అధికంగా వాడారు. గ్రామీణ పాత్రలు స్థానిక భాషను మాట్లాడేవారు. అంటే బుందేల్ ఖండ్ ప్రాంత పల్లెటూరి ప్రజలు ఏ భాష మాట్లాడేవారో ఆ భాషనే నవలల్లో ప్రయోగించారు. మహమ్మదీయ పాత్రలు ఉర్దూ, అరబ్బీ, ఫారసీ పదాలు కలసిన భాషను మాట్లాడేవారు. ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించాక ఆంగ్ల భాష పాల్లో చక్కెర కలసి కరగిపోయినట్లుగా మన భాషలో కలసిపోయింది. వర్మగారు కూడ కొన్ని నవలల్లో ఆంగ్ల భాషా పదాలు వాడారు. ముఖ్యంగా 'ఝాన్సీకీ రాణి లక్ష్మీబాయి' నవలలో ఆంగ్ల పదాలు ఎక్కువగా కనబడతాయి. దీనికి కారణం నవలా కథావస్తువు కాలం నాటికి ఆంగ్లేయులు మన దేశంలో ప్రవేశించి తమ శాసనాన్ని ప్రారంభించడమే. అది పాలకుల

భాష కావడం చేత పాలితులైన భారతీయులు ఆ భాషా శబ్దాలతో పరిచయం పెంపొందించుకొన్నారు.

1. **హిందూ పాత్రల భాష :** గఢ్ కుండార్ నవలలో అగ్నిదత్తుడు "నేను అదే పాపాత్ముడైన రాక్షసుణ్ణి, ద్రోహిని, హంతకుణ్ణి. నన్ను చంపండి; నేను యాచిస్తున్నాను. ఆత్మహత్య చేసుకునేంత శక్తి నాకు లేదు"[1] అని అంటాడు.
("మై వహీ పాపీ రాక్షస్ హూఁ, సర్వద్రోహీ, సర్వహంత్. ముఝే మారో భిక్షా మాంగ్ తా హూఁ. మేరే హృదయ్ మే ఇత్ నీ శక్తి నహీ హై కి ఆత్మఘాత్ కర్ సకూఁ")

2. **గ్రామీణ పాత్రల భాష :** మృగనయనీ నవలలో నిన్ని లాఖీలు నవల ప్రారంభంలో మాట్లాడుకొనే భాష గ్రామీణ భాష. "అవును. మూడవ దానికి అవసరమేముందిలే. నీకు అన్నకూ ఇద్దరికే కలసి ఒక్కటి సరిపోతుందిగా" ("హాఁ. తీసరీ కీ అటక్ భీ క్యా హై. తుమ్హారే ఔర్ భయ్యా కే లియే ఏక్ హీ బహుత్ హై") "అదిగో! మరలా ప్రారంభించావూ! సరసాలు. ఊరిలో వాళ్ళు అసలే కోపంగా ఉన్నారు. ఎప్పుడైనా నీ నోటనుండి ఇటువంటి మాటలు ఎవరి ముందైనా వెలువడితే ఏమి జరుగుతుందో తెలుసా?" ("ఫిర్ తుమ్‌నే ఠఠోలీ కీ. గాఁవ్ వాలే యోఁ హీ అన్ ఖాయేసే దేఖ్తే హైఁ. కభీ తుమ్హారే ముహ్ సే ఐసీ బాత్ కిసీ కే సామ్‌నే నికల్ జాయే తో క్యా హోగా?")

మృగ: పదిమందికీ తెలిస్తే ఇంకా మంచిది. పెళ్ళి చేయించేస్తారు. (బాత్ ఉజాగర్ హో జాయే తో అచ్ఛా హీ హై. బ్యాహ్ రచాదియా జాయేగా)

---

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ, పృ: 426

లాఖీ : గ్రామ పెద్దలు జరగనిస్తారా ! ( గాఁవ్ కే పంచ్ నహీ హోనే దేంగే ! )

నిన్నీ : ఉంపుడుకత్తెలా ఉంటే గ్రామపెద్దలు నోరెత్తి ఏమీ అనరు. కానీ పెండ్లి చేసుకుంటే మాత్రం వారి నెత్తిమీద పిడుగు పడ్డట్టు భావిస్తారు."[1] ( రఖేలీకీ తరహ్ రఖ్‌లేతో గాఁవ్ కే పంచ్ కుఛ్ నహీ కహేంగే. బ్యాహ హో జాయేతో మానో ఉన్ పర్ గాజ్ గిర్ పడేగీ )

**3. నటవర్గపు వారి భాష :** నటవర్గం లోని నాయకురాలి భాష చాంచల్యం, నీచత్వం నానుడితో నిండి ఉన్నది. "ఈ జీవితమంతా అంట్లు తోమడంతోనే గడప లేదనే జ్ఞాపకముంచుకో. నీవు ఇంకా చిన్న పిల్లవు. ఒక సారి చెప్పిన మాట నీవు మరచి పోతావేమో ?"[2] అంది ( కచ్చీ గోలియాఁ నహీ కేలే హూఁ. యహ్ సారీ జిందగీ తూ ఠోకరీ హీ హై. అభీ భలే హీ భూల్ జాయియే )

**4. స్థానీయ బుందేల్ ఖండ్ భాష :** గఢ్ కుండార్ నవలలో నాగదేవుడు సేవకుడైన అర్జున్ కుమ్హార్‌తో తన ప్రేమ లేఖను హేమవతికి ఇమ్మని చెప్పినప్పుడు అతడు ఈ విధంగా చెప్తాడు.

అర్జున్ : "మీరు నాకు ప్రభువులు; అన్నదాతలు. తమ కొరకు ఈ మాత్రం పని చేయలేనా. తమ ఇష్ట ప్రకారం నాకు జాబు ఇవ్వండి"[3] ( అపున్ రాజా హో. మోరే అన్నదాతా హో. ఈసై మై కఛు కై నఈ సక్తా. బస ఈ మర్జీ హోతా, తో మోయా చిఠ్ఠీ దయీ జాయ్ )

**5. ఉర్దూ మిశ్రిత హిందీ భాష :** మృగనయనీ నవలలో మహమ్మదీయ

---

1. మృగనయనీ – బృం. లాల్ వర్మ, పు: 78.
2. పైదే., పు: 113.
3. గఢ్ కుండార్ – ,, ,, పు: 62.

దర్బారులో ఏ విధమైన భాషను ప్రయోగించే వారో, అదే విధమైన భాషను వర్మగారు ప్రయోగించారు. "గయాసు మత్తుతో నిండిన స్వరం హెచ్చిస్తూ, తగ్గిస్తూ అన్నాడు - నెమలి అందమైన పక్షి. అయితే మీలో ఎవరూ నెమళ్ళు కారుగా! దాన్ని చూట్టంతోనే మీలోని లోటు మిమ్మల్ని దగా చేస్తుందను కోవటానికి.... కోతుల బొమ్మలు చెక్కడంతో ప్రయోజనం అంతులేకుండా పెంచివేశారు శిల్పులు. వీరంతా వాస్తవానికి కోతులు. అక్షరాలా కోతులే"[1] (గయాస్ నే సరూర్ కే లహజ్ మేఁ బతలాయా - మోర్ ఖూబ్‌సూరత్ చిడియా హై..... బందర్ కీ తస్వీర్ పేష్ కర్నే మేఁ మసలహత్ కీ హద్ కర్ దీ. ఉన్ కారీగరో మేఁ. ఆప్ సబ్ అసల్ మే బందర్ హై. బిల్‌కుల్ బందర్)

## పాత్రల స్వభావాన్ని, నడవడికను, వాతావరణాన్ని అనుసరించిన భాష:

మృగనయనీ నవలలో మృగనయనీ మానసింహుల మధ్యా సంభాషణలోని భాష గంభీరంగా ఉంటుంది. నటవర్గం వారి భాషలో గాంభీర్యం కనిపించదు. ఉదా॥ మృగనయనీ, మానసింహుల మధ్య సంభాషణ:

మాన: "సభా భవనానికి నడవండి - ముందు తాండవ నృత్యం తరువాత వారి
గానం, వాయిద్యం (మానసింహ్ నే కహా సభా భవన్ మేఁ చలో.
పహలే తాండవ్ నృత్య హోగా ఫిర్ ఉన్‌కా గాయన్ వాదన్)

మృగ: వారి ముందు జరుగదు తాండవ నృత్యం. (ఉన్ కే సామ్‌నే నహీ హోగా
తాండవ నృత్య)

, వాయిద్యం నేర్చుకొన్నారు -

1. మృగనయనీ - బృం. లాల్ వర్మ, పు: 67.

మరొకరి వద్ద శాస్త్రాలు.( వే తుమ్హారే గురుజన్ హైఁ. ఏక్ సే గాయన్ వాదన్ సీఖా। దూస్‌రేసే శాస్త్ర )

మృగ: మీ ముందు తప్ప మరే పురుషుని ఎదుట నేను నృత్యం చేయను; లాఖీ కూడా ..[1] ( సివాయ్ ఆప్ కే ఔర్ కిసీ పురుష్ కే సామ్‌నే న మై నృ కరూంగీ ఔర్ న లాఖీ)

**నట వర్గం వారి సంభాషణ:** నటవర్గం వారికి మాండు సైనికులకు మధ్య సంభాషణ. నట వర్గం వారిలో ఒక పడుచుస్త్రీ బ్రతిమలాడుతూ ఇలా చెప్పింది. "బాబుగారూ! ఎందుకిట్లా మీరపడి కరవ వచ్చినట్లుగా మాట్లాడుతున్నారు. మా ఆటలు ప్రదర్శనాలు చూడండి. మేము చేసే పనులు, నృత్యం, డోలు వాయించుతూ ఉంటే పరుగెత్తరుం ... ఆస్త్రీ మొహంలో వాస్తవంగా దీనత్వం లేదు. పైగా కొంటెతనం కనిపిస్తూ ఉంది. ఒయ్యారంగా చేతులు మొహం తిప్పుతూ కాల్పుల సైనికుల వైపు కొంట చూపు విసిరింది. ఆమెను చూచి దళ నాయకుడు 'ఎటువంటి జాణ. ఎంత అసభ్యపు ఆడది. అయినా నటజాతిదే కదా' ..[2] ( ఏక్ యువతీ నే గిడ్‌గిడాహట్ కే సాథ్ కహా, – పరంతు ఉస్‌కే ఆంఖోఁ మేఁ గిడ్‌గిడాహట్ నహీ థీ, అరే మహారాజ్ క్యోఁ యోఁ హీ ఖాయే జాతే హో. హమారా తమాషా దేఖో. నాచ్, ఢోల్‌కే బజాతే హుయే దౌడ్‌నా.. మార్గ దర్శకోఁకే ప్రతి షరారత్ భరీ ఆంఖ్ చలాయీ. అగువానే సోచా 'కితనీ షోహద్ హై నటనీ హీ తో ఠహరీ).

---

1. మృగనయనీ – బృం. లాల్ వర్మా., పు; 383.

2. వైదే., పు: 87.

సరస సంభాషణ : ప్రేమ ప్రసంగాల చిత్రణలో శబ్దాలు కోమలంగానూ, మధురంగానూ ఉండడం వల్ల భాష సరసంగాను, రసవంతంగాను ఉంది. మృగనయనీ నవలలో మానసింహుడు, మృగనయనీల మధ్య సంభాషణ మధురంగాను, కోమలంగాను ఉంది. ఇద్దరూ ఒకే పీఠం మీద కూర్చొని ఉన్నారు ఇతరులెవ్వరూ అక్కడ లేరు. (ఏక్ మంచ్ పర్ దోనోం బైఠే హుయే థే. కోయీ ఔర్ వహాఁ నథా)

మృగ: వీణ వాయించడం చాల రోజులకు గాని రాదన్నట్లు తోస్తుంది నాకు.

(వీణా కా బజానా బహుత్ దినోం మే ఆ పావేగా ముఝ్ కో ఐసా లగనే లగా హై)

మాన: నీ చిరునవ్వులతో సూర్య కిరణాలెందుకు ఆటలాడుకుంటాయి?

(తుమ్హారీ ముస్కానోం కే సాథ్ సూర్య కీ కిరణేం క్యోం ఖేల్ నే లగ్ తీ హై)

మృగ: కిరణాలు ఆడుతున్నట్లు నాకెక్కడా కనిపించడం లేదు. మీకు ఏమాత్రం కనిపించినా అది వట్టిదే. (ముఝ్ కో తో కిరణేం కహీం ఖేల్ తీ నహీం దిఖలాయీ పడ్ తీ. ఆప్ కో జో కుఛ్ భీ దిఖలాయీ పడ్ జాయ్ సో థోడా హై)

మానసింహుడు ఆమెను తన అంకమున చేర్చుకొన్నాడు.

(మాన సింహ్ నే ఉస్ కో అంక్ మే భర్ లియా)

మాన: ఇప్పుడు చెప్పు ఏమంటున్నావు? (అబ్ కహో క్యా కహ్ రహీ థీ?)

మృగ: నేను ఎప్పుడైన ఏమైనా చెప్పడం కూడానా? మీరెప్పుడూ ఈ విధంగానే నా నోరు మూసి వేస్తుంటారుగా అంటూ ముసి ముసి నవ్వులు కురిపించింది.

(మై కభీ కుఛ్ కహనే భీ పాతీ హూం, ఆప్ సదా ఇస్ తరహ్ మేరా ముహ్

బంద్ కర్ దేతే హైఁ( - ముస్కరాయి)

మాన : అవును నీ నోరు మూస్తాను. మూస్తూనే ఉంటాను."[1]

( హా! కర్ దేతాహూఁ( ఔర్ కర్‌తా రహుంగా)

**యుద్ధ వర్ణన లోని భాష:** యుద్ధ వర్ణనలో భాష ఓజోగుణంతో కూడి ఉంది.

ఉదా॥ ఝూన్సీ కీ రాణి లక్ష్మీబాయి నవల్లో-

రాణి గుర్రాన్ని అధిరోహించి నోటితో కళ్ళెం పట్టుకొని, రెండు చేతుల్తో కత్తులు తీసుకొని భీకరంగా పోరాడుతూ శత్రువులను చీల్చిచెండాడుతూ దారి చేసుకొంటూ ముందుకు వెళుతూ ఉంది ... ఒక తెల్లవాడు రాణి తలపై కత్తితో కొట్టాడు. ఆ దెబ్బ కుడివైపు పడింది. ఏ భాగంపైన దెబ్బ పడిందో ఆభాగం తెగిపడి పోయింది. కుడికన్ను ఊడి క్రింద పడిపోయింది. ఈ పరిస్థితుల్లో ఆమె ఆ ఘాతకునిపై కత్తి ఝుళిపించి ఒక వెయ్యి వరికేసింది. రాణి క్రింద పడకుండా రామచంద్ర దేశ్‌ముఖ్ ఆమెను పట్టుకున్నాడు"[2] ( రాణి నే ఘోడే కీ పీఠ్‌పర్ బైఠ్‌కర్ , ఘోడేకీ లగామ్ అప్నే దాంతో మే థామీ ఔర్ దోనోఁ( హాథోఁ( సే తలవార్ చలాకర్ అప్‌నా మార్గ్ బనానా ఆరంభ్ కర్ దియా .... అంగరేజ్ సవార్ నే తల్వార్ కా వార్ రాణీ కే సర్‌పర్ కియా. వహ ఉనకే దాయీ ఓర్ పడా. సిర్ కా వహ హిస్సా కట్ గయా ఔర్ దాయీ ఆంఖ్ బాహర్ నికల్ పడీ. ఇస్‌పర్‌భీ ఉన్హోనే అప్నే ఘాతక్ పర్ తల్వార్ చలాకర్ ఔర్ ఉస్‌కా కంధా కాట్ దియా ... రామచంద్ర దేశముఖ్ ఘోడే సే గిరతీ హుయీ రానీకో సాధే హుయే హైఁ( )

1. మృగనయనీ — బృం. లాల్ వర్మ., పు: 227.

2. ఝూన్సీకీ రాణి లక్ష్మీబాయి — " పు: 458-460.

బంద్ కర్ దేతే హైఁ( - ముస్కురాయి)

మాన : అవును నీ నోరు మూస్తాను. మూస్తూనే ఉంటాను."[1]

( హాఁ! కర్ దేతాహూఁ( ఔర్ కర్‌తా రహుంగా )

**యుద్ధ వర్ణన లోని భాష:** యుద్ధ వర్ణనలో భాష ఓజోగుణంతో కూడి ఉంది.

ఉదా॥ ఝూన్సీ కీ రాణీ లక్ష్మీబాయి నవల్లో-

"రాణి గుర్రాన్ని అధిరోహించి నోటితో కళ్ళెం పట్టుకొని, రెండు చేతుల్లో కత్తులు తీసుకొని భీకరంగా పోరాడుతూ శత్రువులను చీల్చిచెండాడుతూ దారి చేసుకొంటూ ముందుకు వెళుతూ ఉంది ... ఒక తెల్లవాడు రాణి తలపై కత్తితో కొట్టాడు. ఆ దెబ్బ కుడివైపు పడింది. ఏ భాగంపైన దెబ్బ పడిందో ఆభాగం తెగిపడి పోయింది. కుడికన్ను ఊడి క్రింద పడిపోయింది. ఈ పరిస్థితుల్లో ఆమె ఆ ఘాతకునిపై కత్తి ఝుళిపించి ఒక దెబ్బ వరికేసింది. రాణి క్రింద పడకుండా రామచంద్ర దేశ్‌ముఖ్ ఆమెను పట్టుకున్నారు"[2] ( రాణీ నే ఘోడే కీ పీఠ్ పర్ బైఠ్‌కర్ , ఘోడే కీ లగామ్ అప్నే దాంతోం మే థామీ ఔర్ దోనోం హాథోం సే తలవార్ చలాంకర్ అప్‌నా మార్గ్ బనానా ఆరంభ్ కర్ దియా .... అంగరేజ్ సవార్ నే తల్వార్ కా వార్ రాణీ కే సర్ పర్ కియా. వహ ఉన్‌కే దాయీ ఓర్ పడా. సిర్ కా వహ హిస్సా కట్ గయా ఔర్ దాయీ ఆంఖ్ బాహర్ నికల్ పడీ. ఇస్‌పర్‌భీ ఉన్హోంనే అప్నే ఘాతక్ పర్ తల్వార్ చలాంకర్ ఔర్ ఉస్‌కా కంధా కాట్ దియా ... రామచంద్ర దేశ్‌ముఖ్ ఘోడే సే గిరతీ హుయీ రానీ కో సాధే హుయే హైఁ( )

1. మృగనయనీ — బృం. లాల్ వర్మ., పు: 227.

2. ఝూన్సీకీ రాణీ లక్ష్మీబాయి — " పు: 458-460.

**వ్యంగ్య పూర్ణమైన భాష:** భార్యాభర్తల కలహ పూర్ణమైన సంభాషణలో వ్యంగ్యం మిళితమైంది. ఇటువంటి భాషను వర్మగారు ప్రయోగించారు.

ఒకసారి రాజైన మానసింహుడు రివాజు ప్రకారం పెద్దరాణి సుమన మోహిని దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు ఆమె వ్యంగ్యంతో కూడిన స్వరంతో ఇలా మాటాడుతుంది.

సుమన: చాల అనుగ్రహం చూపించారు, మహారాజులు పొరపాటున ఈ దిశకు రాలేదు కదా? ( బడీ కృపాకీ, మహరాజ్ కుఛ్ భూల్ సే పడే ఇస్ దిశా మేఁ) ... నా అదృష్టం. మహారాజులు నాకెంత గౌరవం ప్రసాదిస్తున్నారు. (- మేరా బడా భాగ్య జో మహరాజ్ ముఝ్‌కో ఇత్‌నా ఆదర్ దే రహే హైఁ) ... ఇక్కడ ఆమె మనస్సుకు - ఇంత త్వరలో ఆనందంగా ఎట్లా ఉంటుంది? రాయీ అడవుల్లోని స్వేచ్ఛా వాయువు - అడవిదున్నలు, అడవి పందులు, సింహాలు - పులులు - ధనుర్బాణాలు, ఇంటి ఆవులు ఎక్కడ? గ్వాలియర్ కోటలోని ఈ ఏకాంత జీవితమెక్కడ? ఇక్కడ నదీ లేదు, పల్లెటూరూ లేదు. పల్లెటూరి రైతులూ లేరు. ఆవూ లేదు - పేడా లేదు..."[1] ( మన్ ఉన్కా కైసే యహాఁ ఇత్‌నీ జల్దీ లగేగా? కహాఁ రాయీ కే జంగలోఁ కా ముక్త్ పవన్, అర్‌నే, భైంసే, సుఅర్, నాహర్, తీర్ కమాన్; ఘుర్ కీ గాయ్ ఔర్ కహాఁ గ్వాలియర్ కే కిలే కా ఏకాన్త్! యహాఁ న నదీ హై, న గాఁవ్ కే కిసాన్!! న గాయ్, న గోబర్!!! )

**ఆవేశపూరితమైన భాష:**
ఇలాంటి సన్నివేశాల్లో భాష తీవ్రంగా ఉంటుంది. గఢ్‌కుండార్

1. మృగనయనీ - బృం.లాల్ వర్మ., పృ. 233.

నవలలో నాగదేవుడు హేమవతితో తన ప్రేమను వెల్లడిస్తూ, ఆమె తనను ప్రేమిస్తున్నాననే ఒక్క మాటను చెప్పమని ప్రతిమాలు కొంటాడు. అప్పుడు హేమవతి - "మేఘాల చాటునుండి సూర్యుడు ఒక్కసారిగా మూడవ ఝామున ఎంత ప్రచండంగా బయటపడ్డాడో ఆ విధంగా హేమవతి మొహం జ్వలించి పోయింది. ... ( జిస్ తరఫ్ ధువాం ధార్ బాద్‌లోం కో ఫాడ్ కర్ ఏక్‌దమ్ తీసరే ప్రహర్ కా సూర్య నికల్ పడ్‌తాహై హేమవతీ కా ముహ్ జ్వలంత్ హో ఉఠా) కానీ నాగదేవుడు ఎంత చెప్పినా వినకుండా ప్రేమ సంభాషణలు మాట్లాడే టప్పటికి - హేమవతి నాగినివలె బుసగొడ్తూ "ఇప్పుడు మీరు కనుక ఇక్కడ నుంచి వెళ్ళక పోతే నేను వెళ్ళి పోతాను. బుందేలు కన్య ఇలాంటి మాటలు వినదు. సహించదు. ఖంగారు రాజుకి, బుందేల్ కన్యను అవమాన పరచే శక్తి ఉన్నదా"[1] అని అంటుంది.

(హేమవతీ నే నాగినీ కీ తరహ్ ఫుఫ్‌కార్ కర్ కహా, యది ఆప్ యహాం సే నహీం జాతే హైం తో మై యహాం సే జాతీహూం. బుందేల్ కన్యా న ఐసీ భాషా సున్ సక్తీ హై ఔర్ న సహ్ సక్తీ హై. ఔర్ ఖంగార్ రాజా హోనే పర్ భీ బుందేల్ కన్యా కా అప్‌మాన్ కర్నేకీ శక్తీ నహీం రఖ్‌తా)

**కావ్యభాష:** బుందేల్ ఖండానికి చెందిన ప్రకృతి సౌందర్యాన్ని నదులను, సరోవరాలను, పర్వతాలను వర్ణించే సమయంలో కావ్యభాషను వాడారు.

టూటే కాంటే నవలలో నూర్‌బాయ్ ఒక ఫారసీ గజల్‌ను పాడింది ఆ గజల్‌కు అర్థాన్ని వర్మగారు కావ్యభాషలో రాశారు. "ఒక పికిలి పిట్ట

1. గఢ్ కుండార్ - బృం. లాల్ వర్మ, పు: 265.

(బుల్ బుల్ పిట్ట) విచ్చుతున్న గులాబీ చెంతకు వెళ్ళి నెమ్మదిగా, రాగ యుక్తంగా ఏమి? నేను ఇంకా దగ్గరగా నీ చెంతకు రావచ్చునా? నాకు రావాలని ఉంది. కానీ నీ ముళ్ళ భయం వల్ల రాలేక పోతున్నాను. నీకే ముళ్ళు లేకుంటే నిన్ను అడక్కుండానే నీ కొమ్మపై వచ్చి వాలి ఉండేదాన్ని అని పాట పాడినట్లు అడిగింది. వీచే గాలికి గులాబీలు అటు ఇటు కదలుతూ ఉంది. పికిలి పిట్ట అడిగినదానికి ఒకసారి అవునన్నట్టుగా, ఇంకోసారి కాదన్నట్లుగా గులాబీ జవాబిస్తూందేమో అన్నట్టు అన్పించింది. పికిలి పిట్ట పాడుతూ పాడుతూ పాట ఆపింది. అయినా గులాబీ తల ఊపడం మానలేదు. పికిలి పిట్టకు ఇంకా గులాబీ ఎందుకు తల ఊపుతుందో అర్థంకాలేదు. ఆఖరికి గులాబీని ఇలా ప్రశ్నించింది. "ఏమీ? నీకు చెవులున్నాయా? ఉంటే ఈ విధంగా ఎందుకు ఇంకా తల ఊపుతావు?" అని అనుకొంటుంది.

(బుల్ బుల్ ఖిల్ తే హుయే గులాబ్ కే పాస్ బార్ బార్ చిహక్ చిహక్ కర్ పూఛ్ తీ హై. క్యామై ఔర్ నికట్ ఆ సక్తీ హూం? గా గాకర్ కహతీ హై, తుమ్హారా కాంటే కాడర్ న హోతాతో బినా పూఛే హీ డాల్ పర్ ఆ బైఠ్ తీ. గులాబ్ హవాకే ఝోకోం కీ గతి కే అనుసార్ కభీ నాహీ కా ఔర్ ఔర్ కభీ హామీకా సిర్ హిలా హిలా దేతా హై. గాతే గాతే బుల్ బుల్ కా గలా బైఠ్ గయా, పరంతు గులాబ్ కే ఉస్ ప్రకార్ సిర్ హిలానే కా అర్థ్ బిచారీ బుల్ బుల్ కీ సమఝ్ మే న ఆయా. తబ్ ఉస్ నాచార్ నే అంత్ మే, జవాబ్ భరే ఉస్ గులాబ్ సే ప్రశ్న కియా, క్యా తుమ్హారే కాన్ హై? ఔర్

1. టూటే కాంటే - బృం. లాల్ వర్మ., పు: 30.

ఖుద్ చహక్‌కర్ ఉత్తర్ దే లియా హోతే తో క్యా తుమ్ ఇస్ ప్రకార్ సిర్ హిలా హిలాకర్ రహ్ జాతే ? )

వర్మగారి నవలల్లో భాష అనేక భాషా శబ్దాల మిళితం. ముఖ్యంగా బుందేల్ భాషకు సంబంధించిన అనేక పదాలు కలసిపోయాయి.

**నామవాచకాలుగా :**

1. టౌరియా ( ఛోటీ పహాడీ) - చిన్నగుట్ట

2. పత్ ఖి (రాత్ మే బోల్‌నే వాలీ చిడియా) రాత్రిపూట కూసే పక్షి.

3. ఢీ ( నదీ కా ఊంచా కినారా) ఎత్తైన నదిగట్టు .

**రెండు శబ్దాల కలయికచే ఏర్పడిన పదాలు :**

కివర్ - మినర్ ( ఆవకాని) ముందు వెనుక .

రినా-ఝునా ( హీన్) హీనమైన

అటక్ - భర్ - ( ఆవశ్యకత) - ఆవశ్యకత.

**బుందేల్ ఖండ్‌కు చెందిన విశేష శబ్దాలు :**

చందీలీ లహరే (చాందీ జైసే తరంగే) వెండివంటి అలలు.

ధూ భరే బాదల్ ( ధుయేకా బాదల్) పొగవంటి మేఘాలు.

ముఛారియా ( బడీ మూఁఛ్‌వాలా) పెద్దపెద్ద మీసాలు కలవాడు.

**క్రియా పదాలు :**

కీంచ్‌నా ( భుఛ్‌నా) - గుచ్చుకొనడం

బరకానా ( బచానా ) - రక్షించడం.

రాన్‌నా ( స్వీకార్ కర్‌నా)- స్వీకరించడం.

ఈ విధంగా వర్మగారి నవలల్లో పాత్రోచిత భాషతో పాటు బుందేల్ ఖండ్ భాష ఉపయోగం విశేషంగా కనిపిస్తుంది.

**6.2.2. శైలి:** ఏ రచనకైనా శైలి జీవలక్షణం. సాహిత్య సృష్టికి పరిపూర్ణత 'శైలి' వల్ల సిద్ధిస్తుంది. "There is no complete creation without style"[1]

"1959 లో ప్రచురించిన ఆప్టే సంస్కృతం - ఇంగ్లీషు నిఘంటువు మూడో సంపుటంలో శైలికి మూడర్థాలున్నాయి.

1. A short explanation of gramatical aphorism.
2. A Mode of expression or interpretation.
3. Behaviour, manner of acting, conduct course"[2]

పుట్టి పెరిగిన ప్రాంతం, ఉన్న పరిసరాలు, కుటుంబ సంస్కారం, నిజ సంస్కారం మొదలైన అంశాలు శైలిమీద ప్రభావం చూపిస్తాయి. పరంపరగా జాతి జీవనానికి ప్రతీకలైన దేశ్య శబ్దాలతో నిండిన రచన ఒకటి, అన్యదేశ్యాలు విశృంఖలంగా వాడిన రచన మరొకటి. అలాగే ఒక్కొక్క రచన చిన్న చిన్న తేలిక మాటలతో ఉంటే, మరొక రచన దీర్ఘ సమాసాల తోనూ రూపొందుతూ ఉంటుంది. వర్మగారి చారిత్రక నవలల్లోని శైలిలో ఈ రెండు లక్షణాలు కన్పిస్తాయి

**వర్ణనాత్మక శైలి:** వర్మగారు తన చారిత్రక నవలల్లో అనేక చోట్ల వర్ణనాత్మక

1. The Art of fiction (Introduction) – Hendry James -, P:17.

2. తెలుగు నవల-మూడు సంవత్సరాలు (భాష, శైలి, మాండలికత) పోరంకి దక్షిణామూర్తి -, పు: 92.

శైలిని ప్రయోగించి ఉన్నారు. ఆయన వ్యక్తిత్వం ఈ శైలిలో ప్రతిఫలిస్తూ ఉంటుంది. చారిత్రక నవలలు అధికంగా చదివే పాఠకులు కొన్ని పంక్తులు చదవగానే, ఈ శైలి వర్మ గారిదని గ్రహించ గలుగుతారు.

ఉ॥ "వర్షాకాలం అంతమయింది. ఆశ్వయుజమాసం ప్రారంభమయింది. అప్పుడప్పుడు పల్చటి మబ్బులు కనబడుతున్నాయి. కాని ఆ సాయంకాలం మాత్రం ఆకాశం పూర్తిగా నిర్మలంగా ఉంది. కొద్దిసేపట్లో సూర్యాస్తమయం కావస్తుంది."[1] ఇలాంటి వర్ణనల్లో చిత్రాత్మకత గోచరిస్తూ ఉంటుంది. అంటే చిత్తరువును చూచినవిధంగా భావన కలుగుతుంది.

**భావాత్మక శైలి:** పాత్రల మానసిక సంఘర్షణలను, మనస్సులలోని భావాలను స్పష్టంగా చెప్పవలసి వచ్చినపుడు భావాత్మకశైలిని ఉపయోగిస్తారు. వర్మగారు భావాత్మక శైలిలో కూడ అనేకచోట్ల రచనగావించారు.

'మృగనయని' నవలలో "నేనెక్కడికి వెళ్తున్నా ప్రియమైన నదీ సౌందర్యాన్ని, వేగంగా ప్రవహించే జలాన్ని నా దగ్గర ఉంచుకొంటాను. వేరొక చోటకి పోతే దీనిని బంధించి నాతో కూడ తీసుకుపోతాను. గాలిలో ఊగులాడే పైరు వెన్నులను కాగితంపై చిత్రిస్తాను. పర్వతాలకు శౌన్నత్యాలను ఒకే చోట చేరుస్తాను."[2]

**వ్యంగ్యాత్మకశైలి:** వ్యంగ్యంగా చిత్రించడానికి కాని పరిహసించడానికి గాని ఉపయోగించే శైలిని సంకేతాత్మకశైలి లేక వ్యంగ్యాత్మకశైలి అంటారు.

1. ఝాన్సీ కి రాణి లక్ష్మీబాయి - బృం. లాల్ వర్మ., పు: 14.
2. మృగనయనీ — " పు: 233.

మృగ నయని నవలలో రాజా మానసింహుని పెద్ద రాణి సుమన మోహిని ఎప్పుడూ రాజుతో వ్యంగ్యంగానే మాట్లాడుతుంది.

"నేను పురుషుని దగ్గర సంగీతం నేర్చుకోనా? ఏమయింది మహారాజా! మీకు? రాణి మృగనయని విషయం వేరు. పల్లెలో నివసించేది. కొద్దిరోజులు ముందు వరకు పల్లెల్లో, అడవుల్లో అందరి ఎదుటా తిరుగుతూ ఉండేది. కానీ నా ఇంట ఆచార వ్యవహారాలు ఇలాంటివి కావు ... ఆమె ఇంత తొందరగా ఇక్కడ సర్దుకు పోతుందా! రాయి గ్రామ అడవుల్లోని స్వేచ్ఛావాయువులు, అడవిదుమ్మలు, అడవి పండులు, సింహాలు, పులులు, ధనుర్బాణాలు, ఇంత ఆ పులు ఎక్కడ? గ్వాలియర్ కోటలోని ఏకాంత జీవిత మెక్కడ. ఇక్కడ నది లేదు. పల్లెటూరు లేదు. ఆవు లేదు. పేడ లేదు."[1]

**ఆలంకారిక శైలి :** వర్మగారు తమ నవలల్లో అక్కడక్కడ ఆలంకారిక శైలిని కూడా ప్రయోగించారు. 'గఢ్ కుండార్' నవలలో అందమైన నెమలి ఒక కొమ్మ మీదనుండి మరో కొమ్మ మీదికి దూకినట్లుగా, అగ్నిదత్తుని చెల్లెలు తార తన ప్రయత్నంలో సాఫల్యాన్ని పొంది చిరునవ్వుతో వెడలిపోయింది."[2]

'విరాటాకీ పద్మినీ' నవలలో కుముద్ ఉంగరపు చేతితో బంతి పూలను తీసుకొనింది. బంగారు, పచ్చలు, బంతిపూల రంగుతో ఒక అరనిమిషం సేపు ఆమె చేయి పోటీ పడినట్లుంది.[3]

'మృగనయనీ' నవలలో ఎండా కాలంలో ఎండిపోయిన కాలువలో

1. మృగ నయనీ — బృం. లాల్ వర్మ, పు: 233.
2. గఢ్ కుండార్ — ,, పు: 196
3. విరాటాకీ పద్మినీ ,, పు: 11.

తొలకరి వాన వల్ల వచ్చిన సన్నటి నీటి ధారవలె లాఖీ అలిగిన పెదవులపైన చిరునవ్వు వచ్చింది.[1]

**సంభాషణాత్మక శైలి:** వర్మగారి కొన్ని నవలల్లో నాటకీయ శైలికూడ కన్పిస్తుంది.

మృగనయనీ నవలలో మటరూ కుట్రచేసి గయాసుద్దీన్‌కు మత్తు పానీయంలో విషం కలిపి ఇచ్చారు. మద్యాన్ని తాగుతూ తాగుతూ గయాసుద్దీన్ కళ్ళు మరింతబరువెక్కాయి. మటరూ అతనికెదురుగా కూర్చుని ఉన్నాడు. గయాసుద్దీన్ తడబడే మాటలతో "నేడు నాచెయ్యి ఇలా ఎందుకు వణుకుతోంది." అని అడిగాడు. అందుకు మటరూ "జహాపనా గాలిలో చల్లదనం ఎక్కువగా ఉంది."

"అయితే రాణా రాయమల్లుగాని, అతని కుమారుడు సాంగాగానీ, సికిందర్‌తో యుద్ధా... నికి -.. తల పడేందుకు యింక ఎం..త ఆ..ల..స్యం ఉం..ది ?" "చాల తక్కువ జహాపనా!"

"ఇద్దరూ కొట్టుకు చా...వనీ"[2] గయాసు చేతిలోని గిన్నె జారిపోయింది.

**ఆఖ్యానాత్మకశైలి:** వర్మగారు కొన్ని నవలల్లో ఆఖ్యానాత్మక శైలిని కూడ ప్రయోగించారు. 'గఢ్ కుండార్' నవలా ప్రారంభంలో ఆఖ్యానాత్మక శైలిలో ఉంది. "13 వ శతాబ్ది అంతం సమీపంలోనే ఉంది. మహోబాలో చందేలుల కీర్తి పతాకం దిగిపోయింది. ఈ రోజు ఏ ప్రాంతాన్ని బుందేల్ ఖండం అంటున్నారో ఆ రోజుల్లో దానిని 'జుఝౌతీ' అనేవారు. 'జఝౌతీ' లోని బేతవా, సింధు

---

1. మృగనయనీ — బృం.లాల్‌వర్మ., పు: 252.
2. పైదే., పు: 310.

కేన్ నదుల ద్వారా తరుపబడ్డ చీలిన ఒక పెద్ద భూభాగమే కుండారుల (ఖంగారుల) హయిరమత సింహుని రాజ్యం",[1]

ఈ విధంగా వర్మగారు తమ నవలల్లో శైలీ వైవిధ్యాన్ని ప్రదర్శించారు

6.2.3. **సంభాషణలు:** నవలాకారుడు అనేక కారణాలను దృష్టిలో ఉంచుకొని సంభాషణలను రచిస్తాడు... అందులో రెండు కారణాలను ముఖ్యంగా పేర్కోవచ్చు. మొట్టమొదటది కథను ముందుకు నడిపించడానికి, రెండో కారణం పాత్రోన్మేషణ దృష్టి. నాటకాలలో సంభాషణలకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. పాత్రల ద్వారానే కథ నడుస్తుంది కాబట్టి, సంభాషణలు నాటకంలో ప్రముఖ పాత్రను నిర్వహిస్తాయి. కాని ఇట్ట అవకాశం నవలలో ఉండదు. నవలాకారునికి సంభాషణల ద్వారా చెప్పవలసింది అధికంగా ఉండదు. కాని అక్కడక్కడ సంభాషణలు కూడ అవసరం. సజీవంగానూ, స్వాభావికంగానూ ఉండే సంభాషణలు నవలను మిక్కిలి ఆకర్షణీయంగా చేస్తాయి. వర్మగారి నవలలన్నీ సరళమైన భాషా శైలిలో నడిచాయి కాబట్టి, సంభాషణలు కూడా సరళంగా, సహజంగా ఆకట్టుకునే రీతిలో ఉన్నాయి. వర్మగారి చారిత్రక నవలల్లో సంభాషణల్ని ఈ క్రింది విధంగా విభజించవచ్చు

1. సంక్షిప్తంగానూ, సారగర్భితంగానూ ఉండే సంభాషణలు.
2. వ్యంగ్యాత్మకంగానూ, పరిహాసాత్మకంగానూ ఉండే సంభాషణలు.
3. ఉత్తేజ జనకంగాను, ఆవేశ పూరితంగానూ ఉండే సంభాషణలు.
4. స్థితుల ననుసరించి పాత్రల సంభాషణలు

1. గఢ్ కుండార్ - వృం. లాల్ వర్మ, పు: 5.

5. స్వభావాన్ని స్ఫురింపజేసే సంభాషణలు.

పై రకమైన సంభాషణలకు కొన్ని ఉదాహరణలు.

**సంక్షిప్తంగానూ, సారగర్భితంగానూ ఉండే సంభాషణ :** 'కచనార్'

నవలలో కచనార్, కళావతులు 'మన్నా' ఆస్తిని జప్తు చేయవద్దని కోరడానికి రావ్ దలీప సింహుని దగ్గరకు వెళతారు. మొండి పట్టుదలగల దలీప సింహుని నోటిని కచనార్ కొద్ది మాటలతో కట్టివేసి తన ఆశయాన్ని నెరవేర్చుకొంటుంది.

ద.సిం : పాపం చేసినవారిని దండించకుండా వదలివేయడం ధర్మ విరుద్ధం.

కచ : 'మన్నా' ఏ పాపం చేసింది.

ద.సిం : ఆమెను నేను దండించలేదే !

కచ : బైజూనాథ్ ఏం పాపం చేశాడు ?

ద.సిం : అతడు మా పెదనాన్నను చంపడంలో సహాయం చేశాడు.

కచ : తమరీ విషయాన్ని పూర్తిగా విచారించారా ?

ద.సిం : అతడు ఆ పరాధం చేశాడని నా నమ్మకం.

కచ : నమ్మకం ఉన్నంత మాత్రాన సాక్షులు, ప్రమాణాలు, ఆధారాలు అక్కరలేదా?

( దలీప సింహ నిరుత్తరుడైనాడు)

ద.సిం: అయితే 'దరూ'ను వదలిపెట్ట మంటారా ?

కచ : అలాఅని చెప్పడంలేదు. గోండు రాజులు ఏ విషయాన్నీ కూడా పూర్తిగా విచారించకుండా మరణశిక్ష విధించరని నేను విన్నాను. బుందేల్ రాజ్యంలో జరిగే అన్యాయాలు గోండురాజ్యంలో జరగవని నా నమ్మకం.

( దలీప సింహుడు స్తబ్దుడై ఆలోచింపసాగాడు)

కచ : మన్నా దగ్గర తినటానికి ఏదు ఏమీలేదు. ఆమె పశువుల్ని బలాత్కారంగా లాక్కున్నారు. ఆమెకెవ్వరూ నీళ్ళు కూడా ఇవ్వడం లేదు.

ద.సి : ఐతే నే నిప్పుడేం చేయాలి ?

కచ : న్యాయం, రాజ గోండులు అపఖ్యాతి పాలు కారాదు - క్షత్రాణులు తమ అపకీర్తిని ప్రచారం చేయకూడదు.

ద.సిం: మున్నా పశువులను ఆమెకిచ్చే ఏర్పాట్లు చేయిస్తాను. బైజూనాథ్‌ని చంపడం సరైన పనో కాదో అని నాకు సందేహంగా ఉంది. కానీ అతడు అపరాధి అనే నా విశ్వాసం. మీరింకా చెప్పుకోవలసింది ఉందా ?

కచనార్ తలవంచుకొంది. కళావతి చిరునవ్వు నవ్వింది. సంక్షిప్తంగానూ, సూటిగానూ ఉన్న కచనార్ మాటలవల్ల రావ్ దలీపసింహుడు ప్రభావితుడైనాడని పై సంభాషణలవల్ల అర్థమౌతుంది.[1]

**వ్యంగ్యాత్మకంగానూ, పరిహాసాత్మకంగానూ ఉండే సంభాషణ :**

మృగనయనీ నవలలో సుమన మోహిని రాజా మానసింహ-తోమర్ తో మాట్లాడిన మాటలు వ్యంగ్యంగానూ, పరిహాసంగానూ ఉంటాయి.[2]

**ఉత్తేజ జనకంగానూ, ఆవేశపూరితంగానూ ఉండే సంభాషణ :**

'విరాటాకీ పద్మినీ' నవలలో కుంజరసింహుడు, దేవీసింహుడు తలపడుతారు. ఆ సమయంలో వారిద్దరి సంభాషణ ఉత్తేజంగానూ, ఆవేశంతో కూడినదిగానూ ఉంది.

---

1. కచనార్ - బృం. లాల్ వర్మ., పు: 74.

2. చూ: భాష (ఇదేసిద్ధాంత వ్యాసంలో)., పు: 809

కుంజర: వీధి బిచ్చగాడా! మోసంతో నా తండ్రి సింహాసనంపై కూర్చున్నావు కాబట్టి ఇంత గర్వంగా మాట్లాడుతున్నావు. మందిరం వదలి బయటకు రా! ఎవరు గెలుస్తారో చూస్తాము.

ఆ మాటలు విని దేవీ సింహుడు సింహం వలె గర్జిస్తూ ఇలా అంటాడు.

దేవీ: మందిరం వదలి బయటకు రా. వేశ్య పుత్రుడా! నాయక సింహుడు బుందేలు రాజు. ఆయన సింహాసనంపై పవిత్రమైన బుందేలుతే కూర్చో వాలి. దాసీలకు పుట్టినవాళ్ళకు సింహాసనాన్ని తాకే అర్హత లేదు"[1]

## పరిస్థితులననుసరించి పాత్రల సంభాషణ:

ఒకే పాత్ర భిన్న భిన్న పరిస్థితుల్లో భిన్నరీతుల్లో సంభాషించడం వర్మగారి నవల్లోని ప్రత్యేకత. దానివల్ల పాత్ర చిత్రణలో సహజత్వం కనిపిస్తుంది. 'మృగనయనీ' నవలలో నవలా ప్రారంభంలో మృగనయనీ, లాఖీ, అటల్ తదితరులతో మాట్లాడే సంభాషణలకు, ఆమె రాణి అయిన తర్వాతి సంభాషణలకు చాల అంతరం కనిపిస్తుంది.

ప్రారంభంలో మృగనయని స్వచ్ఛంగా ప్రవహిస్తూ, తుళ్ళుతూ, గెంతుతూ పారే ఏరులా గలగలా మాట్లాడుతుంది. అప్పటి మాటల్లో అమాయకత్వం ఎక్కువగా కనిపిస్తుంది. రాణి అయిన తరువాత ఆమె మాటలు గంభీరంగా ఉంటాయి. ప్రారంభంలో నిన్నీ లాఖీలు ఒకరి కొకరు పరిహాసాలాడు కొంటారు. గ్వాలియర్ చేరిన తరువాత రాజుతో గంభీరంగా మాట్లాడుతుంది.

---

1. విరాటాకీ పద్మినీ – బృం.లాల్ వర్మ., పు: 91.

" మీ శరీరం, ఉత్సాహం, యశస్సు, శౌర్యం దినదినాభివృద్ధి గాంచవలెనని - రోజు రోజుకూ దృఢంగానూ, అద్భుతమయంగానూ వృద్ధి పొందాలని నేను కోరుతున్నాను."

నియమంగానూ, నిగ్రహంతోనూ ఉండండి. నన్ను కూడా అట్లాగే ఉండనీయండి. ఆ గుణాల వలన నాదేహంలో కూడా రాయి నుండి తెచ్చిన ఆ బలం అట్లాగే ఉంటుంది"[2]

**స్వభావాన్ని స్ఫురింపజేసే సంభాషణ:** దలీప సింహుడు దాసి యైన కచనార్ ను చూస్తూనే మోహపరవశుడై ఆమె చెయ్యి పట్టుకుంటాడు. ఆ సమయంలో దలీప సింహుడు, కచనార్ ల మధ్య జరిగిన సంభాషణ వారి స్వభావాన్ని వ్యక్తం చేస్తుంది.

ద.సిం: (కచనార్ చెయ్యి పట్టుకొని నవ్వుతూ) చెప్పు. ఏమిటి విషయం. ఏమి అడుగుతావో దానిని ఇస్తాను.

కచ: నాకు వస్త్రాలు, అలంకారాలు అవసరం లేదు. నేను గోండి జాతి కన్యను. అవసరమైతే వృక్షాల బెరడుతో నా శరీరాన్ని కప్పుకొని నా శీలాన్ని కాపాడుకుంటాను.

ద.సిం: అయితే నీకేం కావాలో అడుగు అదే ఇస్తాను. (కచనార్ చిరునవ్వు నవ్వింది. దలీప సింహుడు అలాంటి నవ్వును ఇంత వరకు చూచి ఉండ లేదు. ఆశ్చర్య పడ్డారు)

కచ: నా అభిప్రాయం ఎప్పటికీ మారదు.

1. మృగనయని - బృం.లాల్ వర్మ., పు: 230.
2- పైదే., పు: 230.

ర.సిం: మార్చు కోవాలి.

కచ: ఎప్పటికీ మారరు. (కచనార్ కళ్ళల్లో ఆవేశం పరుగులెత్తింది) మీరు నన్ను పెండ్లి చేసుకోండి. నాకు మీ భార్యగా స్థానం ఇవ్వండి. మీ జీవిత సహధర్మచారిణిగా చేసుకోండి. నాకు మాట ఇవ్వండి. నేను మీ పాద దాసిగా ఉంటాను.'[1]

6.2.4. నుడికారం: జాతీయాలు, లోకోక్తులు భాషకు ప్రాణం వంటివి. వర్మగారు తమ రచనల్లో వర్ణనల్లోనూ, సంభాషణల్లోనూ, వ్యవహారంలో ఉన్న జాతీయాలు, సూక్తులు, లోకోక్తులు వాడారు

**జాతీయాలు:**

1. జిస్ కీ లాఠీ ఉస్ కీ భైంస్[2] = శక్తి కలవాడిదే రాజ్యం.

2. ఆంచల్ కే ఛోర్ మే బాంద్ లేనా[3] = కొంగున ముడేసుకోవడం.

3. దిన్ దూనా రాత్ చౌగునా బఢే[4] = పగలు రెండు రెట్లు రాత్రి నాలుగు రెట్లు.

**లోకోక్తులు:**

1. పాసా పడే సో దావ్ ) పాచిక వేస్తే జూదం
పంచ్ కరేతో న్యావ్[5] ) పంచాయితీ చెపితే న్యాయం

2. సాఁప్ మరే ఔర న లాఠీ టూటే[6] = పాము చావకూడదు, కర్ర విరకూడదు.

1. కచనార్ – బృం. లాల్ వర్మ., పు: 25.
2. అహిల్యా బాయి – ,, పు: 201.
3. మృగనయనీ – ,, పు: 231.
4. టూటే కాంటే – ,, పు: 57.
5. విరాటా కీ పద్మినీ – ,, పు: 53.
6. ముసాహిబజు – ,, పు: 48.

3. దూధ్ కా జలా మఠా ఫూక్ ఫూక్ కర్ పీతాహై[1] = వేడి పాలు తాగి నాలుక కాల్చుకున్న వాడు మజ్జిగ ఇస్తే కూడ ఊదుకొని ఊదుకొని తాగుతాడు.

4. ఒఖలీ మే సిర్ దియాతో ముసల్ కా డర్ హీ క్యా[2] = రోట్లో తలదూర్చి రోకటి పోటుకు వెరవడం.

సూక్తులు :

1. స్త్రియాం బాత్ కాట్‌తీ సిర్ నహీ.[3]
(స్త్రీలు మాటలు నరుకుతారు కానీ తలలు కాదు)

2. రాజనీతీ మే ధర్మాచార్యోం ఔర్ యోగీ యోంకీ సలాహ్ కీ జరూరత్ నహీ.[4]
(రాజనీతిలో ధర్మాచార్యుల, యోగుల సలహాలు అనవసరం)

3. దరిద్రతా, ఔర్ విపత్తి పరమాత్మకీ ఛైనీ ఔర్ హథౌడీ హై. జిన్ సే వహ్ అప్‌నీ సృష్టి కే ప్రతిభాశాలి వ్యక్తియోం కీ బుద్ధి ఔర్ వివేక్ కీ ప్రతిభా కో ఛీల్ ఛీల్ కర్ కల్యాణ్ కారీ బన్‌తా హై.[5]
(దారిద్ర్యం, ఆపద ఈ రెండూ భగవంతునికి ఉలి, సమ్మెటల వంటివి. దీని ద్వారా తన సృష్టిలోని ప్రతిభాశాలురైన వ్యక్తుల బుద్ధి వివేకాలను దోచి, దోచి మంగళకరం గావిస్తాడు)

6.2.5. వర్ణనలు : బృందావన్ లాల్ వర్మగారు తమ చారిత్రక నవలల్లో కథాగమనం కుంటుపడకుండా, అనేక చోట్ల పలురకాల వర్ణనలు చేశారు.

1. కచనార్ – బృం. లాల్ వర్మ., పు: 321.
2. టూటే కాంటే – ,, ,, పు: 223.
3. విరాటాకీ పద్మినీ – ,, ,, పు: 93
4. గఢ్ కుండార్ ,, ,, పు: 215
5. భువనవిక్రమ్ ,, ,, పు: 119

వారి వర్ణనల్లో కొన్ని- 1. యుద్ధవర్ణన, 2. వేటవర్ణన, 3. ప్రకృతి వర్ణన, 4. ఆకార వర్ణన

**యుద్ధ వర్ణన:** చరిత్ర అంటేనే రాజులు, యుద్ధాలు గుర్తుకు వస్తాయి వర్మగారు తమ చారిత్రక నవలలన్నింటిలో అనేక విధాలుగా యుద్ధ వర్ణనలు గావించారు. 'విరాటాకే పద్మినీ' నవలలో - " దేవీ సింహుని సేనలను మూడుదళాలుగా విభజించారు. అర్ధరాత్రి దాటిన తరువాత బయలు దేరారు... మొదటి దళానికి దేవీ సింహుడు, రెండో దళానికి లోచన సింహుడు, మూడో దళానికి జనార్ధన శర్మ నాయకులుగా ఉన్నారు.... ఒకవైపు కాలపీ సైన్యం జయ జయ ధ్వానాలు, మరోవైపు దలీప్ సైన్యం జయ జయ ధ్వానాలు వినబడ్డాయి. ఒక నిముషంలో తుపాకుల విస్ఫురవ్వలు, గుండ్ల వర్షం కురిసింది. క్రమక్రమంగా తుపాకుల శబ్దం తగ్గి కత్తుల శబ్దం ఎక్కువైంది."[1]

**వేట వర్ణన:** వర్మగారు స్వతహాగా మంచి వేటగాడు. కాబట్టి వారి 'మృగనయనీ' నవలలో వేటగురించి అద్భుతంగా వర్ణించారు. నిన్నీ, లాఖీలు ఒకవైపు మంచెపై ఉంటే, వారి వేట సామర్థ్యాన్ని చూస్తూ మానసింహుడు ఇరోవైపున్న మంచెపై ఉన్నారు. నిన్నీ సింహాన్ని వేటాడిన విధానాన్ని వర్మగారిలా రాశారు

" నిన్నీ వెంటనే దాని (సింహం) కంఠానికి గురిపెట్టి బలాన్నంతా ఉపయోగించి, వింటి త్రాటిని చెవిదాకా లాగి అమ్ము వదిలింది. ఆలసించకుండా మరో శరం ఎక్కుపెట్టింది. సింహం కంఠంలో అమ్ము పూర్తిగా దిగిపోయింది. సింహం విలవిల్లాడుతూ, గర్జిస్తూ విరక్తితో ఏ చోటునుంచి తొలగిందో దాని

1. విరాటాకే పద్మినీ – బృం. లాల్ వర్మ, పు: 341, 342.

మీదనే క్రిందపడి, తన పెద్ద పెద్ద గోళ్ళతో భూమిని పెకలించి దుమ్ములేపి వేస్తూంది. తీక్షణమైన గర్జనలు చేస్తూనే ఉంది... కొద్దిసేపటికి సింహం పని ముగిసింది."[1] అదే విధంగా నిన్నీ అడవి దున్నను, నిన్నీ, లాఖీ, అటల్‌లు అడవిలో ఇతర జంతువులను వేటాడిన విధానాన్ని వర్మగారు వర్ణించినారు.

**ప్రకృతి వర్ణన:** వర్మగారి నవలల్లో చాలా చోట్ల ప్రకృతివర్ణనలు చోటుచేసుకున్నాయి. 'కచనార్' నవలలో "తీరానికి ఇరుప్రక్కలా పారిజాత వృక్షాలు కాలువ పొడవునా దట్టంగా ఉన్నాయి. చెట్లన్నీ పారిజాత పుష్పాలతో నిండి ఉన్నాయి. అప్పుడే తెల్లవారుతోంది. గాలి సన్నగా, మంద్రస్థాయిలో వీస్తూ వుంది. కాలువలో నీరు సన్నని పాయగా పారుతూ ఉంది. మెత్తని గాలి కుదుపులకు కాలువలోని నీరు ముందుకూ, వెనుకకూ కదలుతూ మెల్లగా ప్రవహిస్తూ ఉంది. ఆ సన్నటి ధార మీద తెల్లరేకులు, ఎర్రటి కాడలు గల చిన్న చిన్న పారిజాత పుష్పాలు పడి ఒక్కొక్కటి, జంటలు జంటలుగా తాకుతూ ప్రయాణిస్తూ ఉన్నాయి. ఈ దృశ్యం ఆ చెట్ల మీద నిరంతరం ఆడుతూ, పాడుతూ ఉండే పికిలి పిట్టలు (బుల్‌బుల్ పిట్టలు) కౌముదీ మహోత్సవం జరుపుకొంటున్నాయేమో అన్నట్లుంది."[2]

**ఆకార వర్ణనలు:** వర్మగారు తన నవలల్లో స్త్రీ పురుషుల ఆకారాలను వర్ణించి, ఆ పాత్రల స్వభావాన్ని మన కళ్ళకు కట్టినట్లు రాశారు. వర్మగారు మృగనయనీ, లాఖీ, లక్ష్మీబాయి, కుముద్, తార, మానవతి, హిమానీ, హేమవతి

---

1. మృగనయనీ — బృం. లాల్ వర్మ., పు: 178.

2. కచనార్ — ,, పు: 243.

గారి , కచనార్ , మూర్‌బాయి మొదలైన స్త్రీల ఆకారాలను చక్కగా వర్ణించారు. వారి వర్ణనల్లో ఎక్కడా మనకు అసభ్యత కనబడదు. అంగాంగ వర్ణన చేసినా శృంగారానికి అంత ప్రాధాన్యం ఇవ్వలేదు. అవధులు మించి పోలేదు. ఉదా॥ గఢ్ కుండార్ నవలలో – "తారకండ్లు ప్రశాంతమైనవి. స్థిరమైనవి. పెద్ద కనురెప్పలు గలవి. ఆమె దేహకాంతి స్వచ్ఛంగా ప్రకాశించేది. ఆమె కళ్లలో ఏ కోణానా కపటం , మోసం కన్పించేవి కావు . శరీరం సన్నగా , మృదువుగా ఉంటుంది. ఆమె ఆకారంలో దేవతా స్వరూపం ప్రతి ఫలిస్తూ ఉంది. ఆమె బ్రహ్మ ముహూర్తమందలి ఉషః కాంతి వలె , మహర్షుల హోమం వలె , విష్ణు భక్తులు పూజించే లక్ష్మివలె ఉంటుంది"[1] అని వర్ణించారు రచయిత.

అలాగే వర్మగారు మానసింహుడు , గయాసుద్దీన్, బఘుర్రా, భువనుడు , రోమకుడు , నాగదేవుడు , అగ్నిదత్తుడు , దివాకరుడు, కుంజర-సింహుడు , దేవీ సింహుడు మొదలైన పురుషుల్ని కూడా వర్ణించినారు. 'మృగనయనీ' నవలలో మానసింహుని వర్ణన – " అతడు మధ్య వయస్కుడు. కన్నులు నల్లగానూ , పెద్దవిగాను ఉన్నాయి. కనుబొమలు దట్టంగా ఉన్నాయి. ముక్కు కొనదేలి పొడుగ్గా ఉంది. మొహం గంభీరంగా ఉంటుంది. దృఢమైన చుబుకం. అతని పెదవులు మెత్తగా , ఎర్రగా ఉన్నాయి. వ్యాయామం చేయడంలో శరీరం దృఢంగా తయారైంది. వక్షస్థలం విశాలంగా ఉంది. మీసాలు దట్టంగా, అందంగా ఉన్నాయి.[2]

---

1. గఢ్ కుండార్ – బృం. లాల్ వర్మ., పు: 142.

2. మృగనయనీ – " పు: 38.

ఈ విధంగా వర్మగారు తన చారిత్రక నవలల్లో అనేకమైన వర్ణనలు కావించినారు.

6.2.6. **పాటలు - గేయాలు:** వర్మగారు తమ చారిత్రక నవలల్లో సందర్భానుసారంగా పాటలు - గేయాలు అక్కడక్కడ చొప్పించారు. వాటి వల్ల కథకు పుష్టి కలగడమే గాక ఆ నాటి ప్రజల్లో ప్రబలంగా ఉన్న జానపదాలు, పల్లె పాటలు, పండుగ పాటలు, భక్తి పాటలు మనకు తెలుస్తున్నాయి. వర్మగారు స్వతహాగా పాటలు రాసి తన నవలల్లో చొప్పించినట్లు అర్పించరు. అనుస్యూతంగా ప్రజల్లో నానుతున్న పాటలనే సేకరించి సందర్భానుసారంగా నవలల్లో ఉంచారని పిస్తుంది. వారి నవలల్లో మృగనయని, బైజునాథ్, నూర్ బాయి, కుముద్, కచనార్ మొదలైన వారు చక్కని గాయకులు.

'విరాటాకీ పద్మిని' నవలలో ఆ నాటి బుందేల్ ఖండ్ ప్రాంతంలో ప్రాచుర్యంలో ఉన్న పాటను వర్మగారు రాశారు.

"మలి వియా, ఫులవా ...

... నందన్ వన్ కే "[1]

వర్మగారు ఇదే నుడుగులను నాలుగు చోట్ల రాశారు. కుముద్ తండ్రి నరపతి ఈ పాటను ఒకసారి పాడుతాడు.[2] కుముద్ కూడా పాడుతుంది.[3] వీణతో శృతి చేసిన రాగంతో ఇదే పాట ఎక్కడి నుంచో వినబడింది.[4] చివరగా కుముద్ బేతవా నదిలో పడి చని పోయే ముందు ఈ పాటను పాడుతూ దూకి చనిపోతుంది.[5]

1, 2, 3, 4, 5. విరాటాకీ పద్మిని – బృం. లాల్ వర్మ., పు: 355, 355, 356, 363, 365.

'మృగ నయని' నవలలో సందర్భాను సారంగా పాటల నుడుగులను అక్కడక్కడ రాశారు. వర్మగారు. నవల మొదట్లో హోలీ పండుగ సందర్భంగా "ఉరఝోనా శ్యామ కహీ మానో ... గోకులకీ గుజరియా సత్ జానో

ఉరఝోన శ్యామ కహీ మానో"[1] ఈ హోలీ పాటను రాయి గ్రామ పూజారి పాడితే అందరూ స్వరం కలిపారు. నిన్ని మధుర స్వరం అందరి లోను ప్రత్యేకంగా శ్రావ్యంగా వినిపించింది.[2] రాయి గ్రామ స్త్రీలు, మృగనయనీ "జాగ్ పరీ మై పియకే జగాయే, భాగ్ జగే పియమోరె ఘర్ ఆయే"[3] అనే పాటను పాడినట్లు వర్మగారు రాశారు. గ్వాలియర్ ఆస్థాన సంగీత విద్వాంసుడు బైజూనాథ్ సభలో "మాన్ హోరి ఖేలేరీ .....

రాజా మాన్ హోరీ ..."[4] పాడాడు.

పాట పూర్తిగా ఆలపించడానికి రెండు గడియలు పట్టింది. పాట ఉచ్చస్వరంలో నడిచింది.[5] ఇంకా "నాయక్ బైజూ హోరీ పాడారు.. 'లాడలీ మాన కరియే...

భోరం హే తాన్ – లాడలీ మాన్ కరియే."[6]

టూటే కాంటే నవలలో 'నూర్ బాయి' "జో ముఖ్ నాహిం

. సఖా సున్ శ్యామ్‌కే"[7] అనే నందదాస్ భ్రమర గీతం, "వామ్ కనక ... జావే ఖాలీ ప్యాలా"[8] అనే ఉమర్ ఖయ్యామ్ రుబాయి, "చరణాకమల .... తిహిపాయి"[9] అనే సూరదాస్ పదం పాడినట్లు రాశారు.

---

1., 2 మృగ నయనీ – బృం. లా. వర్మ పు: 21
3. పైదే., పు: 11
4, 5. పైదే., పు: 338
6., పైదే., పు: 378
7. టూటే కాంటే – బృం. లాల్ వర్మ., పు: 122
8. పైదే., పు: 225.
9. పైదే., పు: 295

ఈ విధంగా వర్మగారు పాటలు, పదాలు, గేయాలు తమ నవలల్లో చొప్పించి నవలకు పుష్టి కలిగించారు.

**6.2.7. రస పోషణ :** కావ్యానికి రసం ఆత్మ వంటిది. రస విహీనమైన కావ్యం నిర్జీవం. మన లాక్షణికులు శృంగార, హాస్య, కరుణ, భీభత్స, రౌద్ర, భయానక, వీర, అద్భుత, శాంత రసాలనే నవరసాలని చెప్పి ఉన్నారు. కవులు తమ కావ్యాలలో పై రసాలను పోషించి ఉన్నారు. కావ్యంలో వీర రసంగాని, శృంగార రసంగాని అంగిరసంగానూ, మిగిలినవి అంగరసాలు గానూ ఉండాలని లాక్షణికులు చెప్పిఉన్నారు. కావ్యంలో రసప్రక్రియను సోదాహరణంగా నిరూపించవచ్చు. కాని నవల, కథానిక, ఖండకావ్యం మొదలైన వాటిలో ఈ రసచ్ఛాయలు ఉంటాయే కాని వాటిని పూర్తిగా నిరూపించడం కష్టం. కాని రచయిత ప్రతిభావంతుడైతే నవల, కథానిక మొదలైన వాటిని కూడా రసానుభూతి కలిగే విధంగా రచిస్తారు.

వర్మగారు చారిత్రక నవలల్లో అనేక చోట్ల అనేక రకాలైన రసాలను ఆవిష్కరించి తమ ప్రతిభను చాటారు. వారి నవలల్లో శృంగారాత్మక ప్రసంగాల్లో శృంగారం, యుద్ధం మొదలైన వీర రసాత్మక ప్రసంగాల్లో వీరం, హాస్య సంభాషణల్లో హాస్యం, దయనీయమైన పరిస్థితులు రాసేటప్పుడు కరుణ, ఆశ్చర్యకరమైన విషయాలు చెప్పేటప్పుడు అద్భుతం, ఇంకా భీభత్స, రౌద్ర, భయానక, శాంత రసాలను అవసరమైన చోట రాసి దాదాపు అన్ని నవలల్లోనూ రసావిష్కరణ గావించారు.

మృగనయనీ నవలలో మృగనయనీ, మానసింహుల మధ్య

మధురం గానూ, కోమలం గానూ వరిచే సంభాషణల్లో శృంగార రసం ద్యోతక మౌతూ ఉంటుంది.'[1]

ఇక వీరరసం దాదాపు అన్ని నవలల్లోనూ కనబడుతూ ఉంటుంది. అన్నీ చారిత్రక నవలలే కాబట్టి నాయకుడు, నాయిక, ముఖ్యమైన పాత్రల సంభాషణల్లో వీర రసాన్ని పోషించారు. విరాటాకీ పద్మినీ, టూటే కాంటే నవలలను కరుణారస ప్రధానంగా భావించ వచ్చు. విరాటాకీ పద్మిని నవల చివర్లో దాంగీ సేనలు యుద్ధంలో ఓడిపోతుండడం, జౌహర్ వ్రతాన్ని పాటించడం, దేవీసింహుడు కుంజర సింహుని తల నరకడం, కుముద్ బేతవా నదిలో పడి మరణించడం - ఈ ఘట్టాల్లో వర్మగారు కరుణ రసాన్ని పోషించారు.

టూటే కాంటే నవలలో నాదిర్షా ఢిల్లీపై దండెత్తినప్పుడు శవాలు కుప్పలు తెప్పలుగా పడి ఉండడం, రక్తం ఏరులై పారడం లాంటి వర్ణనలు చేసి భీభత్స రసాన్ని పోషించినారు.

వర్మగారు అక్కడక్కడా హాస్య రసాన్ని కూడా పోషించారు. మృగనయనీ నవలలో బఘర్రా గురించి, అతని తిండి గురించి వర్ణించే టప్పుడు కడుపు చెక్కలయ్యే నవ్వు వస్తుంది. "మహమ్మద్ బఘర్రా మూడున్నర చేతులకంటే ఎక్కువగానే పొడవుగా ఉండేవాడు. కాని వెడల్పు ఎక్కువ కావడం వల్ల మరుగుజ్జులా కనబడేవాడు".[2]

---

1. చూ; భాష (ఇదే సిద్ధాంత వ్యాసంలో., పు: 808, 809

2. మృగనయనీ — బృం. లాల్ వర్మ, పు: 71.

బఘుర్రా ఉపాహారం గురించి వర్మగారు ఇలా రాశారు.

"150 అరటి పండ్లు, సేరు తేనె, సేరు వెన్న ఇదీ అతని ప్రతిదినం ప్రాతఃకాల ఉపాహార సేవనం ... బఘుర్రా ఉదయాహారం ఖాళీ చేయడం ప్రారంభించాడు. గుట్ట తరిగి పోసాగింది... అరటి పండును రెండు ముక్కలు చేసి బఘుర్రా నోట్లో వేసుకొని గూఢచారి వేస్తు తిరిగి "ఊ" అని మేఘాలు గర్జించినట్లు తల ఊపాడు... బఘుర్రా నోటిలో సగం అరటి పండు బయటికి ఉంది. సగం పండు కంఠంలోంచి దిగిపోయే తొందరలో ఉంది. సగం నోరు ఖాళీగా ఉంది. ఆ దిశనుండే కఠోర శబ్దం వెలువడింది"! – ఇలా అరుదుగా హాస్యం చూపించారు వర్మగారు. ఆయన కథాకాలంలో ప్రజా జీవితం భిన్నాభిన్నమై ప్రజలు అష్టకష్టాలు పడుతుండడం వల్ల తమ నవలల్లో ఎక్కువగా హాస్యాన్ని వర్మగారు పోషించలేదు. అద్భుత రసాన్ని మాత్రం అనేకచోట్ల పోషించారు. మృగనయనీ, భువనవిక్రమ్, గఢ్ కుండార్, కచనార్ మొదలైన నవలల్లో అద్భుత రసాన్ని చూపారు. మృగనయనీ నవలలో నటవర్గం వారి గారడీ విద్యలు, లక్ష్మీబాయి గుర్రపు స్వారీ చేయడం, కత్తియుద్ధం నేర్చుకోవడం, టూటే కాంటే నవల ప్రారంభంలో నూరబాయి నృత్య ప్రదర్శన మొదలైన చోట్ల అద్భుతరసాన్ని ఆవిష్కరించారు వర్మగారు. మృగనయనీ నవలలో మానమందిరం, కర్ణ మందిరం మొదలైన మందిరాల వర్ణనలు అద్భుతంగా ఉన్నాయి. వర్మగారు నటరాజ విగ్రహాన్ని మృగనయనీ నవలలో ఎంతో అద్భుతంగా వర్ణించారు.

"నటరాజ విగ్రహం వికసించిన కమలం మీద నిలబెట్టినట్లు ఉంది.

గోళాకారపు కమలపు రేకుల నుంచి వెదజల్లుతున్న కాంతివలయం కూడా నిర్మించి ఉంది ... ఒక జటలో నాలుగున్నర చుట్లు చుట్టుకొని కూర్చున్న నాగేంద్రుడు, చిన్నపుత్రి, గంగాదేవి ప్రతిబింబం మీద చవితి చంద్రుడు, దేహం మీద సగభాగం వరకు వ్యాఘ్రచర్మం.[1] ఈ విధంగా నటరాజు విగ్రహాన్ని అద్భుతంగా వర్ణించారు. మృగనయని తాండవనృత్యంలో కూడా అద్భుత రసాన్ని వర్మగారు పోషించినారు. నిన్నీ, లాఖీల వేట, బైజూనాథ్ పాట, కళ, మృగనయనీల చిత్రలేఖనం మొదలైన చోటకూడా వర్మగారు అద్భుతరసాన్ని పోషించి ఉన్నారు ఈ విధంగా వర్మగారు తన చారిత్రక నవలల్లో నవరస పోషణ గావించి నవలను అద్భుత కావ్యంగా మలిచారు.

1. మృగనయనీ — బృం. లాల్ వర్మ., పు: 382

బాపిరాజు గారికి, బృందావన్‌లాల్ వర్మ గారికి ముఖ్యంగా భాషలో తేడా కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. బాపిరాజుగారు తమ చారిత్రక నవలలన్నింటిలో ఒకే విధమైన సరళగ్రాంథిక భాషను వాడారు. అయనది ఇంచుమించు కావ్యభాష అని చెప్పవచ్చు. పండితుల మొదలుకొని పామరుల వరకు, రాజుల మొదలు కొని భటుల వరకు అన్నిపాత్రలు ఒకే భాషను మాట్లాడి నట్లు ఒకమూసలోనే వారి భాష సాగింది. వారి భాష ప్రామాణికంగా, ఆహ్లాదకరంగా ఉంటుంది. వర్ణనలు చేసే టప్పుడు సంస్కృత పద భూయిష్ఠాలైన సమాసాలు చోటు చేసుకొన్నా, కథాగమనం విసుగు జనించకుండా ఒకే విధ మైన, క్రమశిక్షణతో నడచిన సైనికులవలె బాపిరాజు గారి భాష సాగిపోతుంది. ఆ భాషాప్రవాహం గలగల పారే ఝరీ ప్రవాహం.

రాజుగారి భాష నవలకు ఒకవిధమైన అందాన్ని తెచ్చిపెడితే, వర్మగారి భాష ఇంకోవిధంగా వైవిధ్యంగా ఉంటుంది. గ్రామీణులు మాట్లాడేటప్పుడు గ్రామీణ భాష, బుందేల్‌ఖండ్ ప్రాంతీయులు మాట్లాడేటప్పుడు వారి ప్రాంతీయ భాష; రాజులు, రాణులు, పండితులు, మాట్లాడేటప్పుడు వాడేభాష; మహమ్మదీయ, ఆంగ్లేయ ప్రభావంవల్ల ప్రజలు మాట్లాడే భాష, ఇలా రకరకాల భాషా

ప్రయోగాలు ఆయన నవలల్లో కన్పిస్తాయి. వర్మగారి కథాకాలం నాటికి మహమ్మదీయులు, ఆంగ్లేయులు మొదలైన విదేశీయులు మనదేశంలో పాలకులుగా ఉన్నారు కాబట్టి పాలితులైన భారతీయుల భాషలపై విదేశీ భాషా ప్రభావం ఉండడం సహజం. బృందావన్‌లాల్ వర్మగారి శబ్ద భండారం చాల విశాలమైంది. వారి భాష తత్సమ, తద్భవాలే కాకుండా ఉర్దూ, అరబ్బీ, పర్షియా, ఇంగ్లీషు మొదలైన ఐదురకాల భాషాపదాల సమ్మేళనంతో అందంగా ఉంటుంది.

బాపిరాజుగారి కథాకాలం నాటికి మహమ్మదీయులు, ఆంగ్లేయులు మనదేశంలో లేరు. ఉన్నా; ఉత్తర భారతంలో ఉన్నారేమో కాని, దక్షిణాపథంలో, ముఖ్యంగా ఆంధ్రప్రాంతంలో లేరు. కాబట్టి రాజుగారు, తెలుగు, సంస్కృత (తత్సమ, తద్భవ) పదాలనే తమభాషలో వాడారు. బాపిరాజుగారి చారిత్రక నవలా కథాకాలానికి ప్రాకృతాలకు ప్రాధాన్యం ఉండేది. తర్వాత తెలుగు వాఙ్మయానికి గుర్తింపు వచ్చింది. చారిత్రక నవలాకారులు ఎన్నో సంవత్సరాల, యుగాల వెనుక జరిగిన కథాంశం తీసుకొని రాస్తే భాషాపరంగా కొన్ని సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. ముఖ్యంగా ఏ భాష రాయాలి? అన్నప్రశ్న ఉద్భవిస్తుంది. సహజంగా రచయిత సమకాలీన భాషనే తమ రచనల్లో వాడుతారు. ఈ ఇబ్బంది

వర్మగారు ఒక్క భువనవిక్రమ్ నవలలో మాత్రం ఎదుర్కొన్నారని పిస్తుంది. బాపిరాజుగారికి కూడ శాతవాహనుల కాలం నాటి పల్లెవాసుల భాష ఊహించి రాయాలనిపించి గాథా సప్తసతి లోని ప్రాకృత గీతాలను మూడింటిని ఆనాటి పల్లె పదాలుగా రాసి తమకోరిక తీర్చుకొన్నారని పిస్తుంది. వర్మగారు కొన్ని చారిత్రక నవలలను స్వతంత్రం రాకముందు రాశారు. స్వతంత్రం వచ్చాక కొన్ని రాశారు. స్వాతంత్ర్యం రాకముందు భాషలో స్వభావసిద్ధంగా పల్లెపదాలు అధికంగా కన్పిస్తే, స్వాతంత్ర్యం వచ్చాక ఉర్దూ మిశ్రిత హిందీ పదాలు ఎక్కువగా కన్పిస్తాయి.

ఇక శైలి విషయానికి వస్తే, ఇద్దరూ తమ రచనల్లో వర్ణనాత్మకశైలి, భావాత్మక శైలి, సంభాషణాత్మక శైలి మొదలైన శైలుల్ని ప్రయోగించారు. అందువల్ల వారి రచనలు ఎంతో ఆదరణ పొందాయి. సంభాషణల్లో ఇద్దరు రచయితల్లో సారళ్యం, సజీవ దృష్టి, స్వాభావికత గోచరిస్తాయి.

ఇద్దరూ వారి వారి చారిత్రక నవలల్లో అనేక రకాలైన వర్ణనలు గావించారు. వర్మగారికీ, రాజుగారికి ఒక స్త్రీ వర్ణన విషయంలో మాత్రం వైషమ్యం కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. స్త్రీ అంగాంగాలను, అందంగా బాపిరాజు

గారు వర్ణించినట్లు వర్మగారు చారిత్రక నవలల్లో ఎక్కడా వర్ణించ లేదు. కాని బాపిరాజుగారు కూడ ఎక్కడా అసభ్యంగా స్త్రీని వర్ణించ లేదు.

వర్మగారు వేటను విశేషంగానే వర్ణించారు. మృగనయనీ నవలలో వేటకు ఇంచుమించు రెండు, మూడు అధ్యాయాలు కేటాయించారు; కాని బాపిరాజుగారు కథానుసారం వేటను వర్ణించారే కాని వర్ణనలో ఒక ముఖ్యఅంశంగా గుర్తించలేదు. దీనికి కారణం వర్మగారు స్వతహాగా వేటకారు కావడమే అన్పిస్తుంది. వర్మగారు కథను చెప్పకొంటూ అవసరం అన్పించిన చోటునే వర్ణనలు కావించారు. కాని రాజుగారు అద్యంతం వర్ణనలకే ప్రాధాన్యత నిచ్చారన్పిస్తుంది. ఒక విధంగా వారిశైలి వర్ణనాత్మక శైలి అనవచ్చు. బాపిరాజుగారు నవలల్లోని పాత్రల్ని మాత్రమేగాక, రాజమార్గాల్ని, బ్రాహ్మణవాడని, నాట్యవిధానాన్ని, రాజాంతఃపురాల్ని ప్రాచీనకాలంనాటి బండ్లను విపులంగా వర్ణించారు. యుద్ధ వర్ణనలను మాత్రం ఇద్దరూ అధికంగా తమనవలల్లో చేసి ఉన్నారు.

పాటలు-గేయాల విషయంలో వర్మగారికి, రాజుగారికి చాల వైషమ్యం ఉంది. వర్మగారు స్వయంగా కవితలుగాని, గేయాలుగాని రాసి నవలల్లో ప్రవేశ

పెట్టినట్లు అన్పించదు. వారు నవలల్లో రాసిన పాటలే స్వల్పం. అన్ని నవలల్లోను పాటలు లేవు. ఉన్న వాటిల్లోనూ, పూర్తి చరణాలు లేవు. కాబట్టి వర్మగారు, ప్రజల్లో ప్రబలంగా ఉన్న కొన్ని పాటలను సేకరించి సందర్భానుసారంగా నవలల్లో చొప్పించారే కాని స్వంతంగా పాటలు రాసినట్లు కనబడదు. దీనికి కారణం ఆయన చారిత్రక దృష్టి. ఆయనకు నవలల్లో స్వకపోల కల్పితమైన పాటలను చొప్పించడం అనవసరం అని తోచి ఉండవచ్చు. చారిత్రక నవలల ద్వారా గతించిన చరిత్రను ఆకర్షణీయంగా చెప్పడం వర్మగారి ఉద్దేశ్యం. కాబట్టి ఫలాన రాజు సభలో సంగీత కచ్చేరీ జరిగింది అని రాశారే గాని, పాటలు విశదంగా రాయలేదు. కాని బాపిరాజు గారు స్వయంగా కవి. గాయకులు కూడ. అందుకే సువర్ణశ్రీ గౌరవార్థం జరిగిన సన్మాన సభలో నృత్యం ప్రదర్శించారు అని, ఆ నృత్యానికి అనుగుణంగా పాటను రాశారు. మృగనయనీ గొంతు శ్రావ్యంగా ఉంటుంది. చక్కగా పల్లె పదాలు పాడగలదు అని వర్మగారు రాశారే కాని ఆ పాటలను నవలల్లో రాయలేదు. బాపిరాజు గారు చంద్రబాల వేద ప్రదాయ సిద్ధమైన సామగానం నేర్చుకొంది అని చెప్పడమే గాక ఆమె పాడినట్లు ఒక పాటను కూడ రాశారు. మొత్తం మీద బాపిరాజుగారి నవలల్లో ఉన్నంత విస్తృతంగా వర్మగారి

నవలల్లో పాటలు లేవు.

ఇక రసపోషణ విషయం పరిశీలిస్తే, విషాదం పట్ల బాపిరాజు విముఖుడని వారి నవలలన్నీ సుఖాంతాలు కాబట్టి తెలుస్తుంది. అందుకే వారి నవలల్లో అధికంగా శృంగారం, వీర రసాలే ఉంటాయి. అక్కడక్కడ భయానక, బీభత్స, అద్భుత రసాలు; ఒకటి రెండు చోట్ల కరుణ రసం ద్యోతకమౌతుంది. కాని వర్మగారి నవలల్లో అనేకం దుఃఖాంతాలు. ఆనాటి సామాజిక పరిస్థితికి అద్దంపట్టే రచనలు కావడంవల్ల రసావిష్కరణకు అవకాశం తక్కువ. కాని ఉన్న పరిధిలోనే వర్మగారు కూడ శృంగార, వీర, కరుణ, శాంత, అద్భుత రసాలు పోషించారు. కరుణ రసాన్ని వర్మగారు పోషించినంతగా బాపిరాజుగారు పోషించలేదనిపిస్తుంది. ఇద్దరు రచయితలు సందర్భానుసారంగా భాషలో జాతీయాలు, లోకోక్తులు, సామెతలు ప్రయోగించారు. భాష, శైలి, రసం, వర్ణన మొదలైన సృజనాత్మక రచనాంగాల్ని (constituents of creative writing) ఇరువురూ సమర్థవంతంగా పోషించారు.

# ఉపసంహారం:

సమస్త మానవ సంస్కృతిలో నిగూఢంగా నిక్షిప్తమై ఉన్న మానవ సంవేదనలో గల సమైక్యతను నిరూపించగల సాధనం తులనాత్మక అధ్యయనం. ఈ నాడు తులనాత్మక అధ్యయనానికి భారత దేశంలోనే గాక ప్రపంచ దేశాలన్నింటిలోనూ ప్రాధాన్యమేర్పడింది.

అందువల్ల పరిశోధకురాలు తులనాత్మక అధ్యయనంపై ఆసక్తితో "అడివి బాపిరాజు - బృందావన్ లాల్ వర్మగార్ల చారిత్రక నవలలు, తులనాత్మక పరిశీలన" అనే అంశాన్ని పరిశోధనకు ఎన్నుకోవడం జరిగింది. పరిశోధనకు స్వీకరించిన అడివి బాపిరాజు గారి చారిత్రక నవలలు నాలుగు 1.హిమబిందు, 2. అడవి శాంతిశ్రీ, 3. అంశుమతి, 4.గోనగన్నారెడ్డి, బృందావన్ లాల్ వర్మగారి చారిత్రక నవలలు తొమ్మిది. 1. భువన విక్రమ్, 2. గఢ్ కుండార్, 3. మృగనయనీ, 4. విరాటాకీ పద్మినీ, 5. టూటేకాంటే, 6. అహిల్యాబాయి, 7. కచనార్, 8. ముసాహిబజూ, 9. ఝాన్సీకీ రాణీ లక్ష్మీబాయి.

ఈ సిద్ధాంత గ్రంథంలో మొదటి అధ్యాయం 'ఉపోద్ఘాతం'లో చరిత్ర అంటే ఏమిటి? నవల అంటే ఏమిటి? ఈ రెండింటి సమ్మేళనంతో చారిత్రక నవల ఎలా ఉద్భవించింది? చరిత్రను చారిత్రక నవలగా మలచడంలో నవలాకారుడు ఎదుర్కొనే సమస్యలు మొదలైన అంశాలను వివరిస్తూ ప్రాచ్య పాశ్చాత్యుల అభిప్రాయాలను క్రోడీకరించడం; ప్రాచీనులు అర్వాచీనులు వెలువరించిన చారిత్రక నవలా లక్షణాలను, వికాసాన్ని చర్చించడం; తెలుగు హిందీ సాహిత్యాలలో చారిత్రక నవలల పుట్టుక, వర్గీకరణ పేర్కొని, చారిత్రక నవలలవల్ల

కలిగే ప్రయోజనాలు కూడ వివరించడం జరిగింది. పరిశోధన రంగం (area) తులనాత్మక అధ్యయనం; కాబట్టి, తులనాత్మక అధ్యయన ప్రాధాన్యతను కూడ విశ్లేషించ వలసి వచ్చింది.

రెండవ అధ్యాయం 'అడివి బాపిరాజు, బృందావన్ లాల్ వర్మల జీవితం, వ్యక్తిత్వం – తులన' లో పరిశోధనకు గ్రహించిన తెలుగు-హిందీ చారిత్రక నవలాకారులైన అడివి బాపిరాజు, బృందావన్ లాల్ వర్మగార్ల జీవిత వ్యక్తిత్వాల వివరణ, వీరిద్దరి జీవితాల్లోనూ గల సారూప్య వైషమ్యాలను విశ్లేషించడం విషయమైంది.

మూడవ అధ్యాయం 'చారిత్రక నేపథ్యం, కథావస్తువు – తులన' లో చరిత్రను చారిత్రక నవలగా మలచడానికి ఇద్దరు రచయితలు ఎంత వరకు సఫలీకృతులైనారో గ్రహించడానికి ప్రతి కథకు ముందు చారిత్రక నేపథ్యాన్ని వివరించడం ఒక ప్రత్యేకత. ప్రతి కథ చివర ఆ కథలో వచ్చే ప్రాసంగిక కథలను పేర్కొనడం జరిగింది. ఈ కథావస్తువుల తులనలో ఇద్దరు రచయితల కథల్లో గల సామ్య వైషమ్యాలను చర్చించడం చోటు చేసుకొంది.

ఇక నాల్గవ అధ్యాయం 'పాత్ర చిత్రణ – తులన' లో ఇంచుమించు బాపిరాజు గారు, బృందావన్ లాల్ వర్మగార్ల చారిత్రక నవలలన్నింటిలో అన్ని ముఖ్య పాత్రలను విశదంగా వివరించడం జరిగింది. అడివి బాపిరాజు గారి నాలుగు నవలల్లో 18 పాత్రలను, బృందావన్ లాల్ వర్మగారి తొమ్మిది నవలల్లో 32 పాత్రలను, ఆ పాత్రల గుణశీలాలను, ఆ పాత్రల

కథా ప్రాముఖ్యాన్ని వివరించడం జరిగింది. అడివి బాపిరాజు, బృందావన్-లాల్ వర్మగారి పాత్రలను తులనగావించాలంటే అనేక రకాలైన పాత్రలను వివరిస్తే కాని రచయితల అభిప్రాయాలు పూర్తిగా స్పష్టం కావు. పాత్రల ద్వారా వారు నడపిన సంభాషణలను యథాతథంగా గ్రహించాలి. అందుకే ఈ అధ్యాయాన్ని విపులంగా విశ్లేషించవలసి వచ్చింది. స్త్రీ, పురుష పాత్రల తులనతో పాటు ఇద్దరు రచయితల విలక్షణ పాత్రలను గురించి కూడా తులనాత్మకంగా చర్చించడం జరిగింది.

ఐదవ అధ్యాయం 'నవలా నేపథ్యం - తులన' లో ఆనాటి రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, మత, ఆర్థిక పరిస్థితులను వివరిస్తూ ఆ పరిస్థితులలో గల సామ్య వైషమ్యాలను వివరించడం జరిగింది.

ఆరవ అధ్యాయం 'ఇతర విశేషాంశాలు - తులన' లో ఇతర విశేషాంశాలుగా వీరి నవలల్లోని భాష, శైలి, సంభాషణలు, వర్ణనలు, వ్యతికారం, రసపోషణ, పాటలు-గేయాల గురించి వివరిస్తూ, వాటిని సరిపోల్చడం జరిగింది.

సిద్ధాంత వ్యాసంలో మొదటి అధ్యాయంలో తులనాత్మక ప్రాధాన్యతను గురించి తెల్పిన తరువాత రెండవ అధ్యాయాన్నుండి తులన విస్తృతంగా చేయడంపై దృష్టిని కేంద్రీకరించడం జరిగింది. నిజానికి రంగంలో దిగి విషయసేకరణ ప్రారంభించేసరికి పరిశోధకురాలికి తాను ఎన్నుకున్న విషయం పరిధి ఎంత విస్తృతమైందో అర్థమైంది. తెలుగు సాహిత్యంలో బాపిరాజుగారి నవలల్ని వివరించడం ఒక పరిశోధన; హిందీ సాహిత్యంలో బృందావన్ లాల్ వర్మగారి

నవలల్ని విశ్లేషించడం రెండో పరిశోధన, ఈ రెండింటిని తులన ద్వారా సమన్వయ పర్చడం మూడో పరిశోధన. అంటే మూడు సిద్ధాంతవ్యాసాల కృషి చేయవలసి వచ్చింది. ఆ కారణం చేతనే సిద్ధాంత వ్యాసం నిడివి పెరిగింది.

ఇంతవరకు తెలుగులో జరిగిన తులనాత్మక పరిశోధనలలో వలె కాకుండా ఈ సిద్ధాంత గ్రంథంలో తులన ( Comparison) కు ప్రాధాన్యం ఇవ్వడానికి ప్రయత్నించడం జరిగింది. అయినా ఈ ప్రయత్నంకూడా తక్కువే అని అనిపిస్తుంది. భవిష్యత్తులో ఇంకా విస్తృతంగా ఈ రంగంలో కృషి జరగవలసి ఉంది.

తులనాత్మక అధ్యయనానికి జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ ఎంతో ప్రాముఖ్యాన్నిస్తున్నారు. ఈ రకమైన అధ్యయనం వల్ల సర్వమానవ సౌభ్రాతృత్వ భావం (Universal Brotherhood) ఏర్పడి వసుధైక కుటుంబకమ్ అన్న విశాల దృక్పథం కలుగుతుంది. జాతీయ సమైక్యత, మత సామరస్యం వంటి భావాలు సుదృఢమై, భిన్నత్వంలో ఏకత్వం అన్న సిద్ధాంతం బలపడి, దేశ సర్వతోముఖాభివృద్ధికి దోహదకారి అవుతుంది.



10. దక్షిణామూర్తి, పోరంకి.- తెలుగునవల నూరుసంవత్సరాలు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్,

11. నరసింహ శాస్త్రి, నోరి.- ధూర్జటి: క్వాలిటీ పబ్లిషర్స్, విజయవాడ, 1986.

12. నాగభూషణ శర్మ, మొదలి.- తెలుగునవలా వికాసము: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాద్, 1971.

13. నాగయ్య, జి.- తెలుగు సాహిత్య సమీక్ష: నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి, 1990.

14. నాగయ్య, జి.- దాక్షిణాత్య సాహిత్య సమీక్ష: నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి, 1976.

15. నాగయ్య, సముద్రాల.- సాహితీ సుధాలహరి: తిరుపతి, 1971.

16. నారాయణరెడ్డి, సి.- ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయము-ప్రయోగము: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాద్, 1977.

17. ప్రతాపరెడ్డి, సురవరం.- హిందువుల పండుగలు: బాలసరస్వతి బుక్ డిపో, మద్రాసు, 1953.

18. ప్రతాపరెడ్డి, సురవరం.- ఆంధ్రుల సాంఘిక చరిత్ర: ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్, హైదరాబాద్, 1992.

19. బద్దెన - సుమతీ శతకము: శ్రీ శైలజా పబ్లికేషన్స్, విజయవాడ, 1992.

20. బలరామమూర్తి, ఏటుకూరి.- ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1966.

21. బలరామమూర్తి, ఏటుకూరి.- భారతీయ సంస్కృతి: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1992.

22. బాపిరాజు, అడివి.- హిమబిందు : జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, 1984.

23. బాపిరాజు, అడివి.- అడవిశాంతిశ్రీ : జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, 1989.

24. బాపిరాజు, అడివి.- అంశుమతి : జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, 1987.

25. బాపిరాజు, అడివి.- గోనగన్నారెడ్డి : జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, 1989.

26. బాలకృష్ణారెడ్డి, ఎర్ల.- తులనాత్మ సాహిత్య అధ్యయనం : చైతన్య ప్రచురణలు, యూనివర్సిటీ బుక్ సెంటర్, తిరుపతి, 1990.

27. మలయశ్రీ .- కాకతీయులనాటి సామాజిక జీవితం : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 1990.

28. మూర్తి, బి.వి.యస్.- తెలుగు,కన్నడ భారత ముల తులనాత్మక పరిశీలన: బులుసు హేమలత, రాజమండ్రి, 1991.

29. యశోదాదేవి, వారణాసి.- భారత దేశ చరిత్ర : ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1973.

30. రఘునాథరావు, పి.- భారతీయ సాంప్రదాయకత-సంస్కృతి : స్టెర్లింగ్ పబ్లిషింగ్ న్యూఢిల్లీ, 1989.

31. రామకృష్ణమాచార్య, నండూరి.- ప్రాచీన దక్షిణా చరిత్ర : కవితా ప్రభాస గ్రంథ మండలి, 1967, సాహిత్య అకాడమీ, ఢిల్లీ.

32. రామకృష్ణయ్య, కోరాడ.- సారస్వత వ్యాసములు: కోరాడ ప్రచురణాలయం, మద్రాసు, 1950.

33. రామచంద్ర, తిరుమల.- తెలుగు పండుగలు : ఆం. ప్ర. సా. అకాడమీ, హైదరాబాద్, 1975

34. రామస్వామి చౌదరి, త్రిపురనేని.- శంబుక వధ : సరళా పబ్లికేషన్స్, తెనాలి, 1978.

35. రామానుజరావు, దేవులపల్లి (సంపా. వర్గం).- తెలుగులో పరిశోధన : ఆం.ప్ర.సా. అకాడమీ, హైదరాబాద్, 1975.

36. రామారావు, మారేమండ.- ఆంధ్రదేశ చరిత్ర : శివాజీ ప్రెస్, సికిందరాబాద్, 1959.

37. లక్ష్మీకాంతం, పింగళి.- ఆంధ్ర సాహిత్య చరిత్ర : గంగాధర పబ్లికేషన్స్, విజయవాడ, 1985.

38. లక్ష్మీనారాయణ శాస్త్రి, వేదం.- శబ్దార్థ చంద్రిక (ఆంధ్ర నిఘంటువు) : వావిళ్ల రామస్వామి శాస్త్రి & సన్స్, మద్రాసు, 1969.

39. లక్ష్మీరంజనం, ఖండవల్లి ; బాలేందుశేఖరం, ఖండవల్లి.- ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి : ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కర్నూలు, 1951.

40. వరదాచారి, కె.సి.- తెలుగు సంస్కృతీ తరంగాలు - తెలుగు ప్రజల కథా కమామీషు: సమాచార పౌర సంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్, ఫిబ్రవరి 1993.

41. వరలక్ష్మి, జె.- యుగయుగాల్లో భారతీయ మహిళ : ప్రియదర్శిని ప్రచురణ, హైదరాబాద్, 1977.

42. విజయలక్ష్మి, డి.- అడివి బాపిరాజు నవలలు - ఒక పరిశీలన : అముద్రిత సిద్ధాంత వ్యాసం, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1980.

43. వీరభద్రరావు, చిలుకూరి.- ఆంధ్రుల చరిత్ర : విజ్ఞాన చంద్రికా బుక్ డిపో, రాజమండ్రి, 1912.

44. వెంకట కుటుంబరావు, జొన్నపాటి.- ఆంధ్ర నవలా పరిణామము : గాయత్రీ ప్రచురణము, హైదరాబాద్, 1971.

45. వెంకట శాస్త్రి, ముసునూరి.- విద్యార్థి కల్పతరువు (ఆంధ్ర భాషా విషయ సర్వస్వము): వేంకటరామా & కో, హైదరాబాద్, 1988.

46. వెంకటసుబ్బయ్య, గొర్రెపాటి.- అక్షరాభిషేకం : దేశి కవితా మండలి, విజయవాడ, 1963.

47. వేంకటావధాని, దివాకర్ల.– సాహిత్య సోపానములు (కావ్యవిషయ సంగ్రహము): ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1978.

48. వేంకటావధాని, దివాకర్ల.– ఆంధ్ర వాఙ్మయ చరిత్ర: ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్, 1988.

49. వేంకటేశ్వర రావు, కాటూరి.– సాహిత్య దర్శనము: కాటూరి కవితాలత, విజయవాడ-2, 1967.

50. వేంకటేశ్వర్లు, పుల్లాభొట్ల.– తెలుగు నవలా సాహిత్య వికాసం:

51. శాస్త్రి, బి.యన్.– ఆంధ్రుల సాంఘిక చరిత్ర (క్రీ.పూ. 400 – క్రీ.శ. 1100): సరస్వతీ నిలయం, హైదరాబాద్, 1975.

52. శేషగిరిరావు, బి; నరసింహారావు, యం.– చరిత్ర (ద్వితీయభాగం): తెలుగు అకాడమీ, హైదరాబాద్, 1986.

53. శ్రీనివాసరావు, వేమూరి.– పూర్వగాథాలహరి: వేంకటరామ & కో, మద్రాసు, 1976.

54. సత్యనారాయణ, కంభంపాటి.– ఆంధ్రుల సంస్కృతి, చరిత్ర: హైదరా బుక్ ట్రస్ట్, హైదరాబాద్, 1982.

55. సత్యనారాయణ, వి (సంపాదక వర్గం).– భారతదేశ చరిత్ర (క్రీ.శ.1526–1964): బి.ఏ. పాఠ్యగ్రంథం, తెలుగు అకాడమీ, హైదరాబాద్.

56. సాంబశివరావు, గోపరాజు.– ఆంగ్లసాహిత్య చరిత్ర: నవజీవన బుక్ లింక్స్, విజయవాడ, 1969.

57. సీతారామాచార్యులు, బి.– శబ్దరత్నాకరము: చెన్నపట్టణ ప్రదేశ భాషా గ్రంథ సేకరణ సభ, మద్రాసు, 1929.

58. సుందరం, ఆర్వీయస్.– కన్నడ సాహిత్య చరిత్ర: ఆం.ప్ర.సా. అకాడమీ, హైదరాబాద్, 1977.

59. సుబ్రహ్మణ్యం, జి.వి. - సారస్వత వ్యాసములు (మూ.భాగాలు) : ఆం.ప్ర.సా. అకాడమి, హైదరాబాద్, 1973.

60. సుబ్రహ్మణ్యం, జి.వి (సంపాదకవర్గం).- మహతి (స్వాతంత్ర్య యుగోదయం 1942-72లో తెలుగు తీరుతెన్నులు సమీక్షా సంకలనం): యువభారతి, సికింద్రాబాద్, 1972.

61. సోమశేఖర శర్మ, మల్లంపల్లి (సంపాదకవర్గం).- విజ్ఞాన సర్వస్వం (1-4 సం), తెలుగు భాషా సమితి, హైదరాబాద్, 1959.

62. హనుమంతరావు, బి.యస్.యల్.- భారతదేశ చరిత్ర, సంస్కృతి (ద్వి.భా) : తెలుగు అకాడమి, హైదరాబాద్.

## English:

1. Baker, E.A. - The History of English Novel : Mac Millan & Co., New York, 1913.

2. Bernard, Fenn.- Studies in comparative Literature : Blackie & Sons Pub; 1985.

3. Brown, David. - Walter scott and the Historical Imagination : Routledge & Kegan paul, London, 1979, 173-205.

4. Carr, E.H. - What is History : Pennium Book Ltd, Reprint 1968.

5. Choudhury Indranath. - Comparative Indian Literature some perspectives : sterling publishers, New Delhi, 1992.

6. Delvin, D.D. - Walter scott Modern Judgement : Mac Millan, 1968.

7. Dharmendra Goel. - Philosophy of History : sterling pub., 1967.

8. Diana S. Neill - A History of the English novel : Jor rolds Pub Ltd., 1954, 111-137.

9. Elton, G.R. - The Practice of History : collins, 1969.

10. Fiske F. christabel .- EPIC suggestion in the Imagery of the Wavereley Novels : New Haven, Yale university Press, 1940.

11. Foster, E.M. - Aspects of Novel : Penguin Books, 1970.

12. George Saint burg. - The English Novel : Dutton & co, 1913.

13. Halperin, John .- The theory of the Novel : oxford Press, 1974.

14. Hudson W. Henry. - An outline History of English Literature ; G. Bell & sons, London, 1955.

15. James, Henry. - The Art of Fiction : Charles Scriber & sons, New York, 1934.

16. Johnson, Alfred. - The English Novel : Forum Pub. com, 1947.

17. John N. Hayden (ed). - The critical Heritage : London, 1970.

17a Leisy, E. Ernest. - American Historical Novel;

18. Lowis, James. - Fiction for the working Man (1830-1950) : oxford university Press, 1963, 86-96.

19. Max Muller. - Lectures on science and Religion : Munshiram - Manoharlal, New Delhi, 1965, (P12).

20. Raghukul Tilak. - Advanced Literary Essays : student store, Rampoor Bagh, 3rd (ed) 1988.

21. Robin Mayhead Scott. - The critical Heritage in Hyden N. John (ed) Walter Scott, London, 1970.

22. Rolph, Fox.- The Novel and the people: Foreign Languages Pub. House, 1956.

23. Sai Prasad, A.B. - A comparative study of Early Novels in Hindi and Telugu: Girish Pub, 1991.

24. Sarada.M. - Philip Meadows Taylor 'Fiction', 'History', 'Romance': unpublished thesis, central university, Hyderabad.

25. Shaw Herry.- Dictionary of Literary Terms: Mc. Gray-Hill, 1972.

26. Shipley T. Joseph.- Dictionary of world Literary Terms: George Allen and unwin, 3rd ed, 1970, P-218.

27. Srinathan, B.- Ivan hoe - sir walter scott: collins, London, P-27-31.

28. Ward, A.C.- Foundation of English prose: E.C.D's London, 1972.

29. Wibur L.Cross.- The Development of the English Novel: Mac.Millan, 1930.

## హిందీ :

1. ఉమాశంకర్ మెహ్రా.- మధ్యకాలీన భారతీయ సభ్యతా ఏవం సంస్ వినోద్ పుస్తక్ మందిర్, ఆగ్రా, 1989.

1. A. ఓం శుక్ల.- హిందీ ఉపన్యాసకే శిల్పవిధికా వికాస్: అనుసంధాన్ ప్రకాశన్, కాన్పూర్, 1964.

2. కమలకుమారి జౌహరి, కె.- హిందీకే స్వచ్ఛందవాద ఉపన్యాస్: గ్రంథం పబ్లికేషన్, కాన్పూర్, 1965.

3. కమలేష్ మాథుర్.- బృందావన్ లాల్ వర్మాకే ఉపన్యాసోం మే నైతికతా: మలిక్ & కం, జైపూర్, 1972.

4. కుమారి ప్రమీల గుప్త.- ప్రేమ్‌చంద్ ఔర్ హరినారాయణా ఆపే కే ఉపన్యాసోంకా సాంస్కృతిక అధ్యయన్: అశోక్ ప్రకాశన్, ఢిల్లీ, 1980

5. కృష్ణనాగ్.- హిందీ ఉపన్యాస్ కే శిల్ప విధీ కా వికాస్ : లోక చేతనా ప్రకాశన్, జబల్‌పూర్, 1962.

6. కౌశల భట్నాగర్.- బృందావన్‌లాల్ వర్మా కే ఉపన్యాసోఁ కా సాంః అధ్యయన్ : మీరట్, 1976.

7. గణపతి చంద్రగుప్త.- హిందీ సాహిత్యకా వైజ్ఞానిక్ ఇతిహాస్: భారతేందు భవన్, చండీగఢ్, 1965.

8. గులాబ్‌రాయ్. – సిద్ధాంత్ ఔర అధ్యయన్ : ప్రతిభా ప్రకాశన్, హైదర్ కులీ, ఢిల్లీ, 1960.

9. గోవిందజీ – హిందీ ఐతిహాసిక్ ఉపన్యాసోఁ మే ఇతిహాస్ ప్రయోగ్ : కల్పనా ప్రకాశన్, మీరట్ కైట్, 1960.

10. చంద్రకాంత్ గర్జే.- హిందీ ఔర్ మరాఠీ ఐతిహాసిక్ ఉపన్యాసోఁ కీ శిల్పవిధి: పుస్తక్ సంస్థాన్, కాన్పూర్, 1978.

11. చంద్రవర్మ సురేష్.- భారతీయ త్యోహార్ : ఆత్మారామ్ & సన్స్, ఢిల్లీ, 1976.

12. త్రిభువన సింహ – హిందీ ఉపన్యాస్ శిల్పప్రయోగ్: హిందీ ప్రచార్ సంస్థాన్, వారణాసి, 1970.

13. నందదులారే వాజపేయ్.- ఆధునిక సాహిత్య : భారతి భండార్, లీడర్ ప్రెస్, ఇలహాబాద్. 1974

14. నారాయణ భారద్వాజ్- ఐతిహాసిక్ ఉపన్యాస్ తులనాత్మ ఢిల్లీ, కోణార్క, 1981.

15. ప్రతాప నారాయణ్ టండన్. – హిందీ ఉపన్యాస్ ఉద్భవ్ ఔర్ వికాస్ కల్పకార్ ప్రకాశన్, లక్నో, 1974.

16. ప్రభాకర్ మాచవే. - హిందీకే సాహిత్య నిర్మాత బృందావన్ లాల్ వర్మ: రాజ్‌పాల్ & సన్స్, ఢిల్లీ, 1990.

17. బృందావన్ లాల్ వర్మ. - భువన విక్రమ్ : సత్యదేవ వర్మ, మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1989.

18. బృందావన్ లాల్ వర్మ. - గఢ్ కుండార్ : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1989.

19. బృందావన్ లాల్ వర్మ. - విరాటాకీ పద్మినీ : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్ ఝాన్సీ, 1986.

20. బృందావన్ లాల్ వర్మ. - మృగనయనీ : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1985.

21. బృందావన్ లాల్ వర్మ. - టూటేకాంటే : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1982.

22. బృందావన్ లాల్ వర్మ. - కచనార్ : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1984.

23. బృందావన్ లాల్ వర్మ. - ముసాహిబజూ : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1987.

24. బృందావన్ లాల్ వర్మ. - అహిల్యాబాయి : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1987.

25. బృందావన్ లాల్ వర్మ. - ఝాన్సీకీ లక్ష్మీబాయి : మయూర్ ప్రకాశన్ ప్రై లిమిటెడ్, ఝాన్సీ, 1987.

26. మోహినీ సహాయ్. - బృందావన్ లాల్ వర్మాకా ఉపన్యాస్ సాహిత్య : అనుపమ ప్రకాశన్, పాట్నా, 1982.

27. రామచంద్ర పాఠక్. - భార్గవ ఆదర్శ్ హిందీ శబ్దకోష్ : భార్గవ బుక్ డిపో, వారణాసి, 1982.

28. రామనారాయణ సింహ మథుర్. - హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాస్ : రామ్‌చాంగ్, కాన్పూర్, 1975.

29. లక్ష్మీ సిన్హా.- బృందావన్ లాల్ వర్మాకే ఉపన్యాసోంమే నారీచిత్రణ్: మిథిల, 1982.

30. విజయ మోహన్ సింహ్.- ఆధునిక్ హిందీ ఉపన్యాసోం మే ప్రేమ్‌కీ పరికల్పనా: శీల్ మల్హోత్రా రచనా ప్రకాశన్, ఇల్హాబాద్, 1972.

31. శశిభూషణ్ సింహాళ్.- ఉపన్యాస్‌కార్ బృందావన్ లాల్ వర్మ: వినోద్ పుస్తక్ మందిర్, ఆగ్రా, 1960.

32. శాంతిస్వరూప్ గుప్త.- హిందీకే ఐతిహాసిక్ ఉపన్యాస్: యస్.ఇ.యస్ అండ్ కం. షహ్దారం - ఢిల్లీ, 1971.

33. శాంతి స్వరూప్ గుప్త.- హిందీ ఔర్ మరాఠీకే తులనాత్మక్ అధ్యయన్: భారతీయ సాహిత్య మందిర్, యస్.చంద్ & కం, షహ్దారం-ఢిల్లీ-6, 1965.

34. శివకుమార్ మిశ్రా.- బృందావన్ లాల్ వర్మ ఉపన్యాస్ ఔర్ కళ: రవి ప్రకాశన్, కాన్పూర్, 1956.

35. శివకుమార్ మిశ్రా.- బృందావన్ లాల్ వర్మ ఔర్ ఉన్‌కీ మృగనయనీ: రవి ప్రకాశన్, కాన్పూర్, 1956.

36. శివనారాయణ శ్రీవాస్తవ్.- హిందీ ఉపన్యాస్: సరస్వతి మందిర్, వారణాసి.

37. శ్రీకృష్ణ అవస్థీ.- బృందావన్ లాల్ వర్మాకే ఉపన్యాసోంకా సాంస్కృతిక్ అధ్యయన్: పుస్తక్ సంస్థాన్, కాన్పూర్, 1978.

38. సియారామ్ శరణ్ ప్రసాద్.- బృందావన్‌లాల్ వర్మ సాహిత్య ఔర్ సమీక్ష: సాహిత్య ప్రకాశన్, ఢిల్లీ, 1960.

39. సూర్యనారాయణ మూర్తి, చావలి.- హిందీ తెలుగు కోష్: బాలసరస్వతి బుక్‌డిపో, మద్రాసు, 1981.

40. పరదేవ బాహరీ - గ్రామీణ్ హిందీ బోలియాం : కితాబ్ మహల్, ఇల్హాబాద్.

## సంస్కృతం :

1. కౌటిల్యుడు. - అర్థశాస్త్ర : కృష్ణదాస అకాడమీ, వారణాసి, 1972.
2. దండి. - కావ్యాదర్శమ్ : పరిమళ పబ్లికేషన్స్, ఢిల్లీ, 1969.
3. ధనంజయ. - దశరూపకమ్ : చౌకాంబ పబ్లికేషన్స్, వారణాసి, 1972.
4. భర్తృహరి. - సుభాషిత త్రిశతి : చౌకాంబ పబ్లికేషన్, వారణాసి, 1978.
5. మమ్మటుడు. - కావ్య ప్రకాశమ్ : చౌకాంబ పబ్లికేషన్స్, వారణాసి, 1978.
6. వేదవ్యాసుడు. - అగ్నిపురాణమ్ : చౌకాంబ పబ్లికేషన్స్, వారణాసి, 1971.
7. వేదవ్యాసుడు. - విష్ణు పురాణమ్ : చౌకాంబ పబ్లికేషన్స్, వారణాసి, 1976.

# వ్యాసాలు

## తెలుగు :

1. అనంత పద్మనాభ రావు, ఆర్. - ఆంధ్ర వాఙ్మయ చరిత్ర : స్రవంతి, ఆగష్టు 1969.
2. ఇన్నయ్య, యస్. - భారత సంస్కృతి : తెలుగు విద్యార్థి, జూలై 1968.
3. కామరాజు, బుద్ధవరపు. - అనుభవాలు, జ్ఞాపకాలు : నాదబిందు శశికళ, అక్టోబర్ 1985.
4. కుసుమకుమారి, పి. - తులనాత్మక సాహిత్య అధ్యయన వికాసం : తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక, ఏప్రిల్ 1993.
5. కృష్ణమూర్తి, రాంభట్ల. - అడివోరి సిన్నోడు : కులపతి బాపిరాజుగారి సంస్మరణ ంచిక, 1954.

6. గోపాలకృష్ణారావు, కె. – నాకు పరిచితులైన బాపిరాజు : నాదబిందు శశికళ, అక్టోబర్ 1985.

7. దామోదరయ్య, కొడాలి. – చారిత్రక నవలలు - వాని సామాజికత : ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1962-63.

8. నమశ్శివాయ, గూడూరు. – భర్తనాట్యాల బావ మా బాపిబావ (అముద్రితం).

9. నాగభూషణశర్మ, మొదలి – నవల : ప్రవంతి, తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక, ఏప్రిల్ 1975.

10. బుచ్చిబాబు. – జీవితం పట్ల బాపిరాజు దృక్పథం : కులపతి బాపిరాజు గారి సంస్మరణ సంచిక, 1954.

11. రంగారావు, మాదిరాజు. – నవల – ఒక పరిశీలన : భారతి, సెప్టెంబర్ 1978

12. రాజారామ్, మధురాంతకం. – మన నవలల్లో స్త్రీ పాత్రలు : ఆంధ్ర మహిళా వార్షికోత్సవ సంచిక, 1955.

13. రాధావసంత. – మహా మానవుడు మా నాన్న : త్రివిజ్ఞ పత్రిక, జనవరి 1974.

14. రామచంద్రారెడ్డి, రాచమల్లు. – కొల్లాయి గట్టితేనేమి : సంవేదన, త్రైమాసిక పత్రిక., జనవరి 1974.

15. విశ్వామిత్ర, జె. – నవల-కథా సంవిధానం : ప్రవంతి, జూలై 1960.

మిత్ర, జె. – నవలయందలి పాత్రపోషణ : ప్రవంతి, నవంబర్ 1960.
సంపాదకుడు ; " జూలై 1993.

17. వెంకట కుటుంబరావు, బొడ్డుపాటి. – ఆంగ్ల నవలా వికాసము : ప్రవంతి, జనవరి 1961.

18. వెంకట కుటుంబరావు, బొడ్డుపాటి. – నవలాలక్షణములు : ప్రవంతి, నవంబరు 1962.

9. వెంకటేశ్వర రావు, కాటూరి.– శశికళా స్వరూపం : చుక్కాని, 1.10.1962.

20. సుబ్బారావు, బొమ్మకంటి.– ప్రథమాంధ్ర కళాదర్శకుడు : బాపిరాజుగారి సంస్మరణ సంచిక, 1954.

21. సుబ్బారావు, రాయప్రోలు.– అడివోరి సిన్నోడు: కులపతి బాపిరాజుగారి సంస్మరణ సంచిక, 1954.

22. జాతీయ స్థాయిలో ఉపాధ్యాయ శిక్షణా కార్యక్రమము.– బోధన సామగ్రి మొదటి భాగము (సామాన్య అంశములు), రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణా సంస్థ, హైదరాబాద్, మాడ్యూల్.

## English

1. Sarada, M. – The Romance : The Hindu, Saturday 10.4.93.

2. Tompe, V.V. – 'Adivi Bapiraju's life dedicated to art' : The Indian Express, sunday standard, August 11th 1963.

19. వెంకటేశ్వర రావు, కాటూరి.— శశికళా స్వరూపం : చుక్కాని, 1.10.1962.

20. సుబ్బారావు, బొమ్మకంటి.— ప్రథమాంధ్ర కళాదర్శకుడు : బాపిరాజుగారి సంస్మరణ సంచిక, 1954.

21. సుబ్బారావు, రాయప్రోలు.— అతిలోక నిష్ణుడు : కులపతి బాపిరాజుగారి సంస్మరణ సంచిక, 1954.

22. జాతీయ స్థాయిలో ఉపాధ్యాయ శిక్షణా కార్యక్రమము.— బోధన సామగ్రి, మొదటి భాగము (సామాన్య అంశములు), రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణా సంస్థ, హైదరాబాద్, మాడ్యూల్.

## English

1. Sarada, M. — The Romance : The Hindu, Saturday 10.4.93.

2. Tompe, V.V. — 'Adivi Bapiraju's life dedicated to art' : The Indian Express, sunday standard, August 11th 1963